# పీఠిక.



సుభాషితత్రిశతి యనంబడునీకృతియందుఁ గలనీతిశృంగార వైరాగ్యశతకంబులు మూఁడు నన్వర్థముగాఁ గ్రమంబున నీతిశృంగార వైరాగ్యంబుల బోధించు. ఈగ్రంథమునకుం గలప్రతులు రెండుతెగలుగా నున్నవి. ఒకతెగప్రతులు రామచంద్రబుధేంద్రవ్యాఖ్యాతమైన ప్రతి ననుసరించునవై తఱుచుగ దక్షిణహిందూదేశంబునన ప్రచారము గలిగి యున్నట్లు గానంబడుచున్నవి. మఱియొకతెగప్రతులు రామర్షి పండితవ్యాకృతమైనప్రతికిం బ్రతినిధులై యుత్తరహిందూదేశమునందే వ్యాప్తిఁ జెందియున్నట్లు చూపట్టుచున్నవి. ప్రకృతగ్రంథము మొదటితెగంజేరినది. ఈతెగయం దొక్కొకశతకమును బదేసి దశకములుగా విభక్తమై మొత్తమునకు సరిగా నూఱేసి శ్లోకములు గలిగి యుండును. శ్లోకముల కొండొంటికి, నట్లే దశకములకును, బూర్వోత్తరసంబంధ ముండును. రెండవతెగప్రతులలో దశకములుగా విభాగము లేదు. ఒక్కొక్కశతకమందును శ్లోకములు * నూఱింటి కెక్కుడై యొండొంటితో సంబంధ మంతగా లేకుండును. అందు శ్లోకములక్రమమును మిక్కిలియు వేఱై యున్నది. ఇంతేకాదు. అం దొకశతకములోనిశ్లోకములు గొన్ని యిందు మఱొకశతకమునం బొడసూపుచున్నవి. రెండింటిపాఠములును జాల భిన్నములై యుండును. అయిన నిందలిపాఠములకంటె నందలివి మఱింత సమంజసములై ప్రాథములుగా నుండును. ఇట్లిరుదెఱంగుప్రతులకును శ్లోకముల క్రమసంఖ్యాపాఠములందు మిక్కిలియు భేదము గానిపించుటం జేసి యిందుఁ జక్కఁగవిప్రణీతమైన దేదియో మాఱుపడి వచ్చిన దేదియో తెలియరాకున్నది. అందుఁ బాఠములు మఱింత సమంజసము లయ్యు శ్లోకములకు సంబంధసంఖ్యానియమము లేమిం జేసి యది కవిప్రణీతమాతృకకుఁ

* రెండవతెగయందు నొక్కొక్కశతకమునను నించుమించుగా ముప్పదినలువది శ్లోకము లెక్కుడుగాఁ గనుపట్టుచున్నవి. కాన మూఁడుశతకములందును మొత్తమునకు నన్నూఱుశ్లోకము లున్నవి. మొదటితెగలో శతకమునకుసరిగా నూఱేసిచొప్పున మూఁడుశతకములకు మున్నూఱుశ్లోకము లున్నవి.

బుత్త్రిక యగుట సందేహింపవలసి యున్నది. ఇం దట్టిసామంజస్యము లేకుండియుఁ దక్కినసంఖ్యాదివ్యవస్థ యుండుటచే నిది కవికృతమైన ప్రతియాకృతి గలిగియుండు ననుట మఱింత యుప్పపన్నముగా నున్నది. ఎట్లన, లేఖకాదులదోషములంబట్టి పాఠము లెంతయు భిన్నములగుం గావున వానిం గొని పాఠసౌష్ఠవము గూర్పవచ్చునుగాని కృతికిం గల తొలియాకృతి నిర్ణయించుట వలనుగాదు. పూర్వోత్తరసంబంధసూచక మైనరచనాప్రణాళికయు సంఖ్యాదివ్యవస్థయుఁ గృతినామ మన్వర్థముసేయు తక్కులక్షణములును గవిరచిత మైనకృతిరూపమును యథాతథముగాఁ దెలియుటకుఁ దోడుపడునవి యగును. కావున నీ మొదటితెగప్రతులే కవి నిబంధించినయాకృతి గలవి యగు ననవచ్చును. అయినను విషయ మింతమాత్రమున వ్యవస్థితము గానేరదు. ఎట్లన, భర్తృహరి బహుతరముగా నీశతకముల ముఖ్యవిషయములగు నీతిశృంగారాదులను మాత్రము మది ననుసంధించి శ్లోకములను బరస్పరసంబంధ మపేక్షింపక యిచ్ఛకు వచ్చినట్లు రచింపఁగా నిందు సంబంధము లేని తెఱపిం గాంచి వెనుకటివారిచేఁ బెక్కుశ్లోకములు ప్రక్షిప్తము లగుటవలన రెండవతెగయందు సంఖ్యాదినియతి చెడియుండవచ్చును. కావున నది, సంబంధసంఖ్యాదినియమములు లేకుండియుఁ గవిప్రణీతాకృతి గలిగియుండనోపు. లేక, రామచంద్రబుధేంద్రుఁడు సంఖ్యాదివ్యవస్థ మాలి దురవస్థ నున్నయాశ్లోకజాలముం గొని వానియందుఁ బ్రక్షిప్తములని తనకుఁ దోఁచినవానిం దీసివైచి పరస్పరసంబంధముకలుగునట్లు *శ్లోకములక్రమము మార్చి సరిగా నూఱేసి గూర్చి దశకవిభాగముతో శతకముల నేర్పఱిచియుండవచ్చును. కావున నీ మొదటితెగయుఁ బ్రథమాకృతి యథార్థముగాఁ గలది గాకుండవచ్చును. ఈవిషయ మిట్లుండ నిచ్చి యిఁక దీనిని రచించినకవి యగు

---

* 'ఆసారాఁః సన్త్వేతే' శృం - 32 ఇత్యాదిశ్లోకములు కొన్ని యపపాఠములంజేసి తమయున్నప్రకరణంబులకుం బాసఁగింపబడియున్నవికాని యుదీచ్యకోశములంబట్టి వానిసమంజసపాఠములం బరిశీలింపఁగా నవి ప్రకరణాంతరముం జేరినవిగాఁ గానిపించెడి. ఈవిషయము, రామచంద్రుఁడే యాకృతిని వేఱుక్రమమునఁ గూర్చె ననుటకు నొకయుపోద్బలకముగా నున్నది.

చరితముఁ దెలియుట యావశ్యకము. పండితపరంపరచే వాడుకొనంబడుకొన్ని విషయములు దప్ప భర్తృహరింగూర్చి విశ్వసనీయంబు లగుచరిత్రాంశములేవియుఁ గానరావు. ఆవిషయములు నొండొంటికిఁ బొసఁగియుండవు. ఇతండుజ్జయినీరాజవంశమునం జనించినవాఁడనియు దానే సింహాసనము నెక్కనర్హుం డయ్యు సంసారబంధముఁ రోసి రాజ్యము తనతమ్ముఁడు విక్రమార్కునికి నప్పగించి చన్నవాఁడనియు నొక ప్రతీతి గలదు. ఈ విక్రముండు విక్రమశకాబ్దమూలభూతుండు. * మఱియొక ప్రతీతి విక్రమాదిత్యునకు బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర కాంతలు బ్రాహ్మణి, భానుమతి, భాగ్యవతి, సింధుమతియని నలువురు గల రనియు వారియందు వరుసగా వరరుచి విక్రమార్క భట్టి భర్తృహరులు జనించి రనియుఁ దెలిపెడిని. ఇది యెంతవిశ్వసనీయమో తెలిసినది గాదు. ఈకవి తన్నుగుఱించి యేమియు నీగ్రంథమునఁ జెప్పినవాఁడు గాఁడు. ఈకవివంశాదికమటుండ జీవించియుండినకాల మిది యని తెలియుటకుఁ బండితప్రతీతియు గ్రంథస్థనిదర్శనములును నితరకవిచరిత్రమూలకములైన విషయములును సాధనములుగాఁ గొని దానిఁ బరిశీలింపవచ్చును. అందుఁ బండితప్రతీతి యితనిని విక్రమాదిత్యునికాలమువాఁడుగా రూపించెడి. అపుడు విక్రమశకము క్రీస్తు పుట్టుటకు 57 సంవత్సరములకుఁ బూర్వ

---

* ఈ ప్రతీతికి,

> యాం చిన్తయామి సతతం మయి సా విరక్తా
> సా ప్యన్య మిచ్ఛతి జనం సజనోఽన్యసక్తః ।
> అస్మత్కృతే చ పరితుష్యతి కాచి దన్యా
> ధిక్తాం చ తం చ మదనం చ ఇమాం చ మాంచ ॥

అనుశ్లోకముమూలము. ఒకప్పుడొకబ్రాహ్మణుఁ డమరత్వమునిచ్చునొకపండు లభింపఁగా నది బహుజనపరిపాలకుం డగుభర్తృహరియే యర్హుం డని యాతని కొసంగె. అతండు దానిఁ దనయిల్లాలి కీయఁగా నది తనవిటునికిని వాఁడు తనయుంపుడుఁగత్తియగు నదిమరల భర్తృహరికిని నాపండు నొసంగిరి. అంత భర్తృహరితత్ఫలవృత్తాంతం బంతయుఁ దెలిసి సంసారమును రోసి యీశ్లోకమును జెప్పెనఁట. మఱియొక ప్రతీతిం బట్టి యాపండు నొకయోగివలన విక్రముండు వడసి యొకబ్రాహ్మణుని కీయఁగా నాతండు భర్తృహరి కిచ్చెననియు నతనినుండి తక్కినవారికి మున్ను చెప్పినవరుసను లభించె ననియుఁ దెలిపెడి.

మునమండి యారంభించుచున్నది గాన మనకవి క్రీస్తునకుఁ బూర్వ మైన ప్రథమశతాబ్దము తొలిసగమున నున్నవాఁ డని తేలుచున్నది. ఇంక గ్రంథస్థనిదర్శనములం బట్టి యాతనికాలము నిర్ణయించుటయుఁ గష్టముగా నున్నది. శతకములు వేదాంతపరిభాషాజటిలములుగా నున్నవి. అయినను వేదాంతసిద్ధాంతములు పెక్కుసంవత్సరశతములుగాఁ జర్చితములై నిష్పత్తి నొందినవి గాన వానియుత్పత్తికాల మిది యని రూఢిగా నిర్ణయింపఁ దరము గాకున్నది. ఇవి యుపనిషత్తుల కనంతర ములై పురాణములకును బుద్ధమతమునకును సమకాలీనములుగాఁ గాని పించుచున్నవి. వీనికాలంబున సుప్రసిద్ధు లగుపురుషులు కుమారిల భట్టును శంకరాచార్యులు నగుదురు. కుమారిలభట్టు రమారమి యెనిమిదవశతాబ్దమునను శంకరులు తొమ్మిదవశతాబ్దమునను నుండిరి. కాన వేదాంతము తొమ్మిదవశతాబ్దము మొదలుగా వ్యాపించినది గాని దానిప్రారంభ మంతకుబహుకాలమునకుమునుపే యుండును. కాని యది యెప్పుడో సూటిగాఁ జెప్ప నయితిగాకున్నది. కాన వేదాంతపరిభాషం బట్టి మనగ్రంథకాలము నూహించుట యసమంజసము. ఇందుఁబురాణ ములును బరామర్శింపఁబడినవి. 'విల్సన్' అనుపండితుఁడు పురాణ మేది యు వేయిసంవత్సరములకుమునుపుగాన రాదనిచూపియున్నాఁడు. దానిం బట్టి కొంద ఱీగ్రంథమును బదునొకండవపండ్రెండవశతాబ్దములనాఁటి దిగా నిష్కర్షించెదరు. పురాణములకుఁ గర్త వ్యాసుండని ప్రసిద్ధిగదా. అతండు వేదవిభాగమును జేసినవాఁడునండ్రు. కాఁబట్టియాతనికాలము వైదికపౌరాణికకాలములకుమధ్యవర్తియైయుండనోపుంగావున నాతండు క్రైస్తవశకమునకు మునుపటివాఁ డగు. ఆతనింబట్టి పురాణము లన్ని యో కొన్నియో ప్రథమశతాబ్దమునకుఁ బూర్వమేయుండినవిగాఁ దెలి యుటంజేసి పురాణప్రసక్తింబట్టి యీకృతి యర్వాచీనమైనదిగా నిర్ణ యింపరాదు. ఇఁక నితరులచరిత్రలమూలముగా లభించినయాధార ములఁజూతము. ఏతద్గ్రంథవ్యాఖ్యాత లెవ్వరును గవికాలమును విచా రించినవారు గారు. పూర్వగ్రంథకారు లెవరుగాని యీ కవింగూర్చి ప్రస్తావించినవారును గారు. దీనివ్యాఖ్యాతలలో నొక రగురామచంద్ర బుధేంద్రుఁడు కవింగూర్చి

'విప్రేణాభూతపూర్వం ఫలమధితపసాలమ్భి సూర్యప్రసాదా-
ల్లబ్ధ్వా తస్మా త్స్వయం త త్ప్రచురతరజరాపఙ్క్తితాకుఞ్చనాఢ్యమ్।
హిత్వా మోహం స్వకాన్తాస్వతివిమలధియా తం నిషేవ్యా త్తభవ్యో
యోగీన్ద్రో భర్తృహర్యాహ్వయ ఇహ కురుతే ఽద్యాపి విద్యావిలాసమ్'

అని చెప్పియున్నాఁడు. ఇందు బ్రాహ్మణుండు సూర్యప్రసాదమువల
నఁ బడసినఫలము నతనివలనం దాను బొంది కాంతాదులందలి మో
హమును వీడి జరాపంచతాకుంచనాఢ్య మైనతత్ఫలభుక్తిం జేసి యామో
యింకను విద్యావిలాసము నెఱపుచున్నాఁ డని చెప్పఁబడినది. వ్యా
ఖ్యాతలగ్రుడ్డిఘాండసమున కిది యొకనిదర్శనము. అయినను గవికాల
నిర్ణయమునకు వేఱొకప్రబలాధారము గనుపట్టుచున్నది. కలిల-ఉ-
డిమ్నా అనునొకపారసీకగ్రంథము గలదు. ఇది సంస్కృతపంచతంత్ర
మునకు వికృతియైనయొకానొకగ్రంథమును జూచి పారసీకభాషయందు
వ్రాయఁబడినది. కావున నిందొకవాక్యము పంచతంత్రమునందలి
*యొకశ్లోకమును మిక్కిలియుం బోలియున్నది. ఈ గ్రంథము క్రీ. వె.
531 నుండి 579 వఱకు నుండిన యొక పారసీకరాజుకొఱకు వ్రాయం
బడినది. కాన దీని కుపజీవ్యమైన పంచతంత్రము దాదాపుగా (క్రీ. వె.
500)ఆఱవశతాబ్దముతొలుతఁ గలిగియుండును. పంచతంత్రము పూర్ణ
ముగా స్వతంత్రనిబంధనము గాదు గావున నది యప్పటివాఙ్మయము
నుపజీవుంచుచున్నదిగాన *నది యాపూర్వోక్తశ్లోకమును నీతిశతకము
నుండి కయికొనియున్నది. కనుక భర్తృహరియుఁ బంచతంత్రకాలంబగు
నాఱవశతాబ్దమునకు మున్ను, అనఁగా నైనవశతాబ్దపు రెండవసగము
నందు నుండు ననుట సంభావనీయముగా నున్నది.

### భర్తృహరిద్వితయము.

సుభాషితత్రిశతినిర్మాత భర్తృహరియనంబడునట్లు వాక్యపదీయ
కర్తయు భర్తృహరి నాఁబడు. ఈభర్తృహరు లిరువురు నొక్కరా, లేక
భిన్నులా యని విచారింప వలసి యున్నవి. 'పఠాక్' (Pathak) అను

* ఈశ్లోకము 'శశిదివాకరయో ర్గ్రహపీడనం। గజభుజఙ్గమయోరపిబన్ధనమ్।మతిమతాంచవిలోక్య దరిద్రతాం। విధిరహోబలవానితి మేమతిః'. ఇది భర్తృహరినీతిశతకమునను గానిపించుచున్నది.

నుత్తరదేశపండితుఁడు, వాక్యపదీయకారుఁడు బౌద్ధుఁడు గాన మనశత కకారుఁడు గాఁడని రూపించియున్నాఁడు. చీనాదేశయాత్రికుఁ డగు 'ఇట్సింగ్' (It'sing) ఏడవశతాబ్దముకడపట నిండియాకు వచ్చినపుడు వాక్యపదీయకారుఁడగు భర్తృహరి తా నచ్చటికి వచ్చుటకు నలువది యేండ్లకు మునుపు మరణించె ననియు నతఁడు బౌద్ధుఁడనియుఁ గావున రత్నత్రయమునందును ద్వివిధశూన్యమునందును దృఢభక్తి గలవాఁ డనియు వ్రాసి యున్నాఁడు. పదునొకండవశతాబ్దమునం దుండినవాచస్పతిమిశ్రుఁ డనుపండితుఁ డావాక్యపదీయకారుని 'బాహ్యుఁ' డని పేర్కొని యున్నాఁడు. బాహ్యు లని వేదబాహ్యు లగుబౌద్ధాదులకు వ్యవహరింపఁబడుచున్నది. కావున నిది పూర్వోక్తయాత్రికునివ్రాఁత యథార్థము గావించుచున్నది. మఱియుఁ గుమారిలభట్టు వాక్యపదీయకారు నెంతయు నిరసించి వ్రాసియున్నాడు. బుద్ధుఁ డౌటంజేసియే కాని మఱియొకహేతువుంబట్టి య ట్లాతనిని నిరసించుటకు మూలము గానరాదు. కాన వాక్యపదీయకర్తయగు భర్తృహరి కేవలబౌద్ధుఁ డనుట నిర్వివాదము. సుభాషితత్రిశతీకారుఁడో వేదాంతవిషయతత్పరుం డైనశివభక్తుం డగుట శతకత్రయమే ఘోషించుచున్నది. వేయేల 'దిక్కాలాద్యనవచ్ఛిన్న' యనునీతిశతకప్రథమశ్లోకమే యీకవి వేదాంతతత్పరతను దెలిపెడిని. కావున నీభర్తృహరు లిరువురును భిన్నులే యగుదురు.

## భర్తృహరియు భట్టియు.

భర్తృహరియే భట్టికావ్యకర్త యగుభట్టి యగు నని యొక ప్రతీతి గలదు. ఈభట్టి త్రిశతీకారుఁడగు భర్తృహరియా వాక్యపదీయకర్తయగు భర్తృహరియా యని శంక పొడమెడిని. భట్టి విష్ణుభక్తుఁ డగుటంజేసి బౌద్ధుఁ డగువాక్యపదీయభర్తృహరి కానేరఁడు. ఇఁక శతకకారుఁ డగుభర్తృహరియా యని ప్రశ్న కలుగుచున్నది. ప్రతీతిని విడిచి యిరువురచరితములం జూడఁగా నిద్దఱు నొకరేయనుటకు నయితి గానరాదు. భర్తృహరి క్షత్రియుఁడు; భట్టి బ్రాహ్మణుఁడు. భర్తృహరి మధ్యహిందూదేశవాసి; భట్టి, భట్టికావ్యమునందలి యొకవాక్యముం బట్టి, వలభీరాజాస్థానములోఁ జేరినవాఁడని తెలిపెడిని. వీరిరువురకైన

లులయందు భేదము గలదు. భట్టిరచన మిక్కిలి ప్రౌఢమై యర్థని
బిడమై వ్యర్థపూరణరహితమై యుండును. భర్తృహరిరచనయందుఁ
గొన్నియెడలఁ బదవైఖరి గడుసుగాను నన్వయ మసంగతముగాను జూ
పట్టెడి. మఱియు భర్తృహరి శివవిష్ణులం దభేదప్రతిపత్తిగలయట్లుగాని
పించి 'తథాపిభక్తిస్తరుణేన్దుశేఖరే' యనిశివునియందభక్త్యతిశయము
తెలుపుచున్నాఁడు. భట్టియో యెంతయు విష్ణుభక్తుఁడు. పూర్వ
గ్రంథకారు లీయిరువుర గ్రంథములనుండి యేవేని యుదాహరించున
పుడు వానిని భిన్నకవికృతములుగానే చూపిరి కాని యేకకవికృతము
లుగాఁ జూపరైరి. ఈకారణములంబట్టి యీయిరువురును భిన్నులేకాని
యొక్కరు గారు.

ఇందు బౌద్ధసిద్ధాంతసూచకములు గల వందురు గాని యవి
యంతగాఁ గనుపట్టవు. 'త్రిభువనమపి బ్రహ్మమనుతే' 'లీయే పర
బ్రహ్మణి' యిత్యాదులు వేదాంతదర్శనప్రదర్శకములు. కవి పరామ
ర్శించుయోగప్రక్రియయు దశావతారములును గంగానదియు హిమా
లయప్రదేశములును నతండు బుద్ధుఁడు గామిని జాటుచున్నవి.

## ఆంధ్రవ్యాఖ్యానము.

ఇఁక దీనియాంధ్రవ్యాఖ్యం గూర్చి కొంత చెప్పనొప్పు. రామ
చంద్రవ్యాఖ్య ననుసరించియె ప్రాయికముగా నీవ్యాఖ్య గావింపఁబడి
నది. కాని పెక్కుశ్లోకములకు నావ్యాఖ్యయందుఁ బాఠములు మిక్కిలి
యసమంజసములై యన్వయమును గడు నసంభావితమై కానంబడు
చుంటం జూచి యుదీచ్యకోశపాఠములఁ బరిశీలించి యన్వయసౌల
భ్యము నర్థవైశద్యమును గలుగునట్లు సమంజసములును సరసము
లును బ్రౌఢములు నగుపాఠముల గ్రహించి నేను గ్రొత్తగా వ్యాఖ్య
గావించి యున్నవాఁడ. మనవ్యాఖ్యాతలలోఁ బెక్కండ్రు దమ కఖండ
పాండిత్యముండినను బాఠసౌష్ఠవములం బరిశీలించుట కావంతబుద్ధియు
వెచ్చింపక యవి యెంత యసంగతము లయ్యుఁ దమపాండిత్యపటిమ
వలన క్లిష్టప్రక్రియచే నర్థములు గల్పించి యలవరించువాడుక తఱు
చుగాఁ గనుపట్టుచున్నది. ఇందులకు నిదర్శన మొకటి చూపెద.

'మాలతీ శిరసి జృమ్భణోన్ముఖీ, చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్।
వక్షసి ప్రియతమా మనోహరా, స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః.'

ఇందులకు 'సిగయం దపుడు విరియఁబాఱు చున్న జాజిపూదండయు మేనియందుఁ గుంకుమపూ వైచి మెదిచినగందమును సక్కన వ్రాలియున్న మిక్కిలి యనుంగుఁజెలువయు, పుడమియం దనుభవింపఁబడుటకై వచ్చిన స్వర్గ(భోగ)శేషము' అని తాత్పర్యము. దీనికి రామచంద్రపాఠము,

శ్లో॥ మాలతీ శిరసి జృమ్భణం ముఖే
చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్।
వక్షసి ప్రియతమా మదాలసా
స్వర్గ ఏష పరిశిష్ట ఆగమః ॥

'జృమ్భణం ముఖే' అని యావులింతయు స్వర్గభోగమా ! ఇందులకు 'ముఖే జృమ్భణం మదనమదజనితజృమ్భశ్చ' 'జృమ్భస్తు త్రిషు జృమ్భణమ్' ఇత్యమరః. 'యద్వా సమ్భోగౌత్సుక్యసూచకరాగవిలాసస్ఫూర్తిశ్చ' యని రామచంద్రవ్యాఖ్య. 'జృమ్భణోన్ముఖీ' యని మాలతీపుష్పమునకుసొంపైనవిశేషణమును గూర్చుపాఠము సరసమో యావులింతను స్వర్గభోగముఁ జేయుపాఠము సరసమో రసజ్ఞులే యూహింతురుగాక. 'స్వర్గఏష పరిశిష్టఆగమః' అనుచో ఈపూర్వోక్తములైన మాలత్యాదులే స్వర్గము-అనఁగా స్వర్గశబ్దవాచ్యములనియు, ఆగమము-అనఁగా వీనిందప్పఁ దక్కినవానిని స్వర్గముగాఁ జెప్పుశాస్త్రము, పరిశిష్టమైనది-అనఁగా అముఖ్యమైనది-స్వర్గపదవాచ్యములైన వాని ముఖ్యార్థమును దెలియనిది, అనియు, కాకున్న పూర్వోక్తములైనవానినే స్వర్గమని చెప్పవలనియు వ్యాఖ్యసేయంబడి యున్నది. ఈ కొండవీటి చేంతాటిచుట్టవేల? ఈకల్పనాగౌరవముచే కష్టపడి సంపాదించినయర్థగౌరవముకంటె'పరిశిష్ట ఆగతః'అనుచో నతిసులభముగా స్ఫురించునర్థసంపద యెంతయు సొంపుగా నున్నది.

శ్లో॥ యదేతత్పూర్ణేన్దుద్యుతిహరముదారాకృతి పరం
ముఖాబ్జం తన్వఙ్గ్యాః కిల వసతి యత్రాధరమధు ।

ఇదం త త్కింపాకద్రుమఫల మిదానీ మతిరసం
వ్యతీతేఽస్మిన్కాలే విషమివ భవిష్యత్యసుఖదమ్ ॥

శృంగార : ౪౧.

ఇందు, తన్వంగిముఖాబ్జము కింపాకద్రుమఫల మనఁబడియె. వ్యాఖ్యాతకు 'కింపాక'శబ్దమున కర్థము దెలియక 'కిం-కిమపి-అనిర్వాచ్యమిత్యర్థః. పాకద్రుమస్య - బాలరసాలాదివృక్షస్య, ఫలం - అతిరస బాలరసాలవృక్షఫలమిత్యర్థః 'పోతఃపాకోఽర్భకోడిమ్భః' ఇత్యమరః. యద్వా...కిం పాకం-ఈషత్పక్వం - ద్రుమఫలమ్...కింపాకశబ్దో నిఘణ్ట్వన్తరేషు మృగ్యః' అని వ్రాసినాఁడు. కింపాకమనఁగా ముసిఁడిచెట్టు: 'కింపాకః స్యాన్మహాకాళః' అని హలాయుధుఁడు. 'విషముష్టౌ నిరర్థకేచ'అని శబ్దరత్నకోశము. స్త్రీముఖము ముసిఁడిచెట్టు పండువలె నను భవించునపు డతిరసముగాను పిదప విషముగాను నుండునని యర్థము. 'కింపాక' శబ్దమును విఱిచి బాలరసాలాద్యర్థములు సేయుటవలనఁ బాండిత్యము కొఱవడదుగాని * విమర్శాలోపమే కానిపించుచున్నది. మొత్తమునకు రామచంద్రునివ్యాఖ్య మిక్కిలి వ్యుత్పన్నమైనది. ఇతండు,

శ్లో॥ శ్రీమాం స్త్రైలిఙ్గదేశే స జయతి విబుధశ్రేణికోటీరకోటీ-
కోటీమాణిక్యభూతాగణితగుణగణోఽఖణ్డపాణ్డిత్యశౌణ్డః।
ధీరః శాణ్డిల్యగోత్రః సకలకవికులాశ్లాఘ్యదిసూక్తిప్రవీణో
వీణోదాహార్యవిద్యావివరణనిపుణో రామచన్ద్రో బుధేన్ద్రః॥

శ్లో॥ వేదాన్తోద న్తచిన్తామతనుత చతురేణాన్తరేణాకుతర్కం
తర్కంచాతర్కయద్యః ఫణిపతివచసాం పారమాధత్త యోగే।
యోగే యః సాఙ్ఖ్యసఙ్ఖ్యాగమసమయవిధావపల్యం తన్త్రవిద్యా
విద్యాయామిన్యధీశః స్ఫురతి నిరుపమాఽవఙ్చవంశామ్బురాశౌ॥

అని వ్రాసికొన్నట్లుసకలశాస్త్రప్రవీణుఁ డనుటకునీవ్యాఖ్యయే నిదర్శ

---

*నీతిశతకమున ముఖ్యముగా 55, 69, 76, 78, 85, 89, 90, 91 వ శ్లోకములును, శృంగారశతకమున 22, 24, 28, 35, 48, 54, 79 వ శ్లోకములును, వైరాగ్యశతకమున 1, 23, 26, 28, 42, 49, 61, 65 వ శ్లోకములును నిట్లే విమర్శారహితము లై యుండుట చూచునది.

నము. ఇందుఁ గలవిశేషప్రక్రియలన్నియును దెలుఁగునందునుగూర్చి యున్నవాఁడ. శృంగారశతకముతోలుత నవరసములంగూర్చియు విభావానుభావాదులంగూర్చియు వ్యాఖ్యావిషయప్రవేశమునకు వలయు నంత వ్రాసియున్నాఁడ. ఉదీచ్యకోశములను బ్రాచ్యలిఖితగ్రంథభండారమందలిప్రతులను బెక్కింటిఁ బరిశీలించి శ్లోకములకు సమంజసపాఠములఁ గుదుర్చుటయే కాక యాంధ్రజనహృదయంగమముగా నేనుఁగులక్ష్మణకవికృతము లగు తెనుఁగుపద్యముల నాయాశ్లోకముకడఁ గూర్చియున్నవాఁడ. ఇవి రామచంద్రవ్యాఖ్యను నిర్విచారముగా ననుసరించుటచేఁ బెక్కుచోట్ల దుష్టములై యున్నను మొత్తమునకుఁ గడు రసవంతములుగానే యున్నవి. ఆయాశతకమున కధికశ్లోకములను నుదీచ్యకోశములనుండి కూర్చి వానికి వ్యాఖ్యయు సొంతముగాఁ దెనుఁగుపద్యములును రచించియున్నవాఁడ. ఇందుఁ గలదోషములు పండితులు నాకుఁ దెలుపుదురేని కృతజ్ఞుఁడనై సవరించుకొనువాఁడ.

తం. తేవప్పెరుమాళ్లయ్య.

# ద్వితీయ ముద్రణ పీఠిక.

శ్రీనిధియు, ధీనిధియు నగు శ్రీభర్తృహరి మహారాజయోగీంద్రునికృతిరత్నమును, నీతి శృంగార వైరాగ్యశతకత్రయాత్మకమును అగు "సుభాషితత్రిశతి" యిదివఱకు పలుసారు లీమద్రాసుఁలో సంస్కృతమూలశ్లోకములును, వానికి రామచంద్రబుధేంద్రుని వ్యాఖ్యానమును, ఏనుఁగు లక్ష్మణకవి విరచితము లయినయాంధ్రపద్యములును కలిపి ముద్రించుచువచ్చినారు. ఇటీవల 1909 లో మామిత్రులును, కీర్తిశేషులును అగు తంజనగరము - తేవప్పెరుమాళ్ళయ్యగారిచే వ్రాయఁబడిన-ఆంధ్రటీకాతాత్పర్యములతోను, ఏనుఁగు లక్ష్మణకవి కృతాంధ్రపద్యములతోను కూర్చి శ్రీవేమూరి-వేంకట కృష్ణమసెట్టి అండ్ సన్సుచేత నాంధ్రజనోపయోగముగా ముద్రింపించి ప్రకటితమయినది. ఈసంవత్సర మాప్రతి పునర్ముద్రణమునకు రాఁగా శ్రీ అనుమాలసెట్టి కణ్ణశ్రేష్ఠిగా రాంధ్రపద్యములు వ్రాసినలక్ష్మణకవిగారి జీవితచరిత్రముతో ముద్రింపింపఁదలఁచి యాభారము నాయందుంచి యున్నారు. నేనును వారియాజ్ఞను శిరసావహించి లక్ష్మణకవిగారి జీవితచరిత్రను వ్రాయుటకు సిద్ధముగా నున్నసమయమున, ఆంధ్రపత్రికాసంపాదకులయిన దేశోద్ధారక, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారి సంపాదకత్వమున వెలువరింపఁబడుచున్న "భారతి" అనుమాసికపత్రిక - అక్షయాషాఢ సంచికలో ఏనుఁగు లక్ష్మణకవిగారి యాంధ్రసుభాషిత రత్నావళి యవతారికాపద్యములు ప్రకటింపఁబడినవి. ఇంతవఱకు ముద్రితములయిన భర్తృహరి సుభాషితత్రిశతికి మూలమునకు సరియైనపద్యములుమాత్రమే ప్రకటించుచు వచ్చిరే కాని యెవ్వరును మొదటి యవతారికాపద్యములు ప్రకటింపఁబూని యుండలేదు. కృతిసలికి శిరోజప్రాయమయిన యవతారిక కృతిమొదట నుండుట యెంతో యావశ్యకమయినను ఇదివఱ కట్టులు జరిగి

యుండలేదు. ఈయవతారికాపద్యము లున్నట్టులే పలువు రెఱిఁగియుం డరు. కవులచరిత్రను వ్రాసిన మ-రా-శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగా రాయవతారికాపద్యములు తాముచూచియున్నట్టు లక్ష్మణకవిగారి చరిత్రములో వ్రాసియున్నారు, కొన్ని యుదాహరించియున్నారు కూడను. కాని వా రయినను ఆంధ్రులయుపయోగముని మిత్తము ప్రకటించినవారు గారు. ఇన్నాళ్ళ కీయవతారికాపద్యముల కాంధ్రులు చూడఁగలిగినభాగ్యము తటస్థించినది. నాకు బాల్యమిత్రులును, సతీర్థ్యులును అగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రులవా రీయవతారికాపద్యములను కాకినాడకు సమీపముననున్న కరపగ్రామములోని శ్రీచాగంటి సుబ్బారావుగారియొద్దనుండి మ-రా-శ్రీ విస్సా-అప్పారావుపంతులవారు సంపాదించి యీయఁగా లేఖనాది ప్రమాదములు సవరించి భారతిలో ప్రకటింపఁజేసినారు. ఆపద్యములను తమద్వితీయముద్రణపుస్తకములోఁ జేర్పించుటకు గ్రంథప్రకాశకులగు కర్ణా సెట్టిగా రంగీకరించినందున నే నాపద్యములతోఁగూడ లక్ష్మణకవిగారి జీవితచరిత్రమును నాతివిస్తరముగ వ్రాసి వీరికి సమర్పించుచున్నాను. ఈయవతారికాపద్యము లాంధ్రులు చూచుటకు కారణభూతులయిన పయివారందఱకును ఆంధ్రులు కృతజ్ఞులయి యుండవలయుట న్యాయ్యము. నే నీకవిజీవితమును వ్రాయునపుడు శ్రీవీరేశలింగముపంతులుగారి కవులచరిత్రను, భారతిలోని మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారు వ్రాసినసంక్షిప్తకవిజీవితమును అవతారికాపద్యములను ఆధారముగా నుంచుకొంటిని. కావున నీకఁ బ్రకృత మనుసరించెదను.

---

## ఏనుఁగు లక్ష్మణకవిగారి వంశచరిత్రము.

గోదావరి మండలములోనిదగు పెద్దాపురపుసంస్థానములోని పెద్దాడ అను గ్రామమున పైఁడిపాటి సింగన్నమంత్రి యనునాయన యొకఁ డుండెడివాఁడు. ఆయన మనకవిగారికి మూలపురుషుఁడు. వీ రారువేల నియోగిబ్రాహ్మణశాఖకుఁ జేరినవారు. ఆపస్తంబసూత్రులు,

వాధూలస గోత్రులు, ఆ సింగన మంత్రిగారి సంతానక్రమంబున దేవ మంత్రిసముఁడయిన జలపాలమంత్రి యను నతఁ డుదయించినాఁడు. ఈయనకు పెద్దాపుర సంస్థానాధీశ్వరుఁడైన శ్రీవత్సవాయ గజపతిరాజు గారు సోమేశ్వర మను నగ్రహారమును, ఒక యేనుఁగును బహుమాన ముగా నిచ్చియున్నారు. ఆకారణమును బట్టి యదిమొదలు వీరియింటి పేరు పైఁడిపాటిపోయి యేనుఁగువా రని వాడుకలోనికి వచ్చియున్నది. ఆజలపాలమంత్రికి గరికరాజు అనుకుమారుఁడు పుట్టినాఁడు. ఈయంశము లన్నియు నవతారికలోని 29-30-వ పద్యములవలనఁ దెలియుచున్నవి. ఆగరిక రాజునకు గుగుమూర్తి, గురురాజు నని యిద్దఱు కుమారులు గలరు. రెండవవాఁడయిన గురురాజునకు పేరమాంబ ధర్మపత్నీ, ఆదం పతులకు లక్ష్మణమంత్రి యనుకుమారుఁ డుదయించినాఁడు. ఈయనయే మనకవికిఁ బితామహుఁడు. ఇతఁడు ద్రౌపదీపరిణయము, స్త్రవచరిత్ర ము, తులామాహాత్మ్యము మొదలయిన గ్రంథములు రచించి పెద్దా పురసంస్థానాధీశులకును, వారిబంధువులకును కృతు లిచ్చియున్నాఁడు. ఈయనభార్యపేరు సుభద్రాంబ. ఈదంపతులకుఁ దిమ్మనార్యుఁడు, గురు వరాజు నని యిద్దఱు కుమారులు పుట్టినారు. పెద్దవాఁడయిన తిమ్మనా ర్యుఁడు మాచిరాజు నృసింహమంత్రికూఁతు రయిన పేరమాంబను పెండ్లియాడినాఁడు. ఈ దంపతులకు ననంతార్యుఁడు, లక్ష్మణకవి, వీర భద్రుఁడు నని ముగ్గురుకొమాళ్ళు పుట్టినారు. రెండవవాఁడే మనప్ర కృతకవి. ఇతనియన్నయగు ననంతార్యుఁడు గౌరీపరిణయమను ప్రబం ధము రచించినట్టుగా నవతారికలోని 41-వ పద్యములో నీకవియే చెప్పియున్నాఁడు. ఈ యనంతార్యునకు సుందరియనునామె భార్య. వీరికి గురువరాజు, తిమ్మనార్యుఁడు నని యిద్దఱుకొడుకులు పుట్టిరి. అం దుఁ బెద్దవాఁడయిన గురువమంత్రికి వీరేశ్వరుండను కొడుకుగలఁడు. మన కవిని లక్ష్మీపతి యనియు, లక్ష్మణకవి యనియును బిలుచుచుం డెడివారు. ఈయనకు భార్య యెవరో తెలియదు గాని,తిమ్మనార్యుఁడు, పేరనార్యుఁడు, నని యిద్దఱుకొడుకులు పుట్టినారు. పెద్దవాఁడగు తిమ్మ నార్యుఁడు పార్వతి యనునామెను పెండ్లియాడి యామెయందు వీర

భద్రుఁడు, లక్ష్మణమంత్రి యనునిరువురు కుమారులను గన్నాఁడు. అనఁగా మనకవి సుభాషితరత్నావళి తెలిఁగించునప్పటికి యోగ్యుల యిన యిద్దఱుమనుమలకుఁ బితామహుఁ డయి యొప్పారుచున్నాఁడు. మన లక్ష్మణకవిగారి పెద్దమనుమఁ డయిన వీరభద్రునకుఁ బేరరాజను కుమారుఁడు గలఁడు. ఈయన పెద్దాడకరణముగా నుండియు సాహిత్య కవిత్వ సంపద గలవాఁడై పెద్దా పురరాజుల-ఆ స్థానమందే తఱచుగాఁ గాలక్షేపము చేయుచుండెడి వాఁ డనియు, శౌర్య ధైర్య సాహస సౌదార్యాది గుణములు గలవాఁడనియు, రసజ్ఞుఁడనియు నిప్పటికి నూటపండ్రెండు సంవత్సరముల క్రిందటి శ్రీముఖ సంవత్సరమున శ్రావణ బహుళైకాదశీ భానువారము నాఁ డితని యుంపుడుకత్తెయు, పెద్దాపురనివాసినియు నగు లక్ష్మీబాయి యను వేశ్య యీతని పేరను వ్రాసిన ప్రేమలేఖవలనఁ దెలియుచున్నది. పీచుకాగితము పయిని వ్రాయఁబడిన ఆ లేఖ యిప్పటికిని గలదఁట! ఈ పేరరాజునకుఁ దమ్ముఁడయిన లక్ష్మన్న యొక్క ప్రపౌత్రుఁడు రామన్నగారిపుడు జీవించి యున్నట్లు వారివంశ వృక్షమువలనఁ దెలియు చున్నది. ఇది మన లక్ష్మణ కవిగారి వంశ చరిత్రము.

ఈయన రామేశ్వరమాహాత్మ్యము, విశ్వామిత్ర చరిత్రము, సంస్కృతసూర్యశతకము, గంగామాహాత్మ్యము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణ నృసింహదండకాదిస్తుతులు, రామవిలాసము మొదలయిన గ్రంథములను రచించియున్నాఁడు. తక్కిన గ్రంథముల సంగతి మన కింతవఱకుఁ దెలియకున్నను భర్తృహరిసుభాషితముల తెలుఁగురచనము మూలమునకుఁ గొంచెమయినను విరసముగ నుండక మూలానుసారముగను, నిర్దుష్టముగను, రసవంతముగాను, హృదయరంజకముగాను నున్నదని శ్రీవీరేశలింగముపంతులవారే వ్రాసియున్నారు. మఱియు నీకవివంశమువారు మొదటినుండియు శ్రీ పెద్దాపురపుసంస్థానాధీశుల యాస్థానములోనే కవులుగా నున్నట్టు స్పష్టపడుచున్నది. వీరివంశములోని కవు లందఱును తమగ్రంథములను సంస్థానాధీశులకును, వారిరాజబంధువులకును గృతిగా నిచ్చియు

న్నట్టు కవులచరిత్రవలనఁ దెలియుచున్నది. ఈయన శ్రీవత్సవాయ తిమ్మజగపతి మహారాజుగారి కాలమున శ్రీ వారి సంస్థానములో గౌరవ మందుచు, శ్రీవత్సవాయ సింహాద్రి రాజు గారి కుమారుఁ డయిన గోపరాజు గారికిఁ దన కడపటికృతి యగు రామవిలాసమును కృతిగా నిచ్చి సత్కరింపఁ బడియున్నాఁడు. గోపరాజు సంస్థానాధీశ్వరుఁడు గాక, సంస్థానము వారి బంధుకోటిలోఁ జేరియున్నవాఁ డని కవులచరిత్రలోఁ గలదు. ఈయన, పదునెనిమిదవశతాబ్దిలో నున్నవాఁడై రసికజనమనోభిరామాదిగ్రంథములు వ్రాసిన కవిసార్వభౌమ, కూచిమంచి తిమ్మకవి గారితో సమకాలికుఁ డయినట్టుగా.

"క. హాటకగర్భవధూలీ, లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ, తేటలు మాకూచిమంచితిమ్మయమాటల్."

అని యీకవి వ్రాసినట్టనుమానింపఁ బడిన పద్యము వలనఁ దెలియుచున్నది. కనుక నీయన కాలము పదునెనిమిదవ శతాబ్దియే.

ఈ యేనుఁగులక్ష్మణకవిగారి కాశ్రయులయిన పెద్దాపురసంస్థానాధీశులును, శ్రీవిజయనగరసంస్థానాధీశులగు పూసపాటివారును దగ్గఱబంధువు లగుటచే నొకప్పు డప్పటి పూసపాటి విజయరామరాజు గారు పెద్దాపురమునకు దయచేసినప్పుడు ప్రస్తావవశమున మనకవి గారు భర్తృహరిసుభాషితములు తెలిఁగించినట్టు తెలిసికొని "విద్యానామ నరస్య రూపమధిక"మ్మను సంస్కృతశ్లోకమున కెట్లు పద్యము చెప్పితిరో చదువుఁ డని యడిగినారఁట! ఆయన "యెందుల కిట్లడిగినారు చెపుమా" యని సంశయించుచుఁ దాను వ్రాసిన "విద్యనిగూఢగుప్త మగు విత్తము" అను దానిపద్యమును చదువఁగా "విద్యావిహీనః పశుః" అని యున్నసంస్కృతమూలమునకు "విద్య నెఱుంగని వాఁడు మర్త్యుఁడే?" అని యుండుట విని మూలము మోటుదనముగా నున్నను తెలుఁగు చాల సరసముగఁ బడిన దని మెచ్చుకొన్నారఁట! ఈకవిస్వస్థలమయిన పెద్దాడగ్రామమందలి సోమశంకరస్వామి తన హృదయమున సాక్షాత్కరించినట్టియును, సుభాషితరత్నావళిని తెనిఁగింపు మన్నట్టును అవతారికలోని 21–22–23–24–25–26 వ పద్య

ములలోఁ జెప్పుకొనియున్నాఁడు. ఈప్రకారముగా నీకవిచరిత్రముగించి యీపుస్తకములో నీకూర్పులోఁ జేర్పఁబడిన మఱిరెండు తెలుఁగురచనలను గూర్చి కొంచెము వివరింపవలసియున్నది. అది యెద్దియనఁగా.—

క్రీ. శ. పదునాఱవశతాబ్దికొనను, పదునేడవశతాబ్దిపూర్వార్ధములోను ఉండి మహామహోపాధ్యాయబిరుదము నందినవాఁడయి పాండిత్యముచేతను మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన మెలకూచి-బాలసరస్వతి యనుకవి సురభిమల్లభూపాలుని కంకితముగా నీభర్తృహరిసుభాషితత్రిశతిని తెలిఁగించియున్నాఁడు. మఱియు నితఁడు రంగకౌముదియను నాటకమును, చంద్రికాపరిణయమను ప్రబంధమును, ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్యానము భాషావివరణము నను లక్షణగ్రంథములను, రాఘవ యాదవ పాండవీయమను త్ర్యర్థికావ్యమును రచించియున్నట్టి క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.—

"సీ. కవిసమీహితరంగకౌముదీనామనాటకవిధానప్రతిష్ఠాఘనుండ
సారసారస్యసచ్చంద్రికాపరిణయప్రముఖశతాగ్రప్రబంధకర్త
నంధ్రచింతామణివ్యాఖ్యనభాషావివరణాదిబహుతంత్రకరణచణుఁడ
వేదశాస్త్రపురాణవివిధసంగీతసాహిత్యాదివిద్యోపబృంహణుండ
తే. గీ. ననఘకౌండిన్యగోత్రుండ హరిపదాబ్జభక్తిశీలుండ నెలకూచి భైరవార్య
కృష్ణదేవతనూజుండ నే విచిత్ర, కావ్యమొక్కటి నిర్మింపఁగాఁ దొడంగి.
శా. మెండైనట్టి విచిత్రవైఖరులచే మీఁదౌమహాకావ్యముల్
దండిం దొల్లియె చేసి రాదిములు తత్కావ్యాధికశ్లాఘమై
నుండన్ రాఘవకృష్ణపాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నేఁ జేసెదన్."

ఈయననివాసాదికము సరిగా కవులచరిత్రవలనఁ దెలియకున్నను, ఈభట్టారబాలసరస్వతికవిమహామహోపాధ్యాయుఁడు తాను రచించిన చంద్రికాపరిణయమును పత్రియాలజమీందారుఁడగు జూపల్లి వేంకటాద్రియనునతని కంకితముచేసి యున్నందునను, ఈ పత్రియాల బెజవాడకు రెండామడలదూరములో నిజామురాష్ట్రములో నున్నందునను కవియు నారాష్ట్రములోనివాఁడే యయి యుండవచ్చును. ఈకవిని మన-అప్పకవి చూచియుండు నని శ్రీవీరేశలింగముపంతులువా

రూహించియున్నారు. ఇతనినిగూర్చి కాని, ఇతనికృతిపతియగు సురభి మల్లభూపాలునిగూర్చికాని తెలిసికొనుటకుఁ దగినయాధారములు కానరావు. కడమ యితనికవిత్వ మెటులుండునదియు మన కంతగాఁ దెలియు నవకాశము చాలదుగాని మొత్తము మీఁదను సుభాషితత్రిశతి తెలిఁగించినపద్యములుమాత్రము మన యేనుఁగులక్ష్మణకవిగారిపద్యములంత సరసముగా నున్నట్టు కనుపట్టవు. ఈతని పద్యము లిదివఱలోఁ గొంత వఱ కాంధ్రులకుఁ బరిచితములయియే యున్నవి. ఇపు డీపుస్తకములోఁ జేర్పఁబడినందున సంపూర్ణముగాఁ బరిచితములు కాఁగలవు.

మఱియు నిందుఁ బుష్పగిరి తిమ్మకవికృతమయిన నీతిశతకపుఁ బద్యములుగూడఁ జదువరులయుపయోగమునకై చేర్పఁబడినవి. పుష్పగిరి తిమ్మకవి,ఉత్తరరామాయణమును రచించిన కంకంటి పాపరాజుతో సమకాలికుఁడు. వీరిద్దఱును గలిసియే యుత్తరరామాయణమును రచించినారని వాడుక. ఇతఁడు సమీరకుమారవిజయమను నేడాశ్వాసముల ప్రబంధమును వ్రాసి, భర్తృహరినీతిశతకమునుమాత్రమే తెనిఁగించియున్నాఁడు. ఇది లక్ష్మణకవి కృతమయిన నీతిశతకమునంత రుచిగా లేదు. కవి సంస్కృతాంధ్రములయం దసమానపాండిత్యము గలవాఁడే యయినను కవిత్వములో నక్కడక్కడ లక్షణవిరుద్ధములయిన ప్రయోగము లున్నవి. ఈకవినివాసస్థలము నెల్లూరిమండలములోని మోడేగుంట యయినట్లు నెల్లూరిమండలచరిత్రసంగ్రహములో వ్రాయఁబడియున్నది. ఇతఁ డాశ్వలాయనసూత్రుఁడు. విశ్వామిత్రసగోత్రుఁడు. ఇతని తండ్రి పేరప్పనార్యుఁడు, తల్లి యాబళాంబ. ఇతఁడు పదునెనిమిదవ శతాబ్దిలో నున్నవాఁడు. ఇతఁడు తన సమీర కుమార విజయములోఁ దన్నుఁ గూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు.—

"సీ. శ్రీహనూమత్పాదసేవాగతాధ్యాత్మతత్త్వకవిత్వమహత్త్వవిదుఁడ
నాశ్వలాయనసూత్ర హారి విశ్వామిత్రగోత్రాబ్ధిచంద్రుఁడఁ గుశల మతిని
అలపుష్పగిరి యప్పనార్యున కాబళాంబకును సుపుత్రుండ బ్రహ్మవేత్త
యైన వేంకటకృష్ణయార్యాగ్రణికిని వేంకటాఖ్యకవీంద్రున కవరజుండ

ఆ. వె. పరసగుణయుతుండ వరకవిఁ దిమ్మనా,
హ్వయుఁడ నేను జనన మంది మనుట
కెల్ల ఫలము గల్గఁ గృతి యొక్కటి రచింప,
నూహ సేయుచున్న నొక్కనాఁడు."

ఈ ప్రకారముగా భర్తృహరిశ్లోకములకుఁ దెలుఁగుపద్యములు వ్రాసిన ముగ్గురుకవుల పరిచయము నేతత్పుస్తకపాఠకుల యుపయోగమునకై యథామతిగ భాషాస్వరూపయు నస్మత్కులదేవతయు నగు శ్రీకామేశ్వరీదేవిప్రీతికై వ్రాసి యేతద్గ్రంథప్రకాశకులకు విధేయతతో సమర్పించుకొన్న-ఆంధ్రభాషాసేవకపాదపద్మపరాగరేణువు.—

క్షయ, భాద్రపదపూర్ణిమ
చెన్నపట్టనము.

పురాణం-సూర్యనారాయణతీర్థులు.

# అవతారిక.

---

ఉ. శ్రీ లలితాద్రిజాఘుసృణచిత్రకరాగముఁ గాంచి తావక
భ్రూలత పల్లవించె ననఁబోణి నిజం బని మించుటద్దమున్
గేల ధరించి ప్రేమ దిలకింపఁగఁ జూపువిలాసశాలికిన్
బాలితసర్వభక్తజనపాలికి మ్రొక్కెదఁ జంద్రమౌళికిన్. ౧

ఉ. తోయధిసార మై యితరదుర్లభ మై గుణరమ్య మై జగ
ద్ధేయమహత్త్వ మై భువనదీపక మై కమలాఖ్య మై నిశా
నాయకసోదరం బయి మనఃప్రియ మౌరతనంబు ఱొమ్మునన్
బాయక తాల్చుశౌరి నిరపాయసుఖంబులు మాకు నీవుతన్. ౨

ఉ. ప్రామినుకుల్ ముఖాబ్జముల భారతినెచ్చెలు లై వసింప నె
త్తామరపువ్వుపీఠమునఁ దాపసముఖ్యులు సర్వనిర్జర
గ్రామణు లాత్మకింకరులు గా జగ మేలెడుమేటి భక్తచిం
తామణి మాకు సత్కృపఁ బితామహుఁ డిచ్చుఁ జిరాయురున్నతుల్. ౩

ఉ. శంకరచారుదృక్కుముదచంద్రిక యోగిజనప్రసన్నహృ
త్పంకజరాజహంసి శ్రుతిదర్పణదృశ్యనిజస్వరూప వి
శ్వాంకురజన్మభూమి తుహినాద్రితపఃఫలరాశి చంద్రరే
ఖాంకితరమ్యమౌళి జగదంబ శుభంబులు మాకు నీవుతన్. ౪

చ. మినుకుఁగడానిపైఁడిపస మిం చన నెమ్మెయిడాలు జాళువా
ననజడికై వడిన్ మగనినల్లనిమేనికి వన్నె వెట్టఁగా
గొనబు వహించుజవ్వని ముకుందునిపట్టఁపుదేవి ప్రేమతో
వననిధికన్య మామకనివాసములన్ వసియించుఁగావుతన్. ౫

చ. నెలకొని తియ్యగాఁ బలుక నేర్పును మా కని చేరుభంగి రా
చిలుకయుఁ వీణయున్ దను భజింపఁగ గీతసుధాపయోధిలోఁ
బొలుపుగ నోల లాడుననఁబోఁడి నిరంతరసుప్రసన్న యై
పలుకువెలంది నావదనపద్మమునన్ విహరించుఁగావుతన్. ౬

శా. శ్రీవాణీరమణాదు లెవ్వని జయశ్రీకాము లై కొల్తు రే
దేవున్ బ్రాఁజదువుల్ గజాననునిగాఁ జెల్వున్ జగత్కర్తగా
నా విద్యాసురునిన్ గణేశ్వరుని భక్తాభీష్టసంధాయకున్
సేవింతున్ మదిలో వినాయకుని సుక్షేమార్థసంసిద్ధికిన్. ౭

ఉ. మూఁడుగుణంబులుఁ బరమమూర్తులు మూఁడును మూఁడువేదముల్
మూఁడుమహాక్షరంబు లొకమూర్తిగఁ జూచినమేటివేలుపుఁ
బ్రోడలకేలుమోడ్పులు సమున్నతిఁ గైకొనుసామిఁ జూడ్కికిన్
వేడుక సేయుదేవునిఁ గవిస్తుతతేజు రవిన్ భజించెదన్. ౭

చ. ఇనజునితోడ మైత్రి ఘటియించియు వారిధి దాఁటి జానకిన్
గనుఁగొని వచ్చియున్ జవముఁ గైకొని మందులు దెచ్చి లక్ష్మణున్
మనిచియు దైత్యులన్ బిలుసమార్చియు రాఘవుచేత మెప్పు లొం
దినహనుమంతు శాంతు వినుతింతు మహాబలవంతు నెంతయున్. ౮

తే. గీ. యుక్తి నొక్కొక్కవర్ణ మత్యుగ్రపాప,
విదళనము చేయుశతకోటివిస్తరముగ
రామచరిత మొనర్చినవామలూరు,
సంభవునకుఁ బ్రణామముల్ సంఘటింతు. ౧౦

తే. గీ. పరమపావన మగుమహాభారతంబు,
పంచమామ్నాయముగ రచియించి ప్రజకు
ముక్తిమార్గంబుఁ జూపినమునికులేంద్రు,
బాదరాయణకవిసార్వభౌముఁ దలఁతు. ౧౧

తే. గీ. సారకవితాసుధారసాసారకలన,
రసికజనులమనోమయూరములఁ దనుపు
ఘనుల వర్ణింతు శివభద్ర కాళిదాస,
చోర మాఘ మయూరాదిసుకవివరుల. ౧౨

ఉ. ఆయుతయుక్తి మువ్వురు మహామును లంచితవాక్ప్రపంచధా
రేయులు శబ్దశాస్త్రి మొనరించినభంగి నుదారభారతా
మ్నాయము మిశ్రసూక్తుల నొనర్చినమాన్యుల నన్నయార్యునిన్
ధీయుతు శంభుదాసకవిఁ దిక్కమఖీశ్వరుఁ బ్రస్తుతించెదన్. ౧౩

తే. గీ. సోమ భాస్కర శ్రీనాథ భీమ రామ, భద్ర వీరభద్రాదుల భద్రకరుల
మాననీయుల దేవతామహిమఁ బూని, వెలయునాంధ్రకవీంద్రుల వినుతిసేతు.

క. ఆకరవల్లికులాబ్ధిని, శాకరుఁ గోదండరాము సద్గురుఁ దలఁతున్
శ్రీకరవిప్రాకార, శ్రీకంఠుని వేదశాస్త్రిసిద్ధాంతనిధిన్. ౧౫

క. పికమధురోక్తులచాడ్పున, సుకవులవాక్యములు కర్ణసుఖకరము లగున్
గుకవులపలుకులు కాకప్రకరరుతంబులునుబోలెఁ బరుషంబు లగున్. ౧౬

క. సామజముమీఁదఁ గవిసిన, దోమలచందమున సుకవితో వాదింపం
గా మొనసి వచ్చుజడుల న, సామతరుల ఖలులఁ జూచి నవ్వరె సరసుల్. ౧౭

వ. అని యిష్టదేవతానమస్కారప్రభృతి కృతిముఖశుభాచారంబు లాచరించి
మనంబులోన. ౧౮

క. రామేశ్వరమహిమము వి, శ్వామిత్రచరిత్ర సూర్యశతకంబును గం
గామాహాత్మ్యము మొదలగు, శ్రీమత్కృతిరత్నములు రచించియు మఱియున్.

వ. ఏ నొక్క చాటుప్రబంధంబు నిర్మించెద నని నిశ్చయించి దేవపూజాసద్మం
బునఁ బద్మాసనాసీనుండ నయి చిత్తంబు నియమాయత్తంబు గావించి పురహర
చరణారవిందధ్యానసుధాసంధానంబు చేయుచున్న సమయంబున. ౨౦

సీ. కలధౌతగిరియును గలధౌతగిరియును, విల్లుగాఁ బాడ వైనయిల్లు గాఁగఁ
గమలాహితుండును గమలాహితుండును, శరముగా లలితశేఖరము గాఁగఁ
బద్మోద్భవుండును బద్మోద్భవుండును, సాదిగా మెయిఁ దాల్చుబూది గాఁగఁ
బవనప్రియుండును బవనప్రియుండును, సొమ్ముగా ఫాలనేత్రమ్ము గాఁగ

తే. గీ. వరలుపెనువేల్పు ముమ్మొనవాలుదాల్పు,
జగములకు ఱేఁడు ధనదునిసంగడీఁడు
హరుఁడు పెద్దాడసోమశంకరుఁడు హృదయ,
సరసిజంబున నాకు సాక్షాత్కరించె. ౨౧

క. ఈరీతిని గృప సాక్షా, త్కారుం డగుసాంబశివునిఁ గని మానసపూ
జారచనలఁ గొలిచి నమ, స్కారంబులు సేసితిఁ వికస్వరమతి నై. ౨౨

క. అతివేలానందసమ, న్వితు నన్నుఁ గృపాకటాక్షనిబిడజ్యోత్స్నా
ప్లుతుఁ జేసి పార్వతీపతి, హితమతి నతిమధురఫణితి నిట్టులు వలికెన్. ౨౩

తే. గీ. భర్తృహరి యనఁదగినభూభర్త నాదు, భక్తిచే యోగిజనసార్వభౌముఁడగుచు
నీతి శృంగార వైరాగ్యరీతు లలర, వృత్తశతకత్రయము రచియించె మున్ను.

క. వెలయు సుభాషితరత్నా, వళి యన భర్తృహరియోగివరకృతి వివిధో
జ్జ్వలగుణశోభిత మయి సొం, పులు గుల్కు రసజ్ఞకంఠభూషణ మగుచున్. ౨౪

తే. గీ. అమ్మహాకృతి నీవు రమ్యాంధ్రదేశ, భాషచే సరసముగఁ గబ్బము రచించి
మాకు సదుపాయనముగ సమర్పితంబు, సేయుము నితాంతభక్తివిశేషయుక్తి. ౨౫

తే. గీ. సామసంగీతములకన్న శైలకన్య, భాషితంబులకన్నను బాహులేయు
కథలకన్నను గర్ణసుఖప్రదములు, భక్తు లర్పించుకావ్యగుంఫములు మాకు.

వ. అని సర్వజ్ఞుఁ డాజ్ఞాపించి మనోరథసిద్ధియగుతమని దీవించుటం జేసి యంతరంగం
బునం దరంగితం బగుహర్షోత్కర్షంబునఁ గృతి రచియింపఁ దొడంగి మదీయవం
శావతారక్రమం బభివర్ణించెద.

సీ. పరమేష్ఠితుల్యప్రభావుఁడు వాధూలుఁ, డనుమునీంద్రుం డొప్పు ననఘమూర్తి
యమ్మునినాథువంశమ్మున క్షీరాంబు, నిధి సుధాకరుఁడు జన్మించినట్లు
ప్రభవించె శ్రీపైఁడిపాటిసింగనమంత్రి, వంశాగ్రగణ్యుఁ డై వరలు నతని
మహితసంతానక్రమంబున జలపాల, సచివుఁ డొప్పె బలారిసచివసముఁడు

తే. గీ. గజపతిక్షితిభర్త చే గజములోడ,
నగ్రహారం బితండు పరిగ్రహించె,
నెలమి నేనుఁగువా రన్నయింటిపేరు,
గలిగె నతనికి గజలాభకలనవలన. ౨౯

తే. గీ. ఈడ్యజగపతిదత్తసోమేశ్వరాగ్ర,
హారశాసనుఁ డై మహోదారభాగ్య
మహిమ గల్గినజలపాలమంత్రిమణికి,
గరికరాజు జన్మించె విఖ్యాతయశుఁడు. ౩౦

క. సరసుఁ డగుగరికిమంత్రికిఁ, బురుహూతోపేంద్రసములు పుట్టిరి తనయుల్
గురుమూర్తియు గురురాజును, శరణాగతభరణనిపుణసద్బిరుదాంకుల్. ౩౧

ఉ. ఆయతభోగవాగ్జితబలారిగురుం గురురాజు దానరా
ధేయు నజేయు వత్సవయతిమ్మమహీశ్వరురాజ్యభారధా
రేయు నుతింపఁగాఁ దగు వరిష్ఠ గజాశ్వ సుఖాసనాదిల
క్ష్మీయుతు దేవవాస సరసీవన సత్కృతి ధర్మకర్మఠున్. ౩౨

ఉ. సారదయారసద్రుహిణసారథికిం గురురాజమంత్రికిం
బేరమయందు నందనుఁడు పేర్మి జనించె విలాససంపదం
మారుఁడు విక్రమంబునఁ గుమారుఁడు లక్ష్మణశౌరి భూరిశో
భారవి సాహితీవిజితభారవి ధీరవిచారవిశ్రుతిన్. ౩౩

ఉ. దండి మనోజ్ఞశబ్దకవితాఝరిచే నుపమాసమృద్ధిచే
రెండవకాళిదాసు రసరీతితరంగితసూక్తిసత్కవీం
ద్రుం డని ధీరు లెంచఁగఁ గృతుల్ రచియించినధన్యునిం మహా
పండితమాన్యు లెన్నఁ దగుభాజితసూర్యుని లక్ష్మణార్యునిన్. ౩౪

తే. గీ. కృతులొసఁగి వత్సవయతిమ్మ నృపతిచేతఁ,
దురగ మణిభూషణాంబరాందోళికాది
పూజఁ గైకొని పెద్దాడపురరమాను,
శాసనుం డయి లక్ష్మణశౌరి దనరె. ౩౫

క. ఆ ఘనుఁడు గాంచె దానఘు,నాఘనుల సుభద్రయందు నందనుల గుణ
శ్లాఘార్హుఁ దిమ్మనార్యుని, రాఘూటసమాఖ్యు గురువరాజసమాఖ్యున్. ౩౬

శా. తిమ్మామాత్యుఁడు మేరుభూధరమహాధీరుండు రాజాధిరా
ట్తిమ్మక్ష్మారమణప్రసాదశుభవర్ధిష్ణుండు విద్వత్సభా
సమ్మోదావహవాగ్విలాసవిబుధాచార్యుండు దిక్కామినీ
ధమ్మిల్లాభరణద్యశోవిశదముక్తాదాముఁ డెన్నం దగున్. ౩౭

క. ధీరమతి తిమ్మనార్యుఁడు, పేరమ యనఁ దగినసతిని ప్రేమ వరించెం
శ్రీరమణీయాకృతి యగు, శ్రీరమణీమణిని హరి వరించినకరణిన్. ౩౮

మ. అనఘస్వాంతుఁడు మాచిరాజు నరసింహార్యుండు మల్లమ్మయున్
జనకుండున్ జనయిత్రి గాఁగ మిహికాశైలేంద్రుఁడున్ మేనయున్
జనకుండున్ జనయిత్రి గాఁ దగుమహేశ్రేయసింబోలి తి
మ్మనమంత్రీశ్వరురాణి యై తనరు పేరాంబన్ నుతింపం దగున్. ౩౯

చ. అతులితకీర్తి పేరమకు నంచితపుణ్యుఁడు తిమ్మమంత్రికిన్
సుతులము సంభవించితిమి సుస్థిరశంకరభక్తిభావనా
చతురుఁ డనంతధీమణియు సన్నుత లక్ష్మణనామధేయవి
శ్రుతుఁ డన నేను శంభువరశోభితభద్రుఁడు వీరభద్రుఁడున్. ౪౦

క. గౌరీపరిణయకావ్యము, సూరీంద్రులు మెచ్చఁ జెప్పి శుంభత్కవితా
పారీణబిరుదు గాంచిన,భూరియశోఘనుఁ డనంతబుధవరుఁ డలరున్. ౪౧

తే. గీ. అయ్యనంతుండు సుందరియందు సుతులఁ,
గాంచె నిరుపుర సౌజన్యకలితమతుల
ధరణినాయకపూజ్యుని గురువఘనుని,
ధీరజనహితగుణధుర్యుఁ దిమ్మనార్యు. ౪౨

ఆ. వె. మాన్యుఁడైన గురువమంత్రికిఁ బట్టిస, వీరభద్రదేవునిపులకరుణ
వలన నుద్భవించె వర్ధిష్ణుఁడైన వీ, రేశ్వరుండు సుజనహితుఁడు సుతుఁడు. ౪౩

క. చతురజనంబులు లక్ష్మీ,పతి యన లక్ష్మణుఁ డనంగఁ బ్రబలిననాకున్
సుతులై వర్ధిల్లిరి సం, భృతవినయులు తిమ్మశౌరి పేరయఘనుఁడున్. ౪౪

తే. గీ. తిమ్మనార్యుండు పార్వతీదేవియందుఁ,
బార్వతీశ్వరువరముచే భాగ్యయుతుల
సుతులఁ గాంచెఁ జిరాయురున్నతుల వీర,
భద్ర లక్ష్మణమంత్రుల బంధుహితుల. ౪౫

వ. ఏవంవిధ వివిధ విభవమహనీయ మదీయవంశసంభవులగు వారికెల్ల సకల మనో
రథఫలప్రదపారిజాతం బగు నమ్మహేశ్వరునకు. ౪౬

## షష్ఠ్యంతములు

క. శ్రీమంతునకుఁ ద్రిలోకీ,సామంతున కరుణచరణజలజరజోరా
జీమంజులసిందూర,శ్రీమధురశ్రుతిసమాజసీమంతునకున్. ౪౭

క. శివునకు గిరిజాధవునకు, భవునకు నిర్దగ్ధభావభవునకు సద్వై
భవునకు శిక్షితనలినో,ద్భవునకు మునిదత్తపరమపదవిభవునకున్. ౪౮

క. నీహారవారసురతటి,నీహారపటీరతారనిభదేహునకున్
మాహాధిపవాహున కని,లాహారాంగదలసన్మహాబాహునకున్. ౪౯

క. స్థాణునకు దానవాంతక,బాణున కభయప్రదానపరిపాలితగీ
ర్వాణునకు వేదమయకం,ఖాణునకు నిశాటఘనజగత్త్రాణునకున్. ౫౦

క. కరుణాభరితాపాంగున, కరుణాబ్జరథాంగభూశతాంగునకు సుధా
హరిణాంకకుందచందన,హరిణాంగున కక్షిశిఖిహుతానంగునకున్. ౫౧

క. హరునకుఁ బెద్దాడపురీ,శ్వరునకు నక్షత్రకుసుమసంగతచికురో
త్కరునకు మందస్మితసుం,దరునకు సోమేశ్వరునకు నమదమరునకున్. ౫౨

వ. భక్తిసమర్పితంబుగా నా రచియింపంబూనిన "సుభాషితరత్నావళి" యనుచాటు
ప్రబంధంబునకుఁ బ్రారంభం బెట్టి దనిన:—

---

మఱియు 1879-వ సంవత్సరమున ముద్రితమయిన పుస్తకములో వైరాగ్యశత
కాంతమున నీ పద్యములు కనుపడుచున్నవి :—

ఉ. కూడిక చెంది కొన్నతమకూరిమికీర మ దెట్లు పల్కిన
న్వేడుక సేయుచందమున నీదయఁ గాంచిననాకవిత్వ మే
జాడ వహించి యున్నఁ గడు సమ్మదమే ఘటియించు నీకుఁ బె
ద్దాడపురీనివాస నిజదాసశివంకర సోమశంకరా!

శా. తారామండలకుండలీశ్వరసుధాతారామరత్మ్నాజ కాం
తారామర్త్యగజాంబుజప్రభవకాంతారామగౌరప్రభా
దారాలంకృతవామభాగ బుధమందారాగ యోగీంద్రబృం
దారాధ్యాంఘ్రిసరోరుహద్వితయ వేదారామఖేలత్పికా!

మాలిని. ప్రణుతకుధరకన్యాఫాలసాదృశ్యహేతు
ప్రణయభరశిరస్సంప్రాపితాబ్జారిరేఖా
ప్రణవనలినపీఠోపాంతశాంతత్యసేవా
చణహరివిధిరామాచామరోద్వీజ్యమానా!

క. సంతోషబాష్పవారిని,రంతరదృగ్జలజభర్తృహరిసంయమిరాట్
శాంతస్వాంతనిశాంతని,తాంతోజ్జ్వలబోధదీప! ధరవరచాపా!

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్ష వీక్షాపాత్రయేనుఁగు లక్ష్మ
ణకవిరాజపౌత్త్రి తిమ్మనార్యపుత్త్రి వివిధ విద్వజ్జనవిధేయ లక్ష్మణకవి నామధేయ
ప్రణీతంబయిన "సుభాషితరత్నావళి" కావ్యంబునందు వైరాగ్యశతకంబున, తృ
ష్ణాదూషణంబును, విషయపరిత్యాగవిడంబనయు, యాచ్ఞాదైన్యదూషణంబును,
భోగాస్థైర్యవర్ణనంబును, కాలమహిమానువర్ణనంబును, యతినృపతిసంవాదంబును,
మనస్సంబోధనంబును, నిత్యానిత్యవస్తువిచారంబును, శివార్చనానుభావంబును, అవ
ధూతచర్యయు నను ప్రకరణంబులుగల తృతీయాశ్వాసము.

క. ఈ కావ్యము లిఖియించినఁ, జేకొని చదివినను వినిన శిష్టుల కెల్లన్
శ్రీకంఠుఁ డిచ్చుఁ గరితుర,గాకల్పానల్పసురుచిరాయుష్యంబుల్.

---

# విషయసూచిక.



శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# భర్తృహరిసుభాషితము.

---

## అవతారిక.

మహాత్ముండును సర్వార్థవిదుండును నగుభర్తృహరి యనుయోగీశ్వరుండు, లోకులవ్యవహారంబులంబరిశీలించిబహుచింతాకులుండై పరమకారుణికుండు గాన వారల ననుగ్రహింపం గోరి నీతిశృంగారవైరాగ్యములస్వరూపంబుల వర్ణించు సుభాషితత్రిశతి యనునొక ప్రబంధంబును రచియింపఁబూని, యది పరిసమాప్తినొంది వర్ధిల్లునట్లు దానికిం గలుగువిఘ్నములం దొలంచుటకుఁగాను మొదట మంగళాచరణము సేయవలయువాఁడై, 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' అను శిష్టోక్తి ననుసరించి విశిష్టపరంజ్యోతిస్స్వరూపమైనతనయిష్టదైవమునకు నమస్కరించుట యనుమంగళమును మున్నుగా నాచరించుచున్నాఁడు.

---

శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్త చిన్మాత్రమూర్తయే।
స్వానుభూత్యేకమానాయ నమశ్శాన్తాయ తేజసే॥ 1

టీక. దిక్కాలా... మూర్తయే-దిక్-కాల-ఆది-అనవచ్ఛిన్న=తూర్పు మొదలగు దిక్కులువర్తమానాదికాలములు మొదలైనవానిచేత(అనఁగా దేశకాలవస్తువులుమూఁటిచేతను) కొలఁదిపెట్టరానిదియు-సర్వవ్యాపకమగుటచే నింతప్రదేశ మావరించియుండునదని కాని నిత్యమగుటచే నింతకాలముండునదని కాని యంతటను దా నేకమెయుండుటచే నిట్టివస్తువుగానుండునని కాని గణింపశక్యముకానిది యనిభావము; (కావున నే) అనంత=పరిమితిలేనిదియు, చిన్మాత్ర=జ్ఞానఘనమైనదియు-జ్ఞానమాత్రస్వరూప మైనదియు అని యర్థము, (అగునట్టి) మూర్తయే=రూపమైనదియు-ఉత్తలక్షణములు గల రూపమే యది యని భావము; స్వ-అనుభూతి-ఏక-మానాయ=ఆత్మానుభవమే స్వప్రకాశమునకు ముఖ్యసాధనముగాఁ గలదియు-కన్నులు మొద లగుప్రమాణములచేఁ దెలియఁ కుండలు మొదలైనవానివలెఁగాక స్వయంప్రకాశ మగుదీపమువలె తానె తన్నును తక్కినవానిని రెంటిని దెలుపునట్టిదిగాన త న్ననుభవించుటవలనమాత్రమే తాను తెలియఁదగ్గదిగాని వేఱొకసాధనముచేఁ దెలియరానిదని భావము; శాన్తాయ=

అవిద్యగాని తత్కార్యములసంబంధముగాని లేక ప్రసన్నమై యుండునదియు నగు, తేజసే=జ్యోతిస్స్వరూపబ్రహ్మమునకు, నమః=నమస్కారము.

క. అచ్ఛము దిక్కాలాద్యన, వచ్ఛిన్నానంతచిద్ధ్రవఘనంబు నిజ
స్వచ్ఛానుభూతిమానము,సచ్ఛాంతము తేజమేన కజస్రముదలఁతున్.

తాత్పర్యము. దేశకాలవస్తుపరిచ్ఛేదములును పరిమితియు లేక జ్ఞానమాత్ర స్వరూపమై యుండు రూపమై, అనుభవించియే తెలిసికొనఁదగినదై, ప్రసన్నమై యుండు పరంజ్యోతీరూపబ్రహ్మమునకు నమస్కారము.

అవ. ఈప్రబంధమునకుఁ గలవివిధస్వరూపములు తెలియుట కొఱకు న్యాయాదానిని ఆరూపపద్ధతిఁగా రచింపఁ గోరి యందు మూర్ఖ విద్వత్పద్ధతులు రెండును నిరూపించుటకుఁ బ్రసక్తింపఁగా నశోకవని కాన్యాయంబున మొదట మూర్ఖపద్ధతిని గైకొని వర్ణించుట కారంభించినవాఁడై, వినుటకు మంచిమనసు గలరసజ్ఞులు లేమిం జేసి తాఁ జెప్పఁదలఁచిన ప్రియవచనమును జెప్పుటకే వీలు లేకున్న దని ముందుగాఁ దెలుపుచున్నాఁడు.

నీతిశతకము - మూర్ఖపద్ధతి.

శ్లో॥ బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః।
అబోధోపహతా శ్చాన్యే జీర్ణ మఙ్గే సుభాషితమ్॥ 2

టీ. బోద్ధారః = మంచిపరిజ్ఞానము గలవారు-చక్కఁగాఁ దెలిసినవారు; మత్సర గ్రస్తాః=అసూయచేత నాక్రమింపఁబడినవారు-మంచిహృదయము లేనివారని యర్థము-కాఁబట్టి నాప్రియవచనమును సరియని యొప్పుకొనరని భావము; ప్రభవః= రాజులు, స్మయదూషితాః=గర్వముచేఁ జెడినవారు-వినయసంపన్నులుకారని యర్థము-కాఁబట్టి నాప్రియవచనమును చెవియిచ్చి వినరని భావము; అన్యే= (విద్వాంసులును ప్రభువులును గాక) తక్కినజనులు, అబోధ-ఉపహతాః=అజ్ఞానముచే నష్టాత్ములైనవారు-అధికారులుగారని యర్థము-కాఁబట్టి వారికి వినుపాటియోగ్యత సైతము లేదని భావము; (కాఁబట్టి) సుభాషితం= (నేను జెప్పఁదలఁచిన) ప్రియవచనము, అఙ్గే=అంతరంగమందే, జీర్ణం=మఱుఁగైనది-లోపలనే నిలిచినది కాని యింకను బయటికివచ్చినది కాదని యర్థము. అయిననుగాని యెట్లో దానిని జెప్పెదను అని శేషము గ్రహింపవలయును.

తే. బోద్ధ లగువారు మత్సరకపూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ క ప్రభువు లెన్న
నితరమనుజు లబోధోపకహతులు గాన
భావమున జీర్ణ మయ్యె సుకభాషితంబు. 2

తా. నే నొకమంచిమాటను జెప్పుదు నేని విద్వాంసు లది మంచి దని యెఱిం గినవా రయ్యు నాయం దసూయచే దానిని సరియని యంగీకరింపరు. ఇఁక ప్రభువు లన్ననో గర్వాంధు లై యుండుటచే నడఁకువతో దానిని బాటించి వినరు. మఱి యే మియు నెఱుక లేని తక్కినసామాన్యజను లంటిమా వారికి విను నంతయోగ్యతయే లేదు. ఇఁక నెవరికిఁ జెప్పుదునుశ్రీ కాఁబట్టి చెప్పఁదలఁచినయీమాట లోపల నె యడఁగినది కాని బయటికి రాకున్నది. అయిన నెట్లో దానిని జెప్పెదను.

అవ. మూర్ఖునిస్వరూపమును దెలుపుచున్నాఁడు.

శ్లో॥ అజ్ఞ స్సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః।
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రఞ్జయతి॥ 3

టీ. అజ్ఞః=కొంచెమైనను తెలియనివాఁడు-మూఢుఁడు, సుఖం=అనాయాస ముగా, ఆరాధ్యః=సమాధాన పెట్టఁదగినవాఁడు. విశేషజ్ఞః=విశేషించి తెలిసినవాఁడు, సుఖతరం=మఱింతసుఖముగా, ఆరాధ్యతే=సమాధాన పెట్టఁబడుచున్నాఁడు. జ్ఞాన లవదుర్విదగ్ధం = (శాస్త్రిమువలనఁ గలిగిన) తెలివి యొక్కింతచేతఁ (దన్నుఁ) బండి తునిగాఁ దలంచుకొనునట్టి, నరం=మనుష్యుని-మూర్ఖజనుని, బ్రహ్మా అపి= (అఘటిత ఘటనాసమర్థుఁ డగు) బ్రహ్మదేవుఁడుకూడ, న రఞ్జయతి=రంజింపఁజేయఁజాలఁడు.

క. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపం దగు సుఖతరముగఁ దెలుపఁగ వచ్చుం
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే. 3

తా. మూఢుఁడు తనంతటఁ దా నేమియుఁ దెలిసికొనలేఁడు గనుక దేనినిగాని యొక రుపదేశించినంతమాత్రమున నె సరియని నమ్ముచున్నాఁడు. కావున నట్టివాని నేకష్టములేకయే సమాధానపెట్టవచ్చును. వస్తుతత్త్వములను విశేషించి యెఱింగి నట్టివాఁడన్ననో, వానిబుద్ధి యెప్పుడును విన్నదానియందలివిశేషములను గ్రహించు వఱకేగాని తక్కిన విపరీతభావములకుఁ బోవదుగనుక, వానిని మూఢునికంటె మఱింతసుఖముగా సమాధానపెట్టవచ్చును. శాస్త్రిమూలమున నేదో స్వల్పజ్ఞానము లభించినంతమాత్ర నే తన్ను మహాపండితునిగా నెంచుకొని విఱ్ఱవీగుమూర్ఖునికో, మూఢునివలె నొకరు చెప్పుదానియందు నమ్మికగాని, విశేషజ్ఞునివలె తనంతటఁ దెలిపి కొనుశక్తిగాని, రెండును లేనందున వానిమనస్సును వేలకొలఁదిమాటలచేతనుగూడ సమాధానపెట్టుట కష్టము. కాఁబట్టి తలంచినట్లు చేయనుగాని చెఱుపనుగాని మా ర్పనుగాని చాలినట్టిమహాశక్తి గల యాబ్రహ్మకూడ నట్టిమూర్ఖుని రంజింపఁజేయ శక్తుఁడు గాఁడు. ఇఁక మఱెవ్వఁడును శక్తుఁడుగాఁడని వేఱ చెప్పవలయునా?

అవ. మూర్ఖుని మనస్సును సమాధానపెట్టుట మిక్కిలి కష్టమని మీఁదిరెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ప్రసహ్య మణి ముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాన్తరాత్।
సముద్ర మపి సంతరే త్ప్రచలదూర్మిమాలాకులం।
భుజఙ్గ మపి కోపితం శిరసి పుష్పవ ద్ధారయేత్।
న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్॥ 4

టీ. మకర వక్త్ర దంష్ట్ర అన్తరాత్= (శింశుమార మను పెను) మొసలి నోటియందలి కోఱపండ్లనడుమనుండి-అట్టి మిక్కిలిసంకటమగుప్రదేశమునుండి యని యర్థము, ప్రసహ్య= బలాత్కారముచే, మణిం=రత్నమును, (ఎవఁడైన నొకఁడు) ఉద్ధరేత్=బయటికిఁ దీయవచ్చునుగాక. ప్రచలత్ ఊర్మిమాలా ఆకులం=మిక్కిలి యుఁ జలించుచున్న యలలపరంపరలచేత కలఁత నొందిన= పెద్దయలలచే మిక్కిలి రేఁగుచున్న, సముద్రంఅపి=సముద్రమునైనను-అపిశబ్దముచే దాఁటరానిదైనను అని భావము స్ఫురించుచున్నది, సం+తరేత్=లెస్సగా దాఁటవచ్చునుగాక. కోపితం= కోపము నొందినట్టి- కోపవశమున బుసకొట్టుచు నాలుకలతో పెలవులు నాకుచున్నట్టి, భుజఙ్గంఅపి=సర్పమునుగూడ అపిశబ్దముచే ధరింప సాధ్యముకానిదైనను అని భావము, శిరసి=తలయందు అనఁగా సిగయందు, పుష్పవత్=పూవువలె పూదండవలెనని యర్థము, ధారయేత్=ధరింపవచ్చునుగాక. తు=అయినను, ప్రతినివిష్టమూర్ఖజనునిమనస్సును, న ఆరాధయేత్=సమాధానపెట్టుటకు శక్యముకాదు, మూర్ఖునిమనస్సును సమాధానపెట్టుట, మొసలికోఱలనడిమిరత్నమును దీయుట మొదలైనవానితో సమాన మని భావము.

చ. మకరముఖాంతరస్థ మగు | మానికముం బెకలింప వచ్చుఁ బా
యక చలదూర్మికానికర | మైనమహోదధి దాఁటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె | సర్పము నైన భరింపవచ్చు మ
చ్చిక ఘటియింప మూర్ఖజన | చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్. 4

తా. శింశుమార మనుపేరు గల పెనుమొసలినోటియందు మిక్కిలి క్రిక్కిఱిసియున్న వాఁడికోఱపండ్లనడుమనుండి, వెలికిఁదీయరానిరత్నము నెట్లో మెలఁకువతో బలవంతముగా బయటికిఁ దీయవచ్చునుగాక. అట్లె, పెద్దయలలచే మిక్కిలి కలంగియుప్పొంగుచున్న మహాసముద్రము దాఁటరానిదైనను, ఏదైన నొకదాఁటుసాధనముచే దానినిగూడ దాఁటవచ్చునుగాక. మిక్కిలి కోపమున బుసలుకొట్టుచున్న యొకసర్పమును ధరింపరానిదానినిగూడ మణిమంత్రాదిసాధనములచే నెట్లో పూదండవలె సిగయందు ధరింపవచ్చునుగాక. అయినను దురాగ్రహము పట్టియున్నందున దేనిని పాటింపక యుండు మూర్ఖునిమనస్సునో యేయుపాయమును లేనందున సమాధానపెట్టుటకు సాధ్యము కాదు.

అవ. ఇట్లు సామాన్యముగా దొరకరానివగు వస్తువులుగాని చేయనలవికాని కార్యములుగాని యెట్లో సమర్థించుటకు శక్యములు గావచ్చునుగాని మూర్ఖునిచిత్తము సాధించుటమాత్ర మట్లుకాదని చెప్పి యిప్పు డెంతమాత్రమును దొరకరానట్టివస్తువునుగూడ సాధింపవచ్చును గాని మూర్ఖునిచిత్తమును సాధింపఁ దరముకానేరదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ లభేత సికతాసు తైల మపి యత్నతః పీడయన్।
పిబేచ్చ మృగతృష్ణికాసు సలిలం పిపాసార్దితః।
కదాచి దపి పర్యటన్ శశవిషాణ మాసాదయేత్।
న తు ప్రతినివిష్టమూర్ఖజనచిత్త మారాధయేత్॥ 5

టీ. యత్నతః = ప్రయత్నముచేత, పీడయన్ = (ఏదైననొకయంత్రముచేత) మర్దించి, సికతాసు అపి=ఇసుకయందుఁగూడ-ఈఅపిశబ్దమువలన కాలత్రయమునందుఁ గాని లోపలఁ జమురులేనట్టివని భావము స్ఫురించుచున్నది, తైలం=చమురును, లభేత=పొందవచ్చును. పిపాసా అర్దితః=దప్పిచేతఁబీడింపఁబడినవాఁడై, మృగతృష్ణికాసుచ = ఎండమావులయందుఁగూడ-జలములేనిదై జలభ్రాంతిని మాత్రము కలిగించు వానియందని భావము, సలిలం = జలమును, పిబేత్ = త్రాగవచ్చును. పర్యటన్ = (అందందు వనములలో) తిరుగుచు, కదాచిత్=ఎప్పుడైన నొకప్పుడు, శశవిషాణం అపి = కుందేటికొమ్మునుగూడ-మాటయందుమాత్రముకలదై వాస్తవముగా లేనిదాని నని భావము, ఆసాదయేత్ = పొందవచ్చును. తు = అయినను, ప్రతినివిష్ట మూర్ఖజన చిత్తం న ఆరాధయేత్ = దురాగ్రహము పట్టినమూర్ఖజనుని మనసును సమాధాన పెట్టఁ దరముకాదు. మూర్ఖునిచిత్తమును సమాధానపెట్టుట, యిసుకనుండి తైలము తీయుట మొదలైనవానివలె శక్యము కాని దని భావము.

తే. తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావ వచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చుఁ
జేరి మూర్ఖులమనము రంజింపరాదు. 5

తా. ఏకాలమందుఁ గాని చమురు లోపల లేకయే యుండునట్టియిసుకనుండికూడ కష్టపడి దాని నేదైననొకయంత్రముచే మర్దించి చమురు తీయవచ్చును. జలములేనివై జల మున్నట్లు భ్రాంతినిమాత్రము కల్పించు నెండమావులయందుఁగూడ మిక్కిలిదప్పి కలిగినప్పుడు నీళ్లు త్రాగవచ్చును. అడవులందు తిరిగి యొకానొకప్పుడైనను మాట మాత్రమున నున్నట్టికుందేటికొమ్మునుగూడ సాధింపవచ్చును. అయినను దురాగ్రహ ముపట్టిన మూర్ఖునిమనస్సును సమాధానపెట్టుట మాత్రము శక్యము కాదు.

అవ. మూర్ఖుని సమాధానపెట్టఁగోరువాఁడు మిక్కిలి యవివేకి యని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ వ్యాళం బాలమృణాళతన్తుభి రసౌ రోద్ధుం సముజ్జృమ్భతే।
భేత్తుం వజ్రమణిం శిరీషకుసుమప్రాన్తేన సన్నహ్యతి।
మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారామ్బుధే రీహతే।
మూర్ఖాన్ యః ప్రతినేతు మిచ్ఛతి బలా త్సూక్తై స్సుధాస్యన్దిభిః॥6

టీ. యః=ఏపురుషుఁడు, సుధా స్యన్దిభిః = అమృతము చిందునట్టి - అనఁగా దానివలె అత్యంతమధురములైన, సూక్తైః=ప్రియవచనములచేత, మూర్ఖాన్=మూర్ఖులను, బలాత్=బలత్కారమున, ప్రతినేతుం=సమాధానపెట్టుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాఁడో, అసౌ = ఆయీపురుషుఁడు, వ్యాళం = దుష్టమగుగజమును-సాధారణజంతువునుగాదని భావము, బాలమృణాళతన్తుభిః-లేఁతతామరతూఁడులలోని దారములచేత, రోద్ధుం=కట్టినిలుపుటకు, సం + ఉజ్జృమ్భతే=మిగులప్రయత్నించినవాఁడగుచున్నాఁడు. వజ్రమణిం=వజ్రమణిని-రవను, శిరీషకుసుమప్రాన్తేన=దిరిసెనపుఁబువ్వుయొక్కయంచుచేత, భేత్తుం=భేదించుటకు-కోయుటకు, సన్నహ్యతి = ఉద్యుక్తుఁడగుచున్నాఁడు. క్షారఅమ్బుధేః=ఉప్పుసముద్రమునకు-స్వల్పమైనజలాశయమునకుఁగాదనియర్థము, మధుబిన్దునా=(ఒక) తేనెబొట్టుచేత-తేనెను ఎడతెగక జడిగాఁ గురియుటచేతఁగాదని భావము, మాధుర్యం=తియ్యఁదనమును, రచయితుం=కలిగించుటకు, ఈహతే=కోరుచున్నాఁడు. మూర్ఖులను సమాధానపఱుపఁ దలంచువాఁడు, దుష్టగజమును లేఁదామరతూండ్లలోని దారములతోఁ గట్టఁబూనువాఁడు మొదలగువారివలె మిక్కిలియు నవివేకి యగు నని భావము.

మ. కరిరాజున్ బిసతంతుసంతతులచేఁ గట్టన్ విజృంభించు వాఁ
డురువజ్రంబు శిరీషపుష్పములచేఁ గూహించు భేదింపఁ దీ
ప రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణప్రాప్తిం బ్రవర్తించు ని
ద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్.6

తా. ఇంచుకంత కట్టినిలుపుటకైన నుపయోగపడని లేఁతతామరతూండ్లలోని దారములతో సామాన్యజంతువుగాక మిక్కిలి పెద్దదియగు నొకమదపుటేనుఁగును గట్టఁ జూచువాఁడును, రత్నములను మీఁదఁబెట్టి తొలుచునట్టిదియుఁ గావున మిక్కిలి కఠినమైనదియు నగువజ్రమణినిబువ్వులలోసెల్ల మిక్కిలిమృదువైన దిరిసెపుఁబువ్వునంచుచేతఁ గోయఁజూచువాఁడును, ఒకయల్పమైననీటిపట్టుగాక మహావిశాలమైనదై మిక్కిలి యుప్పనై యుండు పెనుసముద్రమునం దొక్క తేనెబొట్టునుమాత్రము విడిచి దానిని తియ్యగాఁ జేయఁ జూచువాఁడును, ఎంత మిక్కిలియవివేకులో, యమృతము లొలుకు

తియ్యనిమంచిమాటలచే మూర్ఖుని సమాధానపెట్టనెంచువాఁడు నంత మిక్కిలియు నవివేకి యని తాత్పర్యము. మూర్ఖుని తేర్చుట మిక్కిలి కష్ట మని ఫలితార్థము.

అవ. తమయజ్ఞానమును గప్పిపుచ్చుటకు మూర్ఖులకుఁ గలగతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ స్వాయత్త మేకాన్తహితం విధాత్రా।
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః।
విశేషత స్సర్వవిదాం సమాజే।
విభూషణం మౌన మపణ్డితానామ్॥ 7

టీ. విధాత్రా=బ్రహ్మచేత, ఆయత్తం=తమకు (అనఁగా మూర్ఖునకు) నధీనమై యుండునదియు=ఒక రుపదేశించుటచేఁ దెలిసికొన నక్కఱలేక తనుకే సిద్ధముగాఁ దెలిసియుండునదియు నని యర్థము, ఏకాన్తహితం=మిక్కిలిహితమును జేయునట్టిది యును, విశేషతః=విశేషించి, సర్వవిదాంసమాజే=సర్వజ్ఞులై నవారిసభయందు-అన్నియుఁ దెలిసినపండితుల కూటమియందు, విభూషణం=(తమకు) భూషణ మైనదియు నగు-అలంకారమువంటిదియు నని యర్థము, మౌనం=మౌనము-ఏమియుఁ బలుకక యూరకుండుట, అపణ్డితానాం=పామరులయొక్క, అజ్ఞతాయాః=మూఢత్వము నకు, ఛాదనంసత్=ముసుఁగు అగునట్లుగా-మూసిపెట్టునదిగా, వినిర్మితం=రచింపఁబడినది. పామరులు తమమూఢత్వమును గోప్యముగా నుంచుకొనుటకు మౌనముతోనే ప్రవర్తింపవలయును. మౌనమే వారికి గతి. ఇట్లుసేయనియెడల వారు పరిహాసము నకుఁ బాత్రు లగుదు రని భావము.

తే. స్వవశము హితంబు మూఢతాచ్ఛాదనంబు
గాఁగ నీగతి నిర్మించెఁ గమలభవుఁడు
సర్వవిదు లగుసుజనులసభలలోన
మౌనమె విభూషణము మూఢమానవులకు. 7

తా. బ్రహ్మ మూర్ఖులను జూచి కరుణించి వారు తమమూఢత్వమును మూసి పెట్టుకొనుటకు సాధనముగా నుండునట్లు మౌనమును సృజించెను. దానిగుణములు మఱియుఁ గొన్ని కలవు. అది యామూర్ఖుల కెప్పుడును స్వాధీనమై యుండునదేకాని యొకరివలననుండి పొందవలసినదికాదు. ఇంతేకాక వారికిఁగల యవగుణములనెల్లఁ గప్పిపుచ్చునది కాఁబట్టి యది వారికి మిక్కిలి హితకారియు నగును. విశేషించి పండితజనులనడుమ నది వారి కొకయలంకారమువలె నుండును.

అవ. పూర్వము మూఢత్వము ననుభవించిన యొకానొకఁ డప్పటి తనయనుభవప్రకారము నితరులకుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదా కిఞ్చిజ్జ్ఞోఽహం గజఇవ మదాన్ధ స్సమభవమ్ ।
తదా సర్వజ్ఞోఽస్మీ త్యభవ దవలిప్తం మమ మనః।
యదా కిఞ్చి త్కిఞ్చి ద్బుధజనసకాశా దవగతమ్ ।
తదా మూర్ఖోఽస్మీతి జ్వరఇవ మదో మే వ్యపగతః॥ 8

టీ. అహం=నేను, కించిజ్జ్ఞః సన్=స్వల్పముగా తెలిసినవాఁడనై, యదా=ఎప్పుడు, గజఇవ=ఏనుఁగువలె, మదఅన్ధః=గర్వముచేఁ గన్నుగాననివాఁడను-ఇది చేయఁదగును ఇది చేయఁదగదను వివేచనములేనివాఁడను, అభవం=అయితినో, తదా=అప్పుడు, సర్వజ్ఞఃఅస్మిఇతి=అన్నియును దెలిసినవాఁడను అగుదును అని, మమ మనః=నా మనస్సు, అవలిప్తం అభవత్=గర్వించినది అయ్యెను. 'అల్పవిద్యో మహాగర్వీ' అను న్యాయమున అల్పజ్ఞానమే గర్వమునకు హేతు వగుటవలన నట్లు గర్వించినవాఁడనైతినని భావము. యదా=ఎప్పుడు, బుధజనసకాశాత్=విద్వజ్జనులసన్నిధినుండి, కించిత్ కించిత్=(శాస్త్రములు బోధించెడియాచారములు మొదలైనవి) కొంచెము కొంచెము, అవగతం=(నాచే) తెలియఁబడినదో, తదా=అప్పుడు, మూర్ఖఃఅస్మిఇతి=మూఢుఁడను అగుదును అని, మమమదః=నామదము, జ్వరఇవ=జ్వరమువలె-మదము జ్వరమువలె కన్నుమిన్ను తెలియమి మొదలైన వికారములు గలిగించును కాఁబట్టి దీనికి జ్వరసామ్యము చెప్పఁబడినదని తెలియఁదగును, వ్యపగతః (అభూత్)=పోయినది (అయ్యెను.) 'ఆచార్యవాన్ పురుషో వేద' అను శ్రుతినిబట్టి 'ఆచార్యులవలన లభించిన విద్యచేతనే వివేకము కలుగు' నని భావము. అల్పజ్ఞుఁడైనను దన్ను సర్వజ్ఞునిగాఁ దలంచుకొనువాఁడేమూర్ఖుఁడు, సర్వజ్ఞుఁడయ్యుఁ దన్ను మూఢునిగాఁ దలంచుకొనువాఁడే పండితుఁడు అని వివేచించుకొనవలయు. 'మదము గర్వమునకు హేతువు, గురుశుశ్రూషాదులు వినయమునకు హేతువు' అని ఫలితార్థము.

చ. తెలివి యొకింత లేనియెడఁ దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు
జ్వలమతులైనపండితులసన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగితిం గత మయ్యె నితాంతగర్వమున్. 8

తా. నేను స్వల్పజ్ఞానము గలవాఁడనై యుండుటంబట్టి యేనుఁగువలె మదించి కన్నుమిన్ను తెలియక యుండినకాలమున సర్వమును దెలిసినవాఁడనైతినని మనస్సున మిక్కిలి గర్వించియుంటిని. పండితజనులవలన శాస్త్రములు బోధించునాచారములు మొదలైనవి కొంచెముకొంచెము నాకుఁ దెలియఁగా నదివఱకు నన్ను జ్వరమువలెఁ బట్టియుండిన మదము జ్వరము పట్టి విడిచినట్లు నన్ను విడిచిపోయెను.

అవ. మూర్ఖుఁడు మిక్కిలియు నీచుఁడని దృష్టాంతమూలమునఁ దెలుపుచున్నాఁడు.

శ్లో॥ కృమికులచితం లాలాక్లిన్నం విగన్ధి జుగుప్సితం ।
నిరుపమరసప్రీత్యా ఖాదన్ ఖరాస్థి నిరామిషమ్।
సురపతి మపి శ్వా పార్శ్వస్థం విలోక్య న శఙ్కతే।
న హి గణయతి క్షుద్రో జన్తుః పరిగ్రహఫల్గుతామ్॥ 9

టీ. శ్వా=కుక్క, కృమికులచితం=పురుగులసమూహముచే వ్యాప్తమైనదియు, లాలాక్లిన్నం=నోటిజొల్లుచేఁ దడుపఁబడినదియు, విగన్ధి=కంపుగొట్టునదియు, (కావుననే) జుగుప్సితం=రోఁతపుట్టించునదియు,(అంతేకాక); నిర్+ఆమిషం=(రొంచెమైనను)కండలేనిదియు, నగు, ఖర అస్థి=గాడిదయెముకను, నిరుపమరసప్రీత్యా=అసమానమైనయొకరుచియెడల నెంతప్రేమ పుట్టునో యంతటిప్రేమతో,ఖాదన్=భక్షించుచు-కొఱుకుచు, పార్శ్వస్థం=ప్రక్కనున్న-దగ్గఱనున్న,సురపతిం అపి=దేవేంద్రునైనను-తక్కినవానిని జెప్పనేల యనిభావము, విలోక్య=చూచి, నశంకతే=లజ్జింపదు. (తథా)హి=అశ్లేయగునుగదా, క్షుద్రః జంతుః=నీచజంతువు, పరిగ్రహ ఫల్గుతాం=తాను స్వీకరించినవస్తువునందలి తుచ్ఛత్వమును, న గణయతి=సరకుసేయదు. రోఁతకార్యములను జేయుటయం దాసక్తిగల మూర్ఖుఁడుగూడ నిట్లె మిక్కిలినిందకును భయపడఁ డని భావము.

చ. క్రిమిసముదాయసంకులము గేవలనింద్యము పూతిగంధహే
యమును నిరామిషంబును ఖరాంగభవం బగు నెమ్ముఁ గుక్క దా
నమలుచుఁ జెంత నున్నసురనాథునిఁ గన్గొని సిగ్గుఁ జెంద ద
ల్ప మని నిజస్వభావము దలంపదు నీచపుఁబ్రాణి యెయ్యెడన్. 9

తా. ఒకకుక్కకు నొకయెముక దొరకెను. అది దట్టముగాఁ బురుగులచే నిండినదై కొఱుకునపుడు నోటినుండి కాఱు జొల్లుచేఁ దడిసి మిక్కిలి కంపుగొట్టుచుఁ జూచుటకే వెగటు పుట్టించునదై యుండెను. ఇట్లుండిన నుండెఁగాని దానియందు కండయేమైనఁగలదా యన్నచో నది లేశముకూడ లేదు. అందును అది యతినీచమగు గాడిదయెముక. ఇట్టియెముక దొరకియు నాకుక్క మిక్కిలి రుచ్యమైనపదార్థమం దెంతప్రేమ కలుగునో యంతటిప్రేమతో దానిని తినసాగినది. అప్పుడు ప్రక్క దేవేంద్రుఁడు వచ్చి నిలిచినను గూడ నది లజ్జించునదికాదు. వేయేల! నీచజంతువైనది తానొకవస్తువును స్వీకరించుటమాత్రము చూచునేగాని యది యెంతతుచ్ఛముగా నుండినను దానిని బాటించుట లేదనుట తెల్లమేకదా.

అవ. అవివేకమునకుఁ గలుగుననర్థములను జెప్పి తన్మూలమున వివేకమే యావశ్యక మైన దని సూచించుచున్నాఁడు.

శ్లో॥ శిర శ్శార్వం స్వర్గా త్పశుపతిశిర స్తః క్షితిధరం।
మహీధ్రా దుత్తుఙ్గా దవని మవనే శ్చాపి జలధిమ్।
అధో గఙ్గా సేయం పద ముపగతా స్తోక మథవా।
వివేక భ్రష్టానాం భవతివినిపాత శ్శతముఖః॥ 10

టీ. (యా=ఏది-ఏగంగానది), స్వర్గాత్=స్వర్గలోకమునుండి, శార్వంశిరః=శివునిశిరస్సును, ఉపగతా=పొందినదో, పశుపతిశిర స్తః=శివునిశిరస్సుననుండి, క్షితిధరం=(హిమవత్)పర్వతమును, ఉపగతా=పొందినదో, ఉత్తుంగాత్-మహీధ్రాత్=పొడవైన (యా) కొండనుండి, అవనిం=భూమిని, ఉపగతా=పొందినదో, అవనేః చ అపి=భూమినుండియును, జలధిం=సముద్రమును, ఉపగతా=('నదీనాంసాగరో గతిః' 'గంగాసాగరపూరణా' అనువచనములప్రకారమున) పొందినదో, అధో=అనంతరము, (లేక)అధః=క్రిందిప్రదేశమందు-అనఁగా పాతాళమున, సా ఇయం గంగా=ఆ యీకనఁబడుచున్నగంగ, స్తోకంపదం=అల్పమగు (మిక్కిలి కొలఁదియైన) ప్రదేశమును, ఉపగతా=పొందినదయ్యెను. అథవా=అట్లననేల, వివేకభ్రష్టానాం=వివేకశూన్యులైనవారికి (స్థానమునుండి జాఱినవారికని యర్థాంతరము), శతముఖః=బహుప్రకారములుగా, వినిపాతః=భంగము (క్రిందుక్రిందుగా పడుట అని యర్థాంతరము),భవతి=కలుగుచున్నది. వివేకముతోఁ గూడినవారికో యిది కలుగదనిభావము. సకలలోకప్రసిద్ధయయ్యు గంగానది భ్రంశమువలన నిట్టియవస్థ పొందెను. తక్కిన వారిని చెప్పనేల ? కాఁబట్టి వివేకము మిక్కిలి యావశ్యకమైనదని యూహ్యము.

శా. ఆకాశంబుననుండి శంభునిశిరంబందుండి శీతాద్రి సు
శ్లోకం బైనహిమాద్రినుండి భువి భూలోకంబునం దుండి య
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంకధోలోకముం జేరె గం
గాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్. 10

తా. *గంగానది మొట్టమొదట-స్వర్గలోకముననుండి శివునితలమీఁదను,అక్కడ

*పూర్వము సగరునియజ్ఞాశ్వమును దేవేంద్రుఁడు దాఁచిపెట్టఁగా నతఁడు దానిని జేరఁ దనకొడుకులను బంపుటయు వా రెల్లయెడల వెదకి పాతాళమునకును బోయి యచట తమధార్ష్ట్యముచే కపిలమహాముని నేత్రాగ్నివలన భస్మీభూతులైరి. వారికినూర్ధ్వలోకప్రాప్తి కలుగఁజేయుటకు తద్వంశస్థుఁడగుభగీరథుఁ డుగ్రతపము చేసి స్వర్గలోకముననుండి గంగానదిని పాతాళమునకుఁ దెచ్చె ననుపురాణకథ నిట గ్రహింపఁదగును.

నుండి హిమవత్పర్వతమునీఁదను, దానినుండి భూమిమీఁదను, భూమినుండి సముద్రమునందును, సముద్రముననుండి పాతాళమునకును గ్రమముగాఁ బడుచువచ్చెను. ఇట్లు స్థానమునుండి జాఱినవారికి పయింబయి నానావిధములుగ క్రిందు క్రిందుగాఁ బడుట యెట్లు కలుగుచున్నదో యట్లే వివేకమునుండి భ్రష్టులైనవారికిని నానావిధములుగ మఱిమఱి తక్కువపాటు కలుగును.

అవ. అగ్ని మొదలైనవానిని నివారించుటకు శాస్త్రోక్తములైన జలము మొదలైనయుపాయములు కలవు గాని మూర్ఖుని నివారించుటకు శాస్త్ర మేమైనఁ జెప్పుటగాని యుపాయ మేదైన నుండుటగాని రెండును లేవని విశదీకరించుచున్నాఁడు.

శ్లో॥ శక్యో వారయితుం జలేన హుతభు క్ఛత్రేణ సూర్యాతపో।
నాగేన్ద్రో నిశితాఙ్కుశేన సమదో దణ్డేన గో గార్దభః।
వ్యాధి ర్భేషజసంగ్రహైశ్చ వివిధై ర్మన్త్రైః ప్రయోగై ర్విషం।
సర్వస్యౌషధ మస్తి శాస్త్రవిహితం మూర్ఖస్య నాస్త్యౌషధమ్॥ 11

టీ. హుతభుక్=అగ్ని, జలేన=ఉదకముచేత, వారయితుం=నివారించుటకు, శక్యః=సాధ్యమైనది, సూర్యాతపః = సూర్యునివేఁడిమి—ఎండ, ఛత్రేణ = చేటచేత, పాఠా॥ ఛత్రేణ=గొడుగుచేత, వారయితుంశక్యః = నివారింపఁగూడినది. సమదః=మదముతోఁగూడిన, నాగ+ఇన్ద్రః=శ్రేష్ఠమైనగజము, నిశిత అంకుశేన=వాఁడియైన యంకుశముచేత, వారయితుంశక్యః = వారింపఁగూడినది. గౌః గార్దభశ్చ=ఎద్దును గాడిదయును, దండేన=కఱ్ఱచే, వారయితుంశక్యౌ = నివారింపఁగూడినవి. వ్యాధిః = కుష్ఠము మొదలైన రోగము, భేషజసంగ్రహైః చ = ఔషధములసంగ్రహించుటచేతను - చకారమువలన మహామంత్రజపహోమాదులచేతను నని గ్రాహ్యము, వారయితుంశక్యః=నివారింపఁగూడినది. విషం=కాలకూటాదివిషము, వివిధైః మంత్రైః ప్రయోగైః = నానావిధములగు ప్రణవాదిమంత్రములచేతను ప్రయోగములచేతను, నివారయితుంశక్యః=వారింపఁగూడినది. (కాఁబట్టి) సర్వస్య=(ప్రాణులహింసకు మూలమగు) అన్నింటికిని, శాస్త్రవిహితం=శాస్త్రముచే నేర్పడిన, ఔషధం అస్తి=మందు కలదు. మూర్ఖస్య=మూర్ఖునికి, శాస్త్రవిహితం ఔషధం న అస్తి=శాస్త్రచోదితమైన మందు లేదు.

చ. జలముల నగ్ని శూర్పమునఁ జండమయూఖుని దండతాడనం
బుల వృషగార్దభంబులను బొల్పగుమత్తకరీంద్రము న్సృణిం
జెలఁగెడురోగ మౌషధముచే విషముం దగు మంత్రయుక్తి ని
మ్ములఁ దగఁ జక్కఁజేయనగు మూర్ఖునిమూర్ఖత మాన్పవచ్చునే. 11

తా. అగ్నిని జలముచేతను, ఎండను జేటచేతను లేక గొడుగుచేతను, మదగజమును వాఁడియంకుశముచేతను, వృషభగార్దభములను కఱ్ఱచేతను, రోగమును ఔషధమంత్ర జపహోమాదులచేతను, విషమును నానావిధములగు మంత్రతంత్రములచేతను నడంపవచ్చును. ఇంతేల, ప్రాణిహింసాకారణములగు దుష్టజంతువుల కన్నిటికిని నౌషధము శాస్త్రము విధించియున్నదిగాని మూర్ఖునికిమాత్రము వానిమూర్ఖతను బోఁగొట్టఁజాలినట్టి సుభాషితాదిరూపమైన యౌషధ మెందును లేదు.

ఇది నీతిశతకమునందు మూర్ఖపద్ధతివర్ణన మన్నది ప్రథమదశకము,

---

## నీతిశతకము - విద్వత్పద్ధతి.

---

అవ. ఇప్పుడు మూర్ఖపద్ధతికి వ్యతిరిక్తమైన లక్షణములు గల దానినిగా విద్వత్పద్ధతిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ శాస్త్రోపస్కృతశబ్దసుందరగిర శ్శిష్యప్రదేయాగమా।
విఖ్యాతాః కవయో వసన్తి విషయే యస్య ప్రభో ర్నిర్ధనాః।
తజ్జాడ్యం వసుధాధిపస్య సుధియ స్త్వర్థం వినాపీశ్వరాః।
కుత్స్యాః స్యుః కుపరీక్షకై ర్నమణయో యై రర్ఘతః పాతితాః॥ 12

టీ. శాస్త్రి...గిరః-శాస్త్ర ఉపస్కృత=తర్కవ్యాకరణాది శాస్త్రములచే నలంకృతములైనవియు - దోషరహితములైనవని యర్థము, శబ్దసుందర=శబ్దముచే మనోహరములైనవియు-కర్ణసుఖముగా వినంబడునవియు ననియర్థము, (అగు) గిరః=వాక్కులు గలవారును, శిష్యప్రదేయ ఆగమాః=శిష్యులకు (వ్యాఖ్యానరూపముగా) నీయఁదగినశాస్త్రములు గలవారును-పటువైన మంచిశిక్షవలన సకలశాస్త్రసిద్ధాంతములను జక్కఁగా నెఱింగినవారగుటచే శిష్యుల కుపదేశించుమూలమున సర్వశాస్త్రములను వ్యాఖ్యానము చేసినవారని యర్థము, లేక-వంచనచే వెలిపుచ్చక గర్భమునందే జీర్ణించునట్లు చేయఁబడినవికాక శిష్యులకు వినియోగింపఁదగినవిగా నుంచుకొన్నశాస్త్రములు గలవారనియుఁ జెప్పఁదగును, (కావుననే) విఖ్యాతాః=అంతటఁ బ్రసిద్ధికెక్కినవారును, (అగు) కవయః = విద్వాంసులు, నిర్ధనాః (సన్తః)=ధనహీనులై, యస్యప్రభోః=ఏరాజుయొక్క, విషయే=దేశమందు-లేక సన్నిధానమందు, వసన్తి=ఉన్నారో, తత్=అది (అట్లు వారు ధనహీనులై యుండుట యని యర్థము), (తస్య) వసుధ+అధిపస్య=ఆరాజుయొక్క, జాడ్యం=మాంద్యము-హీనత్వము-వారు ధనములేకుండుట వారికి కొఱఁతకానేరదు; అది యారాజుహీనత్వమే యగు

నని భావము. (ఎట్లనఁగా) సుధియస్తు=విద్వాంసులన్ననో, అర్థంవినాఅపి=ధనము లేకుండిననుగాని, ఈశ్వరాః=సమర్థులు-పూజ్యులనియర్థము-విద్యయే వారికి మహాధనము; తక్కినదిలేకున్నను వారు పూజ్యులే యనిభావము. మణయః=(వెలలేని)రత్నములు, యైః=(రత్నశాస్త్రపరిజ్ఞానము లేని) ఎవరిచేత, అర్ఘతఃపాతితాః=వెలనుండి తగ్గింపఁబడినవో, తైఃకుపరీక్షకైః=అకుత్సితపరీక్షచేయువారిచేత-సరిగా పరీక్షించి వెలచెప్ప నేరనివారిచేత, కుత్స్యాః న స్యుః=నిందితములుకావు-వారు వెలతగ్గినవని చెప్పుటచే నవి నింద్యములు కావనిభావము. పండితులు 'సదాశ్రయేణ శోభన్తే పణ్డితా వనితా లతా' అనున్యాయముచొప్పున ప్రభువుల నాశ్రయించియే యుండవలయును. ప్రభువులు వారికోరికల నీడేర్పనియెడల నది యాప్రభువులకుత్సితత్వమే యగును. విద్వాంసులో, కుపరీక్షకులచే వెలతగ్గినవిగాఁ జెప్పఁబడియు నింద్యములుకాని యమూల్యరత్నములవలెఁ దాము నింద్యులు కారు. కావున శ్రేయమును గోరుప్రభువులు విద్వాంసులకోరికల తీర్చువారే కావలయు నని తెలియనగును.

చ. సకలకలావిభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేనృపతిరాజ్యమున నిర్ధను లై చరింతు రా
వికృతపుజాడ్య మాదొరది వి త్తము లేకయ వారు పూజ్యు లం
ధకజనదూషితంబులు ఘనంబులు గావె యమూల్యరత్నముల్.12

తా. వ్యాకరణసంస్కారముచే దోషరహితముగాను శ్రవణానందముగాను మాటలాడువారై, యాశ్రయించిన శిష్యులకు సమస్తశాస్త్రములను సవ్యాఖ్యానముగ నుపదేశించువారగుటంజేసి యెల్లయెడలఁ బ్రసిద్ధినొందియు నుండు విద్వాంసు లొక ప్రభువు నాశ్రయించి యుండియు ధనహీనులై యుందురేని యాలోపము ప్రభువుదే కాని వారిదికాదు. విద్వాంసులు ద్రవ్యములేనివారైనను బూజ్యులే యగుదురు వెల లేనిరత్నములు వెలతక్కువైనవిగాఁ జెప్పఁబడినను నింద్యములు గావు గాని వానిని సరిగాఁ బరీక్షింప నేరక వెలతగ్గినవని చెప్పినవారే నింద్యు లగుదురు.

అవ. సాధారణధనమునకుఁ గలయల్పలక్షణములకంటె వ్యతిరిక్తములై మిక్కిలి గొప్పలైయున్న విద్యాధనలక్షణములను వర్ణించుచు నట్టివిద్యాధనము గలవారి కతిశయమును గూర్చుచు నట్టివారియెడల గౌరవముతోడి విశ్వాసమును గలిగించుటకొఱకు రాజులను గూర్చి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ హర్తు ర్యాతి న గోచరం కిమపి శం పుష్ణాతి య త్సర్వదా।
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరామ్।
కల్పాన్తే ష్వపి న ప్రయాతి నిధనం విద్యాఖ్య మన్తర్ధనం।
యేషాం తా న్ప్రతి మాన ముజ్ఝత నృపాః క స్తైః సహ స్పర్ధతే॥13

టీ. యత్ = ఏది (ఏవిద్యాధనము), హర్తుః=అపహరించువానికి, గోచరం= గోచరత్వమును-అనఁగా దొరకునదిగానుండుటను, నయాతి=పొందదో-దొరకునట్టిది కాదనుట; (అట్లే) సర్వదా=ఎల్లప్పుడును, కిమపి = అనిర్వాచ్యమైన-ఇంతంతని చెప్పనలవికాని, శం=సుఖమును, పుష్ణాతి = పెంచుచున్నదో; అనిశం=నిరంతరమును, అర్థిభ్యః=విద్యార్థులకొఱకు (అని విద్యాపరమైనయర్థము) - యాచకులకొఱకు (అని ధనపరమైనయర్థము)- ప్రతిపాద్యమానం అపి = (విద్యాపరముగా) వ్యాఖ్యానము చేయఁబడుచున్నప్పటికిని-(ధనపరముగా) ఈయఁబడుచున్నప్పటికిని, పరామ్=ఉత్కృష్టమైన, వృద్ధిం=పెంపును, ప్రాప్నోతి=పొందుచున్నదో; వ్యాఖ్యానముచే నభివృద్ధిని జెందుననుట, (అట్లే) కల్పాన్తేషు అపి = ప్రళయకాలములందుఁగూడ, నిధనం = నాశమును, నప్రయాతి = పొందదో-కల్పాన్తేష్వపి అని బహువచనముచే విద్యాధనమున కెంతమాత్రమును నేకాలమందును వినాశములేదని తెలియవలయును; (తత్=అ) విద్యాఖ్యం = విద్య యను పేరుగల, అన్తర్ధనం = లోపలిద్రవ్యము-ప్రసిద్ధధనమువలె తన్నుఁదాల్చిన పురుషునికి బయటనుండునట్టిదిగాక వానిలోపల గుప్తమైయుండునదనుట, యేషాం=ఎవరికి, (అస్తి=కలదో), తాన్ ప్రతి= (ఆవిద్యాధనముగల) వారినిగూర్చి-వారియెడల ననుట, హేనృపాః=ఓరాజులారా, మానం = కోపమును-దురాగ్రహముననుట, ఉజ్ఝత=విడువుఁడు-మానుఁడు. తైః సహ=వారితోడ-ఆవిద్వాంసులతోననుట, కః=ఎవఁడు, స్పర్ధతే=నిగ్రహించును-మచ్చరించుననుట-వారి నెవఁడును మచ్చరింపఁజాలఁడని యర్థము. కాఁబట్టి వారెప్పుడును మిక్కిలి గౌరవముతో నెన్నఁదగినవారని భావము. ఇచట ఉపమానమగు ప్రసిద్ధధనముకంటె నుపమేయ మగు విద్యాధనమునకు ఆధిక్యమును జెప్పుటచే వ్యతిరేకాలంకారము.

ఉ. హర్తకుఁ గాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టిసేయు స
త్కీర్తి ఘటించు విద్య యనునదివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు దద్ధనాధికులపట్టున గర్వము మాను టొప్పగున్. 13

తా. (స్వర్ణాదిరూప మగుప్రసిద్ధధనముకంటె విద్యాధనమే మేలైనది. ఎట్లనఁగా) విద్యాధనము దొంగలు మొదలైనవారి కగపడునట్టిది కాదు గనుక ప్రసిద్ధధనము నపహరింప శక్యమగునట్లు దీని నపహరింప శక్యముకాదు. 'అర్థానా మార్జనేదుఃఖమ్' అనునట్లు దానిని సంపాదించుటయందు దుఃఖము కలుగుచున్నదికాని యిది యట్లుగాక యెప్పుడును సుఖము నిచ్చుచుండును. అది యనుభవించినఁగాని యొకరి కిచ్చిననుగాని తగ్గి నానాఁటికి నశించిపోవుచుండును. ఇది యొకరి కెల్లప్పుడు నిచ్చుచుండిననుగాని కొంచెమైనను దగ్గక మఱిమఱి వృద్ధిం బొందుచు ప్రళయకాలము లెన్ని వచ్చినను నాశము నొందకుండును. దానివలె బయటనుండునది

గాక యిది తన్నుఁ దాల్చినవానిలోపలనె మిక్కిలి పదిలమైయుండును. ఇట్టివిద్యాధనముగలవారియెడ నట్టిసామాన్యధనముగల రాజులుసైతము దురాగ్రహము మాని గౌరవబుద్ధితోఁ బ్రవర్తింపవలయును. ఏలనఁగా నెవ్వరుగాని యట్టివారితో మచ్చరింపఁజాలరని తాత్పర్యము.

అవ. 'రాజా! మీసంపద వారి కేమియుఁ బ్రతిబంధము కలిగింపఁజాలదు. కాఁబట్టి వారిదెస బహుమానము చూపుచునే యుండవలయును' అని దృష్టాంతముతోఁగూడ రాజునకుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అధిగతపరమార్థాన్ పణ్డితాన్ మావమంస్థా।
స్తృణమివ లఘు లక్ష్మీ ర్నైవ తాం స్సంరుణద్ధి।
అభినవమదరేఖాశ్యామగణ్డస్థలానాం।
న భవతి బిసతన్తు ర్వారణం వారణానామ్॥ 14

టీ. (హేనృప=ఓరాజా) అధిగతపరమార్థాన్=* తెలిసికొనఁబడిన తత్త్వార్థములుగల-తత్త్వార్థముల నెఱిఁగిన యనుట, లేక, పొందఁబడిన పురుషార్థములుగల-పురుషార్థములు లభించిన యనుట, పండితాన్=విద్వాంసులను,మా అవమంస్థాః=అవమానింపకుము, (ఏలనఁగా) తృణంఇవ=గడ్డిపరకవలె, లఘు=అల్పమైన-నిస్సారమైనయనుట, లక్ష్మీః=నీసంపద, ('శోభాసమ్పత్తిపద్మాసులక్ష్మీః శ్రీరివగీయతే' అని విశ్వము) తాన్=వారిని-ఆపండితులను, నఏవ సంరుణద్ధి=కొంచెమైనను అడ్డపెట్టఁజాలదు-కట్టుపఱుపఁజాలదనుట. (ఇందులకు దృష్టాంతము) అభి...స్థలానాం-అభినవ=మిక్కిలిక్రొత్తలైన,మదరేఖా=మదజలధారలచే,శ్యామ=నల్లని,గండస్థలానాం=చెక్కిళ్లప్రదేశములుగల, వారణానాం=ఏనుఁగులకు, బిసతన్తుః=తామరతూఁడులదారము, వారణం=అడ్డగించునట్టిది, నభవతి=కాదు. కావున వారియెడల మిక్కిలి గౌరవముతోనే మెలఁగవలయునని భావము. అలంకారము దృష్టాంతము. దీనికి నంగము-ఉపమ. కావున రెంటికిని సంకరము. ఇచట పండితులపరమార్థజ్ఞానమునకు ముందట రాజులసంపద తృణప్రాయ మనునాశయముతో లక్ష్మికి తృణోపమానము కల్పితమని యెఱుంగునది.

* విద్యాధనమునుగూర్చి యీలీరుననే 'నభోగహార్యా నచబన్ధుహార్యా నభ్రాతృహార్యా నచరాజహార్యా। స్వదేశమిత్రం పరదేశబన్ధు ర్విద్యాసుధాం యేపురుషాః పిబన్తి॥ విద్యాధనము అనుభవించుటచేఁ దఱుఁగదు. బంధువులచేతను,అన్నదమ్ములచేతను, రాజులచేతను నపహరింపఁబడదు. స్వదేశమందు మిత్రునివంటిది. పరదేశమునందు బంధువువంటిది. అట్టివిద్య యనునమృతము నేపురుషులు త్రాగుదురో వారి కట్టిధనము కలుగును అని చెప్పఁబడియున్నది.

తే. ప్రభులు పండితు లగువారికెవలన గర్వ
కలన మానుఁడు వారు మీకలిమి తృణము
లీలఁ బోలింప లేమి మృణాళగుణము
భూరిమదవారణములకు వారణంబె. 14

తా. రాజా! తత్త్వవేత్తలగు విద్వాంసుల నవమానింపకుమా. గడ్డిపరకవలె సారహీనమైన నీసంపద యట్టిమహాత్ములను గొంచెమైనను గట్టుపఱుపఁజాలదు. క్రొత్తలైన మదజలధారలచే నలుపెక్కిన చెక్కిళ్లుగల మదపుటేనుఁగులను దామర తూండ్లదారముచేఁ బట్టి కట్టఁదరముకాదు. అట్లె నీసంపదయు వారిని గట్టుపఱుపఁ జాలదు.

అవ. వేయేల, బ్రహ్మదేవునివంటివాఁడును వారినేర్పు నపహరింపఁజాలఁడని దృష్టాంతమూలముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అమ్భోజినీవనవిహారవిలాసమేవ।
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా।
న త్వస్య దుగ్ధజలభేదవిధౌ ప్రసిద్ధాం।
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః॥ 15

టీ. విధాతా=బ్రహ్మ, క్రుద్ధః=(ఒకానొకహేతువుచే) కోపించినవాఁడై, హంసస్య=(తనవాహనమైన) హంసయొక్క, అమ్భో... మేవ-అమ్భోజినీవన=తామరతీఁగలతంపరయందు, విహార=క్రీడించుటయనెడి, విలాసంఏవ=విలాసమునుమాత్రమే-మఱివేఱొక్కటినిగాదనుట, నితరాం=మిక్కిలి-విశేషించి, హన్తి=నాశము చేయుచున్నాఁడు. తామరకొలనిని మిక్కిలి యెండించుటచే నందు విహరించుటను చెఱుపుటకుమాత్రమే శక్తుఁడగుచున్నాఁడని యర్థము. (అయినప్పటికిని)అసౌ=ఈతఁడు-బ్రహ్మ, అస్య=దీనియొక్క-హంసయొక్క, దుగ్ధ...విధౌ-దుగ్ధజల=పాలునీళ్లను, భేదవిధౌ=వేఱుసేయుటయందు, ప్రసిద్ధాం=ప్రసిద్ధమైన, వైదగ్ధ్యకీర్తిం=నేర్పుచేఁగలిగిన కీర్తినిగూడ, 'కృత్యవస్తుషుచాతుర్యం వైదగ్ధ్యం పరికీర్తతే' అని చేయఁదగిన వస్తువులందుఁ జూపునేర్పు, వైదగ్ధ్యము. అపహర్తుం=పోఁగొట్టుటకు న సమర్థః=శక్తుఁడుకాఁడు. హంస పాలు నీరును గలసియుండఁగా నీటినివిడిచి పాలును మాత్రము గ్రహించునని ప్రసిద్ధి. అప్రకృతమగుబ్రహ్మ హంసవృత్తాంతముచే ప్రస్తుత మగురాజవిద్వజ్జనవృత్తాంతము తెలియనగుటచే నిట యలంకారము అప్రస్తుతప్రశంస.

చ. వనజభవుండు గోపమున వాహన మైనమరాళభర్తకున్
వనజవనీవిహారకలనంబు దొలంగఁగఁ జేయుఁ గాని గుం

భనమున దుగ్ధజీవనవిశేభాగవిధాననిరూఢనై పుణీ
జనితమహాయశోవిభవసారము హంసకు మాన్పఁజాలునే. 15

తా. బ్రహ్మ యెట్లో కోపమునొంది తామరకొలని నెండించి తా నెక్కి తిరుగు హంసకుఁ దామరవనమునందు విహరించువేడుక లేకుండునట్లు చేసెనుగాని పాలను నీటిని వేఱుపఱుచునట్టి నేర్పువలన దానికిఁ గలిగినట్టి కీర్తినిగూడఁ బోఁగొట్టుటకు శక్తుఁడుగాఁడయ్యె. ఇట్లే రాజు పండితులపైఁ గోపముకలిగనేని వారు తనదేశమందు వసించుట మొదలైనవానినిమాత్రము చెఱుపఁగలఁడే కాని సమస్తవిద్యాపరిశీలనమువలన వారికిఁ గలిగినట్టి చాతుర్యమును జెఱుపఁజాలఁడు.

అవ. పండితులకు విద్యయే భూషణ మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చన్ద్రోజ్జ్వలా ।
న స్నానం న విలేపనం న కుసుమం నాలఙ్కృతా మూర్ధజాః ।
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే ।
క్షీయన్తేఽఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్॥ 16

టీ. పురుషం=పురుషుని, కేయూరాణి=బాహుపురులు, నభూషయన్తి=అలంకరింపవు. చన్ద్రోజ్జ్వలాః=చంద్రునివలె మిక్కిలి తెల్లగాఁ బ్రకాశించునట్టి, హారాః=ముత్తెపుహారములు, నభూషయన్తి=అలంకరింప జాలవు (పురుషుని అని ముందంతటను గూర్చుకొనవలయును). స్నానం=అభిషేకము, నభూషయతి=అలంకరింపఁజాలదు. విలేపనం=పచ్చకర్పూరము కస్తూరి గంధము మొదలైనవాని మైపూఁతయు, నభూషయన్తి=అలంకరింపదు. కుసుమం (ఇదిజాత్యేకవచనము)=మల్లెలుమొల్లలుసంపెఁగలు మొదలైన పువ్వులును, నభూషయన్తి=అలంకరింపదు. అలఙ్కృతాః=అభ్యంగనము చేయుట, పువ్వులుదుఱుముట మొదలైనవానిచే చక్కఁగా సవరింపఁబడిన, మూర్ధజాః=తలవెండ్రుకలును, నభూషయన్తి=అలంకరింపవు. (కింతు=అయితే) యా=ఏది-ఏవాక్కు, సంస్కృతా=వ్యాకరణాదిశాస్త్రములచేఁ బరిశుద్ధమైనదై, ధార్యతే=ధరింపఁబడుచున్నదో-స్వాధీనము చేసికొనఁబడుచున్నదో, (సా=అట్టి) ఏకా=కేవలమైన, వాణీ=వాక్కు, పురుషం=పురుషుని, సమలంకరోతి=చక్కఁగా నలంకరించుచున్నది. కేయూరములుమొదలైనవి భూషణము లగుట ప్రసిద్ధమైయుండఁగా నట్లు కాదని నిషేధించుటచేఁ బ్రత్యక్షముగా నిజమును మఱుఁగుపెట్టుటయే యగునని యాశంకించినవాఁడై యవి భూషణములేయైనను క్షీణించునట్టిస్వభావము గలవియగుటచే భూషణములుకాఁదగవు గాన నవి భూషణములుకావని సమర్థించి చెప్పుచున్నాఁడు. అఖిలభూషణాని=బాహుపురులు మొదలైనసమస్తభూషణములును, క్షీయన్తే=కాలక్రమమున నశించుచున్నవి-కాఁబట్టి యవి భూషణములే కావని యాశయము, వాక్

భూషణం=సంస్కారమునొందినట్టి వాక్కురూపమునను౦డు భూషణమన్ననో, సత తం భూషణం=నిత్యమైనభూషణము - ఎప్పుడును నశింపదనుట. కాబట్టియే భూషణ మగునని భావము. అలం. వ్యతిరేకము.

ఉ. భూషలు గావు మర్త్యులకు ♦ భూరిమయాంగదతారహారముల్
 భూషితకేశపాశమృదు ♦ పుష్పసుగంధజలాభిషేకముల్
 భూషలు గావు పూరుషుని ♦ భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
 గ్భూషణమే సుభూషణము ♦ భూషణముల్ నశియించు నన్నియున్.

తా. పురుషుని బాహుపురులు అలంకరించునవి గావు. చంద్రునివలెఁ దెల్లగా మెఱయుచుండుముత్యాలదండలును అలంకరించునవిగావు. స్నానముగాని, చందనము మొదలగు మైపూఁతలుగాని, మల్లెలుమొల్లలుమొదలగు పువ్వులుగాని, దువ్వుటమొద లైనవానిచేఁ జక్కనై నివ్వటిల్లునెఱికురులుగాని యలంకరించునవికావు. వ్యాకర ణాదిశాస్త్రశుద్ధమైన వాక్కు ఒక్కటియే పురుషుని జక్కఁగా నలంకరించునదగును. బాహుపురులుమొదలైనభూషణములెల్ల క్షీణించునట్టివిగాన నవి భూషణములుకావు. వాక్కనెడిభూషణమే యెప్పుడు నశింపకుండుభూషణము.

శ్లో॥విద్యానామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం।
 విద్యా భోగకరీ యశ స్సుఖకరీ విద్యా గురూణాం గురుః ।
 విద్యా బన్ధుజనో విదేశగమనే విద్యాపరా దేవతా ।
 విద్యా రాజసు పూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః ॥ 17

టీ. విద్యానామ=వేదశాస్త్రాదిమయమగు విద్య యనునది, నరస్య=పురుషునికి, అధికం=ఎక్కువయైన-హెచ్చైన, రూపం=(కుండలహారనూపురాంగదము లనుచతు ర్విధభూషణములచే నలంకృతముగాకున్నను అలంకరింపఁబడినదానివలెనె ప్రకాశించు చుండునట్టి) యాకారవిశేషము*-అట్టిరూపమువలె లోకమునురంజింపఁజేయునదని భావము. ప్రచ్ఛన్నం=రహస్యముగా- కనఁబడకుండునట్లు, గుప్తం=దాఁపఁబడినట్టి, ధనం=ద్రవ్యము. (విద్యయేయని కూర్చుకొనఁదగును). ధనమువలె కాలాంతరమందు నుపయోగించునని భావము. విద్యా=ఆవిద్య, భోగకరీ=భోగములను గలుగఁజేయునది- హారచందనాదిభోగ్యవస్తువులను లభించుట కది మూలమని భావము. యశస్సుఖకరీ-

* 'అవేధ్యారోప్య విక్షేప్య బంధనీయైరభూషితం। యద్భూషితమివాభాతి త ద్రూపమిలికథ్యతే' తూర్చితాల్పఁదగిన కుండలాదులు, పైకివేసికొనఁదగినహారములు, విడుల్చునట్లు తొడఁగఁదగిన నూపురములు, కట్టుకొనఁదగిన బాహుపురులు అను నా లుగువిధము లగుభూషణములచే నలంకరింపఁబడకున్నను నలంకృత మైనదానివలెఁ బ్రకాశించునదియే రూప మనఁబడును-అని కావ్యప్రకాశిక.

యశః=కీర్తిని, సుఖః=ఇంద్రియతర్పణమును, కరీ=చేయునట్టిది-కీర్తికిని నింద్రియతర్పణమునకును హేతువనిభావము. విద్యా=విద్య, గురూణాం=(గృణన్తి=ఉపదిశన్తి అనువ్యుత్పత్తిచే)హితాహితముల నుపదేశించునట్టియాచార్యులకుఁగూడ, గురుః=ఉపదేశించునట్టిది-గురువులవలె పరమార్థమును బోధించునదనిభావము. విద్యా=విద్య, విదేశగమనే=దేశాంతరమునకుఁబోయినపుడు-ప్రవాసమునందు, బన్ధుజనః=సుహృజ్జనుఁడైనది-సుహృజ్జనునివలె విశేషోపచారములను జేయునట్టిదనిభావము, విద్యా=విద్య, పరాదేవతా=పరమాత్మ-పరమాత్మునివలె మోక్షదాయకమైనదనిభావము, లేక, పరాదేవతా=తనకభీష్టమైనదైవము-ఇష్టదైవమువలె నైహికాముష్మికఫలములనిచ్చునదని భావము, విద్యా=విద్య, రాజసు=రాజులయందు-రాజులచేతననుట, పూజ్యతే=కొనియాడఁబడునది-గౌరవసంపన్నమైనదిగనుక రాజపూజ్యమగుచున్నదని భావము. లేక, విద్యాశబ్దమునకు విద్యావంతుఁడనియు రాజశబ్దమునకు రాజసభలనియు లక్ష్యార్థము లుగ్రహించినయెడల, విద్యావంతుఁడు రాజసభలయందు గౌరవింపఁబడుననియర్థము. ధనం=ద్రవ్యమున్ననో, నహి=క్రిందఁజెప్పఁబడినప్రకారము గలది కానేరదు. (కాఁబట్టి) విద్యావిహీనః=(క్రిందఁజెప్పఁబడినట్టిదగు) విద్యలేనివాఁడు, పశుః=పశుప్రాయుఁడు-కర్తవ్యాకర్తవ్యవివేకము లేనివాఁడని భావము. పెక్కుప్రకారములు సేయునది కాఁబట్టి మంచివిద్యయే ముఖ్యముకాని మఱివేఱొద్దియును గాదని యాశయము. ఇచట విద్యను, రూపము ధనము మొదలయిన యాకారములచేఁ బలువిధములుగా రూపించుటవలన నిరవయవమాలారూపక మలంకారము.

ఉ. విద్య నిగూఢగుప్త మగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లే దిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే. 17

తా. విద్యయే పురుషునికిఁ గుండలహారాదిభూషణములులేకయే ప్రకాశింపఁజేయునట్టి రూపమువంటిదై లోకమును రంజింపఁ జేయును. మఱియు నది యెవ్వరికిని దెలియనట్లు మిక్కిలిపదిలముగా దాఁచిపెట్టఁబడిన ధనమువంటిదై కాలాంతరములందుపయోగించును. సమస్తభోగములను గీర్తిని సుఖమును బొందుట కదియే హేతువు. విద్య గురువులకు గురువువంటిదై హితాహితముల బోధించుచుండును. దేశాంతరమునకుఁ బోయినపు డది బంధుజనునివలె మిక్కిలియు నుపచరించును. విద్య పరమాత్మవలె మోక్షమునుగాని లేక యిష్టదైవమువలె నైహికాముష్మికఫలములనుగాని యిచ్చును. విద్య రాజులచేతను గొనియాడఁబడును. విద్య గలవారు రాజసభలందుఁ బూజితులగుదురు. విద్యకుఁగలయిట్టిలక్షణములు ధనమునకు లేదు. కాఁబట్టి యిట్టివిద్యలేనివాఁడు కర్తవ్యాకర్తవ్యవివేకశూన్యుఁ డగుటచే పశుప్రాయుఁడే యగును.

అవ. లోకులకు హితము లైనవానిని నహితము లైనవానిని వర్ణించుచు నాప్రసక్తిమూలమున వారికి విద్యయే మిక్కిలి గొప్పయైశ్వర్య మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ క్షాన్తిశ్చే త్కవచేన కిం కి మరిభిః క్రోధోఽస్తిచే ద్దేహినాం।
జ్ఞాతిశ్చే దనలేన కిం యది సుహృ ద్దివ్యౌషధైః కిం ఫలమ్ ।
కిం సర్పై ర్యది దుర్జనాః కిము ధనై ర్విద్యానవద్యా యది ।
వ్రీడాచే త్కిము భూషణై స్సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్॥ 18

టీ. దేహినాం=ప్రాణులకు, క్షాన్తిః=ఓర్పు - అవమానాదులు కలుగుచున్నపుడు కోపమును గలుగనీక యడ్డగించునట్టి గుణవిశేషము, అస్తిచేత్=ఉండినయెడల, కవచేన=కవచములో, కిం (ఫలమ్)=ఏమిప్రయోజనము? (ఫలమ్ అని యంతటనుగూర్చుకొనవలయును.) కవచ మెట్లు మర్మములందు బాణాదులను గ్రుచ్చుకొనకుండఁ జేయునో యట్లే యోర్పును మర్మముల బాధించువానిని దగులనీయకుండును. ఓర్పువలన మర్మబాధ కలుగదని యాశయము. దేహినాం=ప్రాణులకు, క్రోధః=కోపము-మనస్సునకు క్షోభము కలిగించునట్టి గుణము, అస్తిచేత్=ఉన్నయెడల, .అరిభిః కిం(ఫలమ్)=శత్రువులతో నేమి ప్రయోజనము-కోపమే లోపలనుండు శత్రువువంటిదై యుపద్రవము కలిగింపఁగా తక్కినబయటిశత్రు లేల యని భావము. జ్ఞాతిః=దాయాది, అస్తిచేత్=ఉన్నయెడల, అనలేన కిం ఫలమ్=అగ్నితో నేమిప్రయోజనము? దాయాది అగ్నివలె సమస్తమును నిర్మూలముచేయుననిభావము. సుహృత్=మంచిమిత్రుఁడు, అస్తియది=ఉన్నయెడల, దివ్యౌషధైః=సిద్ధౌషధములతో, కిం ఫలం=ఏమి ప్రయోజనము? మిత్రుఁడు మంచియౌషధమువలె నారోగ్యము నిచ్చుననిభావము. దుర్జనాః=దుష్టులు, యది(సన్తి)=ఉన్నయెడల, సర్పైఃకిం(ఫలమ్)=సర్పములతో నేమిప్రయోజనము?-దుర్జనులు సర్పములవలె ప్రాణములను హరింతు రని భావము. అనవద్యా=నిర్దోషమయిన, విద్యా=వేదవేదాంగాదిమయ మగు చదువు, (అస్తి)యది=ఉన్నయెడల, ధనైః=ద్రవ్యములతో, కిము(ఫలం)=ప్రయోజనమేమి?-విద్య ధనమువలె సకలభోగములను సాధించి యిచ్చు నని భావము. వ్రీడా=లజ్జ-చేయఁదగనికార్యములందుఁ బ్రవర్తించుటకు మనస్సు సంకోచపడుట, (అస్తి)చేత్=ఉన్నయెడల, భూషణైః కిము=ఆభరణములతో నేమిప్రయోజనము?-లజ్జయే లోకోత్తర మైనభూషణమనిభావము. సుకవితా=మంచిపాండిత్యము-'సజ్ఖ్యావాన్ పణ్డితః కవిః' అని యమరము, లేక, మంచికవిత్వము, యది అస్తి=ఉన్నయెడల, రాజ్యేన కిం=భూమండలాధిపత్యముతో, లేక, ప్రజాపరిపాలనముతో నేమిప్రయోజనము?- మంచిపాండిత్యముగాని కవిత్వముగాని రాజ్యమువలె సకలలోకవశీకర మని భావము.

చ. క్షమ గవచంబు గ్రోధ మది ♦ శత్రువు జ్ఞాతి హుతాశనుండు మి
త్రము దగుమందు దుర్జనులు ♦ దారుణపన్నగముల్ సువిద్య వి
త్త ముచితలజ్జ భూషణ ము♦దాత్తకవిత్వము రాజ్య మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు♦పట్టునఁ దత్కవచాదు లేటికిన్. 18

తా. ప్రాణులకు నోరుపు కలిగియుండెనేని మర్మబాధకములగువానిని దగులకుండఁ జేసికొనుటకు వేఱుకవచ మక్కఱలేదు. లోపల శత్రువువలె మనస్సును గలంచునట్టి పెనుకోప ముండెనేని నుపద్రవపెట్టుటకు వేఱుశత్రువు లక్కఱలేదు. దాయాది యుండెనేని సమస్తమును నిర్మూలము సేయుటకు నిఁక నిప్పక్కఱలేదు. ఆరోగ్యము నిచ్చుటకు మిత్రుఁడుండెనేని మంచిసిద్ధౌషధము లక్కఱలేదు. దుర్జనులుండిరేని ప్రాణములను దీయుటకు సర్పము లక్కఱలేదు. నిర్దోషమైనవిద్యయుండెనేని సకలభోగములను సాధించుటకొఱకు వేఱుధనము లక్కఱలేదు. లోకోత్తర భూషణ మగులజ్జ యుండెనేని వేఱుభూషణము లక్కఱలేదు. మంచిపాండిత్యముగాని కవిత్వముగాని యుండెనేని సకలలోకులవశముచేసికొనుటకు రాజ్య మక్కఱలేదు.

అవ. విద్వాంసులగుణములను వర్ణించి యట్టిగుణవంతులవలననే లోకస్థితి జరుగుచున్న దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే।
ప్రీతి స్సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవమ్।
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా।
యేచైవం పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః॥ 19

టీ. స్వజనే=తనవారియందు-బంధుజనులయెడ ననుట, (ఇట జనశబ్దము జాత్యేకవచనము ఇట్లే మీఁదట నెల్లఁ దెలియునది), దాక్షిణ్యం=మోమోటము - వారియిష్టానుసారముగా వర్తించుట, అట్లు లేనియెడల వారు నిందింతురని భావము; పరిజనే = భృత్యులయందు, దయా=కనికరము-వారిదారిద్ర్యము మొదలైన దుఃఖములను బోఁగొట్టవలయుననుకోరిక, కనికరము చూపనియెడల వారి విడిచిపెట్టుదురని భావము; దుర్జనే=దుష్టులయందు, సదా=ఎల్లప్పుడును, శాఠ్యం=అప్రియములు చేయుట, లేనియెడల వారు ధిక్కరింతురని భావము; సాధుజనే=సజ్జనులయందు, ప్రీతిః=స్నేహము, స్నేహము చూపనియెడల వారనుతాపపడుదురనిభావము; నృపజనే=రాజులయందు, నయః=నీతి-అనువర్తించుటయందాసక్తి-ఇదిలేనియెడల వారు దండింతురనిభావము; విద్వజ్జనే-పండితజనులయందు, ఆర్జవమ్=వక్రతలేమి- సరియైన నడవడియనుట, ఇది లేనియెడల వారు నిషేధింతురనిభావము; శత్రుజనే=పగవారియందు, శౌర్యం=శూరత్వము-ఇదిలేనియెడల వారు పడఁద్రొక్కుదురనిభావము;గురు

జనే=(తండ్రి మొదలగు) పెద్దలయందు, క్షమా=ఓర్పు-ఇది లేకున్న వారు శపింతు రని భావము; కాన్తాజనే=స్త్రీలయందు, ధృష్టతా=దిట్టతనము-ఇది లేకున్న వారు తనుకు లోకువచేసికొందురని భావము; ఏవం=ఇట్లు చెప్పఁబడిన, కలాసు=శిల్పము లందు, 'కలాశిల్పే కాలభేదా చంద్రాంశే కలనా కలా' అని వైజయంతి, యేచపురు షాః=ఏపురుషులు, కుశలాః = నిపుణులో, తేషు ఏవ = వారలయందే, లోకస్థితిః =లోకమర్యాద, (అస్తి=ఉన్నది). అట్టిగుణములు గలవారే లోకముకట్టుపాటును స్థాపించునట్టివారుగాని తక్కినవారుగారని భావము. అట్టివారే విద్వాంసులు గాని తక్కినవారు గా రని యాశయము.

చ. వరకృప భృత్యులందు నిజవర్గమునం దనుకూలవృత్తి కా
పురుషులయందు శాఠ్యము సుబుద్ధులయం దనురక్తి దాల్మి స
ద్గురువులయందు గౌరవము కోవిదులందు నయంబు రాజులం
దరిజనులందు శౌర్యము మృగాక్షులయందుఁ బ్రగల్భభావ మీ
వరుసఁ గళాప్రవీణు లగువారలయందు వసించు లోకముల్. 19

తా. బంధుజనులయెడల వారియిష్టానుసారముగా నడచుకొనుట, భృత్యులయె డల దయకలిగి యుండుట, దుర్జనులయెడలఁ గటువుగాఁ బ్రవర్తించుట, సజ్జనులదెస స్నేహము, రాజులయెడల నీతియు, విద్వాంసులయెడల సరియైననడత, పగవారిదెసఁ బరాక్రమము, పెద్దలయెడల నోర్పు, స్త్రీలయెడ దిట్టతనము, అనునీగుణములందు నేర్పరులైనవా రెవరో వారివలననే యీలోకమర్యాద జరుగుచున్నదిగాని తక్కిన వారిచేతఁ గాదు. వారే విద్వాంసులు.

అవ. ఇట్లు విద్వజ్జనులను వర్ణించి యిప్పుడు సజ్జనులతోడిసహ వాసము శ్రేయస్సును గలిగించున దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జాడ్యం ధియో హరతి సిఞ్చతి వాచి సత్యం।
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి।
చేతః ప్రసాదయతి దిక్షుతనోతి కీర్తిం।
సత్సఙ్గతిః కథయ కిం న కరోతి పుంసామ్॥ 20

టీ. ధియః=బుద్ధియొక్క, జాడ్యం=మందతను, హరతి=పోఁగొట్టుచున్నది. వాచి=వాక్కునందు, సత్యం=సూనృతభావమును, సిఞ్చతి=చల్లుచున్నది-కలిగించు చున్నదనుట. మాన ఉన్నతిం = గౌరవాతిశయమును-మిక్కిలిగణ్యతను, దిశతి=ఇ చ్చుచున్నది. పాపం=పాపమును, అపాకరోతి = నాశముచేయుచున్నది - ధర్మోప

దేశాదులచేత నని భావము. చేతః=మనస్సును, ప్రసాదయతి = నిర్మలముచేయుచు న్నది- జ్ఞానోపదేశాదులచేత నని భావము. దిక్షు = దిక్కులయందు, కీర్తిం=యశస్సును, తనోతి = విస్తరింపఁజేయుచున్నది. (కాఁబట్టి) సత్సఙ్గతిః = సజ్జనులతోఁడి కూడిక, పుంసాం = పురుషులకు, కింశ్రేయః = ఏశ్రేయస్సును, నకరోతి = చేయదు. కథయ=చెప్పుము - అని యిచట శ్లోకమును సంబోధించుట తెలియఁదగును. సమస్తములైన శ్రేయస్సులను జేయు నని యర్థము. కాఁబట్టి వారితోడనే సహవాసముచేయవలయును గాని దుర్జనులతోఁ గాదని తాత్పర్యము. ఇచటఁ గ్రియలు పెక్కు సముచ్చితములై యుండుటచే సముచ్చయాలంకారము.

తే. సత్యసూక్తి ఘటించు ధీజడిమ మాన్చు
గౌరవ మొసంగు జనులకుఁ గలుష మడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁ జిత్తవిస్ఫూర్తిఁ జేయు
సాధుసంగంబు సకలార్థసాధనంబు. 20

తా. సజ్జనులతోడిసహవాసము బుద్ధిమాంద్యమును బోఁగొట్టుచున్నది, సత్యభాషణమును గలిగించుచున్నది, మంచిగౌరవమునిచ్చుచున్నది, ధర్మోపదేశాదులచేఁ బాపములను బోఁగొట్టుచున్నది, జ్ఞానోపదేశాదులచే మనస్సును నిర్మలము చేయుచున్నది, కీర్తిని నలుగడల వ్యాపింపఁజేయుచున్నది. మనుష్యుల కది చేయనిమేలొక్కటియు లేదు.

అవ. పండితు లసాధారణమైనమహిమ గలనా రగుటచే వారు లోకమునం దెల్లవారికి నుత్కృష్టులైనవారని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥ 21

టీ. సుకృతినః=ధన్యులును, రససిద్ధాః= సిద్ధించిన శృంగారాది నవరసములు గలవారును-సిద్ధించిన పాదరసఘుటిక గలవారును అని యర్థాంతరము, తే = ప్రసిద్ధులును - లేక ముందు వర్ణింపఁబడినవారును (అగు), కవి ఈశ్వరాః=కవిశ్రేష్ఠులు-లేక పండితోత్తములు, జయన్తి=సర్వోత్కృష్టులై వర్తించుచున్నారు (ఇప్పటికిని అని శేషము.) శ్లోకయర్థమెట్లనఁగా, 'రసో వై సః' అనుశ్రుతివలనను 'శృఙ్గారాదౌ విషే వీర్యే పారదే బ్రహ్మవర్చసి। రేతస్యాస్వాదనే హేమ్ని నిర్యాసేఽమృతశబ్దయోః' అనునభిధానమువలనను రస మనఁగా బ్రహ్మమని యర్థము. కాఁబట్టి, రససిద్ధాః=సిద్ధించిన రసము (బ్రహ్మము) గలవారును, (అట్టి) బ్రహ్మసాక్షాత్కారము గలవారనుట. కవు లనఁగా క్రాంతదర్శులు-దివ్యదృష్టి గలవారు, వారికి, ఈశ్వరాః=నాథులు-కాలత్రయాభిజ్ఞులు-బ్రహ్మవిద్యావిశారదులనుట, ఇట్టివారు,జయన్తి=సర్వోత్కృష్టులై వర్తించుచున్నారని యర్థము. సర్వోత్కృష్టులై వర్తించుట కేమిహేతువనఁగా, తేషాం=ఆకవీశ్వరులయొక్క, యశఃకాయే=కీర్తి (రూపమైన) శరీరమునందు. జరామరణజం=జరామరణములవలనఁ బుట్టినట్టి, భయం=దిగులు, నఅస్తి=లే

దు. రససిద్ధులైనవారి పంచభూతమయమగు శరీరమునకే జరామరణభయము లేకుం డఁగా ఇఁక కల్పాంతస్థాయి యగువారికీర్తిమయశరీరమున కాభయము కలుగదని చెప్పవలెనా యన్ని భావము. పాదరసఘుటికాసిద్ధి గలవారికిఁగాని బ్రహ్మసాక్షాత్కారము గలవారికిఁగాని జరామరణభయము లేదనుట ప్రసిద్ధము. ఇచట కవీశ్వరుల 'రససిద్ధాః' అనువిశేషణమునకు న్యాయముగా శృంగారాదినవరససిద్ధి గలవారని యే యర్థమైనను, ఆవిశేషణమునకుఁ గలశ్లిష్టశక్తిచే పాదరససిద్ధిగలవారనియు, బ్రహ్మసాక్షాత్కారముగలవారనియు నర్థమును గలుగఁజేసి యట్టివా రగుటచే వారికి జరామరణభయములేదనుటను సమర్థించినాఁడని సారస్యము గ్రహింపవలయును. ఇచట రససిద్ధపదార్థము విశేషణగతిచే భయాభావపదార్థమునకు హేతు వగుటంజేసి కావ్యలింగ మలంకారము.

క. సుకృతాత్ములురససిద్ధులు, సుకవీంద్రులువిజయనిధులుకసుమ్మతదీయా
 ధికకీర్తిశరీరంబులు, ప్రకటజరామరణజన్మభయరహితంబుల్. 21

తా. ధన్యాత్ములును రససిద్ధి గలవారు నగు కవీశ్వరులు తమ కీర్తిశరీరములకు జరామరణభయము లేమిచే నిప్పటికిని సర్వోత్కృష్టులై వర్తించుచున్నారు.

ఇది నీతిశతకమునందు విద్వత్పద్ధతివర్ణన మన్నది ద్వితీయదశకము.

---

## నీతిశతకము - మానశౌర్యపద్ధతి.

---

అవ. విద్వాంసులకుఁగూడ మానశౌర్యము లావశ్యకము లగుటవలన విద్వత్పద్ధతిని నిరూపించినపిదప మానశౌర్యపద్ధతిని నిరూపించు చున్నాఁడు.

శ్లో॥ క్షుత్క్షామోఽపి జరాకృశోఽపి శిథిలప్రాయోఽపి కష్టాం దశా।
 మాపన్నోఽపి విపన్నదీధితిరపి ప్రాణేషు నశ్యత్స్వపి।
 మత్తేభేన్ద్రవిభిన్నకుమ్భపిశితగ్రాసైకబద్ధస్పృహః।
 కిం జీర్ణం తృణ మత్తి మానమహతా మగ్రేసరః కేసరీ॥ 22

టీ. మత్తే...స్పృహః - మత్త ఇభ ఇన్ద్ర=మదించిన గజశ్రేష్ఠముయొక్క, విభిన్న=చీల్పఁబడిన, కుంభ=కుంభస్థలమునందలి, పిశిత = మెదటిమాంసమును, గ్రాస=మ్రింగుటయందు, ఏక=ముఖ్యముగా, బద్ధ=కట్టఁబడిన-నెలకొల్పఁబడిన-దృఢముగానుంపఁబడినయనుట- స్పృహః=వాంఛగలదియు-సింహము ఏనుఁగు మెదటినిమాత్రమే ముఖ్యముగాఁ గోరునేగాని తక్కినదానిని గోరదనుట-ఇది శౌర్యాతిశయమును జెప్పెడుమాట, మానమహతాం=మానముచే గొప్పయగువారిలోపల-మిక్కిలియు మానముగలవారిలోపల, అగ్రేసరః=మొదటిదైనదియు (అగు), కేసరీ=సింహము

(ఇదికర్త), క్షుత్=ఆఁకటిచేత, క్షామః అపి=క్షీణించినది అయినప్పటికిని, జరా=ముసలితనముచేత, కృశః అపి=చిక్కినదైనప్పటికిని, శిథిలప్రాయః అపి=ఇంచుమించుగా అంగసంధులు వదలిన దైనప్పటికిని-అవయవములబిగి సడలుటచే బలహీనమైనదైనప్పటికి ననుట, కష్టాం=మిగుల కష్టమైన, దశాం=అవస్థను, ఆపన్నః అపి=పొందిన దైనప్పటికిని, (కాఁబట్టియే) విపన్న=నష్టమైన-చెడిన, దీధితిఃఅపి=కాంతిగలదైనప్పటికిని, ప్రాణేషు=(అయిదు) ప్రాణములు, నశ్యత్సు (సత్సు) అపి=నశించుచున్నప్పటికిని-వెడలిపోవుచున్నప్పటికిని-ప్రాణసంకటము కలిగినప్పటికి ననుట, జీర్ణం తృణం=ఎండిన గడ్డిపరకను, అత్తి కిం=తినుచున్నదా యేమి-తినదని భావము. ఇది మానాతిశయమును జెప్పెడుమాట. నీచజంతు లిట్లు కావని భావము. ఇట అపిశబ్దము ఒక్కొకవిశేషణముతోడను గూడియుండుటవలన, ఆయొక్కొకవిశేషణమే నీచవృత్తియందుఁ బ్రవర్తింపఁజేయుటకుఁ జాలినదని తెలుపుచున్నది. అట్టివిశేషము లన్నియుఁ గలిగినప్పటికిని ఏనుఁగుమెదటినే తినునట్టిప్రతిజ్ఞగలసింహము నీచవస్తువులకుఁ బ్రవర్తింపదు అని దాని మానశౌర్యములు చెప్పఁబడుట తెలియఁదగును. 'ప్రాణానపి పరిత్యజ్య మానమేవాభిరక్షయేత్। ప్రాణాస్తరజ్గచపలా మాన మాచన్ద్రతారకమ్' అను వచనముప్రకారమున యశస్సును గోరువాఁడు మానశౌర్యసంపన్నుఁడై యుండవలయు నని భావము. ఈప్రకరణమునఁ గొన్నియెడల మానమును గొన్నియెడల శౌర్యమును గొన్నియెడల రెండును బ్రధానముగాఁ జెప్పఁబడియుండుట తెలియఁదగును. కులక్రమముగా వచ్చిన యుత్తమశీలమును గాపాడుకొనుటయే మాన మనియు సాహాయ్యమును గోరక శత్రువులను సంహరించునట్టిసామర్థ్యమే శౌర్య మనియు, వివేచించుకొనఁ దగును. ఇందు అలంకారమప్రస్తుతప్రశంస.

ఉ. గ్రాసములేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా
యాసము నైన నష్టరుచి యైనను బ్రాణభయార్తమైన సం
త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే. 22

తా. మదగజము మెదటిని మాత్రమే తినఁగోరునదియు మిక్కిలిమానము గలదియు నైనసింహము, తా నాఁకటిచే నెంత క్షీణించినప్పటికిని, ముసలితనముచే నెంత కృశించినను, తనయవయవములసంధులు బిగిసడలుటచే మిక్కిలి బలహీనమైనను, మిక్కిలికష్టదశను బొందినను, ఆకారణముచే శోభ మిక్కిలిచెడినదైనను, వేయేల, దాని ప్రాణములే పోవుచుండినను, ఎండిపోయిన గడ్డిపరకలను దినదు. ఇట్లే మానశౌర్యసంపన్నుఁడైనవాఁ డెట్టికష్టములు వచ్చినను నీచకార్యములు చేయఁబూనఁడు.

అవ. క్షుద్రజంతువునకో యిట్టిగొప్పగుణములు లేవు అని చెప్పిన యర్థమునే వేఱురీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ స్వల్పస్నాయువసావసేకమలినం నిర్మాంసమ ప్యస్థి గోః
శ్వా లబ్ధ్వా పరితోష మేతి నచ త త్తస్య క్షుధా శాన్తయే।
సింహో జమ్బుక మఙ్క మాగతమపి త్యక్త్వా నిహన్తి ద్విపం
సర్వః కృచ్ఛ్రగతోఽపి వాఞ్ఛతి జన స్సత్త్వానురూపం ఫలమ్॥ 23

టీ. శ్వా=కుక్క, స్వల్ప...మలినం-స్వల్ప=కొంచెమైన, స్నాయు=సన్నపు నరముయొక్కయు, వసా=మేదస్సు (ఎముకలలోని మెదటి) యొక్కయు-లేక, మేలైన మాంసపుఁగ్రొవ్వుయొక్కయు, అవసేక=కూడికొనుటచేత, మలినం=మలదూషితము ఐనప్పటికిని, నిర్మాంసం అపి=మాంసము కొంచెమైనను లేనిదైనప్పటికిని, గోః=పశువు యొక్క; అస్థి=ఎముకను, లబ్ధ్వా=పొంది, పరితోషం=సంతోషమును, ఏతి=పొందు చున్నది; తచ్చ=అదియో-ఆయెముకయన్ననో, తస్య=దాని-ఆకుక్కయొక్క, క్షుధా= ఆఁకలియొక్క, శాన్తయే=నివర్తించుటకు, న=(చాలినది) కాదు. అనీచజంతువునకని భావము. సింహః=సింహమో, అఙ్కం=తనసమీపమునుగూర్చి, ఆగతంఅపి=వచ్చిన దైనప్పటికిని-దగ్గఱ మెలఁగుచున్న దైనప్పటికిననుట, జంబుకం=నక్కను, త్యక్త్వా= విడిచి-పాటింపక-లేక, లక్ష్యపెట్టక యనుట, ద్విపం=ఏనుఁగునే, (అది దూరమునం దున్నప్పటికిని అని భావము) నిహన్తి=చంపుచున్నది. కృచ్ఛ్రగతః అపి=మిక్కిలిసం కటమును బొందినప్పటికిని-సర్వః జనః=సమస్తమైనజనము, సత్త్వఅనురూపం=తమ శక్తికిఁ దగినట్టి, ఫలం=లాభమును, వాఞ్ఛతి=కోరుచున్నది. దుర్బలుఁడు గొప్పఫల మును గోరఁడు, ప్రబలుఁడు అల్పలాభమును గోరఁడు; కాఁబట్టి యీసింహమునక దృష్టాంతముచేత ఆయుష్మంతుఁ డగువాఁడు మిక్కిలియల్పము కానట్టియు మిక్కిలి గొప్పది కానట్టియు వస్తువులను బరిగ్రహించువాఁడు కావలయు నని భావము.

ఉ. స్నాయువసావసేకమలినమ్మగు నెమ్ము గ్రహించి జాగిలం
బాయతమోద మందుఁ జనదాఁకలి దానికిఁ జెంత నున్న గో
మాయువు దానిఁ జూచి పరిమార్పక సింగము దంతిఁ గూల్చు నే
చాయల నెల్లవారు నిజసత్త్వ సమానఫలార్థులే కదా. 23

తా. కొంచెము సన్ననరమును గ్రొవ్వును కలదై కంపుకొట్టుచు మాంసమే లేని యొకపశువు నెముక కుక్కకు దొరకెనేని, అది యెంతో సంతోషించుచున్నదిగాని య ట్టియెముకచే దానియాఁకలిమాత్రము తీఱదు. సింహమో తనకుదగ్గఱనే నక్కయుండి నను దానిని లక్ష్యపెట్టక వదలి దూరమందుండిన ఏనుఁగునే పోయి చంపును. కాఁబటి

యొక్కొక్కరును దమ కెట్టికష్టమువచ్చినను దమశక్తికిఁ దగినంతలాభము నే కోరుదురు గాని యెక్కువ గోరరు.

అవ. నీచజంతువు చేయుచేష్టలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ లాఙ్గూలచాలన మధశ్చరణావఘాతం
భూమౌ నిపత్య వదనోదరదర్శనఞ్చ ।
శ్వా పిణ్డదస్య కురుతే గజపుఙ్గవస్తు
ధీరం విలోకయతి చాటుశతైశ్చ భుఙ్క్తే॥ 24

టీ. శ్వా=కుక్క, పిణ్డదస్య=పిండము పెట్టువానియొక్క (ముందట అని శేషము), లాఙ్గూలచాలనం=తోఁకయాడించుటయును, అధః=క్రింద-భూమియందనుట, చరణ అవఘాతం=కాలితోఁ గొట్టుటను, భూమౌ=భూమియందు, నిపత్య=(తానే) పడి, వదన ఉదర దర్శనంచ=నోటిని కడుపును జూపుటయును, కురుతే=చేయుచున్నది. గజపుఙ్గవస్తు=గజశ్రేష్ఠమన్ననో, ధీరం=గంభీరముగా, విలోకయతి=చూచుచున్నది. ఆహారము పెట్టువానియెదుట నని భావము. చాటుశతైః=అనేకప్రియవచనములచేత-పెక్కుబుజ్జగింపువాక్యములచేత, భుఙ్క్తే=(బెల్లము బియ్యము మొదలైనవానిని) తినుచున్నది. నీచులకును అనీచులకును ఈరెండే దృష్టాంతము లని భావము.

ఉ. వాలముద్రిప్పు నేలఁబడి వక్త్రముఁ గుక్షియుఁ జూపుఁ గ్రిందటం
గాలిడు ద్రవ్వుఁ బిండదునికై కట్టెదుట శునకంబు భద్రశుం
డాలము శాలితండులగుడంబులు చాటువచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణయుక్తిగఁ జూచు మహోన్నతస్థితిన్. 24

తా. కుక్క యాఁకలియెత్తినపుడు తనకుఁబిండము పెట్టువానియెదుటఁ దోఁకనాడించుట కాళ్లతో నేలనుగొట్టుట తానే క్రిందపడి నోటిని బొట్టను జూపుట మొదలగు నీచచేష్టలను జేయుచున్నది. శ్రేష్ఠమగు గజమో యట్లుగాక యతిగంభీరముగాఁ జూడ్కులు నిగుడ్చుచు నాహారముపెట్టువాఁడు పెక్కుమంచిమాటలతోఁ దన్ను బుజ్జగించుచుండఁగా బెల్లము బియ్యము మొదలైనవానిని దినును.

అవ. మానశౌర్యములు గలవాఁడై వంశము నభివృద్ధికిఁ దెచ్చునట్టివానికే జన్మమెత్తుట యొకలాభ మగును. వానికే జన్మము సార్థకము. తక్కినవానికిఁ గా దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే।
స జాతో యేన జాతేన యాతి వంశ స్సమున్నతిమ్॥ 25

టీ. పరివర్తిని = (పుణ్యపాపవశమున మరలమరలఁ జుట్టి) చుట్టివచ్చుచున్న, సంసారే=జరామరణరూపమగు సంసారచక్రమునందు, కోవా=ఎవ్వఁడు, మృతః=మరణించినవాఁడు, నజాయతే=కాఁడు-పుట్టినవాఁడును గాఁడని శేషము గ్రహింపవలయును. లేక, కోవా నమృతః కోవా నజాయతే=చావనివాఁ డెవఁడు పుట్టనివాఁ డెవఁడు అనియు నన్వయమును అర్థమును జేయవచ్చును-అందఱును బుట్టుకయును జావును గలవారే యగుదురనుట. *యేనజాతేన=పుట్టినయెవనిచేత-ఏపురుషుఁడు పుట్టుటచేత, వంశః=కులము, సమున్నతిం=మిక్కిలిగొప్పతనమును, యాతి=పొందుచున్నదో, సః=వాఁడు, జాతః=పుట్టినవాఁడు-జన్మించుటవలని లాభమును బొందినవాఁడు-ఎవఁడు వంశోద్ధారకుఁడో వాఁడే జన్మమెత్తినవాఁడు. మానశౌర్యములుగలవాఁడే యిట్టివాఁడగునుగాని తక్కినవాఁడు కాఁడు. కాఁబట్టి మేకమెడచన్నులవలెఁబుట్టి మశకమువలె నశించునట్టి తక్కినవారివలనఁ బ్రయోజన మేమి యని భావము.

గీ. ప్రాణిలోకంబు సంసారపతిత మగుట
వసుధపై గిట్టి పుట్టనివాఁడు గలఁడె
వానిజన్మంబు సఫల మెవ్వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు. 25

తా. పుణ్యపాపవశమున జరామరణరూపముగాఁ దిరిగి తిరిగి వచ్చుచున్న సంసారచక్రమునందుఁ దగుల్కొని పుట్టనివాఁ డెవఁడు? చావనివాఁ డెవఁడు? అందఱికిని బుట్టుకయును జావును గలవు. ఊరక పుట్టినంతమాత్రమున నొకఁడు పుట్టినట్టివాఁడు కానేరఁడు. ఎవఁడు పుట్టి తనవంశము మిక్కిలియున్నతికిఁ దెచ్చునో యట్టివాఁడే పుట్టినట్టివాఁడు. వానిపుట్టుకయే పుట్టుక.

అవ. ఇట్టిపురుషునికిఁ గలవృత్తిని పూగుత్తితోఁ బోల్చి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ కుసుమస్తబకస్యేవ ద్వయీవృత్తి ర్మనస్వినః।
మూర్ధ్ని వా సర్వలోకస్య శీర్యతే వనఏవ వా॥ 26

టీ. కుసుమస్తబకస్యేవ(ఇది ఇవశబ్దముతోడిసమాసము గనుక ఏకపదమని తెలియఁదగును)=పూగుత్తివలె, మనస్వినః=ధీరునికి-మానశౌర్యములచే నొప్పు పురుషునికి, వృత్తిః=వ్యాపారము,ద్వయీ=రెండువిధములైనది. 'ద్వేగతీహి' అనుపాఠమున రెండేగతులనియర్థము. మూఁడవదిలేదనుట. (ఆవృత్తులు రెండు నెవియనఁగా) సర్వలోకస్య=స

---

* 'జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ' అను భగవద్గీతావచన మిట ప్రమాణము.

మస్తజనులయొక్క, మూర్ధ్ని=శిరస్సునందు (అని పుష్పస్తబకపరమైన యర్థము), ఉన్నతస్థానమందు (అని పురుషపరమైన యర్థము) క్షీణించుచనని శేషము. వా=లేక, వనఏవ=అరణ్యమునందే, శీర్యతే=జీర్ణించుచున్నాఁడు. శౌర్యమువలన నున్నతస్థానమును బొందుట, అది దొరకనియెడల మానమువలన నరణ్యమందే జీర్ణించుట యని వృత్తివిధములు రెంటిని వివేచించుకొనఁదగును. ఇట్టి వృత్తియే పురుషులకు శ్రేయస్కర మని భావము. అలంకారము ఉపమ.

గీ. కుసుమగుచ్ఛంబునకుఁ బోలెఁ బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజనమస్తకప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణభావంబు గనుట. 26

తా. మానశౌర్యములు గలధీరునికిఁ బూవుగుత్తికింబోలె వృత్తి రెండువిధములు. ఎట్లన, వాఁడు దానివలె సమస్తజనులచేత శిరసావహింపఁబడి కాలక్రమమున క్షీణించుచున్నాఁడు. లేదా, యడవియందే జీర్ణించుచున్నాఁడు.

అవ. ముందు చెప్పఁబడిన మానశౌర్యము లనుసట్టిరెండుగుణములు గలవాఁడే యుత్కృష్టుఁ డని మరలఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సన్త్యన్యేఽపి బృహస్పతిప్రభృతయ స్సమ్భావితాః పఞ్చషా
స్తాన్ప్రత్యేష విశేషవిక్రమరుచీ రాహు ర్నవైరాయతే।
ద్వావేవ గ్రసతే దివాకరనిశాప్రాణేశ్వరౌ భాస్వరౌ
భ్రాతః పర్వణి పశ్య దానవపతి శ్శీర్షావశేషాకృతిః॥ 27

టీ. అన్యే=(మీఁదఁజెప్పఁబడు సూర్యచంద్రులుకాక) యితరులైన, బృహస్పతిప్రభృతయః=బృహస్పతి మొదలైనవారు(ప్రభృతిశబ్దముచే బుధుఁడు శుక్రుఁడు మొదలగువారును గ్రహింపఁబడుచున్నారు), పంచషాః (పంచషడ్వా) = అయిదుగురు-లేక-ఆఱుగురు, సంభావితాః=(పట్టుకొనుటకు దగ్గఱనే) కలవారై-లేక-గొప్పగా నెన్నఁబడినవారై, సన్తి = ఉన్నారు, తాన్ ప్రతి = వారినిగూర్చి-అబృహస్పతి మొదలగువారిని లక్ష్యపెట్టియనుట, విశేష...రుచిః-విశేష = విశిష్టులైనవారియందు - గొప్పతేజస్సుగలవారియెడల ననుట, విక్రమ=పరాక్రమము చూపుటయందు, రుచిః=ప్రీతిగలవాఁడైన-మిక్కిలి తేజోవంతులతోడనే కలహించుట కాసక్తి గలవాఁడైనయనుట, ఏష రాహుః=(గ్రహణమునకు కర్తయగుటచేఁ బ్రసిద్ధుఁడైన) ఈ రాహువు, నవైరాయతే = వైరముపెట్టుకొనఁడు -లక్ష్యపెట్టమిచే వారిని మ్రింగఁజూడఁడనిభావము. (అయితే), భాస్వరౌ = తేజస్సుగలవారైన, దివాకరనిశాప్రాణేశ్వరౌ=సూర్యచంద్రులను, ద్వావేవ = ఇద్దఱిని మాత్రమే, శీర్షా...కృతిః -శీ

ర్ష=తలమాత్రమే, అవశేష = మిగతగాఁగల, ఆకృతిః = ఆకారము (అనఁగా దేహము) గలవాఁడైన, దానవపతిః=రాక్షసశ్రేష్ఠుఁడు-రాహువు, పర్వణి=పర్వమునందు-పూర్ణిమామావాస్యలందు, గ్రసతి = మ్రింగుచున్నాఁడు. హేభ్రాతః=ఓయన్నదమ్ముఁడా-ఇది యాదరముచేత మతియొక్కనిఁ బిలిచిచెప్పట, పశ్య = చూడుము. ఇచట శీర్షావశేషాకృతిః అనువిశేషణముచేత శరీరమెల్లను లేక తలమాత్రమేమిగిలియున్నప్పుడు రాహు విట్టికృత్యముచేయఁగా నిఁక నంగములెల్లఁ బూర్ణముగా నుండినయెడల నేమిసేయునో తెలియరాదనుభావము స్ఫురించుచున్నది. ఇట్లే మానశౌర్యములుగలవాఁడు తనయంగవైకల్యమును పాటింపక గొప్పకార్యము నే చేయంబూను నని తాత్పర్యము.

మ. గురుముఖ్యుల్ గల దేవురార్యురు శుభాంగుల్ ఖేచరుల్ వారితో
  నరవిక్రాంతివిహారి రాహు వెపుడుం గ్రైరంబుసేయండు భా
  స్వరులం భాస్కరయామినీచపలనే బాధించుచున్నాఁడు ద
  త్పరతం మస్తకశేషమూర్తి యగుదైత్యుండు గర్వంబునన్.

తా. సూర్యచంద్రులేకాక బృహస్పతిమొదలైన గొప్పవారైదాలుగురుకూడ నుండినను, రాహువు మిక్కిలితేజోవంతులైనవారియెడలనే పరాక్రమము చూపఁగోరువాఁడుగావున నా యైదాలుగురిని లక్ష్యపెట్టకయు వారియెడ వైరముచూపకయు సూర్యచంద్రులు మిక్కిలితేజోవంతులుగావున వారిద్దఱితోనే విరోధించితాను * దేహమేమియులేక తలయొక్కటిమాత్రమే మిగిలియున్నవాఁడైనను, అట్టియిరువురిని పర్వములందుఁ గబళించుచున్నాఁడు.

అవ. మహాత్ములమహత్త్వమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వహతి భువనశ్రేణిం శేషః ఫణాఫలకస్థితాం
  కమఠపతినా మధ్యేపృష్ఠం సదా సచ ధార్యతే।
  తమపి కురుతే క్రోడాధీనం పయోధి రనాదరా
  దహహ మహతాం నిస్సీమాన శ్చరిత్రవిభూతయః॥ 28

టీ. శేషః = ఆదిశేషుఁడు, ఫణాఫలకస్థితాం = పలకలవంటి(వేలకొలఁది) పడగలమీఁద ఉన్నదానినిగా, భువనశ్రేణిం=(పాతాళము మొదలుగాఁగల పదునా

---

* దేవతలును రాక్షసులును గూడి సముద్రమును జిలికినప్పుడు పుట్టినయమృతమునువిష్ణువు దేవతలకుమాత్రము పంచిపెట్టుచుండఁగా రాక్షసుఁడగురాహువు దేవతావేషమున వారినడుమఁగూర్చుండి యమృతముద్రాగుటఁజూచి విష్ణువు తనచక్రముచే వానిశిరస్సును ఖండింపఁగా నాశిరస్సుమాత్రము ప్రాణముతో నిలిచియుండె నని పురాణకథ.

లుగు) లోకముల పంక్తిని, వహతి = ధరించుచున్నాఁడు, సచ = ఆశేషుఁడును కమఠపతినా=ఆదికూర్మముచే, మధ్యేపృష్ఠం (పృష్ఠస్య మధ్యే) = వీఁపునడుమ- వీఁపుఁజిప్పమీఁదననుట, సదా = ఎప్పుడును, ధార్యతే = ధరింపఁబడుచున్నాఁడు. తం అపి = ఆయాదికూర్మమునుగూడ, పయోధిః = (ప్రళయ) సముద్రము, అనాదరాత్ =పాటింపక- అనాయాసముగాననుట, క్రోడ అధీనం=పందికి (అనఁగా ఆదివరాహమునకు) లోనైనదానినిగా, కురుతే=చేయుచున్నది. ప్రళయకాలమునందుఁ బాతాళగతమైన భూమండలమును విష్ణువాదివరాహమై యవతరించి తనకోఱపంటితోఁ బైకిలేవనెత్తెననుట యిచటఁ దెలియనగును. (కాఁబట్టి), మహతాం= (మానశౌర్యములచేనొప్పు) మహానుభావులయొక్క, చరిత్రవిభూతయః = మహత్త్వవైభవములు-ప్రభావసంపదలు, నిస్సీమానః మేరలేనివి- అవాఙ్మానసగోచరము లనుట, అహహ = ఏమియాశ్చర్యము! ఇచట ముందుముందు చెప్పఁబడినవి వెనుకవెనుకఁ జెప్పఁబడినవానికి నుత్కర్షమును గలిగించుటచే మాలాదీపక మలంకారము.

మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణాభోగంబుపై సంతతం
 బవలీలన్ భరియించుఁ బృష్ఠమునఁ గూర్మాధీశ్వరుం డాతనిన్
 ధవళక్రోడ వశాత్ముఁ జేయు సతనిన్ వారాశి యశ్రాంతిచే
 నవురా! ధీరచరిత్రసంపద లసంఖ్యాతప్రభావోన్నతుల్. 28

తా. ఆదిశేషుఁ డొకటిపై నొకటి వరుసగా నుండు పదునాలుగులోకములను పలకలవలెనుండు తనపడగలచేధరించుచున్నాఁడు. అట్టిశేషునిఁదనవీఁపుమీఁద నాదికూర్మమెప్పుడును వహించుచున్నది. ప్రళయకాలసముద్రజలములచే భూమండలముతోఁగూడఁబాతాళ మంటినయాకూర్మమును ఆదివరాహము ధరించుచున్నది. కాఁబట్టి మానశౌర్యసంపన్ను లగుమహాత్ములయొక్క ప్రభావములు మిక్కిలి యాశ్చర్యకరములుగా నున్నవి.

అవ. మానశౌర్యములు గలవారికే యిట్టిమహత్త్వము గాని యవిలేనివారికిఁ గా దని మైనాకుని దృష్టాంతముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వరంప్రాణోచ్ఛేద స్సమదమఘవన్ముక్తకులిశ
 ప్రహారై రుద్గచ్ఛద్బహులదహనోద్గారగురుభిః।
 తుషారాద్రే స్సూనో రహహ పితరి క్లేశవివశే
 న చాసౌ సమ్పాతః పయసి పయసాం పత్యు రుచితః॥ 29

టీ. తుషారాద్రేః = మంచుకొండయొక్క - హిమవంతునియొక్క, సూనోః = పుత్రుఁడగు మైనాకునికి, ఉద్గచ్ఛత్...గురుభిః - ఉద్గచ్ఛత్ = విజృంభించుచున్న-పైకి మిక్కిలిరేఁగుచున్న, బహుల=అధికమైన, దహన=(రాతితో నొరసికొనుటవలనఁబుట్టిన) నిప్పు, ఉద్గార = క్రక్కుటలవలన, గురుభిః = సహింపరాని

వైన-నిప్పుకలు మిక్కుటముగా రేఁగుటచే భరింప శక్యముకానివైన యనుట, సమ
ద... ప్రహారైః-సమద = గర్వముతోఁగూడిన, మఘవత్=ఇంద్రునిచేత, ముక్త =
ప్రయోగింపఁబడిన, కులిశ = వజ్రాయుధముయొక్క, ప్రహారైః = వ్రేటులచేత -
ఇంద్రుఁడు కొండను వజ్రముతో వ్రేట్లువేయఁగా నది యాకొండతాలితో నొరసికొ
నుటచేఁ బుట్టిన పెనునిప్పుమంటలతోఁ గూడి యావ్రేట్లు మిక్కిలి సహింపఁగూడని
వగుచున్న దనుట, ఇట్టివ్రేటులచేత, ప్రాణ ఉచ్ఛేదః=ప్రాణముఁ బాయుట - మర
ణము, వరం=కొంతమంచిది. ఏలనఁగా, అహహ=అకటకటా, పితః=తండ్రియగు
హిమవంతుఁడు, క్లేశవివశే(సతి]-క్లేశ=(వజ్రపుదెబ్బలచేఁ బుట్టిన) దుఃఖముచే, వివ
శేసతి=విహ్వలించుచుండఁగా-అవయవముల స్వాధీనత తప్పియుండఁగా ననుట, ప
యసాం పత్యుః = (జలముల కధిపతియైన) సముద్రునియొక్క, పయసి=నీటియం
దు. అసౌ=ఈ -ఇప్పటికిని దెలియుచున్న యనుట, సమ్పాతః=పడుట - తనప్రాణ
రక్షణముకొఱకు మునిఁగి పడియుండుట, ఉచితః = తగినది, నభవతి=కాదు, వీనికి
అని శేషము. మానశౌర్యములు గలపురుషుఁడు తనప్రాణములనుమాత్రము కాపాడుకొ
నఁగోరి యెచటనైన మఱుఁగుపడియుండుటయే మిక్కిలి యపకీర్తికరము. ఇఁక తం
డ్రి దుఃఖవివశుఁడై యుండఁగా నట్లుండెనేని ఏమనవచ్చును. కావున ప్రాణములు
విడిచియైనను మానశౌర్యములనే మిక్కిలి నిలుపుకొనవలయును. లేనియెడలమిగుల
నపవాదము కలుగునని భావము. ఇచట ఉద్గారశబ్దము గౌణమగుటచే గ్రామ్యము
కాకసౌందర్యాతిశయమునే కలిగించుచున్నది. ఇందులకుఁ బ్రమాణము 'నిష్ఠ్యూతో
ద్గీర్ణవాన్తాదిగౌణవృత్తివ్యపాశ్రయః । అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం వ్యగా
హతే' అని దండ్యాచార్యులు.

చ. సమధికభీషణజ్వాలనజాలవినిర్గమదుస్సహంబుచే
సమదసురేంద్రముక్తకులిశక్షతిచే నుచితంబు ప్రాణఘా
తము హిమవత్కుమారునకుఁ దండ్రి నిశాతశతారపాతఖే
దమున మునుంగుచున్నతఱిఁ దా జలరాశిఁ దొలంగ నర్హమే.

తా. హిమవంతునికొడుకగుమైనాకునికి, నింద్రుఁడు గర్వించి వజ్రాయుధ
ముచేనిప్పులు రేఁగునట్లు కడుదుస్సహముగా వ్రేయువ్రేటులచేతఁ జచ్చుటయే కొంత
మంచిదికాని, యట్లు తనతండ్రి యగుహిమవంతుఁడు వజ్రప్రహారములచే దుఃఖపడి
తబ్బిబ్బు నొందుచుండఁగాఁ దాను సముద్రజలములోఁ దాఁగికొని తన్నుమాత్రము కా
పాడుకొనుట తగదు.

అవ. మానవంతులు పరులు చేయునవమానము నోర్వఁజాల
రని దృష్టాంతముతోఁ గూడఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ య దచేతనోఽపి పాదైః స్పృష్టః ప్రజ్వలతి సవితు రినకాన్తః।
త త్తేజస్వీ పురుషః పరకృతనికృతిం కథం సహతే॥ 30

టీ. యత్ =ఎందుచేత, అచేతనః అపి=చేతనములేనిదైనను - పాషాణమగుటచే జీవములేని దైనప్పటికి ననుట, ఇనకాన్తః = సూర్యకాంతమణి, సవితుః = సూర్యునియొక్క, పాదైః=కిరణములచేత, స్పృష్టః=తాఁకఁబడినదై, ప్రజ్వలతి=మిక్కిలి ప్రకాశించుచున్నదో - (ఇచట సూర్యకాంతమణిని మానముగలదానినిగాను వర్ణించుటచే మణిపరముగాను మానిపరముగాను నర్థములు సేయవలయును కాఁబట్టి సూర్యకాంతమణి సూర్యునియొక్క), పాదైః=కాళ్లచేత, స్పృష్ట, =కొట్టఁబడినదై, ప్రజ్వలతి=కోపముచే మండిపడుచున్నదో (అని యర్థాంతరము), తత్=అందుచేత, తేజస్వీ=తేజముగల-మానశౌర్యములు గల యనుట, పురుషః=పురుషుఁడు- సచేతనుఁడు అని యిచట శేషము, పర...నికృతిం - పర=శత్రువులచేత, కృత=చేయఁబడిన, నికృతిం=అపకారమును, కథం సహతే =ఎట్లు ఓర్చును? ఎట్లును ఓర్వఁ డనుట - మైనాకుఁడో యిట్టిమానవంతుఁడు గాఁ డని భావము.

గీ. అర్కకాంత మచేతనం బయ్యు సవితృ
పాదములు సోఁకినంతనే ప్రజ్వరిల్లుఁ
గాన నభిమానవంతుఁ డెం దయిన శత్రు
కృతతిరస్కార మెట్లు సహింప నేర్చు? 30

తా. సూర్యకాంతమణి సూర్యునిపాదములు తనకుఁ దగులఁగానే మిక్కిలి జ్వలించుచున్నది (మండిపడుచున్నది). అచేతన మైనయామణియే పరులు చేయునపకారమును సహింపకుండఁగా సచేతనుఁడును మానశౌర్యసంపన్నుఁడు నైనపురుషుఁ డెట్లు సహింపఁ గలఁడు?

అవ. పరాక్రమమునకు వయస్సు గారణము గాదని చెప్పి యీ పద్ధతిని ముగించుచున్నాఁడు.

శ్లో॥ సింహ శ్శిశురపి నిపతతి మదమలినకపోలభిత్తిషు గజేషు।
ప్రకృతి రియం సత్త్వవతాం నఖలు వయ స్తేజసాం హేతుః॥ 31

టీ. శిశుః అపి = శిశువైనప్పటికిని - పరాక్రమము చూపుటకు యోగ్యము కాని బాల్యావస్థయందున్నదైనప్పటికి ననుట, సింహః=సింగము- మద...భిత్తిషు- మదమలిన= మదజలములచే బురద యైన, కపోలభిత్తిషు=గోడలవంటిచెక్కిళ్లు గల, గజేషు=ఏనుఁగులయందు - మదపుటేనుఁగులమీఁద ననుట, నిపతతి = (కుంభస్థలము చీల్చుటకొఱకు) పడుచున్నది. ఇయం=ఇది - బాల్యావస్థయందైనను ఇట్లు విక్ర

మను చూపుట, సత్త్వవతాం=బలాఢ్యులకు, ప్రకృతిః=స్వభావము. ఎట్లనఁగా, వయః=వయస్సు, తేజసాం= ప్రతాపముగలవారికి, (తేజశ్శబ్దమునకు కేవలతేజస్సని యర్థము. దాని నిచట అభేదాధ్యవసాయముచే తేజస్సు గలవారికిఁ బ్రయోగించుట వా రత్యంత తేజోవంతు లని తెలుపుట కని తెలియనగును.) హేతుః = కారణము, న ఖలు = కాదుగదా. 'తేజసాంహి న వయః సమీక్ష్యతే' అనున్యాయ మిచట ననుసంధింపఁదగును.

క. విదళింప నుఱుకుసింగపుఁ
గొదమయు మదమలినగండకుంజరములపై
నిది బలశాలికి నైజము
గద తేజోనిధికి వయసు కారణ మగునే? 31

తా. సింహము పరాక్రమము చూప యోగ్యము కానట్టిశిశుత్వదశయం దుండి నను మదజలముచే తడిసిగొని గోడలవలె గట్టివై విశాలములై యున్న చెక్కిళ్లచే నిక్కుచున్న యేనుఁగుల కుంభస్థలములను జీల్చుటకు వానిమీఁది కెగిరి పడుచున్నది. ఇట్లు బాల్యమైనప్పటికిని బరాక్రమము చూపుట బలవంతులస్వభావముగా నున్నది. ఏలనఁగా, తేజస్సునకు వయస్సు కారణము గాదు.

ఇది నీతిశతకమునందు మానశౌర్యపద్ధతివర్ణనమన్నది తృతీయదశకము.

---

## నీతిశతకము - అర్థపద్ధతి.

---

అవ. మానశౌర్యముల నిరూపించిన వెనుక వానికి మూల మర్థ మగుటచే నర్థపద్ధతిని నిరూపించుచున్నాఁడు. అందు మొదటఁ గేవల మర్థపరాయణు లైనవారిమతప్రకారమున నర్థమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ జాతి ర్యాతు రసాతలం గుణగణ స్తత్రాప్యధో గచ్ఛతాత్
శీలం శైలతటా త్పత త్వభిజన స్సన్దహ్యతాం వహ్నినా।
శౌర్యే వైరిణి వజ్ర మాశు నిపత త్వర్థోఽస్తు నః కేవలం
యే నైకేన వినా గుణా స్తృణలవప్రాయా స్సమస్తా ఇమే॥ 32

టీ. జాతిః=బ్రాహ్మణత్వము మొదలైనజాతులు, రసాతలం=రసాతల మను లోకమును గూర్చి, యాతు=పోవునుగాక - భ్రంశమునొందునుగాక యనుట, గుణ గణః=(ధైర్యము ఔదార్యము శౌర్యము మొదలైన) గుణములసమూహము, తత్రాపి=దానికంటెను- ఆరసాతలముకంటెను, అధః=క్రిందుగా-అనఁగా పాతాళలోక మును, గచ్ఛతాం = పొందునుగాక - జాతికంటె మతింతభ్రంశము నొందుఁగాక

యనుట, శీలం=మంచిస్వభావము, శైలతటాత్=కొండచఱియవలననుండి, పతతు=
పడునుగాక-పటాపంచలై పోవునుగాక యనుట, అభిజనః=వంశము, వహ్నినా=
నిప్పుచేత, సందహ్యతాం=కాల్పఁబడునుగాక, వైరిణి=(మనస్సును మిక్కిలి కలంచు
టచే) శత్రువు (వంటిది) అయిన, శౌర్యే=శూరత్వమునందు - శూరత్వము తలమీఁద
ననుట. ఆశు=శీఘ్రముగా, వజ్రం=పిడుగు, నిపతతు = పడునుగాక - పిడుగుపడి
యది ధ్వంసమునొందునుగాక యనుట, నః=మాకు, కేవలం అర్థః = ద్రవ్యముమా
త్రమే, అస్తు=కలుగునుగాక-ఇదియే మాకు పరమార్థమనిభావము. యేన ఏకేన వి
నా=ఏదియొకటి లేక, ఇమే=ఈపూర్వోక్తములైన, సమస్తాఃగుణాః=సమస్తమైన
జాతికులశీలాభిమానాదిగుణములు, తృణలవప్రాయాః=గడ్డిపరకలతో సమానము
లో - వానివలె నిస్సారములైనవనుట. కావున గుణమహిమకు ద్రవ్యమే మూల
ము గనుక దానినే సంపాదింపవలయు నని భావము. * 'ధన మార్జయ కాకుత్స్థ
ధనమూల మిదం జగత్। అన్తరంనాభిజానామి నిర్ధనస్య మృతస్యచ॥' అను లక్ష్మ
ణవాక్యమే ఇట సిద్ధాంతము. †'అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాంచ రక్షణే।
రక్షితానాం వ్యయే దుఃఖం ధి గర్థం దుఃఖభాజనమ్'॥ అను మనుస్మృతి యశక్తు
లగువారిని గుఱించినదని తలంపఁదగును.

ఉ. జాతి దొలంగుఁగాత గుణశక్తి రసాతలసీమకుం జనుం
గాత కులంబు బూది యగుఁగాత నగంబుననుండి శీలముం
బాతముఁ జెందుఁ గాత బహుభంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాతగుణంబు లెల్లఁ దృణకల్పము లొక్కధనంబు లేవడిన్. 32

తా. జాతి రసాతలమునకు జాఱిపోవునుగాక. శౌర్య ధైర్యాదిగుణములు
మఱింత భ్రంశమునొంది పాతాళమునకుఁ బోవుఁగాక. శీలము పటాపంచలగునుగాక.
వంశము నిప్పుతగిలి భస్మమగునుగాక. మనస్సునుగలంచునట్టి విరోధియగు శూరత్వము
యొక్క తలయందుఁ బిడుగు పడునుగాక. ఈగుణములెల్ల నశించినను మాకేమికొఱఁ
తలేదు. మేము కోరినదెల్ల ద్రవ్యమొకటియే. అదియే మాకు పరమార్థము. మేలిమిని
గలిగించునట్టివిగా వాసికెక్కిన పూర్వోక్తగుణములెల్లఁ జెడుటకును సమ్మతించి ద్రవ్య
మొక్కటినే కోరెదము. ఏలనఁగా నదియొకటి లేనియెడల నీగుణములన్నియు గడ్డి
పరకవలె నిస్సారములే యగును.

అవ. గుణములు లేనియెడలఁ గేవలద్రవ్య మేమియును జేయఁ

---

* కాకుత్స్థా! ద్రవ్యము నార్జింపుము. ఈజగత్తు ద్రవ్యమూలము. ద్రవ్యము లేనివానికిని జచ్చినవానికిని భేదమును నేను గనిపట్టఁజాలను.

† ద్రవ్యముల నార్జించునపుడు దుఃఖము కలుగుచున్నది. ఆర్జించినవానిని రక్షించునపుడును, అట్లు రక్షించినవానిని వెచ్చించునపుడును దుఃఖము కలుగుచున్నది. ఇసీ! ద్రవ్యము దుఃఖమున కాస్పదము.

జాలదే యని శంక రాఁగా నాద్రవ్యమే యుండెనేని నదియే సమస్త గుణములనుగూడఁ గలిగించుచున్న దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యస్యాస్తి విత్తం సనరః కులీనః, సపణ్డిత స్స శ్రుతవాన్ గుణజ్ఞః।
సఏవ వక్తా సచ దర్శనీయః, సర్వేగుణాః కాఞ్చన మాశ్రయన్తి॥౩౩

టీ. యస్య=ఎవనికి, విత్తం=ద్రవ్యము, అస్తి=కలిగియున్నదో, సనరః=ఆపురుషుఁడు, కులీనః=గొప్పకులమునఁబుట్టినవాఁడు, స (ఏవ)=వాఁడే, పణ్డితః=విద్వాంసుఁడు, సః=వాఁడే, శ్రుతవాన్=శాస్త్రజ్ఞుఁడు-(లేక) శ్రుతమనఁగా వినుట గనుక ధర్మశాస్త్రాదులను వినుటయందు నేర్పరియైనవాఁ డనియు నర్థము. సఏవ=వాఁడే, గుణజ్ఞః=గుణములను గ్రహించువాఁడు. సఏవ=వాఁడే, వక్తా=వాగ్మి-లెస్సగా మాటలాడువాఁడు. సచ=వాఁడే, దర్శనీయః=చూడఁదగినవాఁడు. సుందరుఁ డనుట. కులీనత పాండిత్యము మొదలైన పూర్వోక్తగుణములు లేకుండినను ద్రవ్య మొకటి యుండెనా యాయన్నిగుణము లుండినట్లే యని భావము. ఎట్లనఁగా, సర్వేగుణాః= పూర్వోక్తగుణములెల్ల, కాఞ్చనం=ద్రవ్యమును, ఆశ్రయన్తి=ఆశ్రయించుచున్నవి. కాఁబట్టి యది యుండినయెడల దానితోఁగూడ తక్కినగుణములును నుండునని గ్రాహ్యము. ఇచట ద్రవ్యమునకు నిట్టిగుణములసంబంధము లేకున్నను సంబంధమును జెప్పుటచే నతిశయోక్తి యలంకారము.

క. ఏనరునకు విత్తముగల, దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు నేర్పరి, నానాగుణగణము కాంచనంబునఁ నిలుచున్.

తా. ఒకనికిఁ గులము, పాండిత్యము,శాస్త్రజ్ఞత, గుణగ్రాహిత్వము, వక్తృత్వము, సౌందర్యము మొదలైనగుణములు లేకుండినను విద్యయొకటి యుండెనా వాఁ డాగుణము లన్నియుఁ గలవాఁడే యనుచున్నాఁడు. ఆగుణములులేక ద్రవ్య మొకటి మాత్ర ముండుటచేత నాగుణములన్నియు నెట్లుకలుగునని శంకింపవలదు. ఆగుణము లన్నియు ద్రవ్యము నాశ్రయించియే యుండునవిగనుక నదియున్నచో దానిలోఁగూడ నాగుణములు నుండును.

అవ. ఇదిమొదలుకొని రెండుశ్లోకములచే ద్రవ్యమునకు నాశము గలుగువిధమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ దౌర్మన్త్ర్యా న్నృపతి ర్వినశ్యతి యతి స్సఙ్గా త్సుతో లాలనా
ద్విప్రోఽనధ్యయనా త్కులం కుతనయా చ్ఛీలం ఖలోపాసనాత్।
హ్రీ ర్మద్యా దనవేక్షణా దపి కృషిః స్నేహః ప్రవాసాశ్రయా
న్మైత్రీ చాప్రణయా త్సమృద్ధి రనయా త్త్యాగాత్ప్రమాదా ద్ధనమ్॥

టీ. నృపతిః=రాజు, దౌర్మంత్ర్యాత్-దుష్టమైనమంత్రము గలవానిగనుచే- చెడ్డమంత్రము గలిగియుండుటచేత ననుట, (మంత్రమనఁగా సంధివిగ్రహము మొదలైన

షడ్గుణములను వివేచించి (ప్రయోగించుట), వినశ్యతి=నశించుచున్నాఁడు. మంత్రము వికలమైనయెడల శత్రువులకు వీలుకలిగి వానిరాజ్యాదుల నపహరింతురని భావము. లేక, దౌర్మంత్ర్యాత్ = దుష్టులైనమంత్రులఁ గలిగియుండుటచేత, చెడుచున్నాఁడనియుఁ జెప్పవచ్చును. అట్టిమంత్రులు దండింపఁ దగనివాని దండింపుమనుట మొదలైనపాపములరాజున కుపదేశించుటచే వానికి సంపదమొదలైనవి తొలఁగిపోవుచున్న వని భావము. * 'సన్మన్త్రిణా వర్ధయతే నృపాణాం లక్ష్మీర్మహీధర్మయశస్సమూహః। దుర్మన్త్రిణా నాశయతే తథైవ లక్ష్మీర్మహీధర్మయశస్సమూహః॥'' అను వచన మిచట ననుసంధేయము. యతిః=యోగి, సఙ్గాత్ =సాంగత్యమువలన, నశ్యతి=చెడుచున్నాఁడు. సంగమునకు కామక్రోధాదులు మూలమగుటచే నవి పుట్టినయెడ వానియోగము నశించుచున్నదనుట. '†సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే। క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః.' అనుగీతావచన మిట బోధ్యము. సుతః = కొడుకు, లాలనాత్ =బుజ్జగించుటచేత, నశ్యతి = (గుణహీనుఁడై) చెడుచున్నాఁడు. ‡ 'లాలనా ద్బహవో దోషా స్తాడనా ద్బహవో గుణాః॥తస్మాత్పుత్రంచ శిష్యంచ తాడయేన్నతు లాలయేత్॥ ' అనున్యాయ మిటఁ దెలియఁదగును, విప్రః = బ్రాహ్మణుఁడు, అనధ్యయనాత్ =(వేదశాస్త్రాదుల చదువక పోవుటచేత, నశ్యతి=నశించుచున్నాఁడు-నీచుఁడగుచున్నాఁడనుట. ¶ 'వేదవేదాఙ్గతత్త్వజ్ఞో విప్రః సర్వత్ర పూజ్యతే। అనధీతశ్రుతి ర్విప్రః సభామధ్యే నశోభతే' అనుట నిట నెఱుంగవలయును. కులం=వంశము, కుతనయాత్ = దుష్టపుత్త్రునివలన నశ్యతి =చెడుచున్నది. § 'కోటరాన్తర్భవో వహ్ని స్తరుమేకం దహిష్యతి। కుపుత్త్రస్తు కులేజాతః స్వకులంనాశయే త్పరమ్॥' అనున్యాయ మిచట ప్రమాణము. శీలం=మంచిస్వభావము, ఖల ఉపాసనాత్ =దుర్జనులను సేవించుటవలన, నశ్యతి=

---

* రాజుల లక్ష్మియు, రాజ్యమును, ధర్మమును, కీర్తిసమూహమును మంచి మంత్రిచేత వర్ధిల్లుచున్నవి. అట్లె చెడ్డమంత్రిచే నశించుచున్నవి.

† సంగమమువలన కామమును, కామమువలన క్రోధమును, క్రోధమువలన సమ్మోహమును, సమ్మోహమువలన స్మృతి తప్పుటయుఁ గలుగుచున్నవి.

‡ లాలించుటవలన బహుదోషములును, కొట్టుటవలన బహుగుణములును కలుగుచున్నవి. కాఁబట్టి పుత్త్రుని శిష్యుని కొట్టవలయునే కాని లాలింపరాదు.

¶ వేదవేదాంగములతత్త్వములఁ దెలిసినబ్రాహ్మణుఁడు అంతటను బూజింపఁ బడుచున్నాఁడు. వేదములఁ జదువనిబ్రాహ్మణుఁడు సభామధ్యమునఁ బ్రకాశింపఁడు.

§ చెట్టుతొఱ్ఱలో బుట్టిననిప్పు ఆచెట్టు నొక్కటినే దహించుచున్నది. కులమునందుఁ బుట్టినదుష్పుత్త్రుఁడు కులము నెల్ల నాశము సేయును.

(వారు మిక్కిలి యనర్థము కలిగించువా రగుటచే) చెడుచున్నదనిభావము. *'ఛాదయిత్వాఽత్మనో భావం చరన్తి శఠబుద్ధయః। ప్రహరన్తిచ రన్ధ్రేషు సోఽనర్థః సుమహాన్ భవేత్' అనువాక్యమిచట గ్రాహ్యము. హ్రీః=లజ్జ- రోఁతపుట్టించుపనులు సేయుటవలననుండి తొలఁగునట్టిగుణ మనుట, మద్యాత్ = కల్లు (త్రాగుట) వలన, నశ్యతి =చెడుచున్నది. † 'అయుక్తం బహుభాషన్తే యత్రకుత్రాపి శేరతే। నగ్నా విక్షిప్య గాత్రాణి తే జాల్మాఇవ మద్యపాః॥' అనుట నిట భావ్యము, కృషిః=సస్యము, అనవేక్షణాత్=(నిత్యమును) చూచుకొనకపోవుటచేత, నశ్యతి = చెడుచున్నది. ‡ 'కృషించ పత్నీమనవేక్ష్య యః పుమా నన్యాని కార్యాణి సమాచరేచ్చ। తే త్వేవ మేవంచ సమాకులే ద్వే తథేతి బాధానిచయంచ యాతి' అనుట యూహ్యము. స్నేహః =ఆఁడుబిడ్డలయందుఁ బుట్టినమోహము, ప్రవాస ఆశ్రయాత్= దేశాంతరసంచారమును అవలంబించుటవలన, నశ్యతి=చెడుచున్నది. ¶ 'సుతాఙ్గనాబన్ధుషు సోదరేషు నృపేషు భృత్యేషుచ జాతమోహః ప్రవాసమాత్రేణహి నశ్యతేఽఖిలంచిరం ప్రవాసేన హరత్యశేషమ్' అనువచన మిచట నూహ్యము. మైత్రీ= మిత్రభావము, అప్రణయాత్= అనురాగము లేమివలన, నశ్యతి=చెడుచున్నది. §'మృద్ఘటఇవ సుఖభేద్యో దుస్సన్ధానశ్చ దుర్జనో భవతి । సుజనస్తు కనకఘటఇవదుర్భేద్య శ్చాశుసన్ధేయః' అనుట నిటఁ దెలియవలయును. సమృద్ధిః=సంపత్తి, అనయాత్ =నీతిలేమివలన, నశ్యతి =చెడుచున్నది. 'రక్షాయాం స్వమతి క్షితిపత్యధికరం శిక్షాగుణైర్లభ్యతే। విద్వేష్టిస్వజనం త్యజ త్యవనతిం మృద్నాతి మార్గస్థితాన్ । భూతిం నేచ్ఛతియోజనా త్పరిలిభయం దుర్వృత్మనాగచ్ఛతి । క్రూరాగ్రం వినయాంకుశం నసహతే భూపాలమత్తద్విపః॥' అనుట తెలియనగును. ధనం=ద్రవ్యము, త్యాగాత్ =

---

* కుత్సితబుద్ధు లగువారు, తమ కుత్సితభావమును గప్పిపుచ్చుకొని (బయటికి మంచివారివలె నగపడుచు సమయమువేచి) తిరుగుచుందురు. సందులు దొరకినా వానిమూలమునఁ గొట్టుదురు. అందుచే మిక్కిలి యనర్థకము కలుగును.

† కల్లుద్రాగువారు ముందు వెనుక యోచింపనిక్రూరులవలెఁ దగనిమాటలు పెక్కు లాడుదురు; దిగంబరులై యవయవము లెగాదిగ వైచుకొని యెచ్చటఁ దలఁచిన నచ్చటఁ బరుండుదురు.

‡ పైరును పెండ్లమును జూచుకొనక యితరకార్యములనే చేయుచుండువానికా రెండు నట్లట్లు దక్కక చెదరిపోవును. వాఁడును పెక్కుబాధలపా లగును,

¶ ఆఁడుబిడ్డలు, చుట్టములు, తోఁబుట్టువులు, రాజులు, సేవకులు మొదలైన వారియెడలఁ గలిగిన మోహము, దేశాంతరము పోయినంతమాత్రముననే నశించుచున్నది. ఇఁక చిరకాలము దేశాంతరమున వసించియున్నయెడల నది బొత్తిగా నశించును.

§ దుర్జనుని మట్టికుండవలె సుఖముగా భేదింపవచ్చునుగాని మరల సంధించుట కష్టము. సజ్జనుని బంగారుకుండవలె భేదించుట కష్టముగాని మరల సంధించుట సులభము.

దానమువలననుగాని, ప్రమాదాత్ = పరాకువలననుగాని, నశ్యతి=నశించుచున్నది. పరాకువలన ధనముపోవుట యనుభవసిద్ధమే. దానమువలన ధనముపోవుట నుత్తర శ్లోకమే చెప్పుచున్నది. శిష్టానాం గర్హణాన్నాశః సదాచారవివర్జనాత్' అనుటచే శిష్టులైనవారి నిరసించుటవలనను సదాచారమును వదలుటవలనను ధనము నశించు చున్నదని తెలియనగును.

మ. యతి సంగంబున బాలుఁ డాదరముచే ♦ జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతిహీనిర్ద్విజుఁ డన్వయంబు ఖలుచేఁ ♦ గ్రూరాప్తిచే శీలము
ధృతిచే మిత్రత చూపులేమిఁ గృషి మ♦ద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలుర్వి నశించుఁ జెడు న♦ర్థంబుల్ ప్రమాదంబునన్. 34

తా. దుర్మంత్రము సేయుటవలన (లేక) దుర్మంత్రులమాట వినుటవలన రాజును, సంగమువలన యోగియు, లాలనమువలనఁ బుత్త్రుఁడును, వేదశాస్త్రాధ్యయనము లేమివలన బ్రాహ్మణుఁడును, దుష్పుత్త్రునివలనఁ గులమును దుర్జనుల సేవించుటవలన శీలమును, గల్లు ద్రాగుటవలన లజ్జయు,నిత్యము పరామర్శలేకపోవుటవలనఁ బైరును, దేశాంతరము పోవుటవలన నాలుబిడ్డలు మొదలైనవారియందలి మోహమును, అనురాగము లేమివలన మైత్రియు, నీతిలేమివలన సంపదయు, దానమువలనఁ గాని హెచ్చరిక లేకుండుటవలనఁగాని ధనమును నాశమగును.

అవ. ధనము ఉత్తమమధ్యమాధమము లని మూఁడువిధము లుగా నుండుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ దానం భోగో నాశ, స్తిస్రో గతయో భవన్తి విత్తస్య।
యో న దదాతి న భుఙ్క్తే, తస్య తృతీయా గతి ర్భవతి॥ 35

టీ. దానం=సత్పాత్రమునకు దానముసేయుట, భోగః=హారచందనాదుల ననుభవించుట, నాశః =(దానధర్మములు సేయకున్నయెడల దొంగలు మొదలైనవారిచే) నాశమగుట, (అని) విత్తస్య=ధనమునకు, తిస్రః=మూఁడు, * గతయః =పోకడలు- వ్యయమై పోయెడి యుపాయము లనుట, భవన్తి=కలవు. ఈమూఁడుగతులును వరుసగా ఉత్తమ మధ్యమాధమములని యెఱుఁగునది. యః=ఎవఁడు, నదదాతి= యాచకులకునీయఁడో (ధనమును అని శేషము),నభుఙ్క్తే=తానును అనుభవింపఁడో, తస్య=వానియొక్క-దానభోగములచే ధనము వ్యయము చేయని పురుషునియొక్క యనుట, (విత్తస్య=ధనమునకు అని శేషము) తృతీయాగతిః = మూఁడవగతి-అనఁగా

---

* 'చత్వారో ధనదాయాదా ధర్మాగ్నినృపతస్కరాః। తేషాం జ్యేష్ఠావమానేన త్రయః కుప్యన్తి సోదరాః' ధర్మము, అగ్ని, రాజు, దొంగ యని ధనమునకు దాయాదులు నలుగురు. అందు పెద్దదియగు మొదటిదానిని (ధర్మమును) అవమానించుటచే తక్కినదాని ముగ్గురు తోఁబుట్టువులు కోపము నొందుదురు; అనుశ్లోక మిచట అనుసంధింపఁదగును.

నాశము, భవతి=కలుగుచున్నది. ఆనాశావస్థయె మిక్కిలికష్టప్రదమైనదని భావము. ధనమునకు దానముచే వ్యయమగుట యుత్తమము, తానుభోగించుటచే వ్యయమగుట మధ్యమము, దొంగలు మొదలైనవా రెత్తికొని పోవుటచే నాశమగుట యధమమని తెలియునది. కావున ధనాఢ్యులైనవారు దానతత్పరులై యుండవలయు నని భావము.

క. దానము భోగము నాశము
పూనికతో మూఁడుగతులు గ భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనునిధనమునకు గతి తృతీయమె పొసఁగున్, 35

తా. సత్పాత్రమున కిచ్చుట, తాననుభవించుట, దొంగలుమొదలైనవా రెత్తి కొనిపోవుటచే నశించుట, అనిధనము పోవుటకు మూఁడుగతులుగలవు. ఈమూఁటిలో నేదైన నొకగతి దానికిఁ దప్పక కలుగవలయును. ఎవఁడు ధనము నొకరికిఁ బెట్టక తాను ననుభవింపకయుండునో వానిధనమునకు మొదటిరెండుగతులును లేనందున దొంగలు మొదలగువా రపహరించుట యనెడిమూఁడవగతియే తప్పక కలుగును.

అవ. దానశీలునికి దానముచే ధనమెల్ల వ్యయమైపోవుటవలనఁ గలుగుకృశత్వముకూడ వానికిశోభ నేకలుగఁజేయునని చెప్పచున్నాఁడు.

శ్లో. మణి శ్శాణోల్లీఢః సమరవిజయీ హేతిదళితో
మదక్షీణో నాగః శరది సరి దాశ్యానపులినా।
కలాశేష శ్చన్ద్రః సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభ న్తే గళితవిభవా శ్చార్థిషు నరాః॥ 36

టీ. శాణ ఉల్లీఢః=సానచాలిచే ఒరపెట్టఁబడిన- సానపెట్టఁబడిన యనుట, మణిః=రత్నమును, హేతిదళితః=ఆయుధముచే గాయపఱుపఁబడిన, సమరవిజయీ= యుద్ధమునందు జయముగలవాఁడును-రణశూరుఁడు ననుట, మదక్షీణః = మదజలము (మిక్కిలికాఱుట)చేత కృశించినట్టి, నాగః=గజమును, శరది=శరత్కాలమునందు, ఆశ్యానపులినా=కొంచెముగా నెండియున్నయిసుకతిన్నెలు గల, సరిత్=నదియును, కలాశేషః=పదునాఱవపాలుమాత్రము-అనఁగా పదునాఱుకళలలో నొక్కకళ మాత్రము మిగిలియున్నట్టి, చన్ద్రః=చంద్రుఁడును, 'కలాతు షోడశో భాగః'అని యమరము. తక్కిన పదునైదుకళలను వరుసగా నగ్ని మొదలైనదేవతలు త్రాగుచున్నా రనుట యితిహాసప్రసిద్ధము. సురతమృదితా=మన్మథయుద్ధముచే(రతిక్రీడచేనన్నట) మర్దింపఁబడిన-అనఁగావిహ్వలించునదిగాఁ జేయఁబడిన, బాలవనితా=ముగ్ధస్త్రీయును, అర్థిషు=యాచకులవిషయమందు, గళితవిభవాః=పోయినద్రవ్యసంపత్తి గలవారైన -

యాచకుల కవ్వారిగాఁ దమసంపత్తినెల్ల దానముచేసి పేదవడినవారైన యనుట, నరాశ్చ=మనుష్యులును-దాతలనుట,తనిమ్నా=కృశత్వముచేత, శోభన్తే=ప్రకాశించుచున్నారు - ఇట్టి కృశత్వమే వారికి శోభాకర మని భావము.

ఇచట ప్రస్తుతములైనమణ్యాదులకును నదులకును ఏకధర్మాన్వయముచే ఔపమ్యము గమ్యమగుచుండుటఁబట్టి దీపకాలంకారము.

ఉ. శాణవిఘృష్టరత్నమును శస్త్రహతుం డగుశూరుఁడుర్ మద
క్షీణగజంబు సైకతవిశిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసురతాలసబాలికయున్ ధనైకవి
శ్రాణనశూరులుం గడుఁ గృశత్వమునం బ్రభఁ గాంతు రిద్ధరన్. 36

తా. సానపెట్టఁబడిన రత్నమును, ఆయుధపుదెబ్బలు దగిలియున్న రణశూరుఁడును, మిక్కిలి మదజలము స్రవించుటచేఁ జిక్కిన యేనుఁగును, శరత్కాలమందుఁ గొంచెమెండినట్టియిసుకతిన్నెలు గలనదియును, నొక్కకళమాత్రమేగల చంద్రుఁడును, రతిక్రీడయందు నలఁగి పరవశయైయున్న ముగ్ధకాంతయును, తమద్రవ్యమును యాచకులకొసంగి బీదలైనదాతలును, ఎంత కృశించినప్పటికిని ఆకృశత్వమే వారికి మఱింత శోభ కలిగించుచున్నది.

అవ. పురుషులకు ధనము కలిగినప్పుడు నది లేనప్పుడును గలుగు దశను (స్థితిని) జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే
స పశ్చా త్సమ్పూర్ణః కలయతి ధరిత్రీం తృణసమామ్।
అత శ్చానేకాన్తా గురులఘుతయార్థేషు ధనినా
మవస్థా వస్తూని ప్రథయతి చ సఙ్కోచయతి చ॥ 37

టీ. కశ్చిత్=(ధనవంతుఁడగు) ఒకానొకపురుషుఁడు, పరిక్షీణః-దైవికముగా దరిద్రుఁడై, యవానాం=యవధాన్యములయొక్క, ప్రసృతయే=పుడిసెఁడుకొఱకు, స్పృహయతి = కోరుచున్నాఁడు-యవ లొకపుడిసెఁడుమాత్రమే మిక్కిలిగొప్పగాఁ గోరుచున్నాఁడనుట. సః = వాఁడు-ఆదరిద్రుఁడై యున్నవాఁడనుట,పశ్చాత్=పిదప-కాలాంతరమునందనుట, సంపూర్ణః=(దైవవశమున) ధనసంపన్నుఁడై, ధరిత్రీం=భూమిని, తృణసమాం=గడ్డిపోఁచతో సమానమైనదానినిగా-దానివలె చులుకనైనదిగాననుట, కలయతి=తలఁచుచున్నాఁడు-ధనమదముచేత దాని నట్లు చూచుచున్నాఁడనుట. అతశ్చ=కాఁబట్టియే, అర్థేషు=(యవలు, భూమి మొదలైన) వస్తువులవిషయమున, గురులఘుతయా=గురుత్వలఘుత్వములచేత-గొప్పది అల్పమైనది యనుభావము

చేత ననుట, అనేకాన్తా=ఒక్కతీరుగానేయుండని-ఒకటే నియతిలేని-గొప్పది గొప్పదిగానే అల్పము నల్పమైనదిగానే ఎప్పుడును గ్రహించునియమము లేనిదైన యనుట, ధనినాం అవస్థా=ధనవంతులదశ(వ్యాపారము),వస్తూని=యవలు, భూమి మొదలైన గొప్పవియు నల్పములునైన) వస్తువులను,ప్రథయతిచ=(ధనములేనపు డల్పమైనవానిని) గొప్పవిగాను జేయుచున్నది. అట్లే, సజ్కోచయతిచ=(ధనముగలయప్పుడు గొప్పవస్తువునుగూడ) తక్కువగాఁ జేయుచున్నది-చులుకనగాఁ దలఁచుచున్నదనుట. మనుష్యు లొకవస్తువునే ధన మున్నపు డొకరీతిగాను లేనపుడు మఱియొకరీతిగాను జూచుట ప్రత్యక్షసిద్ధముగా నున్నది. కావున వివేకము గలవాఁడట్లు తాఱుమాఱగు బుద్ధి కలిగియుండరాదని భావము.

ఉ. చేరి యొకండు నెవ్వఁబడి ♣ చిక్కుచుఁ జేరెఁడుశాలిధాన్యమే
కోరు నతండు పిమ్మట నఙకుంతధనోన్నతుఁ డై వసుంధరం
బూరికి సాటిగాఁ దలఁచు ♣ భూరిధనాఢ్యులచొ ప్పనేకమై
గౌరవమున్ లఘుత్వమును ♣ గైకొనువస్తువులందు నెల్లెడన్. 37

తా. ధనవంతుఁ డొకానొకఁడు దైవవశమున దారిద్ర్యము కలుగఁగా నపు డొకపుడిసెఁటియవలను మిగులగొప్పగాఁ దలఁచి కోరుచున్నాఁడు. పిదపఁ గాలాంతరమున వానికే సంపదలుకలిగినప్పుడు ధనమదముచే భూమినిసైతము గడ్డిపోఁచవలెఁ దలఁచుచున్నాఁడు. కాఁబట్టి ధనవంతు లొకవస్తువునే యొకప్పుడు గొప్పదిగాను మఱొకప్పు డల్పముగాను భావించుటచే వస్తువులయెడల వారివ్యాపారము (స్థితి) ఎప్పుడునొక్కతీరుగలది (అనఁగాగొప్పదాని నెప్పుడును గొప్పదిగాను నల్పము నెప్పుడు నల్పముగాను భావించునట్టినియమముగలది) గా లేదు. అది తన కనుకూలముగా వారికి వస్తువులను జిన్నవానినిగాను పెద్దవానినిగాను పెద్దవానిని చిన్నవానిని గాను దోఁపించును.

అవ. రాజును సంబోధించి వానికి ద్రవ్యము సంపాదించు నుపాయమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రాజన్ దుధుక్షసి యది క్షితిధేను మేనాం
తే నాద్య వత్స మివ లోక మముం పుషాణ।
త స్మింశ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః ॥ 38

టీ. రాజన్=రాజా,(నీవుఅనిశేషము)ఏనాం=ఈనిహస్తగతమైనయనుట-ఇచట అన్వాదేశములేమిచే ఏనాదేశము చింత్యము, క్షితిధేనుం=ఆవువంటి భూమిని, దుధుక్షసియది=పిదుకఁగోరితివేని, (అర్థమునుఅనిశేషము,) తేన=దానిచేత-పిదుకఁగోరిన కారణముచేత ననుట, అద్య=ఇప్పుడు, అముం = ఈ, లోకం= జనమును, వత్సం=

దూడవలె, పుషాణ=పోషింపుము. దూడ నశించినయెడల పా లెట్లు కలుగదో యట్లె జనము నశించినయెడల ద్రవ్యమును గలుగదని భావము. అట్లు పోషించుటచేఁ గలుగుఫలమును జెప్పుచున్నాఁడు. తస్మింశ్చ =ఆలోకము, అనిశం=ఎల్లప్పుడును, సమ్యక్=చక్కఁగా, పరిపుష్యమాణే సతి =పరిపాలింపఁబడుచుండఁగా, భూమిః=భూమి, కల్పలతాఇవ=కల్పవృక్షపుఁగొమ్మవలె ('సమేశాఖాలతే' అని యమరము) లేక, యభీప్సితములను గల్పించునదిగాన కల్పా, అదియే లతయు, అని విగ్రహము సేయవచ్చును. అప్పుడు 'కల్పాకు పుంవద్భావము కలుగఁగా కల్పలతా యగునని వ్యుత్పత్తిచేసినచో, కల్పవల్లియన కోరినకోర్కుల నిచ్చునట్టితీఁగయని యర్థము. దానివలె, నానాఫలం=(ధనధాన్యములు మొదలైన ) పెక్కురూపములగు ఫలమును, ఫలతి=ఫలించుచున్నది. లోకమును బరిపాలించుట తప్పఁ దక్కిన విధమున నీకు ధనము కలుగ నేరదు. ఏలనఁగా లోకపరిపాలనమూలముననమాత్రమే భూమి సకలఫలములను బిదుకునుగాని తక్కినవిధమునఁబిదుకదు. కాఁబట్టిసమస్తలాభములను బొందుటకై లోకమును బోషించుట యావశ్యకము. ఇచట పూర్వవాక్యమందలియుపమచే నుత్తరవాక్యమందలియుపమ నిర్వహింపఁబడుటవలన రెంటికి నంగాంగిభావముచే సంకరము.

తే. ధరణి ధేనువుఁ బిదుకంగఁ దలఁచితేని
జనులఁ బోషింపు మధిప వత్సములమాడ్కి
జనులు పోషింపఁబడుచుండ జగతి కల్ప
లతతెఱంగున సకలఫలంబు లొసఁగు. 38

తా. రాజా ! ఆవువంటి యీభూమివలననుండి ధనమును బిదుకఁగోరితివేని, ఈజనమును దానిదూడవలెఁ దలఁచి పోషింపుము. దూడను బోషించిననే కదా యావుపాలు పిదుకఁగూడును. ఇట్లె యీజనము నెల్లప్పుడును జక్కఁగాఁ బరిపాలించితివేని భూమి కల్పలతవలె ధనధాన్యాదిరూపము లగునానావిధములను నీకుఁ గలిగించును.

అవ. రాజును సంబోధించినట్టి ప్రసక్తిచేత వానినీతియు నెట్టిదని యాశంక కలుగఁగా నది బహువిధములైనదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ సత్యానృతాచ పరుషా ప్రియభాషిణీచ
హింస్రా దయాళు రపి చార్థపరా వదాన్యా।
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమాచ
వారాఙ్గనేవ నృపనీతి రనేకరూపా॥ 39

టీ. సత్యా=(కొన్నివిషయములందు) సత్యముగాఁ బలుకునది, అనృతాచ (కొన్నిట) అసత్యముగా చెప్పునదియును- "కొన్నివిషయములందు" అని అంతటను గూర్చుకొనవలయును, పరుషా=కఠినముగా మాటలాడునది, ప్రియవాదినీచ=

తియ్యగా మాటలాడునదియును, హింస్రా=చంపునట్టిది, దయాళురపి=కనికరము గలదియును, అర్థపరా=ధనలోభముకలది, వదాన్యాచ=దానముచేయునట్టిదియును, నిత్యవ్యయా=నిత్యమును ధనవ్యయము గలది - ధనమును వెచ్చించునట్టి దనుట, ప్రచుర...ఆగమాచ-ప్రచుర=మిక్కిలి, నిత్య=నిత్యమును ధన ఆగమా=ధనముయొక్క రాకగలది- నిత్యమును మిక్కిలి ధనమును వెచ్చించుటయు సంపాదించుటయుఁ గలది యనుట. కాఁబట్టి, వారాఙ్గనాఇవ=వేశ్యవలె, నృపనీతిః=రాజువృత్తి, అనేకరూపా=బహుప్రకారములుగలది. ఒక్కతీరుననే యుండునది కాదనుట, నీతికిఁగల విశేషణములెల్ల వారస్త్రీకిని సమానము లని తెలియనగును. ఇచట సత్యా అనృతా ఇత్యాదిపదములను వినినతోడనే విరోధముస్ఫురించుచున్నది. దానిని స్వాభావ్యమున నాభాసముగాఁ జేయుటచే నిది విరోధాభాసాలంకారమగు చున్నది. అది 'వారఙ్గనేవ' అనుచోఁ గలయుపమతో నంగాంగిభావముచే సంకీర్ణమగుచున్నది.

తే. సత్య మనృతంబు పరుషోక్తి సరసభాష
ప్రాణిహింసయు దయయు లోభంబు నీఁగి
కనకసంగ్రహవ్యయములు గలుగు వార
రమణికైవడి బహురీతి రాజనీతి. 39

తా. రాజనీతి వేశ్యవలెఁ గొన్నియెడల నిజము పలుకుచుఁ, గొన్నియెడల నబద్ధములాడుచుఁ, గొన్నిచోట్లఁ జంపుచు, మఱికొన్నిచోట్లఁ గనికరముచూపుచుఁ, గొన్నివిషయములందు ధనలోభము చూపుచు, మఱికొన్నిట మిక్కిలి దానముచేయుచు, నిత్యమును మిక్కిలిధనము వెచ్చించుచు నిత్యమును మిక్కిలిధనము సంపాదించుచును, నానాప్రకారములుగా నుండును.

అవ. గుణసంపన్నుఁడైనరాజునే యాశ్రయింపఁదగును గాని గుణహీనుని గా దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆజ్ఞా కీర్తిః పాలనం బ్రాహ్మణానాం
దానం భోగో మిత్రసంరక్షణంచ ।
యేషా మేతే షడ్గుణా న ప్రవృత్తాః
కోఽర్థ స్తేషాం పార్థివోపాశ్రయేణ॥ 40

టీ. పార్థివ=ఓరాజా,ఆజ్ఞా=మర్యాదను బరిపాలించునట్టిశాసనము, కీర్తిః=దానక్షాత్రములచేఁబుట్టిన మంచిపొగడ్త, బ్రాహ్మణానాం పాలనం=బ్రాహ్మణులను బాలించుట-నిరుపద్రవముగా బ్రాహ్మణసంతర్పణము సేయుట, దానం = సత్పాత్రమున కిచ్చుట, భోగః=హారచందనాదులవలనిసుఖము ననుభవించుట, మిత్రసంరక్షణంచ=చెలికాండ్ర నుద్ధరించుటయును (అను), ఏతేషడ్గుణాః=ఈయాఱుగుణములు,

యేషాం=ఎవరికి-ఏరాజులక నుట, న ప్రవృత్తాః=ప్రవర్తింపవో-కలుగవో యనుట, తేషాం=వారియొక్క, ఉపాశ్రయేణ = ఆశ్రయించుటచేత, కః అర్థః=ఏమిలాభము - లాభ మేమియు లేదనుట. కాఁబట్టి పూర్వోక్తములైన గుణములు గలరాజునే యాశ్రయింపవలయును గాని కుక్షింభరి యైనవానిని గాదని భావము.

తే. ఆజ్ఞయును గీర్తియును భూసురావనంబు
దానమును భోగమిత్రసంత్రాణనములు
షడ్గుణంబులు గలుగ వేఁజనులయందు
వారిఁ గొల్చిన ఫల మేమి వసుమతీశ. 40

తా. ఏరాజులకుఁ గట్టుపాటులను జెడకుండునట్లు గాపాడునట్టి శాసనమైన యాజ్ఞ, కీర్తి, నిరుపద్రవ మగుబ్రాహ్మణసంతర్పణము, సత్పాత్రదానము, హారచందనాది సుఖానుభవరూపమైనభోగము, చెలికాండ్ర నుద్ధరించుట, యనెడి యీ యాఱుగుణములు లేవో యట్టిరాజులను గొలుచుటవలన లాభ మేమియు లేదు.

అవ. లాభాలాభములు దైవాయత్తముగాఁ గలుగునవి గాన వానిని గుఱించి దైన్యము నొందకు మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ య ద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
త త్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌచ నాతోఽధికమ్।
త ద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మాకృథాః
కూపే పశ్య పయోనిధా వపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్॥ 41

టీ. ధాత్రా=బ్రహ్మచేత, స్తోకం=అల్పముగాఁగాని, మహద్వా=మిక్కిలిగాఁగాని, యత్ ధనం=ఏధనము, నిజఫాలపట్టలిఖితం=తననొస లనెడుపట్టికయందు వ్రాయఁబడినదో, తత్=అది-బ్రహ్మ లిఖించినయాధన మనుట, మరుస్థలేఽపి = ఊషరప్రదేశమందుఁగూడ - ఇఁక తక్కినచోట్ల దొరకుట చెప్పనేల యని భావము, నితరాం=మిక్కిలి, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు (తక్కువపడకుండ నని శేషము). మేరౌచ=బంగారుకొండయందును, అతః = (బ్రహ్మ లిఖించిన) దానికంటెను, అధికం=ఎక్కువను, నప్రాప్నోతి=పొందఁడు, తత్ = కాఁబట్టి, ధీరః=స్థిరచిత్తుఁడవు, భవ=కమ్ము, విత్తవత్సు=ధనాఢ్యులైనవారియెడల, కృపణాంవృత్తిం=దీనవ్యాపారమును, వృథా=వ్యర్థముగా, మాకృథాః=చేయకుమా-అట్లు దీనత్వము చూపుటవలన నిందమాత్రమే గలుగునుగాని ధనమధికముగాఁ గలుగదనిభావము. ఇందులకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు. ఘటః=కుండ, కూపే=(అల్పజలము గల) బావియందును, పయోనిధౌ అపి=సముద్రమునందునుగూడ, తుల్యం = తనకు పరిమితమైనంత, జలం=జలమును, గృహ్ణాతి=గ్రహించుచున్నది, పశ్య=చూడుము. ఇట్లని కృపణుని సంబోధిం

చుట తెలియనగును. కుండ కూపమునందుఁ గొంచెముగాను సముద్రమునందు నధిక ముగాను జలమును గ్రహింపఁగదా. కాఁబట్టి కలిగినంతమట్టునకు తృప్తినొంది ధై ర్యముతో నుండవలయునుగాని దీనత్వముతో వ్యాకులపడుట తగ దని భావము.

చ. వనజభవుండు నెన్నొసట వ్రాసినసొమ్ము ఘనంబొ కొంచెమో
 విను మరుభూమి కేఁగిన లభించును మేరువుఁ జేరఁ బోయినన్
 ధన మధికంబు రాదు కడు దైన్యము మాను ధనాఢ్యులందు న
 వ్వననిధి నూతఁ దుల్యముగ వారి గ్రహించుఘటంబు సూడుమా.

తా. బ్రహ్మ నొసటియం దెంతధనము కలుగునట్లు వ్రాసియున్నాఁడో యంత మాత్రమే కొంచెమైనను తక్కువపడక మరుభూమియం దైనను దప్పక దొరకును. బంగారుమయ మగుమేరుపర్వతమునకుఁ బోయినను దానికంటె నెక్కువ దొరక నేరదు. కాఁబట్టి మవస్సున ధైర్యము కలిగియుండుము. ధనవంతులయెదుట దీనత్వ ము చూపకుము. దీనిచే నీకు నింద గలుగు నేగాని ధన మెక్కువరాదు. కుండ బావి యందుముంచినను సముద్రమున ముంచినను దన కెంతమితమో యంతజలముమాత్రమే గ్రహించుటఁ జూడుము. ఈదృష్టాంతముచే నెచటికిఁబోయినను గాని ప్రాప్త మెంతో యంతే లభించునని తలంచి వ్యాకులపడకుండుము.

ఇది నీతిశతకమునందు అర్థపద్ధతివర్ణన మన్నది చతుర్థదశకము.



నీతిశతకము - దుర్జనపద్ధతి.

---

అవ. అర్థము మొదలైనవి గలవాఁడైనప్పటికిని దుర్జనుని గై కొనరాదని చెప్పునభిప్రాయముతో నర్థపద్ధతి నిరూపించినపిదప దుర్జన పద్ధతిని నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ అకరుణత్వ మకారణవిగ్రహః, పరధనే పరయోషితి చ స్పృహా।
 సుజనబన్ధుజనే ష్వసహిష్ణుతా, ప్రకృతిసిద్ధ మిదంహి దురాత్మనామ్॥

టీ. అకరుణత్వం=(పరదుఃఖములను బోఁగొట్టుకోరిక కరుణ కావున నట్టి) కరుణలేమి-దయాహీనత్వమును, అకారణవిగ్రహః=కారణములేని కలహమును, పర ధనే=ఇతరుల ద్రవ్యమునందును, పరయోషితి=పరుని స్త్రీయందును, స్పృహా=ఆశ- పరధన మపహరించుటకును పరభార్యలతో సంభోగించుటకును గోరిక యనుట, సు జన=సజ్జనులయందును, బన్ధుజనేషు=చుట్టములయందును, అసహిష్ణుతా=సహింపలేని

తనమును (అను), ఇదం=ఇదియెల్లను, దురాత్మనాం=దుర్జనులకు, ప్రకృతిసిద్ధం హి=స్వభావసిద్ధ మైనదిగదా. కావున నట్టివారిని గైకొనరాదని భావము.

తే. కారణము లేనికలహంబు కరుణలేమి
పరవధూపరధనవాంఛ బంధుసాధు
జనములం దసహిష్ణుత్వ మనఁగ జగతిఁ
బ్రకృతిసిద్ధంబు లివి దుష్టనికరమునకు. 42

తా. కరుణలేమి, కారణములేనికలహము, పరధనములనపహరించుకోరిక, పరస్త్రీలతో సంభోగింపఁదలఁచుట, సజ్జనులయెడలను బంధుజనులయెడలను నోరుపుచూపకుండుట, ననునివియెల్లదుర్జనులకుసహజగుణములు కావుననట్టివారు గైకొనఁదగనివారు.

అవ. కేవలదుర్జనుఁడు త్యజింపఁదగినవాఁ డనుట యటుండఁగా వాఁడు తనయవగుణముల నన్నింటిని బోఁగొట్టఁ జాలిన గొప్పలక్షణములతోఁ గూడియున్నప్పటికినిగూడఁ ద్యజింపఁదగినవాఁడే యని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో, విద్యయాఽలఙ్కృతోఽపి సన్।
మణినా భూషిత స్సర్పః, కి మసౌ న భయఙ్కరః॥ 43

టీ. దుర్జనః=దుష్టుఁడైనవాఁడు, విద్యయా=వేదవేదాంగాదిమయమైన విద్యచేత, అలంకృతః సన్ అపి=అలంకరింపఁబడినవాఁడైనప్పటికిని, పరిహర్తవ్యః=త్యజింపఁదగినవాఁడు, ఏలనఁగా, సర్పః=సర్పము, మణినా=పడగయందలి మాణిక్యముచేత, భూషితః సన్ అపి=అలంకరింపఁబడినదైనప్పటికిని, అసౌ=ఇది-ఈసర్పమనుట, నభయఙ్కరః కిం=భయము కలుగఁజేయునట్టిది కాదా యేమి-భయంకరమైనదే యగుననుట. ఇచట బింబప్రతిబింబన్యాయముచే ధర్మమును ధర్మియు రెండు వాక్యములందు వేఱువేఱ నిర్దేశింపఁబడుటచే దృష్టాంతాలంకారము.

తే. విద్యచే భూషితుం డయి వెలయుచున్నఁ
దొడరి వర్జింప నగుఁ జుమీ దుర్జనుండు
చారుమాణిక్యభూషితశస్తమస్త
కం బయినపన్నగము భయంకరము గాదె. 43

తా. సర్పము పడగయందు రత్నము గలదైనప్పటికినిగూడ నది భయంకరమగుటచే దూరముననె త్యజింపఁదగినది యెట్లగునో యట్లె దుర్జనుఁడు విద్య గలవాఁడైనప్పటికిని వానిని దుష్టత్వమునుబట్టి దూరముననే త్యజింపవలయును.

అవ. దుర్జనుఁడు సర్వదూషకుఁ డని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతశుచౌ దమ్భః శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునే విమతితా దైన్యం ప్రియాలాపిని ।
తేజస్విన్యవలిప్తతా ముఖరతా వక్తర్యశక్తిస్థిరే
తత్కో నామ గుణోభవేత్స గుణినాం యో దుర్జనైర్నాఙ్కితః ॥

టీ. (దుర్జనైః=దుర్జనులచేత), హ్రీమతి=లజ్జగలవానియందు, జాడ్యం=మాంద్యము-చులుకఁదనము లేమి యనుట, గణ్యతే=గణింపఁబడుచున్నది-భావింపఁబడుచున్న దనుట. వానిలజ్జను, రోఁతపుట్టించుపనులను జేయుటకు వెనుదీయునట్టి యొక గుణవిశేషముగా నెన్నక మందత్వముగా దుష్టు లెన్నుదు రనుట. వ్రతశుచౌ-వ్రత=తపము చాంద్రాయణము మొదలైన నియమములచేత, శుచౌ=శుద్ధుఁడైనవానియందు, దమ్భః=డంబము, గణ్యతే=గణింపఁబడుచున్నది-వానివ్రతములను అనుష్ఠానములనుగాఁ దలంపక డంబముగాఁ దలంతురనుట. శుచౌ=(స్వభావముచేతనే బాహ్యాంతరములయందు)నిర్మలుఁడైనవానియందు, కైతవం=కపటము (గణింపఁబడుచున్నది)-సహజమైన వానిబాహ్యాభ్యంతరశుద్ధిని పారమార్థికమైనదానినిగా నెన్నక వేషముగా నెన్నుదు రనుట. శూరే=శూరునియందు, నిర్ఘృణతా దయలేనితనము(గణింపఁబడుచున్నది)-వానిశూరత్వమును బరాక్రమముగా నెన్నక దయలేమిగా నెంతు రనుట. మునౌ=*మననశీలునియందు- ఆత్మస్వరూపానుసంధానరూపమైన మననము గలవానియం దనుట, విమతితా = మతిలేనితనము - బుద్ధిహీనత (గణింపఁబడుచున్నది)-వాని మననమును ఆత్మానుసంధానముగాఁ దలంపక బుద్ధిహీనతగాఁ దలంతురనుట. ప్రియ ఆలాపిని=ఇంపుగా మాటలాడువానియందు, దైన్యం=దీనత్వము(గణింపఁబడుచున్నది.)- వానిమాటలు శ్రవణానందకరము లగుటను గణింపక దీనోక్తులనుగా గణింతురనుట. తేజస్విని=తేజస్సు (ప్రభ లేక ధీరత్వము) గలవానియందు, అవలిప్తతా=గర్వము (గణింపఁబడుచున్నది.)- తేజస్సును వానికి స్వభావముఁగాఁ దలంపక గర్వముగాఁ దలంతురనుట. వక్త...స్థిరే-వక్తవ్య=మాటలాడఁదగిన విషయములందు, శక్తి=ప్రతిభారూపమైన సామర్థ్యముచేత, స్థిరే=నిలుకడయైనవానియందు-చలింపని బుద్ధిసామర్థ్యములోఁ దగిన విషయముల నెత్తి చక్కఁగా సంభాషించువానియం దనుట, ముఖరతా=అసంబద్ధప్రలాపము లాడుట- వదరుఁబోతుతనము (గణింపఁబడుచున్నది.) - వానిని బొంకముగా మాటాడ నేర్చినవానినిగాఁ దలంపక వదరుఁబోతుఁగా గణింతురనుట. తత్ =కాఁబట్టి, యః= ఏది-ఏగుణము, దుర్జనైః=దుర్జనుల చేత, న అఙ్కితః=తప్పు పెట్టఁబడనిదో-దూషింపఁబడనిదో, సఃగుణః=అట్టిగుణము,

---

* మననము అద్వైతపక్షమున ఆత్మైక్యానుసంధానముగాను, విశిష్టాద్వైతపక్షమున ఆత్మస్వరూపానుసంధానముగాను దెలియవలయును.

గుణినాం=గుణవంతులకు, కో నామభవేత్=ఏది కలదు? దుర్జనులు తప్పు పెట్టనిగుణ మొక్కటియును సజ్జనులకు లేదు. అనఁగా సజ్జనులగుణము లన్నింటిని దుర్జనులు దూషించుచునే యుందు రనుట.

శా. హ్రీరమ్యుం జడుఁగాఁగ సువ్రతుని మాకయింగా శుచిం దంభిఁగా
శూరుక్ నిర్దయుఁగా మునిక్ విమతిఁగా క్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితాకరూఢంబుఁ జేయుంగదా. 44

తా. దుర్జనులు సిగ్గుగలవానిని జడునిగాను, తపశ్చాంద్రాయణాదివ్రతానుష్ఠానములచేఁ బరిశుద్ధుఁ డైనవానిని డాంబికునిగాను, ఏవ్రతములేక సహజముగానే లోపలను వెలుపలను నిర్మలుఁడై యున్నవానిని వేషధారిగాను, శూరుని దయలేనివానినిగాను, ఆత్మస్వరూపమును మననము సేయువానిని బుద్ధిహీనునిగాను, చెవుల కింపుగా మాటలాడువానిని దీనునిగాను, తేజస్సు గలవానిని, గర్విఁగాను మంచిసామర్థ్యముతో యుక్తియుక్తముగా మాటాడువానిని వదరుఁబోతుగాను గణింతురు. ఇట్లు గుణవంతు లగువారిగుణములలో నేదిగాని దుర్జనుఁడు దూషింపనిది లేదు.

అవ. గుణములను అవగుణములను వరుసగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ లోభ శ్చే దగుణేన కిం పిశునతా య ద్యస్తి కిం పాతకైః
సత్యం చే త్తపసాచ కిం శుచి మనో య ద్యస్తి తీర్థేన కిమ్।
సౌజన్యం యది కిం బలేన మహిమా య ద్యస్తి కిం మణ్డనైః
సద్విద్యా యది కిం ధనై రపయశో య ద్యస్తి కిం మృత్యునా॥ 45

టీ. లోభః=(ద్రవ్యాదులయందలి) పేరాస, (అస్తి) చేత్=ఉండె నేని, అగుణేన=దుర్గుణముతో, కిం=(పని) ఏమి - ఏమియును లేదనుట-మిక్కిలినింద కలిగించుటకు లోభ మొకటిచాలును మఱియొకదుర్గుణ మక్కఱలేదనిభావము. పిశునతా=కొండెము చెప్పుట- మఱుఁగున పరులపై తప్పులెత్తిచూపుట, అస్తియది=ఉండె నేని, పాతకైః కిం=బ్రహ్మహత్యాదిపాతకములతో పనియేమి-నరకములోఁ ద్రోయుటకు కొండెము చెప్పుట యొకటియెచాలును మఱియొకపాతక మక్కఱలేదనుట. సత్యం=నిజము పలుకుట, లేక, సమదర్శిత్వము, అస్తిచేత్=ఉండె నేని, తపసాచ కిం=చాంద్రాయణాది తపములతో పనియేమి - పరిశుద్ధి కలిగించుటకు సత్యభాషణమే చాలును మఱియొక నియమ మక్కఱలేదనుట. శుచి=(ద్రోహచింతనము మొదలైనవి లేక) శుద్ధమైన, మనః=మనస్సు, అస్తియది=ఉండె నేని, తీర్థేన=ప్రయాగ మొదలైన తీర్థములతో, కిం=పనియేమి- మోక్షమును గలిగించుటకు నిర్మలమైనమన సొకటియే చాలును మఱియొకపుణ్యతీర్థ మక్కఱ లే దనుట. సౌజన్యం=సుజనభావము-మంచితనము,

అస్తియది=ఉండెనేని, బలేన=బలఁగముతో-పరిజనముతో, కిం=పని యేమి? సర్వకార్యములు నిర్వహించుటకు మంచితన మొకటియే చాలును పరిజను లక్కఱలేదనుట. మహిమా=మాహాత్మ్యము- గొప్పతనము, యది అస్తి=ఉండెనేని, మణ్డనైః=కుండలహారాదులైన యలంకారములతో, కిం=పనియేమి- అలంకారము సేయుటకు గొప్పతనమే చాలును వేఱొకభూషణమక్కఱలేదనుట. సద్విద్యా=మంచి విద్య, యది అస్తి=ఉండెనేని, ధనైః కిం=ద్రవ్యముతో పనియేమి? కార్యములను సాధించుటకు మంచివిద్య యొక్కటి చాలును ద్రవ్యమక్కఱలేదనుట. అపయశః= అపకీర్తి, అస్తి యది=ఉండెనేని, మృత్యునా కిం=మరణముతో పనియేమి- *అపకీర్తి కలుగుటయే చచ్చుటతో సమానము, నిజముగా చావ నక్కఱ లేదనుట. ఇట్లు విచారించినవాఁడై పురుషుఁడు సద్గుణములనే యార్జింపవలయును. లేనియెడల దుర్జనత్వ మతిసులభముగాఁ బట్టువడునని యిచట వాక్యశేషముగా నూహించుకొనఁదగు.

చ. వగ గొనులోభముం బిశునభావము సత్యము చిత్తశుద్ధియుం
దగుసుజనత్వముం సుమహితత్వము విద్యయు లోకనిందయుం
దగిలిన దుర్గుణంబు దురితంబుఁ దపంబును దీర్థసేవ భృ
త్యగణము సొమ్ములుం ధనచయంబును జావును వేఱయున్నదే.

తా. లోభముకంటె మిక్కిలి నిందావహమైన దుర్గుణము లేదు. కొండెము చెప్పుటకంటె మిక్కిలి నరకములోఁ గూల్చునట్టిపాతకము లేదు. సత్యము చెప్పుట కంటెఁ బవిత్రమైననియమము లేదు. †నిర్మలమగు మనస్సుకంటె మోక్షదాయకమైన పుణ్యతీర్థము లేదు. మంచితనముకంటె నన్నిపనులు నిర్వహించునట్టిపరిజనము లేదు. గొప్పతనముకంటె మించినయలంకారము లేదు. మంచివిద్యకంటె మించినధనము లేదు. అపకీర్తికంటె ఘోరమైనమరణము లేదు.

అవ. కవి యొకానొకయనుభవశాలి పడినకష్టములను దనతోఁ జెప్పునట్లు అభినయించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ శశీ దివసధూసరో గళితయావనా కామినీ
సరో విగతవారిజం ముఖ మనక్షరం స్వాకృతేః।
ప్రభు ర్ధనపరాయణః సతతదుర్గతి స్సజ్జనో
నృపాఙ్గణగతః ఖలో మనసి సప్త శల్యాని మే॥ 46

టీ. దివసధూసరః-దివసపగటియందు, ధూసర=కాంతిమాసిన, శశీ=చంద్రుఁడును, గళితయావనా=జాఱిపోయినయావనముగల-ఎలప్రాయముగడచినట్టి, కామినీ=

*'సమ్భావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే' అనుభగవద్గీతావాక్యమిచటననుసంధేయము.
†'యస్స్వాన్తతీర్థం భజతే వినిష్క్రియః స సర్వవి త్సర్వగతోఽమృతో భవేత్' అనుట యిచట ననుసంధేయము.

స్త్రీయును, విగతవారిజం=పోయినతామరపువ్వులు గల-తామరపువ్వులులేని, సరః=కొలనును, సు ఆకృతేః = మంచియాకారము గలవానియొక్క-సుందరపురుషుని యొక్క, అనక్షరం=అక్షరములేని- శాస్త్రములు చదివినట్టిదికాని, ముఖం=ముఖమును, ధనపరాయణః=ధనమందు పేరాసగల, ప్రభుః=రాజును, సతతదుర్గతిః=నిరంతరమును దారిద్ర్యము గలిగియున్న, సజ్జనః=సత్పురుషుఁడును, నృప అఙ్గణ గతః = రాజగృహమును బొందిన-రాజగృహమునందు వర్తించునట్టి, ఖలః=దుర్జనుఁడును (వీఁడు రాజుచెంతనుండి యితరులకు విఘాతము సేయువాఁ డగుటచే నిట్లు చెప్పఁబడెను), అని యిట్లు, సప్త=ఏడును, మే=నాయొక్క, మనసి=మనస్సునందు, శల్యాని=శూలములు-శూలములవలె సహింపరాని దుఃఖమును బుట్టించునవి యనుట. శల్యములనుటయే మిక్కిలి కష్టమును దెలుపునట్టిమాటయని తెలియవలయును. ఇచట అప్రకృతములైనది వసధూసరచంద్రాదులకును ప్రకృతమైన ఖలునికినిసమానమగు దుఃఖహేతుత్వమువలనఁ గలిగిన సామ్యముచే ఉపమాభావను గమ్యమగుచున్నది గాన దీపకాలంకారము.

చ. దినమలినాంగుఁడైనహిమదీప్తియుఁ బ్రాయము దప్పనాతియున్
వనరుహశూన్య మాకొలను వర్ణితరూపునిరక్షరాస్యమున్
ధనపరుఁడైనరాజు సతతంబును లేమిని గుందు సాధువున్
జనపతిచెంత దుర్జనుఁడు శల్యము లేడివి నామనంబునన్. 46

తా. పగటియందుఁ దేజస్సు మాసినచంద్రుఁడును, యౌవనము గడచిపోయిన స్త్రీయును, తామరలు లేనికొలఁకును, చదువులేనిసొగసుకాఁడును, మిక్కిలిద్రవ్యాశ గలరాజును, నిరంతరమును దరిద్రుఁడైనసజ్జనుఁడును, రాజుచెంత నుండి యితరుల కార్యములకు విఘాతము సేయుచుండు దుర్జనుఁడును అను నీయేడుగురు మనస్సున నాటినశూలములవలె దుస్సహమైన దుఃఖమును గలిగింతురు.

అవ. దుష్టరాజలక్షణమును దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ న కశ్చి చ్చణ్డకోపానా, మాత్మీయో నామ భూభుజామ్।
హోతార మపి జుహ్వానం, స్పృష్టో దహతి పావకః॥ 47

టీ. చణ్డకోపానాం=తీక్ష్ణమైనకోపము గలవారగు - ఉగ్రులైనట్టి, భూభుజాం= రాజులకు, కశ్చిత్=ఎవఁడుగాని, ఆత్మీయః = తమవాఁడు- తమ ప్రేమకుఁ బాత్రుఁడై యుండునట్టివాఁడనుట, న నామ=కాఁడుగదా-వారికిఁ దమవాఁడుగాఁ బ్రసిద్ధిఁబొందినవాఁ డొక్కఁడును లేఁడనుట-ఎట్లోయొకట్లు వారికి హితము సేయుచుండువాఁడు వారివాఁడే యగునుగదా యనఁగాఁ గానేరఁడని దృష్టాంతము చూపుచున్నాఁడు. జుహ్వానం అపి= వేల్చుచున్నవాఁడైనను- నెయ్యి పురోడాశము మొదలయినవి యొసంగి యుపచారముచేయుచున్నవాఁడైనను, [illegible]=యజించుచున్న

వానిని- యజ్ఞము సేయుచున్న వానిని, పావకః=అగ్ని, స్పృష్టఃసన్=తాఁకఁబడిన వాఁడై, దహతి=దహించుచున్నాఁడు. అలంకారము దృష్టాంతము.

క. మనుజులలో నెవ్వఁడు దగఁ
దనవాఁ డనువాఁడు దుష్టధరణీశునకుం
దనకయి ప్రేలిమి ప్రేల్చెడు
జనునితనువుఁ గాల్చు వాయుసఖుఁ డదయుం డై. 47

తా. మంతుచుండునగ్నికి యజించునట్టివాఁడు నెయ్యి మొదలైనవి యర్పించి యుపచరించుచున్నప్పటికిని గూడ నది తన్నుఁ దాఁకినయెడల వానిని దహింపక విడువదు. అట్లే కోపముచే మండుచుండురాజులకు నెంతహితము సేయువాఁడుగాని వారికిఁ బ్రేమపాత్రుఁడై వారివాఁడని చెప్పఁదగినవాఁ డొక్కఁడును లేఁడు. కాఁబట్టి వారి నాశ్రయింపఁదగదు.

అవ. వారిని గొలుచుట మిక్కిలి కష్ట మగుటవలన వారి నాశ్రయింపఁ దగ దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మౌనా న్మూకః ప్రవచనపటు ర్వాచకో జాల్పకో వా
ధృష్టః పార్శ్వే భవతి చ వస న్దూరతోఽప్యప్రగల్భః।
క్షాన్త్యా భీరు ర్యది న సహతే ప్రాయశో నాభిజాతః
సేవాధర్మః పరమగహనో యోగినా మ ప్యగమ్యః॥ 48

టీ. మౌనాత్=మౌనమువలన-ఏమియుఁబలుకకుండుటవలన, మూకః=మూఁగ, భవతి=అగుచున్నాఁడు- సేవకుఁడుఅని శేషము మీఁదనెల్లఁగూర్చుకొనునది. సేవకుఁడు భయభక్తులచేమాఱుపలుకక మిన్నకుండినయెడలవానినిమూఁగవాఁడనినిందింతురనుట- ఇట్లెయంతటను భావము గ్రహించునది. ప్రవచనపటుః=చక్కఁగా మాటలాడుట యందు సామర్థ్యము గలవాఁడు, వాచకః=మిక్కిలి మాటలాడువాఁడుగాఁ గాని, జాల్పకః వా= అసంబద్ధముగామాటలాడువాఁడుగాఁగాని,(భవతి=అగుచున్నాఁడు), పార్శ్వే=సమీపమునందు, వసన్=వసించువాఁడు, ధృష్టః=భయభక్తులులేనివాఁడు, (అగుచున్నాఁడు), దూరతః=దూరముగా, వసన్ అపి=ఉండువాఁడైనను, అప్రగల్భః=ప్రౌఢి లేనివాఁడు-దిట్ట గానివాఁడు (అగుచున్నాఁడు), క్షాన్త్యా=(అవమానాదులు గలుగు చున్నను క్రోధము నడ్డగించునట్టి గుణవిశేషమైన) ఓర్పుచేత (కూడినవాఁ డైనయెడల), భీరుః = భయశీలుఁడు (అగుచున్నాఁడు), నసహతే యది = (అవమానాదులను) ఓర్చుకొననియెడల, ప్రాయశః = తఱుచుగా- మిక్కిలి, అభిజాతః = మంచికులమునఁ బుట్టినవాఁడు, న = కాఁడు, కాఁబట్టి,

పరమగహనః- పరమ=మిక్కిలియు, గహనః=దురవగాహమైన-గ్రహింపసాధ్యము కాని, సేవాధర్మః=పరిచర్యసేయుటయనుకర్మము,యోగినాంఅపి=యోగులకుఁగూడ- కాలత్రయాభిజ్ఞులకుఁగూడ-ఇంద్రియములకు గోచరముగాని వస్తువుల నెఱుఁగునట్టివారికిఁగూడననుట, అగమ్యః=తెలిసికొనుటకు సాధ్యముకానిది-అవాఙ్మానసగోచరమైన పరబ్రహ్మమునుగూడ ధ్యానాదులచేఁ గనుఁగొననేర్చినట్టి యోగులకుసైతము దీనినిగనుఁగొనుట సాధ్యముకాదని భావము. రాజులను సేవించునప్పుడు మానాదులను జూపినయెడల నొక్కొక్కటికి నొక్కతప్పు వారుపెట్టెదరు. కావున నవి లేనట్టిసేవ ననుష్ఠింపవలయును. అయిననట్టిసేవాధర్మము గగనారవిందమువలె కలుగనేకలుగదు. అది బ్రహ్మమునుదెలియుట. కాఁబట్టి యట్టిధర్మము ననుష్ఠించుట దుష్కరమనియాశయము. ఇచటసేవాధర్మము యోగులకు గమ్యమైయుండినను దానికి నగమ్యత్వము సెప్పుట వలన సంబంధ ముండఁగా నసంబంధమును జెప్పెడియతిశయోక్తి యలంకారము.

ఉ. మౌనముచేత మూఁగయు నఽమంచితవక్త్ర ప్రలాపి చెంగటం
బూని వసింప దిట్టదమఽముందట దవ్వుగ నుండెనేని శా
లీనుఁడు దాల్మి భీరుఁడవఽలిప్తుఁడు చాలిమి లేనిబంటు భూ
జానులసేవ దుష్కర మఽసాధ్యము యోగులకైన నిద్ధరన్. 48

తా. రాజులుతమసేవకుఁ డేమియుఁబలుకకుండిన,వాఁడుమూఁగవాఁడనియుఁ, జక్కఁగా మాటాడఁజాలినయెడల మితిమీఱిగాని (లేక) తాలుమాలుగాఁ గాని మాటాడువాఁడనియు, దగ్గఱ నిలుచున్నయెడల భయభక్తులులేనివాఁ డనియు, దూరమునందు నిలుచుకొన్నను గట్టివాఁడు కాఁడనియు, నవమానాదుల నోర్చుకొనువాఁడైనయెడలఁ బిఱికి యనియు, నోర్చుకొననియెడల మిక్కిలి మంచికులమునఁ బుట్టినవాఁడు కాఁడనియుఁ జెప్పుదురు. కావున వారలను సేవించువిధ మిట్టిదట్టిదని గ్రహించుట మిక్కిలి యశక్యముగా నున్నది. వేయేల, ఇంద్రియగోచరములుగాని వస్తువుల నెఱుఁగునట్టియోగులకుఁగూడ దానిని దెలిసికొనుట సాధ్యము కాదు.

అవ. వేయేల, దుర్జనులగుప్రభువులయెదుట నిలుచుటకుఁగూడ నెవ్వనికి శక్యముగా దని చెప్పుచున్నాఁడు,

శ్లో॥ ఉద్భాసితాఖిలఖలస్య విశృఙ్ఖలస్య
ప్రోద్గాఢవిస్మృతనిజాధమకర్మవృత్తేః।
దైవా దవాప్తవిభవస్య గుణద్విషోఽస్య
నీచస్య గోచరగతైః సుఖ మాస్యతే కైః॥ 49

టీ. ఉద్భాసిత=ప్రకాశింపఁ జేయఁబడిన, అఖిల ఖలస్య=సమస్త దుర్జనులు గలవాఁడును-అధికారములనొసంగి దుర్జనులనెల్ల ముందఱికిఁ దెచ్చినవాఁ డనుట-సజ్జ

నులను ద్వేషించుటవలన ననిభావము, విశ్రృఙ్ఖలస్య=విధినిషేధములనుబాటింపక విచ్చలవిడిగాఁ బ్రవర్తించువాఁడును, ప్రోద్గాఢ...వృత్తేః-ప్రోద్గాఢ=మిక్కిలి, విస్మృత=మఱవఁబడిన,నిజ=తనదైన,అధమకర్మవృత్తిః=(పూర్వపు)నీచకృత్యములచేతనైనజీవికగలవాఁడును-తాను బూర్వము జరపుచుండిన నీచపుబ్రతుకు నిపుడు బొత్తిగా మఱచినవాఁడనుట-మిక్కిలి లజ్జాహీనుఁడనిభావము, దైవాత్=దైవికముగా-అదృష్టవశమున, అవాప్తవిభవస్య = అప్పుడు కలిగినయైశ్వర్యసంపత్తి గలవాఁడును, గుణద్విషః =సుగుణముల నిందించునట్టివాఁడును అగు, అస్య నీచస్య= ఈనీచునియొక్క - నీచుఁడైన యీపూర్వోక్తప్రభువుయొక్క, గోచరగతైః=దేశమందు వసించునట్టి- ఎఱుకకందినట్టి-లేక,పాలంబడినట్టి యనియుఁ జెప్పవచ్చును, కైః=ఎవ్వరిచేత, సుఖం=సుఖముగా, ఆస్యతే=ఉండఁబడుచున్నది-ఎవరును దుఃఖములేక యుండరనుట.కాఁబట్టి నీచుల నాశ్రయింపఁదగదనిభావము. ఇచట 'ఉద్భాసిత' ఇత్యాదిపదార్థము విశేషణగతిచే సుఖస్థిత్యభావపదార్థమునకు హేతు వగుటవలన పదార్థహేతుకకావ్యలింగమలంకారము.

చ. ఖలు లగువారలం దురధి?కారసమర్థులఁ జేసి తా నిర
 ర్గళగతి యై నికృష్టనిజ?కర్మము విస్మృతిపా లొనర్చి ని
 శ్చలగుణవైరి యై విధివ?శంబున సంపద గాంచి త్రుళ్లుచుఁ
 మెలఁగునృపాలు దేశమున ? మేలు లభించునె యెట్టివారికిన్. 49

తా. సజ్జనులనొల్లక దుర్జనుల కధికారములిచ్చి వానికివన్నెకుఁ దెచ్చినట్టివాఁడును, ఇదితగును ఇది తగదని విచారింపక విచ్చలవిడిగాఁ బ్రవర్తించువాఁడును లజ్జాహీనుఁడగుటవలనఁ దాను బూర్వమునీచకృత్యములచేఁ గడపినబ్రతుకునుమఱచి యదృష్టవశముగా నప్పుడు కలిగిన యైశ్వర్యముచే మదించి మంచిగుణముల నొల్లక యుండువాఁడును, గావున నీచుఁడు నైనట్టిప్రభువుయొక్క దేశమందు వసించునట్టివాఁడెవ్వఁడును సుఖముగా నుండఁడు.

అవ. దుర్జనులయొక్కయు సుజనులయొక్కయు స్నేహములరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ, లఘ్వీపురావృద్ధిముపైతి పశ్చాత్।
 దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా, ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్॥ 50

టీ. ఖలసజ్జనానాం=దుర్జనులయొక్కయు సుజనులయొక్కయు, మైత్రీ = చెలిమి, దినస్య=పగటియొక్క, పూర్వార్ధ...భిన్నా-పూర్వార్ధ=ముందటిసగముచేతను, పరార్ధ=వెనుకటి సగముచేతను, భిన్నా=వేఱువేఱైన, ఛాయాఇవ=నీడవలె - పగటియందు మొదటిభాగమున నొకవిధముగాను వెనుకటిభాగమున వేఱువిధముగాను నిట్లు రెండుభాగములచే రెండువిధములుగా వేఱుపడియున్న నీడవలె ననుట,

ఆరమ్భ గుర్వీ-ఆరమ్భ=ఆరంభించుసమయమున, గుర్వీ=గొప్పది- పెరుఁగునట్టిదనుట, క్రమేణ=కాలక్రమమున-ప్రొద్దెక్కఁ గొలఁదిని, క్షయిణీ=తగ్గునట్టిది - దినపూర్వభాగపునీడ యిట్లనుట, పురా=మొదట,లఘ్వీ=చిన్నది, పశ్చాత్=వెనుక, వృద్ధిం=పెరుఁగుటను, ఉపైతి=పొందుచున్నది-ఇట్టిది వెనుకటిభాగపునీడ యనుట. ఇచట యథాసంఖ్యము ఉపమ అను నలంకారములు రెంటికి సంకరము.

తే. మొదలఁ జూచిన గడుగొప్ప ♦ పిదపఁ గుఱుచ
యాదిఁ గొంచెము తర్వాత ♦ నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగ♦జనిత మయిన
చాయపోలికఁ గుజనస♦జ్జనులమైత్రి. 50

తా. దుర్జనులమైత్రి ప్రొద్దుటిపూఁటనీడవలె మొదటఁ బెద్దదిగా నుండి క్రమక్రమముగా క్షీణించిపోవును. సజ్జనులమైత్రియో మాపటిపూఁటనీడవలె మొదటఁ జిన్నదై పిదపఁ బెరుఁగుచు వచ్చును. ఈరెంటిలో నేది యుక్తమో దానిని గుశలుఁడైనవాఁడు గైకొనవలయును.

అవ. 'అకరుణత్వ మకారణవిగ్రహః' అనుచో దుర్జనుఁడు నిష్కారణముగా వైరము చూపు నని చెప్పినవిషయమునే మరల విశదముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మృగమీనసజ్జనానాం, తృణజలసన్తోషవిహితవృత్తీనామ్।
లుబ్ధకధీవరపిశునా, నిష్కారణ మేవ వైరిణో జగతి॥ 51

టి. తృణ...వృత్తీనాం-తృణ=గడ్డిపఱకలచేతను, జల=నీటిచేతను, సన్తోష=(దైవవశమున లభించినదానిచేతనె మనస్సునఁబొందు) సంతుష్టిచేతను, విహిత=కల్పింపఁబడిన, వృత్తీనాం = జీవనముగల-ఒరులను బీడించి పొట్టపోసికొనక దొరకినదానితో నెమ్మదిగాఁ గాలము గడపునట్టి యనుట, మృగమీనసజ్జనానాం-మృగ=మృగములకును, మీన=చేఁపలకును, సజ్జనానాం=సాధువులకును, లుబ్ధ...పిశునాః-లుబ్ధక=బోయవాండ్రును, ధీవర=చేఁపలనుబట్టు జాలరివాండ్రును, పిశునాః=కొండెగాండ్రును, జగతి=భూమియందు, నిష్కారణంఏవ=కారణము లేకయే, వైరిణః=శత్రువులు-ఘాతుకు లనుట. ఇచట తృణవిహితవృత్తు లగుమృగములకు లుబ్ధకులు నిష్కారణముగా వైరులు అని యీతీరున నొక్కొక్కటికి యథాక్రమముగా నన్వయము కలుగుటచే క్రమ మను నామాంతరముగల యథాసంఖ్య మలంకారము.

తే. కసవుచే నీటిచే మోద♦కలనచేత
బ్రతుకు మృగమీనసజ్జన♦ప్రకరమునకు

శబరకైవర్తసూచకశ్జనులు జగతిఁ
గారణము లేనిపగవారు కై గారె తలఁప. 51

తా. ఇతరుల నొక్కరినిగాని పీడించి పొట్టపోసికొనక గడ్డిపరకలచేత జింక మొదలైన మృగములును, నీళ్లచేతఁ జేఁపలును, దొరకినదానితోఁ దృప్తినొంది సజ్జనులును, దమతమకాలములను గడపుదురు. ఇట్లుండినను మృగములకు బోయవాండ్రును, జేఁపలకు జాలరివాండ్రును, సజ్జనులకుఁ గొండెగాండ్రును గారణములేకయే విరోధులై యున్నారు.

ఇది నీతిశతకమునందు దుర్జనపద్ధతివర్ణనమన్నది పంచమదశకము.

---

## నీతిశతకము – సుజనపద్ధతి.

---

అవ. దుర్జనపద్ధతికి వ్యతిరిక్తమైనలక్షణములతో సుజనపద్ధతిని నిరూపించువాఁడై మొదట నాదరాతిశయమువలన సుజనులకు నమస్కరించుచున్నాఁడు.

శ్లో॥ వాఞ్ఛా సజ్జనసఙ్గతౌ పరగుణే ప్రీతి ర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతి ర్లోకాపవాదా ద్భయమ్।
భక్తి శ్శూలిని శక్తి రాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసన్తి నిర్మలగుణా స్తేభ్యో నమః కుర్మహే॥ 52

టీ. సజ్జనసఙ్గతౌ = సాధువులతోడి సాంగత్యమున, వాఞ్ఛా=అభిలాష-దుర్జనులకుంబోలె వెగటుకాదనుట. ఇట్లే దుష్టులవిరుద్ధలక్షణము లెల్లఁ జెప్పఁబడియుండుట యూహ్యము. సజ్జనసాంగత్యము మోక్షసాధకమగుటచే దానియం దభిలాష యనిభావము. అది మోక్షసాధకమగుట జ్ఞానవాసిష్ఠమునందు *'మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితా। శమో విచారః సన్తోష శ్చతుర్థః సాధుసఙ్గమః॥' అనియును, శ్రీమద్భాగవతమున † 'మహత్సేవాం ద్వార మాహు ర్విముక్తేః' అనియు నిందు ‡ 'చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం సత్సఙ్గతిః కథయ కిం నకరోతి పుంసామ్' అనియును జెప్పఁబడియున్నవి. పరగుణే=ఇతరులగుణమునందు, ప్రీతిః= సంతోషము-దుష్టులవలె తప్పు పెట్టుట కావనుట. దీనిని గుఱించి యింద 'పరగుణ

---

* మోక్షద్వారమున, శమము విచారము సంతోషము నాలుగవది సాధుసంగమము అని నలుగురు ద్వారపాలకులుండునట్లు చెప్పఁబడియున్నారు.

† మహాత్ములను సేవించుటను మోక్షమునకుఁ బోవుద్వారమునుగాఁ జెప్పుదురు.

‡ చూడు 22 పుట, 20 శ్లోకము.

పరమాణూన్ పర్వతీకృత్య నిత్యం నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః' అని మీఁదఁ జెప్పఁబడుచున్నది. గురౌ=విద్య నుపదేశించువానియందు, నమ్రతా= (భక్తి శ్రద్ధాభరముచే) అణఁగియుండుట-గర్వోద్రేకము లేకుండుట, దీనిని గురించి †'యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ। తస్యైతే నిఖిలా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥' అనియు, ‡ 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః। గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥' అనియు శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. విద్యాయాం = వేదాంతాదివిద్యల నభ్యసించుటయందు, వ్యసనం = ఆసక్తి-విద్య మోక్షసాధనమును బ్రహ్మజ్ఞానము నొసంగునదియు నగుటచే దానియం దాసక్తి యని భావము- జూదము మొదలైనవానియందు కాదనుట, స్వయోషితి = తనభార్య యందు, రతిః=సంభోగము-పరభార్యలయందు కాదనుట; ¶ 'రమ్యం కులస్త్రీరతమ్' అను వచనమునుబట్టి స్వభార్యతో మాత్రమే సుజనులు సుఖింతురని భావము. లోక అపవాదాత్=లోకనిందవలన, భయం=భయము-సిగ్గుమాలియుండుట కాదనుట, §'లోకాపవాదో బలవానితి సత్యవతీ శ్రుతిః' ఇత్యాదివచనముంబట్టి లోకాపవాదము బలిష్ఠమైన దగుటచే దానికి సుజనులు భయపడుదురని భావము. శూలిని=పరదైవమగు శివునియందు, (పాఠాం) చక్రిణి=విష్ణువునందు, భక్తిః=అనురాగము-క్షుద్రదేవతల యందుఁ గాదనుట, ◊ 'శివే భక్తిః శివే భక్తిః' ఇత్యాది వచనములందు శివభక్తికి శ్రుతులు ప్రాశస్త్యము చెప్పుటవలన శివునియందు భక్తి కలిగియుందు రని భావము. ఆత్మదమనే (సతి) = తన కవమానము కలుగుచుండఁగా, శక్తిః= సామర్థ్యము- పరాక్రమించుట-ఉపశాంతితో (అనఁగా ఓర్పుతో) మిన్నకుండుట కాదనుట;॥ 'అన్యదా భూషణం పుంసాం శమో లజ్జేవ యోషితాం। పరాక్రమః పరిభవే వై యాత్యం సురతేష్వివ' అను వచనముంబట్టి పరిభవము కలిగనేని పరాక్రమము చూపుదు రని భావము. ఖలైః (సహ) = దుర్జనులతోడ, సంసర్గముక్తిః=సాంగ

---

† ఎవనికి దేవునియందును, దేవునియం దెట్లో యట్లే గురువునందును, ఉత్కృష్టమైన భక్తి గలదో యామహాత్మునికే యీసమస్తవిషయములు స్పష్టముగాఁ దెలియుచున్నవి.

‡ గురువే బ్రహ్మ. గురువే విష్ణువు. గురువే పరమేశ్వరుఁడు. గురువే సాక్షాత్పరబ్రహ్మము. అట్టి శ్రీగురువునకు నమస్కారము.

¶ కులస్త్రీసంభోగ మింపైనది.

§ లోకనింద బలీయమైన దని చెప్పుశ్రుతి సత్యమైనది.

◊ శివునియందుభక్తి శివునియందుభక్తి.

॥ సురతము తప్పఁ దక్కిన కాలమునందు స్త్రీలకు లజ్జవలె, పరిభవములేని కాలమునందుఁ బురుషులకు శమము భూషణ మగును. స్త్రీలకు సురత(కాల)ములందు దిట్టతనము (లజ్జలేమి)వలె, పురుషులకు పరిభవమునందు పరాక్రమము భూషణము.

త్యము వదలుట-వారితో సాంగత్యముచేయఁగోరుట కాదనుట; * 'దుర్జనం దూర తస్త్యజేత్' † 'దుర్జనః పరిహర్తవ్యః' ఇత్యాదివచనములంబట్టి దుష్టసహవాసము మానుదురని భావము. ఏతే=ఈ (చెప్పఁబడిన), నిర్మలగుణాః = (సజ్జనసాంగత్యము గోరుట మొదలైన) కళంకము లేనిగుణములు, యేషు= ఏపురుషులయందు, వసన్తి= వసించుచున్నవో, తేభ్యః మహద్భ్యః = ఆ మహాత్ములకొఱకు, నమస్కుర్మహే= నమస్కరించుచున్నారము. ఇట్టి గొప్పగుణములతోఁ గూడినవారే నమస్కరింపఁ దగినవా రని భావము.

మ. సుకృతిశ్రేష్ఠులగోష్ఠియుం బరగుణస్తోమంబునం బ్రీతి దే
శికసంసేవయు విద్యయందు రుచి స్వస్త్రీకేళి లోకాపవా
దకథాభీతియు విష్ణుభక్తి దమనోద్యచ్ఛక్తియుఁ సాధుదూ
షకసాంగత్యవిముక్తియుం గలమనీషావంతులం గొల్చెదన్. 52

తా. సజ్జనసహవాసమును గోరుట, పరులగుణములకు సంతోషించుట, విద్య నుపదేశించు గురువునకు భయభక్తులచే నణఁగియుండుట, వేదాంతాదివిద్యల నభ్యసించుట కాసక్తి, స్వభార్యతోమాత్రము సంభోగించుట. లోకనిందకు వెఱచుట, శివునియందు భక్తి, అవమానము కలిగనేని పరాక్రమించుట, దుర్జనులతోడిసహవాసము వదలుట, యనెడి యీ నిర్మలగుణము లెవ్వరికిఁ గలవో యట్టిమహాత్ములే నమస్కరింపఁ దగుదురు గాన వారికి నమస్కారము.

అవ. సుజనులకు స్వభావసిద్ధములైనగుణములను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ విపది ధైర్య మథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః।
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్॥ 53

టీ. విపది=ఆపత్కాలమందు, ధైర్యం=ధైర్యము-నిర్వికారచిత్తము(అనఁగా కలఁకనొందనిమనస్సు) గలిగియుండుట-దీనత్వముకాదనుట; అథ=పిదప, అభ్యుదయే=సంపదయందు, క్షమా=సహించుట-మన్నించుట-ఉగ్రతకాదనుట; సదసి=రాజునువిద్వాంసులుఁనుండు) సభయందు,వాక్పటుతా=చక్కఁగామాటాడుశక్తి-లేకసరసవచనరచనాచాతుర్యము-మూఁగవలెనుండుట కాదనుట;యుధి=యుద్ధరంగమందు, విక్రమః=పరాక్రమము-పలాయనము కాదనుట; యశసి=కీర్తియందు, అభిరతిః= సంపాదింపవలయునను కోరిక-అనాదరము కాదనుట; శ్రుతౌ = వేదశాస్త్రముల నభ్యసించుటయందు, వ్యసనం=ఆసక్తి-హేయముగాఁ దలఁచుట కాదనుట; ఇదం=

---

* దుర్జనుని దూరముననే విడువవలయును.

† దుర్జనుఁడు పరిహరింపవలయువాఁడు.

ఇది-ఈచెప్పఁబడినదంతయు, మహాత్మనాం=మహానుభావులకు, ప్రకృతిసిద్ధంహి=స్వభావసిద్ధమైనదిగదా.

ఉ. ఆపదలందు ధైర్యగుణ మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటుశక్తియున్ యశమునం దనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతిసిద్ధగుణంబులు సజ్జనాళికిన్. 53

తా. ఆపత్కాలమందు మనోధైర్యము కలిగియుండుట, సంపద కలిగినప్పుడు ఓర్పు కలిగియుండుట, రాజును బండితులును గలసభలందుఁ జక్కఁగా నేర్పుతో మాటలాడుట, యుద్ధమునందుఁ బరాక్రమము నెఱపుట, కీర్తి నార్జింపవలయునను కోరిక, వేదశాస్త్రము లభ్యసించుటయం దాసక్తియనెడియీగుణములన్నియు మహాత్ములైనవారికి స్వభావసిద్ధములుగా నుండును.

అవ. సజ్జనులకు మణిసువర్ణాదులచేఁ జేయఁబడుహారకటకాది ప్రసిద్ధభూషణములు భూషణములు గావనియు, వారిభూషణము లాప్రసిద్ధభూషణములకంటె వేఱువిధముగా నుండు ననియుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కరే శ్లాఘ్య స్త్యాగః శిరసి గురుపాదప్రణయితా
ముఖే సత్యా వాణీ విజయి భుజయో ర్వీర్య మతులమ్।
హృది స్వచ్ఛావృత్తిః శ్రుత మధిగతం చ శ్రవణయో
ర్వినా ప్యైశ్వర్యేణ ప్రకృతిమహతాం మణ్డన మిదమ్॥ 54

టీ. కరే=హస్తమునందు, శ్లాఘ్యః=సకలలోకప్రశస్తమైన, త్యాగః=దానము, మణ్డనం=భూషణము-కంకణములు కాదనుట, ఇందు *'దానేన పాణి ర్నతు కఙ్కణేన' అని మీఁదఁజెప్పబడుచున్నది; శిరసి=శిరస్సునందు, గురు...ప్రణయితా-గురుపాద= గురువుయొక్క పాదములందు, ప్రణయితా=(మ్రొక్కుటకు) ఆసక్తి (భూషణము)-మణిసువర్ణమయకోటీరాదులు కావనుట; ముఖే=ముఖమునందు, సత్యావాణీ=సత్యమైనవాక్కు-నిజముచెప్పుట (భూషణము)-తాంబూలచర్వణాదులు కావనుట; భుజయోః=బుజములందు, అతులం= సమానములేనిదియు, విజయి=జయశీలమైనదియును అగు, వీర్యం=బలము, (భూషణము) -బాహుపురులు మొదలైనవి కావనుట;హృది=(వృత్తిపరముగా)మనస్సునందు,(భూషణపరముగా)వక్షస్స్థలమునందు, స్వచ్ఛావృత్తిః=నిర్మలమైనవ్యాపారము (భూషణము)-హారాదులు కాదనుట; ఇచట స్వచ్ఛవృత్తి మండనముగా నిరూపితముగదా. అయిననుస్వచ్ఛవృత్తికి స్థానము అంతరంగము, మండనమునకు స్థానము వక్షము, కాఁబట్టి రెంటికిని బొసఁగునట్లుగా

*చూ॥ నీతిశతకము-పరోపకారపద్ధతి, 63 శ్లోకము.

నారెంటికిని బర్యాయ మగు హృత్ శబ్దమును బ్రయోగించినాఁడని తెలియవలయును. శ్రవణయోః=రెండుచెవులయందు, అధిగతం=పొందఁబడిన-వినఁబడిన యనుట, శ్రుతం=శాస్త్రము (భూషణము)-కుండలములు కావనుట-ఇందే 'శ్రోత్రం శ్రుతేనైవ న కుణ్డలేన' అని మీఁదఁ జెప్పఁబడును. ఇదం=ఇది-ఈచెప్పఁబడిన దానాదులన్నియు ననుట, ఐశ్వర్యేణవినా=ధనరత్నసంపత్తి లేకపోయినను, ప్రకృతిమహతాం=స్వభావముచేత మహాత్ములైనవారికి-సుజనత్వము గలవారి కనుట, మణ్డనం=భూషణము. హారకంకణాది ప్రసిద్ధభూషణములకంటె దానాదిరూపములైన భూషణములే లోకోత్తరమైన రామణీయకత్వమును గలిగించు నని భావము. భూషణమునకుఁ గారణమైన యైశ్వర్యము లేకపోయినను ఐశ్వర్యమునకు ఫలమైన భూషణము వ్యక్తమగుటచే నిచట నలంకారము విభావన.

చ. కరమున నిత్యదానము ముఖంబున సూనృతవాణి యాఁదలం
గురుచరణాభివాదన మకుంఠితవీర్యము దోర్యుగంబునన్
వరహృదయంబునన్ విశదవర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబు లివి శూరులకున్ సిరి లేనియప్పుడున్. 54

తా. స్వాభావికముగా సుజనులై యుండుమహాత్ము లైశ్వర్యము లేమిచే హారకంకణాద్యాభరణము లేనివారైనను వారి నాభరణహీనులనుగాఁ దలంపరాదు. వారి యవయవములకుఁ బ్రసిద్ధములైన కంకణాద్యాభరణములకంటె మిక్కిలియు రమణీయములైన యాభరణములు వేఱు గలవు. ఎట్లన, వారిహస్తములకుఁ బ్రశస్తమైన దానమును, శిరస్సునకు గురుచరణప్రణామమును, ముఖమునకు సత్యభాషణమును, భుజములకు జయమునిచ్చునట్టి యసమానబలమును, హృదయమునకు నిర్మలవృత్తియుఁ, జెవులకు శాస్త్రశ్రవణమును అనెడియివియే యాభరణములు. తక్కినయాభరణము లిట్లు లోకోత్తరరమణీయములైనవిగావు.

అవ. సుగుణములు కలిగియుండుటవలన లాభ మేమని యడుగఁగా నవి మిక్కిలి శ్రేయస్కరము లని తెలుపుచున్నాఁడు.

శ్లో॥ ప్రాణాఘాతా న్నివృత్తిః పరధనహరణే సంయమః సత్యవాక్యం
కాలే శక్త్యా ప్రదానం యువతిజనకథామూకభావః పరేషామ్।
తృష్ణాస్రోతోవిభఙ్గో గురుషుచ వినయః సర్వభూతానుకమ్పా
సామాన్యం సర్వశాస్త్రే ష్వనుపహతవిధిః శ్రేయసా మేష పన్థాః॥

టీ. ప్రాణ అఘాతాత్=ప్రాణహింసనుండి-ప్రాణులను హింసించుటవలననుండియనుట, నివృత్తిః=నివర్తించుట-తొలంగుట, పరధనహరణే=ఇతరులద్రవ్యము నపహరించుటయందు, సంయమః=మనోనిగ్రహమును, కాలే=సమయమందు-సత్యము చెప్ప

వలసినట్టిసందర్భమునం దనుట, సత్యవాక్యం=యథార్థమును జెప్పుటయు, ఇచట 'బ్రాహ్మణార్థేగవామర్థే' ఇత్యాదులందుగోబ్రాహ్మణాదులరక్షణకుఁ గానుఅసత్యమును బలుక వచ్చునని శ్రుతిచెప్పుటచే నెప్పుడును సత్యమే చెప్పవలయుననుట విహితముకాఁజాలదు. కాఁబట్టి సత్యమును జెప్పఁదగినకాలమందే చెప్పవలయు నని తెలుపుటకై 'కాలే' అని ప్రయుక్తమైనది. శక్త్యా=శక్తిచేత-శక్తికొలఁదిని-ద్రవ్యమునకుఁదగినట్లుగా, ప్రదానం=దానమును, పరేషాం=ఇతరులయొక్క, యువతి...భావః-యువతిజనకథా=స్త్రీలవృత్తాంతమును జెప్పుటయందు, మూకభావః=మూఁగతనము-ఏమియుఁజెప్పక మిన్నకుండుట-పరస్త్రీలనుగుఱించి మాటలాడుకొనుటయే కూడదనఁగా ఇఁక వారిని గోరఁదగదనుట చెప్పవలయునా యనిభావము, తృష్ణా...విభఙ్గః-తృష్ణాస్రోతః=(ధనమును పొందవలయు ననెడి) యాశాప్రవాహముయొక్క, విభఙ్గః=నిరోధమును-అడ్డగించుటయుఁ, బ్రవాహమువలెఁ బైపైసాగు తనయాశను సాఁగనీక యంతటితో నిలుపుట, గురుషు=గురువులయందు, వినయంచ=నమ్రత్వమును సర్వ...కమ్పా-సర్వభూత=సమస్తప్రాణులందును, అనుకమ్పా=దయయు, (అనఁబడు)ఏషః=ఈ,శ్రేయసాం=(అఖండైశ్వర్యము మొదలైన) శ్రేయస్సులకు, లేక, ప్రశస్యులైన వారియొక్క, పన్థాః=మార్గము-శ్రేయస్సులను బొందునట్టిమార్గమనుట-ప్రాణాఘాతనివృత్తిమొదలైనవానిరూపమున నున్నయీశ్రేయోమార్గమనిభావము, సర్వశాస్త్రేషు=సకలశాస్త్రములందును, సామాన్యః=సమానముగా నుండునది- శాస్త్రములన్నియు నీమార్గమును బ్రతిపాదించుచున్నవనుట. మఱియు, అనుపహతవిధిః=కొట్టువడని(అడ్డగింపఁబడని)యనుష్ఠానముగలది-దీని ననుష్ఠింపఁగా నేయాటంకమునులేక ఫలముకలుగుననుట. లేక, కొట్టువడనిశాస్త్రవిధులు గలది-అనఁగా శాస్త్రవిధుల నతిక్రమింపనిది. ఇట్టిగుణసంపత్తి సుజనులకే గనుక వారు శ్లాఘ్యులని యాశయము.

మ. పరహింసాపరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వ మన్యవనితోదంతోక్తిమూకత్వముం
బరతృష్ణాఝురభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణా శాస్త్రసమత్వసద్విధులు భద్రప్రాప్తికి మార్గముల్. 5.

తా. *('మాహింస్యాత్సర్వభూతాని' 'అహింసా పరమోధర్మ స్త్వధర్మః ప్రాణినాం వధః' ఇత్యాదిప్రమాణములచే నగ్నిషోమీయయజ్ఞమందుఁ జేయుపశువధము తప్పఁ దక్కినహింస నిషిద్ధమని శ్రుతిచెప్పుటచే) ప్రాణహింసచేయుటను మాను

---

*సమస్తభూతములను హింసింపరాదు. హింసచేయమియే పరమధర్మము. ప్రాణులను వధించుటే యధర్మము.

టయు; *'పరద్రవ్యాణి లోష్టవత్' అను న్యాయమునుబట్టి పరధనాపహరణమందు మనస్సును బోనీక యడంచుటయు; ('బ్రాహ్మణార్థే గవామర్థే' అనునట్లు గోబ్రాహ్మణాదులను రక్షించుటకు నసత్యము చెప్పినను నిషిద్ధము కాదు. అట్టిసమయములందు వానికి బాధకమగు సత్యమైనను నిషిద్ధము కావున సత్య మైనంతమాత్రమున సమయ మెఱుఁగక చెప్పరాదుగాన) సమయమెఱిఁగి సత్యము పలుకుటయు; ('వి త్తశాఠ్యం నకారయేత్' అనునట్లు,) శక్తికొలఁది దానముచేయుటయు; †('స్వప్నే ప్యన్యవధూకథామ్' అనునట్లు) పరస్త్రీలవృత్తాంతముల మాఁగవలె నెంతమాత్రమును బలుకక యూరకుండుటయు; ప్రవాహమువలె మీఁదుమిక్కిలి సాఁగునట్టి యాశను నిలుపుటయు; ('గురౌ నమ్రతా' అనునట్లు) గురువులయెడ నడఁకువయు; సమస్తప్రాణుల యెడ దయయు ననునివియే యఖండిమైశ్వర్యము మొదలైన శ్రేయస్సులను బొందుమార్గము. మఱియు నివి సర్వశాస్త్రములందును బ్రతిపాదితమై విధ్యుక్తమై, కోరినకోర్కుల తప్పక నొడఁగూర్చునదియై యొప్పును.

అవ. ఆపదలందును సంపదలందును సజ్జనులమనస్సు ఉండెడిరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సమ్పత్సు మహతాం చిత్తం, భవే దుత్పలకోమలమ్।
‡ఆపత్సు చ మహాశైల, శిలాసఙ్ఘాతకర్కశమ్॥ 56

టీ. సమ్పత్సు=సంపదలందు - ధనధాన్య వస్తువాహనాది సమృద్ధులయందు, మహతాం=మహాత్ములయొక్క-సజ్జనులయొక్క యనుట, చిత్తం=మనస్సు, ఉత్పల కోమలం=కలువలవలె మెత్తనిదిగా, భవేత్=అగును-కఠినమైనది కాదనుట, ఆపత్సు= ఆపదలందు-దారిద్ర్యము మొదలైన యనర్థసంకటములందు, మహా...కర్కశం-మహాశైల=పెద్దకొండలయొక్క, శిలాసఙ్ఘాత=రాలసమూహమువలె, కర్కశంచ=కఠోరమైనదియు, (భవేత్=అగును)-అధైర్యముచే వికవికలు గాదనుట, వారిమనస్సు ఇచటఁ జెప్పఁబడినట్లుండునే గాని వేఱువిధమున నుండదు. అట్లుండినయెడల వారు మహాత్ములు కానేరరని భావము. వివేకులుగాని అవివేకులుగాని యిట్టిపద్ధతినేఁ(అనఁ

* పరులద్రవ్యములను మట్టిపెళ్లవలెఁ జూడవలెను.

† స్వప్నమందును పరస్త్రీలను గుఱించిన విషయములను స్మరింపరాదు.

‡ ఇదియే 'సౌజన్యామృతసిన్ధవః పరహితప్రారబ్ధవీరవ్రతాః । వాచాలాః పరవర్ణనే నిజగుణాలాపేచ మౌనవ్రతాః। ఆపత్స్వ ప్యవిలుప్తధైర్యనిలయాః సంపత్స్వనుత్సేకినో । మాభూవ న్ఖలవక్త్రనిర్గతవిషమ్లానాననాః సజ్జనాః' అని మఱియొకచోటను జెప్పఁబడినది.

గా ఇట్టిమనోవృత్తినే యాదరింపఁదగు నని తాత్పర్యము). 'మహాశైల'అనుచో శైల మునకు 'మహత్' అను విశేషణము పెట్టుట అట్టిదాని శిలాసమూహము భేదింపరాని దని తెలుపుటకొఱ కని యెఱుఁగునది. ఇందు అలంకారము ఉపమ.

తే. సంపదలు గల్గుతఱి మహాఁజనులహృదయ
మభినవోత్పలకోమలం ఁ బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మఁహామహీధ
రాశ్మసంఘాతకర్కశం ఁ బై తనర్చు. 56

తా. మహాత్ము లగుసజ్జనులయొక్క మనస్సు ధనధాన్యాదిసంపదలు కలిగిన ప్పుడు గర్వముచేఁ గఠినముగాక కలువపూవువలెఁ గోమలమైనదిగానే యుండును. దారిద్ర్యము మొదలైనయాపదలు కలిగినపుడు దిగులుపడి విలవిలఁబోక పెద్దకొండ యొక్క గడంశిలవలె భేదింపరానిదై కఠోరముగా నుండును.

అవ. ఇట్టిసజ్జనవృత్తి సాధారణమైనదికాదు. ఇది మిక్కిలియరు దని యిఁక రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ప్రియా న్యాయ్యా వృత్తి ర్మలిన మసుభఙ్గేఽప్యసుకరం
త్వసన్తో నాభ్యర్థ్యాః సుహృదపి న యాచ్యః కృశధనః ।
విప ద్యుచ్చై ర్ధైర్యం పద మనువిధేయంచ మహతాం
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్॥ 57

టీ. న్యాయ్యా=న్యాయముతోఁ గూడినట్టి-నీతియుక్తమైన, వృత్తిః = వర్త నము, ప్రియా=ఇష్టమైనది-(ఇట్టివర్తనమే శ్రేయస్కరముగాన నిదియే యిష్టమైనవి గాని వేఱొక్కటికాదని భావము.) అసుభఙ్గే అపి = ప్రాణప్రయాణమందును - ప్రాణమునకు కష్టము కలిగినప్పుడుకూడ-ఇంక వేఱొకప్పుడు చెప్పనేల యని భావ ము, మలినం = పాపకర్మము, అసుకరం=చేయఁదగినది కాదు-ఇట్లు చేయకుండుటయే యైహికాముష్మికఫలప్రదము గాన 'ఆపత్కాలే నాస్తి మర్యాదా=ఆపత్కాలమం దు మర్యాద యక్కఱలేదు' అను న్యాయము ననుసరించి తగనికార్యము చేయరాదని భావము. అసన్తః=దుష్టులు, న అభ్యర్థ్యాః=ఏ విషయమునందును వేఁడఁదగినవారు కారు- దుష్టు లుపేక్షింపఁదగినవారే యగుదురుగాన సజ్జనులనే యేవిషయమందుఁ గాని వేఁడుకొనఁదగు నని భావము. 'న పదాదౌ ఖల్వాదయః, పదాదిని ఖలుమొద లైనవి రాఁగూడదు' అని వామనుఁడు చెప్పి యుండుటవలన నిచట 'త్వసన్తః= తు+అసన్తః' అని పదాదిని తు శబ్దము ప్రయోగించుట దోషమైనను కవిప్రౌఢిచే నట్లు ప్రయుక్తమైనదని తెలియవలయును. సుహృదపి=మిత్రుఁడైనను- ప్రాణప్రియ బంధువైన ననుట - ఇఁక తక్కినవారిని జెప్పనేల యని భావము, కృశధనః=

కృశించినధనము గలవాఁడు-ధనములేనివాఁడు, నయాచ్యః=(ధనాదులను) యాచింపఁ దగినవాఁడు కాఁడు. ధనాఢ్యునే ధనాదులను యాచింపఁదగును గాని ధనహీనుని యాచించుట మిక్కిలి యనుచితముగాన వాఁ డెంత ప్రాణమిత్రుఁడుగా నుండినను వానిని యాచింపరాదనుట. విపది=ఆపదయందును, ఉచ్చైః ధైర్యం=అధికమైనధీరత్వము, 'ఆపత్స్వప్యవిలుప్తధైర్యనిలయాః' 'విపది ధైర్య మథాభ్యుదయే క్షమా' అనునట్లు ఆపదలందు ధైర్యము కలిగియుండవలయునే కాని భయముచే విలవిలఁబోరాదని భావము, మహతాం=మహాత్ములకు, అనువిధేయం=అనుకూలమైన, పదం=వ్యవసాయము-పూనిక (అనెడి), ఇదం=ఈ, విషమం= (అసాధారణ మైనదనుటచే) దుష్కరమైన, *అసిధారావ్రతం= కత్తివాఁదరవంటివ్రతము, సతాం= సత్పురుషులకు, కేన = ఎవనిచేత, ఉద్దిష్టం=ఉపదేశింపఁబడినది-అది వారికి స్వతస్సిద్ధమైనదే కాని యెవరిచేతను ఉపదేశింపఁబడినది కాదని భావము-అసిధారావ్రతమనఁగా, కత్తివాఁదరవలె వాఁడియైన దనికాని లేక కత్తివాఁదరను గ్రిప్పసాధనవలె మిగుల మెలపుతోను హెచ్చరికతోను జేయఁదగిన వ్రతమని కాని లేక కత్తి వాఁదరతో వ్యవహరించువారియొక్క (అనఁగా వీరులయొక్క) వ్రత మనికాని యర్థము గ్రహింపవలయును.

మ. అసమానప్రియనీతివర్తనము ప్రాణాంతంబునందుఁ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసంపత్ప్రార్థనాభావముఁ
వ్యసనావాప్తిని ధైర్యముం బుధజనాత్యంతానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహాశ్రేణికిం దెల్పెనో. 57

తా. న్యాయమైన వర్తనమునే యిష్టపడుట, ప్రాణసంకటము కలిగినపుడు కూడ దుష్కార్యములు చేయకుండుట, ఎట్టి విషయమునందుఁ గాని దుష్టులను బోయి ప్రార్థింపకుండుట, ఎంతప్రాణమిత్రుఁ డైనను ధనహీనుఁడుగా నుండెనేని వానిని బోయి యాచింపకుండుట, ఆపత్కాలమందు మిక్కిలి ధైర్యము కలిగి యుండుట, మహాత్ముల కనుకూలము లయిన ప్రయత్నములనే చేయుట, అనెడి యీదుష్కరమైన అసిధారావ్రతము సజ్జనులకు స్వభావముచేతనే కలుగునుగాని యొకరియుపదేశము వలన వచ్చునదికాదు.

---

* 'అసిధారావ్రతమ్-అసిధారాయాం స్థితిరివ దుష్కరం వ్రతమ్' కత్తివాఁదరమీఁద నిలుచుకొనుటవలె దుష్కరమైన వ్రతము అని కొందఱిమతము. 'యత్రైకశయన స్థాపి ప్రమదా నోపభుజ్యతే । అసిధారావ్రతం నామ వదన్తి మునిపుఙ్గవాః॥' అనునట్లు కాంత తనతోడఁగూడ నేకశయ్యను పరుండుచున్నదైనను దానితో భోగింపకుండునట్టి నియమము అసిధారావ్రతము. లేక, 'శయనే మధ్యే ఖడ్గం నిధాయ స్త్రీపుంసౌ యత్రబ్రహ్మచర్యేణ స్వపతస్తత్' పడుకనడుమఁ గత్తి నుంచి యందు స్త్రీ పురుషులిరువురు పరుండి బ్రహ్మచర్యముతో నిదురపోవునట్టి నియమము. లేక, 'యువా యువత్యా సార్ధం య స్ముగ్ధ భర్తృవదాచరేత్। అంతర్నివృత్తసంగ

శ్లో॥ ప్రదానం ప్రచ్ఛన్నం గృహ ముపగతే సంభ్రమవిధిః
ప్రియం కృత్వా మౌనం సదసి కథనం చాప్యుపకృతేః।
అనుత్సేకో లక్ష్మ్యాం నిరభిభవసారాః పరకథాః
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రత మిదమ్॥ 58

టీ. ప్రచ్ఛన్నం=రహస్యమైన, ప్రదానం=దానమును-రహస్యదానమునకే మహాఫలము కలుగుననుటవలన దానమును ప్రకాశముగాఁ జేయరాదనిభావము. గృహం ప్రతి=తనయింటిని గూర్చి, ఉపగతేసతి=యాచకుఁడు రాఁగా, సంభ్రమవిధిః=(ఎదురుకొనుట వందనముచేయుట మొదలైన) సంభ్రమముతోఁగూడిన వ్యాపారములు చేయుటయు-అలక్ష్యముగా నూరకుండక లేచి యెదుర్కొనుట మొదలైనయాదరణలు త్వరపడి చేయుటయు-ఇట్లు చేయుటయే శాస్త్రోక్తమైన యాచారము గనుక విముఖముగా నుండరాదనిభావము. ప్రియం=(ఆయతిథికి) ఇష్టమైనదానిని, కృత్వా=చేసి, మౌనం=ఊరకుండుటయు-చేసినదానిని చెప్పుకొనకుండుటయు ననుట. 'కృతస్యాపరికీర్తనమ్' 'నదత్వాపరికీర్తయేత్' అను మనుస్మృతినిఁబట్టి చేసినమేలును ప్రకటించుకొనకుండుటయు నని భావము, సదసి= (రాజులు పండితులు నుండు) సభయందు, ఉపకృతేః=ఒకరు తమకుఁ జేసిన యుపకారముయొక్క, కథనం=చెప్పుటయు-చెప్పక మిన్నకుండుట గాదనుట, అట్లుచెప్పనియెడల కృతఘ్నత కలుగును గనుక చెప్పుకొనఁదగునని భావము. లక్ష్మ్యాం=సంపదయందు, అనుత్సేకః= గర్వములేమియు-మదాంధత్వము కాదనుట 'సమ్పత్స్వనుత్సేకినః' అని చెప్పి యున్నట్లు గర్వములేకుండుట యనిభావము. నిరభిభవసారాః=నిందింపమియే సారముగాఁ గలిగిన-నిందించుటయే లేనట్టి, పరకథాః = ఇతరపురుషులను గూర్చిన ప్రస్తావములును-ఇతరులనుగూర్చి ముచ్చటించునపుడు వారిని గొంచెమైనను నిందింపకుండుటయు ననుట. 'ఆత్మప్రశంసాం పరగర్హాంచ వర్జయేత్' అను స్మృతిప్రకారమున ఒకరిని నిందింపకుండుట యనిభావము. (అనెడి) ఇదమ్=ఈ, విషమం=దుష్కరమైన, అసిధారావ్రతం=అసిధారావ్రతము, సతాం=సజ్జనులకు, కేన=ఎవనిచేత, ఉద్దిష్టం=ఉపదేశింపఁబడినది-స్వతస్సిద్ధమైనదే కాని ఒకరిచే నుపదేశింపఁబడినది కాదనుట. సముచ్చయాలంకారము.

మ. పొసఁగం దానము గుప్త మర్థి భవనంబుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థానవిధానముం బ్రియవిధుల్ గావించి మౌనంబు రా

---

స్స్యాదసిధారావ్రతం స్మృతమ్' ఒక యౌవనవంతుఁడు తనయువతితోఁ గలసి యుండియు మనస్సున సంగమును వదలినవాఁడై మిక్కిలి బేలయగు భర్తవలె సేవికారమును బొందక దానియెడల నడచుకొనునట్టి నియమము; అనియు కొందఱిమతము.

జనభర్తృ మిత్రకృతప్రకాశనము గుర్తాస్కరత్నమై ముఖ్య మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహాశర్యశ్రేణికిం దెల్పెనో. 58

తా. రహస్యముగా దానము సేయుటయు, యాచకుఁ డింటికివచ్చినపుడు మొగము త్రిప్పకొని మిన్నకుండక యెదుర్కొని వందనాదులు సంభ్రమముతోఁ జేయుటయు, వాని కిష్టమైనదానిని జేసి చెప్పకొనకుండుటయు, రాజులు పండితులు నుండు సభలందు తమ కొకరు చేసినయుపకారమును జెప్పటయు, సంపద కలిగినపుడు గర్వములేకుండుటయు, పరులవిషయములను నిందారహితముగా ముచ్చటించుటయు, ననెడి యీ దుష్కరమైన యసిధారావ్రతము సజ్జనులకు స్వభావసిద్ధమైనదే కాని ఎవరియుపదేశముచేతను వచ్చినది కాదు.

అవ. అధములు, మధ్యములు, ఉత్తములు. అను నీ మువ్వురి యొక్క వృత్తులను దెలియఁజేయుచున్నాఁడు.

శ్లో॥ సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం దృశ్యతే।
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే
ప్రాయేణాధమమధ్యమోత్తమజుషా మేనంవిధా వృత్తయః॥ 59

టీ. సన్తప్తఅయసి=చక్కఁగా కాలినయినుమునందు, సంస్థితస్య=ఉన్నట్టి-ఉంపఁబడినట్టి యనుట, పయసః=జలముయొక్క, నామ అపి=పేరుమాత్రముకూడ, న శూ్రియతే=వినఁబడదు-మొదలంట నశించుచున్న దనుట-దానిపేరే లేనపుడు దాని స్వరూపమును జూచుట యెక్కడిదని భావము. తదేవ=అదియే-ఆజలమే, నలినీ పత్రస్థితంసత్=తామరపాకునందున్నదై, ముక్తాకారతయా = ముత్యముయొక్క యాకారములో-ముత్యమువలెననుట, దృశ్యతే=చూడఁబడుచున్నది-ముత్యమువలెనేయుండునుగాని ముత్యమే కాదనుట. తత్=ఆజలమే, అన్త...పతితం సత్-అన్తస్సాగర= సముద్రములోపలఁగల, శుక్తి=ముత్తెపుఁజిప్పయొక్క, మధ్య=నడుమ-కడుపునందనుట, పతితంసత్=పడినదై, మౌక్తికం=ముత్యముగా, జాయతే=పుట్టుచున్నది-మంచిముత్యముగా పరిణమించు చున్నదనుట. ప్రాయేణ=తఱుచుగా, అధమ మధ్యమ ఉత్తమ జుషాం=నీచమైనవియు నడితరమైనవియు హెచ్చైనవియు నగు ఆశ్రయములను బొందినవారికి, ఏవం విధాః=ఇటువంటి, వృత్తయః=వ్యాపారములు (కలుగుచున్నవి) ఇందు యథాక్రమముగా అన్వయ ముండుటవలన యథాసంఖ్యాలంకారము. మన మాశ్రయించిన దెట్టిదియో అట్టిస్థితియే మనకుఁ గలుగుచున్నది గాన 'నీచాశ్రయో న కర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః' అన్నట్లు గొప్పదానినే యాశ్రయింపవలయు నని యాశయము.

ఉ. నీరము తప్తలోహమునన్ నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁ బడి మణిత్వము గాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తు లిట్లధమున్ మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్. 59

తా. మిక్కిలికాలియున్న యినుమునందు జలమును బోసినయెడల నది పేరు కూడ తెలియనట్లు మొదలంట నశించుచున్నది. ఆజలమే తామరాకుమీఁదఁ బడి తళ తళలాడుచు నిజమైన ముత్యము కాకపోయినను ముత్యమువలెనే కానఁబడుచున్నది. అదియే సముద్రమధ్యమునను న్న ముత్తెపుఁజిప్పలోపలఁబడి నిజమైనముత్యమే యగుచు న్నది. కావున అధమములు మధ్యమములు ఉత్తమములు నైనవానిని ఆశ్రయించిన వారికి తఱుచుగా నీరీతినే అధమములు మధ్యమములు ఉత్తమములు నైన వ్యాపారములు వరుసగాఁ గలుగుచున్నవి.

అవ. పుణ్యము లాచరించువారికే మంచి పుత్రమిత్రకళత్రములు కలుగు నని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ప్రీణాతి య స్సుచరితైః పితరం స పుత్రో
యద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్।
తన్మిత్ర మాపది సుఖేచ సమక్రియం య
దేతత్త్రయం జగతి పుణ్యకృతో లభన్తే॥ 60

టీ. యః=ఎవ్వఁడు, సుచరితైః=(చెప్పినట్లుచేయుట మొదలైన) మంచిన డవడులచేత, పితరం=తండ్రిని, ప్రీణాతి = సంతోషింపఁజేయునో, సః పుత్రః = వాఁడే పుత్రుఁడు- పున్నామనరకమునుండి కాపాడువాఁడు అను వ్యుత్పత్తిప్రకార ముగా* పుత్రశబ్దమునకుఁ దగినవాఁ డనుట. యత్=ఏది, భర్తుః=పెనిమిటికి, హితం= హితమైనదానిని, ఇచ్ఛతి=(చేయఁ) గోరుచున్నదో,తదేవ=అదియే, కళత్రం=భార్య- తనయిచ్ఛచొప్పున నడచుకొనునట్టిది కా దనుట. యత్ = ఏది-ఎవఁడనుట, ఆపది= ఆపత్కాలమందును, సుఖేచ=సంపత్కాలమందును, సమక్రియం=సమానమైన వృత్తి గలదో-ఒక్కవిధముననే నడచుకొనునో, తదేవ=అదియే-వాఁడే యనుట, మిత్రం=మిత్రము-స్నేహితుఁడు- ఆపదవచ్చినపుడు విడుచుటయు సంపదవచ్చినప్పుడు

* జీవతో ర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్। గయాయాం పిణ్డదానేన త్రిభిః పుత్రస్య పుత్రతా' తలిదండ్రులు జీవించియుండఁగా వారు చెప్పినట్లు నడచుకొనుట, వారు గతించిన వెనుక ప్రతిసంవత్సరమును శ్రాద్ధమున మిక్కిలి భో జనముపెట్టుట, గయయందు వారికి పిండములు పెట్టుట, అను నీమూఁటిచే పుత్రునికి పుత్రత్వము కలుగుచున్నది; అని స్మృతి.

అనువర్తించుటయుఁ గలవాఁడు మిత్రుఁడు కాఁడనుట. ఏతత్ త్రయం=ఈమూటిని-ముగ్గురినసుట, జగతి=పుడమియందు, పుణ్యకృతః=ధన్యులు, లభన్తే=పొందుచున్నారు-పుణ్యహీనులు పొందరనుట. ఇట్టి పుత్రమిత్రకళత్రములు మహాపుణ్యమువలననే కలుగుదురుగాన పుణ్యముచేయువారే వారిని బొందుదురనిభావము.

చ. జనకుని బూజలం గడుఁ బ్రసన్నుని జేయునతండు పుత్రుఁ డే
వనితమెలంగు భర్తృవశవర్తినియై యది సత్కళత్ర మే
జనుఁడు విపత్తిసౌఖ్యసదృశక్రియఁ డాతఁడు మిత్రుఁడీత్రయం
బును జగతిన్ లభించుఁ గడుఁ బుణ్యముఁ జేసినయట్టివారికిన్. 60

తా. మంచినడవడిచేఁ గన్నతండ్రిని సంతోషపెట్టువాఁడే పుత్రుడు. పెనిమిటికి హితము గోరునదియె పెండ్లము. ఆపదయందుఁగాని సంపదయందుఁగాని సమముగా చెలిమికలిగి యుండువాఁడే చెలికాఁడు. లోకమున నిట్టి ముగ్గురును పుణ్యాత్ములకే కల్గును.

అవ. సజ్జనులు మిక్కిలియు గొప్పతనముగలవారగుటచే నందఱికిని బూజ్యులనుచున్నాఁడు.

శ్లో॥ నమ్రత్వేనోన్నమన్తః పరగుణకథనైః స్వాన్గుణాన్ఖ్యాపయన్తః
స్వార్థాన్సమ్పాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే।
క్షాన్త్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్దుర్జనాన్దుఃఖయన్తః
సన్తస్సాశ్చర్యచర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్చనీయాః॥

టీ. నమ్రత్వేన=అణఁకువచేత, ఉన్నమన్తః=ఉన్నతిని పొందుచున్నట్టివారును- అణఁకువయే యున్నతికి హేతువు గాన దానిచే నున్నతిని బొందుచున్నవారనుట, పరగుణకథనైః=ఇతరులయొక్క సుగుణములను వర్ణించుటలచే-తమగుణములను వర్ణించుకొనుట చేతఁగాదనుట, స్వాన్ గుణాన్=(సౌజన్యము మొదలైన) తమయొక్కగుణములను, ఖ్యాపయన్తః=ప్రకటించుచున్నవారును-ఒకరిగుణములను వర్ణించుటయే తమసుగుణములు ప్రకటితమగుటకు హేతువుగాన అట్లు వారిని వర్ణించుటచే తమసుగుణములే ప్రకటింపఁబడుచున్నవని భావము. పరార్థే=పరులయొక్కప్రయోజనమందు, వితత...యత్నాః-వితత=విస్తరించినదైన, పృథుతర=మిక్కిలి గొప్పవియగు, ఆరమ్భ=కార్యములయందు, యత్నాః సన్తః= పూనికగలవారై, స్వార్థాన్ =తమప్రయోజనములను, సంపాదయన్తః= సంపాదించుకొనుచున్నవారును-ఒడఁగూర్చుకొనుచున్నవారనుట-వారు పరులకొఱకు గొప్పకార్యములను జేయఁబూనఁగా వారికార్యములను పరులుఁతామై సాధించి యిచ్చుచున్నా రనుట- తమ కార్యములనుమాత్రమే చూచుకొన్నవారు కా దనుట, 'వితత' శబ్దము 'యత్న'మునకు

విశేషణము, క్షాన్త్యైవ=ఓర్పుచేత నే-ఉగ్రతచేత కాదనుట,ఆక్షే...ముఖాన్-ఆక్షేప=నిందచేత, రూక్ష=పరుషములైన, అక్షర=వాక్యములచేత,ముఖర=శబ్దించుచున్న-కఠినవాక్యములను వదరుచున్నయనుట, ముఖాన్=ముఖములుగల, దుర్జనాన్=దుష్టులను, దుఃఖయన్తః=సంతాపము నొందునట్లు చేయువారును-తమయోర్పే దుష్టులకు హృదయశల్యమువలె బాధించును గాన నాయోర్పుచేత నే వారిని దుఃఖింపఁజేయుచున్నారని భావము. ఇట్లు కావున నే, సాశ్చర్యచర్యాః=మిక్కిలియాశ్చర్యకరమైన చరిత్రముగలవారైన,సన్తః=సత్పురుషులు,జగతి=లోకమునందు,బహుమతాఃసన్తః=గొప్పగా నెంచఁబడినవారై, కస్య=ఎవ్వనికి,న అభ్యర్చనీయాః=పూజింపఁదగినవారు కారు-అందఱికిని బూజింపఁదగినవారేయనుదురనిభావము.విరోధాభాసాలంకారము.

చ. నతు లగుచున్ మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బరజనప్రియకార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహముఁ జేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం బరఁగుధీరులు పుణ్యులు గారె యేరికిన్. 61

తా. సజ్జను లణఁకువచేత నే యౌన్నత్యమును బొందుదురు. పరులగుణముల వర్ణన సేయుటచేత తమసౌజన్యాదిగుణములను బ్రకటింతురు. పరులకొఱకు గొప్పకార్యములను జేయుటయందు మిక్కిలి పూనికగైకొని పాటుపడుటవలన తమకార్యముల నొడఁగూర్చుకొందురు. తమ్ముఁ బరుషముగా మాటలాడుదుష్టులను తమయోర్పుచేత నే సంతాపము నొందునట్లు చేయుదురు. కావున వారిచరిత్రలు మిక్కిలి యాశ్చర్యకరములై లోకమునందంతట వారికి మిక్కిలి మెప్పు కలిగించుచున్నవి. కాన నట్టివారందఱికిని బూజనీయులే యనుదురు.

ఇది నీతిశతకమునందు సుజనపద్ధతివర్ణన మన్నది షష్ఠదశకము.

---

## నీతిశతకము - పరోపకారపద్ధతి.

---

అవ. సౌజన్యమునకు పరోపకారమే ఫలముగావున సుజనపద్ధతి నిరూపించినవెనుక పరోపకారపద్ధతిని వర్ణించుచున్నారు.

శ్లో॥ భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవామ్బుభి ర్భూరివిలమ్బినో ఘనాః।
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః
స్వభావ ఏ వైష పరోపకారిణామ్ ॥ 62

టీ. తరవః=(పనస మామిడి మొదలైన) వృక్షములు, ఫలఉద్గమైః=పండ్లభారములచేత, నమ్రాః=వంగినవి, భవన్తి=అగుచున్నవి. ఘనాః=మేఘములు, నవామ్బుభిః (ఉపలక్షితాః సన్తః) = క్రొత్తనీళ్లతోఁ (గూడినవై), భూరి విలమ్బినః=మిక్కిలి వ్రేలాడునవి-జలభారముచే క్రిందుగా మిక్కిలితగ్గి సంచరించునవి యనుట, (భవన్తి=అగుచున్నవి). సత్పురుషాః=సజ్జనులు, సమృద్ధిభిః (ఉపలక్షితాఃఅపి)=సంపదలతోఁ (గూడియున్నవారై నప్పటికిని), అనుద్ధతాః=ఉద్ధతిలేనివారు-ఉగ్రులు కానివారనుట, (భవన్తి=అగుచున్నారు). 'అనర్థితాః' అను పాఠమునందు యాచింపఁబడనివారని యర్థము. పరులు తమ్ము యాచించుట నక్కఱలేకయే వారికి తాము హితములు సేయుదురని భావము. ఏషః=ఇది-ఈనమ్రత్వము మొదలైనవి యనుట, పరోపకారిణాం=పరులకు హితముసేయుటయందాసక్తులైనట్టివారికి, స్వభావ ఏవ=స్వభావమే-స్వతస్సిద్ధమైనదే కాని తెచ్చిపెట్టుకొన్నది గాదనుట. *మహాత్ములకుఁ బరోపకారము సేయుట స్వాభావికమగుటవలన వారు దానిచేఁ గలుగుక్లేశమును క్లేశముగా గణింపరనుట. అలంకారము అర్థాంతరన్యాసము.

తే. తరువు లతిరసఫలభారగురుత గాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము. 62

తా. పనసరసాలాదివృక్షములు ఫలభారములచే నమ్రములై (వంగి)యున్నవి. మేఘములు నూతనజలభారముచే క్రిందుగాఁదగ్గి యంతరిక్షమున సంచరించుచున్నవి. సుజనులు సకలసంపదలతోఁ గూడియున్నవారైనను గర్వముచే మిట్టిపడువారు కారు. (లేక యాచింపఁబడకయే దానము సేయుదురు). ఈ నమ్రత్వము మొదలైనవి పరోపకారులకు సహజగుణములే కాని వేఱుకావు.

అవ. పరోపకారులకు ముఖ్యము లైన యలంకారములను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శ్రోత్రం శ్రుతేనైవ న కుణ్డలేన, దానేన పాణిర్నతు కఙ్కణేన।
విభాతి కాయః కరుణాపరాణాం, పరోపకారేణ న చన్దనేన॥ 63

---

* పరోపకారాయ ఫలన్తి వృక్షాః పరోపకారాయ వహన్తి నద్యః । పరోపకారాయ చరన్తి గావః పరోపకారార్థ మిదం శరీరమ్॥' వృక్షములు ఫలించుటయు నదులు ప్రవహించుటయు గోవులు చరించుటయుఁ బరోపకారముకొఱకే. ఈ శరీరమును పరోపకారముకొఱకే; అనువచనము నిట తెలియునది.

టీ. కరుణాపరాణాం=దయాళువులైనవారికి-పరోపకారులకనుట, శ్రోత్రం= చెవి, శ్రుతేనఏవ=(ధర్మశాస్త్రములను) వినుటచేతనే, విభాతి=ప్రకాశించుచున్నది, కుండలేన=(సువర్ణమణిమయమైన) కర్ణాభరణముచేత, న (విభాతి) =ప్రకాశింపదు. పాణిః=చేయి, దానేన=(సత్పాత్రమునకుఁజేయు)దానముచేత, విభాతి=ప్రకాశించు చున్నది), కఙ్కణేన తు=కంకణముచేతనో, న(విభాతి)=ప్రకాశింపదు. కాయః= దేహము, పరోపకారేణ=పరులకు హితముచేయుటచేత, (విభాతి=ప్రకాశించు చు న్నది), చన్దనేన=చందనముచేత-న(విభాతి)=ప్రకాశింపదు. మహాత్ములకు నశించు నట్టికుండలాదులు ఆభరణములు కావు. శాస్త్రశ్రవణము మొదలైనవియే వారికి సహ జములైన యాభరణములని భావము. అలం. పరిసంఖ్యా.

తే. అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండలమునఁ గాదు
వలయమున నొప్పదీవిచే వెలయుఁ బాణి
యురుదయాఢ్యుల మేనుపరోపకార
కలన రాణించు గంధంబువలనఁ గాదు. 63

తా. దయాళువులైన పరోపకారశీలురయొక్క కర్ణములకు శాస్త్రశ్రవణమే యలంకారముకాని కుండలములుకాదు. వారిహస్తములకు సత్పాత్రదానమే యలం కారముగాని కడియములుకాదు. వారిదేహమునకు పరోపకారమే యలంకారముగాని కస్తురి పచ్చకర్పూరము మొదలైనవానితో మెదిపిన చందనపుఁబూఁత కాదు.

అవ. 'అనర్థితాః సత్పురుషాః' సత్పురుషులు యాచింపఁబడకయే దానముచేయుదురు, అని చెప్పినదానినే మరలవిస్తరించిచెప్పుచున్నాఁడు.

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి
చన్ద్రో వికాసయతి కైరవచక్రవాలమ్ ।
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః ॥ 64

టీ. దినకరః=సూర్యుఁడు, న అభ్యర్థితః అపి=యాచింపఁబడనివాఁడైనను, పద్మాకరం=తామరతంపరను, వికచం=వికసించినదానినిగా, కరోతి=చేయుచున్నాఁ డు. చంద్రః=చంద్రుఁడు, (అట్లె యాచింపఁబడనివాఁడైనను), కైరవచక్రవాలం- కైరవ=తెల్లగలువలయొక్క, చక్రవాలం=సమూహమును, వికాసయతి=వికసింపఁజే యుచున్నాఁడు. జలధరః=మేఘుఁడు, (యాచింపఁబడనివాఁడైనను,) జలం=జలమును, దదాతి=ఇచ్చుచున్నాఁడు-వర్షించుచున్నాఁడనుట, సన్తః=సత్పురుషులు, స్వయం= తమంతటనే - ఒకరిచే యాచింపఁబడకయే యనుట, పరహితే = పరులకు హితము

చేయుటయందు, విహిత అభియోగాః= చేయఁబడిన అభినివేశముగలవారు-పరోపకార మందు తమంతటనే యభినివేశముగలవారుగాని యొకరుచెప్పుటచేత కాదనుట. ఇట్టి వారికి పరోపకారముచేయుట యుక్తమేయని భావము. అలం. అర్థాంతరన్యాసము.

తే. ద్యుమణి పద్మాకరము వికసించముగఁ జేయుఁ
గుముదహర్షంబు గావించు నమృతసూతి
యర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు. 64

తా. సూర్యుఁడు యాచింపఁబడకయే తామరలను వికసింపఁజేయుచున్నాఁడు. చంద్రుఁడును యాచింపఁబడకయే కలువలను వికసింపఁజేయుచున్నాఁడు. మేఘుఁడును యాచింపఁబడకయే జలమును గురియుచున్నాఁడు. కావున సత్పురుషులు ఒకరు కోరుటవలనఁగాక తమంతటనే పరులకు హితము సేయఁజొత్తురు.

అవ. పురుషులు తమతమవ్యాపారములం గలతారతమ్యమువలన నుత్తమమధ్యమాదిభేదములనుబొందుచున్నారని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే।
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే
యేతు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే॥ 65

టీ. యే=ఏపురుషులు, స్వార్థాన్=తమసొంతప్రయోజనములను, పరిత్యజ్య= విడిచి, పరార్థఘటకాః-పర=ఇతరులయొక్క, అర్థ=ప్రయోజనములను, ఘటకాః= ఘటింపఁజేయువారో-ఒడఁగూర్చునట్టిశీలముగలవారో, ఏతే=(ఆ)వీరు,సత్పురుషాః= మంచిపురుషులు-పురుషులలో నుత్తము లనుట. యేతు=ఎవరైతే, స్వార్థావిరోధేన- స్వార్థ=తమప్రయోజనములకు, అవిరోధేన=విరోధములేమిచే-భంగము కలుగకుండునట్లు-తమప్రయోజనముల నిర్వహించుకొనుచునేయనుట, పరార్థం=ఇతరులకొఱకు- ఇతరులప్రయోజనముల నిర్వహించుకొఱకనుట, ఉద్యమభృతః=పూనికగలవారో, (తే=వారు), సామాన్యాః=సాధారణపురుషులైనవారు-మధ్యమపురుషులనుట, యే= ఎవరైతే, స్వార్థాయ=తమప్రయోజనముకొఱకు, పరహితం=ఇతరులకు హితమైనదానిని, నిఘ్నన్తి=నాశముసేయుదురో, తే అమీ=ఆవీరు, మానుషరాక్షసాః=మనుష్యులని చెప్పఁబడు రాక్షసులు-మనుష్యులని పేరుకలిగినను క్రూరాచారములనుబట్టి రాక్షసులే యగుదురనుట- పురుషులలో అధములనిభావము. యేతు=ఎవరైతే, నిరర్థకం= నిష్ఫలముగా-ఏప్రయోజనముగాని కలుగకపోయినను అనుట, పరహితం=ఇతరులకు హితమైనదానిని, ఘ్నన్తి=చెడఁగొట్టుచున్నారో, తే=వారు, కే=ఎవరో-ఎట్టివారో,

న జానీమహే=ఎఱుఁగము-ఈ చెప్పఁబడిన ఉత్తములు మొదలైన మూఁడువిధముల పురుషులకంటెను వీరు మిక్కిలి వేఱువిధముగా నుండుటవలన వీ రిట్టివారని తెలియఁజాలమనుట. కావుననే వీరు పరమనీచులని తెలియునది. ఇట్లు చెప్పఁబడిన యుత్తమాదిపక్షములలో నేది మేలైనదో దానిని ఆయుష్మంతుఁడైనవాఁ డాశ్రయింపవలయు నని భావము.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచుర్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథానర్థకం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగగ శక్యమే యేరికిన్.

తా. తమకార్యములను విడిచి పరులప్రయోజనముల నొడఁగూర్చునట్టివారుత్తములు. తమకార్యములకు భంగము లేకుండ నెఱవేర్చుకొనుచునే యితరులకార్యములను సైతము నిర్వహించుటకుఁ బూనునట్టివారు మధ్యములు. తమకార్యముల నెఱవేర్చుకొనుటకొఱకై పరులకార్యములను జెడఁగొట్టువారు మనుష్య లనఁబడురాక్షసులేగాన నధములు. తమ కేప్రయోజనముగాని కలుగకయే పరులకార్యములను జెఱుచునట్టివారిని ఎట్టివా రని చెప్పవచ్చునో తెలియకున్నది.

అవ. నిజమైన మిత్రుని యొక్క లక్షణములను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పాపా న్నివారయతి యోజయతే హితాయ
గుహ్యం నిగూహతి గుణా న్ప్రకటీకరోతి।
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదన్తి సన్తః॥ 66

టీ. పాపాత్ = పాపముచేయుటవలననుండి, నివారయతి = నివర్తింపఁజేయుచున్నాఁడు-ధర్మోపదేశముచేత దుష్కర్మములందు ప్రవర్తించుటనువిడుచునట్లుచేయుచున్నాఁడనుట, హితాయ=సత్కర్మములనుజేయుటకొఱకు,యోజయతే=ప్రవర్తింపఁజేయుచున్నాఁడు, లేక, హితాయ = మేలు (ఒనగూర్చుకొనుట) కొఱకు, యోజయతే=పురికొలుపుచున్నాఁడు అనియు నర్థము చేయవచ్చును, గుహ్యం=గోప్యమైనదానిని-రహస్యమును, నిగూహతి=దాఁచుచున్నాఁడు-దానిని ఎక్కడను వెలిపుచ్చఁడనుట, గుణాన్=సౌశీల్యము మొదలైన మంచిగుణములను, ప్రకటీకరోతి=ప్రకటనముచేయుచున్నాఁడు-అందఱికిఁ దెలుపునేగానిదాఁపఁడనుట,ఆపద్గతంచ=మిక్కిలి సంకటమును పొందియున్నవానిని గూడ-ఆపద వచ్చినప్పుడునుగూడ ననుట, నజహాతి=విడిచిపెట్టఁడు,కాలే=(వ్యసనాదులుకలుగు) సమయమునందు,దదాతి=(కోరిన

దానిని) ఇచ్చుచున్నాఁడు. ఇదం=ఇది-ఈపాపమునుండి నివర్తింపఁజేయుట మొదలైనవి యనుట, సన్మిత్రలక్షణం-సన్మిత్ర = నిజమైనస్నేహితునియొక్క, లక్షణం-స్వరూపముగా, సన్తః=సత్పురుషులు, ప్రవదన్తి=చెప్పుచున్నారు.

తే. అఘమువలన మఱల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబు దాఁచుఁ బోషించు గుణము
విడువఁ డాపన్ను లేవడిన వేళ నిచ్చు
మిత్రుఁ డీలక్షణంబులఁ దె మెలఁగుచుండు. 66

తా. పాపకృత్యములనుండి మఱల్చుట, మంచికర్మము లాచరించునట్లుగాని మే లొనగూర్చుకొనునట్లుగాని పురికొలుపుట, రహస్యమును దాఁచుట, మంచిగుణములనే వెల్లడిసేయుట, ఆపదకలిగినప్పుడుగూడ విడిచిపోకుండుట, వ్యసనాదులు కలిగినప్పుడు వలయుదాని నిచ్చుట, మొదలైనవి నిజమైనమిత్రునియొక్క లక్షణములని సత్పురుషులు చెప్పుదురు.

అవ. మరల నాసన్మిత్రలక్షణమునే క్షీరనీరదృష్టాంతపూర్వకముగా వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తాః పురా తేఽఖిలాః
క్షీరోత్తాప మవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుతః ।
గన్తుం పావక మున్మన స్తదభవ ద్దృష్ట్వా తు మిత్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్రీ పున స్త్వీదృశీ ॥ 67

టీ. క్షీరేణ = పాలుచేత, ఆత్మ... కాయ-ఆత్మ = తన్ను, గత=పొందిన, ఉదకాయ=జలముకొఱకు-తనతోఁగలుపఁబడినజలమున కనుట, పురా=ముందుగా, తే=ప్రసిద్ధములైన,అఖిలాః=సమస్తములైన, గుణాః=(తీయఁదనము, తెల్లఁదనము మొదలైన తన) గుణములు, దత్తాహి=ఇయ్యఁబడినవిగదా. ఇట్లు తనగుణముల నిచ్చుటవలన పాలునకు జలముతో మైత్రికలిగెననుట. క్షీరోత్తాపం=(కాఁగుటకై నిప్పునందుంపఁబడిన) పాలుయొక్క సంతాపమును-పాలుకాఁగుటనని భావము, అవేక్ష్య=చూచి, తేనపయసా = క్షీరములోఁ గలిసియున్న జలముచేత, స్వాత్మా = తన శరీరము, కృశానౌ = అగ్నియందు, హుతః = వేల్వఁబడినది - హోమముచేయఁబడినది-మిత్రమగు పాలయొక్కసంతాపమును జూచి తాళలేక నిప్పులోఁబడి నశించెననుట-ఇగిరిపోయెనని భావము. తత్ తు = ఆపాలును, మిత్రాపదం = మిత్రమగు జలముయొక్క (యిగిరిపోవుటయనెడి) విపత్తిని, దృష్ట్వా=చూచి, పావకం=అగ్నినిగూర్చి, గన్తుం = పోవుటకు, ఉన్మనః = ఉద్యుక్తమైనది, అభవత్ = ఆయెను. నీరు ఇగిరిపోఁగా పాలు పొంగి పైకివచ్చుచున్నదని భావము. తేన=ఆ, జలేన=జలముతోడ,

యుక్తంసత్=కూడినదై, శామ్యతి= ఉపశమించుచున్నది-పొంగు తీసిపోవు నని భావము. సతాం=సజ్జనులయొక్క, మైత్రీ=స్నేహము, ఈదృశీపునః=ఇటువంటిది గదా-ఒండొరుల వ్యసనములకుఁ దాళనట్టిస్వభావము గలది యనుట.

ఉ. క్షీరము మున్ను నీటి కొసఁగెఁ గెఁ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరము దప్తమౌట గని చిచ్చుఁటికెఁ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని వహ్నిఁ జొరం జనె దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంతమగు నిల్చు మహాత్ముల మైత్రి యాగతిన్. 67

తా. పాలు తనతోఁగలసినజలమునకు తీయఁదనము తెల్లఁదనము మొదలైన తనగుణము లన్నిటిని ముం దిచ్చి దానితో మైత్రిచేసికొనెను. పిదప నాపా లగ్ని యందు మిక్కిలి తపించుటఁజూచి దానిమిత్రమగు జలము తాళలేక తనశరీరము నగ్నియందు హోమము చేసికొనెను. జలమున కిట్టియాపద వచ్చెనే యని పాలు దుఃఖించి తాను నగ్నియందుఁబడుటకుఁ దమకించుచుండఁగా నింతలో జలమువచ్చి దానిలోఁ గలియుటవలన నాపా లూఱడిల్లెను. సత్పురుషుల స్నేహముకూడ నిటువంటిదే యగును. [పాలుతో మొట్టమొదట జలము కలుపఁబడును. పిదప పాలు పొయ్యిమీఁద కాఁచఁబడును. అది కాఁగునపుడు జలమంతయు నిగిరిపోవును. అది యిగిరిపోఁగా పాలుపొంగి పైకివచ్చును. అప్పుడు జలమును జల్లఁగా పాలుపొంగక యణఁగిపోవును. ఈ వ్యవహారము క్షీరనీరములకు స్వభావసిద్ధ మైనది. అరెంటికిని స్వాభావిక మైన యీ వ్యవహారమును నొండొరులతాపమునకు తాళలేని హేతువుచేఁ గలిగిన స్నేహవ్యాపారముగాఁ గవి యుత్ప్రేక్షించి వర్ణించినాఁడు. కావున నిందు క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్ష 'సతాం మైత్రీ పునస్త్వీదృశీ' అనుచోఁగల అర్థాంతరన్యాసముచే నిర్వహింపఁబడుటవలన రెంటికిని విజాతీయసంకర మని తెలియునది.]

అవ. పరోపకారులమాహాత్మ్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇతః స్వపితి కేశవః కుల మిత స్తదీయద్విషాం
మిత శ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే।
ఇతోఽపి బడబానలః సహ సమస్తసంవర్తకై
రహో వితత మూర్జితం భరసహంచ సిన్ధో ర్వపుః॥ 68

టీ. ఇతః=ఈదిక్కున-ఈప్రదేశమందనుట, కేశవః=విష్ణువు-సకలభువనములను కుక్షియందుఁ గలయట్టివాఁడని భావము. స్వపితి=యోగానుసంధానముతో నిదురించు చున్నాఁడు-యోగనిద్రపోవుచున్నాఁడనుట, ఇతః = ఈప్రక్కను-మఱియొకచోట ననుట, తదీయద్విషాం - తదీయ=ఆవిష్ణువుయొక్క, ద్విషాం = (కాలకేయాది)

శత్రువులయొక్క, కులం=సమూహము, (ఉన్నది యని శేషము గ్రహింపవలెను). ఇతః=ఈప్రక్కను-మఱియొకచోటనుగూడ ననుట, శరణ అర్థినాం= శరణము గోరినట్టి, శిఖరిణాం=మైనాకాదిపర్వతములయొక్క, గణాశ్చ=సమూహములును, శేరతే= నిద్రించుచున్నవి. ఇతః=ఈప్రక్క-ఈ యింకొకచోట, సమస్తసంవర్తకైఃసహ-సమస్త=సకలమైన, సంవర్తకైః సహ=(ప్రళయకాలమందు జగత్తును దహించునట్టి) యగ్నులతోడఁగూడ, బడబానలః అపి=బడబాగ్నియును, (వసించుచున్నదని శేషము) సిన్ధోః=సముద్రముయొక్క, వపుః=శరీరము, వితతం=(విష్ణువునంతటివెనుమూర్తియుం డునట్టిస్థల మగుటచే) విరివియైనదియు, ఊర్జితం=(బడబానలము నీరునంతయు త్రాగుచుండియుఁ దగ్గకుండుటవలన) మిక్కిలి వర్ధిల్లుస్వభావముగలదియు, భరసహంచ=(మహాపర్వతములను సైతము భరించుటచే) బరువును వహింపఁజాలినదియు, అహో= ఆశ్చర్యము-కొలఁదిలేనిప్రభావము గలిగియుండుటచే మిక్కిలి యాశ్చర్యమైన దనుట. అలం. అప్రస్తుతప్రశంస.

చ. ఒకయెడఁ బవ్వళించు హరియొక్కయెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడఁగుఁ బర్వతసంఘము లొక్కెడన్ బలా
హకములతోడ నుండు బడబాగ్నియు విస్తృత మూర్జితంబునుం
బ్రకటభరక్షమం బగుచు భాసిలు నౌర సముద్ర మెంతయున్.

తా. సముద్రమునం దొకప్రక్క పదునాలుగుజగములు కడుపునంగల విష్ణువు యోగనిద్ర పోవుచున్నాఁడు. వేఱొకప్రక్క నావిష్ణునిశత్రువు లగు కాలకేయుఁడు మొదలైనవారి సమూహము ఉన్నది. ఇంకొకప్రక్క నింద్రాదులకు వెఱచి శరణు గోరివచ్చి దాఁగియున్న మైనాకాదిమహాపర్వతసమూహములు పడియున్నవి. మఱియొకప్రక్క ప్రళయకాలమందు జగత్తును దహించి నశింపఁజేయునట్టి యగ్నులతోఁ గూడ బడబాగ్ని వసించుచున్నది. ఈవిషయములనుబట్టిచూడఁగా సముద్రముయొక్క దేహము అత్యంతవిస్తారమైనదియు మఱిమఱి పెరుఁగునట్టిదియు మిక్కిలి భారమును వహింపఁజాలినదియునై యున్నది. ఏమాశ్చర్యము. [ఇందు లక్షయోజనములకొలఁది గల సముద్రమును కొలఁదిలేనికేశవాదివాసప్రదేశముగాఁ జెప్పఁబడినది గాన ఆధారముకంటె ఆధేయము పెద్దది యగుటచే అధికాలంకారమును.]

అవ. నిరతిశయ మైనపరోపకారశీలము గలవా రిద్దఱే గనుక నాయిద్దఱజన్మమే సఫలమైనది కానితక్కినవారిది కాదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జాతః కూర్మః సఏకః పృథుభువనభరా యార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్విచక్రమ్।
సఞ్జాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టా న్నచాధో
బ్రహ్మాణ్డోదుమ్బరాన్త ర్మశకవ దపరే జన్తవో జాతనష్టాః॥ 69

టీ. యేన = దేనిచేత-ఏకూర్మముచేత ననుట, పృథు...రాయ-పృథు=అధికమైన, భువనభరాయ=పదునాలుగులోకముల భారముకొఱకు-అంతటిభారమును వహించుటకొఱకు, పృష్ఠ=వీఁపు- తనవీఁపుఁజిప్ప యనుట, (ఇచట 'పృథు' శబ్దమును వేఱుగా విడఁదీసి దానిని 'పృష్ఠ' మునకు విశేషణముగా గ్రహించిన 'పృథు పృష్ఠం విశాలమైనవీఁపు అని యర్థము.) అర్పితం=ఇయ్యఁబడినదో, సః ఏకః కూర్మః = ఆ ఒక్క-కూర్మమే-ఆయాదివరాహావతార మొకటిమాత్రమే యనుట, జాతః=పుట్టినది-సార్థకమైనజన్మము గల దనుట - పదునాలుగులోకములను వీఁపుపై భరించియుండుటచే నని భావము-నిరంతరమును లోకములకన్నిటికిని క్రిందిప్రదేశమునం దుండుటవలన భరింపరాని యాభువనములభారముచేఁ గలిగినక్లేశమును సహించినట్టిదనుట, యత్ర= ఎవనియందు-ఏధ్రువునియందు, తేజస్విచక్రం-తేజస్వి = జ్యోతిస్సులగు గ్రహనక్షత్రాదులయొక్క, చక్రం=శింశుమారచక్రము, లేక, మండలము, నియమితంసత్ = నియోగింపఁబడిన దై -ఏర్పఱుపఁబడిన దై, భ్రమతి=తిరుగుచున్నదో, ధ్రువస్య= ఆధ్రువునియొక్క, జన్మ=జన్మమును, శ్లాఘ్యం=(సకలలోకములందును) బొగడ్తకెక్కినది-గ్రహనక్షత్రమునంతయు మెలపుచుండుటచే నని భావము-సకలలోకములకును బొడవైన మేరువుయొక్క శిఖరమునకు శిఖామణి యగు ధ్రువుఁడు జ్యోతిశ్చక్రము నంతయు తన కధీనము చేసికొని నడపుచుండుట శ్రీవిష్ణుపురాణభాగవతాదులందుఁ బ్రసిద్ధము. అపరే=ఇతరులై న-ధ్రువకూర్మములు తప్ప తక్కిన, జన్తవః=ప్రాణులు, పరహితకరణే=పరోపకారముచేయు విషయమందు,సఞ్జాత...పక్షాః-సఞ్జాత=కలిగిన, వ్యర్థ=నిరర్థకమైన-ప్రయోజనము లేని, పక్షాః=పక్షముగలవారు-పరహితముఁ జేయ నేరనిపక్షమందున్నవారు. కాఁబట్టి, ఉపరిష్టాత్ న=మీఁదను లేరు-ధ్రువునివలె ఉపరిభాగమందు వర్తించువారునుగారు. అధశ్చ న=క్రిందను లేరు-ఆదికూర్మమువలె క్రిందిభాగమున వర్తించువారును గారు. (మఱి యెట్టివా రగుదురనిన), బ్రహ్మ... వత్-బ్రహ్మాణ్డ=బ్రహ్మాండ మనెడు, ఉదుమ్బర=అత్తిపండుయొక్క, అన్తః=లోపలి, మశకవత్=పురుగులవలె, జాతనష్టాః=పుట్టినవారును నశించినవారును అగుదురు అని శేషము. తక్కినవారికి జంతువులు అనుశబ్దము ప్రయోగించుట వారి నీచత్వము తోఁపించుటకొఱకని తెలియునది, తక్కినవారు సాధించినదేదియు లేమిచే అత్తిపండు లోనిపురుగులవలె నిరర్థకముగా పుట్టి చచ్చునట్టివానితో సాటియగుదురు గాన వారితోఁ బని యేమి యని భావము.

చ. వితతజగద్భరంబు దనవీఁపునఁ దాల్చినకూర్మనాథుఁడున్
సతతము చంద్రభాస్కరులచక్రముఁ ద్రిప్పుధ్రువుండు సజ్జనుల్
ప్రతిభ నజాండజంతుఫలరంధ్రవసన్మశకంబులట్ల నిం
దితవిఫలార్థసంగతి జనించి నశించుఁ దదన్యజంతువుల్. 69

తా. అవతారములందు సైతము ఆదికూర్మావతార మొకటియే సకలలోకములను వీఁపుపై భరించియుండుటంజేసి సార్థకమైనజన్మము కలది. ఇఁకఁ దక్కినవాని జన్మములమాట చెప్పనేల? ఇంతే కాక ధ్రువుఁడు మేరుపర్వతశిఖరముననుండి జ్యోతిశ్చక్రమునంతయుఁ ద్రిప్పుచుండును గాన నట్టివానిజన్మమును శ్లాఘ్యమైనది. ఈయిరువురు తప్ప పరహితముసేయుటయందు సమర్థులు కాని తక్కినప్రాణులు ధ్రువునివలె మీఁదను లేక, యాదికూర్మమువలెఁ గ్రిందను లేక, బ్రహ్మాండమునడుమ నత్తిపండులోని పురుగులవలెఁ బుట్టి నశించువారే యగుదురు. కావున వారిజన్మము లెల్ల నిరర్థకములే యగును. 'బ్రహ్మాండోదుమ్బరాన్తర్మశక' అనుచో రూపకము. 'మశకవత్ జాతనష్టాః' అనుచో ఉపమ. ఈరెంటికిని సంకరము.

అవ. విధేయులగువారిని బిలిచి వారికి సదాచారమును గఱపుచున్నాఁడు.

శ్లో॥ తృష్ణాంఛిన్ధి భజ క్షమాం జహి మదం పాపే రతిం మా కృథాః
సత్యం బ్రూహ్యనుయాహి సాధుపదవీం సేవస్వ విద్వజ్జనమ్।
మాన్యా న్మానయ విద్విషోఽప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయా మేత త్సతాం చేష్టితమ్॥ 70

టీ. ఓయిజనుఁడా! అని అధ్యాహరించుకొనవలయును. తృష్ణాం=ఆశను, ఛిన్ధి=(వైరాగ్యశాస్త్రముచేత) ఛేదింపుము-లేనియెడల ననేకములైన యాశాపాశములచే కట్టువడి క్లేశమును బొందుదువని భావము. తృష్ణయనఁగా లభింపరాని పరధనములు లభింపవలయు ననెడియభిలాష. క్షమాం=ఓర్పును, భజ=సేవింపుము-పొందుమనుట-లేనియెడల నుగ్రభావము కలిగి కార్యములను జెఱుచుదువని భావము. క్షమయనఁగా అవమానాదులు సంభవించునపుడు కలుగుకోపము నడంచుట. మదం = (విద్యవలనఁబుట్టిన) క్రొవ్వును, జహి=(విజ్ఞానముచేత) నాశముచేయుము-లేనియెడల వివేకముమాలి తగనికార్యములందు ప్రవర్తించి యనర్థములను దెచ్చుకొందువని భావము. పాపే = పాపమునందు - పాపకృత్యములను జేయుటయందనుట, రతిం = ప్రీతిని, మాకృథాః = (అజ్ఞానముచేత) చేయకుము. అయితే 'ధర్మంచర' ఇత్యాద్యుపదేశవచనములచొప్పున సత్కర్మములను జేయుటయందే మనస్సునుంపుము-లేనియెడల నరకమువం బడుదువని భావము. సత్యం=నిజమును, బ్రూహి=చెప్పుము 'సత్యం వద' అనువచనముచొప్పున యథార్థమునే చెప్పుము-లేనియెడల 'నానృతాత్పాతకంపరమ్-అనృతముకంటె మించిన పాతకము లేదు' అనున్యాయమువలన అవివేకిత్వము కలుగునని భావము. సాధుపదవీం=సన్మార్గమును, అనుయాహి=(ధర్మశాస్త్రానుసారముగా) అనుసరింపుము - లేనియెడల దుర్మార్గమునఁ బ్రవర్తించుటవలన దోషము సంభవించునని భావము. విద్వజ్జనం = (మంచియుపదేశములచేత కృతార్థత్వమున కలిగించు

నట్టి) పండితమండలమును, సేవస్వ=(బుద్ధిప్రసన్నతకొఱకు) శుశ్రూషచేయుము-లేని యెడల బుద్ధి విశదముకామి పెద్దలశిక్షలేమి * మొదలైన దోషములు సంభవించు నని భావము. మాన్యాన్=పూజ్యులను, మానయ=తగినట్టు పూజింపుము-లేనియెడల† కీర్తి ధర్మము ధనము అనునీమూఁడును వదలిపోవుననిభావము. విద్విషః అపి=శత్రువులనైనను-ఇఁక తక్కినవారిని జెప్పనేల యనుట, అనునయ=ఉపలాలింపుము- ప్రసన్నులనుగాఁ జేయుమనుట, 'సమ శ్శత్రౌచ మిత్రేచ' అను వచనముచొప్పున శత్రువులను నీయెడల కలఁక లేనివారినిగాఁ జేసికొనుమనుట-లేనియెడల వారు నీలోపములను గని పెట్టి తన్మూలమున కూలఁద్రోయుదు రనిభావము. ప్రశ్రయం=(గురువు లాచార్యులు మొదలైనవారియెడల) నమ్రత్వమును-అడఁకువను, ప్రఖ్యాపయ = ప్రకటింపుము- 'గురౌనమ్రతా' అనునట్లు వినయమును జూపుమనుట-లేనియెడల దుర్వినీతుఁడనెడియపవాదము కలుగుననిభావము. 'ప్రచ్ఛాదయ స్వాన్గుణాన్' అనుపాఠమున, సొంతగుణములను మూసిపెట్టుము(అనఁగా చెప్పకొనకుము)అని యర్థము. కీర్తింపాలయ=(జన్మసాఫల్యము కలుగుటకై) కీర్తిని నిర్వహించుటకుఁ బ్రయత్నముచేయుము - లేనియెడల భూమియందు 'కింజన్మకీర్తింవినా-కీర్తిలేనిజన్మమేల' అనునట్లు జీవన్మృతుఁడనుపేరు కలుగునని భావము. దుఃఖితే = దుఃఖముగలవారియందు-ఇచట జాత్యేకవచనము, దయాం కురు=కరుణసేయుము-దయ యనఁగా నితరులదుఃఖములను బోఁగొట్టవలయు ననెడియిచ్ఛ. 'దుఃఖిషు కరుణా' అనుశాస్త్రముచొప్పున కరుణచూపనియెడల చిత్తశుద్ధి కలుగదనిభావము. ఏతత్=ఇది-తృష్ణను ఛేదించుట మొదలైనవి, సతాం=సజ్జనులయొక్క, చేష్టితం=వ్యాపారము-కావున నీవు సుజనుఁడనుకీర్తి పొందఁ గోరితివేని నిట్లు ప్రవర్తింపుము-లేనియెడల పురుషార్థములు నీకు లభింప వని యాశయము. 'సతాం లక్షణమ్' అని పాఠాంతరము.

శా. ఆశాసంహరణంబు నోర్మియు మదత్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యమున్ బుధమతాచారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మాన్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ శిష్టాలికిన్ ధర్మముల్. 70

* 'యస్తు పర్యటతే దేశా న్యస్తు సేవేత పణ్డితాన్ । తస్య విస్తారితా బుద్ధి స్తైలబిన్దు రివామ్భసి' ఎవఁడు దేశాటనము చేయునో, ఎవఁడు పండితులను సేవించునో, వానిబుద్ధి నీటియందు నూనెబొట్టువలె విస్తరించును; అనుట యూహ్యము.

† 'అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజ్యా శ్చైవావమానితాః । అయశో మహ దాప్నోతి ధనా ద్ధర్మాచ్చ హీయతే' ఎవనిచే పూజ్యులుకానివారు పూజింపఁబడుదురో పూజ్యులైనవా రవమానింపఁబడుదురో వాఁడు మిక్కిలియపకీర్తిని బొందును. ధనమును ధర్మమును క్షీణించినవాఁ డగును; అనుట యిట గ్రాహ్యము.

తా. పేరాసను ద్రుంచుట, ఓర్పు కలిగియుండుట, విద్యవలనిమదము నడంచుట, పాపకృత్యములందు ప్రీతిలేకుండుట, సత్యముపలుకుట, సన్మార్గము ననుసరించుట, పండితజనులను గొలుచుట, పూజ్యులను బూజించుట, పగవారినైనను లాలించి కలఁకదేర్చుట, పెద్దలయెడల నడఁకువఁజూపుట, కీర్తిని రక్షించుకొనుట, దుఃఖితులయెడ దయనూపుట యనునివి యెల్ల సజ్జనులవ్యాపారములే యగును.

అవ. ఇటువంటివారు మిక్కిలి కొందఱే యని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః।
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః॥ 71

టీ. మనసివచసికాయే = మనోవాక్కాయములందు - త్రికరణములందును, పుణ్య...పూర్ణాః- పుణ్య=పుణ్యమనెడి, పీయూష=అమృతముచేత, పూర్ణాః=నిండినవారు-త్రికరణములచేతను సత్కర్మములనే యాచరించుటయం దాసక్తిగలవారనుట, త్రిభువనం=మూఁడులోకములను--మూఁడులోకములం దున్నట్టిజనులననుట, ఉపకారశ్రేణిభిః=ఉపకారపరంపరలచేత, ప్రీణయన్తః = సంతోషింపఁజేయుచున్నవారును, పర...అణూన్-పర=ఇతరులయొక్క, గుణపరమాణూన్=మిక్కిలి స్వల్పములయిన గుణములను, పర్వతీకృత్య=కొండంత చేసి - గోరంతదానిని కొండంతసేసి యనుట, నిత్యం=ఎప్పుడును, నిజహృది=తమయంతఃకరణమునందు, వికసన్తః=సంతోషించుచున్నవారును(అగు), సన్తః=సత్పురుషులు, కియన్తః=కొందఱే, సన్తి=కలరు-ఇటువంటిగుణసంపత్తి మిక్కిలి యరుదగుటచే దీనిని గలవారు ఎక్కడనో ఒకరిద్దఱుగా నుందురే కాని తఱుచుగా నుండరని భావము.

చ. హృదయవచశ్శరీరములకున్ నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారములకున్ మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగుసన్మాన్యులు గొందఱు వొల్తురిద్ధరన్. 71

తా. పుణ్యమనెడియమృతముచే నిండినత్రికరణములు గలవారును, నుపకారములు పెక్కులాచరించి ముల్లోకముల నుల్లసిల్లఁజేయువారును, బరులగుణముల గోరంతలను గొండంతలుగాఁ జేసి వర్ణించి మదినానందించువారును నగుసత్పురుషులు కొందఱే కలరు కాని పెక్కండ్రు గలుగరు.

ఇది నీతిశతకమునందు పరోపకారపద్ధతివర్ణన మన్నది సప్తమదశకము.

---

శ్లో॥ రత్నైర్మహార్ఘేస్తుతుషు ర్న దేవా, న భేజిరే భీమవిషేణ భీతిమ్।
సుధాం వినా న ప్రయయు ర్విరామం, న నిశ్చితార్థాద్విరమన్తి ధీరాః॥

టీ. దేవాః=దేవతలు, మహాబ్ధేః=మహాసముద్రముయొక్క-పాలసముద్రమును సంబంధించినట్టి యనుట, రత్నైః=కౌస్తుభము మొదలయిన మణులచేత-లేక 'జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్నమితి కథ్యతే' 'ఒక్కొక్కజాతియందును ఎది మిక్కిలి మేలైనదో అది రత్నమని చెప్పఁబడుచున్నది' అను వచనముచొప్పున ఐరావతము, ఉచ్చైశ్శ్రవము, కల్పవృక్షము, కామధేనువు మొదలైన జాతిశ్రేష్ఠములగువస్తువుల చేత, న తుతుషుః=సంతుష్టినొందినవారుకారు-సముద్రమును చిలుకునప్పుడని శేషము. భీమవిషేణ=భయంకరమైన కాలకూటవిషముచేత, భీతిం=భయమును, న భేజిరే=పొందినవారుకారు-ఇది ధైర్యాతిశయమును సూచించుమాట. సుధాం వినా=అమృతము లేక-అమృతమునులభింపక యనుట, విరామం=ఉడుగుటను-చిలుకుటమానుటను, న ప్రయయుః=పొందినవారు కారు-అమృతము పుట్టువఱకు చిలుకుటను వదలినవారుకార నుట-ఇదిశీలసంపత్తినిసూచించుమాట. ధీరాః=ధీరులు-దిట్టలైనవారు, నిశ్చితార్థాత్=ప్రతిజ్ఞ చేసికొన్న కార్యమునుండి, న విరమన్తి=విరమింపరు. ధైర్యశీలసంపన్నులైన వారు పట్టినకార్యమునువిడువక ఫలముగలుగువఱకు ప్రయత్నముచేయుచు నేయుందు రనుట. దేవతలును ధైర్యశీలసంపన్నులుగనుక వారును బట్టినకార్యము విడువకుండుట (అనఁగా అమృతముపుట్టువఱకుచిలుకుట వదలకుండుట) యుక్తమేయగునని భావము.

తే. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు. 72

తా. పాలసముద్రమును జిలుకునప్పుడు దేవత లందఱిరత్నములకు సంతోషింపక, యందుఁ బుట్టిన హాలాహల మనుభయంకరవిషమునకు భయపడక, యమృతము పుట్టువఱకు చిలుకుటను జాలించినవారుకారు. ధీరులైనవారు తాముచేయనిశ్చయించుకొన్నకార్యమును ఫలముగలుగువఱకును జేయక విడువరు. అలం. అర్థాంతరన్యాసము.

అవ. నీచులు మొదలైనవారి వృత్తులను జెప్పుచు తన్మూలమున

☞ ఈదశకమందుఁ గొన్నియెడల ధైర్యము ప్రధానముగాను గొన్నియెడల భయము ప్రధానముగాను నిర్దేశింపఁబడుచున్న దని యెఱుంగునది.

'ధీరులు పూనికకార్యమును విడువరు' అని ముందు చెప్పినవిషయమునే గట్టిపఱుచుచున్నాఁడు.

శ్లో॥ ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నై ర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి॥ 73

టీ. నీచైః=అధములచేత, విఘ్నభయేన=విఘ్నములవలని భయముచేత, నప్రారభ్యతేఖలు=ఆరంభింపఁబడదు-కార్యము అని శేషము. మధ్యాః=మధ్యములు, ప్రారభ్య=(కార్యమును)ఆరంభించి, విఘ్నవిహతాఃసన్తః=విఘ్నములచే నడ్డుపఱుపఁబడినవారై, విరమన్తి=ఉడుగుచున్నారు-కార్యముచాలించుచున్నారనుట. ఉత్తమగుణాః=ఉత్కృష్టములైన ధైర్యము శీలము మొదలైనగుణములు గలవారు పురుషశ్రేష్ఠులనుట, విఘ్నైః=విఘ్నములచేత, ముహుర్ముహుః = మాటిమాటికి, ప్రతిహన్యమానాఃఅపి=కొట్టఁబడినవారైనప్పటికిని, ప్రారబ్ధం=ఆరంభించినదానిని, న పరిత్యజన్తి=విడిచిపెట్టరు. దేవతలును †ధైర్యము శీలము మొదలైనయుత్తమగుణములు గలవారేకాన కాలకూటము బడబానలము మొదలైన విఘ్నములచే కొట్టువడినను అమృతము లభించువఱకు నారంభించిన మథనమును పరిత్యజింపకుండుట యుక్తమే యని యీచెప్పఁబడిన రెండుశ్లోకములచే నేర్పడిన యాశయము.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్. 73

తా. అధములు విఘ్నములు కలుగు ననుభయముచేతఁ గార్యము నే యారంభింపరు. మధ్యములు కార్యమును ప్రారంభింతురుగాని నడుమ విఘ్నములు కలిగనేని దానిని విడిచిపెట్టుదురు. ధైర్యశీలాదిగుణములు గలయుత్తములు ప్రారంభించినకార్యమును విఘ్నములు మాటిమాటికిఁ గలిగినను విడిచిపెట్టరు.

అవ. ధైర్యశీలసంపన్నుఁ డైనవాఁ డొకకార్యమునకుఁ బూనినపుడుసుఖదుఃఖములుకలిగిన సరకుసేయఁడు. అట్లు సరకుసేయకుండుట

† 'మనసో నిర్వికారత్వం ధైర్యం సత్స్వపి హేతుషు' మనస్సునకు వికారము కలిగించుహేతువులు కలిగియున్నను అది వికారము నొందకుండుటయే ధైర్యము. కులోచితమైన మంచిస్వభావమే శీలము అని రెంటికిని భేదము తెలుపఁగునది.

వలన నాకార్యమును సాధించుకొను నని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ క్వచి త్పృథ్వీశయ్యః క్వచి దపిచ పర్యఙ్కశయనః
క్వచి చ్ఛాకాహారః క్వచి దపిచ శాల్యోదనరుచిః।
క్వచి త్కన్థాధారీ క్వచి దపిచ దివ్యామ్బరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్॥ 74

టీ. క్వచిత్=ఒకానొకచోట, లేక, ఒకానొప్పుడు, పృథ్వీశయ్యః=భూమియే శయ్యగాఁగలవాఁడును - కఠినమగు నేలపై పరుండువాఁడు ననుట, క్వచిత్ చ=ఒకానొకచో, లేక, ఒకానొకప్పుడు; (ఇట్లే క్వచిచ్ఛబ్దమునకు మీఁదనెల్ల నర్థము తెలియునది) పర్యఙ్కశయనః అపి=(హంసతూలికా)తల్పమున నిదురించుటగలవాఁడును- మిగుల మెత్తనిపరుపున పరుండువాఁడుననుట, క్వచిత్, శాక ఆహారః=కాయగూరలే యాహారముగాఁ గలవాఁడును-నీరసమైనయాహారము గలవాఁడు ననుట, క్వచిత్= శాల్యోదనరుచిరపి-శాల్యోదన=శాల్యన్నమునందు, రుచిః అపి = రుచిగలవాఁడును- షడ్రసోపేతమృష్టాన్నభోజనముచే సంతుష్టుఁడైనవాఁడుననుట,|క్వచిత్, కన్థాధారీ= చింపిగుడ్డలనుగూర్చి కుట్టినబొంతను ధరించినవాఁడును, క్వచిత్, దివ్యామ్బరధరో ఽపి=ప్రకాశించుచున్న బంగారుపీతాంబరమును ధరించినవాఁడును(అగు), కార్యార్థీ =కార్యసిద్ధినిగోరునట్టి, మనస్వీ=ధీరుఁడు, దుఃఖంచ-(భూశయ్యాదులవలనఁగలుగు) దుఃఖమును, నగణయతి = సరకుసేయఁడు, సుఖంచ = (పర్యంకశయనాదులవలనఁ గలుగు) సుఖమును, నగణయతి=సరకుసేయఁడు-సుఖదుఃఖములను సమముగాఁజూచి లక్ష్యపెట్టక కార్యమును సాధించుటయందే కనుగలిగి యుండు ననుట.

మ. ఒకచో నేలను బవ్వళించు నొకచోఁ బ్రాప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచోఁ నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకురానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబుఁ సుఖంబుఁ మదిన్.

తా. కార్యమునుసాధింపఁగోరుధీరుఁడు కష్టసుఖములనులక్ష్యపెట్టక యాయా సందర్భములకుఁ దగినట్లు కటువైన నేలమీఁదఁగాని మృదువైన పరుపునందుఁగాని పరుండి నిదురించును. చవిలేని కూరగాయలనుగాని రసవంతమైన శాల్యన్నమునుగాని భుజించును. చింపిగుడ్డలబొంతనుగాని తళతళలాడు బంగరుపీతాంబరమునుగాని ధరించును. ఇట్లుకష్టములైనవానివలనఁగలుగుదుఃఖమునుగాని కష్టములుకానివానివలనఁ గలుగు సుఖమునుగాని సరకుసేయఁడు. [ఇట్లు సుఖదుఃఖములను లక్ష్యపెట్టకుండుట వలన వానిచేఁ గార్యము చెడక సిద్ధించుచున్న దని యాశయము.]

అవ. ధీరులైనవారు లోకులు నిందించినను గాని స్తుతించినను గాని న్యాయమార్గముననుండి చలింప రనుచున్నాఁడు.

శ్లో॥ నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతువా యథేష్టమ్।
అద్యైవవా మరణ మస్తు యుగాన్తరేవా
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః॥ 75

టీ. నీతినిపుణాః=నీతిశాస్త్రమునందు నేర్పరులైనవారు-నీతిని జక్కఁగా నెఱింగినవారనుట, నిన్దన్తువా=నిందింతురుగాక, యది=కాదేని, స్తువన్తువా=స్తోత్రము సేయుదురుగాక, లక్ష్మీః=సంపద, సమావిశతువా=కలుగునుగాక, (అథవా) యథేష్టం=ఇచ్చవచ్చినట్లు-అడ్డపాటులేక, గచ్ఛతువా=పోవునుగాక, మరణం=మృతి, అద్యఏవవా=ఇప్పుడేకాని, (అథవా) యుగాన్తరేవా=కల్పాంతరమందుఁగాని, అస్తు=కలుగుఁగాక, ధీరాః=బుద్ధిశాలులు, న్యాయ్యాత్=న్యాయముతోఁగూడిన, పథః=మార్గమునుండి, పదం=అడుగు-ఒక్కయడుగు పెట్టునంతమాత్రముగూడననుట, నప్రవిచలన్తి=చలింపరు-న్యాయమార్గమును విడువకుండుటయే వారికి పరమార్థము గాని నిందాస్తోత్రములు కావని భావము.

శా. నీతిప్రౌఢవిహారు లైననిపుణుల్ ‡ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ ‡ గాఢంబుగా సాఁగనీ
ఘాతం బప్పుడ పొందనీ నియతిమై ‡ కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా ‡ నిత్యంబు ధీరోత్తముల్. 75

తా. నీతివేత్తలు దూషించినను లేక భూషించినను, సంపదకలిగినను లేక తొలఁగినను, మరణ మిప్పుడే కలిగినను లేక కల్పాంతరమునఁ గలిగినను, ధీరులైన వారు న్యాయమార్గముననుండి యొక్కయడుగుకూడఁ జలింపరు.

అవ. ధీరుఁ డనఁగా నెవఁడు? వాఁ డేమి సాధించుననఁగా దానికిఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కాన్తాకటాక్షవిశిఖా న ఖనన్తి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశానుతాపః ।
కర్షన్తి భూరివిషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రయం జయతి కృత్స్న మిదం స ధీరః॥ 76

టీ. యస్య=ఎవనియొక్క, చిత్తం=మనస్సును, కాన్తా * కటాక్షవిశిఖాః -

* 'యద్గతాగతవిశ్రాన్తివైచిత్ర్యేణ వివర్తనమ్। తారకాయాః కలాభిజ్ఞ స్తం

కాన్తా=స్త్రీలయొక్క, కటాక్ష=కడగంటిచూపులనెడి, విశిఖాః=బాణములు, న ఖనన్తి=క్రుచ్చవో-మోహింపఁజేయవోయనుట, కోప... తాపః-కోప=క్రోధమనెడి, కృశాను=అగ్నియొక్క, తాపః=తాపము-వేఁడిమి,ననిర్దహతి=దహింపదో-వ్యాపుల పెట్టదో యనుట, భూరివిషయాః చ=బలవత్తరములైన శబ్దము రసము మొదలైన యింద్రియార్థములును, లోభపాశైః=లోభము లనెడిత్రాళ్ల చేత-(లోభ మనఁగా పరధనాపహరణమందు ప్రయత్నము- అది బంధనహేతువగుటచే పాశముగా రూపింపఁబడినది), నకర్షన్తి=ఆకర్షింపవో-(తర్షన్తి అనుపాఠమున తృష్ణ గలదిగాఁ జేయవో యని యర్థము.) సః ధీరః=ఆధీరుఁడు, కృత్స్నం=సమస్తమైన, లోకత్రయం=స్వర్గము మొదలైన మూఁడులోకములను, జయతి=జయించుచున్నాఁడు-స్వాధీనములుగాఁ జేసికొనుచున్నాఁ డనుట. వాని కేదియు నసాధ్యము కాదని భావము.

ఉ. మానవతీకటాక్షశితమార్గణముల్ విదలింపఁ జాల వె
వ్వానిమనంబు కోపమయవహ్ని దహింపదు లోభపాశసం
తానము మాల్యచందనవితానములన్ వెత సేయ నోప కె
వ్వానివశంబునన్ మెలఁగువాఁడు జయించు జగంబు లన్నియున్.

తా. ఎవనిమనస్సు, పూవుఁబోఁడుల వాఁడిచూపులనెడితూపులచేఁ గాఁడకయుఁ గోపాగ్నిచేఁ గ్రాఁగకయు, శబ్దాదివిషయములం దగిలి లోభపాశములచే కట్టువడి పేరాసపాలు కాకయు నుండునో, వాఁడే ధీరుఁడు. వానికి మూఁడులోకములును వశమై యుండును.

అవ. ధైర్యగుణమును దిరస్కరించుట యెట్లును యుక్తము కా దనుచున్నాఁడు.

శ్లో॥ కదర్థితస్యాపిహి ధైర్యవృత్తే, ర్నశక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్।
అధోముఖస్యాపి కృతస్యవహ్నే, ర్నాధః శిఖా యాతి కదాచిదేవ॥

తా. కదర్థితస్యాపి=తక్కువపఱుపఁబడినవాఁడయ్యును-అతిదుఃఖితుఁడైనను ధైర్యవృత్తేః=ధైర్యముతో వర్తించునట్టివానియొక్క-ధీరునియొక్క, ధైర్యగుణః= ధైర్య మనెడిగుణము, ప్రమార్ష్టుం=తుడిచివైచుటకు-తక్కువపఱుచుటకనుట, నశక్యతేహి=శక్యముగా నేరదు. దీనికి దృష్టాంత మేమన, అధోముఖస్య=దిగుముఖముకలదిగా, కృతస్యాపి=చేయఁబడినదైనను, వహ్నేః=అగ్నియొక్క, శిఖా=జ్వాల,

---

కటాక్షం ప్రచక్షతే' నల్లగ్రుడ్డు ఇటు నటు పోవుచును మరల వచ్చుచును నిలుచుచును ఇట్లు విచిత్రముగా విలాసముతోఁ దిరిగివచ్చుటయే కటాక్షము: అని భావప్రకాశమునఁ జెప్పఁబడినది.

కదాచిదేవ=ఒకప్పుడును, అధః=క్రిందుగా, నయాతి=పోదు-మీఁదనే ప్రసరించుననుట-ఇట్లే ధీరనిధైర్యగుణమును నుండు నని తెలియునది. అలంకారము-దృష్టాంతము.

తే. నియతిచేతఁ గదర్థితుం డయిన ధైర్య
పరునిధైర్యగుణంబు మాసిపోవంగఁ దరమె
క్రిందు సేయంగఁ బడినట్టి కృష్ణపథుని
కీల లెందయిన మీఁదుగాఁ గెరలుఁగాదె. 77

తా. అగ్నిని దలక్రిందుగాఁ బట్టినను దానిజ్వాల క్రిందుగా ప్రసరింపనియట్లు ధీరుని నెంతతక్కువపఱిచినను వానిధైర్యగుణము తక్కువకాదు.

అవ. శీలము నశించుటకంటె మరణమునొందఁ యత్నించుటయే మే లనుచున్నాఁడు.

శ్లో॥ వరం తుఙ్గాచ్ఛృఙ్గా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వాయం కాయః కఠినదృషద న్తే విదలితః।
వరం న్యస్తో హ స్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే
వరం వహ్నౌ పాత స్తదపి న కృతః శీలవిలయః॥ 78

టీ. అయం=ఈ, కాయః=దేహము, గురుశిఖరిణః=మిక్కిలి పొడవైన పర్వతముయొక్క, తుఙ్గాత్ శృఙ్గాత్ = పొడవైన శిఖరమునుండి, క్వాపి=ఒకానొక, విషమే=వికటమైన-ఒడుదొడుకైన, కఠిన దృషత్ అన్తే=కఠినమైన ఱాతి నడుమ, పతిత్వా=పడి, విదలితః=తునుకలైనది (అయ్యేనేని), వరం=కొంత మేలు, హస్తః=చేయి, తీక్ష్ణ దశనే=విషాగ్నిచే నుగ్రమైన కోఱలు గల, ఫణిపతిముఖే=సర్పరాజుయొక్క నోటియందు, న్యస్తః=పెట్టఁబడినది (అయ్యేనేని). వరం=కొంత మేలు, హస్తః=చేయి, తీక్ష్ణ దశనే = విషాగ్నిచే నుగ్రమైన కోఱలుగల, ఫణిపతిముఖే=సర్పరాజుయొక్క నోటియందు, న్యస్తః=పెట్టఁబడినది (అయ్యేనేని), వరం=కొంత మేలు, వహ్నౌ=అగ్నియందు, పాతః=పడుట-అగ్నిప్రవేశ మనుట, వరం=కొంత మేలు, తదపి=అయినను, శీలవిలయః=మంచిస్వభావముయొక్క నాశము-మంచి స్వభావమును విడిచిపెట్టుట, కృతః=చేయఁబడినది (అయ్యేనేని), న వరం=కొంచెమైనను మంచిది కాదు-ప్రాణసంకటము కలిగినను శీలమును విడువరాదని భావము.

ఉ. ఉరుతరపర్వతాగ్రమున నుండి దృఢం బగుఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హతంబుగఁ జేయుట మేలు గాలిమే
పరిదోరవాతఁ గేలిడుట బాగు హుతాశనమధ్యపాతముం
వర మగుఁ జారుశీలగుణవర్జన మర్హము గాదు చూడఁగన్. 78

తా. పొడవైనయొకపర్వతపుఁగొననుండియొకానొకకఠినశిలనడుమఁబడి యొడలు తునుకలుగాఁ జేసికొనుటయుఁ గొంత మే లనవచ్చును. బెడిదంపుఁగోఱలుగల

యాదిశేషునిముఖమునందుఁ జేయిఁ జొనుపుటయుఁ గొంత మేలనవచ్చును. అగ్నిఁ జొచ్చుటయు మేలనవచ్చును. కాని, శీలమును విడుచుటమాత్రము కొంచెమైనను మంచిది కాదు.

అవ. శీల మత్యంతావశ్యక మైనదని చెప్పఁబడినదిగదా. అది యుండుటవలనఁ గలుగులాభ మేమి? అని యడుగఁగా దానికిఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వహ్ని స్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతే తత్‌క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతిః సద్యః కురఙ్గాయతే।
వ్యాలో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాఙ్గేఽఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి॥ 79

టీ. యస్య=ఎవనియొక్క, అఙ్గే = అవయవమునందు - శరీరమునం దనుట, అఖి...తమం-అఖిలలోక=సమస్తజనులకును, వల్లభతమం=మిక్కిలియు మనోహర మైన, శీలం=సత్స్వభావము, సమున్మీలతి=మిక్కిలియుల్లసిల్లుచున్నదో, తస్య=వానికి-వానియెడ, వహ్నిః=అగ్ని (దహించునట్టిదైనను), జలాయతే=జలమువలె నాచరించుచున్నది-జలమువలె చల్లనగుచున్నదనుట. జలనిధిః = సముద్రము (దాఁటరానిదైనను), తస్య=వానికి-(ఇట్లె మీఁద నొక్కొక్కదానికిని గూర్చుకొనవలయును), కుల్యాయతే=కాలువవలె నాచరించుచున్నది తత్క్షణాత్ =అక్షణముననే-ఆలస్యమునఁగాదనుట, మేరుః=మేరుపర్వతము, స్వల్పశిలాయతే=చిన్నఱాయివలె నగుచున్నది, మృగపతిః=సింహము(మిక్కిలి హింసించుస్వభావము గలదైనను), సద్యః=అప్పుడే-తోడనే, కురఙ్గాయతే=జింకవలె నగుచున్నది. వ్యాలః=సర్పము (విషముచేతను రోషముచేతను భయంకర మైనదయ్యును), మాల్యగుణాయతే=పూవండవలెనగుచున్నది. విషరసః=విషద్రవము (ప్రాణములను హరించునట్టిదైనను, పీయూషవర్షాయతే=అమృతవర్షమువలె నాచరించుచున్నది-దుఃఖమును గలిగించునవియెల్ల శీలసంపన్నునికి సుఖమును గలిగించుచున్నవి. ఇదియే శీలమువలనఁ గలుగుపరమలాభమని భావము.

చ. అతనికి వార్ధి కుల్య యగు ✽ నగ్ని జలం బగు మేరుశైల మం
చితశిలలీల నుండు మద✽సింహము జింక తెఱంగుఁ దాల్చుఁ గో
పితఫణి పూలదండ యగు ✽ భీష్మవిషంబు సుధారసం బగు౯
క్షితి జనసమ్మతం బగుసు✽శీల మ దెవ్వనియందు శోభిలున్. 79

తా. సకలజనులకు నత్యంతమనోహర మైనశీలముకలిమిచే నెవ్వనిమూర్తి యుల్లసిల్లుచుండునో యట్టిపురుషునికి దహించునట్టియగ్ని జలమువలెఁ జల్లగను, దాఁటరానిసముద్రము చిన్నకాలువవంటిదిగాను, బొడవైన మేరుపర్వతము చిన్నఱాతివం

టిదిగాను, హింసించునట్టి సింహము బెదరి పాఱునట్టి జింకవంటిదిగాను, విషరోష ములచే బెడిదమైన సర్పము సొంపైన పుష్పసరమువంటిదిగాను, విషద్రవ సువృష్టి వర్ష మువంటిదిగాను నిట్లు దుఃఖహేతువు లైనవన్నియు సుఖప్రదములుగా నగును. ఇచట కృఞర్థమువలన ఔపమ్యప్రతీతి కలుగుటచే నుపమాలంకారము.

అవ. శీలసంపన్ను లగువారికి నెప్పుడును సంతాపము గలుగ దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఛిన్నోఽపి రోహతి తరుః, క్షీణో ప్యుపచీయతే పున శ్చన్ద్రః।
ఇతి విమృశ న్త స్స న్తః, స న్తప్య న్తే న విప్లుతా లోకే॥ 80

టీ. తరుః=వృక్షము, ఛిన్నస్సన్నపి=ఛేదింపఁబడినదైనను, పునః=మరల, రోహతి=పైకిపోవుచున్నది- పెరుఁగుచున్నదనుట. చన్ద్రః=చంద్రుఁడు, క్షీణస్సన్నపి=కృష్ణపక్షమునందు నానాఁటికిం గృశించినవాఁడైనను, పునః=మరల, ఉపచీయతే=పెరుఁగుచున్నాఁడు. ఇతి=అనియిట్లు, విమృశ న్తః=మనస్సునఁ దలపోయుచున్నవారైన, స న్తః=సత్పురుషులు-శీలసంపన్నులనుట, లోకే=ఈలోకమునందు, విప్లుతాస్స న్తః=సంకటము నొందినవారగుచు, నస న్తప్య న్తే=సంతాపమునొందరు. అయితే తరువృక్షములవలె తాము అభివృద్ధికి మఱియొకప్పుడు రాఁగూడునని తలంతురనుట.

గీ. ఖండితం బయ్యు భూజంబు ♦ వెండి మొలచు
క్షీణుఁ డయ్యును నభివృద్ధిఁ ♦ జెందు సోముఁ
డివ్విధమున విచారించి ♦ యొడలు దెగిన
జనములకుఁ దాప మొందరు ♦ సాధుజనులు. 80

తా. చెట్టు ఛేదింపఁబడినను మరల పైకి పెరుఁగుట, చంద్రుఁడు కృష్ణపక్షమునఁ గృశించినను మరల వృద్ధినొందుట, యను నీ రెండు దృష్టాంతములను మనస్సునఁ దలపోసినవారై శీలసంపన్నులు తమకు దుఃఖము కలిగనేని తాపమునొందక తా మా తరుచంద్రులవలె ముం దభివృద్ధికి రాఁగూడునని తలఁచుచుందురు. [ఇప్పుడు క్షీణదశ నొందినను పిదప వృద్ధినొందుదు మను విమర్శవలన వారికి సంతాపమే కలుగ దని యాశయము.]

అవ. శీలమే సమ స్తభూషణము లని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞాన స్యోపశమః శ్రుతస్య వినయో వి త్తస్య పాత్రే వ్యయః।
అక్రోధ స్తపసః క్షమా ప్రభవితు ర్ధర్మస్య నిర్వ్యాజతా
స ర్వేషా మపి సర్వకారణ మిదం శీలం పరం భూషణమ్॥ 81

టీ. ఐశ్వర్యస్య=స్వామ్యమునకు - పతిత్వమునకు, సుజనతా = సుజనత్వము- మంచితనము, విభూషణం=అలంకారము-దుర్జనత్వ మలంకారము కాదనుట. శౌర్యస్య=శూరత్వమునకు, వాక్సంయమః=వాక్కుయొక్క నియమము - మితభాషిత్వమనుట, భూషణము - అసంబద్ధప్రలాపములాడుట కాదనుట. జ్ఞానస్య=తెలివికి-ఇది చేయఁదగును తగదు అను వివేకమునకు, లేక, ఆత్మవిషయజ్ఞానమునకు, ఉపశమః= శబ్దాది విషయములందు ఆశలేమి, విభూషణము-విషయలోలుపత్వము కాదనుట. శ్రుతస్య=శాస్త్రమునకు, వినయః=అడఁకువ, భూషణము-గర్వోద్రేకము కాదనుట. విత్తస్య=ధనమునకు, పాత్రే=సత్పాత్రమునందు, వ్యయః=వ్యయము, భూషణము- నటవిటాదులందుఁ జేయు వ్యయము కాదనుట. తపసః=చాంద్రాయణాదిరూపమైన తపమునకు, అక్రోధః=కోపములేమి, భూషణము-కోపశీలత్వము కాదనుట, ప్రభవితుః=సమర్థుఁడైనవానికి-సామర్థ్యమునకు, క్షమా=ఓర్పు, విభూషణము-ఉగ్రత కాదనుట, ధర్మస్య=సత్పాత్రదానమునకు, నిర్వ్యాజతా=వ్యాజములేమి, భూషణము-ఒక నెపమునకై చేయుట కాదనుట. సర్వకారణం=ఐశ్వర్యము మొదలైన సమస్తమునకు మూలమగు, ఇదం=ఈ పూర్వోక్తమైన, శీలం=శీలము, సర్వేషామపి=సకలపురుషులకును, పరం=(సౌజన్యాదులకంటె) నుత్కృష్టమైన, భూషణం=అలంకారము. కావున సర్వవిధముల శీలమునే యాశ్రయింప వలయు నని భావము.

ఉ. జానుగ భూతికిం దొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతి విద్యకు శమంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము దాల్మి శక్తికిని ధర్మనిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణభూషణ మెన్నఁగ శీలమే సుమీ. 81

తా. స్వామిత్వమునకు సుజనత్వమును, శౌర్యమునకు మితభాషిత్వమును, జ్ఞానమునకు శబ్దాదివిషయములందు రక్తిలేమియు, శాస్త్రజ్ఞతకు వినయమును, ధనమునకు సత్పాత్రవినియోగమును, తపమునకుఁ గోపములేమియు, సామర్థ్యమునకు సహనశీలత్వమును, ధర్మమునకు వ్యాజములేకుండుటయు నలంకారములు. శీలమనునది ఐశ్వర్యము మొదలైనవాని కన్నిటికిని మూలము గనుక సకలపురుషులకు నిదియే సౌజన్యాదులకంటెను మేలైన భూషణము-(ఐశ్వర్యము మొదలైనవి గల యాయా పురుషులకు వరుసగా సౌజన్యము మొదలైన యాయాగుణములు భూషణములు. ఐశ్వర్యాదులకెల్ల శీలమే మూలము, గనుక నాయైశ్వర్యాదులు గలవారికి ఆసౌజన్యాదులకంటె నిదియే మేలైనభూషణ మని తాత్పర్యము.)

ఇది నీతిశతకమునందు ధైర్యపద్ధతివర్ణన మన్నది అష్టమదశకము.

---

అవ. ధైర్యశీలములు రెండునుగూడ దైవాయత్తము లగుటంజేసి వానిని నిరూపించినపిదప దైవపద్ధతిని నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురాః సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలు హరే రైరావణో వారణః ।
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభి ద్భగ్నః పరైః సఙ్గరే
త ద్వ్యక్తం నను దైవమేవ శరణం ధిక్ ధిక్ వృథా పౌరుషమ్॥

టీ. యస్య=ఎవనికి, నేతా=నడపువాఁడు-హితాహితము లుపదేశించి తగిన దారిని ప్రవర్తింపఁజేయువాఁడనుట, బృహస్పతిః=బృహస్పతియో-ఎవఁడో యొకఁడు కాదనుట, ప్రహరణం=ఆయుధము-పగతురనుగొట్టుసాధనము, వజ్రం=వజ్రాయుధమో-కొండలరెక్కలు గొట్టినను మొక్కవోనట్టి వజ్రాయుధమే కాని యేదో యొకయినుపసాధనము కాదనుట, సైనికాః=సైనికులు, సురాః=దేవతలో-బలహీను లగు నీలోకపుమనుష్యులు కారనుట, దుర్గం=గుప్తస్థానము, స్వర్గః=స్వర్గలోకమో-మన్నుతాలు మొదలైనవానితోఁ గట్టఁబడినది కాదనుట, అనుగ్రహః=రక్షించు నాసక్తి, హరేఃఖలు=హరివలననుండియో-క్షుద్రదేవతవలననుండి కాదనుట-హరి యింద్రుని రక్షింపఁగోరుట సకలలోకాధీశ్వరుఁ డగుటవలన నేకాని వానికిఁ దమ్ముఁడుగాఁ బుట్టుటవలనఁ గాదని హరిశబ్దప్రయోగము తెలుపుచున్నది, వారణః=ఏనుఁగు, ఐరావణః=ఐరావతమో-ఏదో యొకయేనుఁగుగున్న కాదనుట, బలభిత్=అట్టియింద్రుఁడు, ఇతి=ఇట్లు, ఆశ్చర్యబలాన్వితోఽపి=(ఇతరులకు సాధారణము కాని దగుటవలన) ఆశ్చర్యమును గలిగించునట్టి శక్తితోఁ గూడినవాఁ డైనను, సఙ్గరే=యుద్ధమునందు, పరైః=ఇతరులచేత-రాక్షసులచేతననుట, భగ్నః=భంజింపఁబడెను. తత్=కాఁబట్టి, వ్యక్తం=స్పష్టముగా, దైవమేవ=దైవమే, శరణంనను=రక్షకముకదా-పౌరుషము రక్షకము కాదనుట. పౌరుషం=పురుషకారమును-పురుషప్రయత్నమును, ధిక్ ధిక్=చీ చీ (అనఁదగును.) వృథా=అది వ్యర్థము-అప్రయోజకమైన దగుటచే పౌరుష మేమియుఁ జేయనేరదని భావము.

చ. గురుఁడు గురుండు వాలు శతకోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు గోట మధుసూదనుఁడుర్వ సయిదోడు దంతి ది
క్కరిపతిగాఁగ నొప్పుబలఘాతియు దాయల కోడె నాజిలో
శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్నిభంగులన్. 82

తా. ఇంద్రుని కాలోచన చెప్పుమంత్రి బృహస్పతి. ఆయుధము కొండల రెక్కలఁ గొట్టినను మొక్కవోనివజ్రము. సైనికులు దేవతలు. దుర్గము స్వర్గము.

అనుగ్రహించినవాఁడు సకలలోకాధినాథుఁడగు విష్ణువు. గజము ఐరావతము. ఇట్లా శ్చర్యకరమైన శక్తితోఁ గూడినవాఁడైనను ఇంద్రుఁడు యుద్ధమునందు రాక్షసులచే భంగపడెను. కాఁబట్టి *దైవమే రక్షక మనుట స్పష్టముగాఁ దెలియుచుండుటవలన నిసీ! పౌరుష మెంతయు వ్యర్థము. [ఇందు సాభిప్రాయవిశేషణములవలన పరికరాలంకారము.]

అవ. బంధమోక్షములకును హానివృద్ధులకునుసైతము దైవమే కారణ మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ భగ్నాశస్య కరణ్డపిణ్డితతనో ర్మ్లానేన్ద్రియస్య క్షుధా
కృత్వాఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః।
తృప్త స్తత్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా
స్వస్థా స్తిష్ఠత దైవమేవ హి పరం వృద్ధౌ క్షయే కారణమ్॥ 83

టీ. ఆఖుః=ఎలుక, నక్తం=రాత్రియందు, వివరం=బిలమును, కృత్వా=చేసి-పెట్టెకనిభావము, కరణ్డ పిణ్డిత తనోః=పెట్టెయందు ముద్దగాఁ గూర్పఁబడిన దేహము గలదియు-తిరుగుటకును మేనుచాఁచుటకును లేక కష్టదశయందున్నట్టియనుట, కావున నే, భగ్న ఆశస్య=(తప్పించుకొనిపోవ వీలులేమిచే) చెడినమనోరథముగలదియు, క్షుధా=ఆఁకటిచేత, మ్లాన ఇన్ద్రియస్య=వాడినయింద్రియములు గలదియు-ఇంద్రియములపాటవము చెడినదియు ననుట, (అగు) భోగినః=సర్పముయొక్క, ముఖే=నోటియందు, స్వయమేవ=తనంతనే-దైవవశమున, నిపతితః=పడినదాయెను. అసౌ=ఈ సర్పము, తత్ పిశితేన=దాని (ఎలుకయొక్క) మాంసముచేత, తృప్తస్సన్=తృప్తినొందినదై, తేనైవపథా=ఆదారినే-ఆబిలముదారినేయనుట, సత్వరం=శీఘ్రముగా, యాతః=(బయటవచ్చిపాటి) పోయెను. (కాఁబట్టి హేజనాః=జనులారా! అని శేషము), స్వస్థాఃసన్తః=స్థిరచిత్తులై-నెమ్మదితోననుట, తిష్ఠత=ఉండుఁడు,(ఏలనఁగా) వృద్ధౌ=వృద్ధియందును, క్షయే=క్షీణతయందును, దైవమేవ=దైవమే, పరంహి=ఉత్కృష్టమైనదిగదా-ఉత్కృష్టమైన కారణముగదా యనుట- వేఱొకటి కారణము గాదనిభావము. ఈ మూషకభోగిదృష్టాంతమును దలఁచుకొని వృథా పౌరుషములకు సంకటపడక, స్వస్థచిత్తులై యుండుఁడని యాశయము.

ఉ. రాతిరి మూషకంబు వివరంబొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సినపామునాత సం

---

* 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ ర్దైవం ప్రధాన మితి కాపురుషా వదన్తి। దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్రదోషః' అని పౌరుషమే యధికప్రధానమైనదిగాఁ జెప్పుటను పైశ్లోకము ఖండించుట తెలియనగును.

పాతముఁ జెందె దానిఁ దిని ♦ పాము దొలంగె బిలంబుత్రోవనే
యేతతి హానివృద్ధులకు ♦ నెక్కటి దైవము కారణం బగున్. 83

తా. ఒకనాఁటిరాత్రి యొకయెలుక యాహారము సంపాదించుకొనుటకు నొక పెట్టెకు రంధ్రముచేసి దానిలోనికిఁ దూరెను. అప్పు డంతకుమును పే యొకపాము పెట్టెలో తగులుపడి యాశచెడి యిఱుకటమువలన దేహమునంతయు ముడ్గాఁగూర్చు కొన్నదై యాఁకటివలన నింద్రియములపాటవమును దప్పి కృశించుచుండెను. అంత నది యాయెలుక ప్రవేశింపఁగానే పట్టుకొని దానిమాంసమును దిని తృప్తినొందినదై యాయెలుక చేసినరంధ్రముగుండనే బయటికి తప్పించుకొని పాఱిపోయెను. ఇట్లెలుక యాహారము వెదకవచ్చి చిక్కుకొని చచ్చుటయు, చిక్కుకొని చావనున్న సర్ప మాహారమును దిని తప్పించుకొని బ్రదుకుటయు, నెలుక చేసినబొందయే యది చిక్కుకొనుటకు నుపాయమును బాము తప్పించుకొనుటకు హేతు వగుటయుఁ జూడఁగా దైవమే ముఖ్యకారణమై నిలిచి వృద్ధిక్షయములు కలిగించుచున్నదిగాని పురుషప్రయత్నమువలన నేమియు లేదని తెలిసెడిని. కావున లోకులారా! యీసర్పమూషక దృష్టాంతమును దలఁచుకొని కష్టములు కలిగినయెడల వానికి దైవమే మూల మని తలఁచి దుఃఖింపక స్వస్థచిత్తులరై యుండుఁడు.

అవ. దైవభక్తి గలవానికిని లేనివానికిని గలుగునవస్థలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యథా కన్దుకపాతే నో, త్పత త్యార్యః పతన్నపి ।
తథా త్వనార్యః పతతి, మృత్పిణ్డపతనం యథా॥ 84

టీ. ఆర్యః=పూజ్యుఁడు-దైవభక్తి గలవాఁడు, పతన్నపి=(ఏదేనొక కారణము చేత) పడుచున్నవాఁడైనను-తక్కువదశకు వచ్చుచున్నను అనుట, కన్దుకపాతేన= బంతిపాటుచేత-బంతి పడి పైకిలేచులాగున అనుట, యథా ఉత్పతతి=ఎట్లు పైకి వచ్చునో-ఉన్నతికివచ్చునోయనుట, తథా=అట్లే అనార్యః=పూజ్యుఁడుకానివాఁడు-దైవభక్తి లేనివాఁడనుట, మృత్పిణ్డపతనం యథా=మట్టిముద్దయొక్క పాటువలె, పతతి=పడుచున్నాఁడు- తక్కువస్థితికి వచ్చుచున్నాఁ డనుట.

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందం బడి మగుడ మీఁదికి న్నెగయు సుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందం బడి యడఁగియుండుఁ ♦ గృపణత్వమునన్. 84

తా. బంతి క్రిందపడినను మరల పైకిలేచునట్లు దైవభక్తి గల పూజ్యుఁడు క్రిందుపడినను తిరిగి యున్నతికి వచ్చును. మట్టిముద్ద క్రిందఁబడి యట్లే యుండునట్లు దైవభక్తి లేనివాఁడు క్రిందుపడియే యుండును.

అవ. దైవకృప లేనివానికి నెక్కడఁగాని సుఖము కలుగదను చున్నాఁడు.

శ్లో॥ ఖల్వాటో దివసేశ్వరస్య కిరణైః సన్తాపితో మస్తకే
వాఞ్ఛ న్దేశ మనాతపం విధివశా త్తాలస్య మూలం గతః।
తత్రా ప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః
ప్రాయో గచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యా న్త్యాపదః॥85

టీ. ఖల్వాటః = బట్టతలవాఁడు, మస్తకే=తనతలయందు, దివసేశ్వరస్యకిరణైః=సూర్యునియొక్క కిరణములచేత, సన్తాపితస్సన్=మిక్కిలి తపింపఁజేయఁబడినవాఁడగుచు, అనాతపం = ఎండలేనట్టి-నీడగలయనుట, దేశం=ప్రదేశమును, వాంఛన్=కోరుచు, విధివశాత్=దైవయోగమున, తాళస్య=తాటిచెట్టుయొక్క, మూలం (ప్రతి)=మొదటిని (గూర్చి), గతః=పోయెను-తాటిచెట్టుక్రిందికిఁ బోయి యుండెననుట, తత్రాపి=అచ్చటనుగూడ, పతతా=కొడ తునిగి పడుచున్న, మహాఫలేన=పెద్ద (తాటి) పండుచేత, అస్య=వీనియొక్క, శిరః=తల, సశబ్దం=పటపట యనుశబ్దముతోఁ గూడునట్లుగా, భగ్నం=పగుల్పఁబడినది-పగిలెననుట. (దీనికి హేతువేమనఁగా), దైవహతకః=దైవము ప్రతికూలముగా నుండువాఁడు, యత్ర=ఏచోటికి, గచ్ఛతి=పోవుచున్నాఁడో, తత్రఏవ=ఆచోటికే, ఆపదః=ఉపద్రవములుకూడ, ప్రాయః=బహుతరముగా, యాన్తి=పోవుచున్నవి-దోమలకు వెఱచి యూరువిడిచి యడవికిఁ బోయినవానిని పులి పట్టుకొన్న ట్లనుట

మ. ధర ఖల్వాటుఁ డొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁ డై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాఁ
బౌరి దైవోపహతుండు వోవుకడకుం బోవుంగదా యాపదల్.85

తా. బట్టతలవాఁడొకఁడు తనతల యెండచేఁ గాలుటకుఁ దాళలేక నీడగలచోటిని గోరి నొకతాటిచెట్టుక్రిందఁజేరెను. దైవికముగా, అచ్చటికిఁ బోయియుండినను పెద్దతాటిపండొకటి మీఁదఁ బడి వానితల పటపటమని బ్రద్దలయ్యెను. కావున దైవము ప్రతికూలముగానుండువాఁ డెక్కడికిఁబోయిన నక్కడికి వానియాపదలుకూడ వచ్చునేగాని వానిని విడిచిపెట్టవు. (తలను ఎండసోఁకుననుండి తప్పింపఁజూడఁగా పండు వేసి గానిని బగుల్చుట ప్రతికూలమను దైవముయొక్క చేష్టిత మని యూహించునది).

అవ. ఇట్లుండుటవలన దైవమే బలీయ మని నాయభిప్రాయ మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ గజభుజఙ్గవిహఙ్గమబన్ధనం, శశిదివాకరయో ర్గ్రహపీడనమ్ ।
మతిమతాంచ విలోక్యదరిద్రతాం,విధి రహో బలవానితి మేమతిః॥

టీ. గజభుజఙ్గ విహఙ్గమ బన్ధనం=ఏనుఁగులుసర్పములు పక్షులు వీనియొక్క కట్టువడుటయు,శశిదివాకరయోః=సూర్యచంద్రులయొక్క, గ్రహపీడనం=రాహుగ్రహముచే పీడింపఁబడుటయు, మతిమతాం=ప్రాజ్ఞు లైనవారియొక్క, దరిద్రతాంచ=పేదఱికమును,విలోక్య=చూచి,అహో=ఔరా,విధిః=దైవము,బలవాన్ ఇతి=బలీయమైనది అని, మేమతిః=నాయభిప్రాయము-దైవమే యన్నిటికిని మూల మనిభావము.

తే. ఫణులు గజములుఁ బక్షులుఁ గట్టువడుట
రవిసుధాకరులకు నైనఁ రాహుబాధ
బుద్ధిమంతులలేమియుఁ జూచి
విధి బలాఢ్యుఁ డటంచు భావింతు మదిని. 86

తా. పట్టుకొనసాధ్యముకాని యేనుంగులు సర్పములును పక్షులును గట్టువడుటయు,జగమునంతయు వెలిఁగించునంతటిమహిమగల సూర్యచంద్రులను రాహువుపీడించుటయు,మిక్కిలిబుద్ధిశాలులైనవారికిఁబేదఱికముకలుగుటయునుజూడఁగా,ఔరా! అందఱికంటెను దైవమే బలీయమైనది, కానిచో నింతటిగజాదు లిట్టిపాట్లకు లోనగునాయని నేను దలంచుచున్నాను. అలం. అర్థాంతరన్యాసము,కావ్యలింగము.

అవ. దైవ మిట్లు చేయునేని నదికూడ తెలివి లేనిదియే యగునని తలఁచి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ సృజతి తావ దశేషగుణాకరం, పురుషరత్న మలఙ్కరణం భువః।
తదపి తత్క్షణభఙ్గి కరోతి చే, దహహ కష్ట మపణ్డితతా విధేః॥87

టీ. (విధిః=దైవము), అశేష గుణ ఆకరం = సకల సద్గుణములకును గనియును (అనఁగా ఆశ్రయమును), భువః=భూమికి, అలఙ్కరణం=అలంకారమును,(అగు) పురుషరత్నం=పురుషుఁ డనురత్నమును-పురుషశ్రేష్ఠుని అనిభావము, సృజతితావత్=నిర్మించుచున్నాఁడుగదా. తదపి=అయినను-అట్లు సృజించినప్పటికిని, తత్=ఆపురుషరత్నమును, క్షణభఙ్గి=క్షణమాత్రమున భంగము నొందుదానినిగా, కరోతిచేత్=చేయుచున్నయెడల, విధేః=దైవముయొక్క, అపణ్డితతా=పాండిత్యములేమి-మూఢత్వమనుట, అహహ= అక్కటా, కష్టం=కష్టము. 'అహహ' మిక్కిలివిషాదమును దెలుపుటకొఱ కని తెలియునది. ఇచట 'అశేషగుణాకరం' 'అలఙ్కరణంభువః' అనునీరెండు విశేషణములును 'పురుషరత్నం' అను రూపకసమాసమునఁ గల పురుషునికిని రత్నమునకును సమానములు.

క. గుణమణిఖని యగుపూరుష
మణి ధరణికి రవణముగ నమర్చిన విధి యా

గుణవంతుని వెసఁ దునిమిన
గుణహీనునిగాఁగ నెన్నఁ గొనరే ధాతన్. 87

తా. దైవము సకలగుణసంపన్నుఁడును జగమున కలంకారభూతుఁడు నగు పురుషశ్రేష్ఠుని నిర్మించినప్పటికిని వాని నతిత్వరలో నశించునట్లు చేయు నేని, కట కటా! దానికిని దెలివి లేదు. ఏమి చేయవచ్చును? అలం. రూపకము.

అవ. దైవయోగము నెట్లుగాని యతిక్రమించుట కష్ట మను చున్నాఁడు.

శ్లో॥ అయ మమృతనిధానం నాయకో ఽప్యోషధీనాం
శతభిషగనుయాతః శమ్భుమూర్ధ్నో ఽవతంసః ।
విరహయతి న చైనం రాజయక్ష్మా శశాఙ్కం
హతవిధిపరిపాకః కేన వా లఙ్ఘనీయః॥ 88

టీ. అయం=వీఁడు-ఈ కనఁబడుచున్న చంద్రుఁ డనుట, అమృతనిధానం=అమృతమునకు స్థానమును, ఓషధీనాం=సంజీవిని మొదలైన మూలికలకు, నాయకః అపి=ఏలికయును, శతభిషక్ అనుయాతః=నూర్గురు వైద్యులచేత అనుసరింపఁబడినవాఁడును-(చంద్రునికి నూఱువైద్యులు లేమిచే నట్లు చెప్పుటవలన దోషముకలుగఁగా శతభిషనక్షత్రముచే ననుసరింపఁబడినవాఁడు అని యర్థాంతరమువలన దోషమునకు పరిహారము గ్రహింపవలయును), శమ్భుమూర్ధ్నః=శివుని యొక్క శిరస్సునకు, అవతంసః=శిరోభూషణమును, ఏనంశశాఙ్కం=పూర్వోక్తలక్షణములతోఁ గూడియున్న యీచంద్రుని, రాజయక్ష్మా=క్షయరోగము, నచ విరహయతి=విడువలేదుగదా. (కావున)హత...పాకః-హతవిధి=నష్టదైవము యొక్క-చచ్చినదైవము యొక్క, పరిపాకః=నియోగము, కేనవా=ఎవ్వనిచేత, లఙ్ఘనీయః=అతిక్రమింపఁదగినది-ఎవ్వనికిని అతిక్రమింపరాదనుట. 'హతవిధి' అనుచో హతశబ్దము నిర్వేదపడుటను దెలుపుచున్నది. అనఁగా హేయముగాఁ దలఁచి చెప్పినమాట యని తెలియునగును.

చ. శతభిషగాఢ్యుఁడున్ సతతశంభువతంసము నయ్యు నోషధీ
తతులకు నాథుఁ డయ్యును సుధారససేవధి యయ్యుఁ దారకా
పతి దనరాజయక్ష్మభవబాధలఁ బాపఁగ నోపఁ డక్కటా
హతవిధికృత్య మెవ్వనికి నైన జగంబున దాఁటవచ్చునే. 88

తా. ఈ కనఁబడుచున్న చంద్రుఁడు అమృత ముండెడుస్థానము; సంజీవిని మొదలైన మూలికలకెల్ల రాజు. వైద్యులొకనూర్గురు కూడనేయుందురు. సకలలోకక్షేమ

కరుఁడగు శివునికి శిరోభూషణమైనవాఁడును, ఇట్టియీచంద్రుని క్షయరోగము పట్టి విడువకున్నది. కాఁబట్టి పాడుదైవముయొక్క నియోగమును దప్పింప నెవరికిని దరముకాదు.

అవ. మనస్సును మెలపునదికూడ దైవమే యని చెలికానిని చూచి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ప్రియసఖ విప ద్దణ్డవ్రాతప్రపాతపరమ్పరా
పరిచయచలే చిన్తాచక్రే నిధాయ విధిః ఖలః ।
మృద మివ బలా త్పిణ్డీకృత్య ప్రగల్భకులాలవ
ద్భ్రమయతి మనో నో జానీమః కి మత్ర విధాస్యతి॥ 89

టీ. ప్రియసఖ=ప్రియస్నేహితుఁడా! ఖలః=దుష్టుఁడైన, విధిః=దైవము, ప్రగల్భకులాలవత్=ప్రౌఢుఁడైన (అనఁగా ఆఁతితేఱిన) కుమ్మరవానివలె, మనః=నామనస్సును, మృదం ఇవ=మట్టినివలె, బలాత్=సామర్థ్యముతో, పిణ్డీకృత్య=ముద్దచేసి, విపత్...చలే-విపత్=ఆపదలనెడి, దండ=కొయ్యలయొక్క, వ్రాత=సమూహముయొక్క, ప్రపాత=పాటులయొక్క, పరమ్పర=పరంపరయొక్క, పరిచయ=మచ్చికచేత-కూడికచేతననుట-విపత్తులనెడికొయ్య లొకటివెనుక నొకటిగా పెక్కులు తనపైఁ బడుచుండుటచేతనని భావము, చలే=తిరుగునట్టిదైన-దైవమనెడి కుమ్మరి విపత్తులనెడి కొయ్యలను వరుసగా మీఁదవైచికొట్టుటచేఁ దిరుగుచున్నట్టి యనుట, చిన్తాచక్రే=చింత యనెడిచక్రమునందు, నిధాయ=ఉంచి, భ్రమయతి=త్రిప్పుచున్నది, అత్ర=ఇందు-ఈత్రిప్పుటయందు, కిం విధాస్యతి=ఏమి చేయఁబోవుచున్నాఁడో-ఏమి చేయుటకిట్లు త్రిప్పుచున్నాఁడో, నోజానీమః=ఎఱుఁగము.

చ. కలితవిపత్తిదండపదఘట్టనసేయుచు మన్నుకైవడిన్
ఖలుఁడు విధాత పిండితముగా నొనరించి నితాంతచింత యన్
బలితపుసారెపై నిలిపి పాయక డెందము ద్రిప్పుచున్నవాఁ
డలమి కులాలురీతిఁ దెలియం గలవారమె యేమి సేయునో. 89

తా. దుష్టమగుదైవ మొకయాఁతితేఱినకుమ్మరివలె నామనస్సును బలిమిలోఁ బట్టి మట్టివలెముద్దఁజేసి, యాపద లనియెడి కొయ్యగుదియలచే నెడతెగక కొట్టువడుటవలనఁ దిరుగుచున్న చింతయనెడుచక్రమునం దునిచి త్రిప్పుచున్నది. ఏమి చేయుట కిట్లు త్రిప్పుచున్నదో తెలియరాదు. [కుమ్మరిత్రిప్పుట కుండచేయుట కని తెలియును. ఇదిత్రిప్పుట యెందులకో తెలియరాదనుట. దైవప్రాతికూల్యమువలన ఆపదలు సంభవించుటయు, అవి చింతను గలిగించుటయు, ఆచింత మనస్సును ద్రిప్పుటయు ననెడి వ్యవహారమును మట్టిని ముద్దచేసి చక్రమునఁ బెట్టి త్రిప్పుట యనెడుకుమ్మరివ్యాపారముగాఁ గవి రూపించినాఁ డని యెఱుంగునది.]

శ్లో॥ విరమ విరసాయాసా దస్మా ద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షితు మీహసే।
అపి జడ విధే కల్పాపాయే వ్యపేతనిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వా జలరాశయః ॥ 90

టీ. జడ=ఓయి మందుఁడా! విధే=దైవమా, విపది=నీవు కలిగించిన యాపదయందు, మహాత్మనాం=మహాత్ములైనవారికి, ధైర్యధ్వంసం=ధైర్యము చెడుటను, ఈక్షితుం=కనుఁగొనుటకు, ఈహసే=కోరెదవు, (అనుట)యత్=ఏదియో, విరసఆయాసాత్=నిష్ప్రయోజనమైన ఆయాసము గల-మహాత్ముల ధైర్య మెట్టియాపద నేనిఁ దూల నేరదు గాన దానిని దూలించుటకైన యాయాసము వ్యర్థమే యగును కాఁబట్టి యట్టియాయాసము గల, అస్మాత్=యీ-మహాత్ముల కాపద పుట్టించి వారి ధైర్యమును దూలింపఁజూచుట యనునట్టి యనుట, దురధ్యవసాయతః=చెడ్డపూనికనుండి, విరమ=ఉడుగుము, వారిధైర్యమును దూలించుట యసంభావిత మని దృష్టాంతముచే దృఢపఱుచుచున్నాఁడు. కల్ప అపాయే = కల్పాంతమునందు - కల్పాంతమువంటి మిక్కిలి సంకటమునందు-ఇఁక తక్కినపుడు చెప్పనేల యని భావము, వ్యపే... క్రమాః-వ్యపేత=మిక్కిలివీడిన-చెడినయనుట, నిజక్రమాః అపి=తమమర్యాదలుగలవయ్యు-తమకులమ మేరలు తప్పినట్టివయ్యు-భూమిని దాల్చియుండుట చెలియలికట్ట దాఁటిరాకుండుట యనుకట్టుపాటులను వదలినవయ్యు, ఏతే=ఈ, కులశిఖరిణః=మహేంద్రాదిసప్తకులపర్వతములుగాని, జలరాశయో వా=సప్తసముద్రములు గాని క్షుద్రాః=నీచములు, న (ఖలు)=కావుగదా-అపుడు మేరలు తప్పినవయ్యు పిదప మిగుల తమతమ మరియాదలయందే వర్తించుచున్నవి చూడుమనుట. *లేక, 'అపి' అనునది సంబోధవాచకముగాఁగొని తక్కినవానికి 'కల్పాపాయే వ్యపేతనిజక్రమాః క్షుద్రాః కులశిఖరిణః=కల్పాంతమునందు క్రమము తప్పినవియు కావుననే నీచము

---

* గాంభీర్యస్థైర్యాదులందు మహాత్ములకును సముద్రకులపర్వతములకును సామ్యముఁ జెప్పుట కవులందు సామాన్యముగాఁ జూపట్టుచున్నది. కిరాతార్జునీయమున 'స్థిత్యతిక్రాన్తభీరూణి స్వచ్ఛాన్యాకులితాన్యపి। తోయాని తోయరాశీనాం మనాంసిచ మనస్వినామ్' అనియు, మహావీరచరితమున 'నకమ్పన్తే ఝుంఝూమరుతి కిల వాతి ప్రతిదిశమ్।సమున్మూర్ఛాసారాః కులశిఖరిణః కిఞ్చిదపితే। న మర్యాదాన్తేఽపి ప్రతిజహంతి గాంభీర్యగరిమస్ఫురద్వార్బ్రహ్మాణః కలితమహిమానోఽమ్బునిధయః' అనియు సామ్యము వర్ణితము. కాన నీ సామ్యమును బ్రతిపాదించు మొదటి యర్థము సరసముగా నున్నది. అయినను 'తతస్సముద్రఉద్వేల స్సర్వతః ప్లావయన్మహీమ్' భాగవత-8-24, అనునట్లు సముద్రాదులు ప్రళయకాలమున మేరలు దప్ప

లై నవియు నగు కులపర్వతములు, ఏతే= ఈ మహాత్ములు, న=కారు. జలరాశయోవా =(అట్లే అప్పుడు క్రమము తప్పుటచే నీచములైన) సముద్రములుగాని, న=కారు- మహాత్ములు ఎప్పుడైనను సముద్రకులపర్వతములవలె నీచులై మేరతప్పువారు కార నుట-అనియు నర్థాంతరము. ఈ దృష్టాంతమునుబట్టి ధీరధైర్యధ్వంసము అతిదుష్కర మగుటచే దానికై పూనుటవలన వట్టిప్రయాసతప్ప వేఱొక్క ఫలము గలుగ దనుట. రెండవయర్థమున, అలం. వ్యతిరేకము.

చ. దొసఁగులు వచ్చువేళ గుణధుర్యుల ధైర్యగుణంబు సర్వముం
బస చెడు నంచుఁ జూచెదవు పాపపుదైవమ యీదురాగ్రహ
వ్యసనము మాను మాను ప్రళయంబున వీతనిజక్రమంబులై
నసి సెడ వించు కంతయును సాగరముల్ గులపర్వతంబులున్. 90

తా. మందబుద్ధి వైన యోదైవమా! మహాత్ములకు నీ వాపదలు కలిగించి వారి ధైర్యమును దూలింపఁగోరెదవు. నీ యీపూనిక వట్టిప్రయాసమే యగును గాని ఫలింపనేరదు గాన దీని నుడుగుము. ఏలన, కల్పాంతమున సప్తకులపర్వతములును సప్తసముద్రములును దమతమమేరలు తప్పినను మరల నవి తమతమమేరలయందే యెంతయు నెలకొని వర్తించుచుండుటఁ జూడుము.

అవ. అయినను దైవమే శరణ మనుచున్నాఁడు.

శ్లో॥ దైవేన ప్రభుణా స్వయం జగతి య ద్యస్య ప్రమాణీకృతం
తత్తస్యోపనమే న్మనా గపి మహా న్నైవాశ్రయః కారణమ్।
సర్వాశాపరిపూరకే జలధరే వర్షత్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పత న్తి చాతకముఖే ద్విత్రాః పయోబిన్దవః ॥ 91

టీ. ప్రభుణా=సమర్థుఁడైన, దైవేన = దైవముచేత, జగతి=లోకమునందు, యస్య=ఎవనికి, యత్=ఏది - ఏవస్తువు, ప్రమాణీకృతం=నిర్దేశింపఁబడినదో -ఏర్ప ఱుపఁబడినదో, తత్=అ వస్తువు, తస్య=వానికి, స్వయం=తనంతట, ఉపనమేత్= కలసివచ్చును-తనంత దొరకును. మహాన్=గొప్పదైన, ఆశ్రయః=పట్టు-గొప్పవారి నాశ్రయించుట యనుట, మనాక్ అపి=కొంచెమైనను, కారణం=సాధనము-గొప్ప

---

టచే నీచము లగుననియు నట్టినీచులు మహాత్ములు కా రనియు-అనఁగా సముద్రా దులకంటె నతిశయించినవా రనియు, ప్రతిపాదించు రెండవయర్థము మఱింత సమం జసముగా నున్నది. మహాత్ములకుఁ గల యీయతిశయమే 'గిరయో గురవ స్తేభ్యోఽ ప్యుర్వీ గుర్వీ తతోఽపి జగదణ్డమ్।తస్మాద ప్యతిగురవః ప్రలయే ప్యచలా మహా త్మానః' అనుటం దెలియనగు.'మహేన్ద్రో మలయః సహ్యః సానుమా నృక్షపర్వతః। విన్ధ్యశ్చపారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః॥' అని కులపర్వతము లేడును, 'లవణేక్షు సురాసర్పి ర్దధిక్షీరజలార్ణవాః' అని సముద్రము లేడును గలవు.

వారి నాశ్రయించుట గొప్పఫలప్రాప్తికి సాధనము, నైవ=కానేకాదు. ఇందులకు దృష్టాంతము. సర్వా...రకే-సర్వ=సర్వలోకముయొక్క, ఆశా=మనోరథములను, పరిపూరకే=ఓడఁగూర్చునట్టి, లేక, సర్వాశాపరిపూరకే = సకలదిగంతములందును వ్యాపించినట్టి ఫలముగల అని యర్థాంతరము, జలధరే=మేఘము, ప్రత్యహం=ప్రతి దినము, వర్షతి సత్యపి=వర్షించుచున్నను, చాతకస్య=చాతకపక్షియొక్క, ముఖే=నోట-చంచూపుటమునందు, సూక్ష్మాః=అణువులైన, (అంగును), ద్విత్రాః=రెండో మూఁడో (యైన), పయోబిన్దవః=జలకణములు-నీటిబొట్లు, పతన్తి=పడుచున్నవి. అన్నిటికి దైవము నియామకమై యుండుటచే మన మాశ్రయించినట్టి తక్కినవి యెంతపెద్దవి యయ్యు ఫలము నంతపెద్దవిగా నుండు నని తలంపరాదు. కావున దైవమే శరణ మని యాశయము.

తే. ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము
దైవకృత మగు నది వొందు దప్ప కతనిఁ
గారణము గాదు పెనుఁబ్రాపు ఘనునిఁ జేరు
చాతకమునాతఁ బడు నల్పజలకణములు. 91

తా. అన్నిటికిని శక్తిగలదైవము లోకమునం దెవనికి నేది గలుగునట్లు లేర్పఱుచు చున్నదో యదియే వానికిఁ దనంత దొరకును. కావున గొప్పవారి నాశ్రయించుటచే గొప్పఫలము కొంచెమేనియుఁ గలుగు ననరాదు. ఎట్లన, నలుగడల వ్యాపించి యెల్లవారికోరికలు నీడేరునట్లు మేఘము ప్రతిదినమును వర్షించు చుండియుఁ జాతకపక్షినోట రవ్వంతేసి నీటిబొట్లు రెండో మూఁడో పడుచున్నవేకాని యంత కెక్కువ పడవు గదా.

ఇది నీతిశతకమునందు దైవపద్ధతివర్ణన మన్నది నవమదశకము.

---

## నీతిశతకము - కర్మపద్ధతి.

---

అవ. 'దైవేన ప్రభుణా ఇత్యాదిసందర్భములచే దైవమె మిక్కిలి యావశ్యక మైనదని తెలుపఁబడినది. ఆదైవము కర్మముచే నియమింపఁబడున దై యుండుటచే దానికి స్వాతంత్ర్యము లే దను నభిప్రాయముతో దైవపద్ధతిని నిరూపించినవెనుక కర్మపద్ధతిని నిరూపింపఁ గోరి నవాఁడై యందును, సర్వదేవతలను నియమించునది విధి యనియు నట్టి విధిని నియమించునది కర్మమనియుఁ, గర్మముయొక్క ప్రాబల్యమును దెలుపుటకై దేవాదికర్మపర్యంత మైనపరంపరను అనువిధించుచున్నాఁడు.

శ్లో॥ నమస్యామో దేవా న్నను హతవిధే స్తేఽపి వశగా
విధి ర్వన్ద్యః సోఽపి ప్రతినియతకర్మైకఫలదః ।
ఫలం కర్మాయత్తం కి మమరగణైః కించ విధినా
నమ స్తత్కర్మేభ్యో విధి రపి న యేభ్యః ప్రభవతి॥ 92

టీ. దేవాన్=ఇంద్రాదిదేవతలను, నమస్యామః=నమస్కరించుచున్నారము-అయినను దేవతలనుమాత్రమే తుదముట్ట నమస్కరింపఁదగదు, వారినిసైతము నియమించునట్టిదైన దైవ మనునది యొకటి యుండుటచే దానికిఁగూడ నమస్కరింపవలయు ననుచున్నాఁడు, తే అపి=వారును, హతవిధేః=పాడుదైవమునకు, వశగాను=లోనైనవారుగదా, కాఁబట్టి, విధిః = దైవము (కూడ), వన్ద్యః=వందనముచేయఁదగినది, సోఽపి=అదికూడ-ఆదైవముకూడ, ప్రతి...లదః=ప్రతినియత=ఏర్పఱుపఁబడిన-ఈ కర్మమున కీఫలమని ముందుగానే వేఱువేఱ నియమింపఁబడియున్నదైన (ఇది ఫలముతో నన్వయించును), కర్మ=కర్మముయొక్క, ఫల=ఫలమును, దః=ఇచ్చునది. ఆయాకర్మమునకు ప్రతినియతమైయున్న యాయాఫలమును మాత్రమునియ్యఁజాలునేకాని తాను స్వతంత్రముగా నేదియు నియ్యఁజాలదనుట. ఫలం=ఫలమో, కర్మఆయత్తం=కర్మమునకులోనైనది-కర్మమువలననే ఫల మొనగూడునుగాని మఱొకటిచేఁ గాదనుట, కావున, అమరగణైః కిం=దేవతాసమూహములతోఁబనేమి. 'ఫలం కర్మాయత్తం యది కి మమరైః' అనుపాఠమున 'ఫలము కర్మమునకులోనైనయెడల దేవతలతోఁబనేమి' యనియర్థము. విధినాచకిం=విధితోడనుబనేమి-దేవతలును దైవమును ఫలమునుదమంతట నిచ్చునధికారములేనివారుగాన ఫలమునకైవారిని బ్రార్థించి యభివందనముచేయవలసినపని లేదనుట. తత్ =కాఁబట్టి,యేభ్యః=ఎవనివలన-ఏకర్మములయెడననుట, విధిరపి=దైవముకూడ, నప్రభవతి=చాలదో-సమర్థమైనదికాదో-ఫలము తనంతనే యిచ్చుటకు నేరదుగావున తనంతనే యీఁజాలిన కర్మమునకంటె శక్తికలదిగాదోయనుట, కర్మేభ్యః=(అట్టిజ్యోతిష్టోమతపోదానాదిరూపమైన) కర్మములకొఱకు, నమః=నమస్కారము - విధికంటె సమర్థమైనదిగాన నమస్కరింపఁ దగినదనిభావము- ఇచ్చటఁ బూర్వపూర్వములైనవి యుత్తరోత్తరములకు నుత్కర్షము కలిగించుటచే నలంకారము మాలాదీపకము - ఇదియె 'ఉత్తరోత్తర ముత్కర్షో భవేత్సారః పరావధిః' అని సారాలంకారముగాఁ గావ్యప్రకాశమునఁ జెప్పఁబడినది.

చ. శిథిలత లేనిభక్తి నతిసేతుము వేల్పుల కాసుపర్వులున్
విధివశవర్తు లావిధియు విశ్రుతకర్మఫలప్రదాత య
య్యధికఫలంబు కర్మవశ మట్లగుటం బనియేమి వారిచే
విధి కధికంబు గర్మ మని వేమఱు మ్రొక్కి భజింతుఁ గర్మమున్.

తా. సకలఫలముల నొసంగువారు దేవతలుగాన వారికి మ్రొక్కుదము. అయినను దేవతలుసైతము పాడుదైవమునకు లోనైనవారుగాన దైవమునకును మ్రొక్కఁదగును. ఈదైవమో కర్మమునకుఁబూర్వమే యేర్పడియుండునట్టిఫలము నిచ్చునదికాని వేఱు కాదు. అఫలమును గర్మమునకు లోనైనది. కాఁబట్టి యొకఫలముకొఱకు మనకు స్వతంత్రులు కాని దేవతలతోఁగాని దైవముతోఁగాని పనేమి? కాఁబట్టి దైవముకూడ దేనిని మీఱఁజాలదో యట్టికర్మములే మ్రొక్కఁదగినవి గాన వానికే మ్రొక్కుదము.

అవ. విధికూడ కర్మములను మీఱఁ జాల దన్నవిషయమునే విస్తరించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మా యేన కులాలవ న్నియమితో బ్రహ్మాణ్డభాణ్డోదరే
విష్ణు ర్యేన దశావతారగహనే క్షిప్తో మహాసఙ్కటే।
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం కారితః
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే॥ 93

టీ. యేన=దేనిచేత-ఏకర్మముచేతననుట, బ్రహ్మా=బ్రహ్మ, బ్రహ్మా...దరే = బ్రహ్మాణ్డ భాణ్డ=బ్రహ్మాండమనెడు కుండయొక్క, ఉదరే=నడుమ, కులాలవత్=కుమ్మరివలె, నియమితః=(వివిధవస్తువులను నిర్మించువాఁడుగా) నియోగింపఁబడెనో(బ్రహ్మ బ్రహ్మాండమనెడు కుండలోపల కుమ్మరివలె నియుక్తుఁడైనాఁ డనుట యాభాసము. కుమ్మరి కుండలోపల నియుక్తుఁ డగుట లేదుగదా. 'బ్రహ్మాణ్డభాణ్డే వరే=మేలైన బ్రహ్మాండమనెడు కుండయందు-అనఁగా బ్రహ్మాండము లనెడి కుండలను నిర్మించుటయందు' అను పాఠ ముచిత మని తోఁచెడి) యేన=దేనిచేత, విష్ణుః=విష్ణువు-కుక్షియందు నఖిలజగములు గలయట్టివాఁడయ్యు ననుట, దశా...హనే-దశఅవతార=పదియవతారములచేత, గహనే=చొరరాని-బహుప్రయాసకరము లైన పదియవతారములు గలిగియుండుటచే ననుభవింప శక్యము కాని యనుట, మహాసఙ్కటే=గొప్పకష్టమునందు- పదియవతారము లెత్తుట యను పడరాని పెనుఁగష్టమునం దనుట, క్షిప్తః=త్రోయఁబడెనో, 'మహాసఙ్కటే దశావతారగహనే' అనునన్వయమున 'మిక్కిలికష్టమైన దశావతారములనెడి యడవియందు' అని యర్థము. దీనికంటె పూర్వోక్తమైన యన్వయార్థములు సరసములు. యేన=దేనిచేత, రుద్రః=శివుఁడు-మృత్యువును జయించినవాఁడయ్యుననుట, కపాలపాణిపుటకే=పునుకయనెడి (అనఁగా బ్రహ్మశిరస్సు అనెడి) చేతిపాత్రయందు- పునుక నే బిచ్చ మెత్తుట కైనచేతిపాత్రగాఁ గలిగి యనుట, భిక్ష అటనం=భిక్షమునకై తిరుగుట, కారితః=చేయింపఁబడెనో, 'పుటకే భిక్షాటనం' 'పాత్రయందు బిచ్చమునకై తిరుగుట' అనుట యసంగతము. 'పుటకః భిక్షాటనం' పాత్రగలవాఁడై బిచ్చమునకై తిరుగుట అనియే పాఠముండునని తోఁచెడి. లేక, 'పుటకే భిక్షాదనం సేవతే=పాత్రయందు భిక్షాన్నమును గుడు

చుచున్నాఁడు' అనుపాఠాంతరమును నుచితమే. అయినను, 'క్షిప్తః' 'నియమితః' అని మొదట కర్మార్థకములు ప్రయోగించి యిచట 'సేవతే' అని కర్త్రర్థకము నుంచుట ప్రక్రమభంగముగాన 'కారితః' అనునదియే సరసము. (యేన=ఎవనిచేత), సూర్యః=సూర్యుఁడు-సకలలోకప్రకాశకుఁడయ్యును, (నియమితస్సన్ = నియోగింపఁబడినవాఁడగుచు), గగనే=ఆకాశమునందు, నిత్యమేవ=ఎప్పుడును-ఒకనిమిషమైనను విశ్రాంతిలేక యనుట, భ్రామ్యతి=తిరుగునో, తస్మై=ఆ-సకలమును నియమించునట్టియనుట, కర్మణే=కర్మమునకు, నమః=నమస్కారము. సర్వనియంత యైనదానికే నమస్కారము సేయఁదగునుగాన అట్టిదైనకర్మమునకు నమస్కరించెద నని భావము.

చ. నలువ కులాలుభంగి నలిననప్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతారవనకనిష్ఠితుఁ డయ్యె మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుఁ డయి భిక్షుకుఁ డయ్యెఁ బురారి దేనిచే
నల రవి దేనిచేఁ దిరుగు నాఘనకర్మము వంద్యమే కదా. 93

తా. దేనిచేత బ్రహ్మ కుండవలెనుండు బ్రహ్మాండమునడుమ నుండి కుమ్మరివలె నానావిధవస్తువులు నిర్మించుటకు నియోగింపఁబడెనో, దేనిచేత విష్ణువు పదియవతారములెత్తు పెనుఁగష్టమున కగ్గమయ్యెనో, దేనిచేత శివుఁడు పునుకను బాత్రగాచేతఁ గొని బిచ్చమెత్తుటకుఁ దిరిగెనో, దేనిచేత సూర్యుఁడు నియుక్తుఁడై యొక్క నిమిషముసేపేని నిలువక యెప్పుడు నాకాశమునఁ దిరుగాడుచుండునో, యట్టిసర్వనియమనశక్తిగల కర్మమునకు నమస్కారము.

అవ. ఇట్లు రెండుశ్లోకములఁ గర్మము సకలనియంత యగుటచే నది యభివాదనము సేయఁదగిన దని నిరూపించి, తానును దాని కభివందనము సేసి, యిప్పు డది బహుశ్రేయస్సులకు హేతువై నదగుటచే నుపాదేయము నైన దని చెప్పుచున్నాఁడు. [ద్వేషిణః

శ్లో॥ యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్
ప్రత్యక్షం కురుతే పరోక్ష మమృతం హాలాహలం తత్క్షణాత్।
తా మారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాఞ్ఛితం
హేసాధో వ్యసనైర్గుణేషు విపులే ష్వాస్థాం వృథా మాకృథాః॥

టీ. యా=ఏది-ఏసత్క్రియయనుట, ఖలాంశ్చ=దుర్జనులనుగూడ, సాధూన్=సజ్జనులనుగాను, మూర్ఖాన్=అజ్ఞానులను, విదుషః=పండితులనుగాను, ద్వేషిణః=ద్వేషించువారిని, హితాన్=హితులనుగాను-మేలుకోరువారినిగా ననుట, పరోక్షం=మఱుఁగైన దానిని-ఇంద్రియములకు గోచరింపనిదాని ననుట, ప్రత్యక్షం= ఇంద్రియము

లకు గోచరించుదానినిగాను, హాలాహలం=విషమును, తత్క్షణాత్=తోడనే-అప్పుడే యనుట, అమృతం=అమృతమునుగాను, కరోతి=చేయుచున్నదో, తాం=ఆ, భగవతీం=భగవతియగు, సత్క్రియాం=సత్కర్మమును, 'వక్రికామ్' అనుపాఠమున 'మంచివారిని జెడ్డవారినిగాఁ జేయుట మొదలైనవక్రములు చేయఁజాలిన దైనట్టిది' యనునర్థము గ్రాహ్యము. హేసాధో=ఓసుజనుఁడా, లేక, నేర్పరియైనవాఁడా యనియుఁ జెప్పవచ్చును. 'సాధుస్సమర్థోనిపుణోవా' అని కాశిక; వాఞ్ఛితం=కోరినట్టి, ఫలం=ఫలమును, భోక్తుం=అనుభవించుటకు-కోరినఫల మనుభవింపఁ దలఁచితివేని ననుట, ఆరాధయ=ఆరాధింపుము-అది సర్వఫలప్రదాయిని యనుటచే ననుట, (అయితే) వ్యసనైః=ఆపదలచేత, విపులేషు=మిక్కిలి యైన - మిక్కిలి యాపదలతోఁ గూడినవైన, లేక, 'వ్యసనైః' అనుటను క్రియావిశేషణపర్యాయముగా గ్రహించినచో 'మిక్కిలి యక్కఱలతో-చాల అక్కఱయొత్తుకొని, విపులేషు=అనేకములైన' అనియు నర్థ మూహ్యము, గుణేషు=రజస్సు తమస్సు మొదలైన గుణములందు, వృథా=వ్యర్థముగా, ఆస్థాం=ఆసక్తిని-ప్రయత్నము ననుట, మాకృథాః=చేయకుము-గుణములు క్లేశకరములైనఫలముల నిచ్చునవిగాన వానికై పూనకు మని భావము. ఇచట ఖలాదులను సాధువులు మున్నగువారినిగాఁ జేయుట అను అశక్యవస్తుకరణ ముండుటచే తద్రూపమైన విశేషాలంకార మూహ్యము.

మ. ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను సంఖ్యావంతునిం గాఁగ దా
యల సన్మిత్రులఁ గా నగోచరముఁ బ్రత్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కలనం బైనమహావిషం బమృతముంగాఁ జేయు సత్కర్మ ము
జ్జ్వలనిస్తానిధి వై భజింపుము వయస్యా వాంఛితార్థాప్తికిన్. 94

తా. ఓయీ! నిపుణుఁడా! నీవు గోరినకోరికఁ బడయఁదలంచితివేని నేది సుజనులను దుర్జనులనుగాను, మూర్ఖులను బండితులనుగాను, బగతురను హితులనుగాను, ఇంద్రియములకు గోచరింపనిదానిని గోచరించుదానినిగాను, హాలాహలమును నమృతముగాను తోడనే చేయఁజాలినదో యట్టి భగవతిని సత్క్రియను (మంచికర్మమును) నారాధింపుము. అట్లు గాక యనేకములైన రజస్తమోగుణాదులను బట్టితివేని నవి క్లేశకరములైన ఫలములనే యొసంగునుగాన వానికొఱకై మిక్కిలి యక్కఱతో వ్యర్థముగాఁ బాటుపడకుము.

అవ. వృద్ధియు హానియు దీనివలననే కలుగు ననుచున్నాఁడు.

శ్లో॥ శుభ్రం సద్మ సవిభ్రమా యువతయః శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీ రిత్యనుభూయతే చిర మనుస్యూతే శుభే కర్మణి ।

విచ్ఛిన్నే నితరా మనఙ్గకలహక్రీడాత్రుటత్తన్తుకం
ముక్తాజాల మివ ప్రయాతి ఝడితి భ్రశ్య ద్దిశోదృశ్యతామ్॥ 95

టీ. శుభేకర్మణి=మంచికర్మము- మంగళ మైన పురాకృతవిశేష మనుట, చిరం=చిరకాలమునుండి, అనుస్యూతేసతి=కూడ గ్రుచ్చఁబడినదై యుండఁగా-అనుసరించి వచ్చుచుండఁగా ననుట, శుభ్రంసద్మ=నిర్మల మైనయిల్లును- తెలిగచ్చు మున్నసువానిచే నిగనిగలాడు మేడలు మొదలైనవి యనుట, సవిభ్రమాః=విలాసముతోఁగూడిన, యువతయః=జవరాండ్రును, శ్వేతా...జ్జ్వలా- శ్వేత ఆతపత్ర=తెల్లనిగొడుగుచేత, ఉజ్జ్వలా=ప్రకాశించుచున్నట్టి- తెల్లనియొక గొడుగు చక్రవర్తులే ధరింతురుగాన ఏకచ్ఛత్రాధిపత్యముచే శోభిల్లునట్టి యనుట, లక్ష్మీః=లక్ష్మియు-రాజ్యలక్ష్మియుననుట,ఇతి=అని-అనువట్టి యీచెప్పఁబడినవి యెల్ల,అనుభూయతే=అనుభవింపఁబడుచున్నది-జన్మాంతరకృతఫలము ఎడతెగక వచ్చుచుండఁగా నివియెల్ల ననుభవింపఁబడు ననుట. విచ్ఛిన్నే=(అశుభకర్మము) తెగిపోఁగా-నశింపఁగా ననుట, నితరాం=మిక్కిలియు, అనఙ్గ...తన్తుకమ్-అనఙ్గకలహ=మన్మథయుద్ధము-మరుపోరు-మిక్కుటమైనరతి, (యనెడు) క్రీడా=కేళిచేత-ఘట్టిదముగా మరుకేళి సలుపుటచేత ననుట, త్రుటత్=తెగు, తన్తుకం=దారముగల, 'అనఙ్గక్రీడా' అనుటయే చాలియుండఁగా 'కలహ' శబ్దమునుగూడ ప్రయోగించుట దారము తెగునంతటి యాత్కట్యమును సూచించుటకొఱకని తెలియునది, ముక్తాజాలమివ=ముత్తెపుసరివలె, సద్మము మొదలైనవి. ఝడితి=తోడనే, దిశః=దిశలనుగూర్చి, భ్రశ్యత్=జాఱిపోయినదై-దారము తెగుటచే జాఱిపడి నలుగడలఁ జెదరిపోయినదై, అదృశ్యతాం = కానరాకుండుటను, ప్రయాతి=పొందుచున్నది-కానఁబడకపోవు ననుట. లేక 'దిశోదృశ్యతాం=దిక్కులయందుఁ గనఁబడుటను-అనఁగా చూపునకుఁ దెలియక మూలలలో మాటుగాఁ బడియుండుటను, ప్రయాతి=పొందుచున్నది.' యని కాని, లేక; 'దిశః ప్రయాతి దృశ్యతామ్ = దిక్కులనుగూర్చి పోవుచున్నది చూడుఁడు' అని కాని యర్థాంతరము లూహ్యములు. చూడుఁడు అనుచో వృద్ధిహానులకు నిదియే కారణ మగుట చూడుఁ డని భావము. ఇందు ముత్తెపుసరి నుపమానముగాఁ దెచ్చుటచే దానికిని బొసఁగునట్లు ఉపమేయమునకు-'అనుస్యూతః-విచ్ఛిన్నః' అను విశేషణము లుంపఁబడినవని సారస్యము గ్రహించునది. అలం. ఉపమ.

చ. లలితనికేతనప్రియవిలాసవతీధవళాతపత్రస
ద్విలసితవైభవం బనుభవింపఁబడున్ సుకృతానువృత్తిచేఁ
జెలు వగుపుణ్యకర్మము నశించిన నంగజసంగరత్రుట
త్కలితగుణోరుమౌక్తికనికాయములట్లు దొలంగు సంపదల్. 95

తా. పురాకృతమైన శుభకర్మవిశేషము ఎడతెగక యనువర్తించుచుండఁగాఁ దెలిగచ్చుచే మెచ్చులుగులుకు మిద్దెలు మేడలును, నొయ్యారంబు గులుకులేజవరాం డ్రును, ఏకచ్ఛత్రాధిపత్యముచే శోభిల్లునట్టి రాజ్యలక్ష్మియు మొదలైనవి యనుభ వింపఁబడును. ఆకర్మవిశేషము తీఱి పోయెనేనిఁ దోడనే యామిద్దెలు మొదలైనవి వికృతమైన మరుకేళియందు దారము తెగి నలుగడల చెదరి కానరాకపోవు ముత్తెపు సరివలెనే మటుమాయ మగును.

అవ. ఇఁక నీకర్మముల నాచరింపఁ దగుప్రకారమును జెప్పు చున్నాఁడు.

శ్లో॥ గుణవ దగుణవ ద్వా కుర్వతా కార్య మాదా
పరిణతి రవధార్యా యత్నతః పణ్డితేన।
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః॥ 96

టీ. గుణవత్=గుణము కలిగినట్టికాని, అగుణవత్ వా=గుణము లేనట్టికాని, కార్యం=కార్యమును, కుర్వతా=అనుష్ఠించునట్టి, పణ్డితేన=పండితునిచేత-ఎఱుకగల వానిచేత ననుట, పరిణతిః=పరిపాకము-ఆకార్యముయొక్క పర్యవసాన మనుట, ఆదౌ=మొదట, యత్నతః=అతిప్రయత్నముచేత-హెచ్చరికతో ననుట, అవధార్యా= ఆలోచింపఁదగినది- ఒకకార్యమును మొదటనే దానిపర్యవసానమును ఆలోచించు కొని పిదప మిక్కిలి యత్నముతో నారంభింపవలయు ననుట. అట్లుగాక, అతిరభస కృతానాం=మిక్కిలిత్వరతోఁ జేయఁబడినట్టి, కర్మణాం=కర్మములకు-అవి గుణవం తములైననుగాని యని శేష మూహ్యము, ఆవిపత్తేః=మరణపర్యంతము-లేక, 'ఆవిప త్తేః=నిష్పత్తిపర్యంతము-అవి యొనగూడువఱకనుట' అనియు నర్థాంతరము సరసము కాదు, శల్యతుల్యః=శల్యముతో సమానమై, హృదయదాహీ=మనస్సునకు సంతా పము కలిగించునట్టి, విపాకః=పరిపాకదశ-అతిత్వరగాఁ జేసినయెడల కార్యములకు మనస్సునకు బాధకర మైనట్టి పరిణామము, భవతి=కలుగును. కాన మొదట పర్యవ సాన మిట్టి దగునని యాలోచించియే యొకకార్యము నారంభింపవలయు ననియు నట్లు చేసిననే యది మనస్సునకు సమాధానకరముగా నుండు ననియు భావము. అలం. ఉపమ.

తే. సగుణనిర్గుణకార్యముల్ సలుపుసుమతి
చేతఁ బరిణతి గడుఁ బరీక్షింపఁ దగును
బరుషకర్మవిపాకంబు ఫలముదనుక
హృదయము దహించు శల్యంబురీతి జగతి. 96

తా. ఎఱుకగలవాఁడు మంచిదో చెడుదో యొకకార్యమును జేయఁబూనినపుడు మొదట దాని కెట్టిపర్యవసానము గలుగునో యని మిక్కిలి ప్రయత్నములో నాలోచించుకొనవలయును. అట్లుగాక యేకార్యమునుగాని ముందువెనుకచూడక యతి త్వరతోఁ జేసినయెడల నది మరణపర్యంతము శల్యమువలె మనస్సు దహించు నట్లుగాఁ బరిణమించును.

అవ. కాఁబట్టి సత్కర్మము ననుష్ఠింపనివానికి బుద్ధి లేదను చున్నాఁడు.

శ్లో॥ స్థాల్యాం వైదూర్యమయ్యాం పచతి తిలఖలీ మిన్ధనైశ్చన్దనాద్యైః
సౌవర్ణైర్లాఙ్గలాగ్రై ర్విలిఖతి వసుధా మర్కమూలస్య హేతోః।
ఛిత్త్వాకర్పూరఖణ్డా న్వృతి మిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమింనభజతి మనుజో య స్తపో మన్దభాగ్యః॥

టీ. ఇమాం కర్మభూమిం=కర్మమాచరించుటకుఁ దగినయీభూమిని, ప్రాప్య =పొంది, యః=ఏ, మన్దభాగ్యః=నిర్భాగ్యుఁడైన, మనుజః=మనుష్యుఁడు, తపః= చాంద్రాయణాదికర్మరూపమైన తపమును, నభజతి=సేవింపఁడో- ఆచరింపఁడో య నుట, సః = అట్టివాఁడు, వైదూర్యమయ్యాం = వైడూర్యమణులతోఁ జేయఁబడిన, స్థాల్యాం=వంటకుండలో, చన్దనాద్యైః=చందనము మొదలైన, ఇన్ధనైః=వంటకట్టె యలతో, 'చాన్దనై రిన్ధనౌఘైః' అనుపాఠమున చందనసంబంధి యైనకట్టెలసమూహ ములచే నని యర్థము, తిలఖలీం= తెలికపిండిని, పచతి=వండు చున్నాఁడు-వండునట్టి వానితో సమానుఁడనుట, సౌవర్ణైః=బంగారుమయములైన,లాఙ్గలాగ్రైః=నాఁగేళ్ల మొనలతో, అర్కమూలస్యహేతోః=జిల్లేడు వేరుయొక్క కారణమునుబట్టి - జిల్లేడు వేరుకొఱకనుట, 'అర్కతూలస్య' అనుపాఠమున జిల్లేడుదూదికొఱకని యర్థము; ఈపాఠము సరసముకాదు. వసుధాం=భూమిని, విలిఖతి = దున్నుచున్నాఁడు-బంగ రునాఁగేళ్లతో జిల్లేడువేరుకొఱకు నేలదున్నువానితో సమానుఁడగుననుట. కర్పూర ఖణ్డాన్=కర్పూరవృక్షములసమూహమును, లేక,కప్పురపుటరఁటిబోదెలను, ఛిత్వా= ఛేదించి, కోద్రవాణాం=ఆళ్లకు, ఇహ=ఇచట, సమన్తాత్=చుట్టును, వృతిం=వెలు గును, కురుతే=చేయుచున్నాఁడు-చేయునట్టివానితో సమానుఁడగు ననుట. ఈకర్మ భూమియందు తపం బనుష్ఠింపకుండుట వైదూర్యపుఁగుండలలో తెలికపిండి వండుట మున్నగువానితో సాటియని భావము. కాఁబట్టి శ్రేయస్సుగోరువాఁడు సర్వవిధముల సత్కర్మము ననుష్ఠింపవలయు నని తాత్పర్యము. ఇచట అలం. మాలానిదర్శనము

మ. చెలువారారత్నఘటంబునం దతఁడు సుశ్రీఖండఖండంబులం
దిలపిణ్యాకము వండె నాగరుల కర్థిం సప్తపర్ణావృతుల్
నిలిపెం జిల్లెడుదూదికై పుడమి దున్నెం బైఁడినాఁగేళ్ల ని
మ్ములఁ గర్మక్షితిఁ బుట్టి యెవ్వఁడు దపంబుల్ సేయఁ డప్రాజ్ఞతన్.

తా. కర్మ మాచరించుటకు యోగ్యమైనయీభూమిని బ్రాపించియు నేభాగ్యహీనుఁడు చాంద్రాయణాదిరూపమైన తపంబు నాచరింపఁడో, యట్టివాఁడు వైడూర్యమణిమయమైన వంటకుండయందుఁ దెలికపిండిని వండువానితోను, పనికిమాలిన జిల్లేడువేరుకొఱకు బంగరునాఁగేళ్లతో నేలను దున్నించువానితోను, గప్పురపుటరఁటుల నఱికి వానితో నాళ్లకు వెలుగు వేయువానితోను సమానుఁ డగును.

అన. పుణ్యవిశేషమే ఫలముగాని మఱియొకటి ఫలము గానేరదనుచున్నాఁడు.

శ్లో॥ నైవాకృతిః ఫలతి నైవ కులం న శీలం
విద్యాపి నైవ నచ యత్నకృతాపి సేవా।
భాగ్యాని పూర్వతపసా ఖలు సఞ్చితాని
కాలే ఫలన్తి పురుషస్య యథైవ వృక్షాః॥ 98

టీ. ఆకృతిః=ఆకారసంపత్తి-శరీరముయొక్క చక్కఁదనము, నైవఫలతి=ఫలింపనేఫలింపదు-ఫలమునకు హేతువుకానేకాదనుట, కులం = మంచివంశమును, నైవ (ఫలతి)=ఫలింపనేఫలింపదు, శీలం న=మంచిస్వభావమును ఫలింపదు. విద్యాపి=వేదవేదాంగాత్మకమైన విద్యయు, నైవ (ఫలతి)=ఫలింపనేఫలింపదు, యత్నకృతా=ప్రయత్నముతోఁ జేయఁబడినట్టి-మిక్కిలి పాటుపడిచేసినట్టి యనుట, సేవా అపిచ = (రాజాదులకుఁ జేయు) పరిచర్యయును, న=ఫలింపనేఫలింపదు. అయితే, పూర్వతపసా=పురాకృతమైన తపస్సుచేత-అనఁగా సుకృతముచేత. సఞ్చితాని=కూర్పఁబడిన-సంపాదింపఁబడిన యనుట, పురుషస్య=పురుషసంబంధియైన, భాగ్యాని=భాగ్యములు, యథా వృక్షాః=వృక్షములవలెనే, కాలేఏవ=పరిపాకసమయమునందే, ఫలన్తి ఖలు=ఫలించుచున్నవిగదా - తపస్సుచేఁ గలుగుభాగ్యవిశేషముతప్ప తక్కిన దేదియు ఫలమొసంగునదొక్కటియు లేదనిభావము. అలం. దీపకము, ఉపమయు.

తే. రమ్యరూపంబు విద్యయు రాజసేవ
గులము శీలంబుఁ జాలవు ఫల మొసంగఁ

బూర్వపుణ్యసంచితభాగ్యకములు ఫలించుఁ
గాలమునఁ బనసాదివృక్షములకరణి. 98

తా. పురుషునకు మేనిచక్కఁదనముగాని, మంచికులముగాని, మేలైన స్వభావముగాని, వేదాదిరూపమైన విద్యగాని, పాటుపడి రాజాదులకుఁ జేసినపరిచర్యగాని ఫలము నొసంగునవికావు. పూర్వకృతమైన తపస్సుచేఁ గలిగినట్టిభాగ్యమే వృక్షములవలె పరిపాకకాలమున ఫలము నొసంగును.

అవ. 'కానిది కానేరదు' అనుట సర్వవిధముల కర్మవశముననే యగు ననుచున్నాఁడు.

శ్లో॥ మజ్జత్వమ్భసి యాతు మేరుశిఖరం శత్రూన్ జయ త్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలావిద్యాః కలాః శిక్షతామ్।
ఆకాశం విపులం ప్రయాతు ఖగవ త్కృత్వా ప్రయత్నం పరం
నాభావ్యం భవ తీహ భాగ్యవశతో భావ్యస్య నాశః కుతః॥ 99

టీ. (పురుషుఁడు అనుకర్త అధ్యాహార్యము), అమ్భసి=నీటియందు, మజ్జతు=(జలస్తంభాదులచే) మునుఁగునుగాక, మేరుశిఖరం=మేరుపర్వతపుకొనను గూర్చి, యాతు=(యోగానుసంధానాదులచే) పోవుఁగాక, ఆహవే=యుద్ధమునందు, శత్రూన్=పగతురను, జయతు = జయించునుగాక, వాణిజ్యం=(క్రయవిక్రయాదిరూప) వర్తకము, కృషిసేవనాది = దున్నిబ్రదుకుట కొలువుగొలుచుట మొదలైనవియు, లేక, 'కృషిసేవనేచ' అనుపాఠమున- దున్ని బ్రదుకుటయు కొలువు గొలుచుటయు నని యర్థము, సకలాః = సమస్తములైన, *విద్యాః = పదునాలుగువిద్యలను, కలాః = ఇతిహాసాగమాదులైన యఱువదినాలుగుకళలను, శిక్షతాం = అభ్యసించునుగాక, పరం=ఉత్కృష్టమైన, ప్రయత్నం = (పాదుకాసిద్ధి మొదలైనట్టి) ప్రయత్నమును, కృత్వా = చేసి, ఖగవత్=పిట్టవలె, విపులం = విరివియైన, ఆకాశం = ఆకాశమునందు, ప్రయాతు=పోవునుగాక, (ఏమి చేసినను), భాగ్యవశతః=భాగ్యవశమున- 'కర్మవశతః' అనుపాఠమున ధర్మాధర్మాత్మకమైన కర్మవశమున అనియర్థము, ఇహ=ఈలోకమునందు, అభావ్యం=కలుగనిది-భాగ్యము కలిగింపఁబూనని యేవస్తువుగాని ఫలముగాని యనుట, నభవతి=కలుగదు. భావ్యస్య =భాగ్య మవశ్యమును గలిగింపఁ జూచుటచేఁ) గలుగ నున్నదానికి - కానున్నదాని కనుట, నాశః=నాశము, కుతః= ఎక్కడిది? కానున్నది బ్రహ్మయడ్డగించినను కాకమానదనుట, 'నాభావ్యం భవతీహ'

* 'అఙ్గాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః। పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతా శ్చతుర్దశ' అని విద్యలు పదునాలుగు.

అనుటకు 'భావ్యస్యనాశః కుతః' అనుట హేతువు. 'కానిది కానేకాదు' అది కాను
న్నదైనయెడల కాక యెందుకు నశించును, అనియాశయము. ఇట్లుగాక మొదటివాక్య
ముచే 'కానిదికాదు' అనియు, రెండవదానిచే 'కానున్నదికాకపోదు, అనియు వేఱువే
ఱ రెండర్థములు ముఖ్యముగాఁ బ్రతిపాదింపఁబడినవని గ్రహించుట యసమంజసము.
మొదటియర్థమే ముఖ్యప్రతిపాద్యమై దానికి రెండవది అంగమాత్ర మగు నని తెలి
యఁదగును. 'యద్భావి తద్భవత్యేవ యదభావినతద్భవేత్' అనున్యాయ మిచట నను
సంధేయము. ఇందు అంభోమజ్జనాదులు చతుష్షష్టికళలలో నంతర్భూతములు.

చ. సలిలముఁ జొచ్చినం గనకశైలముఁ జేరిన వైరివీరులం
గెలిచిన రాజసేవఁ దిలకించిన వేదము లభ్యసించినం
గళలతెఱం గెఱింగిన ఖగత్వము దాల్చినఁ గర్మనిఘ్నతా
కలన నభావ్యమైనపని గాదు వినాశము లేదు భావికిన్. 99

తా. ఒకఁడు నీళ్లయందు మునిఁగినను, మేరువుకొనకుఁ బ్రాఁకినను, గయ్యాంబు
నఁ బగతుర గెలిచినను, వర్తకము సేసినను, దున్నుకొని బ్రతికినను, గొలువుచేసిన
ను, మఱి సకలవిద్యలను సమస్తకళలను గఱచినను, మిక్కిలియుఁ బాటుపడి పిట్ట
వలె నాకసమునఁ బాఱినను, మఱి యింకేమిచేసిననుగాని, భాగ్యమేమి వానికిఁగలి
గింపఁబూనదో యది కలుగనేకలుగదు. అది కలుగనున్నయెడలఁ గలుగక నశించు
టెట్లు? [అది కలుగనున్నది కాదు గాఁబట్టియే నీళ్లలో మునుఁగుట మొదలైన పా
ట్లు పడినను గలుగఁజాల దని యాశయము.]

అవ. ఒకఁడు పూర్వకృతపుణ్యము గలవాఁ డెట్టిసంకటమునం
దుండినను జెఱుపు నొందఁ డనుచున్నాఁడు.

శ్లో॥ వనే రణే శత్రుజలాగ్నిమధ్యే, మహార్ణవే పర్వతమస్తకేవా।
సుప్తం ప్రమత్తం విషమస్థితంవా, రక్షన్తి పుణ్యాని పురాకృతాని॥

టీ. వనే=అడవియందుఁగాని, రణే=యుద్ధమందుఁగాని, శత్రు జల అగ్నిమ
ధ్యే=పగతురు నీళ్లు నిప్పు అనెడివీనినడుమఁగాని, మహత్ అర్ణవే=పెనుసముద్రము
నఁగాని, పర్వతమస్తకేవా=కొండపైని గాని, సుప్తం=నిదురించిన వానినేని-నిద్ర
పోయియున్ననుగాని యనుట, ప్రమత్తం=పరాకుపడియున్నవానినేని-పరాకునొంది
యున్నను గాని యనుట, విషమస్థితంవా=ఒడుదొడుకైనచో నున్నవానినేని- ఒడు
దొడుకుచోటనున్ననుగాని యనుట, పురాకృతాని=పూర్వకృతములైన, పుణ్యాని=
సుకృతములు, రక్షన్తి=రక్షించుచున్నవి.

క. కాననమున రణమున సలి,లానలరిపుమధ్యమున మహాబ్ధి నగాగ్ర
స్థానమునమత్తునిద్రితుఁ,బూనికతోఁబూర్వపుణ్యములురక్షించున్.

తా. ఒకఁడు పూర్వమునందు పుణ్యము లాచరించి యున్నవాఁ డేని, అట్టి వాఁడు అడవియం దున్నను, యుద్ధము సేయుచున్నను, శత్రువులు నీళ్లు నిప్పు మొద లయినవానినడుమఁ జిక్కుకొని యున్నను, మహాసముద్రమునందుఁగాని పెనుఁగొండ పైభాగమునఁగాని యున్నను, నిదురనొందియున్నను, పరాకుపడియున్నను, ఒడు దొడుకైనచో నున్నను, వానిని నా పుణ్యములు చెఱుపు కలుగనీయక కాచును.

అవ. వేయేల, పుణ్యాత్మునికన్నియు ననుకూలముగానే యుండు నని చెప్పి నిగమించుచున్నాఁడు.

శ్లో॥ భీమం వనం భవతి తస్య పురం ప్రధానం
సర్వో జనః సుజనతా ముపయాతి తస్య।
కృత్స్నాచ భూ ర్భవతి సన్నిధిరత్నపూర్ణా
యస్యాస్తి పూర్వసుకృతం విపులం నరస్య॥ 101

టీ. యస్యనరస్య=ఏమనుష్యునకు, విపులం=విస్తారమైన, పూర్వసుకృతం=పు రాకృత సత్కర్మములచేఁ గలిగినట్టి పుణ్యము, అస్తి=ఉన్నదో, తస్య=అట్టి వానికి, భీమం=(ఘాతుకము లైన సింహములచే) భయంకరమైన, వనం=అరణ్యము, ప్రధానం పురం= ముఖ్యపట్టణము, భవతి=అగుచున్నది-ఒకప్రధానపట్టణమువలె సకలభోగ సాధన మగు ననుట, తస్య=వానికి, సర్వోజనః=జనులందఱును, సుజనతాం=మంచి వారై యుండుటను, 'స్వజనతాం' అనుపాఠమున కింకరులై యుండుట నని యర్థము, ఉపయాతి=పొందును-పొందుదు రనుట. జనులంద ఱట్టివానికి మంచివార గుదురనుట. (తస్య=వానికి), కృత్స్నా=సమస్తమైన-నాలుగు సముద్రములనడుమ నుండునట్టి, భూశ్చ=భూమియు, సన్నిధి...పూర్ణా-సన్నిధి=శ్రేష్ఠములైననిధులతోను-పాఁతఱల తోను, రత్నః= రత్నములతోను, పూర్ణా=నిండినది, భవతి=అగుచున్నది-సమస్తఫల ములను ఈను నని భావము. కాఁబట్టి శ్రేయస్కాముఁడైనవాఁడు సత్కర్మాచరణ పరాయణుండై యుండఁదగు నని సందర్భాభిప్రాయము.

తే. భువనమునఁ బూర్వసంభృతకపుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచినకసుగుణనిధికి
వనము పుర మగుఁ జను లాత్మకజనము లగుదు
రవని నిధిరత్నపరిపూర్ణక యయి ఫలించు. 101

తా. ఎవ్వఁడు మిక్కిలియుఁ బురాకృతపుణ్యము గలవాఁడో యట్టివానికి సిం హశార్దూలాదులచే భీకరమైనయరణ్యము నొకరాజధానివలె సకలభోగసాధన మై

యుండును. అట్టివానికి జనులందఱు మంచివారై చెలిమి చూపుచుందురు. మఱియు నట్టివానికి నాలుగుపెఱుఁగులలోని నేలయంతయు వెలలేని పాఁతఱలతోను దళతళ లాడు రతనములతోను నిండియుండునదై కోరినకోరిక లీనుచుండును.

మ. యమునానీలసరోజసౌరభరసవ్యాసంగిభృంగీకులో
పమకంఠద్యుతిలిప్తశేషభుజగప్రాలంబ జాంబూనదా
ద్రిమహాకార్ముకరూఢగూఢపదమార్గవ్యాసంప్రయుక్తత్రివి
క్రమశాతాంబకపాతితాంబరచరక్రవ్యాత్పురాట్పాలకా.

మాలిని. ప్రమథగణపరీతా పాపజీమూతవాతా
కమలభువనసూతా గణ్యలీలాకిరాతా
శమితదనుజనేతా చారువక్త్రాంబుజాతా
సమరజయసమేతా సామవేదాంతగీతా.

క. సుమనోనాయకసంభృత, సుమనోర్చ్చిత పదబిసప్రసూనభవానీ
సమనోహర సురనిర్ఝర, సుమనోదామార్హజాటజూటోద్దేశా.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధవిద్వజ్జనవిధేయ లక్ష్మణకవినామధేయప్రణీతం బయినసుభాషితరత్నావళికావ్యంబు నందు నీతిశతకంబున మూర్ఖపద్ధతియు విద్వత్పద్ధతియు మానశౌర్య పద్ధతియు నర్థపద్ధతియు దుర్జనపద్ధతియు సుజనపద్ధతియుఁ బరోప కారపద్ధతియు ధైర్యపద్ధతియు దైవపద్ధతియుఁ గర్మపద్ధతియు నను ప్రకరణంబులు గలప్రథమాశ్వాసము.

ఇది నీతిశతకమునందు కర్మపద్ధతివర్ణన మన్నది దశమదశకము.

---

సుభాషితత్రిశతియందు నీతిశతకము సంపూర్ణము.

---

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# భర్తృహరిసుభాషితము - శృంగారశతకము.

---

## అ వ తా రి క.

రాజర్షిప్రవరుం డగుభర్తృహరి లోకంబునకు వైరాగ్యంబు బోధింపఁబూనినవాఁడై, శృంగారరసంబు తొలుత విషయంబులచవి చూపి పిదప వానివైరస్యంబు వెలిపుచ్చి కడపట వైరాగ్యంబును దిరముగాఁ గలుగునట్లు సేయునదిగావునను, శృంగారస్వరూపంబు తెలిసిననే తద్విరుద్ధమైనవైరాగ్యస్వరూపంబు తెలియుట సుకర మగుం గావునను, మొదట శృంగారంబును వర్ణింపఁదలంచియు, నీతిని మున్నిడుకొనియేకాని నీతిని మాసి యాశృంగారంబును సేవింపరాదు గాన నన్నిటికిని మొదట నీతిశతకమును రచించినవాఁడయ్యె. ఇఁక నీతిపూర్వకముగా సేవింపఁదగినదియు, నంతమున వైరాగ్యమును గలిగించునదియు నైనశృంగారముయొక్క స్వరూపము నిరూపింపఁబూని యది నిర్విఘ్నముగాఁ దుదముట్టుటకై యేదేని మంగళమును మునుముట్ట నాచరింపఁదగును గాన శృంగారరసమున కధిదేవతయైన మన్మథునికి నమస్కరించుట యను నమస్కారరూపమంగళమును మొట్టమొదట నాచరించుచున్నాఁడు.

శ్లో॥ శమ్భుస్స్వయమ్భుహరయో హరిణేక్షణానాం
యే నాక్రియన్త సతతం గృహకుమ్భదాసాః।
వాచామగోచరచరిత్రవిచిత్రితాయ
తస్మై నమో భగవతే కుసుమాయుధాయ॥ 1

టీ. శమ్భు స్స్వయమ్భు హరయః=శివబ్రహ్మవిష్ణువులు - సంహారసృష్టిస్థితులు సేయువా రగుటచే సకలలోకములకు నధిపతులై నవా రయ్యు ననుట-దేనినిగాని చేయుటకును జెఱుపుటకును మఱొకరీతిని మార్చుటకును శక్తిగలవారై యుండియు నని భావము, యేన=ఎవ్వనిచేత-ఏమన్మథునిచేతననుట, హరిణ ఈక్షణానాం= (లేడి కన్నులవలె సొగసైనకన్నులు గల తమ) కాంతలకు- అనఁగా పార్వతీ సరస్వతీ

లక్ష్మీదేవులకు, గృహ...దాసాః-గృహ=ఇంటియందు, కుమ్భ=నీటికడవలకు-నీటికడవలను మోసి తెచ్చునట్టి యనుట, దాసాః=సేవకులుగా, ('గృహకర్మదాసాః' అను పాఠమున నింటిపనులు సేయుపరిచారకులుగా నని యర్థము.), అక్రియన్త = చేయఁబడిరో-మిక్కిలి విధేయులు గావింపఁబడిరో యనుట-సర్వశక్తియుక్తులైన త్రిమూర్తులవంటివారినిగూడ సరస్వతి మొదలైన వారివారిపడఁతులయందు మోహమును గలిగించి యాలలనలకు మిక్కిలియు లోనై యుండునట్టివారినిగాఁ జేసినాఁ డనుట; ఇంక తక్కినవారిని జేయుట చెప్ప నేల యని భావము-బ్రహ్మ సరస్వతిని దన వాక్కుననే యుంచుకొనుటచేతను, శివుఁడు పార్వతికిఁ దనయర్ధదేహ మిచ్చుట చేతను, విష్ణువు తనఱొమ్ముననే లక్ష్మిని దాల్చియుండుటచేతను నిట్లు గృహకుంభదాసు లనఁబడిరని తెలియునది. ఇచట 'హరిణేక్షణా'శబ్దము దాసు లగుటకు హేతువును దెలిపెడిని-బెళుకుంగన్నుఁగవసొగసునకుఁ జొక్కి మిక్కిలి లోనై రని యాశయము, కావుననే, వాచా...చిత్రితాయ-వాచాం=వాక్కులకు, అగోచర=తెలియని-పలుకులకందరాని-వర్ణింపఁదరముకాని యనుట, చరిత్ర=చర్యలచేత, విచిత్రితాయ = విచిత్ర మైనవాఁడుగాఁ జేయఁబడిన-వర్ణింపరాని తనయద్భుతచర్యలచే లోకములోపాటివాఁడు గాక వారికంటె విలక్షణుఁడుగా నుండునట్లు చేయఁబడిన యనుట, కావుననే, *భగవతే=ఐశ్వర్యవంతుఁడైన- సర్వలోకనియమనశక్తిగల, తస్మై=ఆ-అనఁగా జగత్ప్రసిద్ధుఁడైనట్టి, కుసుమాయుధాయ=(పువ్వులే యాయుధముగాఁగల) మన్మథునికి, 'మకరధ్వజాయ' యనుపాఠమున మొసలిని పడగయందుఁ గలమన్మథునికి నని యర్థము, నమః=నమస్కారము.

ఉ. శంకరపద్మగర్భమురశాసనులన్ భువనేశులన్ నిరా
 తంకధృతిన్ మృగాక్షులకు దాసులఁ జేసినమేటికిం గురం
 గాంకవసంతమిత్రునకు నంజలిఁ జేసెద వాగతీతని
 శ్శంకచరిత్రచిత్రునకు షడ్గుణహారికి శంబరారికిన్. 1

తా. సృష్టిస్థితిసంహారకర్త లగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులనుగూడ †శృంగారరసంబునకు లోఁబఱచి తమతమపూఁబోండ్లకు మిక్కిలి విధేయులుగా నుండు

* భగవంతుఁ డను వాసుదేవునకు, వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులను నాలుగు వ్యూహములలో ప్రద్యుమ్నవ్యూహముగా నుండుటంబట్టికాని, విష్ణువునకుఁ బుత్రుఁడగుటంజేసికాని, భగవచ్ఛబ్దము మన్మథునకుఁ బ్రయుక్తము కావచ్చునని తెలియునది.

† ఒకరిసుఖదుఃఖాదులను జూచునపుడు వాసనారూపముగా మనమనస్సులకును నొకవికారము పుట్టును. ఇట్టిమనోవికారమే భావ మనఁబడును. ఇట్టిభావము

నట్లు సేయుచున్నాఁడుగాన వర్ణింప నలవికానియిట్టియతివిచిత్రచర్యలచే మిక్కిలి యాశ్చర్యమును గలిగించునట్టి యాభగవంతుఁడగు మన్మథునికి నమస్కారము.

---

సజాతీయభావములచేఁగాని విజాతీయభావములచేఁగాని డిందుపడక రసముగాఁ బరిణమించువఱకు చిత్తమున స్థిరముగానుండు నేని నది స్థాయి యనఁబడును. అనఁగా నొకనాయకునకు నొకనాయికయందు రతి (అనఁగా వలపు) అనెడి భావము గలిగినయెడ నది మఱియొకనాయికయందలి రతి యనెడి సజాతీయభావముచేఁ గాని హాస్యబీభత్సాదు లనెడి విజాతీయభావములచేఁగాని కొట్టువడక చిత్తమున స్థిరముగా నెలకొని తన కనుకూలముగా సంబంధించియుండు వానిచే వర్ధిల్లి రసముగాఁ బరిణమించు నేని నది స్థాయీభావ మనఁబడును. లవణసముద్రము తనయందుఁగలయు నదులతీయనిజలముల నుప్పనగాఁ జేయునట్లు స్థాయీభావము తన్నుఁ గలయునితర భావములనెల్ల తనయందు మగ్నములు గావించునంతపటువై యుండును. ఇట్టిస్థాయీభావము పైపయి వర్ధిలి మిక్కిలి యానందరూపముగాఁ బరిణమించు నేని నదియె రస మనఁబడును. రతి యనఁగా సంభోగవిషయముగాఁ గలుగు నొకయిచ్ఛావిశేషము. ఈ భావమే స్థాయిత్వమును బొంది పూర్వోక్తరీతిగాఁ బుష్టింజెందు నేని శృంగార మనెడురసముగాఁ బరిణమించును. ఈరతితోఁగూడ, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము అని స్థాయీభావములు తొమ్మిది గలవు. ఇవియె వృద్ధి నొందె వరుసగా శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము, అని నవరసము లగును. ఈ స్థాయిని బుష్టి నొందించి రసముగాఁ బరిపక్వము సేయుసామగ్రియుఁ గలదు. అది విభావములు, అనుభావములు, సాత్త్వికములు, వ్యభిచారులు అని నాలుగువిధముల నుండును. వ్యంజనాదులు అన్నము నెట్లు భోగ్యముగాఁ జేయునో యట్లె విభావాదులును స్థాయిని స్వాద్యముగాఁ జేసి రసముఁ గావించును. ఇదియె 'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః। ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః' అని చెప్పఁబడినది. స్థాయిని గలిగించుటకు మొదటిసామగ్రి యైనది విభావము. ఇది ఆలంబనము, ఉద్దీపనము అని ద్వివిధము. నాయికానాయకు లాలంబనవిభావము. ఈ యాలంబనముయొక్క (1) గుణములు (2) చేష్టలును (3) అలంకారమును (4) మఱి తక్కినతటస్థములును అని ఉద్దీపనవిభావము నాలుగువిధములు గలది. గుణములు రూపయౌవనాదులు. చేష్టలు యౌవనమువలనఁ బుట్టు హావభావాదులు. అలంకారము నూపురాంగదహారాదులు. తటస్థములు మలయానిలచంద్రశుకపికాదులు. ఈనాయికానాయకతద్గుణచేష్టాదిరూపమైన యాలంబనోద్దీపనవిభావములచే రత్యాదిభావములకు స్థాయిత్వము గలుగును. అనఁగా నాస్థాయీభావములకు నవియె కారణము లగును. రెండవసామగ్రి యైన అనుభావములు శరీరజనితము లైన కటాక్షము (కడఁగంటిచూపులు భ్రూవిక్షేపము (కను

అవ. ఆలంబనవిభావభూతు లైన స్త్రీపురుషులలో స్త్రీలే ప్రశస్తమైన యాలంబనము గాన నింకఁ బందొమ్మిదిశ్లోకములచే మొదట నా స్త్రీలను బ్రశంసింపఁ బూని మున్ముగా వారు పురుషులకు బంధన హేతువు లగుటను జెప్పుచున్నాఁడు.

---

బొమలు (త్రిప్పుట) మొదలగునవి. ఇవి హృదయ=మునందలిరత్యాదిభావములను వెలి పుచ్చును. ఇవి స్థాయివలనఁ గలుగునట్టి వైనయెడల స్థాయిని గలిగించుసామగ్రి యెట్లగు ననరాదు. ఏలన, ఒకరిచిత్తమునందుఁ గల రత్యాదులచే భ్రూవిక్షేపాదులు పుట్టున వయ్యు నాభ్రూవిక్షేపాదులు వారిచిత్తమునందలి రత్యాదిభావములను మఱొకరికిఁ దెలిపి ఆ యితరులకుఁ గూడ నారత్యాదులు కలిగించుచున్నవి. ఇట్లు మొదటివారి రత్యాదుల కవి కార్యము లయ్యును, రెండవవారి రత్యాదులకుఁ గారణము లగుటచే సామగ్రిగాఁ జెప్పఁబడె నని తెలియునది. మూఁడవసామగ్రియైన సాత్త్వికభావములు సత్త్వమువలనఁ బుట్టినవి. సత్త్వ మనఁగా ఒకరిసుఖదుఃఖాదులను భావించుటకు మనసు మిక్కిలి యనుకూలముగా నుండుట. ఇట్టిమనఃస్థితి యగుసత్త్వమువలనఁ బుట్టునవిగాన నివి సాత్త్వికము లనఁబడియె. ఇవి స్తంభము, ప్రళయము, రోమాంచము మొదలైనవి యెనిమిది గలవు. నాలుగవసామగ్రి యైన వ్యభిచారిభావములు స్థాయికి సహకారములు. ఇవి నిర్వేదము, గ్లాని, శంక మొదలైనవి ముప్పదిమూఁడు గలవు. ఇట్లు స్థాయీభావ మీచతుర్విధ సామగ్రిచే సముల్లాసితమై రస మగును. రసము వస్త్రమువంటిది. దానికి స్థాయి తంతువులవంటిది. విభావాదిసామగ్రులు నాలుగును సాలెవాఁడు మున్నగువానివంటివి. వస్త్రమునకు తంతువు లెట్లు సన్నిహితములో - అనఁగా వస్త్రమునకు మిక్కిలి సమీప మైన పూర్వావస్థ తంతువు లెట్లగునో, యట్లే రసమునకు మిక్కిలిదాపైన పూర్వావస్థ స్థాయియే యగును. అనఁగా తంతువులే వస్త్రమగునట్లు స్థాయియే రసమగును. సాలెవాండ్రు మున్నగునవి తమంతఁగాక తంతువుల మూలముననే వస్త్రము కలిగించునట్లు, విభావాదులు తమంతటఁగాక స్థాయిమూలముననే రసమును గలిగించును కాన భావములలో స్థాయి రసమునకు సన్నిహితమైనదనియు విభావాదులు వ్యవహితము లైన వనియు గ్రాహ్యము.

శృంగారరసమున సాత్త్వికవ్యభిచారిభావము లన్నియు వర్తించును. తక్కిన రసములందు అవి యన్నియుం గాక కొన్నికొన్నియే వర్తించును.

ఇచటఁ బ్రకృతరసము శృంగారము. దీనికి స్థాయి రతి. తక్కినరసములకుం బోలె దీనికిని నాయికానాయకులు ఆలంబనమును తద్గుణచేష్టాదులు ఉద్దీపనమును అగును గదా. శృంగారరసమునకుఁ గల యుద్దీపనముయొక్క చేష్టలు భావము, హావము, హేల, మాధుర్యము, ధైర్యము, లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, కుతూహలము, చకితము, విహృతము, హాసము అని పదునెనిమిది గలవు.

శ్లో॥ స్మితేన భావేన చ లజ్జయా భియా
పరాఙ్ముఖై రర్ధకటాక్షవీక్షణైః।
వచోభి రీర్ష్యాకలహేన లీలయా
సమస్తభావైః ఖలు బన్ధనం స్త్రియః॥ 2

టీ. స్మితేన=(యౌవనము మొదలైన మదవికారములవలనఁ దనంతనె కలుగు చిఱునవ్వుచేతను, భావేన=(బాల్యము వీడి యౌవనము వచ్చుటకు నడుమ మనస్సునకు శృంగారవిషయముగా మొట్టమొదటఁ గలుగువికారముభావము. అట్టి)మనోవికారముచేతను, లజ్జయా=(చన్నుఁగవయు చంకలును మూసికొనుట, మోము వంచుట, కన్నులరమోడ్చుట మొదలైనవి కలిగించునట్టి) మనస్సు కొంకుపాటుచేతను, భియా=(తటాలున భయపడుటచేఁ బుట్టునట్టి) బెదరుచేతను-అట్టి భయముచే మనస్సునకుఁ గలుగు కలఁకపాటుచేత ననుట, 'గుణైః' అనుపాఠమున ఆలంబనభూతము లైన యా స్త్రీలరూపయౌవనాదిగుణములచేత నని యర్థము. పరాఙ్ముఖైః=లజ్జచేత మాఱు గలిపడిన-అనఁగా తాము చూచుపురుషునిదెస సిగ్గుచేత సగముమాత్రము స్పష్టము గాకుండునట్లు నిగుడ్చుచును తక్కిన సగము మఱొకదెస స్పష్టముగా సగము నిగుడ్చుచును ఉన్నట్టి యనుట, *అర్ధకటాక్షవీక్షణైః=సగమైన (అనఁగా సమగ్రముగా నిగుడింపక కొంచెముగా నిగుడించు) కడఁగంటిచూపులచేతను, వచోభిః = చిలుకలకోయిలలపలుకులవలె ఇంపు గులుకు తీయనిపలుకులచేతను, ఈర్ష్యాకలహేన-ఈర్ష్య = ఒకరిమేలిమికి నోర్వకుండుట (అనఁగా చూపోపమి) చేతనైన

---

ఇందు మొదటఁ జెప్పఁబడినభావము సామాన్యవాచి యగుభావశబ్దము గాదు. ఇది శృంగారచేష్టావిశేష మైనది. వికారము కలిగించుకారణ ముండఁగా చిత్తమునకుఁ గలుగు వికృతియె సత్త్వము అనఁబడును. ఇది చిత్తవికారములకు బీజము వంటిది. ఇదియె పరులసుఖదుఃఖాదులను భావించుటకు యోగ్య మైన చిత్తస్థితి యనఁబడియె. బీజముయొక్క మొట్టమొదటివికారమువలె నిట్టిసత్త్వముయొక్క కొంచె మెక్కువయైన వికారము భావ మనఁబడును. ఇది శృంగారముయొక్క ప్రథమచేష్ట. బాల్యము వీడి యౌవనము రానున్నపుడు శృంగారవిషయముగా మనస్సునకు మొట్టమొదటఁ గలుగు వికారమే యిది యగును. ఇది స్పష్టముగాఁ గానిపింపదు. దీనికంటెఁ గొంచె మెక్కువ స్పష్టముగాఁ దోఁచుశృంగారచేష్టయె హావము. దానికంటె నెక్కువస్పష్టమై (అనఁగా సువ్యక్తముగాఁ) గలుగునది హేల. ఇట్లె తక్కినశృంగారచేష్టలును నాయాసందర్భములయందు మీఁద వివరింపఁబడును.

* 'యద్గతాగతవిశ్రాన్తి వైచిత్ర్యేణ వివర్తనమ్। తారకాయాః కలాభిజ్ఞాస్తత్కటాక్షం ప్రచక్షతే' అన్నట్లు కనుగ్రుడ్డు పోవుచును వచ్చుచును నిలుచుచును నిట్లు పలువగల సొగసుగా చుట్టి తిరుగుటయే కటాక్ష మనఁబడును.

కలహముచేతను - ప్రణయకలహముచేత ననుట, †లీలయా = వాక్కు మొదలైన వానిచే ప్రియుని ననుకరించునట్టి విలాసవిశేషముచేతను - ప్రియుఁ డెట్లు నడచు కొనునో యట్లే తానును వాగాదులచే ననుకరించి నడచుట యను విలాసముచేత ననుట, వేయేల, సమస్తభావైః = స్తంభము రోమాంచము మొదలైన సాత్త్వికభావములు హర్షము ఔత్సుక్యము మొదలైన వ్యభిచారిభావములు అన్నిటి చేతను, స్త్రియః = స్త్రీలు, బన్ధనం ఖలు = పురుషులకు బంధనము అగుదురు కదా- పురుషులకు సంసారబంధము కలిగించువా రగుదు రనుట. ఇందు స్మితము కటాక్షములు ఆలాపము లనుమూఁడును అనుభావములు; లజ్జ భయము ఈర్ష్య అను మూఁడును వ్యభిచారిభావములు; భావము లీల అనురెండును శృంగారముయొక్క చేష్టావిశేషములు అని తెలియునది. ఇట్టి హావభావాదిసాధనసంపత్తి స్త్రీల కుండఁగా వారు పురుషులకు బంధనహేతువు లగుదు రని చెప్ప నేల యని భావము. మఱియు నిందుఁ జెప్పఁబడినశృంగారనాయికలలో భావలజ్జాభయములు గలవారు మధ్యమ లనియు ఈర్ష్యాకలహలీలలు గలవారు ప్రౌఢ లనియు వివేకించుకొనవలయును.

చ. చెలువపుఁ దేటలేనగవుచేతను భావముచేత సిగ్గుచే
నలు వగులీలచేత సుగుణంబులచేఁ గడఁగంటిచూపుచేఁ
గలహముచేత విందు లగుకందువమాటలచే నసూయచేఁ
బెలుచన నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్. 2

తా. మవ్వంపుఁజిఱునవ్వు మొలకచేతను, మనంబునఁ దొలితొలి తోఁచు మోహంపువికారముయొక్క మరువుచేతను, ననుసిగ్గుచేతను, నారజంపుబెదరుపాటు చేతను, నొఱపు మీఱ నోరగా మలంచి చూచుకడఁగంటిపిసాళియరమోడ్పుచూడ్కులచేతను, చిలుకలకోయిలలపలుకులవలె ముద్దులుగులుకు పలుకులచేతను, నెయ్యంపు జగడముచేతను, నవకంపులీలచేతను, ఇది యది యన నేల, సమస్తభావముల చేతను, స్త్రీలు పురుషులను వశపఱుచుకొని సంసారబంధమునకుఁ గట్టుపఱుతురు.

అవ. చెప్పినయర్థమునే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భ్రూచాతుర్యాత్కుఞ్చితాక్షాః కటాక్షాః
స్నిగ్ధా వాచో లజ్జితాన్తాశ్చ హాసాః।
లీలామన్దం ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణా మేత ద్భూషణం చాయుధం చ॥ 3

† 'లీల' యనఁగా. శృంగారముయొక్క యష్టాదశచేష్టలలో నొకటి. 'లీలా ప్రియానుకరణం వాగ్భి ర్గత్యార్థచేష్టయా-మాటలచేతను, నడకచేతను, చేష్టచేతను ప్రియుని ననుకరించుట లీల' అని లక్షణము.

టీ. భ్రూచాతుర్యాత్ - భ్రూ=కనుబొమ్మలయొక్క, చాతుర్యాత్ = నేర్పువలన-కనుబొమల నీటుగా త్రిప్పుటయందలి నేర్పువలన ననుట. కుఞ్చితాక్షాః-కుఞ్చిత=కొంచెము వంకరగాఁ జేయఁబడినట్టి, అక్షాః=కన్నులు గల, కటాక్షాః=కడగంటి చూపులును-బొమల నొయ్యారముగా నటు త్రిప్పఁగా నొకింత వంకరలైన కన్నుంగవకొలుకులచేఁ జూచు వాలుఁజూడ్కు లనుట-ఇందు *రేచితము భ్రుకుటి యనుభ్రూలతావ్యాపారములు రెండును జెప్పఁబడియె, స్నిగ్ధాః=నెయ్యముతోఁ గూడిన, వాచః=పలుకులును-నెయ్యంపుఁదియ్యనిపలుకు లనుట,లజ్జిత అన్తాః=లజ్జ కడపలగాఁగల-సిగ్గునందు ముగియునట్టి యనుట, హాసాశ్చ=చిఱునవ్వులును-నునుసిగ్గుగాఁ బరిణమించు చిఱునవ్వే మోహకరముగాని నవ్వియు సిగ్గుమాలియుండుట మదనోద్దీపకము గాదు; అది హాస్యజనకమే యగును; గాన నవ్వునకు సిగ్గునందుఁ బర్యవసానము చెప్పఁబడినది. † లీలామన్దం-లీలా=విలాసముచేత - మురువుచే ననుట, మన్దం=మెల్లనైన, ప్రస్థితం=నడకయు, స్థితంచ = నిలుచుటయు - అల్లనల్లన నొయ్యారముగా నడచుటయు నిలుచుటయు ననుట, ఏతత్ =ఇది(యంతయు), స్త్రీణాం= స్త్రీలకు, భూషణం=(మిక్కిలి నీటును గలుగఁజేయునదిగాన) అలంకారము; ఆయుధం చ=(వయసుకాండ్ర గెలుచుటకు సాధనము లగుటచే) కైదువును; అగుననుట. ఇందు భ్రుకుటి మొదలైనవానిని భూషణములుగాను ఆయుధములుగాను రూపించుటచే రూపకాలంకారము. ఇందు కటాక్షాదులు స్థాయికిఁ బోషకములై దానిని రసముగాఁ బరిణమింపఁజేయునట్టి యనుభావము లని పూర్వమే చెప్పఁబడినవి. ఇందుఁ జెప్పఁబడినలీల శృంగారచేష్ట యగును. భ్రుకుటి మున్నగుతక్కినవి అనుభావము లని తెలియనగును.

తే. భ్రూలతాక్షేపకుంచితస్ఫురణఁ దాల్పు
కలికిచూపులు నెయ్యంపుఁబలుకుతీపు
సిగ్గునగవులు చెన్నగుచిన్నినడలు
సొమ్ము లాయుధములు ముద్దుగుమ్మలకును. 3

తా. బొమలు నీటుగాఁ ద్రిప్పి వంకరలైన యోరగన్నులతోఁ జూచుచూడ్కులును, నెయ్యంబుఁ గులుకు తియ్యనిపలుకులును, నునుసిగ్గున గిలిగొను చిన్నారి

---

* 'స్యాద్భ్రువోర్లలితాక్షేప ఏకస్యా ఏకరేచితమ్। ద్వయో ర్మూలసమక్షేప కౌటిల్యాద్భ్రుకుటిం విదుః' ఒకబొమ లలితముగాఁ ద్రిప్పుట రేచితము. రెంటినిఁద్రిప్పి మూలల ముడివఱిచి వంకరగావించుట భ్రుకుటి.

†ఇందు గమనమును లీలామందమైనదిగాఁ జెప్పఁబడినది. ఇట్టిమందయానము పద్మినీజాతిస్త్రీలకే నియతము కాన వారికిఁ గల లజ్జాతిశయమును నిందు సూచితమగుచున్నది. పద్మినీజాతి 'వ్రజతి మృదుసలీలం రాజహంసీవ తన్వీ త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా।మృదుశుచి లఘు భుఙ్క్తే మానినీ గాఢలజ్జా ధవళకుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్'.

లేనగవులును, హాయలు(?)మీఱ నల్లల్ల నడచు నడకయు, ఎలదీఁగెవలెఁ బొలసి నిలుచునిలువును, అనునివి స్త్రీలకు సొమ్ములు నాయుధములు నగును.

అవ. ఇఁక శృంగారమునకు అనుభావము లైనదృగ్విలాసములను సపరికరముగా వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ క్వచి త్సభ్రూభఙ్గైః క్వచిదపిచ లజ్జాపరిగతైః
క్వచి ద్భూరిత్రస్తైః క్వచిదపిచ లీలావిలసితైః।
కుమారీణా మేతై ర్మదనసుభగై ర్నేత్రవలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవ దిశః॥ 4

టీ. క్వచిత్=ఒకానొకచోట, సభ్రూభఙ్గైః=బొమముడిపాటుతోఁ గూడినవియు-భ్రుకుటిరేచితము లనెడి భ్రూవ్యాపారములతోఁ గూడినవనుట, క్వచిదపిచ=ఒక్కయెడను, లజ్జాపరిగతైః=సిగ్గుచేఁ జుట్టఁబడినవియును- నునుసిగ్గు గిఱిగొన్నట్టియు ననుట-('సవ్రీడాలోకనేనైవ స్వానుకూల్యప్రకాశనమ్' అన్నట్లు సిగ్గుతోడి చూడ్కులే స్త్రీలయానుకూల్యమును దెలుపును గాన) నిజానుకూల్యమును దెలుపునట్టివియు నని భావము, క్వచిత్=మఱియొక్కెడ, భూరిత్రస్తైః=మిక్కిలి భయముచేత త్తఱపడినవియు-మిక్కిలి బెదరినవియుననుట, క్వచిదపిచ=మఱియొకచోట, లీలావిలసితైః-లీలా=రాకపోకలవిలాసవిశేషములచేత-నీటుగులుకుచు నటుపోవుట మరలి యిటువచ్చుట యనువ్యాపారములచేత ననుట, విలసితైః=ఇంపైనవియు-లేక చకచకని మెఱుఁగులడరించునవియు, మదనసుభగైః-మదన=మన్మథునిచేత, సుభగైః=మనోహరమైనవియు, మరులు గొలుపునంతసొగసైనవియనుట-('యద్దర్శనా ద్విరక్తోఽపి క్షుభ్యతే తత్సమన్మథమ్' దేనిని జూచుటచే విరక్తుఁడును గలఁతనొందునో యది సమన్మథ మనఁబడును గాన) విరక్తునిమనస్సునేనిఁ గలంచునట్టివియు ననుట, ఏతైః=ఈ-ఇట్లు చెప్పఁబడినటువంటివైన యనుట, కుమారీణాం=కొమరాండ్రయొక్క-కలువరేకులవంటికన్నులు గలజవరాండ్రయొక్క యనుట, నేత్రవలితైః=నయనవిలాసములచేత-బెళుకులీను కన్నుంగవల కులుకుందిరుగుడులచేత- వానిని నీటుగాఁ ద్రిప్పుటలచేత ననుట, దిశః=దిక్కులు, స్ఫురత్ నీల అబ్జానాం=వికసిల్లుచున్న నల్లగలువలయొక్క, ప్రకరపరికీర్ణా ఇవ=సమూహములచేత వెదచల్లఁబడినవో యనునట్లు; కనఁబడుచున్న వని శేషము. జవరాండ్రచూపులు కలువపూగుంపులవలె నిసుడుటచే నలుగడలు కలువలు చల్లఁబడినవో యనునట్లు గానిపించిన వని యుత్ప్రేక్ష.

[ఇచట నయనవిలాసములు ప్రియజనులు మొదలైనవారిఁ గనుఁగొనుటయందలి చాపలముచేతఁ గలుగునవిగాన 'కుతూహలం రమ్యదృష్ట్యా చాపలం పరికీర్తితమ్' రమ్యములైనవానిని జూచుటయందలిచాపలమె కుతూహల మనఁబడు ననుటచే, కు

తూహల యనెడి శృంగారచేష్ట సూచిత మైనది. మఱియు నిందు నయనముయొక్క వలన మనుక్రియచేత దిశలు వికీర్ణము లయ్యె ననెడిక్రియ యుత్ప్రేక్షింపఁబడుటచే క్రియానిమిత్త క్రియాస్వరూపోత్ప్రేక్ష యూహ్యము. 'నయనవలితములచే దిక్కులు నల్లగలువలచే వెదచల్లఁబడెనో యన్న ట్లుండె' ననెడియీయుత్ప్రేక్షచే నయనములు నల్లగలువలతో సమానమగుట గమ్యమగుచున్నది. గమ్యమైనయీసామ్యముచే ఉపమ వ్యంజిత మగుచున్నదిగాన నిచట అలంకారముచే నలంకారధ్వని యని యెఱుఁగునది.

ఉ. భ్రూలతికావిభంగయుతకేముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేలవిలాసముల్ మదనదీపనముల్ రుచిరంబు లైనకాం
తాలసమాననేత్రవలితంబులచే దిశ లెల్ల విస్ఫుర
న్నీలసరోజపత్రములు నిండె ననం గనుపట్టె నెంతయున్. 4

తా. *ఎలప్రాయంపుఁబువుఁబోండ్లు ఒక్కెడ బొమలుముడివెట్టియు,నొక్కచో నునుసిగ్గున నూలుకొల్పియు, నొకచక్కి మిక్కిలి బెదరున బిత్తరంపు తత్తఱపాటు నొందియు, నొక్కవలన నును మెఱుఁగు లడరించునట్లు నిటునటుఁ బఱపియును, నిట్లు మరుఁడు కోయని యార్చి చూపఱం బైకొనునంతసొగసుగాఁ, దమ నిడువాలుఁ గన్నుఁగవ గిఱపి దెసలఁ గీలుకొలిపిరేని నల్ల నికలువపూఁజాయల నిగనిగలాడు వాని నునుఁజూడ్కులచే దిక్కులనల్ల గలువలు వెదచల్లఁబడెనో యన్నట్లు గానిపించెడిని.

* ప్రాయంబుననే స్త్రీలకుఁ గన్నులు నల్లఁగలువలతో సాటి యగును గాన నిచట నీలాబ్జవికిరణమునకు అనుగుణముగా యౌవనసూచక మగుకుమారీశబ్దము ప్రయుక్తమైనది. స్త్రీలకు యౌవనప్రాదురావ్భమున నయనములు నీలోత్పలసమానములగుట

శ్లో॥ 'నీరాత్తీర ముపాగతా శ్రవణయోస్సీమ్ని స్ఫురన్నేత్రయో
శ్శ్యామం లగ్న మిదం కి ముత్పలమితి జ్ఞాతుం కరం న్యస్యతి !
శైవాలాఙ్కురశఙ్కయా శశిముఖీ రోమావళీం ప్రోఞ్ఛతి
శ్రాన్తాస్మీతి ముహు స్సఖీ మవిదితశ్రోణీభరా పృచ్ఛతి॥

శా. లీలన్ బాల తటాకముఁ వెడలి హాళిం గేలఁ గర్ణస్ఫుర
ల్లోలాపాంగము లంటుఁ గేళిలసదుల్లోలోత్పలం బంచు శై
వాలభ్రాంతిని నారుఁ జిమ్ము నఖరవ్యాపారలీలం జెలీ
సోలన్ మే నని పల్కుఁగా యవిదితశ్రోణీభరాయాస యై.'

అని అజ్ఞాతయౌవనవిషయమై రసమంజరియందును,

అవ. ఉద్దీపనవిభావము ఆలంబనముయొక్క గుణము, చేష్ట, అలంకారము, తటస్థము అని నాలుగువిధములుగా నుండును గదా. ఆ నాలుగింటిలో మొదటఁ జెప్పఁబడిన గుణములను పిదపఁ జెప్పఁగోరి కతో నిప్పుడు మానినవాఁ డై 'స్మితేన' ఇత్యాదు లగు మూఁడుశ్లోకములచే రెండవది యగుశృంగారచేష్టలను గొన్నిటి వానితోఁగూడ కొన్ని యనుభావములను వ్యభిచారులను వర్ణించినాఁడు. ఇప్పుడు మూఁడవది యైన యలంకారమును జెప్పఁబూనినవాఁ డై అవి నైసర్గికము, ఆహార్యకము అని ద్వివిధ మగుటచే ఆహార్యకము వెంబడినే తెలియఁగల దని లోఁ దలఁచి యిప్పుడు నైసర్గికాలంకారమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వక్త్రం చన్ద్రవికాసి పఙ్కజపరీహాసక్షమే లోచనే
వర్ణః స్వర్ణ మపాకరిష్ణు రలినీజిష్ణుః కచానాం చయః।
వక్షోజా విభకుమ్భవిభ్రమహరౌ గుర్వీ నితమ్బస్థలీ
వాచాం హారిచ మార్దవం యువతిషు స్వాభావికం మణ్డనమ్॥ 5

టీ. చన్ద్రవికాసి=చంద్రునివలె వికసించునట్టి-అనఁగా సుందరమైన, వక్త్రం=ముఖమును; పంక...క్షమే-పంకజ=తామరలను, పరీహాస=పరిహసించుటయందు, క్షమే=సమర్థములైనట్టి-తామరలను నిరసింపఁజాలినట్టి-తామరలను బోలినట్టి యనుట, లోచనే=కన్నుఁగవయు; స్వర్ణమపాకరిష్ణుః=బంగారునుసరకుసేయనిస్వభావముగల-బంగరుచాయం బోలిన యనుట, వర్ణః=దేహకాంతియు-దీనిచే పద్మినీజాతి సూచితము ('కాऽపి చామ్పేయగౌరీ-సంపెఁగపూవంటిపసుపువన్నె గలది' అని పద్మిని లక్షణము.) అలినీజిష్ణుః=ఆఁడుతుమ్మెదలను జయించునట్టిశీలము గల-ఆఁడుతుమ్మె

'అప్రక్రాన్తే బాల్యే తరుణిమని చాగన్తుమనసి
ప్రయాతే ముగ్ధత్వే చతురిమణి చాశ్లేషరసికే।
న కేనాపి స్పృష్టం య దిహ వయసా మర్మ పరమమ్
త దేత త్పశ్చేషో ర్జయతి వపు రిన్దీవరదృశః॥'
అని ప్రసన్నరాఘవనాటకమునను,

శ్లో॥ ఆకృష్టే వసనాఞ్చలే కువలయశ్యామా త్రపాధఃకృతా
దృష్టి స్సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతి।
బాలః కశ్చన చూతపల్లవ ఇతి ప్రాన్తస్మితాస్యశ్రియం
శ్లిష్యం స్తా మథ రుక్మిణీం నతముఖీం కృష్ణ స్స పుష్ణాతు నః॥
అని కృష్ణకర్ణామృతమునను వర్ణితము.

దలవలెనల్లనైన యనుట, కచానాంచయః=వెండ్రుకలసమూహమును; ఇభ...హారౌ-ఇభకుమ్భ=ఏనుఁగుకుంభములయొక్క, విభ్రమ=విలాసమును, హరౌ=తీసివేయునట్టి-వానికెనయైనయనుట, వక్షోజౌ=చన్నుదోయియు; గుర్వీ=పెద్దదియైన-బటువైన, నితమ్బస్థలీ=పిఱుఁదుపట్టును; హారి=మనోహరమైన, వాచాం=పలుకులయొక్క, మార్దవంచ=మృదుత్వమును-ఇంపారుమెత్తనికులుకుపలుకులు ననుట; (ఇవి యెల్ల), యువతిషు=యౌవనవతులయందు, స్వాభావికం=స్వభావసిద్ధమైన-తెచ్చికొన్నది గాక తనంతటనే కలిగినట్టి యనుట, మణ్డనం=అలంకారము-ఇవి యెల్ల దేహము నందే పుట్టినసొమ్ము లనుట. ఇం దలంకారము *ఉపమ.

ఉ. తమ్ములఁ నేలుకన్నులు సుధానిధిఁ బోలుమొగంబు మత్తభృం
గమ్ముల గెల్చుకొప్పు కనకద్యుతి మీఱుమెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వుగుబ్బచనుబంతులు గొప్పపిఱుందు తేనియ
ల్చిమ్మెడుముద్దుఁబల్కులును జేయనిసొమ్ములు సుందరాంగికిన్. 5

తా. †నిండుచందురునివలె ముద్దులు గులుకు నెమ్మొగంబును, దామరరేకులం బురుడించు నిడువాలుకన్నుంగవయు, జాళువాపసిండిచాయను జీ యను మేనికాంతియు, తుమ్మెదగఱులవలె నల్లనై నిగనిగలాడు నెఱికురులును, గజకుంభములంబోని

---

* 'స్పర్ధతే జయతి ద్వేష్టి హస తీర్ష్య త్యసూయతి।త దన్వే త్యనుబధ్నాతి త చ్ఛీలతి నిషేధతి।తచ్చైవానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః॥' అను ఆచార్యదండివచనముంబట్టి 'వికాసి' 'పరిహాసతుమే' ఇత్యాదులు ఇట సాదృశ్యము నే తెలుపునవి గాన అలంకార ముపమయే యగును.

† చంద్రవికాసి యగు వక్త్రము మున్నగునవి యౌవనలక్షణములు గనుక యువతీశబ్దము సాభిప్రాయము. ఇందులకు

మ. వరవక్త్రేందు విలాసకృ న్నవవయో-వర్షావసానంబునం
దరుణీశైశవసింధు లింకునెడఁ ద- త్తత్కాలలక్ష్యంబులౌ
సరసాంతస్థితగండశైలము లనం - జందోయి యంతంతకుం
బరఁగుం దత్కృమశోషరేఖ లనఁ గ-న్పట్టుఁ వళీపుంజముల్.

నరసభూపాలీయము.

చ. కలికిముఖేందుకాంతికర-కాంతవయోజలదాంతవేళ వ
ర్తులకుచగండశైలములు - దోఁప వళిత్రయశోషరేఖ లిం
పలరఁగ మధ్యసీమ బను - లై కటిసైకత ముప్ప బాల్య మ
న్బలునది యింకుచో మెఱసె- నాభి గభీరజలాశయం బనన్.

వసుచరిత్ర.

గబ్బిచనుగుబ్బలును, బటువులై మిటారించు వలుఁదపిఱుందులును, మెత్తనై యింపారు పలుకుపలుకులును, అను నివియె జవరాండ్రకు పెట్టక తమంతటనే మేనం బుట్టిన యెమ్మెసొమ్ములు.

అవ. ఇఁక ఆలంబనముయొక్క గుణమైన యౌవనమును వర్ణించు చున్నాఁడు.

శ్లో॥ స్మితం కించి న్ముగ్ధం సరళతరలో దృష్టివిభవః
పరిస్పన్దో వాచా మభినవవిలాసో క్తిసరసః।
గతానా మారమ్భః కిసలయితలీలాపరికరః
స్పృశన్త్యా స్తారుణ్యం కిమివ నహి రమ్యం మృగదృశః॥ 6

టీ. స్మితం=మందహాసము-చిఱునవ్వు, కించిత్ ముగ్ధం=కొంచెము మనోహరమైనది-కొంచెముమాత్రమే ముద్దుగొలుపునది, (అగును అని శేషము. ఇట్లే మీఁద నెల్ల యథాయోగముగా నధ్యాహరించుకొనునది). ఇచట తరుణి, బాల్యమునకును యౌవనమునకును నడుమ నున్నదిగాన యింకను ప్రాగల్భ్యము కలుగమింజేసి చిఱునగ వొక్కింత సుందరమైనదిగాఁ జెప్పఁబడెనని తెలియనది; 'కించిద్వక్త్రే' అను పాఠమున మొగమున చిఱునవ్వు కొంచెము కలిగియున్నదని యర్థము. ఈపాఠమును సరసమే. దృష్టివిభవః=విలోకనసంపద-చూడ్కులసొంపు, సరళతరళః-సరళ=అకుటిలము గా-ఏకుంటును లేక యనుట, తరళః=చలించునది-చూడ్కు లేవంకరయు లేక ధారాళముగా బెళుకులు దళుకొత్తుచుండు ననుట; వాచాం=వాక్కులయొక్క, పరిస్పన్దః=రచన-పన్నికయనుట-వాగ్వ్యాపార మని భావము, అభి...సరసః-అభినవ=క్రొత్తవైన, విలాస=మురువులుగల-వింతపోలుపైనకులుకులతోఁ గూడిన యనుట, ఉక్తి=పలుకులచేత, సరసః=రసవంతమైనది-మాటాడునప్పుడు పలుకులు మునుపటివలెఁగాక మతియొక్రొత్తచెలువులోఁ గూడి తులకించుచుండుననుట; గతానాం=నడలయొక్క, ఆరమ్భః=మొదలుపెట్టుట- నడచుటకుం బూనఁగా ననుట, కిస...కరః-కిసలయిత=చిగిర్చిన-క్రొత్తగా నంకురించిన యనుట, లీలాపరికరః = విలాసపృద్ధి గలది-నడలయం దిప్పుడిప్పుడే క్రొత్తగా నెఱనీటుహొయలు గులుకుచుండు

సీ. దేవకీసుతుకోర్కి-తీఁగలు వీడంగ, వెలఁదికి మైదీఁగ - వీడఁదొడఁగ
కమలనాభునిచిత్త-కమలంబు వికసింపఁ, గాంతి నింతికి ముఖ-కమలమొప్పె
మధువిరోధికిలోన-మదనాగ్ని పొడసూపఁ,బొలఁతికిఁజనుదోయి-పొడవుసూపె
శౌరికి ధైర్యంబు - సన్నమై డాయంగ, జలజాక్షిమధ్యంబు - సన్నమయ్యె
హరికిఁ బ్రేమబంధ-మధికంబు గాఁ గేశ,బంధ మధికమగుచు-బాలకలరెఁ
బద్మనయనువలనఁ-బ్రమదంబునిండార,నెలఁతయౌవనంబు-నిండియుండె.
భాగవతము.

ననుట, లేక, పరికర మనఁగా ఆరంభము నగుసుగాన ఒయ్యారము కొంతకొంత సూపుచున్న దని యర్థాంతరము ; (కాఁబట్టి) తారుణ్యం=యౌవనమును-లేఁబ్రాయము ననుట, స్పృశత్=తాఁకుచున్న-ఎలపరువ మప్పుడే కొంచెము వచ్చియున్నట్టి యనుట, మృగదృశః=(లేడికన్నులవంటికన్నులు గల) స్త్రీయొక్క-అనఁగా ఎలపరువము తలసూపుచున్నపడఁతిని సంబంధించినట్టి దైన యనుట, కిమివ=ఏది, రమ్యం=మనోహరము, నహి (భవతి)=కాదు-పసమించు నెలప్రాయముగల పువుఁబోఁడియొక్క యొక్కింతముద్దు లేనగవు మున్నగునవి యొక్కొక్కటియు మనోహరమే యగు నని భావము. [ఇందు నాయికకు యౌవనము పొడసూపు చున్నది గాన యిది *ముగ్ధయగును. ఈరెండుశ్లోకములను శ్లాఘ్యములైన విశేషణము లుండుటచే ఉదాత్త

---

* నాయికలు ముగ్ధ, మధ్య, ప్రౌఢ అని మూఁడువిధములు. ఇందులకు లక్షణము.
'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జా విజితమన్మథా।
లజ్జా మన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా।
స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా॥'

ఉదయించుచున్న యౌవనము గలదియు, లజ్జచే జయింపఁబడినమన్మథుఁడు గలదియు (అనఁగా సిగ్గుచే కామము నడంచినదియు) ముగ్ధ. యౌవన ముదయించినదియు సిగ్గును కామమును సమముగాఁ గలదియు మధ్య. యౌవనము నిండారినదియు కామముచే సిగ్గుఁ దగ్గుపఱిచినదియు ప్రౌఢ. అందు ముగ్ధ యెట్లన,

ఉ. నేరని నేర్పు కౌఁగిటికి - నిండనిచన్నులు సిగ్గుపాటునం
జేరక చేరుదేహమును - జిన్నిమిటారపుఁగల్కి సేఁతలున్
బీరము లేనిపొందికలుఁ - బ్రీతివిలాసపుముద్దుమాటలుం
గోరక కోరుచుంబనముఁ - గొంచెపుఁజూపులు ముగ్ధభామకున్.

మధ్య యెట్లన,

చ. నెఱి గలగుబ్బచన్నులును - నేర్పులు గుల్కెడివాలుఁజూపులుం
దఱికొను మారుకేళియును - దట్టపుగర్వము భూషణంబులున్
వెఱవక చేయుసేఁతలును - వీడనికౌఁగిలి మోహకోపముం
దుఱఁగలియొప్పు లేఁజెమట - తోరపుమాటలు యౌవనాంగికిన్.

ప్రౌఢ యెట్లన,

చ. కులుకుమెఱుంగుఁజూపులును-గండెపుఁజేఁతలుఁ దియ్యమాటలున్
జిలిబిలిపాటలుం గలికి-చిత్తము మన్మథబంధభేదముం
దలకొనుచుంబనంబులును - దాటవపేటవభూషణవ్రజం
బలుకలుఁ గల్గి పైకొనుచు-నాసలఁ దేల్తురు ప్రౌఢభామినుల్.

మనుగుణము చెప్పఁబడినది. 'శ్లాఘ్యైర్విశేషణైర్యోగో యస్యాశ్చ స్యాదుదాత్తతా' అని ఉదాత్తగుణలక్షణము.]

ఉ. ఇంచుకముద్దులేనగవు ! లింపగునవ్యవిలాససూక్తు ల
భ్యంచితలోలదృష్టియు న! వారుణపల్లవమండలంబు ని
ర్మించు సలీలయానములు ! మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించు మృగాక్షిచందము ల! తిప్రమదంబు ఘటింపఁ జాలవే. 6

తా. ఎలప్రాయము తలసూపుచున్న చిగురాకుఁబోఁడియందు మేలకనగ వొకింత ముద్దుగుల్కుచున్నది. వాలారుఁజూడ్కు లేమఱుపును లేక బెళుకులు దళుకొత్తుచున్నవి. మాటాడుతీరు వింతచెలువుతోఁ గూడినపలుకులచే నొప్పు లొలుకుచున్నది. నెన్నడలయందు నొయ్యారంపుఁగులుకు దులకింప మొదలుపెట్టుచున్నది. పూపజవరాలిపోలు పేది మనోహరము గాదు?

అవ. ఇపుడు కన్నుమొదలైనయాటింద్రియములలో నొక్కొక్కటికిని లోకోత్తరము లైనవిషయము లిందే నియతమైయున్న వని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ద్రష్టవ్యేషు కిముత్తమం మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం తదాస్యపవనః శ్రావ్యేషు కిం తద్వచః।
కిం స్వాద్యేషు తదోష్ఠపల్లవరసః స్పృశ్యేషు కిం తద్వపు
ర్ధ్యేయం కిం నవయౌవనం సహృదయైః సర్వత్ర తద్విభ్రమాః.7

టీ. (ఇందు ప్రశ్నోత్తరరూపంబుగా అన్వయము గ్రహించుకొనునది). ద్రష్టవ్యేషు=చూడఁదగినవానిలో-చూడనింపైనవస్తువులలో ననుట, ఉత్తమం=శ్రేష్ఠమైనది, కిం=ఏది-ఇది ప్రశ్నము. ప్రేమప్రసన్నం=అనురాగముచే వికసిల్లినట్టిదైన-'ద్రవీభూతం మనో యత్ర దర్శనే ప్రేమదాయిని-దేనిని జూడఁగా మనస్సు ద్రవమువలె కరఁగునో యది ప్రేమదాయి' అనునట్లు ప్రేమదాయి యైనట్టి, మృగదృశః=తరుణియొక్క, ముఖం=ముఖము-ఇది ఉత్తరము. ఇట్లె ప్రశ్నోత్తరములు మీఁదనెల్లఁ దెలియునది. కన్నులకు మిక్కిలియింపుగూర్చున దగుటచే నిదియె శ్రేష్ఠమనుట. ఘ్రాతవ్యేషు=మూచూడఁదగినవానిలో-కిం=ఏదిశ్రేష్ఠము. తత్ ఆస్యపవనః=దాని (అతరుణియొక్క) మొగముయొక్క-గాలి-దాని కమ్మనిముద్దుమొగముపైఁ బొలసి వచ్చునట్టిగాలి యనుట; ఇదియె మిక్కిలి ఘ్రాణతర్పణమైనదిగాన శ్రేష్ఠమనుట. మూర్కొనఁదగినది గంధమేకాని గాలికాదు గావున స్త్రీముఖపవనమును మూర్కొనఁజెప్పుట యెట్లు? అన్నచో ఇచట తరుణి పద్మినీజాతిగాన పద్మవాసన దానిపైఁ బొలయు

గాలికిని తగులువడుచున్నది. 'పుష్పము లాఘ్రాణింపఁబడును' అన్నచో పుష్పములనఁగా కేవలపుష్పములుకాక గంధముతోఁగూడినపుష్పములను (అనఁగా పుష్పములయొక్క గంధమును) ఆఘ్రాణించుట యర్థమైనట్లు ఇచట ముఖపవనము నాఘ్రాణించుటయనఁగా పద్మవాసనగల ముఖపవనమును(అనఁగాముఖపవనముయొక్కపద్మగంధమును) ఆఘ్రాణించుట యగునుగాన దోషములేదు. శ్రావ్యేషు=వినఁదగినవానిలో, కిం=(శ్రేష్ఠమైనది) ఏది? తత్ వచః=దానియొక్క (ఆతరుణియొక్క) పలుకు-మృదుమధురభాషణ మనుట; ఇదియె మిక్కిలి శ్రవణానందకరమైనదిగాన శ్రేష్ఠమని భావము. స్వాద్యేషు=అనుభవింపఁదగినవానిలో, కిం=(శ్రేష్ఠమైనది) ఏది? తదో...రసః-తత్=ఆతరుణియొక్క, ఓష్ఠపల్లవ=చిగురాకువంటి మోవియొక్క, రసః=రసము-అధరామృతమనుట; ఇదియె మిక్కిలిచవి గొలుపునదిగాన శ్రేష్ఠ మని భావము. స్పృశ్యేషు=స్పృశింపఁదగినవానిలో, కిం=(శ్రేష్ఠమైనది) ఏది? తత్ వపుః=ఆతరుణియొక్క శరీరము-పువ్వువలె నలిసుకుమారమైయుండు దానిమే ననుట; ఇదియె మిక్కిలి యింద్రియసౌఖ్యావహమైనది గాన శ్రేష్ఠమైనదనిభావము. ధ్యేయం=ధ్యానింపఁదగినది, కిం=ఏది? ధ్యానింపఁదగినవానిలో శ్రేష్ఠమైనది ఏది యనుట, నవయౌవనం=(తరుణియొక్క)ఎలప్రాయము. ఇదియె మిక్కిలి మనస్సును రజించునదిగాన శ్రేష్ఠమనుట. అన్నివిధముల ముఖ్యముగా ధ్యేయమెద్దియో చెప్పుచున్నాఁడు. సహృదయైః=హృదయముగలవారిచే- రసికజనులచే ననుట, సర్వత్ర=అన్నియెడలను, లేక, అన్నికాలములను, తత్ విభ్రమాః=ఆతరుణియొక్క విలాసములు-ఒయ్యారపుఁగులుకులు, ధ్యానింపఁదగిన వని శేషము.

[ఇచట నాయాదానికిఁ బ్రసిద్ధములై యుండువిషయములెల్ల నీయొకచోటనే యొక్కటిగా యొనగూడియుండుటను జెప్పుటచే దీనికి (తరుణికి) శృంగారరసమును బరిపోషించునట్టియతిశయము మిక్కిలియుఁ గలిగియుండుట చెప్పఁబడియె. దీనివలన దీనికి లోకోత్తరమైన యాభిరూప్యము సూచిత మగుచున్నది. ఇట్లె మిక్కిలి యుత్తమవిషయములను గోరువారికి నిట్టివిశిష్టతరుణీసంభోగమే కర్తవ్య మనియు నర్థము ఫలించుచున్నది. ఇందు చాతుర్య మతిశయించుటకొఱకు ప్రశ్నోత్తరములను పలుమాఱు నిబంధించుటచే నలంకారము ఉత్తరము.]

సీ. చూడంగఁ దగినవస్తువులందు ఘన మెద్ది
　　తుల లేక తగువెలందులమొగంబు
వలపు గైకొనఁదగువానిలో నెయ్యది
　　మగువవలవదనాబ్జమారుతంబు
వీనుల కింపైనవానియం దెయ్యది
　　కోమలాంగులముద్దుగులుకుపలుకు

తనువు సోఁకిన సుఖం౯ బొనరించు నెయ్యది
మెలఁతలసొబగైన౯మేనుదీవ.

తే. యతిమధుర మెద్ది కాంతాధ౯రామృతంబు
సరసజనులకుఁ జింతింపఁ౯ జాలు నెద్ది
పువ్వుఁబోఁడులవెలలేని౯జవ్వనంబు
వెలయు నెల్లెడఁ బడఁతుల౯విభ్రమములు. 7

తా. రసికులైనవారికి జవరాలియొక్క ప్రేమలోలుపు తెలిముద్దు మొగము కంటె మిక్కిలియుఁ జూడఁదగినది గాని; తమ్మివాసనలు గొలుపు దానినెమ్మొగము పైఁ బొలసివచ్చు కమ్మనితెమ్మెరకంటె మిక్కిలియు మూర్కొనఁదగినదిగాని; తేనియ లొలుకు దాని తీయనిపలుకులకంటె మిక్కిలియు వినఁదగినదిగాని; చిగురాకు వంటిదానికెమ్మోవిపానకముకంటె మిక్కిలియుం గ్రోలఁదగినదిగాని; మవ్వంపునునుఁ బువ్వువంటి దాని మెయిదీఁగకంటె మిక్కిలియు స్పృశింపఁదగినదిగాని; దానియెల ప్రాయముకంటెను, దానికన్న ముఖ్యముగా నన్నియెడల దాని యొయ్యారంపుఁ గులుకులకంటెను, మిక్కిలి ధ్యానింపఁదగినవి గాని మఱి వేఱెవ్వియుఁ నెంగను లేవు.

అవ. ఇపుడు వీరల ముఖాద్యలంకారములను వర్ణించుమూలముగా సకలలోకములను మిక్కిలి మోహింపఁ జేయునట్టివా రగుదురని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏతా శ్చలద్వలయసంహతిమేఖలోత్థ
ఝుఙ్కారనూపురపరాజితరాజహంస్యః।
కుర్వన్తి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్తముగ్ధహరిణీసదృశైః కటాక్షైః॥ 8

టీ. చలత్...హంస్యః=చలత్=(గతివై చిత్ర్యమువలన- అనఁగా నడకతీరు వలన) కదలుచున్న, వలయ సంహతి=కడియముల సమూహమునుండియు, మేఖలా= మొలనూలినుండియు- మొలనూలి చిఱుగజ్జెలనుండియు, ఉత్థ=లేచిన-పుట్టిన యనుట, ఝుఙ్కార=ఝుణఝుణత్కారముచేతను, నూపుర=అందియలచేతను-అందియల రవళిచేతను అనుట, పరాజిత=ఓడింపఁబడిన-'నూపురరవాహృత' అనుపాఠమున'అందియలరవళిచేఁగెలువఁబడిన' అని యర్థము, రాజహంస్యః=రాయంచపెంట్లుగలవారు- కడియములయొక్కయు మొలనూలి గజ్జెలయొక్కయు ఝుణఝుణధ్వనిచేతను గిలుకుటందియల రవళిచేతను ఆఁడురాయంచల గెలిచినవారనుట-రాయంచల యెలుఁగుల కంటె వారలకంకణకాంచీనూపురధ్వనులు మఱింత శ్రావ్యము లనియుఁ గాఁబట్టి కలరవంబులు సేయుచు సుంపరమందగమనముతోఁ బోవురాజహంసాంగనలవలె కర

కంకణాదిధ్వనులతిశ్రావ్యముగాఁ జెలంగ హొయలుగులుకుచు-నడచువారనియు నాశయము. ఏతాః=ఈ-అనఁగా పూర్వోక్తలైన, *తరుణ్యః=జవరాండ్రు-ఇరువదియేండ్లకొక్కింతతక్కువవయస్సు గల స్త్రీలు, విత్రస్త...దృశైః-విత్రస్త - చకితమైనట్టియు, ముగ్ధ=సుందరమైనట్టియు, హరిణీ=జింకలో-జింకయొక్క కన్నులతోననుట, సదృశైః=సమానములైనవియగు, కటాక్షైః=కడగంటిచూపులచేత (ఈచకితహరిణకటాక్షములచేత వీరు 'చకితమృగదృగాభే ప్రాన్తరక్తే చ నేత్రే' అన్నట్లు పద్మినీజాతివారని సూచిత మగుచున్నది) కస్య=ఎవనియొక్క, మనః=మనస్సును, వివశం=మోహమునొందినదిగా,నకుర్వన్తి=చేయరు.-చేయు నేచేయుదురనుట. ఇందు చెప్పఁబడిన నాయికలు మధ్యమలు. ఇచట రాజహంసియొక్క పరాజయము, దండివచనానుసారముగా సాదృశమునందే పర్యవసించునుగాన ఉపమ. 'హరిణీసదృశైః' అనుచోమఱొకయుపమ. ఈరెండును ఒకటొకటిని అంగములై యాశ్రయింపక పరస్పరనిరపేక్షములుగా నుండుటచే సజాతీయసంసృష్టి అలంకారము.

మ. కరచంచన్మణికంకణక్వణరణత్కాంచీగుణస్వర్ణనూ
పురనాదాహృతరాజహంసరమణుల్ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ముగ్ధత్రస్తవల్గన్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగంతస్తోమపాతంబులన్. 8

తా. కలరవములు సేయుచు హొయలుగాఁ బోవు నాఁడురాయంచలవలె కరంబుల నల్లలాడు కడియంబులును మొలనూలి-చిఱుగజ్జెలును ఝణంఝణధ్వనులు సేయ, గిలుకుటందియలు గల్లుగల్లు మని మొరయ మురిపెంపుఁగులుకునడలతోఁ బోవు జవ

---

* తరుణీలక్షణము రతిరహస్యమున
బాలా స్యాత్షోడశాబ్దా తదుపరి తరుణీ వింశతే ర్యావదూర్ధ్వం।
ప్రౌఢా స్యాత్పఞ్చపఞ్చాశదవధి పరతో వృద్ధతా మేలి నారీ॥

క. 'పదియాఱు బాలకును మ, ప్పదియేఁడులు జవ్వనికిని ♦ ప్రౌఢకు నైదుం,
బదియేఁడులు నటమీఁదట, తుదియేఁడులు లోలకయ్యెఁ♦దోడ్తో వరుసన్ 'అనియు,
ఆయావయస్సులయొక్క లక్షణములు,

'నిదాఘశరదో ర్బాలా పథ్యా విషయిణో భవేత్ ।
హేమన్తే తరుణీ యోగ్యా ప్రౌఢా వర్షావసన్తయోః ।
సతతం సేవ్యమానాపి బాలా ప్రథయతే బలమ్॥'

క. హేమంతంబున యౌవన, కామిని వర్షావసంత-కాలములందుం,
గామించుఁ బ్రౌఢ బాలకు, నేమాసంబైన బలము - నిచ్చును వరుసన్.
అనియుఁ జెప్పఁబడినవి.

రాంగ్రడు బెదరినబిత్తరిజింకవంటి బెళుకుంగడగంటిచూడ్కులచే నెట్టివారిమనసును మరులుకొలుపుదురు.

శ్లో॥ కుఙ్కుమపఙ్కకళఙ్కితదేహా, గౌరపయోధరకమ్పితహారా।
నూపురహంసరణత్పదపద్మా, కం న వశీ కురుతే భువి రామా॥ 9

టీ. కుఙ్కు...దేహా—కుఙ్కుమపఙ్క=కుంకుమరొంపిచేత - రొంపివలెఁ జిక్కగా మెదిచినకుంకుమచేత ననుట, ('అథ కుఙ్కుమమ్। కాశ్మీరజన్మాగ్నిశిఖమ్' 'పఙ్కోఽస్త్రీ శాదకర్దమౌ' అని యమరుఁడు; లేక, 'కుఙ్కుమం ఘుసృణమ్'అను అభిధానరత్నమాలచొప్పున కుంకుమ మనఁగా కుంకుమపువ్వు గాన 'కుంకుమపువ్వు మెదిచిన చందనపుఁజిక్కనిపూఁతచేత, ననుట; లేక, సిన్దూరం నాగసమ్భవమ్। చీన పిష్టంచ గాన్ధారం పఙ్కం శృఙ్గారభూషణమ్' అను నమరునిచొప్పున పఙ్క మ నఁగా సిందూర మనునామాంతరముగల శృంగారభూషణ మనియెడి యొకద్రవరూప మైన ద్రవ్యవిశేషమును అగును గాన 'కుంకుముచేతను అట్టి సిందూర మనెడి పంకము చేతను' అని యర్థాంతరము.) కళఙ్కిత=చిహ్నితమైన-గుఱుతుగలదిగాఁజేయఁబడిన-అలఁదఁబడిన యనుట, దేహా=దేహము గలదియు—కుంకుమసిందూరాదిరంజకద్రవ్యములచే శృంగారితమైనయాకారముగలదియు ననుట; కాఁబట్టియే, గౌర...హారా-గౌర=ఎఱుపువన్నె గల-లేక, పద్మినీజాతి యగుటచే 'స్తనయుగళ మనిన్ద్యశ్రీఫలశ్రీ విడమ్బి' అన్నట్లు మారేడుపండువన్నెగల, పయోధర=గుబ్బపాలిండ్లయందు, కమ్పిత=చలితమైన-అల్లలాడుచున్న యనుట, హారా=ముక్తావళులు-అనఁగా ముత్తెపుస రులు, గలదియు; నూపు...పద్మా-నూపురహంస=అందియ లనెడిహంసలచేత-లేక, హంసలవంటియందియలచేత, రణత్=మ్రోఁగుచున్న, పదపద్మా=అడుగులనెడి తామ రలుగలదియు-లేక, తామరలవంటియడుగులు గలదియు అనునట్టి, రామా=సుందరి, భువి=పుడమియందు, కం=ఎవనిని, న వశీకురుతే=వశముచేసికొనదు-ఎట్టివానినైనను వశముసేసికొనుననుట. ఇచట రూపకమును ఉపమయు రెండు నగుటకు సాధకబాధ కములు లేమింజేసి సందేహసంకరము.

[ఇచట హారములు అల్లలాడుచున్నవనుటచే చన్నుఁగవలు మిక్కిలిబిగువులగుట సూచిత మగుచున్నది. మిక్కిలి బిగి లేనియెడ దానిపై ముత్తెపుసరులు వ్రాలియుండు నేకాని తాఁకితాఁకి యెగయుచు నిట్లు అల్లలాడుచుండు ననుట పొసఁగదు. చన్నుఁ గవనిబ్బరంపుబిగిచే మిక్కిలి మిక్కుటమైన పరువంపుసొంపు సూచిత మయ్యెడిని. పాలిండ్లకు గౌరము లనుటచే రూపసమృద్ధియు వ్యక్తమగుచున్నది. ఇందువలన ఆ లంబనగుణము లభించుట తెలియనగును. ఇట్లే 'కుఙ్కుమపఙ్క'అనుటచే తటస్థమైన యుద్దీపనవిభావము చెప్పఁబడినది. అట్లే హారనూపురము లనెడి ఆలంబనాలంక

రణము చెప్పఁబడియె. 'రణత్పదపద్మా' అనుటచే లీలాగతివిశేషరూప మైన అను భావమును దెలియనయ్యెడి. ఇట్లు 'అభిరూప్యమకాఠిన్య మఙ్గానాం చాతిమార్దవమ్। ఏవమాదిగుణావస్థా ప్రథమే యౌవనే భవేత్' అన్నట్లు యౌవనమునఁ బొడసూపు ఆలంబనగుణానుభావాదిసామగ్రిచే సముల్లసిత మైనట్టియు, 'కృతాధరాఙ్గసంస్కారా సఖీ కేలీషు లాలసా' అను చేష్టావిశేషములతోఁ గూడిన యౌవనముచే నిండారియు న్నట్టియు,'రమయతీతి రామా' అనువ్యుత్పత్తివలన రమింపఁజేయునట్టిదిగాన లోకో త్తరలావణ్యసంపన్న మైనదియు నగు ఆలంబనవిభావముచేత (అనఁగా నాయికా రూపవిభావముచేతఁ) బొడమిన శృంగారరసంపుసముద్రమున నెవ్వఁడు మునుఁగకుం డు నని భావము. ఇచట శ్లాఘ్యము లైన విశేషణములతోఁ గూడి యుండుటవలన ఉదాత్తత యనుకావ్యగుణము తెలియునది. మఱియు నత్యంతసుకుమార మైనయర్థ సందర్భము కలిమిచే నిచట వృత్తి కైశికి యగును.]

చ. గొన బగుమేన సంకుమద కుంకుమపంక మెసంగ సిబ్బెపుం
జనుఁగవ రత్నహారములు సారె పెనంగఁ బదాంబుజంబులన్
మొనసినగిల్కుటందియలు మ్రోఁత చెలంగ ననంగవైభవం
బెనయఁగఁ గుల్కుకల్కిసొబగు గెవ్వనిఁ దా వలపింప దిమ్మహిన్.

తా. కుంకుమపూవుతోఁ జిక్కగా మెదిచినచందనంబు మెయినిండ నలందు కొని, పసిమివన్నెగబ్బిగుబ్బలపై ముత్తియంపుసరులు అల్లలాడుచుండఁగా, నంచ రొదలవలె నింపుగులుకు గిలుకుటందియలరవళి యడుగుఁదమ్ముల నెమ్మెలునూప, నల రారు మిటారికి నిప్పడమియం దెవ్వరు వశులు గారు?

అవ. వీరల ప్రాబల్యమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ నూనం హి తే కవివరా విపరీతవాచో
యే నిత్య మాహు రబలా ఇతి కామినీ స్తాః।
యాభి ర్విలోలతరతారకదృష్టిపాతైః
శక్రాదయోఽపి విజితా స్త్వబలాః కథం తాః॥ 10

టీ. యే=ఎవరు-ఏకవివరు లనుట, తాః=ఆ- ప్రసిద్ధ లైనట్టి, కామినీః=స్త్రీ లను, అబలాః=అబలలు అని-అనఁగా బలహీనురాండ్రని, నిత్యం=ఎప్పుడును, ఆహుః =చెప్పుదురో-వర్ణింతురో యనుట, తే=ఆ, కవివరాః=కవిశ్రేష్ఠులు, విపరీతవాచః= వ్యత్యస్తమైన వచనములు గలవారు-ఒకవిషయమును దానికి విరుద్ధమైన మఱొకవిష యముగాఁ జెప్పువారనుట, నూనంహి=సత్యమేగదా. అబలాశబ్దమునకు రూఢ్యర్థము స్త్రీయైనను దాని నిచట యోగార్థమున (అనఁగా బలహీనురాలు అనునర్థమున) గ

హించి యిట్టియర్థమునకు విరుద్ధముగా స్త్రీ లుండుటచే కవీశ్వరు లిట్టియర్థముతో వారిని వ్యవహరించుట విపరీతముగాదా యని యాశంకించి విపరీతమే యని స్థాపించుటకు నా స్త్రీలు ప్రబలురాండ్రని సాధించుచున్నాఁడు. యాభిః=ఏ స్త్రీలచేత, విలోల...పాతైః - విలోలతర = మిక్కిలియుఁ జలించుచున్నట్టి, తారక=నల్ల గ్రుడ్డులుగల, దృష్టిపాతైః=లోచనప్రసారములచేత-చూపుల నిగుడ్చుటలచేత ననుట-ఇటునటు నల్లగ్రుడ్డును సలీలముగాఁ ద్రిప్పి నిగుడ్చునట్టిచూడ్కులచేత ననిభావము, శక్రాదయః అపి = ఇంద్రుఁడు మొదలైనవారు గూడ - తక్కినవారిని జెప్ప నేల యనుట, విజితాః=జయింపఁబడిరో-తమకు లోఁబడవగాఁ జేసికొనఁబడిరో, తాస్తు= వారో-అట్టికామినులో, అబలాః=దుర్బలలు,కథం=ఎట్లు, దుర్బలలు గారు ప్రబలలే యని భావము. వీక్షణమాత్రముచేతనే యింద్రాదులను సైతము గెలువఁజాలినట్టి వారిబలము నేమని చెప్పవచ్చును. అట్టి యా స్త్రీలకు దౌర్బల్యమును ప్రతిపాదించు కవులపలుకులే దుర్బలములుగాని వారు గాదు అని భావము. ఇందు ఉత్తరవాక్యార్థము పూర్వవాక్యార్థమును సమర్థించుచున్నదిగాన తద్వాక్యార్థహేతుకమైన కావ్యలింగము అలంకారము.

చ. అతివలఁ జూచి వీ రబల లంచు వచించుమహాకవీంద్రు లు
ద్ధతవిపరీతవాదు లిది దబ్బఱ గాదు విలాసినీసమం
చితతరళాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులు
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచి చూడఁగన్. 10

తా. కవీశ్వరు లెప్పుడును కామినులను అబల లనుచుందురు. ఆకామినులో నల్లగ్రుడ్డును నొయ్యారముగా నటు నిటుఁ ద్రిప్పి నిగుడ్చునునువాలుంజూడ్కుల చేతనే యింద్రాదులనుగూడ తమకు లోఁబడవగావించుకొనునట్టిప్రబలురాండ్రు.అట్టి వారి నబల లని చెప్పుకవులు విపరీతములు మాటలాడువారే యగుదురు గదా.

అవ. కామదేవుఁడును కామినులకుఁ గింకరుఁడే యగుట నుత్ప్రేక్షించుచున్నాఁడు.

శ్లో॥ నూన మాజ్ఞాకర స్తస్యాః, సుభ్రువో మకరధ్వజః।
యత స్తన్నేత్రసఞ్చార,సూచితేషు ప్రవర్తతే॥ 11

టీ. మకరధ్వజః=కామదేవుఁడు-మన్మథుఁ డనుట, యతః=ఎందుచేత, తన్నేత్ర...తేషు-తత్-ఆకామినియొక్క, నేత్రసఞ్చార = దృష్టిప్రసారముచేత-ఆకాంత నిగిడ్చినచూడ్కిచేత ననుట, సూచితేషు=సూచింపఁబడినవానియందు-గుర్తింపఁబడిన పురుషులయందు,ప్రవర్తతే=ప్రవర్తించుచున్నాఁడో-కామినులుతమవాలుఁజూపులఁ గీలుకొలిపినంతనే మన్మథావేశము పురుషులకుఁ గలుగు ననుట, (అతః=అందువలన),

తస్యాః=ఆ-ప్రసిద్ధమైన-లేక, పూర్వోక్త మైనట్టి, సుభ్రువః=(చక్కనికనుబొమలు గల) స్త్రీయొక్క-ఇట జాత్యేకవచనము గనుక స్త్రీలయొక్క అనిభావము, ఆజ్ఞాకరః-ఆజ్ఞనుశేయువాఁడు-కింకరుఁడనుట-ఏమిచెప్పిన నది సేయువాఁడనుట, నూనం=నిజము-ఇది యుత్ప్రేక్షావాచకము. లోకమునందు స్వామి కన్నుఁజూపినచోట సేవకుఁడు వర్తించునట్లు స్త్రీలు తమచూడ్కులు నిగిడ్చినవానియందు మన్మథుఁడు ప్రవర్తించుచున్నాఁడు-అనఁగా వానికి మరులుకొలుపుచున్నాఁడు గాన వాఁడు వారికి కింకరుఁడే యని భావము.

[కామినీకటాక్షముచేత నే జనులకు మన్మథావేశము కలుగుటవలన నీయుత్ప్రేక్ష కలిగినది. ఇదియు 'నూనమ్' అను వ్యంజకశబ్ద ముండుటవలన వాచ్య మగుచున్నది. 'మన్యేశఙ్కే ధ్రువం నూనం ప్రాయ ఇత్యేవమాదిభిః। ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపితాదృశః' అనుటంబట్టి 'నూనమ్' అనుశబ్దముచే నిచట నుత్ప్రేక్ష యుత్థాపిత మైనది. దీనిచే స్త్రీలు జగత్తునెల్ల వశీకరించుకొనుటయందు నెదురులేని సామర్థ్యము గలవారని వ్యక్త మగుచున్నది. బొమలతీరుతోఁ గూడిన కన్నుంగవ చూడ్కులు మఱింత మదనోద్దీపకములు గాన 'సుభ్రువః' అనుపద మిట సాభిప్రాయము.]

క. నారీజనముల కాజ్ఞా
కారి యగుభటుండు మరుఁడు ♦ గాఁబోలుఁ జుమీ
వారికటాక్షము సోఁకిన
వారియెడన వాఁడిఁ జూపి ♦ వర్తించుఁ గదా. 11

తా. మన్మథుఁడు చక్కనికనుబొమలతీరు గలయెలనాఁగలు తమచూడ్కులెందు నిగుడింతురో యందే ప్రవర్తించుచున్నాఁడు గాన వాఁడు వారానతిచ్చు పని సేయుకింకరుఁ డనుట నిజము.

అవ. కామినులయందు రాగము గలయొకఁడు ఒకానొకకామినిం జూచి శ్లేషవైచిత్ర్యముచే దానిని బ్రశంసించుట యగునట్లుగాఁ జెప్పినవచనమును రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కేశాః సంయమినః శ్రుతే రపి పరం పారం గతే లోచనే
అన్తర్వక్త్ర మపి స్వభావశుచిభిః కీర్ణం ద్విజానాం గణైః।
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజకుమ్భౌ విమా
విత్థం తన్వి వపుః ప్రశాన్త మపి తే రాగం కరో త్యేవ నః॥ 12

టీ. కేశాః=కురులు, సంయమినః=కట్టఁబడినవి-ఇది సామాన్యమైన యర్థము; మంచినియమముతోఁ గూడిన వని ప్రశంసాపరమైన విశేషార్థము. ఇట్లు శ్లేష

నై ఖరిచే మీఁద నెల్ల విశేషణములకు రెంపేసియర్థములు గలుగుట తెలియునది. లోచనే అపి=కన్నులు గూడ, శ్రుతేఃపరం పారం=చెవులయొక్క యవ్వలిదరిని-అనఁగా కర్ణాంతము ననుట; వేదములయొక్క యవ్వలిదరిని-అనఁగా వేదాంతముల ననుట, గతే=పొందినవి-కర్ణాంతవిశ్రాంతము లైనవనియు, వేదాంతపరిశీలన తత్పరము లనియు నర్థద్వయము. అంతర్వక్త్రం= ముఖముయొక్క లోపలిభాగము, స్వభావశుచిభిః = స్వభావముచేత తెల్లనైనట్టి; స్వభావముచేత పవిత్రమైనట్టి, ద్విజానాం గణైః= దంతముల సమూహముచేత; బ్రాహ్మణులసమూహముచేత, 'దన్తవిప్రాణ్డజాద్విజాః' అని యమరుఁడు, కీర్ణం=వ్యాప్తమైనది - స్వాభావికముగాఁ దెల్లనైయుండు పండ్లవరుసచేత నెఱసిన దని యర్థము; స్వాభావికముగాఁ బవిత్రులైన బ్రాహ్మణగణములు గలిగియున్న దని యర్థాంతరము. ఇమౌ = ఈ-ఈ యని చేతితోఁ జూపుటగాఁ దెలియునది, వక్షోజకుమ్భౌ=కుచకుంభములు-సుబ్బపాలిండ్లు, ముక్తానాం=ముత్తెపుసరులయొక్క; జీవన్ముక్తులయొక్క, సత...రుచిరౌ-సతత =నిరంతరమైన, అధివాస=ఉనికిచేత; కాఁపురముచేత, రుచిరౌ=మనోహరములైనవి. 'ముక్తాతు మౌక్తికే ముక్తః' 'ప్రాప్తముక్తాతు మోచితః' అని విశ్వము. గబ్బిసుబ్బలు ముత్తెపుసరుల కెపుడు నాటపట్టై యుండు నని యర్థము; జీవన్ముక్తులకు నెపుడు వాసస్థానమై యుండు నని యర్థాంతరము. కాఁబట్టి, హేతన్వి= ఓతీఁగఁబోఁడీ, ఇత్థం = ఈ చెప్పఁబడిన ప్రకారమున, తే = నీయొక్క, వపుః=శరీరము, ప్రశాన్తమపి=ప్రసన్నమైనను-తిన్నఁదనముగలదైన ననుట; మిక్కిలిశాంతి గలదైనను-అనఁగా వైరాగ్యమునకు వలయు సంయమాదిసాధనసంపత్తి గల దయ్యును అని యర్థాంతరము, నః=మాకు, రాగం=అనురక్తిని-సంభోగాభిలాష నేయనుట, (క్షోభం= కలఁతను, అని పాఠాంతరము.) కరోతి=పుట్టించుచున్నది-వైరాగ్యసాధనములైన సంయములు, వేదాంతపారీణత, పవిత్రబ్రాహ్మణగణములు, జీవన్ముక్తులు అనెడు నివి గలిగియుండుటచే వైరాగ్యము నే కలిగింపవలసినదై యుండఁగా దానికి విరుద్ధముగా రాగమును గలిగించుచున్నదని విరోధము స్ఫురించుచున్నది. ఈవిరోధము ఆభాసిత మగుటచే నిచట అలంకారము విరోధాభాసము. ఇదియును 'సంయమినః' ఇత్యాదులందలి శ్లేషయొక్క శక్తిచే నుత్థాపిత మైనదిగాన రెంటికిని అంగాంగిభావముచే సంకరము.

ఉ. వావిరిగన్నుదోయి శ్రుతిపారగ మెంతయు సంయముల్ కురుల్
భావశుచిద్విజప్రకరభాజన మెన్న ముఖాంతరంబు ము
క్తావళిరమ్యముల్ కుచములక్కట యిట్లు ప్రశాంత మయ్యు రా
జీవదళాక్షి మేను విరచించుచు నున్నది మాకు రాగమున్. 12

తా. ఓ తీఁగఁబోఁడీ! నీ నెఱికురులు సంయములు (ముడువఁబడిన వనుట). నీలోచనములు శ్రుతియొక్క పారమును జెందినవి (కర్ణాంతవిశ్రాంతము లనుట). నీ ముఖములోపల సహజముగా శుచిగల ద్విజగణములు నిండియున్నవి (తెలిపండ్లవరుస

గలిగి(యున్నవనుట). నీసుబ్బపాలిండ్లో ముక్తావలికి నిరంతరవాసమై యొప్పచున్నవి (ముత్తెపుసరు లెపుడు వ్రేలుచుండుననుట). ఇట్లు నీశరీరము వైరాగ్యసాధనభూతు లగు సంయములు, బ్రాహ్మణులు, జీవన్ముక్తులు మున్నగువారిం గలిగి ప్రశాంతమై యుండియు (తిన్నదనము కలిగియుండియు ననుట) మాకు రాగమునే కలిగించు చున్నది కాని వైరాగ్యమును గలిగింపదు.

శ్లో॥ ముగ్ధే ధానుష్కతా కేయ, మపూర్వా త్వయి దృశ్యతే।
యయా విధ్యసి చేతాంసి, గుణై రేవ న సాయకైః॥ 13

టీ. హేముగ్ధే=ఓసుందరీ-లేక, యౌవనము పొటమరించుచున్నదానా,త్వయి =నీయందు, అపూర్వా=ఇంతవఱకుఁ జూచి యెఱుఁగనట్టి-అసాధారణమైన యనుట, ధానుష్కతా=విలుకానితనము-విలువిద్యయనుట, దృశ్యతే=కనఁబడుచున్నది.ఇయం కా=ఇది యేది-ఇది యెట్టిదో తెలియరాకున్న దనుట. ఏలనఁగా, యయా=దేనిచేత-ఏవిలువిద్యను గొని యనుట, చేతాంసి=(వయసుకాండ్ర) మనస్సులను-మర్లక్ష్యము లైనవాని ననుట, గుణైః ఏవ = అల్లెత్రాడులచేతనే యని యర్థము; రూపయౌవనాదిగుణములచేతనే యని యర్థాంతరము, విధ్యసి = గ్రుచ్చుచున్నావో, ఆ యీవిలువిద్య యెట్టిదో తెలియరాకున్నదని పూర్వములో నన్వయము. సాయకైః= బాణములచేతనో, న (విధ్యసి)=గ్రుచ్చవు. లోకమునఁ బ్రౌఢు లైన విలుకాండ్రు గుఱిపెట్టఁగూడిన లక్ష్యములనే బాణములతో నాటుచున్నారు; నీవో ముగ్ధవయ్యుఁ గుఱిపెట్టరాని లక్ష్యములను(యువజనమనంబులను)అల్లెత్రాడులచేతనే నాటుచున్నావు; ఈవిలువిద్య మిక్కిలి వింతగా నుండుటచే ఎట్టిదో తెలియరాకున్నదని భావము. ఇచట గుణమనఁగా ఆలంబనగుణము లైన రూపయౌవనాదులు నగును గాన నీరూపయౌవనాదిగుణములచేత వయసుకాండ్రమనసులను మరుతూపులపాలు సేయుచున్నావని భావము. స్త్రీలకుఁ దమరూపయౌవనాదిగుణసంపత్తియే పరులనుబ్రహరించుటకు సాధన మగు నని ఫలితార్థము. ఇచట ఉత్తరవాక్యము పూర్వవాక్యమును హేతువై సమర్థించుటచే వాక్యార్థహేతుక మగుకావ్యలింగము అలంకారము. ఆదియు 'గుణైః' అను శ్లేషయొక్క భిత్తికాభేద మగు అధ్యవసాయమువూలమునఁ గలిగిన అతిశయోక్తిచే నిర్వహింపఁబడినది. కాన రెంటికిని అంగాంగిభావముచే సంకరము. దానిచేఁ బ్రసిద్ధోపమాన మగుధానుష్కునికంటె ఉపమేయభూత యగుముగ్ధకు ఆధిక్యము ప్రతీత మగుటచే వ్యతిరేకాలంకారము వ్యక్త మగుచున్నది గాన అలంకారముచే అలంకారధ్వని యని యెఱుంగునది.

క. శరములచే భేదింపక
నిరతముఁ జేసెదవు హృదయకని ర్భేదము భా

సురగుణములచే నద్భుత
కరచాపప్రౌఢి నీకె కలదు లతాంగీ. 13

తా. ముద్దరాలా! గుఱిపెట్టరాని యువజనమనంబులను గుణములచేతనె (రూపయౌవనాదిగుణములచేతనే యనుట) గ్రుచ్చుచున్నావు కాని తక్కిన విలుకాండ్రవలె బాణములచేఁ గాదు. నీ యీవిలువిద్య మిక్కిలి వింతగా నుండుటచే నెట్టిదో తెలియరాకున్నది.

అవ. ఇఁక నీమొదటివింశతి ముగియువఱకును కామినులయందత్యంతానురాగము లగవారా కామినులం గుఱించి చెప్ప ప్రశంసావచనములం జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సతి ప్రదీపే సత్యగ్నౌ, సత్సు తారారవీన్దుషు।
వినా మే మృగశాబాక్ష్యా తమోభూత మిదం జగత్॥ 14

టీ. ప్రదీపే = (విషయములను బ్రకాశింపఁ జేయునట్టి వెలుంగుగల) దీపము, సతి=ఉండఁగా-ఉండిన ననుట, అగ్నౌ = (అటువంటిదే యైన) అగ్ని, సతి=ఉండఁగాను, 'అర్కే'అనుపాఠమున త్రిలోకప్రకాశకుఁ డైనసూర్యుం డుండఁగా ననియర్థము, తారా రవి ఇన్దుషు= (చీఁకటిని బోఁగొట్టునవిగాఁ బ్రసిద్ధములై యున్న) చుక్కలు సూర్యుఁడును చంద్రుఁడును ('తారామణీన్దుషు' అను పాఠమున మణీయనఁగా కెంపులు మొదలైన మాణిక్యములు అని యర్థము.) సత్సు=ఉండఁగాను-వీరందఱు నుండిననుగాని యనుట, మృగశాబ అక్ష్యా వినా = లేడిపిల్ల కన్నులవంటి కన్నులు గలదానిని (అనఁగాఁ బూర్వము నే ననుభవించిన యా ప్రియురాలిని) విడిచి-అట్టి ప్రియురాలు లేకుండుటవలన ననుట, ఇదం జగత్ =ఈజగము, మే= నాకు, తమోభూతం=అంధకారమైనది -చీఁకటివలెఁ గనఁబడుచున్న దని శేషము. అదియె నాకన్నుఁగవకు వెలుతురువంటిది గాన నది లేనిచో జగమెల్ల నాకుఁ జీఁకటిగానే కనుపట్టుచున్న దని భావము. చీఁకటిని నిరసించునవిగాఁ బేరొందిన ప్రదీపాదికారణములుండియు వానివలన చీఁకటిని నిరసించుకార్యము పుట్టనందున నలంకారము విశేషోక్తి. మఱియు ప్రదీపాదు లున్నను చీఁకటియయ్యె ననుటచే విరోధమును వ్యంజిత మగుచున్నది. దీనిచే నీయనురాగికిఁ గలమోహాంధత్వము అనెడివస్తువు గమ్య మగుచున్నది గాన అలంకారముచే వస్తుధ్వని యని తెలియునది.

ఆ. పెక్కుదివియ లున్న జక్కవచెలి యున్న
రిక్కరాయఁ డున్నఁ జుక్క లున్నఁ
జిన్నిలేడిచూపుచేడియ నెడఁబాయ
నప్పు డంధకార మయ్యె జగము. 14

తా. విషయములను దనవెలుంగుచేఁ బ్రకాశింపఁజేయుదీప ముండినను, అట్టిదే యగునగ్ని యుండినను, జీఁకటిని బోఁగొట్టునవిగా వన్నెకెక్కిన చుక్కలును సూర్యుఁడును జందురుఁడు నుండినను, కొదమలేడివంటి బెళుకుంగన్నుఁగవ గల నావగలాడి లేనిచో యీలోకం బంతయుఁ జీఁకటి గాలుకొన్నట్లే తోఁచుచున్నది.

శ్లో॥ ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదం కుర్వన్తు నామ వ్యథామ్।
సౌభాగ్యాక్షరపఙ్క్తికేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాపి కరోతి తాప మధికం రోమావలిః కేన సా॥ 15

టీ. ఉద్వృత్తః=మిక్కిలి వట్రువలైన-ఉత్పథము గలదైన: అనఁగా కాని త్రోవను వర్తించునదైన అని యర్థాంతరము, ఏషః=ఈ-ఈ యని చేతఁజూపి చెప్పుట, స్తనభారః=చన్నులబరువును, బటువులైనచన్ను లనుట, తరలే=సలీలముగా చలించునట్టి-నీటుగా నిటు నటు తిరుగునట్టి యనుట: చపలము లైన యని యర్థాంతరము, నేత్రే = కన్నుదోయి, చలే=రేచితము మొదలైన విలాసములచేఁ గదలునట్టి: నిలుకడలేనట్టి యని యర్థాంతరము, భ్రూలతే=తీఁగవంటికనుబొమలును, రాగ అధిష్ఠితం = ఎఱుపు నెలకొన్నట్టిది: మత్సరము నెలకొన్నట్టిదని యర్థాంతరము. 'రాగశ్చ రక్తే మాత్సర్యే క్లేశాదౌ లోహితేషుచ' అని విశ్వము. ఇదం=ఈ, ఓష్ఠపల్లవం=మోవిచిగురును, చిగురాకుమోవి యనుట, అనునివి, వ్యథాం=మనస్సునకుఁ బీడను, కుర్వన్తు నామ=కలిగించినఁ గలిగింపనీ - ఇచట ఉద్వృత్తాదివిశేషణములందు శ్లేషవలన నర్థాంతరములుగా ఉత్పథవృత్తి, చపలత్వము, నిలుకడలేమి, మాత్సర్యగ్రస్తత మొదలైన దుష్టలక్షణములు ప్రతిపాదింపఁబడుటచే నిట్టి దుష్టములైన స్తనభారాదులు వ్యథ కలిగించుట యొకయాశ్చర్యము కాదనుట - దుష్టులకు పరులను పీడించుట స్వాభావికము గాన నవి పీడించిన పీడించుఁగాక యని భావము. అయితే, పుష్పాయుధేన = (పువ్వు లాయుధముగాఁ గలయట్టి) మన్మథునిచేత, స్వయం=తనంత-తనచేతితోనే యనుట, లిఖితా=వ్రాయఁబడిన దైన, సౌ...పంక్తికేవ - సౌభాగ్య=సౌభాగ్యమును దెలుపునట్టి, అక్షరపంక్తికా ఇవ=పుణ్యవర్ణముల బంతివలె-అట్టివర్ణముల బంతియో యన్నట్లు ఉన్నట్టి యని యుత్ప్రేక్ష, సా=ఆ, రోమావలిః=ఆరు, మధ్యస్థా అపి=నడుమునందున్నదైనను: తటస్థమైనదిగా నున్నప్పటికిని అని యర్థాంతరము, కేన=ఎందుచేత, అధికం=మిక్కుటమైన, తాపం=తుందుడుకును, కరోతి=చేయుచున్నది - తటస్థులైనవార లెవ్వరికి సంతాపము చేయరుగాన విశేషించి తటస్థమైన యీ యారేల మనస్సును తపింపఁజేయుచున్న దనుట - ఇచట స్తనభారాదులకును రోమావళికిని శ్లేషచే నర్థాంతరములు కల్పించి యాయర్థములచే స్తనాదులనెల్లదుష్టులనుగాను రోమావళినిమాత్రము మధ్యవర్తియైనదిగానుఅలవరించి

దుష్టము లైన స్తనాదులకు మనస్సును బీడించుట తగును గాని మధ్యవర్తియైన యా రున కట్లు చేయఁదగదు. అయినను ఆరే యన్నిటికంటె నధిక తాపము చేయుచున్న దని యాశయము నిబంధించినాఁడు.

[ఇచటఁ బూర్వార్థమున శ్లేషభంగిని ఉద్వృత్తాదిపదార్థములు విశేషణగతి చేత, పీడించుట యనుపదార్థమునకు హేతువు లగుటచే పదార్థహేతుక కావ్యలింగ మలంకారము. ఉత్తరార్థమున మధ్యస్థపదార్థము శ్లేషభంగిచేత నే 'కేన సా తాప మధికం కరోతి' అను ఆక్షేపము అనెడి పదార్థమునకు హేతు వగుటచే పదార్థ హేతుక కావ్యలింగము మఱియొకటియుఁ జూపట్టుచున్నది. ఈ రెండవది 'సౌభా గ్యాక్షరపంక్తికేవ' అను ఉత్ప్రేక్షచే నపేక్షిత మగుటచే రెంటికిని సంకరము. మొదటి కావ్యలింగమున కివి యపేక్షితములు గామిచే సజాతీయసంసృష్టి యలంకార ము. దీనిచే స్తనభారాదులు లోకోత్తరలావణ్యసంపత్తి గలవనియు నత్యంత మోహన కరము లైనవనియు సూచితమగుచున్నది. ఆరును సౌభాగ్యాక్షరపంక్తికగా నుత్ప్రే క్షించుటచే నది నల్లనియక్షరములబంతివలె నిడుదగా సాఁగియుండుట సౌభాగ్యసూ చకమగుటయు దానినే 'స్వయంలిఖితా' అనుటచే అత్యంతమదనోద్దీపక మగుటయు నూహ్యము.

చ. గరువపుఁజన్నులుం బెళుకుఁగన్నులు నిల్కడలేనికన్బొమల్
మురియుచు నెట్టఁబాఱుగిజిగివోవియుఁ దాపముఁ జేయఁగాఁదగుఁ
స్మరలిఖితోరుభాగ్యలిపిజాల మనం దగి మధ్యవర్తి యై
పరఁగినరోమరాజియును బాయక తాపముఁ జేయ నేరమే. 15

తా. చనుగుబ్బలు (మిక్కిలివట్టువ లైనవి) త్రోవదప్పి నడచునవి. కన్నుఁ గవ(నీటుగా నిటునిటుచలించునది) చపలమైనది. కనుబొమ (విలాసపుఁద్రిప్పులు గ లది) నిలుకడలేనిది. చిగురుంగెమ్మోవియో (ఎఱుపుగిఱిగొన్నది) మత్సరము మిక్కిలి యుఁ గలది. ఇట్లివియెల్ల దుష్టము లగుటచే మనస్సును బీడించినఁ బీడించుఁగాక. మన్మథుఁడు తనచేతులార వ్రాసినపుణ్యాక్షరములబంతివలె నల్లనై నిడుదగాఁ జాఁగి సొంపు నింపుచున్నయారు తాను(నడుమునందున్నదైనను) మధ్యవర్తి గానున్న దైనను దుష్టులైన యా స్తనాదులకంటె నధిక తాపము చేయుచున్నది. ఇది యెట్లో తెలియరాదు.

శ్లో॥ ముఖేన చన్ద్రికాన్తేన మహానీలైః శిరోరుహైః।
కరాభ్యాం పద్మరాగాభ్యాం రేజే రత్నమయీవ సా॥ 16

టీ. చన్ద్రికాన్తేన=చంద్రునివలె మనోహరమైన: చంద్రకాంతిరూపమైన యని యర్థాంతరము, ముఖేన=ముఖముచేతను, మహానీలైః=మిక్కిలినల్లనైన: సింహళ

ద్వీపమునఁబుట్టు నింద్రనీలములైన యని యర్థాంతరము, శిరోరుహైః=కురులచేతను, ('సింహలస్యాకరోద్భూతా మహానీలాస్తు తేస్మృతాః' అని యగస్త్యులు.) పద్మరాగాభ్యాం=తామరలవలె నెఱ్ఱనైన: పద్మరాగమణులరూపమైన యనియర్థాంతరము, కరాభ్యాం=చేదోయిచేతను, సా=ఆసుందరి, రత్నమయీఇవ=రత్నరూపమైనదాని వలె-రత్నములచేతనే చేయఁబడినదానివలె, రేజే=విలసిల్లెను. ఇచట చంద్రకాంతాది శబ్దములకుఁ గల యర్థాతరములచేత చంద్రకాంతమణ్యాదుల నలవరించి యాసుందరి మణులచేతనే రచితమైన దని యుత్ప్రేక్షించినాఁడు. ఇచట శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్ష యలంకారము.

తే. మిగుల శశికాంత మైన నెఱమొగముచేత
నెఱి మహానీలకచము లైన నెఱులచేత
జలజరాగము లయినహస్తములచేత
రత్నమయ మనఁ గామినీరత్న మమరె. 16

తా. ఆముద్దుగుమ్మ నెమ్మొగము చంద్రకాంతము (చంద్రునివలె మనోహరమైనదనుట). దానికురులు మహానీలములు (మిక్కిలి నల్లనైనవనుట). దానికరములు పద్మరాగములు (తామరలవలె నెఱ్ఱనైనవనుట). కాఁబట్టి యది రత్నములచేతనే చేయఁబడినదో యన్నట్లు ప్రకాశించుచున్నది.

శ్లో॥ గురుణా స్తనభారేణ ముఖచన్ద్రేణ భాస్వతా।
శనైశ్చరాభ్యాం పాదాభ్యాం రేజే గ్రహమయీవ సా॥ 17

టీ. గురుణా=గొప్పదియైన: బృహస్పతిరూపమైన అని యర్థాంతరము-('గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భరే' అని శబ్దార్ణవము) స్తనభారేణ=చన్నుల బరువుచేత-నిబ్బరంపుగుబ్బచన్నులచేత ననుట, భాస్వతా=ప్రకాశముగల: సూర్యుని చేతను ('భాస్వాన్ భాస్కరసూర్యయోః' అని విశ్వము.) ముఖచన్ద్రేణ=ముఖమనెడి చంద్రునిచేతను-ఇచట 'భాస్వతా' అనుశబ్దముయొక్క మొదటియర్థము ముఖచంద్రునికి విశేషణము; రెండవయర్థము విశేషణముగాక తనంత వేఱై నవగ్రహములలో సూర్యుని నిర్దేశించుచున్న దని తెలియునది. శనైశ్చరాభ్యాం = మందగమనము గల : శనైశ్చరుఁ డను గ్రహముచేతను, పాదాభ్యాం = అడుగులచేతను - ఇందును శనైశ్చరశబ్దము మొదటియర్థము పాదములకు విశేషణ మనియు, రెండవయర్థము వేఱై శనిని నిర్దేశించుచున్న దనియుఁ దెలియునది, సా=ఆసుందరి, గ్రహమయీ ఇవ = గ్రహరూపమువలె - గ్రహము లనెడి సామగ్రిచేతనే రచింపఁబడినదో యన్నట్లు, అని యుత్ప్రేక్ష, రేజే = విలసిల్లెను -. ఇందును శ్లేషమహిమచే గురువు మొదలైన గ్రహములను అలవఱిచి యాస్త్రీని గ్రహమయిగా నుత్ప్రేక్షించినాఁడు. కాన శ్లేషసంకీర్ణమైన యుత్ప్రేక్షయే యిట యలంకారము. ఇట్లు రెండుశ్లోకములను

రత్నమయిగాను గ్రహమయిగాను నుత్ప్రేక్షించుటవలన లోకో త్తరములైన యాకార రూప లావణ్య సౌందర్య కాంతి విశేష భాగ్య సౌభాగ్యాదు లగు సకలకల్యాణగుణములచే మనోహరమై యుండుట సూచిత మగుచున్నది.

క. గురు వగుకుచభారంబును
సరసకళాభాస్వదాస్యచంద్రుండు శనై
శ్చరము లగుచరణములుఁ గల
కరిగమన దనర్చె నౌర గ్రహరూప మనన్. 17

తా. గుబ్బచనుంగవ గురువు (గొప్పది). మొగంబు చంద్రుండును భాస్వంతుండును (ప్రకాశముగలదియు). పాదములు శనైశ్చరములు (మందగమనముగలవి), కాఁబట్టి యాసుందరి గ్రహములచేత నే చేయఁబడ్డదో యనున ట్లున్నది.

శ్లో॥ తస్యాః స్తనౌ యది ఘనౌ జఘనం చ హారి
వక్త్రం చ చారు తవ చిత్త కి మాకులత్వమ్।
పుణ్యం కురుష్వ యది తేషు త వాస్తి వాఞ్ఛా
పుణ్యై ర్వినా నహి భవన్తి సమీహితార్థాః॥ 18

టీ. తస్యాః=ఆతరుణియొక్క, స్తనౌ=చన్నుఁగవ, ఘనౌ=గొప్పలైనవి-క్రిక్కిఱిసినవనుట, యద్యపి=అయినను, జఘనంచ=కటిపురోభాగమును, హారి=మనస్సును హరించునట్టిది, (యద్యపి=అయినను), వక్త్రంచ=మొగమును, చారు=సొగసైనది (అయినను), హేచిత్త=ఓమనస్సా, తవ=నీకు, ఆకులత్వం=ఆకులపాటు-కలఁత, కిం=ఎందుకు-ఇట్లు స్తనములఘనత్వము మున్నగువానింబట్టి యాకులపడుట వలన నాయాకులపాటు మాత్రమే కలుగును గాని మఱేమియుఁ గలుగదుగాన నది వలదని భావము. అయితే చేయవలసినదేమియన్నచో, తేషు=వానియందు - అస్తనాదులయం దనుట, తవ=నీకు, వాఞ్ఛాయది=కోరిక గలదేని, పుణ్యం=సత్కర్మమును, కురుష్వ=ఆచరింపుము. ఏలనఁగా, పుణ్యైః వినా=పుణ్యములులేక, సమీహిత అర్థాః=కోరినయర్థములు,న భవన్తి హి=కలుగవుగదా. జ్యోతిష్టోమాది సత్కర్మము లాచరించుటవలన రంభాసంభోగము కలుగునట్లు ఏదేని నొకపుణ్యావిశేషముచేత నీకును ఆతరుణితోడిసంభోగము కలుగఁగలదు గాన పుణ్య మాచరింపు మని భావము. అలం-అర్థాంతరన్యాసము.

చ. సుదతిపయోధరంబు లతిసుందరముల్ జఘనంబు రమ్య మా
వదనము హృద్య మంచుఁ జలవర్తన మేటికి నీకుఁ జిత్తమా
కదలక వానిపైఁ దలఁపు గల్గినఁ బుణ్యము లాచరింపు మిం
పొదవ లభించునే సుకృతయోగము లేక సమీహితార్థముల్. 18

తా. ఆలలనజిగిబిగిగుబ్బపాలిండ్లం జూచియు, మరులుగొలుపు దానికటిం జూచియు, ముద్దుగులుకుదానినెమ్మొగంబుఁ జూచియు, ఓమనసా! నీవూరక యాకుల పడుటవలనఁ బస యేమి? వానియందు నీకు సంభోగవాంఛకలదేని పుణ్యకర్మము లాచరింపుము. పుణ్యములు సేయనిచో వాంఛితార్థములు కలుగనేరవుగదా.

అవ. ఇఁక విలాసవర్ణనమును నిగమించుచున్నాఁడు.

శ్లో॥ ఇమే తారుణ్యశ్రీనవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాపప్రారమ్భాః స్మరవిజయదానప్రతిభువః।
చిరం చేతశ్చోరా అభినవవికారైకగురవో
విలాసవ్యాపారాః కిమపి విజయన్తే మృగదృశామ్॥ 19

టీ. తారుణ్య…మళాః-తారుణ్యశ్రీ=యౌవనపుసంపదయొక్క, నవ=క్రొత్తలైన, పరిమళాః=వాసనలైనవి-వాసనలవంటివి యనుట-వాసనలెట్లు తాము కలిగియున్నవస్తువులను బయలుపఱుచునో యట్లే యవియు జవ్వనంపుసొంపును వెలిపుచ్చునవి యనుట-లేక, తారుణ్యశ్రీయొక్క, నవ=అపూర్వమైన, పరిమళాః=సౌభాగ్యవిశేషము గలవి యనియు నర్థము-యౌవనముయొక్క యపూర్వసౌభాగ్యవిశేషమును సూచించునవి యని భావము, ప్రౌఢ…ప్రారమ్భాః - ప్రౌఢసురత=మిక్కుటమైనరతికేళియందలి, ప్రతాప=సామర్థ్యముయొక్క, ప్రారమ్భాః = ఉపక్రమములైనవియు-మరుకేళి నురవడిగాఁ జేయు నేర్పు క్రొత్తక్రొత్తగా నలవడుచున్నదనుటకు సూచకములైనవని భావము, స్మర…భువః=స్మర-(జగత్తులనెల్ల జయింపఁజూచు) మన్మథునికి, విజయ=గెలుపును, దానే=ఇచ్చుటయందు, ప్రతిభువః=లగ్నకములు-పూఁటకాఁపులైనవియు ననుట-ఒకరు చేయుపనిని తాను జేసియిచ్చునట్లు పూనుకొనువాఁడు పూఁటకాఁపు. మన్మథుఁడు సేయవలయు త్రిలోకజయమును దాము చేసియిచ్చుటచే నివి పూఁటకాఁపు లనఁబడెను. అప్పులకాఁపు లీయవలసినధనము తీసి యప్పిచ్చినవారలకు నిచ్చుపూఁటకాఁపువలె మన్మథునికిఁ గలుగవలసిన దిగ్విజయమును దామే కలిగించి యిచ్చు నని యాశయము, చిరం=చిరకాలమునుండి, చేతశ్చోరాః=మనస్సును దొంగిలునట్టివియు-మనస్సును చిరకాలము హరించి యుండునట్టివియు ననుట, అభినవ…గురవః-అభినవ వికార=క్రొత్తలైన యౌవనవికారములచేత-ఆకస్మికముగా బెదరుట, కంపించుట, ప్రియునిగుణచేష్టాదు లనుకరించుట మొదలైన యొలపరువంపువికారములచేత ననుట, ఏకగురవః మిక్కిలి గొప్పలైనవి-అట్టివికారములెంతయు నిండారియుండునవి యనుట-లేక, ఏకగురవః= ముఖ్యశిక్షకులైనవియు-అనఁగా పైపయిఁ గ్రొత్తక్రొత్త లగు శృంగారవికారములను ముఖ్యముగాఁ గఱపునట్టివియు నని యర్థాంతరము, అగు, మృగదృశాం=(లేడికన్నులవంటికన్నులు గల) జవరాండ్రయొక్క, ఇమే=ఈ-ఈ మునువర్ణింపఁబడినట్టి యనుట, విలాస

వ్యాపారాః=శృంగారచేష్టావిశేషములు, కిమపి=అనిర్వాచ్యముగా - ఇంలింతనరాని యట్లు, విజయన్తే=సర్వోత్కృష్టములై వర్తించుచున్నవి.

చ. కనఁదగు నిండుజవ్వనపుఁ గల్మికిఁ దావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు పుష్పధనుర్జయదానదక్షవా
ఙ్మనసిజచిత్తహారులు వికారనిదానము లైనకామినీ
జనులవిలాసకృత్యములు సంతతరమ్యతరంబు లెన్నఁగన్. 19

తా. లేడికన్నులవంటికన్నులు గలకులుకులాండ్రశృంగారంపుకలికిచెయ్వులు, వారి యెలపరువంపుసొంపును తొలుదొలుత వెలువరించునవియు, మరుకేళి నురవడిగాఁజేయు ప్రోఢతనము వారి కల్లల్ల నలవడుచుండుటకు సూచకములును, పూవిలుకానికి ముల్లోకంబుల గెలుపు నొడఁగూర్చి యిచ్చుటకుఁ బాఁటకాఁపులునై, మనంబు తద్దయుఁ గాలము చూఁఱగొని, పయింబయి నవయౌవనంపువికారములు మిక్కిలియు నిండార,గండరించి యెల్ల యెడల నింతింతనరాని యొఱపు మీఱి కలలు చున్నవి.

శ్లో॥ *ప్రణయమధురాః ప్రేమోద్గారా రసాశ్రయతాం గతాః
ఫణితిమధురా ముగ్ధప్రాయాః ప్రకాశితసంమదాః ।
ప్రకృతిసుభగా విస్రమ్భార్ద్రాః స్మరోదయదాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరన్తి మృగీదృశామ్॥ 20

టీ. ప్రణయమధురాః-ప్రణయ = స్నేహముచేత, మధురాః=తాపమును హరించునవియు, ('శీతలీక్రియతే తాపోయేన తన్మధురం స్మృతమ్' అనుటచే తాపము చల్లార్చునవి మధుర మనఁబడును),ప్రేమ ఉద్గారాః=అనురాగము గ్రక్కునవియు, రసా...గతాః-రస=శృంగారరసమునకు, ఆశ్రయతాం=ఆస్పదమై యుండుటను, గతాః=పొందినవియును-శృంగారరస మొలుకఁ గులుకు చూపునట్టివియు ననుట, ఫణితి మధురాః-ఫణితి=ఫక్కిచేత-మాటల కూర్చుపొందికచేత- సందర్భవిశేషముచే ననుట, మధురాః=మాధుర్యగుణముతోఁ గూడినవియు-అమృతప్రాయము లైన వనుట, ముగ్ధప్రాయాః= సౌకుమార్యముతో నెఱసినవియు - చెవుల కింపైన వనుట, ప్రకాశితసంమదాః= వెలిపఱుపఁబడిన సంభోగంపు తమి గలవియు - సంభోగంబునందలి తమిని వెలిపుచ్చున వనుట, ప్రకృతి సుభగాః = స్వభావముచేతనే యింపారునవియు, విస్రమ్భ ఆర్ద్రాః= విశ్వాసముచేఁ దడిసినవియు-నమ్మికతోఁ గూడు

---

*ప్రణయ మనఁగా 'విస్రమ్భపరమాకాష్ఠా మారూఢో యావనాదిభిః। యేనాన్తరజ్గం ద్రవతి సస్నేహ ఇతి కథ్యతే' యౌవనాదులచే మిక్కిలియు నెక్కుడుగా వర్థిలినదై యంతరంగమును గరఁగింపఁజాలునట్టి విస్రంభము (విశ్వాసము) స్నేహ మనఁబడును' అను స్నేహమే యగును.

టచే సరసములుగా నుండునవియు ననుట, కావునసే, స్మరో...దాయినః-స్మర ఉదయ=మన్మథుని పుట్టుటను - మారవికారము ననుట, దాయినః = ఇచ్చునట్టి వియు-జితేంద్రియుల కైనను మరులుకొలుపునట్టివియు ననుట, అగు, మృగీదృశాం=స్త్రీలయొక్క, రహసి=రహస్యమునందు, స్వైర ఆలాపాః=చనవుతోడి మాటలు-మంతనమునఁ జనవు మెఱసి యిచ్చమెయి నాడుమాట లనుట-నర్మోక్తు లని భావము, కిమపి=అనిర్వాచ్యముగా, ఇట్టట్టు అని చెప్పరానట్లు, హరన్తి = మనస్సును హరించునవి-మనోహరము లైనవి.

[ఇచట రెండు శ్లోకములందును శృంగారము చదువుచుండఁగానే ఆస్వాదింపఁబడుచుండుటచే లోపలను వెలుపలను స్ఫురించునదగుం గావున నిందు ద్రాక్షాపాక మని తెలియం దగును.]

చ. ప్రణయశ్రీమధురంబు లుజ్జ్వలరసప్రాచుర్యముల్ ప్రేమ భూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిరవిశ్వాసార్ద్రముల్ ముగ్ధముల్
ఫణితిశ్రావ్యము లంగజప్రభవముల్ ప్రాణేశ్వరీనర్మభా
షణముల్ నామదిఁ గొల్లలాడెడి రహస్యక్రీడలం దెప్పుడున్. 20

తా. తెలుకుంగన్నులపూవుఁబోండ్లు మంతనమునఁ జనవు మెఱసి యిచ్చమెయి నాడునునుఁబలుకులు, నెయ్యంబుచే తియ్యంబులై, వలపుసొంపుచే నింపుగులుకుచు శృంగారరసంబు నొలుకుచు, కూర్చుపొందికచే నమృతముచిందుచు, మెత్తందనమునఁ దళుకొత్తుచు, మరుకేళితమిఁ గొసరుఁజూపుచు, తమంతటఁ జెలువంబులై, నమ్మికచే మఱిమఱియిమ్ములై, మరులు మొలపించుచు, నింతింతని చెప్ప నలవికాని మనోహరము లగును.

ఇది శృంగారశతకమునందు స్త్రీప్రశంస మన్నది ప్రథమవింశతి.

---

## శృంగారశతకము – సంభోగవర్ణనము.

---

అవ. * సంభోగము విప్రలంభము అను శృంగారవిధముల లో సంభోగశృంగారమును సవిస్తరముగా మీఁద వర్ణించువాఁడై మొదట నొకశ్లోకముచే విప్రలంభశృంగారమును జెప్పుచున్నాఁడు.

* శృంగారము-సంభోగము విప్రలంభము అని ద్వివిధము. ఒండొరులఁ గలసియున్న స్త్రీపురుషులకుఁ గలుగునది సంభోగము. ఒండొరుల నెడఁబాసియున్న స్త్రీపురుషులకుఁ గలుగునది విప్రలంభము. కావున 'సంయుక్తయోస్తు సంభోగో విప్రలంభో వియుక్తయోః' అనఁబడినది. అందు సంభోగము ఒండొరులఁజూచుట, మాటా

శ్లో॥ విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసు తన్వీ విచచార కాచిత్।
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయన్తీ శశినో మయూఖాన్॥ 21

టీ. కాచిత్=ఒకానొక, తన్వీ=(కృశించినయంగముగల) స్త్రీ, వనే=వనమునందు, కరఉద్ధృతేన=చేతితోఁ బైకెత్తఁబడిన, స్తన ఉత్తరీయేణ=గుబ్బలగ్రాఁది వలువచేత-పయ్యెదచేతననుట, శశినః=చంద్రునియొక్క, మయూఖాన్=కిరణములను-అనఁగా వెన్నెలలననుట, నివారయన్తీ=అడ్డగించుచున్నదై - పైఁటచెఱంగుఁ బైకినెత్తి అడ్డముగాఁ బట్టుకొని వెన్నెల తనకుసోఁకకుండునట్లు వారించుకొనుచున్నదై యనుట, ద్రుమాణాం=చెట్లయొక్క, ఛాయాసు=నీడలయందు-వెన్నెలలులేని చెట్లక్రిందిప్రదేశములం దనుట, విశ్రమ్య విశ్రమ్య=విశ్రమించి విశ్రమించి-సారెసారెకు నలపుదీర్చుకొనుచుననుట, విచచార=సంచరించెను-వనములయందు విహరించుట విరహిజనుల కొకవినోదోపాయ మగుటచే నందు సంచరించెననుట - వీవనచే వేసవితాపమును వారించునట్లు పయఁటచెఱంగుచే వెన్నెలతాపమును వారించుకొనుచున్నదనుట, వెన్నెల విరహిణులకు సంతాపకర మగుటచే దాని నివారించుకొనుట చెప్పఁబడినది. †దశావస్థలు చెప్పుపక్షము ననుసరించినయెడల నిందు ఆఱవది యైన మన్మథావస్థయు నాలుగవది యగు జాగరావస్థయుఁ జెప్పఁబడినవి. పైఁటచెఱంగులోఁ

---

డుట, కౌఁగిలించుకొనుట, ముద్దిడుట మొదలైనవ్యాపారము లనంతముగాఁ గలిగి యుండుటచే నది వేర్వేఱుగ విభాగించుటకు శక్యముగాక యంతయు నొక్కవిధముగానే గ్రహింపఁబడెడిని. విప్రలంభము- అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసము అనెడినాలుగుహేతువులచే నాలుగువిధములుగా గ్రహింపఁబడుచున్నది. అభిలాష మనఁగా సంభోగమునకు మునుపు గలుగునను రాగము. ఈర్ష్యయనఁగా నాయకుఁడు మఱొక స్త్రీయందు ఆసక్తుఁడై యుండుటచేఁ గలుగు చిత్తవికారము. విరహమనఁగా మున్ను కలిసిన నాయికానాయకులకు మఱల నొకకారణముచే కూడిక కలుగనీయని యెడఁబాటు. ప్రవాస మనఁగా దేశాంతరమునం దుండుట. ఈనాలుగింటిచే విప్రలంభము నాలుగువిధము లగును.

† ఈ శృంగారమునకు అంకురితత్వ (మొలకెత్తుట), పల్లవితత్వ (చిగుర్చుట), కుసుమితత్వ (పూచుట), ఫలితత్వము (పండుట) లను గలిగించు నవస్థలు కొందఱు పండ్రెండనియు మఱికొందఱు పదియనియుఁ జెప్పుదురు. 'చక్షుఃప్రీతి ర్మనస్సంగస్సంకల్పోఽథ ప్రలాపితా। జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః। ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః॥' కంటికిఁ బ్రీతిగలుగుట, మనస్సు తగులుపడుట, తలంచుచుండుట, ప్రలాపించుట, నిదురతప్పుట, మేను చిక్కుట, అరతి, సిగ్గువిడుచుట, కాఁకపుట్టుట, మతి భ్రమయుట, సొమ్మసిలుట, మరణము అని కా

చంద్రకిరణములు నివారింపరా దనువివేకము లేమిచే చిత్తవిభ్రమము తెలియుచున్నది గాన కామశాస్త్రప్రోక్తద్వాదశావస్థలయందు పదియవదియైన ఉన్మాదావస్థ సూచితమగుచున్నది. తన్వీ అనుటచే కార్శ్యావస్థయుఁ జెప్పఁబడినది. *ఇందు నాయిక విరహోత్కంఠిత.

చ. విరహకృశాంగి యైనఘనవేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందు నుచితంబుగ నూటికి విశ్రమించి బం
ధురగతి సంచరించెఁ జనుదోయిని బయ్యెదకొంగుఁ గేలఁ దా
వెరవుగఁ బూని యగ్గలపువెన్నెలకాఁక దొలంగఁజేయుచున్. 21

---

మశాస్త్రప్రోక్తము లైన ద్వాదశావస్థలు. 'దృఙ్మనస్సంగసంకల్పా జాగరః కృశతా రతిః। హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ' అని, ప్రలాపము అరతి అనురెండవస్థలను విడిచి తక్కినదశావస్థలు చెప్పఁబడినవి.

* శృంగారరసాలంబనభూతు లగునాయకులు-అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నాలుగువిధముల నుందురు. ఒక్కతరుణియందే మిక్కిలి యనురక్తుఁ డైనవాఁడు అనుకూలుఁడు. అనేకనాయికలందు భేదములేక సమానమైన యనురక్తిగలిగియుండువాఁడు దక్షిణుఁడు. తాను జేసిననేరము నాయికకుఁ దెలుపుచు భయములేకుండువాఁడు ధృష్టుఁడు. నాయికకు మాత్రము తెలియుగూఢవిప్రియమును జేసినవాఁడు శఠుఁడు. ఇదియే 'ఏకాయత్తోఽనుకూలః స్యాత్తుల్యోఽనేకత్ర దక్షిణః వ్యక్తాగా గతభీ ర్ధృష్టో గూఢవిప్రియకృచ్ఛఠః' అని చెప్పఁబడినది. నాయికలు-స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కణ్ఠిత, విప్రలబ్ధ, ఖణ్డిత, కలహాన్తరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అని యెనిమిదివిధములు. ప్రియునిచే నెప్పుడు నుపలాలింపఁబడునది స్వాధీనపతిక. ప్రియుఁడు వచ్చువేళయందు కేళీగృహమును దన్నును మాటిమాటికి నలంకరించునది వాసకసజ్జిక. ప్రియుఁడు రాక తడవుసేసె నేని మనసున నారటపడునది విరహోత్కంఠిత. పురుషుఁ డొకసంకేతపుఁజోటు చెప్పి రాక వంచనసేయఁగా మిగుల మదనార్తిం గుందునది విప్రలబ్ధ. ప్రియుఁడు మఱొకతరుణికడకు రాత్రి పోయియుండి దానితోడిసంభోగపుచిహ్నములతో వేకువ తనకడకు రాఁగా కోపించునది ఖండిత. కోపముచే మును ప్రియుని పరుషములాడి పశ్చాత్తాపపడునది కలహాంతరిత. ప్రియుఁడు దేశాంతరమునం దుండుటచే దుఃఖించునది ప్రోషితభర్తృక. మదనార్తిచే తాను గోరినచెలువునికడకుఁ దానై వేసాదులుదాల్చి పోవునది అభిసారిక. నాయికలకు పద్మిని, చిత్తిని, హస్తిని మొదలైనజాతులు కామశాస్త్రప్రోక్తములు. సంక్షేపమున నాయికలు - ముగ్ధ, మధ్య, ప్రౌఢ యని ముత్తెఱంగులు మున్ను వివరింపంబడియె.

తా. ఒకవనములో నొకానొకతీఁగబోఁడి విరహతాపముచేఁ గృశించిన మేనితో వేడుకగా నుబుసుపోకకై విహరింపవచ్చి యందు నిచ్చలు గాయు పండువెన్నెలవేఁడిమికిఁ దాళంజాలక పైఁటచెఱంగు నెత్తి యది తనపు సోఁకకుండునట్లు అడ్డముగాఁ బట్టుకొనుచు వెన్నెలలు లేనిచెట్లయడుగునీడలయందు మాటికిమాటికి నలపుదీర్చుకొనుచు నందుఁ దిరుగుచుండెను.

అవ. ఇఁక సంభోగశృంగారము. అది *బాహ్యము ఆభ్యంతరము అని రెండువిధములు. అందు ఆలింగనాదిరూప మైన మొదటి విధమును సపరికరముగా రెండు శ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అదర్శనే దర్శనమాత్రకామా
దృష్ట్వా పరిష్వఙ్గసుఖైకలోలాః ।
ఆలిఙ్గితాయాం పునరాయతాక్ష్యా
మాశాస్మహే విగ్రహయోరభేదమ్ ॥ 22

టీ. పురుషులు అనుకర్త యిచట అధ్యాహార్యము. అదర్శనే=దర్శనములేనపుడు-ఒకకాంతను చూచుట కలుగనపుడనుట, దర్శ...కామాః దర్శనమాత్ర-చూచుట యందుమాత్రము, కామాః=కోరిక గలవారు-ఒకచెలువ కంటికిఁ గనఁబడకుండఁగా దానిం జూచునంతమాత్రమేని కలిగినఁ జాలునని కోరుచుండువారనుట, అగుదుము అని శేషము, పిదప, దృష్ట్వా=చూచి-దైవికముగా దానిని చూడఁగలిగినా యనుట, పరి...లోలా_పరిష్వఙ్గ=కౌఁగిలించుటయొక్క-కౌఁగిలించుటచేఁ గలుగునట్టి, సుఖ=సుఖమునందు-('రస' అనుపాఠమున కౌఁగిలింతయందలిప్రేమయం దని యర్థము), ఏక=ముఖ్యముగా-మిక్కిలియనుట, లోలాః=తమకముగలవారము, అగుదుము, పునః=అయితే, ఆయత+అక్ష్యాం=(నిడువాలుకన్నులు గలయా) చెలువ, ఆలిఙ్గితాయాం (సత్యాం)=కౌఁగిలింపఁబడినది అగుచుండఁగా, మేము, విగ్రహయోః=దేహములయొక్క-దానియొక్కయు మాయొక్కయు దేహములు రెంటియొక్క, అభేదం=వేఱుపాటు లేకుండుటను, వేఱువేఱుకాక ఒక్కటియే యై యుండుటను, ఆశాస్మహే=కోరుచున్నారము-దైవికముగా ఆలింగనము సైతము కలిగెనేని అవి మరల కలుగక పోవునేమో యనుభీతిచే నిరువురదేహములు రెండును ఎప్పుడు నొక్కటియే యై యుండునా యని యువ్విళ్లూరుదు మనుట.

[ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో నబాహ్యం కిఞ్చన వేద నాన్తరమేవాయం

---

* వాత్స్యాయనుఁడు వీనికే మఱియొకరీతిని రెండుభేదములు 'బాహ్యమాభ్యన్తరం చేతి సురతం ద్వివిధం స్మృతమ్ । తత్రాద్యం చుమ్బనాశ్లేషనఖదన్తక్షతాదికమ్। ద్వితీయం సురతం సాక్షాన్నానాకరణకల్పితమ్' అని చెప్పియున్నాఁడు.

పురుషః' ప్రియురాలగు చెలువచేఁ గౌఁగిలింపఁబడిన యీపురుషుఁడు వెలుపలివస్తు వు దేనినిగాని లోపలివస్తువునుగాని యెఱుఁగఁడు'ఇత్యాదిశ్రుతులవలన, ప్రియతముల బిగికౌఁగిలింతలవలన మఱి వేఱెద్దియుఁ దెలియకుండునట్లు చొక్కించు బ్రహ్మానం దముతో సాటియైన మహాసుఖవిశేషము కలుగుటచే నట్టి గాఢాలింగనముం గోరుట యుక్తమే యని భావము. ఇదియే రతిరహస్యమున 'తత్సౌఖ్యం పరతత్త్వవేదనమహా నన్దోపమం మూఢధీః। కోవా నిన్దతి సూక్ష్మమన్మథకలావైచిత్ర్యమూఢో జనః' పర తత్త్వమును దెలియుటచేఁ గలుగు మహానందముతో సాటియైనయాసౌఖ్యమును సూ క్ష్మము లగుమన్మథవిద్యయందలి విన్నాణములను దెలియని మూఢమతి యెవఁడు నిం దించునో' అని చెప్పఁబడియున్నది. ఇందే యింకొకచోట 'ప్రౌఢాలిఙ్గనచుమ్బనా మితసుఖం ప్రచ్ఛన్నవేద్యాన్తరమ్' అని కాననగు.]

ఉ. బాలిక నన్నుఁ గన్గొననిశపట్టున దర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచుఁ గోరె మఱిశచక్కఁగఁ గన్నుల నన్నుఁ జూచి ప్రో
యాలు కవుంగిలింపవలెశ నంచుఁ దలంచెఁ దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న నిరుశమేనులు నొక్కటి సేయఁగోరితిన్. 22

తా. ఒకవగలాడిని జూడకుండునంతవఱకు దానిం జూడనైనఁగలుగునాయని కోరుచుందుము. దైవికముగా దానిని జూడనోచితిమా దానిని బిగియారఁ గవుంగి లించి చొక్కఁ గలుగునా యని యువ్విళ్లూరుచుందుము. అదృష్టవశమున నా వాలుగంటిని బిగియఁ గవుఁగిలించుకొనుటయుఁ గలిగెనా యిఁక నిట్టిమహాసుఖము మరలం గలుగునో కలుగదో యను విరహభీతిచే మాయిద్దఱదేహములును వేఱువేఱు గాక యొక్కటియే యై యెప్పుడు నుండునా యని కోరుదుము. వగలాండ్రతోడి సుఖము మితిలేనిది గాన యెంత యనుభవించినను దృప్తి కలుగదు.

అవ. ఇట్లు పరమానందసంధాయక మగుటచే స్త్రీలయాలింగ నము అపవర్గమే యగునని చెప్పి యిప్పు డదియే స్వర్గమనుచున్నాఁడు.

శ్లో॥ మాలతీ శిరసి జృమ్భణోన్ముఖీ, చన్దనం వపుషి కుఙ్కుమావిలమ్।
వక్షసి ప్రియతమా మనోహరా, స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః ॥ 23

టీ. శిరసి=తలయందు, జృమ్భణ + ఉన్ముఖీ-వికసించుటయందు ఆసక్తి గల-వికసింప నారంభించినట్టి యనుట, మాలతీ=(జాజి-పూదండయు ననుట, 'జృమ్భ ణంము ఖే' అనుపాఠమున యౌవనంపుమదముచే మోమునంగలుగు ఆవులింత యనిగాని సంభోగంపుఁదమిని జూపు రాగవిలాసస్ఫూర్తి యనిగాని యర్థము. ఇది మిక్కిలి విర సము), వపుషి=దేహమునందు; కుంకుమ + ఆవిలం=కుంకుమపూవుతో మెదిచిన,

చన్దనం=గంధమును-దానిపూఁతయు, వక్షసి=ఱొమ్మున, మనోహరా=చక్కనిదైన, ('మదాలసా' అనుపాఠమున యౌవనంపు మదముచే మందవ్యాపారములు గల-అనఁగా జవ్వనంపుపెంపుచే మత్తిలి లీలమై నల్లలమెలఁగునట్టి యని యర్థము), 'ప్రియతమా=చెలువయు-అక్కున బిగియఁ గౌఁగిలింపబడియున్న చెలువంపుతరుణియు ననుట, ఏష=అనెడి యిది-మాలతి మొదలైన యీమూఁటియొక్క సముదాయ మనుట, పరిశిష్టః=పుణ్యావశిష్టమై-పుణ్యముచే అనుభవింపఁగా మిగిలినదై, ఆగతః=ఈభూలోకమునకు వచ్చినట్టి, స్వర్గః=స్వర్గము, పుణ్యవిశేషముచేఁ జాలవలకు స్వర్గమును అనుభవింపఁగా అందుఁ గొంత మిగిలి యీభూలోకమునం దనుభవింపఁబడుటకు వచ్చిన (స్వర్గ) భాగమే యీమాలత్యాదు లని యాశయము. ['పరిశిష్ట ఆగమః' అనుపాఠమున ఈమాలత్యాదులు మూఁడే స్వర్గ మగును. ఇవితప్ప వేఱైనదానిని స్వర్గముగాఁ జెప్పు ఆగమ (శాస్త్రి) ము అముఖ్యమైనది-అనఁగా స్వర్గపదమునకు ముఖ్యార్థమైన యీమాలత్యాదులను జెప్పక మఱి యేయర్థమునో చెప్పున దని యర్థము. ఈపాఠము అంతగా సరసముకాదు]. తలను జాజిదండ దాల్చుట మున్నగునవి స్వర్గసమానసుఖప్రదము లని యాశయము.

చ. తలపయి మాలతీకుసుమదామము నెమ్మెయిఁ గుంకుమంబుతోఁ
గలసినకమ్మదావి విరిగంధపుఁబూఁత వెడందఱొమ్మునం
దలికులనీలకుంతలమదాలసనీలసరోరుహాక్షియుం
గలుగుట నింద్రభోగ మనఁగాఁ దగదే మఱి వేఱె యున్నదే. 23

తా. సిగయం దప్పుడువికసించుచున్న జాజిపూదండయు, మేనియందు కుంకుమపూవైచి మెదిచినచందనంపుఁబూఁతయు, నక్కున బిగికౌఁగిలియందు నెలకొన్న జక్కవగుబ్బలాఁడియు ననెడి యీమూఁడును, మిగతపడి రాఁగా నిం దనుభవింపఁబడుస్వర్గమే కాని వేఱుకావు.

అవ. ఇఁక ఆభ్యంతరసంభోగమును వర్ణింప నుపక్రమించుచున్నాఁడు.

శ్లో॥ ప్రాఙ్మామేతి మనాగనాగతరసం జాతాభిలాషం తతః
సవ్రీడం తదను శ్లథీకృతతను ప్రత్యస్తధైర్యం పునః ।
ప్రేమార్ద్రం స్పృహణీయనిర్భరరహఃక్రీడాప్రగల్భం తతో
నిశ్శఙ్కాఙ్గవికర్షణాధికసుఖం రమ్యం కులస్త్రీరతమ్ ॥ 24

టీ. ప్రాక్=మొదట, మనాక్=కొంచెముగా, మామా ఇతి=వద్దువద్దు అని-అడ్డగింపఁబలుకులచేత ననుట, అనాగతరసం=రానట్టి (అనఁగా పుట్టని) అను

రాగవిశేషము గలదియు-బేలతనముచే నింకను అనురాగము పుట్టనందున వలదువలద నునడ్డగింపుఁబలుకులతోఁ గూడియుండున దనుట, ('అమానితగుణమ్' అనుపాఠమున కొంచెము నెన్నంబడనిగుణములుగలదియు-గుణములు లెస్సగా నెఱుంగఁబడనిదియనుట, ఈపాఠము సరసము కాదు); తతః=పిమ్మట-అడ్డగింపుమాటలకుఁ బిదప ననుట, జాత+అభిలాషం=అంకురించినకోరిక గలదియు-మొదట నడ్డగింపుఁబలుకు లాడి తీరినవెనుక రతియందు కొంతకోరిక మొలకెత్తె ననుట, తదను=దానివెంట-ఆకోరిక గలిగినపిమ్మట, సవ్రీడం (యథా తథా)=సిగ్గుతోఁ గూడునట్లుగా, శ్లథీకృతతను=ప్రిదులఁజేయఁబడినమేను గలదియు-అవయవములు ముడుఁచుకొనియుండి రతియందుఁ గోరిక యుదయింపఁగా మేనిని రతి కనుగుణముగాఁ బ్రిదులఁజేయు ననియు నట్లు సేయునప్పుడు లజ్జ తలసూపు ననియు భావము. ('సవ్రీడం తదను శ్లథోద్యమ మథ' అనుపాఠమున, తదను=పిమ్మట-కోరిక యుదయించిన పిదప, సవ్రీడం=సిగ్గుతోఁ గూడినదియు-చెలువకుఁ గోరిక యుదయింపఁగాఁ బురుషుఁడాకీ లెఱింగి పోకముడి వదల్చుట మొదలైనవ్యాపారములు సేయునపుడు దానికి నునుసిగ్గు మీఱు ననుట, అథ=సిగ్గు గలిగినపిమ్మట, శ్లథ+ఉద్యమం=ప్రిదిలినపూనిక గలదియు-పురుషుని నడ్డగించుపూనిక బిగి వీడినది యనుట-సిగ్గు గలిగియుండఁగా నడ్డగించుపూనిక బిగి యెచ్చునే కాని తగ్గునా యన్నచో సిగ్గుకంటెఁ గోరిక యెక్కుడుగా నుదయించి యుండుటచే నాసిగ్గు విఘ్నకారి గాదయ్యె నని తెలియునది-ఈపాఠ మంతగా సరసము గాదు.) పునః=పిదప, ప్రత్యస్తధైర్యం=నశించినధైర్యము గలదియు-అడ్డగించువిట్టతనము మానినది యనుట, 'ప్రధ్వస్తధైర్యమ్' అనుటకును ఇదియే యర్థము, ప్రేమ+ఆర్ద్రమ్=ప్రణయరసముచేఁ దడిసినదియు-నెయ్యముచే సరస మైనదియు ననుట, స్పృహ...గల్భం-స్పృహణీయ=ఒండొరులు కోరఁదగినవియు, నిర్భర=మిక్కుట మైనదియును అగు, రహః క్రీడా=ఏకాంతకేళికలయందు-ఏకాంతమున సిగ్గు విడిచి కోరికలు ప్రబ్బి నిబ్బరముగా సలుపు విహారాదివ్యాపారములయందనుట-ప్రగల్భం=ప్రౌఢ మైనదియు-ఆఱితేఱినదియు ననుట, తతః=దానికిఁ బిదప, నిశ్శఙ్క...సుఖం—నిశ్శఙ్క=జంకులేని, అఙ్గ=కుచాద్యవయవములయొక్క, వికర్షణ=మర్దనముచేత-ఒండొంటితోడి యొరపిడిచేత ననుట, అధికం=మిక్కిలి యైన, సుఖం=పరమానందము గలదియు-ఏకతమున నిచ్చలు గలసి మెలసి విహారాదులు సేయుటయందు నేర్పు ముదిరినపిదప జంకు విడిచి యొండొరులతో నణఁగి పెనఁగి చేయుకూటువలయందు కుచాద్యవయవముల యొరపిడివలన మిక్కిలియుం బుట్టుమహాసుఖము గలదియును, అగు, కులస్త్రీరతమ్=కులకాంతలతోడి-(అనఁగా స్వస్త్రీలతోడి)సంభోగము-తమతమ పత్నులతోడిరతి యనుట, రమ్యం=మిక్కిలియు మనోహర మైనది, ఇచట 'మామా' అను నిషేధవచనము లాడుట మొదలుకొని 'నిశ్శఙ్కాఙ్గవికర్షణ' మను గాఢకేళియందుఁ జొక్కుటవఱకుఁ గల సురతవ్యాపా

రములు వర్ణింపఁబడిన క్రమమునుంబట్టి యిది ప్రథమసమాగమపర మైన దని తెలియు నది, కావున న్నిట్టివ్యాపారక్రమము కలుగును. ఇందలి నాయిక ముగ్ధ. నాయకుఁడు ఉత్తముఁడును గామతంత్రనిపుణుఁడును అగు అనుకూలుఁడు. అట్టివాఁడు గాకున్న, నీచెప్పఁబడినక్రమమున చతురముగా నాలలనను గరఁగించి చొక్కించుట కలుగదు. సంభోగము రతిరహస్యమున 'అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ। దర్శనస్పర్శనాదీని ససంభోగ ఉదాహృతః' 'విలాసు లగువురు అనుకూలురై యొండొరులను దర్శనస్పర్శనాదులచే మిక్కిలి సేవించుటయే సంభోగము' అని చెప్పఁబడినది. మఱియు నిందు 'మామా' అను పలుకులచే సూచితములైన యనుభావములచేతను, 'జాతాభిలాషమ్' అని చెప్పఁబడిన రతి యనెడి స్థాయీభావముచేతను, సవ్రీడం' అనుటచే నుపలక్షితము లగు వ్యభిచారిభావములచేతను, తక్కుంగల విశేషణములచే నూహ్యములైన యాయా యనుభావాదులచేతను, 'నవ స్త్రీ' అని చెప్పఁబడిన యాలంబనవిభావముచేతను, ప్రతీయమానమైన రసలలామ మగుశృంగారము 'నిశ్శఙ్కాఙ్గవికర్షణాధికసుఖమ్' ను పరిపోషాతిశయము పొందుటను తెలియు నది.

ఉ. ఆది మితాదరంబు తదనంతర మంచితరాగ మంత ల
జ్జోదయరమ్య మంత శిథిలోద్యమ మంత నితాంతధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము విశేషవివిక్తవిహార మంత నా
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే. 24

తా. ఇల్లాలితో మొట్టమొదట మరుకేళిం గూడునపుడు తొలుత రసం బుప్పతిల్లకుండుటచే వలదు వల దని యడ్డగింపుఁబలుకు లాడును. పిదపఁ గవగూడుటకుఁ గోరికగలది యగును. అట్టికోరిక కలిగినపిదప మున్ను బిగియ ముడుఁచుకొన్న యవయవములను అగ్గలంపుసిగ్గు మీఱ మరుకేళి కనుగుణముగా సడల్చును. పిదప రసము పైకొనఁగా తాలిమి యిసుమంతయు లేక తూలును. ఇట్లు తాలిమి దూలఁగా ప్రేమరసం బెసలార నోలుకును. పిమ్మట మంతనమున నిచ్చలు గలసి మెలసి లీలావిహారాదిక్రీడలుసలుపు నెఱజాణయై రాణించును. అనంతరము ఆవంతయు జంకును గొంకును లేక బిగిగుబ్బలు మున్నుగువాని నదిమి గదిమి యింతింతనరాని యానందమున నోలలార్చును. కావున యిట్టికులకాంతతోడిమరుకేళియే యెంతయు మనోహరము.

అవ. వాత్స్యాయనుఁడు 'ద్వితీయం సురతం సాక్షా న్నానాకరణకల్పితమ్' అని అభ్యంతరసురతమును నానాకరణకల్పితముగా (అనఁగా నానాబంధవిరచితముగాఁ) జెప్పినాఁడు. ధేనుకము మొదలైన యాబంధవిశేషములలో నొకబంధమును (అనఁగా పురుషాయితమును)

జెప్పఁబూని దాని కనుకూలమైన యుపరిసురతమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకులితనయనానాం కిఞ్చిదున్మీలితానామ్।
ఉపరిసురతఖేదస్విన్నగణ్డస్థలానా
మధరమధు వధూనాం భాగ్యవన్తః పిబన్తి॥ 25

టీ. ఉరసి=ఱొమ్మునందు, నిపతితానాం=వ్రాలినవారును-పురుషాయితబంధవశమున ప్రియునిఱొమ్మున వ్రాలియున్నవారు ననుట, కావుననే, స్రస్తధమ్మిల్లకానాం=జాఱినకీలుగంటు గలవారును=పురుకేళిసేయు నురవడివలన ముడిపిడినకీల్గంటుగలవారనుట, ముకులితనయనానాం= మోడ్పఁబడినకన్నులు గలవారును-సుఖపారవశ్యమువలనఁగాని లజ్జానుభావము ననుకరించుటవలనఁగాని కన్నుఁగవ మోడ్చియున్నవా రనుట, అట్లు మోడ్చినప్పటికిని, కిఞ్చిత్ ఉన్మీలితానాం=కొంచెము కన్నులు తెఱచియున్నవారును-కన్నుంగవ యరమోడ్చినవారనుట, కన్నులు పూర్ణముగా మొగుడ్చుట పురుషాయితమునకు అనుచితముగాన యరమోడ్పు చెప్పఁబడినది, కాఁబట్టియె, ఉపరి...స్థలానాం-ఉపరి సురత=పైపయిం జేయు రతియందలి, ఖేద=శ్రమచేత, స్విన్న=చెమర్చిన, గణ్డస్థలానాం=చెక్కిళ్లప్రదేశములు గలవారును, ('శ్రమః ఖేదోఽపి రత్యాదేర్జాతః స్వేదాదిభూమికృత్' అని ఖేదలక్షణము) అగు,వధూనాం=చెలువలయొక్క, అధరమధు=అధరామృతము-మోవిపానకమును, భాగ్యవన్తః=భాగ్యముగలవారు, పిబన్తి=గ్రోలుదురు, *పురుషాయితమున స్త్రీముఖము తమముఖమున కెదురైయుండుటంజేసి యనాయాసముగాఁ గెమ్మోవి నొక్కుదురని యర్థము. ఇట్టిసుఖము పుణ్యాత్ములకేకాని తక్కినవారికిఁ గలుగదుగాన 'భాగ్యవన్తః' అనఁబడియె. ఇచట చుంబనము బాహ్యరతవిశేషమయ్యును నది ఆభ్యంతరమునకు అంగముగాఁ జెప్పఁబడిన దని తెలియునది. ఇచట నాయికలు ప్రౌఢలు; నాయకులు కామతంత్రకుశలు లైన యనుకూలురు. అలం. స్వభావోక్తి.

ఉ. అక్కున వ్రాలి కొప్పు విడి యల్లల నాడఁగఁ గన్నుఁదామరల్
చక్కఁగ మోడ్చి చొక్కి పురుషాయితసంజనితశ్రమంబునం
జెక్కుల ఘర్మబిందువులు చిందఁగ విం దొనరించుబోంట్లమే
ల్చొక్కపుమోవితేనె చవిఁ జూతురు భాగ్యముఁ గల్గునేర్పరుల్.

---

*'స్వేచ్ఛయా శ్రమిణీ వల్లభే తథాయోషి దాచరతిపూరుషాయితమ్' ప్రియుఁడు అలసిసొలసియుండఁగా స్త్రీ తనయిచ్ఛగా పైకొని యతనివలె రతి నాచరించుట పురుషాయితము; అని రతిరహస్యము.

తా. ప్రియుని బొమ్మన బిగిగుబ్బలు గ్రుమ్మచు వ్రాలి, మరుకేళియురవడిని మీటారించు కీలుగంటు బిగివీడ, నక్కజంపుఁజొక్కున వాలుఁగన్నుఁగవ లరమొ గుడ, నుపరిసురతంబున నలసి సొలసి నిద్దంపుఁజెక్కులు చెమర్పఁ, గొమరారునట్టి ముద్దుగుమ్మల కెమ్మోవి తేనియలం గ్రోలుట పుణ్యాత్ములకే కలుగునుగాని తక్కితరు లకుఁ గలుగదు.

అవ. జ్ఞానపూర్వకముగాఁ జేయు సురతానుభవమే సార్థకము గాని తక్కినది కాదనుచున్నాఁడు.

శ్లో॥ ఆమీలితనయనానాం, యః సురతర సోఽను సంవిదం భాతి।
మిథునైర్మిథోఽవధారిత, మవితథమిదమేవ కామనిర్వహణమ్॥26

టీ. ఆమీలితనయనానాం=(చొక్కి) ఒక్కింతమోడ్చినకన్నులు గలవారి యొక్క, యః=ఏ,సురతరసః=సురతముయొక్క ఆస్వాదము-రతికేళియొక్క చవి, సంవిదం అను=జ్ఞానమును అనుసరించి-తెలివియుం దింపై నెలకొని యనుట, భాతి= ప్రకాశించునో-ఇది యిట్టిది యని తెలివితో ననుభవింపఁబడునో, ('భవతి' అనుచో కలుగునో యని యర్థము) ఇదమేవ=ఇదియే-ఇట్టిసురతానుభవవిలసనమే, అవితథం= వ్యర్థముకాని-సార్థకమైనట్టి యనుట, కామనిర్వహణమ్-కామ=మన్మథునియొక్క- లేక, కామపురుషార్థముయొక్క, నిర్వహణం=ప్రతిష్ఠాపనము-ఉజ్జీవనమనుట-ఇట్టిది కానట్టి తక్కినసురతము కామోజ్జీవనము కాదనుట, అని, మిథునైః=స్త్రీపురుషు లిరువురచేత, మిథః=అన్యోన్యముగా, అవధారితం=నిశ్చయింపఁబడినది. అనుభవము గలవారికే విషయము ఇట్టి దని నిర్ణయింపఁ గలుగును గాన అట్టిసురతరస మనుభ వించు స్త్రీపురుషులకే యది యిట్టిదని నిర్ణయింపఁగలుగుననిభావము. రతిపారవశ్య మునఁ గన్ను లరమోడ్చి తెలివితో మనంబున సురతంపుచవి ననుభవించుటయే కామ పురుషార్థము సిద్ధించుట యని భావము. ఇట్టి సురతరసము ననుభవింపనియెడల కామపురుషార్థ మొడఁగూడినది కానేర దని యాశయము.

తే. కన్ను లరమోడ్చి విహరించుచున్న వారి
సురతభోగంబు తెలివితోఁ దెలియఁగనేని
రమ్య మగునది కామనిర్వహణ మనుచు
నాయికానాయకులకు నిర్ణయము గాదె. 26

తా. మరుకేళిపారవశ్యమునఁ జొక్కి కన్ను లరమోడ్చి యువయువతీజను లే సురతంపురసమును తెలివితో తమమనంబుల ననుభవింతురో అదియే కామపురుషార్థ ముయొక్క సిద్ధి యని తద్రసజ్ఞులైన స్త్రీపురుషులచే పరస్పరము నిశ్చయింపఁబడి యున్నది.

అవ. సురతకాలావధిని జెప్పుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ ఇద మనుచిత మక్రమ శ్చ పుంసాం
యదిహ జరాస్వపి మాన్మథా వికారాః।
యదపి చ న కృతం నితమ్బినీనాం
స్తనపతనావధి జీవితం రతం వా ॥ 27

టీ. ఇహ=ఇందు-ఈలోకమం దనుట, పుంసాం=పురుషులకు, జరాసు అపి=వార్ధకదశలయందును-ముసలితనమునం దనుట, మాన్మథాః=మన్మథునిసంబంధించిన-మన్మథకృతము లైన, వికారాః=వికారములు-సురతవ్యాసంగము లనుట (కృతాః=చేయఁబడినవి అని శేషము), (ఇతి) యత్=అని యేదియో, నితమ్బినీనాం=స్త్రీలకును, స్తన...వధి- స్తన=గుబ్బలయొక్క, పతన=పడుట-సోలుట, అవధి=మేరగా-కడపలగాఁ గల-చన్నుఁగవ బిగివీడునంతవఱకుమాత్ర ముండునట్టి యనుట, జీవితంవా=బ్రతుకుగాని, రతంవా=సురతముగాని, నకృతం=చేయఁబడదు, (ఇతి) యదపి=అనునది యేదియో, ఇదం=ఇది-అనఁగా మగవారలకు ముదిమి గలిగినప్పుడు సైతము వలపుచిన్నెలు కలిగించుటయు, నాఁడువారిని గుబ్బలబిగి వీడకుండునంత వఱకే బ్రతికియుండునట్లు గాని రతి సలుపునట్లుగాని చేయకపోవుటయు ననెడి యీరెండును, అనుచితం = తగనిది, అక్రమశ్చ = క్రమమునుగానిది-మర్యాదమీఱిన దనుట. మగవారికి యౌవనమునఁ గామవికారములు కలుగుటయే సార్థకముగాన ముదిమియందుఁ గలుగుట నిరర్థకమే యగుటంజేసి యవి అనుచితములు అక్రమములును అగును. స్త్రీలకుఁ జన్నుఁగవ బిగి గలిగి మరులుకొలుపుచుండు వయసువఱకే బ్రతికియుండుటయు రతిసలుపుటయు సార్థకము గాని * గుబ్బలు సోలి యెమ్మె దొలఁగిన ముదిమిని బ్రతికియుండుటగాని రతి సలుపుటగాని అనుచితములును అక్రమములును అగునని భావము. స్త్రీపురుషులకు యౌవనమందు సేయు సురత మేరమణీయ మని భావము.

---

* 'పఞ్చపఞ్చాశదవధిపరతో వృద్ధతామేతి నారీ' అని కామశాస్త్రవచనము చొప్పున వృద్ధలు సంభోగమునకు అనర్హ లనుటచేతను, 'త్యజే దన్యకులోద్భూతాం వృద్ధస్త్రీం కన్యకాం త్యజేత్' అని వృద్ధస్త్రీని నిషేధించుటచేతను, 'ఆలిఙ్గనం లమ్బపయోధరాణాం స్త్రీణాంచ దుఃఖం త్రయమేవ భూమా' అని చన్నులు సోలిన స్త్రీతోడిసంభోగము దుఃఖరూప మగుటచేతను, స్త్రీలకు స్తనపతనపర్యంతమైనజీవితమును రతమునే యుచితమును క్రమము నని యెఱుంగునది. మాఘుఁడును 'అయ మతిజరఠాః ప్రకామ గుర్వీ రలఘువిలమ్బిపయోధరోపరుద్ధాః। సతత మసుమతా మగమ్యరూపాః పరిణతదిక్కరికా స్తటీర్బిభర్తి' అని చెప్పఁబడుట యను సంధించుకొనునది.

చ. ఇది యుచితంబుగాని పని ౹ యిమ్మహిలో మగవారికెంతయున్
మదనసుఖాభిలాషములు ౹ మానకయున్కి జరాభరంబునం
గొదమమిటారిముద్దుచను ౹ గుబ్బలు జాఱినవెన్క బోంట్లకున్
మదనసుఖంబు జీవితము ౹ మాన్పఁడు తామరచూలి జాణయే. 27

తా. మగవారికి ముదిసినపిదప సైతము కామవికారములు కలిగించుటయు, స్త్రీలకు సుబ్బపాలిండ్లబిగి వీడినపిదపఁ గూడ బ్రతికియుండునట్లును రతిసలుపునట్లును గావించుటయు నను నీరెండును సృష్టికర్తకు మిక్కిలి యనుచితములును అక్రమములు నగును.

అవ. సురతంపుసొంపు గోరినయెడల యౌవన మత్యంతావశ్యక మని మూఁడుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు. అందును మొదట రాజసేవాపరత్వమునఁ జిరకాల మిల్లాలిని బాసి దేశాంతరమునం దున్న కోడెగాండ్రపలుకులఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రాజం స్తృష్ణామ్బురాశే ర్నహి జగతి గతః కశ్చిదేవావసానం
కోవార్థోఽర్థైః ప్రభూతైః స్వవపుషి గళితే యౌవనే సానురాగే
గచ్ఛామః సద్మ యావద్వికసితనయనేన్దీవరాలోకినీనా
మాక్రమ్యాక్రమ్యరూపంఝటితినజరయా లుప్యతే ప్రేయసీనామ్.

టీ. రాజన్=రాజా, జగతి=ఈలోకమునందు, కశ్చిత్ ఏవ=ఎవ్వఁడును, తృష్ణఅమ్బురాశేః=పేరాస యనెడు సముద్రముయొక్క-తృష్ణ గొలఁదియిడరాని దగుటచే అంబురాశిగా నిరూపితమైనది, పారం=గట్టును, నగతోహి=పొందఁడుగదా-తృష్ణాసముద్రమున మునింగినవాఁడేకాని దానిదరి చేరినవాఁడు లేనే లేఁడనుట, స్వవపుషి=తనశరీరమునందు, స+అనురాగే=అనురాగముతోఁగూడిన-వలపుఁ బుట్టించునట్టి యనుట, యౌవనే=ప్రాయము, గళితేసతి=జాఱినదగుచుండఁగా, ప్రభూతైః=మిక్కిలియైన, అర్థైః=ద్రవ్యములచేత, అర్థః=ప్రయోజనము, కోవా=ఏమి, ఆశయో మితిలేనిది. దానిని యౌవనమందు తృప్తిపఱుచుటయే మిగులసుకరము. యౌవనముతీఱినపిదప దానిని తృప్తిపఱుచుటకు శక్తియుండ నేరదు. ఆశయో ఎంతవయస్సు చెల్లినను విడువదు. కావున శక్తియుక్తమైన యౌవనముననే దానిని తృప్తిపఱుపఁదగునుగాని యౌవనముతీఱినవెనుక ఎంతద్రవ్య ముండినను అట్లు తృప్తిపఱుపశక్యమగునా యని యర్థము. రాజా! నీ వెంతద్రవ్యము లవ్వారిగానిచ్చినను, యౌవన ముండునపుడే వానినిగొని స్త్రీ సంభోగాదిరూపమైన తృష్ణను దృప్తిపఱుపఁ

గూడునుగాని అది లేనిపిదప నన్నియు వ్యర్థ మేయగు ననిభావము. కాఁబట్టి, వికస... కినీనాం-వికసిత=వికసించిన,నయన+ఇన్దీవర=నల్లగలువలవంటి కన్నులచేత, ఆలో కినీనాం=చూచునట్టి-కన్నులు నల్లగలువల వెదచల్లఁగా నీటుగులుక చూడ్కులు నిగుడ్చునట్టి యనుట ('వికసితకుముదేన్దీవరాలోకినీనాం' అనుపాఠమున వికసించిన తెల్లగలువల నల్లగలువలవంటికన్నులు గలవారైన యని యర్థము.) ప్రేయసీనాం =ప్రియురాండ్రయొక్క, రూపం=పరువంపుఁ జక్కఁదనము, జరయా=ముదిమిచే, ఆక్రమ్య ఆక్రమ్య=మిక్కిలి యాక్రమింపఁబడి, ఝటితి=తటాలున-అతిత్వరలో ననుట, నలుప్యతే యావత్=ఎంతవఱకు మాపఁబడదో, (తావత్=అంతలోఁగా), సద్మ=మాయింటికి, గచ్ఛామః=పోయెదము- మాప్రియురాండ్ర పరువంపుఁజెలువు మాసి ముసలితనము రాకమునుపే మేము పోయి వారితో నిష్టసుఖము లనుభవింపఁ దగును. లేనియెడ మాకు ముదిమివచ్చి యశక్తులమై యాశాతృప్తికి అనర్హులమగుదుము. వారును, ముదిమివచ్చుటచేతను వృద్ధస్త్రీ సంభోగము నిషిద్ధముగావునను, నిరర్థకలే యగుదురు. ఇచట 'నయనేన్దీవరాలోకినీనాం' అనుటచే చూడ్కులకు నల్లగలువల సాటియు దానిచే యౌవనమును ప్రియురాండ్రయందు గమ్యములు.

శా. ఆశాసాగరపార మేరికిని శక్యంబు గాదని చేరంగ భో
  గాశాయుక్తము జవ్వనంబు గళితంబైన నర్థనం బేల ధా
  త్రీశా యింటికిఁ బోదుమే ప్రియవధూహృద్యోల్లసద్రూపరే
  ఖాశోభాతిశయంబు దుర్భరజరాక్రాంతంబు గా కుండఁగన్.28

తా. రాజా! ఆశ సముద్రమువలె మేరలేనిది. కాన నట్టిదానిని దరించినవాఁ డెవ్వఁడును లేఁడనుట తెలిసినవిషయమే గదా. అట్టిదానిని వలఁపు గొలుపునట్టి యౌవనమునందే చేసైనంతవఱకు తృప్తిపఱుపఁదగును. దేహమున యౌవనము జాఱి వలపుడిగిన పిదప నెంతద్రవ్య ముండిననేమి? దానిని తృప్తిసేయఁగూడునా ? కావున నల్లగలువచాయలవెదచల్లునట్టి నిడువాలుఁజూడ్కులు నిగుడ్చు ప్రియురాండ్ర యెలజవ్వనంపుసొంపు ముదిమిచే మాయకమునుపే మామాయిండ్లకుఁ బోయి వారితో నిష్టసుఖము లనుభవించెదము.

అవ. ఇఁక యౌవనము అనర్థమునకు మూలమనుచున్నాఁడు.

శ్లో॥ రాగస్యాగార మేకం నరకశతమహాదుఃఖసంప్రాప్తిహేతు।
  ర్మోహస్యోత్పత్తిబీజం జలధరపటలం జ్ఞానతారాధిపస్య।
  కన్దర్పస్యైకమిత్రం ప్రకటితవివిధస్పష్టదోషప్రబన్ధం।
  లోకేఽస్మిన్నహ్యనర్థవ్రజకులభవనం యౌవనాదన్య దస్తి॥ 29

టీ. రాగస్య=అనురాగమునకు,ఏకం=ముఖ్యమైన, అగారం=గృహము,నరక...హేతుః-నరకశత=నరకపరంపరలయందలి, మహాదుఃఖ-(తీవ్రయాతనాది రూప

మైన) మహాదుఃఖములయొక్క, సంప్రాప్తి=పొందుటకు, హేతు=సాధనమైనది-సం భోగింపఁదగని వారితో సంభోగించుట మొదలైన దుష్కర్మములందుఁ బ్రవర్తింపఁ జేయుటచే నరకదుఃఖావహ మైనదనుట, మోహస్య=(మఱొకస్త్రీయందలి) ఆసక్తి యొక్క, ఉత్పత్తిబీజం=పుట్టుకకువిత్తు-జన్మకారణమైనదనుట, జ్ఞానతారాధిపస్య- జ్ఞాన=ప్రబోధమనెడి-తత్త్వజ్ఞానమనెడు,తారాధిపస్య=చంద్రునికి, జలధరపటలం= మేఘసమూహము - మబ్బులెట్లు గ్రమ్మి చంద్రుని ప్రకాశమును మఱుఁగుపఱుచునో యట్లె యిదియు జ్ఞానమును బ్రకాశింపనట్లుచేయుననుట, కన్దర్పస్య=మన్మథునికి, ఏకమిత్రం=ముఖ్యుఁడైన చెలికాఁడు-మన్మథుని ఉద్రేకింపఁజేయునదనుట, ప్రక... బన్ధం-ప్రకటిత=ప్రకటింపఁబడిన, వివిధ=నానావిధములుగలదియు, స్పష్ట=ప్రకా శమైనదియునగు, దోషప్రబన్ధం=పాతకసంబంధముగలదియు, 'యౌవన మగును గా వున' అని శేషము, అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, అనర్థ...భవనం-అనర్థ= అనర్థములయొక్క, వ్రజ=సమూహమునకు, కులభవనం=పుట్టినిల్లు అగునది ('కుసుమ వనం' అనుపాఠమున పూఁదోఁట-యనఁగా అనర్థములెల్ల మిక్కిలి తలసూపునట్టి స్థానము అనియర్థము), యౌవనాత్=యౌవనముకంటె, అన్యత్=మఱొకటి, నా స్తిహి=లేదుగదా. యౌవనమే అత్యంతానర్థమూలమని భావము. ఇదియే 'యౌవనం ధనసమ్పత్తిః ప్రభుత్వ మవివేకతా। ఏకైకమ ప్యనర్థాయ కిము యత్రచతుష్టయమ్' అని చెప్పఁబడినది.

చ. రతిపతిచేతివాలు ఘనరాగనివాసము నీతివైరి దు
  ర్గతిశతదుఃఖమోహజనికారణ ముజ్జ్వలబోధతారకా
  పతినిబిడాభ్రబృందము శుభప్రతిబంధము దోషసంఘసం
  గత మగునేఁగి జవ్వనముకన్న జగంబున వేఱె యున్నదే. 29

తా. యౌవనము అనురాగము కలిగించును. నరకపరంపరలం బారలించి పెను దుఃఖములకుఁ బాలుపఱుచును. పరకాంతలయం దాసక్తి పుట్టించును. మబ్బు చం ద్రుని గప్పునట్లు జ్ఞానమును గప్పి దానిని బ్రకాశింపనట్లు చేయును. మదనవికారము రేఁచును. పలువగల పాతకములఁ బ్రకటముగాఁ జేయించును. ఇట్లు అనర్థములను గలిగించునది యౌవనముకంటె మఱొకటి యీలోకమునందు కలుగనే కలుగదు.

అవ. ఇట్టి యౌవనము కలిగినప్పుడు వికారము నొందనివాఁ డెవ్వఁడో యొకఁ డని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ శృఙ్గారద్రుమసీరదే ప్రసృమరక్రీడారసస్రోతసి।
  ప్రద్యుమ్నప్రియబాన్ధవే చతురవాఙ్ముక్తాఫలోదన్వతి।
  తన్వీనేత్రచకోరపార్వణవిధౌ సౌభాగ్యలక్ష్మీనిధౌ।
  ధన్యఃకోఽపి న విక్రియాం కలయతే ప్రాప్తే నవే యౌవనే॥ 30

టీ. శృఙ్గార...నీరదే-శృఙ్గార = శృంగారరసమనెడి, ద్రుమ = చెట్టునకు, నీరదే=మేఘమైనదియు-మేఘము వృక్షమున కెట్లో యట్లే యిదియు శృంగారము నకు, పొటమరించుట, మొలకెత్తుట, చిగుర్చుట, పూచుట యను నవస్థలఁ గలి గించి పోషించున దనుట, ప్రసృమర...స్రోతసి-ప్రసృమర=వ్యాపించుగుణము గల, క్రీడారస = మన్మథకేళీరసమునకు, స్రోతసి=ప్రవాహమైనది-జలములను ప్రవాహ స్థానములగు నదులు మొదలైనవి యెట్లు ఎడతెగక విచ్చలవిడిగాఁ బ్రవహింపఁజేయునో యట్లే యిదియు మన్మథక్రీడారసమును ఎడతెగక ప్రవహింపఁజేయుస్థాన మగునని యర్థము-దానిని ఎడతెగక ప్రవర్తింపఁ జేయున దని భావము. ప్రద్యు...థవే-ప్రద్యుమ్న=మన్మథునికి, ప్రియబాన్ధవే=ఆప్తబంధువైనదియు-మన్మథో ద్రేకము కలి గించునది యనుట, చతుర...దన్వతి-చతుర=నిపుణములైన, వాక్=మాటలనెడి, ముక్తాఫల = ముత్తెములకు, ఉదన్వతి = సముద్ర మైనదియు - సరససల్లాపములను బుట్టించునది యనుట, తన్వీ...విధౌ-తన్వీ-విలాసినులయొక్క, నేత్ర=కన్నులనెడి, చకోర = వెన్నెలపులుఁగులకు, పార్వణవిధౌ=పున్నమచందురుఁ డైనదియు-చకోర ములను బూర్ణచంద్రుఁ డెట్లు ఉల్లసిల్లఁజేయునో యట్లే యిదియు విలాసినుల కన్నుఁగవల నుల్లసిల్లఁజేయు నని భావము, సౌభాగ్య...నిధౌ-సౌభాగ్యలక్ష్మి= సౌందర్యసంపదకు, నిధౌ=నిధానమైనదియు-మంచి చక్కఁదనమును గూర్చునది యనుట, అగు, నవే యౌవనే=నూతనమైన వయస్సు-ఎలప్రాయ మనుట, ప్రాప్తే సతి=కలిగినదగుచుండఁగా, కోఽపి ధన్యః=ఎవఁడో యొకధన్యుఁడు, విక్రియాం= మన్మథవికారమును, కలయతే=పొందఁడు. ఇట్టివాఁడు మిక్కిలి యరు దని భావము. ఈరెండుశ్లోకములను అలం. నిరవయవరూపకము.

ఉ. మారునికూర్మిచుట్టము సఽమంచితకేళిరసహ్రదంబు శృం
గారమహీజనీరదము ఽ కంజముఖీజనదృక్చకోరరా
కారజనీశమండలము ఽ కాంతవచోమణివార్ధి యౌవనం
బారయఁ జెందుచో వికృతిఽనందనివాఁడె కృతార్థుఁడిమ్మహిన్. ౭౦

తా. ఒకచెట్టునకు మబ్బువలె శృంగారరసమును అంకురించి, చిగిర్చి, పుష్పిం చునట్లు పోషించునదియు, జలమునకుఁ బ్రవాహమువలె మన్మథకేళీరసము నెడతెగక విచ్చలవిడిఁ బ్రవర్తింపఁజేయునదియు, అనుంగుచుట్టమువలె మన్మథునికిఁ దో డై యుద్రేకింపఁ జేయునదియు, *సముద్రము ముత్తియముల నీనునట్లు విన్నాణంపు

---

* 'కరీన్ద్రజీమూత వరాహశఙ్ఖమత్స్యాహి శుక్త్యర్ణవ వేణుజాని। ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవమేవ భూరి' ఏనుఁగు, చెఱకు, మబ్బు, పంది, సంకువు, చేఁప, పాము, ముత్తెపుఁజిప్ప, సముద్రము, వెదురు అను వీనిలోఁ బుట్టినముత్తెములు లోకమునఁ బ్రసిద్ధము లైనవి. వానిలో ముత్తెపుఁజిప్పను బుట్టు నవియే మెండు.

నెఱజాణమాటల నీటుసులుకఁ గలిగించునదియు, పున్నమచందురుఁడు చకోరముల నుల్లసిలఁ జేయునట్లు చెలువలకన్నుఁగవల కుల్లాసము గలిగించునదియు, నక్కజంపుఁ జక్కఁదనపుసిరిని గిఱిగొనఁ జేయునదియు, నైనయెలజవ్వనము దలఁపఁగా ధన్యుఁ డెవఁడో యొక్కఁడు మన్మథవికారము నొందక యుండునుగాని యందఱు నట్లుండుట యరిది.

అవ. యౌవనము అనర్థమూలము గాన కామినులను వదలిన యెడల నది యనర్థములకు మూలమగుటయు మిక్కిలి దొలఁగిపోవును గదా యని యాశంకించి యాకామినులను విడుచుటయుఁ గష్ట మని మూఁడుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ *సంసారేఽస్మి న్నసారే కునృపతిభవనద్వారసేవాకళఙ్కా।
వ్యాసఙ్గవ్య స్తధైర్యం కథ మమలధియో మానసం సంవిదధ్యుః।
యద్యేతాః ప్రోద్యదిన్దుద్యుతిసిచయభృతో న స్యు రమ్భోజనేత్రా
ప్రేఙ్ఖత్కాఞ్చీకలాపాః స్తనభరవినమన్మధ్యభాజ స్తరుణ్యః॥ 31

టీ. అమలధియః=నిర్మలమతులు-మహాత్ములనుట, ప్రోద్య...భృతః-ప్రోద్యత్=ఉదయించుచున్న, ఇన్దు = చంద్రునియొక్క, ద్యుతి=కాంతి వంటికాంతి గల, సిచయ=చీరలను, భృతః=ధరించువారును- ఉదయించుచున్న చంద్రునికాంతితోఁ బోల్చుటచే నిట చీరలు మాంజిష్ఠవర్ణము (అనఁగా ఎఱుపుమించిన పసుపువన్నె) గలవి గాఁ దెలియునది-అట్టిచీరలను దాల్చినవారు ననుట, అమ్భోజనేత్రా=తామరలవంటికన్నులు గలవారును-తామరరేకులవలె నిడుదలైనకన్నులు గలవారనుట, ప్రేఙ్ఖత్...కలాపాః-ప్రేఙ్ఖత్=కదలుచున్న-మ్రోఁగు, కాఞ్చీ=ఒంటిపేట మొలనూలును, కలాపాః=ఇరువదియైదు పేటలయొడ్డాణమును గలవారును- లేక అట్టి మొలనూలును దక్కినహారాదిభూషణములును గలవారనుట, స్తన...భాజః- స్తనభర=గుబ్బలబరువు చేత, వినమత్=వంగుచున్న, మధ్యః=నడుములను, భాజ=పొందినవారును ('మధ్య

---

* ఈ శ్లోకమునకు.
సంసారేఽస్మిన్ ...కునృపతిభవనద్వారసేవావలమ్బ।
వ్యాసఙ్గధ్వ స్తధైర్యం...మానసం సన్నిదధ్యుః॥
అనుపాఠమున, కునృప...ధైర్యం=దుష్టరాజుల మోసలకడ కొలువును నైకొనుట యందలి యాసక్తిచే మిక్కిలి నశించినధైర్యము గల, మానసం=మనస్సును, కథం= ఎట్లు, సన్నిదధ్యుః=సమాహితముగావింపుకొందురు-అనఁగా తేర్చుకొందురనియర్థము తక్కినవానికర్థము సమము. ఇట్టిజవరాండ్రు లేనిచో నట్టికొలువు వలన దిటవుమాలిన మనస్సును దేర్చుకొనలేరని భావము-అట్టికొలువు మనస్సు తెంపును మాలించియు నిట్టి జవరాండ్రు ఉండుటంబట్టి వారిమనస్సునకు దిటవు కలుగునని యాశయము.

భాగాః' అనుపాఠమున నడుమనెడి భాగము గలవారని యర్థము), బలితంపు గుబ్బచన్నులును సన్ననినడుమును గలవారుననుట-ఇది సౌందర్యాతిశయసూచకము, అగు, ఏతాః=ఈ-ప్రసిద్ధలైనయనుట, తరుణ్యః=జవరాండ్రు, నస్యుః యది=లేకపోయిరేని, అమలధియః=నిర్మలమతులగువారు-మహాత్ములనుట, అసారే=సారములేని, అస్మిన్=ఈ, సంసారే=(దారపుత్రాది పోషణవ్యాసంగరూపమైన) సంసారమునందు, కునృపతి=దుష్టరాజులయొక్క, భవనద్వార=యింటిమోసలయొక్క, సేవా=కొలుచుట యనెడి, కళఙ్క=అపవాదమునందు-నెలుసునందనుట, వ్యాసఙ్గ=మిక్కిలి యాసక్తిచేత, వ్యస్త=చెడిన, ధైర్యం=ధీరత్వము గలదానినిగా, మానసం=మనస్సును, కథం=ఎల్లు, సంవిదధ్యుః=చేయుదురు - ఎట్లును చేయ నేరరనుట-మహాత్ము లీసంసారము నిస్సారమని తెలిసియు నిందలిజవరాండ్ర కులుకుబెళుకులకు లోనై, ధైర్యముదూలి, తమ నిర్మలమనస్సులను కుచ్ఛితంపురాచనగళుల మోసలలకడ కొలువు గొలువ నియ్యకొనునట్టి కళంకము గలవానినిగాఁ జేసికొని రనియు నీజవరాండ్రు లేకుండిరేని ఈ నిస్సారమగు సంసారమునకై యింతటి కుచ్ఛితంపు బ్రదుకునకుఁ బాలువడరనియు భావము. ఇట్టి విశిష్టతరుణు లుండుటవలననే మహాత్ములుసైత మిట్టివారైరనియు కాన తరుణుల పరిహరించుట కష్టమనియు నాశయము. ఉత్తరవాక్యార్థము పూర్వవాక్యార్థమును సమర్థించుహేతు వగుటచే కావ్యలింగ మలంకారము.

చ. జలజవిలోచనంబులును సన్నపుఁజంగురకావిచీరలుం
గులుకుమెఱుంగుఁజన్నులును గొంచెపుఁగన్నులు రత్నకింకిణీ
కలరశనాగుణంబులును గల్గినకాంతలు గల్గరేని గా
సిలి మతిమంతు లేటికి వసింతురు రాజగృహాంగణంబులన్. 31

తా. అప్పు డుదయించుచున్న చందురునికాంతివంటివన్నె గల వలువ చెలువుగాఁ గట్టి, తామర రేకులవలె వాలుకన్నుంగవ చెన్ను చూప, మొలనూలిగజ్జెలు గల్లుగల్లని మొరయ, బలితంపుగుబ్బల బ్రేఁగున లేఁగౌఁదీఁగె యల్లలాడ, బెడఁగారు లే జవరాండ్రు లేనిచో, నిర్మలాత్ములైనవారు నిస్సారమైన యీవట్టిసంసారమునకై దుష్టరాజులమొగసాలకడఁ గొలువుకొలుచునట్టి కుచ్ఛితంపుబ్రదుకుచే మనస్సు తెంపుమాలినవారు గాకుందురు.

శ్లో॥ సిద్ధాధ్యాసితకన్దరే హరవృషస్కన్ధావరుగ్ణద్రుమే।
గఙ్గాధౌతశిలాతలే హిమవతః స్థానే స్థితే శ్రేయసి।
కః కుర్వీత శిరఃప్రణామమలినం మానం మనస్వీ జనో।
యద్విత్రస్తకురఙ్గశాబనయనా న స్యుః స్మరాస్త్రం స్త్రియః॥32

టీ. విత్రస్త...నయనాః-విత్రస్త=మిక్కిలి బెదరిన, కురఙ్గశాబ=లేడిపిల్లవంటి, నయనా=కన్నులుగలవారును-దీనిచే 'చకితమృగదృగాభే' అను పద్మినీజాతి సూ

చితము, కావుననే, స్మరాస్త్రం=మన్మథుని బాణమును- మహావీరుఁడైన మన్మథుని కి జగములనెల్ల గెల్చుసాధన మైనబాణమగువారనుట, అగు, స్త్రియః=స్త్రీలు, యత్ నస్యుః=లేకపోయిరేని, సిద్ధా...కన్దరే-సిద్ధ=యోగులచేత,అధ్యాసిత=అధిష్ఠింపఁబడిన-యోగులుండునట్టి యనుట, కన్దరే=గుహలుగలదియు, దీనిచే తపస్సిద్ధి గలిగించున దని సూచితము, హర...ద్రుమే-హర= శివునియొక్క-హిమవత్పర్వత శిఖరమగు కైలాసమున శివుఁడుగాఁపుంషునుగాన నచటనేయెపుడు సన్నిహితుఁడై యుండునట్టి శివునియొక్క యనుట, వృష=(వాహనమైన) యెద్దుయొక్క-నందియొక్క యనుట, స్కన్ధ=మూఁపురముచే, అవరుగ్ణ=విఱువఁబడిన, ద్రుమః=చెట్లుగలదియు-నంది వర్తించుటను జెప్పుటచే దాని నెక్కు శివుఁడును దగ్గఱనే యుండుట సూచితమగుచున్నదిగాన నట్టి శివసన్నిధానముచే నఖిలశ్రేయఃప్రద మైన దని భావము, గఙ్గా...తలే-గఙ్గా=గంగచేత, ధౌత=కడుగఁబడిన, శిలాతల=ఱాతిపట్టులుగలదియు-దీనిచే నతిపవిత్ర మైనదని సూచితము, కాఁబట్టియే, శ్రేయసి-శ్రేష్ఠమైనదియు-లేక, శ్రేయస్కర మైనదియునగు, హిమవతః=మంచుకొండయొక్క, స్థానే=ప్రదేశము, స్థితే (సతి) ఉండఁగా, కః మనస్వీ=ఏబుద్ధిమంతుఁడు,మానం=తనమానము,శిర... మలినం-శిరః ప్రణామ=తలవంచి నమస్కరించుటచే, మలినం=చెడినదిగా-దుష్టరాజులపాదములకుఁ దలవంచి నమస్కారము సేయుటచే కళంకిత మైనదిగా ('శిరఃప్రణామమలినం మ్లానం' అను పాఠమున, శిరః=తనతలను, ప్రణామ మలినం=నమస్కారముచే కళంకిత మైనదిగా-అనఁగా దుష్టరాజులపాదములకు వందనము సేయుటచే దూషితమై, కావుననే, మ్లానం=వాడినదిగా-ఉత్కర్ష లేనిదిగా) కుర్వీత=చేయును-ఎవఁడును జేయఁడనియర్థము. కామునితూపులవలె మరులుకొలుపు జవరాండ్రు లేనిచో మతిమంతులు పుణ్యవంత మైన హిమవంతమున వసించి తపంబుసేసి కడతేఱినవా రగుదురుగాని, రాజులకుఁ దలవంచికొని కొలిచి బ్రతుకునంత మానమును జెఱుపుకొనువారు గారని భావము. అమోఘమన్మథాస్త్రములవలె నున్న స్త్రీలను బరిహరించుట కష్టము గాన వారినిబట్టియే మనస్వు లగువారికిని ఇట్టిప్రణామాదిదురవస్థాప్రాప్తి యని యాశయము.

శా. గంగాధౌతశిలాతలంబు హరగోస్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధసేవితగుహాస్తోమంబు శీతాచలో
త్సంగం బుండఁగ నెవ్వఁడో పు నృపపాదంబుల్ దలం దాల్ప సా
రంగీశాబవిలోచనల్ మనసిజాస్త్రంబుల్ సతుల్ లేనిచోన్ .32

తా. బెదరిన కొదమలేడివంటి బెళుకుఁగన్నులఁ జెన్నారుచుఁ గాముని తూపులవలె మరులుకొలుపు చెలువలంబట్టియే బుద్ధిమంతు లగువారునైతము రాజులకుఁ దలవంచి కొలువుసేసి దమమానముఁ దూలపుచ్చుకొను చున్నారుగాని యట్టికా

వీనులు లేనిచో (సిద్ధులచేఁ దద్దయు నొప్పఁగుహల కలిమిని) దపస్సిద్ధి కలిగించునదై, (నంది తనలోని ప్రమథుల నందంద లీలమై విఱుచుటవలనఁ దెలియందగు శివసన్నిధిచే) నతిశ్రేయస్కరంబై, (గంగాజలంబులఁ దడిసిన శిలాతలంబులవలన) అతిపవిత్రమై యొప్పమంచుకొండ నొకయెడనుండి కదలేఁరఁ జూతురు గాని యట్లు తలవంచి కొలిచి మానము చెఱుపుకొనరు.

శ్లో॥ *సంసార తవ పర్యన్తపదవీ న దవీయసీ।

అన్తరా దుస్తరా నస్యు ర్యది తే మదిరేక్షణాః॥ 33

టీ. సంసార=ఓసంసారమా, తే=నీయొక్క, అన్తరా=నడుమ-సముద్రమువంటినీనడుమ ననుట, దుస్తరాః=తరింపశక్యముకానివారై-మహానదులవలె నతిక్రమించి పోవఁదరము కానివారై, మదిరేక్షణాః=స్త్రీలు,నస్యుఃయది=లేకపోయిరేని, తవ=నీయొక్క, పర్యన్తపదవీ=పొలిమేర, దవీయసీ=మఱింతదూరమైనది, న=కాదు.- అనఁగా స్త్రీలునడుమనుండుటచేఁ గలిగినదూరముకంటె మఱింతతక్కువదూరముననే నీచివరయెల్ల యుండుననుట. సంసారము దరిచేరుటకు స్త్రీలు అడ్డుపాటు అగుదురు-కాన వారిని పరిత్యజించుటచేతనే శ్రేయము కలుగునని భావము.అలం కావ్యలింగము.

తే. అమితసంసార నీదుపర్యంతపదవి
గతి దలంప దవీయసి గాదుసూవె
యర్థి కీలోనఁ గడవంగ నలవిగాని
ఖంజరీటాయతాక్షులు గలుగరేని. 33

తా. ఓసంసారమా! నీపొలిమేరను జేరవలయునన్న నడుమ జవరాండ్రు దాటఁగూడరాని వారై యున్నారు. వారు లేనియెడల నీయెల్ల యిప్పుడు తోఁచునంత దవ్వుగా నుండదు. మఱింత దాపుగానే యుండి యుండును.

---

* ఈశ్లోకమునకు.

'సంసారోదధినిస్తారపదవీ న దవీయసీ।

అన్తరా దుస్తరా నస్యుర్యది రే మదిరేక్షణాః॥

అనిపాఠాంతరము. రే=ఓరీ-ఓజనుఁడా యనుట, 'అన్తరా దుస్తరా మదిరేక్షణా నస్యుర్యది=నడుమ (అనఁగా సంసారసముద్రమునడుమఁ) గడవరాని వారగు స్త్రీలు లేకుండిరేని 'సంసార + ఉదధి నిస్తారపదవీ=సంసార మనెడిసముద్రమును దాటు మార్గము, దవీయసీ న=మఱింతదూరముకాదు-సమీపమునందే యుండుననుట. స్త్రీలంబట్టియే సంసారము తరింపరానిదై నదని రెండుపాఠములయందును భావముసమానము.

అవ. ఇట్లు స్త్రీలయం దనురక్తికై సంభోగమును వర్ణించి యిపుడు బుద్ధిమంతులకేని స్త్రీలను పరిహరించుట కష్ట మగుటచే నందఱు వారియం దాసక్తులే యగుదురు. అట్టి సంసారులకు శ్రేయస్సు కలుగుట యెట్లు? అని యాశంకించి యా స్త్రీలను అనురక్తిచేఁ గలసి యున్నవారికి నిహలోకఫలమును, విరక్తిచే వదలినవారికిఁ బరలోకఫలమును గలుగు నని తలఁచి దానిని నిరూపించుటకై యనురక్తి విరక్తి యను రెండుపక్షములను నీవింశతి ముగియువఱకు వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ * దిశ వనహరిణేభ్యో వంశకాణ్డచ్ఛవీనాం
కబళ ముపలకోటిచ్ఛిన్నమూలం కుశానామ్ ।
శుకయువతికపోలాపాణ్డుతామ్బూలవల్లీ
దళ మరుణనఖాగ్రైః పాటితం వా వధూభ్యః॥ 34

టీ. (హేజన=ఓయీ! అని అధ్యాహార్యము), వనహరిణేభ్యః=పుణ్యారణ్యమందలి యాఁడుజింకలకు-అచ్చటఁ దపస్సుచేయుటవలన వెఱపులేక లేళ్లు దాపునకు రాఁగా వానికని భావము, వంశకాణ్డచ్ఛవీనాం=వెదురుమోసులయొక్క కాంతి గలవి యగు, కుశానాం=దర్భలయొక్క, ఉపల... మూలం-ఉపలకోటి=ఱాలిమొనచేత, ఛిన్న=త్రెవ్వఁబడిన, మూలం=మొదళులుగల-పుణ్యారణ్యములందు కొడవలి మొదలగు సాధనములు గలుగవు గాన కఱుకొనలు గలఱాలు సాధనముగాఁ జెప్పఁబడినవని తెలియునది, కబళం=గ్రాసమునైనను-కఱుకుఱాల కొనలచేఁ ద్రుంపఁబడినవై వెదురు మొలకలవలె నొప్పు దర్భలయొక్క గ్రాసమును గాని యనుట, వా=లేక, వధూభ్యః=స్త్రీలకు, అరుణనఖ అగ్రైః=ఎఱ్ఱనిగోళ్ల కొనలచేత, పాటితం=చీల్పఁబడిన, శుక...దళం-శుకయువతి=చిలుకపెంటియొక్క, కపోల=చెక్కిలివలె, ఆపాణ్డు=కొంచెము తెలుపుమించిన పసిమివన్నె గల, తామ్బూలవల్లీదళం=తములపాకును గాని, ('శకయువతి' అనుపాఠమున, శకయువతికపోల=శకదేశపుతరుణుల యొక్క చెక్కులవలె, ఆపాణ్డు=అంతటఁ దెల్లగానున్న, తామ్బూలవల్లీదళం=తములపాకును గాని, అని యర్థము), దిశ=ఇమ్ము-ఇచట, నడవులందు లేళ్లకు గఱికపోఁచలు ద్రుంచి యిమ్మనుటచే తపస్సు నాచరించుటయు, జవరాండ్రకు బాగా లిమ్మ

* 34-వ శ్లోకముతోలుత 'ఇతి సంభోగవర్ణనమ్. అథపక్షద్వయనిరూపణమ్' అని యవతారిక దాక్షిణాత్యకోశములందుఁ గానిపించెడి. 33-వశ్లోకముతో సంభోగవర్ణనము ముగియఁగా 34-వది మొదలుకొని 40-యవది వఱకుఁ గల యేడు శ్లోకములచే పక్షద్వయమును (అనఁగా అనురక్తి విరక్తి యనుపక్షముల రెంటిని) నిరూపించునట్లు ప్రతిజ్ఞ చూపట్టుచున్నది.

నుటచే సంసారము సలుపుటయు సూచితములు. విరక్తితో తపంబైనఁ జలుపుము. అనురక్తితో సంసారమునైనఁ జేయు మనుట. విరక్తియందు తపస్సును ననురక్తియందు సంసారమును అనుటెందే పరమసౌఖ్యప్రదములు కాని తక్కినవి కావని భావము. ఇట్లే మీఁదనెల్ల నూహించుకొనునది. గోళ్లు ఎఱ్ఱనివిగా నుండుట మహాభాగ్యలక్షణమగుటచే సుఖిత్వమును దెలుపుటకై యది యిట 'అరుణనఖాగ్రైః' అని చెప్పఁబడియె. ఇందులకు 'పాణీ పాదతలే రక్తే నేత్రాన్తశ్చ నఖ స్తథా। తాలు జిహ్వాధరోష్ఠంచ సప్తరక్తః సుఖీభవేత్' అను సాముద్రికశ్లోకము ప్రమాణము.

చ. శిలమొన మూలముల్ చిదిమి శ్రీ చెన్నుగ వేణుకరీరకాంతిచే
లలితము లైనదర్భకబళంబులు లేళ్లకు నిమ్ము కానలోఁ
గలితశకాంగనావిపులకగఁడసుపాండురనాగవల్లికా
దళముల గోళ్లఁ ద్రుంచి వనితాతతికైన నొసంగు మిమ్ములన్. 34

తా. ఓయీ! పుణ్యారణ్యములందు బెదరు లేనివై దాపునకు వచ్చెడి యాఁడు జింకలకు వెదురుమోసులవలెనున్నట్టి మిగుల గఱికపోఁచలను గఱుకుతాళ్ల కొనలచేఁ గోసి మేఁతపెట్టుము- (విరక్తి కలవాఁడవేని నడవికిఁ బోయి తపంబుసేయుమనుట). లేదా, జవరాండ్రకు, ఆఁడుచిలుకలచెక్కిళులవలె నించుక తెలుపుమీఱిన పసిమివన్నె గల తమలపాకులను నెఱ్ఱగోటిమొనలచేఁ జీల్చి యిమ్ము- (అనురక్తి గలవాఁడవేని నిండ్లయందు చెలువలతో సంసారము సలుపు మనుట).

శ్లో॥ *అసారాః స్వ్యేతే విరతివిరసా వాథ విషయా
జుగుప్స్యన్తాం యద్వా నను సకలదోషాస్పద మితి।

---

* పక్షద్వయనిరూపకమైన శ్లోకసప్తకములోని యీ 'అసారాః స్వ్యేతే' అను శ్లోకమునకు 'అసారాః సర్వేతే విరతి విరసాః పాపవిషయా।జుగుప్స్యన్తాం యద్వా నను సకలదోషాస్పద మితి' అను పాఠాంతరము గ్రహించి యీ పూర్వార్ధమునకు 'పాపములైన విషయములెల్ల నసారములనికాని, విరతివిరసములనికాని, సకలదోషాస్పదమనికాని యేవగింపఁబడునుగాక' అని 'జుగుప్స్యన్తామ్' అనునొకక్రియను బట్టి విముక్తిపరముగా నర్థముసేసి యుత్తరార్ధమునకు అనురక్తిపరముగా నర్థము చెప్పి యిది పక్షద్వయనిరూపకముగా సమర్థింపఁబడినది. అయినను ఉత్తరార్ధమునందు మూఁడవ పాదమున 'పుడమిలో పరహితముకంటె నెక్కుడుపుణ్యము లేదు' అనియు, నాలవపాదమున 'సంసారములో స్త్రీకి మించిన రమ్యవస్తువు లేదు' అనియు నున్నవి. ఇందు మొదటిది యేపక్షములోను జేరని సామాన్యవిషయము. రెండవది మాత్ర మనురక్తిలోఁ జేరినది. ఈరెండును పరస్పరసంబద్ధములుకాక వేఱువేఱ నిబద్ధములైనవి. కాన యీరెంటిని గలిపి యనురక్తిపరముగాఁ జేయుట కల్పనాగౌరవమేకాని కవిహృదయము కానేరదు. పూర్వార్ధమెల్ల విరక్తిపరమైనట్లు ఉత్త

తథాప్యేత ద్భూమౌ నహి పరహితా త్పుణ్య మధికం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్య మపరమ్॥ 35

టీ. ఏతే=ఈ-ప్రసిద్ధములైన, విషయాః=శబ్దాదివిషయములు-లేక, హారచందనాదులు, అసారాః=అస్థిరములుగా-లేక, నిస్సారములుగాఁగాని, అథవా=లేక, విరతివిరసాః= పరిణామసమయమున అనర్థములుగాఁ గాని, సంతు=ఉండుఁ గాక, యద్వా=లేక, సకల...స్పదమితి = రాగద్వేషమోహాదిసకలదోషములకుఁ బట్టయిన దనిగాని, జుగుప్స్యన్తాం=ఏవగింపఁబడును గాక-వెగటుతో విడువఁబడును గాక యనుట. అట్లు విడుచుటచే, 'స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనన్తం విదధతే' అన్నట్లు పరమసుఖము లభించును. తథాపి=అయినను-విషయములు నిస్సారములుగాను విరతివిరసములుగాను నుండినను దోషాస్పదములుగా ఏవగింపఁదగినవై నను అనుట, రెండువిషయములుమాత్ర మట్టివి గావనుచున్నాఁడు. అవి యేవన, ఏతత్= ఈ, భూమౌ=భూమియందు, పరహితాత్=ఇతరులకుఁ జేయుహితముకంటె, అధికం =ఎక్కుడైన, పుణ్యం=సుకృతము, నహి=లేదుగదా- 'శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః। పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్' అనుటచే పరహితమే అత్యంతపుణ్యమైనదనుట, అస్మిన్ సంసారే=ఈసంసారమునందును, కువలయదృశః=కలువకంటికంటె, అపరం=వేఱైన, రమ్యం=మనోహరమైనవస్తువు, న= లేదు-ఇదియే మిక్కిలిమనోహర మనుట, కాబట్టి విషయములన్నిటిని దోషాదులుగాఁ గనుఁగొనినను, భూమియందు పరహితము సంసారమునందు స్త్రీ అను రెండువిషయములను మాత్ర మట్లు గనుఁగొనరా దని భావము.

చ. దురితనిదానముల్ సకలదోషగృహంబులు సారహీనముల్
పరిణతిఘోరముల్ విషయపద్ధతు లెంతయుఁ గుత్సితంబు లి
ద్ధరను బరోపకారసుకృతంబును బోలవు పుణ్యముల్ మనో
హరతరవస్తువుల్ కువలయాక్షులకన్నను గల్గ వెవ్వియున్. 35

తా. ఈశబ్దాదివిషయములను నిస్సారములని కాని, కడపట ననర్థము గలిగించున వనికాని, సకలదోషములకుఁ బట్టయిన వనికాని యేవగించి విడిచినను వీనిలో పరోపకారమును పూవుబోఁడియు నను రెండుమాత్రమట్టివి గావు. ఏలన నిప్పుడమిని పరహితమునకంటె మించినపుణ్యము లేదు. ఈసంసారమున కలువకంటికంటె నింపైనది మఱొకటిలేదు. కావున పరహిత మాచరించుచుఁ గాంతలం గూడి సంసారమును నడపవలయును.

---

రార్ధమెల్ల అనురక్తిపరము గావలసి యుండఁగా నందు తృతీయపాదవిషయము అప్రసక్తమైనదిగాను ఏకదేశమైనచతుర్థపాదముమాత్రము ప్రకృతపరముగాను నుండ నేలకి పూర్వార్ధముయొక్క పాఠాంతరమును అంతగాయుక్తముగాఁ దోఁపదు. కాన నీశ్లోకము పక్షద్వయనిరూపకము గాదు.

శ్లో॥ మాత్సర్య ముత్సార్య విచార్య కార్య
మార్యాః సమర్యాద మిదం వదన్తు।
సేవ్యా నితమ్బాః కిము భూధరాణా
ముత స్మరస్మేరవిలాసినీనామ్॥ 36

టీ. ఆర్యాః=పండితులు-లేక పండితులారా అని సంబోధనపరముగాను గ్రహింపవచ్చును,మాత్సర్యం=అసూయను, ఉత్సార్య=నిరాకరించి-విడిచియనుట-మాత్సర్యము యథార్థమును జెప్పనీయదు గాన దానినివిడిచియని భావము, కార్యం=కర్జమును-చేయఁ దగినదాని ననుట, విచార్య=చక్కఁగా నాలోచించి, సమర్యాదం=మర్యాదతోఁ గూడునట్టుగా- అనఁగా సన్మార్గ మను మేరను అతిక్రమింపక యనుట, ఇదం=దీనిని, వదన్తు=చెప్పుదురుగాక. అది యేదనఁగా, సేవ్యాః=ఆశ్రయింపఁదగినవి, భూధరాణాం=పర్వతములయొక్క, నితమ్బాః కిము=కటకప్రదేశములా, ఉత=లేక, స్మర...విలాసినీనాం-స్మర=మన్మథునిచే, స్మేర=ఉల్లసిల్లునట్టి-అనఁగా మన్మథమదము మిక్కిలి గల, లేక, స్మర=మన్మథావేశముచే, స్మేర=అందకత్తియ లైన-అనఁగా సంభోగంపుతమిని జూపుచిఱునవ్వుచే ముద్దుసులుకు నెమ్మొగము గలవారైన యనుట, -లేక, ఏవిషయమందును గుఱిగా నెలకొనక విచ్చలవిడి నందంద యల్లల్ల నీటుగా వెలసి పొలయు కడగంటిచూపులు *స్మేర మనఁబడును గాన, స్మరస్మేర=మన్మథుఁడు ముఖ్యముగాఁ గలిగి (అనఁగామన్మథునిచే ముఖ్యముగాఁబురికొలుపఁబడి) యందంద విచ్చలవిడి నీటుగా నొలయుకడగంటిచూపులుగల యనియు నర్థాంతరము, విలాసినీనాం=వగలాండ్రయొక్క, నితమ్బాః=మొలలా-కొండనడుములా కులుకులాండ్రపిఱుఁదులా యాశ్రయింపఁదగిన వేది చెప్పుదురుగాక యని భావము. వైరాగ్యమున్నచో గిరినితంబములును, అది లేనిచో విలాసినీనితంబములును, సేవ్యము లని యాశయము. ఇచట వృత్త్యనుప్రాస మను శబ్దాలంకారము. పర్వతకటకములను స్త్రీకటీభాగములను 'నితమ్బాః' అను శ్లిష్టమైన యేకపదముచేత నే చెప్పినాఁడు గాన శ్లేష యనునర్థాలంకారము. మఱియు గిరికటక నారీ కటీభాగములు రెండును ప్రకృతములగుటచేత నీశ్లేష కేవలప్రకృతమైనది. ఒక కాడయందు రెండుపండ్లవలె నొకశబ్దమునందే రెండర్థములు స్ఫురించుటచే నిది యర్థశ్లేషయు నగు. మొదటఁ జెప్పిన వృత్త్యనుప్రాసమును దానికి విజాతీయమైన యీశ్లేషయు తిలతండులములవలె పరస్పరనిరపేక్షములుగా నుండుటచే సంసృష్టి.

---

* అపరిచ్ఛిన్నవిషయం మదమన్థరవీక్షితమ్। స్ఫురద్భ్రూపక్ష్మతాయుక్తం తత్ స్మేరమితి కథ్యతే; విషయ మిది యనిలేక, మత్తుచే మందటిలి యరమోడ్చినదై కదలుచున్న కనుబొమ్మలును తొంగలిరెప్పలును గలిగినచూపు స్మేర మనఁబడును

ఉ. ఆరయ మత్సరంబు విడనాడి సమంచితకార్యనిశ్చయో
దారవిచారులై సరసతర్క వచియింతురు గాక సజ్జనుల్
ధారుణి సేవ్యముల్ గిరినితంబములో మఱి కాక మన్మథ
స్మేరవిలాసినీజనవిశేషనితంబములో తలంపఁగన్. 36

తా. ఉండఁదగినవి కొండలకటకములా? లేక, మన్మథమదముచే నల్లల్ల నిటు నటు వాలారుఁ గడగంటిమాడ్కులు నిగుడ్చు కులుకులాండ్ర కటిదేశములా? ఈసు విడిచి చక్కఁగా విచారించి పండితులైనవారు మేరతప్పనియట్లు చెప్పుదురుగాక.

శ్లో॥ సంసారే స్వప్నసారే పరిణతితరలే ద్వే గతీ పణ్డితానాం
తత్త్వజ్ఞానామృతామ్భఃప్లవలలితధియాం యాతు కాలః కథఞ్చిత్।
నోచేన్ముగ్ధాఙ్గనానాం స్తనజఘనఘనాభోగసమ్భోగినీనాం
స్థూలోపస్థస్థలీషు స్థగితకరతలస్పర్శలీలోద్యమానామ్॥ 37

టీ. స్వప్నసారే=స్వప్నముయొక్క సారమువంటిసారము గలదియు-అనఁగా స్వప్నమువలె మిథ్యాభూతమైన దనుట, పరిణతి తరలే-పరిణతి=పరిణామమునంగు, తరలే=అస్థిరమైనదియు-స్థిరమైన పరిణామము లేనిదనుట-శాశ్వతము కానిదని భావము, సంసారే=సంసారమునందు, ('సంసారేస్మిన్నసారే' అనుపాఠమున సారహీనమైన యీసంసారమునందిని యర్థము), పణ్డితానాం=పండితులైనవారికి-ఎఱుక గలవారి కనుట, ద్వే=రెండు, గతీ=అవస్థలు-లేక మార్గములు, కలవు అని శేషము, అగతులు రెం డేవియో చెప్పుచున్నాఁడు, తత్త్వ...ధియాం-తత్త్వజ్ఞాన = తత్త్వజ్ఞానమనెడి, అమృతామ్భః=అమృతమువంటి జలమునందు, ప్లవ=తెప్పవలె, లలిత=మనోహరమైన,-లేక, ప్లవ=తెప్పలఁదేలుటయందు, లలిత=ఉల్లాసముగలదియగు ('పరిలులిత' అనుపాఠమున అంతట వర్తించునట్లుచేయఁబడినట్టి-అనఁగా ఆజలమునవంతట నోలలార్పఁబడినట్టి యనుట), ధియాం=బుద్ధిగలవారలకు-తత్త్వజ్ఞానామృతరసమున నెవరిమనస్సు నోలలాడునో యట్టిపండితుల కనుట, కాలః=కాలము, కథఞ్చిత్=ఎట్లోయొకవిధమున, యాతు=కడచి పోవునుగాక-తత్త్వజ్ఞానముచే నుల్లసిల్లుచు కాలము పుత్తురుగాక యనుట-ఇది యొకగతి. నోచేత్=(ఇట్లు) కాదేని, స్తన...సమ్భోగినీనాం- స్తన=చన్నులయొక్కయు, జఘన=మొలలయొక్కయు, ఘన=గొప్పవియైన, ఆభోగ=పరిపూర్ణతయొక్క-విస్తారముయొక్క, సమ్భోగినీనాం=అనుభవము-లేక ఉపయోగము గలవారైన-విఱివిచన్నులును వలుఁదపిఱుఁదులును గలవారైన యనుట ('స్తనఘనజఘనాభోగసమ్భోగినీనాం' అనుపాఠమున, స్తన...భోగ=చన్నులయు గొప్పమొలలయు విస్తారమునందు- అనఁగా విరివియైనచన్నులయందును బలితంపు పిఱుఁదులయందును, సమ్భోగినీనాం=సంభోగించుచునిచ్ఛ గలవారైన, లేక, స్తన

ములందును ఘనజఘనములందును, ఆభోగసమ్భోగినీనాం=విస్తరించిన సంభోగేచ్ఛ గలవారైన-అనఁగా కుచమర్దనము అనెడి బాహ్యసంభోగమును రతి యనెడి అభ్యంతరసంభోగమును అభిలషించువారైన యనుట-దీనిచే స్త్రీకిని సమానురాగము వ్యక్త మగుచున్నది. ఇది లేనిచో *నాభాసము ప్రసక్తించునుగాన నిట్లు స్త్రీపురుషులకు సమానురాగత్వము చెప్పఁబడినదని తెలియునది-'స్తనఘన...సంసర్గిణీనాం' అనుచో. 'చన్నులయు గొప్పమొలలయు సంసర్గము గలవారైన' యని యర్థము.) ముగ్ధాఙ్గనానాం=ముద్దరాండ్రయొక్క-నవయౌవనము తలసూపుచున్న చెలువలయొక్క, స్థూలోపస్థస్థలీషు-స్థూల=బలుపుగల-బటువైన నిండారిన యనుట, ఉపస్థస్థలీషు=మన్మథగృహస్థానములందు, స్థగిత...ద్యమానాం-స్థగిత=స్థిరమైన-గట్టిగా నెలకొలుపఁబడిన యనుట-లేక, కప్పఁబడిన-తెలియునట్లు ఉంపఁబడిన, కరతల=అఱచేతుల యొక్క, స్పర్శ=తాఁకుడు అనెడి, లీలా=లీలయందు, ఉద్యమానాం=పూనికగలవారికి-మగుడల మర్మస్థానముల విలాసముగాఁ గేల స్పృశించి సుఖమనుభవించు పండితులకనుట, (కాలోయాతు=కాలము జరిగి పోవునుగాక)-ఇది రెండవగతి. జ్ఞాననిష్ఠచేఁగాని కామినీగోష్ఠిచేఁగాని పండితులు కాలము పుచ్చవలయు ననియును ఈరెండుగతులే యుత్తమములు గాన ఈరెండుతప్ప మఱియొక్క గతిని కాలము పుచ్చరాదనియును భావము. స్థూలోపస్థ' అనుటచే నిచట స్త్రీలకు చిత్రిణీజాతిసూచిత మగుచున్నది.

శా. సారం బెక్కడ లేక మిథ్య యగుసంసారంబునన్ మార్గముల్
బాఱం జూచిన రెండు పండితులకున్ బ్రహ్మానుసంధానయో
గారూఢత్వము రూపవద్యువతిరమ్యస్థూలమీనధ్వజా
గారన్యస్తకరారవిందకృతయోగ్యస్పర్శలీలారతియున్. 37

తా. సంసారము కలవలె కల్లయైనది, నిలుకడయులేనిది. కాన యెఱుకగలవారి కిందు నడచుకొనవలసినమార్గములు రెండుగలవు. అవి యేవనఁగా, వారు తమ మనస్సులను తత్త్వజ్ఞాన మనెడియమృతరసమున నోలలార్చుచు సుఖముగాఁ గాలము పుచ్చవలయును. ఇట్లు కాదేని వలుఁదచన్నులును బలితంపుఁబిఱుఁదులును గల యెలపరువంపు ముద్దరాండ్రతోడ విలాసముగాఁ గ్రీడించుచు నైనను కాలము జరుపవలయును.

శ్లో॥ †ఆవాసః క్రియతాం గాఙ్గే పాపహారిణి వారిణి ।

---

* 'ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా।యోషితో బహుసక్తిశ్చేద్రసాభాస స్త్రిధామతః' అని ఆభాసము గ్రాహ్యము.

† 'గాఙ్గంవారి మనోహారి మురారిచరణచ్యుతమ్। త్రిపురారిశిరశ్చారి పాపహారి పునాతు మామ్॥' 'పాపాపహారి దురితారి తరఙ్గధారి, దూరప్రసారి గిరిరాజ

స్తనద్వయే తరుణ్యా వా మనోహారిణి హారిణి॥ 38

టీ. పాపహారిణి=పాపములను హరించునట్టి, గాఙ్గే=గంగానదిని సంబంధించి నట్టి, వారిణి=జలమునందు, ఆవాసః=నివాసము-స్నానపానాదులు సేయుచు నా గంగానదియొడ్డున వసించుట యనుట, క్రియతాం=చేయఁబడును గాక-స్నానపానాదులచే బాహ్యాభ్యంతరశుద్ధి గలిగి స్వర్గాపవర్గములు లభించునుగాన నట్లు చేయఁదగునని భావము. (అథ) వా=లేక, హారిణి=ముత్తెపుసరులుగలదియు, కావున నే, మనోహారిణి=మనస్సును మిక్కిలి హరించునదియు, అగు, తరుణ్యాః=జవ్వనియొక్క, స్తనద్వయే=చన్నుదోయియందు, ఆవాసః క్రియతాం=నివాసము చేయఁబడును గాక-అందే రమింపఁదగుననుట, తరుణీ స్తనముల నాశ్రయించుటయే నిరతిశయసుఖము కలిగించునది గాన నట్లు చేయఁదగునని భావము. ఇట తరుణీశబ్దము గ్రహించుట చన్నుఁగవ సోలక బలితంపుబిగి కలిగియున్నదని తెలుపుటకొఱకని తెలియునది. రతనాల కడియములు బంగరుకడియములు రెండునెట్లొయట్లే చన్నుఁగవయు ముత్తెపుసరులును నొండొంటికి రామణీయకము గలిగించును గాన చందోయికి 'హారిణి' అని విశేషణము గూర్పఁబడెను. తరుణీశబ్దముచే బిగి తెలుపఁబడెను. ముత్తెపు సరులచే నలరారు బిగువుంగుబ్బలే మిక్కిలి రమించుటకుఁ దగినవని భావము. ఇందు పూర్వార్ధమున వృత్త్యనుప్రాసము. ఉత్తరార్ధమున భిన్నార్థకము లైన యొక తీరుపదములే 'హారిణి హారిణి' అని వచ్చుటంబట్టి యమకము. ఈ రెండుశబ్దాలంకారములును బరస్పరనిరపేక్షములుగాన వీనికి సంసృష్టి యని తెలియునది.

తే. అఖిలపాతకభయహారి యైనగాంగ
వారియం దైన యువమనోహారి యగుచు
హారి యగుకల్కికుల్కుమిటారిచన్ను
దోయియం దైన వాసంబు సేయవలయు. 38

తా. సకలపాపములను దూలించు గంగాజలంబుల స్నానపానంబులు సేయుచు దాని తీరమున వసించి బాహ్యాంతరశుద్ధినొంది స్వర్గాపవర్గములం బడయందగును.

---

సహావిహారి। ఝఙ్కారకారి హరిపాదరజోవిహారి, గాఙ్గం పునాతు పరితః శుభకారి వారి॥' అని గంగాజలములు సకలపాపక్షయకరములగుట వర్ణింపఁబడినది. మఱియు నది స్వర్గాపవర్గప్రదమని 'సితాసితే సరితే యత్ర సఙ్గతే తత్రాప్లుతాసో దివ ముత్పతన్తి। యేవైతన్వం విసృజన్తి ధీరాస్తేజనాసో అమృతత్వం భజన్తే; తెల్లని నల్లని నదులు రెండెచట సంగమించుచున్నవో యందు మునిఁగినవారు దేవలోకమునకుఁ బోవుదురు. అచట నెవరు దేహమును విడుతురో నాధీరులు అపవర్గమును బొందుచున్నారు' అని శ్రుతియు 'గఙ్గాతుఙ్గతరఙ్గిణీ భవభయక్లేశాపహా సర్వదా, మర్త్యానా మవగాహనాత్సకృదపి స్వర్గేఽపి సంస్థాపినీ' అని స్మృతియు ప్రతిపాదించెడిని.

లేదా, *ముత్తెపుసరులచే నలరారు జవరాలి బిగిగబ్బిగుబ్బలయందు రమించుచు నిహలోకసుఖము నైనఁ బడయందగును.

అవ. ఇఁక రెండుశ్లోకములచే నిగమించుచున్నాఁడు.

శ్లో॥ కి మిహ బహుభి రుక్తై ర్యుక్తిశూన్యైః ప్రలాపై
ర్ద్వయ మిహ పురుషాణాం సర్వదా సేవనీయమ్।
అభినవమదలీలాలాలసం సున్దరీణాం
స్తనభరపరిఖిన్నం యౌవనం వా వనం వా॥ 39

టీ. ఇహ=ఈవిషయమునందు, బహుభిః=అనేకములును, యుక్తిశూన్యైః=ఒప్పిదము లేనివియు-సారహీనములు ననుట, ఉక్తైః=చెప్పఁబడినవియునగు, ప్రలాపైః=ప్రేలుటలచేత-అనర్థకవచనములచేత ననుట, కిం=ఏమి, ఫల మని శేషము-సారము లేని వట్టి ప్రేలరిమాటలు పెక్కు చెప్పుటవలన మొత్తుపెట్టుకొనుటే కాని మఱియొక్క ఫలము గలుగ దనుట. అయితే, ఇహ=ఈలోకమునందు, పురుషాణాం=పురుషులకు, ద్వయం=రెండు, సర్వదా=ఎల్లప్పుడును, ('సర్వథా' అనుపాఠమున అన్నివిధములచేత నని యర్థము), సేవనీయమ్=సేవింపఁదగినది. ఆరెండెవ్వియనఁగాఁ జెప్పుచున్నాఁడు, అభినవ...లాలసం-అభినవ=క్రొత్తయైన, మద=మన్మథావేశపుమత్తుయొక్క-దానిచేఁ గలిగిన యనుట, లీలా=విలాసములందు, లాలసం=ఆసక్తమైనట్టియు-వలపుసొలపునఁ జేయుచిన్నెలు వన్నెలు గలదియు ననుట, స్తన...ఖిన్నం-స్తనభర=గుబ్బలబరువుచేత, పరిఖిన్నం=మిగుల బడలినట్టియు, సున్దరీణాం=అందకత్తెయలయొక్క, యౌవనం వా=ఎలప్రాయముగాని-ఇచట అచేతనమైన యౌవనమునకు చేతనధర్మములైన లాలసత్వపరిఖిన్నత్వములు కలవు గాని యౌవనవతియొక్కయాధర్మము లాయౌవనమునందు ఉపచరించినవని తెలియునది-మఱఁడు సెరరేపువలపుపొలుపునఁ గ్రొత్తలుగాఁ బొటమరించు కలికిపలుకులు గలదియు, గబ్బిగుబ్బలప్రేఁగున నల్లల్ల పచరించు చేష్టితములు గలదియు నైనయెలజవ్వనముగాని యనుట, వనంవా=పుణ్యారణ్యముగాని, సేవింపఁదగినది యని సంబంధము. ఈరెండు పరమసుఖప్రదము లని భావము.

చ. కనుఁగొన యుక్తియుక్తములుగానివి మాటలు వేయు నేటికిఁ
గొనబుగ రెండు మానవులకుర్ భజనార్హము లైనవస్తువుల్
వినుతనవీనచారుమదవిభ్రమలాలససుందరీజన
స్తనభరఖిన్న మై యమరుయౌవనముఀ వనమున్ వసుంధరన్.

---

* చనుగుబ్బలే ముత్తెపుసరులకు వన్నె గూర్చుట 'తరుణీస్తన ఏవ దీప్యతే మణిహారావలిరామణీయకమ్' అని శ్రీహర్షుఁడు చెప్పియున్నాఁడు.

తా. సారములేనిపలుమాట లూరక పేర్కొనుటవలనఁ బని యేమి? మరువికారంపు సొంపు దళుకొత్త మత్తిలి యొయ్యనొయ్యఁ బొడసూపు నొయ్యారంపుఁగులుకు మీఱుచును, గ్రిక్కిఱియుచన్నుఁగవ వ్రేఁగున నల్లల్ల సోలి క్రాలుచునున్నయందకత్తియల యెలప్రాయం బనుభవించి యిహసుఖంబు నేని, లేదా పుణ్యారణ్యంబుల నిలిచి తపంబు సేసి యాముష్మికసుఖంబు నేని పురుషు లెప్పుడును బొందవలయునుగాని యీ రెండుదప్ప వేఱొద్దియును జగదు.

అవ. ఇప్పుడు సారముగాఁ దేలినవిషయమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సత్యం జనా వచ్మి నపక్షపాతా, ల్లోకేషు సప్తస్వపి తథ్య మేతత్।
నాన్య న్మనోహారి నితమ్బినీభ్యో, దుఃఖైకహేతుర్నచ కశ్చి దన్యః॥

టీ. హేజనాః=ఓజనులారా, సత్యం=నిజమును, వచ్మి=చెప్పుచున్నాను, పక్షపాతాత్=పక్షపాతమువలన, న (వచ్మి)=చెప్పను-నిష్పక్షపాతముగానే చెప్పుచున్నాననుట, సప్తసు లోకేషు అపి=ఏడులోకములందును, ఏతత్=ఇదియే, తథ్యం =సత్యమైనది-అది యేదియో చెప్పుచున్నాఁడు. నితమ్బినీభ్యః=యువతులకంటెను, మనోహారి=మనోహరమైన (వస్తువు), అన్యత్=మఱియొక్కటి, న(అస్తి)=లేదు. అట్లె వారికంటె, దుఃఖ ఏకహేతుః=దుఃఖములకు ముఖ్యకారణమైనది, అన్యః=మఱియొకటి, న (అస్తి)=కలుగదు, 'శోభోగో రమణీంవినా' ఇత్యాదులచే రమణియే భోగైకసాధనముగాను, 'బద్ధమూలస్య మూలం హి మహద్వైరతరోః స్త్రియః' అన్నట్లు ఇదియే అనర్థకమూలముగాను నుండుటచే నితంబినులే పరమసుఖమునకుఁగాని పరమదుఃఖమునకుఁగాని నిదానమైనవా రని భావము. ఇచట స్త్రీకంటె వేఱైన రమ్యవస్తువును అనర్థహేతువును ఉండియు లేవనఁబడెను. ఇట్లారెంటియొక్క సంబంధ ముండియు లేదని యసంబంధము చెప్పుటచే అతిశయోక్తి.

తే. తథ్యమ వచింతుఁ బక్షపాతమునఁ గాదు
నిఖిలజగములయం దిది నిక్కువంబు
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు
వారలే కష్టముల కెల్లఁ గారణములు. 40

తా. జనులారా! నేను సత్యమొకటి చెప్పెద. అది చెప్పుట పక్షపాతముచేఁ గాదుసుఁడీ. వలుఁదపిఱుఁదులుగల జవరాండ్రకంటె మనోహరమైనవస్తువును లేదు. వారికంటె దుఃఖకారణ మగువస్తువును గలుగదు. ఇది యిందే కాదు. ఈసప్తలోకములందును నిజము.

ఈ రెండుశ్లోకములందు పక్షద్వయము నిరూపించుటకు భావ మేమనఁగా, అఖండానందప్రాప్తిలక్షణమైన మోక్షము ముఖ్యపురుషార్థ మనుట సర్వసిద్ధాంతసమ్మతము. సకలప్రాణులును స్త్రీపుంసయోగాత్మకమైనకామముచేతనే జనించుటచే

తను మహాత్ములును పిత్రాణవిముక్తికై దానిని పరిగ్రహించుటచేతను కామమును పురుషార్థ మని నందికేశ్వర శ్వేతకేతు పాంచాల వాత్స్యాయనాదుల సిద్ధాంతము. అందు ముఖ్యపురుషార్థమైనమోక్షమునకై తత్సాధనములందు ప్రవర్తింపవలయు. లేదా, 'పూర్వాలాభేపరఃపరః' అనున్యాయముచొప్పున కామపురుషార్థమునకు సాధనము లైనవానియందైన నవశ్యము ప్రవర్తింపవలయునని రెండుపక్షములును జెప్పఁబడినవిగాఁ దెలియునది.

ఇది నీతిశతకమునందు సంభోగవర్ణన మన్నది ద్వితీయవింశతి.

---

## భర్తృహరిసుభాషితము-కామినీగర్హణము.

---

అవ. 'దుఃఖైకహేతు ర్నచ కశ్చి దన్యః' అని చెప్పినదానినే విస్తరించి నిరూపించుట కిపుడు కామినీగర్హణమును అనఁగా స్త్రీనింద నిరువదిశ్లోకములచేఁ జేయుచున్నాఁడు.

శ్లో॥ కాన్తే త్యుత్పలలోచనేతి విపులశ్రోణీభరే త్యున్నమ
త్పీనోత్తుఙ్గపయోధరేతి సుముఖామ్భోజేతి సుభ్రూ రితి।
దృష్ట్వా మున్యాతి మోదతేఽభిరమతే ప్రస్తౌతి విద్వానపి
ప్రత్యక్షాశుచిభస్త్రికాం స్త్రియమహో మోహస్య దుశ్చేష్టితమ్॥

టీ. విద్వాన్ అపి=ఎఱుకగలవాఁడైనను-సారాసారములను విచారించునేర్పుగలజ్ఞానవంతుఁడైనను, ఇంకొకరిని జెప్పనేల యనుట, ప్రత్య... స్త్రికాం-ప్రత్యక్ష=ప్రత్యక్షముగా, అశుచిభస్త్రికాం=అపవిత్రమైన తిత్తియైన-మిక్కిలి యేవగింపఁదగినస్వరూపము గలదైన యనుట, ('ప్రత్యక్షామసిపుత్రికాం' అనుపాఠమున, ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్న చూరకత్తి యైనట్టి-అనఁగా చూరకత్తివలె వేధించునట్టిదైనయనుట), స్త్రియం=స్త్రీని, దృష్ట్వా=చూచి, కాన్తా ఇతి=మనోహర మైనది యనియు-చెలువయనియు ననుట, ఉత్పలలోచనా ఇతి=నల్లకలువలవంటి కన్నులు గలదనియు, విపులశ్రోణీభరా ఇతి=వలుఁదపిఱుఁదులబరువు గలది- అనఁగా బలితంపువలుఁదపిఱుఁదులుగలది యనియు, ఉన్న...ధరేతి-ఉన్నమత్=ఎగయునదియు-పుటమెగయుచున్నట్టిదియనుట, పీన=బలుపుగలదియు, ఉత్తుఙ్గ=పొడవైనదియు నగు, పయోధరా ఇతి=చన్నులుగలదియనియు-చన్నులు పీనోత్తుంగము లగుటచే పైకి నెగయునో యన్నట్లు గానిపించునవనుట, ('ఉత్సుకః పీనోత్తుఙ్గపయోధరేతి' అనుపాఠమున, ఉత్సుకః=తమి గలవాఁడై అని విద్వాంసునికి విశేషణమగును), సుముఖ+అమ్భోజా ఇతి-చక్కనిమోముదామర గలది యనియు-తామరవలె చక్కనైన నెమ్మో

ముగలదియనుట, సుభ్రూః ఇతి=తీరైనకనుబొమలు గలదియనియు, ముహ్యతి=మోహపడుచున్నాఁడు-మతిమాలిసొగియుచున్నాఁడనుట ('మాద్యతి' అనుపాఠమున మత్తుఁడగుచున్నాఁడు-చొక్కి మత్తిలుచున్నాఁడనుట), మోదతే=సంతసిల్లుచున్నాఁడు, అభిరమతే=క్రీడించుచున్నాఁడు, ప్రస్తౌతి=(ముందు చెప్పినట్లు గాని మఱొకరీతినిగాని) పొగడుచున్నాఁడు. కాఁబట్టి, మోహస్య=మోహముయొక్క, దుశ్చేష్టితం=దుర్విలసితము-చెడుసయ్యాటము, అహో=ఆహా! ఆశ్చర్యము-విద్వాంసునిగూడ నిట్టివానినిగాఁ జేయుచున్నదే యేమాశ్చర్యమనుట. ఇచట పెక్కుక్రియలు సముచ్చితము లగుటచే సముచ్చయాలంకారము.

మ. మలభూయిష్ఠపుఁదోలుబొమ్మ యగుకామ్మంజూచి విద్వాంసుఁడుం
బులినశ్రోణి మనోహర స్తని నవాంభోజాస్య నీలోత్పలా
క్షి లతాతన్వి యటంచు మత్తుఁడగు హర్షించుఁ రమించుఁ బలీ
బలియంచుఁ వినుతించు మోహవికృతుల్ భావింపఁగాఁజిత్రముల్.

తా. ప్రత్యక్షముగా కసుమాలపు తిత్తి యై చూపట్టుచున్న స్త్రీని జూచినంతనే సారాసారములు తెలిసినపండితుఁడు సైతము మిక్కిలి యసహ్యపడఁదగిన దానిస్వరూపమును మఱచి చెలువ యనియు, కలువకంటి యనియు, వలుఁదపిఱుఁదులాఁడి యనియు, నుదుటుగబ్బిగుబ్బలాఁడి యనియు, తామరవంటి నెమ్మోము గలదనియు, కామునివిలువలెఁ దీరిచినట్టులున్న కనుబొమలు గలదియనియు, మతి దూలి, చొక్కి, యుబ్బి, దానితోఁ గ్రీడించుచుఁ బొగడుచునున్నాఁడు. * ఆహా! మోహముయొక్క సయ్యాట మేమనవచ్చును?

అవ. మూఁడు శ్లోకములచే దానిస్వరూపమును దూషించుచున్నాఁడు.

శ్లో॥ స్మృతా భవతి తాపాయ దృష్టా చోన్మాదకారిణీ।
స్పృష్టా భవతి మోహాయ సా నామ దయితా కథమ్॥ 42

---

*'అమేధ్యపూర్ణం కృమిజన్తుసఙ్కులం స్వభావదుర్గన్ధ మశౌచ మధ్రువమ్।
కళేబరే మూత్రపురీషభాజనే రమేత మూఢో న రమేత పణ్డితః' అమేధ్యముచే నిండినదియు, పురుగులచే నెఱసినదియు, సహజముగా చెడుకంపుగొట్టునదియు, శుచికానిదియు, నిత్యముకానిదియు, మూత్రపురీషములకు పట్టు అయినదియు నగు బొందియందు మూఢుఁడే రమించునుగాని పండితుఁడు రమింపఁడు; అన్నట్లు, పండితునికి నేవగింపఁదగిన యిట్టి కామినియొక్క కళేబరమునందు రమించుటయే కలుగదు. అయినను మోహము మిక్కిలిప్రబల మైనదిగాన నట్టివానినిగూడ దానియందు రమింపఁ జేయుచున్న దని భావము.

టీ. (యా=ఏది), స్మృతాసతీ=తలంచుకొనఁబడినదగుచు-పురుషునిచే దేశాంతరమున నొకప్పుడు స్మరింపఁబడినదగుచు, తాపాయ=తాపముకొఱకు, భవతి=అగుచున్నదో-తాపముకలిగింపఁజాలిన దగునో యనుట, పిదప, దృష్టాసతీ=చూడఁబడినదగుచు, ఉన్మాదకారిణీ=చిత్తవిభ్రమము కలిగించునదో-మదికిఁ దత్తఱపాటు కలిగించునది యగునో, స్పృష్టాసతీ=తాఁకఁబడినదగుచు-కౌఁగిలింపఁబడినదగుచు ననుట, మోహాయ=మైమఱపునకు, భవతి = అగుచున్నదో-పారవశ్యమున బయటిప్రపంచమును మఱచునట్లు సేయుచున్నదోయనుట, సా=అది-ఆకాంత, కథంనామ=ఎట్లు, దయితా=ప్రియతమ-మనస్సునకింపైనదనుట-ఎట్లును ప్రియతమకాదు; ఉక్తకారణములంబట్టి యప్రియతమయె యగు నని భావము. ఇచట 'స్మృతా భవతి తాపాయ' ఇత్యాదిపదార్థములు 'సా దయితా కథం' అను పదార్థమునకు విశేషణగతిని హేతువు లగుటచే నలంకారము కావ్యలింగము.

క. తనుఁ దలఁచినఁ బరితాపము
గనుఁగొనఁ జిత్తభ్రమంబుఁ గగదు వేడుకము
ట్టిన మోహంబు నొసంగెడు
వనిత దయిత యనుచుఁ బలుకఁ గ వచ్చునె జగతిన్. 42

తా. దేశాంతరమునందుండి యొకానొకప్పుడు మనకామినిని దలంచుకొందుమేని నది తోడనే మదనతాపము పుట్టించును. దానినిఁ గన్నులారఁ జూచితిమా మతిని దత్తఱపఱిచి కలఁచును. వచ్చి కౌఁగిలించితిమా యంతయు మఱచి పారవశ్యము నొందునట్లు చేయును. ఇట్టిది ప్రియురాలని యెట్లు చెప్పవచ్చును?

శ్లో॥ తావదే వామృతమయీ యావ ల్లోచనగోచరా।
చక్షుష్పథా దతీతాతు విషాద ప్యతిరిచ్యతే॥ 43

టీ. యావత్=ఎంతవఱకు, లోచనగోచరా=కంటికిఁ గనఁబడునది యగునో, తావదేవ=అంతవఱకే, అమృతమయీ=అమృతమైనదిగా నుండును-అమృతమువలె మిక్కిలి మధురముగా నుండుననుట, చక్షుఃపథాత్=కంటియొక్క త్రోవనుండి-చూపుమేరనుండి యనుట, అతీతాతు=కడచిపోయినదైతేనో, విషాదపి=విషమునకంటె-కాలకూట విషమునకంటెను, అతిరిచ్యతే=అతిశయించిన దగును-దానివలె ప్రాణము నలంచుననుట. ఇచట వధువు అమృతమయిగాను విషాతిరిక్తగాను నుండుసంబంధములేకున్నను సంబంధ మున్నట్లు చెప్పుటచే నలంకార మతిశయోక్తి.

తే. ఎంతలో నింతి కన్నులకెదుట నిలుచు
నంతలో నింపు వాటించు నమృతమట్ల

కాక లోచనమార్గంబు కే గడచెనేని
గరళమునకన్నఁ బ్రాణసంకటముఁ జేయు. 43

తా. కాంత కంటికి నగపడుచుండునంతవఱకె యమృతమువలె నింపుసొంపు గూర్చుచుండును. కంటికి మఱుఁగయ్యెనా కాలకూటమునను మించి ప్రాణముల నలంచును.

అవ. చెప్పినయర్థము నే శ్లోకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ నామృతం న విషం కిఞ్చి దేకాం ముక్త్వా నితమ్బినీమ్।
సై వామృతలతా యుక్తా వియుక్తా విషవల్లరీ॥ 44

టీ. నితమ్బినీం=చక్కనిపిఱుఁదులు గలదానిని-కాంతను, ఏకాం=ఒక్క తెను, ముక్త్వా=విడిచి, అమృతం=అమృతమనునది, కిఞ్చిత్=ఏదిగాని, న=లేదు, విషం=విషమనునది, కిఞ్చిత్=ఏదిగాని. న=లేదు- స్త్రీతప్ప అమృతముగాని విషముగాని వేఱొకటి లేదు-ఇదియే అమృతమును విషమును అగుననుట- అమృతమువంటిదియు విషమువంటిదియు నగునని భావము. అగుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు. యుక్తా(చేత్) =కూడఁబడియుండినది (అగునేని), సాఏవ=అదియే-ఆనితంబినియే, అమృతలతా= అమృతపు తీఁగ-సంజీవిని-యగుననుట, వియుక్తా (చేత్)=ఎడఁబాయఁబడినది(యగునేని), విషవల్లరీ=విషపుతీఁగ, అగును-ప్రాణాపహారిణి యగుననుట. ('యుక్తా' అనుటను 'రక్తా' యనియు 'వియుక్తా' అనుటను 'విరక్తా' యనియు పాఠాంతరములు. అప్పుడు, రక్తా=అనురాగము గలదియనియు, విరక్తా=అనురాగములేనిది యనియు నర్థము.) అమృతలతలె బ్రతికించునదియు విషవల్లరివలెఁ జంపునదియు నగు ననుట. నితంబినియేకాక వేఱైనయమృతమును విషమును లోకమునఁ గలిగియున్నవి. ఇట్లు వేఱైన యమృతవిషములకుఁ గలిగియుండునట్టిసంబంధ ముండియు 'నామృతం నవిషం' అని అవిలేవనెడియసంబంధమును జెప్పుటచే నిచట నలంకార మతిశయోక్తి. ఉత్తరార్థమునందు, నితంబినిని అమృతలతగాను విషవల్లరిగాను రూపించుటచే నలంకారము రూపకము. 'యుక్తా' 'వియుక్తా' అను పదార్థములే హేతువులై అమృతలతాత్వవిషవల్లరీత్వములను సమర్థించుటచే నలంకారము కావ్యలింగమును జెలియునది. 'యుక్తావియుక్తా' అని హేతువులు ప్రతిపాదించు నీకావ్యలింగముచేత నే 'అమృతలతా' 'విషవల్లరీ' అని రూపణములుసేయు రూపకాలంకారము ఉత్థాపితమైనది. నితంబిని నే అమృతలతగాను విషవల్లరిగాను నీరూపకము రూపించుటచే, 'నామృతం నవిషం కిఞ్చిత్' 'మఱొకయమృతమును లేదు విషమును లేదు' అను అతిశయోక్తి యుత్థాపితమైనదిగాన నిది రూపకానుప్రాణిత మగును. ఇట్లు అలంకారములు పరస్పరాపేక్షితములై యుండుటంజేసి సంకర మనియుఁ దెలియునది.

ఆ. పడఁతి యొక్క దానిఁ విడిచి యించుక యమృ
తంబు లేదు భువి విషంబు లేదు
అమృతలత లతాంగి యనురాగవతి యైనఁ
గాక మెలఁగె నేని గరళవల్లి. 44

తా. బలితంపుపిఱుఁదులు గలయెమ్మెలాఁడి కూడియుండునప్పు డమృతలతవలె ప్రాణముల నెలకొలుపుచున్నది. ఎడఁబాసినయెడల విషవల్లివలె ప్రాణముల నలంచుచున్నది. కాఁబట్టి యదితప్ప నమృతముగాని విషముగాని వేఱొకటి లేదు.

అవ. స్త్రీ యనెడుయంత్రమును సృజించినవానిని దూషించుచున్నాఁడు.

శ్లో॥ ఆవర్తః సంశయానా మవినయభవనం పట్టణం సాహసానాం
దోషాణాం సన్నిధానం కపటశతమయం క్షేత్ర మప్రత్యయానామ్
స్వర్గద్వారస్య విఘ్నో నరకపురముఖం సర్వమాయాకరణ్డం
స్త్రీయన్త్రం కేన సృష్టం విషమమృతమయం ప్రాణిలోకస్య పాశః॥

టీ. సంశయానాం=సందేహములయొక్క, ఆవర్తః=సుడియు-సుడి త్రిప్పునట్లు ఎడతెగని సందేహములచే మనస్సును త్రిప్పునదియు, అవినయభవనం=అవినయములకు నిల్లు అయినదియు-వినయము లేక వర్తించున దనుట, సాహసానాం=తెగుదారితనములకు, పట్టణం=పట్టణ మైనదియు, దోషాణాం=రాగద్వేషాదిదోషములకు, సన్నిధానం=అక్షయ మైననిధి యైనదియు-తఱుఁగనిపాఁతఱ యైనదనుట- దీనియందలి దోషము లెన్నఁటికిఁ దఱుఁగవనుట-లెక్కింపరాని దోషములకు పట్టు అయినదని భావము, కపట శతమయం=పెక్కులైన కపటములచే మిక్కిలి యైనదియు- నిలువెల్ల కపటములే కాన పలువిధములైన కపటముల నిండే చూడఁగలుగు నని భావము, అప్రత్యయానాం=అవిశ్వాసములకు, క్షేత్రం=పుట్టుచోటు-అవిశ్వాసములను పెక్కుపుట్టించునది యనుట, స్వర్గద్వారస్య=స్వర్గలోకప్రాప్తికి సాధన మైనదానికి, విఘ్నః=అడ్డపాటు అయినదియు, నరకపురముఖం=యమలోకమునకు ద్వార మైనదియు-నరకము గలిగించునది యనుట, సర్వమాయాకరణ్డం=సమస్తములైన యింద్రజాలాదిమాయలకు పెట్టియ యైనదియు-పెట్టెవలె నన్నివిధములైనమాయలను సంగ్రహించియున్నది యనుట, అమృతమయం=అమృతరూపముగా నున్నట్టి, విషం=విష మైనదియు-బయటికి నమృతమువలెఁ దోఁచుచు లోపల విచారింపఁగా విషప్రాయ మైనది యనుట, ప్రాణిలోకస్య=జనసముదాయమునకు, పాశః=పాశ మైనదియు-బంధించు సాధన మనుట, అగు, స్త్రీయన్త్రం=స్త్రీయనెడి జంత్రము, కేన=ఎవ్వనిచేత, సృష్టం=నిర్మింపఁబడినది-ఇట్టి యనర్థావహ మైన యంత్రము నిర్మించుట కుత్సితమే

యగునుగాన అట్టిపల్సితుఁ డెవ్వఁ డని ప్రశ్నము, లేక, బ్రహ్మయే యిట్టిదుష్టయంత్రమును నిర్మించినవాఁడేని యాతని నామము నుచ్చరించుటయుఁ దగదుగాన 'కేన' అని అనిర్దిష్టముగాఁ జెప్పఁబడినదనియు గ్రహింపవచ్చును. ఇచ్చట స్త్రీయంత్రమున పట్టణాదిరూపణము లుండుటచే నిరవయవరూపకాలంకారము.

మ. నరకద్వారము సాహసాకరము పుణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దోషస్థాన మప్రత్యయో
త్కరసుక్షేత్రము కాలకూట మమృతాకారంబు స్త్రీయంత్రముర్
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళోద్బంధక్రియాపాశమున్.

తా. ఎడతెగనిసందేహములను బుట్టించి మనస్సును సుళ్ళఁబెట్టునదియు, అవినయములకు నునికిపట్టయినదియు, సాహసములకు వీడైనదియు, పలువగల కపటములు నిలువెల్లఁ గలదియు, అవిశ్వాసములను బుట్టించునదియు, స్వర్గప్రాప్తికి సాధనములైనవాని నెల్లఁ జెఱుపునదియు, నరకమును గలిగించుసాధనమైనదియు, సకల మాయలను సేకరించి పెట్టియున్న పెట్టియవంటిదియు, బయటి కమృతమువలె నుండియు లోపల విషప్రాయమై యుండునదియు, జనిసముదాయమునకెల్ల బంధనమైనదియు నగు స్త్రీయనెడియంత్రమును గుల్సితుఁ డెవఁడు నిర్మించెనో తెలియరాదు.

అవ. ఇట్లు కపటమునకే పాలుపడి యున్న స్త్రీయంత్రమును మఱియొక్కవిధమైనదిగా పొగడుకవులవిస్తారవర్ణనములచే మోసపోయి మూఢుఁడు అనువర్తించుచున్నాఁ డని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ నో సత్యేన మృగాఙ్క ఏష వదనీభూతో న చేన్దీవర
ద్వన్ద్వం లోచనతాం గతం న కనకైర ప్యఙ్గయష్టిః కృతా।
కి న్త్వేవం కవిభిః ప్రతారితమనా స్తత్త్వం విజానన్నపి
త్వఙ్మాంసాస్థిమయం వపు ర్మృగదృశాం మన్దోజనః సేవతే॥ 46

టీ. ఏషః=ఈ-ఈకనఁబడుచున్న యనుట, మృగాఙ్కః=చంద్రుఁడు, సత్యేన=యథార్థముగా, వదనీభూతః=ముఖముగా నైనవాఁడు-ముఖముగా పరిణమించినవాఁడనుట, నో=కాదు, ఇన్దీవరద్వన్ద్వం=రెండునల్లగలువలు, లోచనతాం=లోచనభావము-కన్నగుటను, గతంనచ=పొందినదియుఁగాదు:-రెండుకలువలు కండ్లోయిగాఁ బరిణమింపలేదనుట, కనకైః=బంగరుతీఁగలచేత-లేక, సంపెంగపూవులచేత, 'అథ చాంపేయశ్చమ్పకో హేమపుష్పకః' అని యమరుఁడు, అఙ్గయష్టిః=దేహము, కృతా న=చేయఁబడినది కాదు. 'కాపిచాంపేయగౌరీ' అని సంపెంగవన్నె గలిగియుండుట పద్మినీలక్షణము. కిన్తు=అయితే, ఏవం=ఇట్లు-మొగము చంద్రుఁడు, కన్నులు నల్లగ

లువలు, మేను బంగారు అని యీప్రకారమున, కవిభిః=(మాటనేర్పు గల) కవుల చేత, ప్రతారితమనాః=వంచింపఁబడినమనస్సు గలవాఁడై- వారివర్ణనములు మది నమ్మి మోహమునొందినవాఁడై యనుట, మూఢః=మూఢుఁడను, జనః = జనుఁడు, తత్త్వం=కలరూపును, విజానన్ అపి= తెలియువాఁడైనను - ఈమొగముచంద్రుఁడు గాదు పోలికచేత నట్లు చెప్పఁబడినది యని ముఖాదుల కలరూపును నెఱుఁగుచున్న వాఁ డయ్యు ననుట, త్వ...మయం-త్వక్ =తోలు, మాంస= కండ, అస్థి=ఎమ్ములు, మయం=వీనిచే నైనట్టి-మిక్కిలి యేవగింపఁదగినదైనను అనుట, మృగదృశాం= స్త్రీల యొక్క, వపుః=కళేబరమును-బొందిని, సేవతే=సేవించుచున్నాఁడు-సంభోగించుట కై చేకొనుచున్నాఁడు. ఎఱుక గలవాఁడో యట్లు దానిం గైకొనఁ డనుట. ఇచట 'ప్రతారితమనాః' అనుపదార్థము విశేషణగతిచే త్వఙ్మాంసాస్థిమయవపుః సేవనము అను పదార్థమునకు హేతువగుటచే నలంకారము కావ్యలింగము.

చ. అలనెల కామినీవదన కైమై జనియింపఁగ లేదు కల్వలుఁ
నెలఁతకుఁ గన్నులై యునికి కైనిక్కము గాదు కడానిచే నొడల్
వలనుగఁ జేయలేదు కవివంచితమానసుఁడై వివేకియుఁ
మలమలినాంగనాతనుసమాశ్రయుఁడై విహరించు మందతన్.

తా. నిజము విచారింపఁగా చంద్రుఁడు స్త్రీయొక్క మొగమైనవాఁడుగాఁడు. దానికన్నులు నల్లగలువలు కావు. దాని మెయిదీఁగయు మిసిమిబంగారుతోఁ జేయఁ బడినదిగాదు. అయితే కవులు వానిని అట్లు వర్ణింపఁగా మూఢుఁడు విని మతిమాలి స్త్రీశరీరము తోలు, కండ, యెమ్ములతో నైనదని తెలిసినవాఁడయ్యు దానినే సేవించుచున్నాఁడు.

అవ. పురుషులు స్త్రీని జూచి భ్రమించుటను దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ లీలావతీనాం సహజా విలాసా స్త ఏవ మూఢస్య హృది స్ఫురన్తి।
రాగో నలిన్యా హి నిసర్గసిద్ధ స్తత్ర భ్రమత్యేవ ముధా షడఙ్ఘ్రిః॥

టీ. లీలావతీనాం=విలాసినులయొక్క, విలాసాః=విభ్రమములు-ఒయ్యారంపు వగలనుట, ('స్వభావాః' అనుపాఠమున కటాక్షభ్రూవిక్షేపాదిధర్మము లనియర్థము), సహజాః=కూడఁబుట్టినవి-వారికి స్వభావసిద్ధము లైనవేకాని తెచ్చిపెట్టుకొన్నవి కావనుట, తేఏవ=అవియే-ఆ సహజములైనట్టి విలాసములే, మూఢస్య= తెలివిలేనివాని యొక్క, హృది=మనస్సునందు, స్ఫురన్తి ప్రకాశించుచున్నవి-అవి తన్నుఁగూర్చి చేయఁబడినవిగా వానిమనస్సునందు ప్రకాశించుననుట, ఇట్లు స్ఫురించుట వ్యర్థమే యగు నెట్లనఁగా, నలిన్యాః=తామరతీఁగయొక్క, రాగః=అనురాగము-ఎఱుపు అని యాశయము, నిసర్గసిద్ధః=స్వభావముచేతనే కలిగినదిగదా, షడఙ్ఘ్రిః = తుమ్మెద,

ముధాఏవ=వ్యర్థముగానే, తత్ర=ఆతామరతీఁగయందు, భ్రమతి=తిరుగాడుచున్నది, తన్ను గుఱించియే యీతామరకు రాగము గలిగినదని భ్రమించి దానిఁ జుట్టి తిరుగు ననుట. నిజముగా తామరతీఁగెకు తుమ్మెదయెడ రాగము లేదుగాన నది భ్రమించుట వ్యర్థమేయనిభావము. ఇట రాగమనఁగా ఎఱుపనియు నది తామరతీఁగెకు స్వభావ సిద్ధమైన దనియు భావము.

ఇచట రెండువాక్యములందు బింబప్రతిబింబభావముచే సామ్యమును నిర్దేశించుటవలన దృష్టాంత మలంకారము. ఎఱుపనెడిరాగమునకు అనురక్తియనెడురాగమునకు భేదముండియు శ్లేషచేనైన యభేదాధ్యవసాయమువలన నతిశయోక్తి. దానిచే 'భ్రమత్యేవ' అని భ్రాంతిమదలంకారము నిర్వహింపఁబడియె. ఈభ్రాంతిమంతముచే, ప్రస్తుతములైన నళినీషట్పదములవలన అప్రస్తుతములైన కామినీవిటులను దోఁపించు సమాసోక్తి ఉజ్జీవితమైనది. ఇది పూర్వోక్తదృష్టాంతమునకు అంగ మగుటచే సంకరము నూహ్యము.

తే. లలిత మైనట్టిలీల లీలావతులకు
సహజ మది మూఢునకు మది సందడించుఁ
బద్మినికి రాగగరిమ స్వాభావికంబు
తేఁటి పనిలేక దానిలోఁ దిరుగుచుండు. 47

తా. తామరతీఁగెకు రాగము సహజమైనదిగానున్నను అది తన్ను గుఱించినదిగాఁదలఁచి తుమ్మెద దానియందు భ్రమించునట్లు లీలావతులకు నొయ్యారంపువగలు కూడఁబుట్టినవే యైనను మూఢుని కవి యట్టివిగాఁ దెలియక తన్నుగుఱించి ప్రచరింపఁబడినవిగా మనస్సునఁ దోఁచుచుండును.

అవ. పైకి సొగసైనదిగాఁ దోఁచుచెలువలమొగంబును జూచి మోహపడరా దనుచున్నాఁడు.

శ్లో॥ య దేత త్పూర్ణేన్దుద్యుతిహర ముదారాకృతి పరం
ముఖాబ్జం తన్వఙ్గ్యాః కిల వసతి యత్రాధరమధు ।
ఇదం త త్కింపాకద్రుమఫల మిదానీ మతిరసం
వ్యతీతేఽస్మి న్కాలే విషమివ భవిష్య త్యసుఖదమ్॥ 48

టీ. యత్ ఏతత్=ఏ యీ, తన్వఙ్గ్యాః=స్త్రీయొక్క, ముఖఅబ్జం=మోముఁదామర-తామరవంటినెమ్మొగ మనుట, పూర్ణ...హరం-పూర్ణేన్దు=నిండుచందురుని యొక్క, ద్యుతి=కాంతిని, హరం=దొంగిలునదియు-నిండుచందురునికి సాటియైనది యనుట, తామర నిండుచందురునికాంతి హరించుట విరుద్ధమని ధ్వని, పరం=మిక్కిలియు, ఉదారఆకృతి=రమ్యమైన ఆకారముగలదియు, యత్ర=ఎందు-ఏముఖాబ్జము

నం దనుట, అధరమధు=మోవితేనియ, వసతి కిల=ఉన్నదియందురో-ఉన్నదియని లోకు లనుటే కాని యెప్పుడు ననుభవింపఁబడినది కాదు; ప్రసిద్ధమైన తామరయందు పూఁదేనె యున్నది; ఈముఖతామరసమందో అది వార్తామాత్రమే కాని వాస్తవము కాదనుట, తత్ ఇదం=అయిది - ఆయీముఖాబ్జ మనుట. కింపాక...ఫలం-కింపాకద్రుమ=ముసిఁడిచెట్టుయొక్క, ఫలం=ఫలమైనది ('కింపాకః స్యాన్మహాకాళః' అని హలాయుధుఁడు. 'విషముష్టౌ నిరర్థకేచ' అని శబ్దరత్నకోశము. ముసిఁడిపండగుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు.), ఇదానీం=ఇప్పుడు - భక్షించుకాలమున అని ముసిఁడిపరముగాను-అనుభవింపఁదగిన యీ యౌవనకాలమునం దని ముఖాబ్జపరముగాను గ్రాహ్యము, అతిరసం = మిక్కిలియు మాధుర్యాదిగుణము గలది-మిక్కిలియు ననురక్తి గొలుపున దనుట, అయితే, అస్మిన్ కాలే= ఈయనుభవింపఁబడు కాలము-యౌవనసమయ మనుట, అతీతేసతి=కడచిన దగుచుండఁగా, విషమివ=విషమువలె, అసుఖదం= దుఃఖమునిచ్చునది, భవిష్యతి=అగును, ముసిఁడిపండువలె భుజించునపు డతిమధురముగా నుండి పరిణామమున విషతుల్య మైనట్లు తరుణీముఖాబ్జమును అనుభవయోగ్యమైన యౌవనసమయమందు నతిప్రేమావహమై యది జారినపిదప విషమువలె దుఃఖావహ మగు నని భావము.

శా. రాకాకైరవమిత్రకాంతిహరమై రమ్యాధరోష్ఠామృతా
స్తోకంబై విలసిల్లుచున్నరమణీశుంభన్ముఖాబ్జంబు కిం
పాకక్ష్మాజఫలం బగుఁ రుచిరమై ప్రారంభకాలంబునం
గాకోలంబు తెఱంగునన్ నరులకుం గష్టం బొసంగుం దుదిన్. 48

తా. నిండుచందురునిం బోలునదనియు, నింపారురూపు గలదనియు, మోవియందుఁ దేనియ గలదియనియుఁ జెప్పఁబడు తీఁగబోఁడియొక్క యీమోముఁదామర, ముసిఁడిపండువలె అనుభవింపఁబడు (యౌవన) కాలమున మిక్కిలి రసవంతముగా నుండి యీ (యౌవన) కాలము కడచిపోవఁగా విషమువలె దుఃఖప్రద మగును.

అవ. ఇప్పుడు దీనిని అనర్థమును గలిగించు నొకనదిగా నిరూపించి తన్మూలమున పరిత్యజింపఁదగినదిగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉన్మీలత్త్రివళీతరఙ్గవలయా ప్రోత్తుఙ్గపీనస్తన
ద్వన్ద్వేనోద్యతచక్రవాకయుగళా వక్త్రామ్బుజోద్భాసినీ।
కాన్తాకారధరా నదీయ మభితః క్రూరాశయా నేష్యతే
సంసారార్ణవమజ్జనం యది తదా దూరేణ సన్త్యజ్యతామ్॥ 49

టీ. ఉన్మీలత్...వలయా-ఉన్మీలత్=పొడసూపుచున్న, త్రివళీ=మూఁడువళులనెడి, తరఙ్గ=అలలయొక్క, వలయా=పంక్తులుగలదియు, ప్రోత్తు...ద్వేన-ప్రోత్తుఙ్గ=మిక్కిలిపొడవైనదియు, పీన=బలిసినదియునగు, స్తనద్వన్ద్వేన=చన్నుఁగవచేత-

ఇట్టిచన్నుఁగవ యనెడి నెపముచేత ననుట, ఉద్య...గళా-ఉద్యత=పైకినిక్కిన, చక్రవాక=చక్రవాకపక్షులయొక్క, యుగళా=జతగలదియు-మిక్కిలి పొడవుగా నిక్కుచున్న గబ్బిసబ్బదోయి యనెడి పైకి నెగయు జక్కవకవ గలది యని భావము, స్తనద్వంద్వము ప్రోత్తుంగ మనుటకుసరిగా చక్రవాకముల నుద్యతములని చెప్పినాఁడు, వక్త్రా)...సినీ-వక్త్ర అమ్బుజ=మొగ మనెడి తామరచేత, ఉద్భాసినీ=ప్రకాశించుచున్నదియు, అభితః=అంతటను, క్రూర ఆశయా=(నదీపక్షమున) ఘాతుకజంతువులకు (మొసళులు మొదలైనవానికి) స్థానమైనదియు-(స్త్రీపక్షమున) కఠినమైన హృదయముగలదియు ('నృశంసోఘాతుకః క్రూర' అనియు 'కర్కశం కఠినం క్రూరం కఠోరమ్' అనియు నమరుఁడు. 'క్రూరాత్రనాపేక్ష్యతే' అనుపాఠమున 'క్రూరా' అనుటకు పూర్వోక్తములైనయర్థములే గ్రాహ్యములు, అత్ర=ఈలోకమునం దని యర్థము), కాన్తాకారధరా=కాంతరూపమును దాల్చినదియు నను, ఇయం=ఈ-ఈయగపడుచున్నయనుట, నదీ=ఏఱు-వళుల నెడియలలును నిక్కుచున్నుఁగవ యనెడి నెగయు జక్కవగవయు మొగ మనెడి తామరయుఁ గల స్త్రీయనెడి యీ నది యనుట, సంసారార్ణవమజ్జనం-సంసారార్ణవ = సంసారమనెడి సముద్రమునందు, మజ్జనం=మునుఁగుట, యది న ఇష్యతే=కోరఁబడదేని, తదా=అప్పుడు-అట్లు సంసారసముద్రమున మునుఁగ నపేక్షింపనిపక్షమునం దనుట, దూరేణ=దూరముగా, సన్త్యజ్యతాం=మిక్కిలి విడువఁబడునుగాక. నదులు సముద్రమునకుఁ బోవునట్లు ఈ స్త్రీ యనెడినది సంసార మనెడి సముద్రమునకుఁ బోవును. ఈస్త్రీ నది నాశ్రయించిన యెడల నిది సంసారమునఁ గొనిపోయి ముంచునుగాన నాసముద్రమున మునుఁగ నిచ్ఛగింపనివాఁ డీనదిని మిక్కిలిదూరముననే విడిచిపెట్టఁ దగు నని భావము. స్త్రీయే సంసారమూలముగాన సంసారము గోరనివాఁడు స్త్రీని మిక్కిలి పరిత్యజింపవలయు నని భావము. ఇచట స్త్రీని నదిగాను దానివళులు మొదలైనవానిని నదియొక్కయలలు మొదలైనవానినిగాను, అది కొంపోవు సంసారమును నది ప్రవహించు సముద్రముగాను నిరూపించుటచే సావయవరూపక మలంకారము.

ఉ. చన్నులు చక్రవాకములు ♦ చక్కనిమోముఁ గరంబు లబ్జముల్
గన్నులు మీలు నాభి సుడి ♦ గాఢనితంబము సైకతంబుగా
నెన్నికఁ గన్నబోటి యనునేటికి దవ్వుల నుండ్కి చాల మే
లెన్న భవాబ్ధిమజ్జన మదేమియుఁ గోరనివారి కిమ్మహిన్. 49

తా. వళులనెడియలలును నిక్కువలుఁ దన్నుఁగవ యనునెగయుచున్న జక్కవదోయియును, మొగ మనెడి తామరయుఁ గలిగి యంతటఁ గ్రూరజంతువులకు నాశ్రయమై (కఠినహృదయము గలదై) యుండు కామిని యనెడి యీనది సంసారమనెడి సముద్రమునకుఁ గొనిపోవునది కాఁబట్టి యాసముద్రమున మునుంగఁ గోరనివారీనదిని మిక్కిలి దూరముగానే విడిచిపెట్టఁదగును.

అవ. స్త్రీలు నమ్మఁదగినవారు గా రనుటకు మఱియు హేతువులు రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ జల్పన్తి సార్ధమన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః।
హృద్గతం చిన్తయన్త్యన్యం ప్రియః కోనామ యోషితామ్॥ 50

టీ. (స్త్రీలు), అన్యేనసార్ధం=ఒకపురుషునితోడ, జల్పన్తి=మాటలాడుదురు, సవిభ్రమాః=విలాసములతోఁ గూడినవారై -కులుకుబెళుకులు చూపుచుననుట, అన్యం=మఱొకనిని, పశ్యన్తి=చూతురు. హృద్గతం=మనస్సునందుండెడి, అన్యం=ఇంకొకనిని, చిన్తయన్తి=తలఁచుకొనుచుందురు. కాఁబట్టి, యోషితాం=స్త్రీలకు, ప్రియః=ప్రియుఁడైనవాఁడు - నిలుకడగా మిక్కిలి ప్రియుఁడై యుండునట్టివాఁ డనుట, కోనామ=ఎవఁడు-ఎవఁడును లేఁడనుట.

తే. ఒకనితోఁ గూడి భాషింతు రొక్కనరునిఁ
జూతురు విలాససంపద సొంపుగులుక
మఱియు నొక్కనిఁ దలఁతురు మనసులోనఁ
గూర్చుప్రియుఁ డెవ్వఁడో ముద్దుగుమ్మలకును. 50

తా. కాంత లొకనితో నెయ్యముమీఱ మాటలాడుదురు. మఱొకని నొయ్యారముగాఁ జూతురు. ఇంకొకని మనస్సునఁ దలంచుచుందురు. కాఁబట్టి వారికి నియతముగాఁ బ్రియుఁ డైనవాఁ డెవ్వఁడును లేఁడు.

అవ. స్త్రీని సర్పముగా నిరూపించి చెలికానికి వెఱపు గలిగించుచు దానికి దూరముగాఁ దొలఁగి పొమ్మని యుపదేశించుచున్నాఁడు.

శ్లో॥ అపసర సఖే దూరా దస్మా త్కటాక్షవిషానలా
త్ప్రకృతివిషమా ద్యోషిత్సర్పా ద్విలాసఫణాభృతః
ఇతరఫణినా దష్టః శక్య శ్చికిత్సితు మౌషధై
శ్చతురవనితాభోగిగ్రస్తం త్యజన్తి హి మన్త్రిణః॥ 51

టీ. హేసఖే=ఓచెలికాఁడా, కటాక్షవిష అనలాత్=కడగంటిచూపు లనెడి విషాగ్ని గలదియు, ('కటాక్ష శిఖానలాత్' అనుపాఠమున కడగంటిచూపు లనెడి జ్వాలలయగ్ని గలది యని యర్థము), ప్రకృతి విషమాత్=స్వభావముచేతనే కుటిలమైనదియు-పుట్టుకచేతనే వంకరగానుండున దని సర్పపరమైన యర్థము, విలాస... భృతః-విలాస=విభ్రమములనెడి, ఫణా=పడగలను, భృతః = తాల్చినదియు నైన, అస్మాత్=యీ, యోషిత్ సర్పాత్=స్త్రీయనెడి సర్పమువలననుండి, దూరాత్ = దూరముగా, అపసర=తొలఁగిపొమ్ము, హి=ఏలనఁగా, ఇతరఫణినా=తక్కిన ప్రసిద్ధ

సర్పముచేత- పుట్టుకచేతనే సర్పమైన జంతువుచేత, దష్టః=కఱవఁబడినవాఁడు, ఔషధైః = మందులచేత-మూలికా మణిమంత్రాదులచేత, చికిత్సితుం = కుదుర్చుటకు-విషమును దింపి బ్రతికించుటకు, శక్యః = అలవియైనవాఁడు - వానివిషమును గుదుర్ప సాధ్యమగు ననుట, చతుర...గ్రస్తం-చతుర=నేర్పుకత్తెయైన, వనితా=స్త్రీయనెడి, భోగి=సర్పముచేత, గ్రస్తం=పట్టుకొనఁబడినవానిని- కఱవఁబడినవానిననుట- స్త్రీకి వశమైనవాని నని తాత్పర్యము, మన్త్రిణః=మాంత్రికులు-విషవైద్యులనుట- ఆలోచనపరులు-అనఁగా బుద్ధిమంతులని యర్థాంతరము, త్యజన్తి=వదలుదురు-ఆ స్త్రీసర్పము గ్రసింపఁగాఁ గలుగు నున్మాదము దీర్పరాని దగుటచే వదలుకొందురనుట. ప్రసిద్ధమైన సర్పముయొక్క కాటువలెఁ గాక స్త్రీయనెడియీసర్పముయొక్క కాటు కుదుర్పరాని దగుటచే దీనితోడిసంగతి నుంచుకొనక దవ్వుగాఁ దొలఁగిపొమ్మని యర్థము. ఇచటను సావయవరూపక మలంకారము. దీనిచే, ఉపమానమైన ప్రసిద్ధసర్పముకంటె నుపమేయమైన వనితాసర్పమున కాధిక్యము తెలియుచున్నది గాన వ్యతిరేకము వ్యంజిత మగుటంబట్టి యలంకారముచే నలంకారధ్వని యని యెఱుఁగునది.

ఉ. చూపు విషంబు విభ్రమము సొంపు ఫణాఫలకంబు గా వధూ
రూపము దాల్చుభోగికిని రూఢిగ దూరముగాఁ దొలంగుమీ
దాపుగ సర్పదష్టునకుఁ దప్పు విషంబు మహౌషధంబులం
బాపవధూభుజంగవిషభగ్నుని చెంతకుఁ బోరు మాంత్రికుల్. 51

తా. చెలికాఁడా! వాలారుంగడగంటిచూపు లనెడి విసంపునిప్పుకలు గుప్పించుచు, స్వభావముచేతనే కుటిలమై (వంకరయై), యొయ్యారము లనెడిపడగలు దాలిచియున్న యీచెలువయనెడిచిలువనుండి దవ్వుగాఁ దొలఁగిపొమ్ము. ఏలనఁగా, ప్రసిద్ధమైన తక్కిన సర్పము గఱచినవానిని మందు లిచ్చి కుదుర్పవచ్చును. కాని నీటుకత్తియయైన బిత్తరియనెడిపాము గ్రసించినవానిని గుదుర్చుట యశక్య మని యెట్టిమంత్రము గలవారును వదలుకొందురు.

అవ. మరల మఱియొకరీతిని వెలయించుచున్నాఁడు.

శ్లో॥ విస్తారితం మకరకేతనధీవరేణ
స్త్రీసంజ్ఞితం బడిశ మత్ర భవామ్బురాశౌ।
తే నాచిరా త్తదధరామిషలోలమర్త్య
మత్స్యా న్వికృష్య స పచ త్యనురాగవహ్నా॥ 52

టీ. మకరకేతన ధీవరేణ=మన్మథుఁ డనెడిజాలరిచేత, అత్ర=యీ, భవ+అమ్బురాశౌ=సంసారమనెడి సముద్రమునందు, స్త్రీసంజ్ఞితం=స్త్రీయనెడి సంజ్ఞ (పేరు)గల- స్త్రీరూప మైన యనుట, బడిశం=గాలము, విస్తారితం=పచరింపఁబడినది-విసరి వైవఁబడి యున్న దనుట. తేన=దానిచేత-అట్లువైచియున్న గాలముచేత,అచి

రాత్=త్వరలో, తవ...మత్స్యాన్-తత్=వారియొక్క-ఆ స్త్రీలయొక్క, అధర=మోవియనెడి, ఆమిష=ఎరయందు, లోల=ఆసక్తి గల, మర్త్య=మనుష్యులనెడి, మత్స్యాన్=చేపలను, వికృష్య=లాగి, అనురాగవహ్నౌ=వలపు అనెడి నిప్పునందు, సః=వాఁడు-ఆమన్మథుఁడు, పచతి=పక్వముసేయును-మిక్కిలి సంతాపము కలిగించును - మన్మథుఁ డీమూలమున పురుషులను బీడించుననుట. ఇచటను సావయవరూపకమలంకారము.

ఉ. చేరి మనోజధీవరుని చేత భవాంబుధిలోన నంగనా
 కారముఁ బూనియున్న పెనుగాలము చిమ్మఁగ నయ్యె దానిచే
 భీరుజనాధరామిషముఁ బేర్మి భుజించునరాండజంబులన్
 నారక సారెకుం దిగిచి వండు మరుం డనురాగవహ్నిలోన్. 52

తా. మరుఁ డనుజాలరి సంసారమనెడిసముద్రమునం దున్నమనుజు లనెడిచేపలను బట్టుటకై కులుకులాఁడి యను గాలమును విసరి వైచియున్నాఁడు. ఆగాలమందు కెమ్మోవియను నెర యున్నది. దానికినాసించి చిక్కువడెడు మనుజు లనుచేపల నాగాలముచేతఁ ద్వరలో లాగి వలపనెడినిప్పునందు వాఁడు పక్వముచేయును.

అవ. ఇప్పుడు మనస్సును వెఱపించుచున్నాఁడు.

శ్లో॥ కామినీకాయకాన్తారే, కుచపర్వతదుర్గమే।
 మా సంచర మనఃపాన్థ, తత్రాస్తే స్మరతస్కరః॥ 53

టీ. హేమనఃపాన్థ=ఓమనస్సనెడిబాటసారీ, కుచపర్వత దుర్గమే-కుచపర్వత=చన్నులనెడి కొండలచేత- దుర్గమే=పోవరానిదైన, కామినీ...తారే-కామినీకాయ=స్త్రీయొక్క దేహమనెడి, కాన్తారే=అడవియందు, మా సంచర=సంచరింపకుమా, ఏలనఁగా, తత్ర=అందు-ఆయడవియందు, స్మర తస్కరః=మన్మథుఁ డనెడి దొంగ, ఆస్తే=ఉన్నాఁడు-వాఁడు నీమానధనము నెల్ల దొంగిలు నని భావము. సావయవరూపక మలంకారము.

క. స్తనపర్వతదుర్గమమై
 ఘన మగుకాంతాశరీరకాంతారమునం
 జనఁబోకు మనఃపాంథుఁడ
 కనలుచు మరుఁ డనెడిదొంగ గలఁ డచ్చోటన్. 53

తా. మనస్సనెడి యోతెరువరీ! బలితంపుఁజనుఁగొండలచేఁ జొర శక్యముకాని కామినిమేననెడియడవియందు మరుఁడనెడిదొంగ దాఁగియున్నాఁడుగాన నందు నీవు నడవకుము. నడతువేని నీమాన మెల్ల వాఁడు కొల్లగొనును.

అవ. ఒకానొకనియనుభవమును మూఁడుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వ్యాదీర్ఘేణ చలేన వక్రగతినా తేజస్వినా భోగినా
నీలాబ్జద్యుతి నాహినా వర మహం దష్టో న తచ్చక్షుషా।
దష్టే సన్తి చికిత్సకా దిశిదిశి ప్రాయేణ ధర్మార్థినో
ముగ్ధాక్షీక్షణవీక్షితస్య నహి మే వైద్యో న వా ప్యౌషధమ్ ॥ 54

టీ. ఇచట సర్పమునకును నేత్రమునకు రెంటికిని బొసంగునట్లు విశేషణములు నిబంధించినాఁడు. ఎట్లన, వ్యాదీర్ఘేణ=(సర్పపరముగా) మిక్కిలి నిడుదయైనదియు-(నేత్రపరముగా) చెవివఱకు నిడుదగాఁ జాఁగియున్నదియు, చలేన=చలించుచుండునదియు - రెంటికినిసమము, వక్రగతినా = (స్వభావముచేత నే) కుటిలమైన సంచారముగలదియు - రెంటికిసమము, తేజస్వినా=బలము గలదియు-(నేత్రపరముగా) కాంతిగలదియు, భోగినా=పడగ గలదియు. (నేత్రపరముగా 'ఆభోగినా' అని ఛేదముచేయఁగా) విశాలిగలదియు, నీలా...ద్యుతినా-నీలాబ్జ=నల్లగలువయొక్క, ద్యుతినా=కాంతి గలిగినదియు- నల్లగలువవంటివన్నె గలదియని సర్పపరముగాను నల్లగలువతో సాటియైనదని నేత్రపరముగాను అర్థము గ్రాహ్యము, అహినా=సర్పముచేత, దష్టః=కఱవఁబడినవాఁడనుట, వరం=కొంతమేలు, తచ్చక్షుషా=దాని నేత్రముచేత-ఆచెలువకంటిచేననుట, (దష్టః)న=కఱవఁబడుట కొంచెమేనియుమేలుగాదు. వ్యాదీర్ఘమును, వక్రగతియు, తేజస్వియు, భోగియు, నీలాబ్జద్యుతియునైన యహిచేఁ గఱవఁబడుట గొంతమేలుగాని వ్యాదీర్ఘమును, వక్రగతియు, తేజస్వియు, ఆభోగియు, నీలాబ్జద్యుతియునైన యాచెలికన్నుచేఁ గఱవఁబడుట కొంచెమైనను మేలు గాదనుట, (ఒక్కొకవిశేషణమునకు సర్పనేత్రముల కనుగుణముగా సర్థద్వయము పూర్వోక్తరీతిని దెలియునది.), ఏలనఁగా, దష్టే (సతి)-ఆసర్పముచేతఁగఱవఁబడినయెడల, దిశిదిశి=ప్రతి దిక్కునందును, ప్రాయేణ=తఱుచుగా, ధర్మార్థినః=పరోపకార మనెడి ధర్మమే ప్రయోజనముగాఁ గలవారైన, చికిత్సకాః=విషవైద్యులు, సన్తి=కలరు, అయితే, ముగ్ధా...వీక్షితస్య-ముగ్ధాక్షీ=సొగసైన కన్నులుగల చెలువయొక్క, ఈక్షణ=కంటిచేత, వీక్షితస్య=చూడఁబడినట్టి-లేక, ముగ్ధాక్షిచేత, క్షణవీక్షితస్య=క్షణమాత్రము చూడఁబడినట్టియనియు నర్థాంతరము-ముద్దరాలి వాలారుఁజూడ్కిచే గ్రసింపఁబడినట్టి యనుట, మే=నాకో, వైద్యః=చికిత్సకుఁడు, నహి=లేఁడుగదా, ఔషధంవా=విషమును హరించుమందుగాని, న=లేదు, ప్రసిద్ధమైన సర్పముకాటునకు మందుమంత్రములు గలవుగాని యాకామినియొక్క వాఁడిమాడ్కి కాటు తగిలెనా దానిచేఁగలుగు నున్మాదమును దీర్ప నేమందును మంత్రమును లేదు. కావ నట్టికంటిచూపు తగులుటకంటె పాముకాటే కొంతమేలని భావము. ఇచటఁ బ్రసిద్ధమైన సర్పముతోఁ బోల్చిచూడఁగా చక్షువనెడియహియే యధికముగాఁ దెలియుటచే వ్యతిరేక మలంకారము.

ఉ. ఉరగము ముట్టనా నరులకుఁ గుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింపు రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ గ్రూనినమానినిచూపు సోఁకినం
బురుషున కెందు మందులునుఁ బొందవు పొందరు వెజ్జులెవ్వరున్. 54

తా. మిక్కిలి నిడుదయు, చలించుచున్నదియు, వంకరగాఁ బోవునదియు, బలిమిగలదియుఁ, బడగచే భెడిదమైనదియు, నల్లగలువవన్నెవంటి వన్నెగలదియు నైన పాముచేఁ గఱవఁబడినను గొంత మేలనవచ్చునుగాని, చెవివఱకు నిడుదగాఁ జాఁగి, బెళుకులీనుచు, కుటిలముగాఁ బొలయుచు, కాంతిదళుకొత్తుచు, విశేషిగ్రాయి, నల్లగలువతోఁ బురుడించు నాకలువకంటికంటిచేఁ గఱవఁబడుట కొంచెమైనను మేలుకాదు. ఏలనఁగా, ఆపాముచేఁ గఱవఁబడినయెడల దానికొఱకునకుఁ బరోప కారశీలు రగు విషవైద్యులెందఱో యేదిక్కునందు నున్నారు. సొగసుంగన్నులుగల చిన్నారికంటిచూపు తగిలెనా నాకు దానివలనియున్మాదము దీఱుటకు నేవైద్యుఁడు గాని యేమందుఁగాని కలుగ నేకలుగదు.

శ్లో॥ ఇహ హి మధురగీతం నృత్తమేత ద్రసోఽయం
స్ఫురతి పరిమళోఽసౌ స్పర్శఏష స్తనానామ్।
ఇతి హతపరమార్థై రిన్ద్రియై ర్భ్రామ్యమాణః
స్వహితకరణధూర్తైః పఞ్చభి ర్వఞ్చితోఽస్మి॥ 55

టీ. ఇహహి=ఇందే-ఈతరుణులయందే యనుట, మధురం=తాపహరమైన-చెవులకింపైన యనుట- 'శీతలీక్రియతే తాపోయేనతన్మధురం స్మృతమ్' అనుటచే మధురమనఁగా తాపహారియని తెలియునది, గీతం=(వారి) గానము, స్ఫురతి=ఒప్పుచున్నది, ఏతత్=ఈ-కంటికింపైనయనుట, నృత్తం=నాట్యము, ఒప్పుచున్నది, అయం = ఈ-నాలుకకింపైన, రసః = రసము-అధరామృతమనుట, ఒప్పుచున్నది. అసౌ = ఈ-ముక్కుకింపైన, పరిమళః=వాసన - పద్మినిజాతి యగుటచేఁ గలిగినమేని కమ్మనితావియనుట-లేక, పచ్చకపురము గందము మొదలైనవాని పయిపూఁతలచేఁ గలుగు వాసనావిశేషము, ఒప్పుచున్నది, ఏషః=ఈ-స్పృశించుట కింపైన, స్తనానాం=చన్నులయొక్క, స్పర్శః=తాఁకుడు, ఒప్పుచున్నది, ఇతి=అని-ఈవిధముగా, హతపరమార్థైః-హత=నశించిన-చెడినయనుట,పరమార్థః=తత్త్వార్థము గలవియు-విషయములయొక్క కలరూపు తెలియక వానికి లోనైనవి యనుట, కాఁబట్టియే, స్వ...ధూర్తైః-స్వహిత=తనయొక్క-మేలును, కరణ=చేయుటయందు, ధూర్తైః=మోసగాండ్రును-తనకు హితముచేయక పోయినను చేయువానివలె నున్నట్టి యనుట, పంచభిః=ఐదు, ఇంద్రియైః=ఇంద్రియములచేత-చెవులు మొదలైనవానిచేత, భ్రామ్యమాణఃసన్=త్రిప్పఁబడుచున్నవాఁడ నగుచు-ఆయావిషయములందుఁ దగులు

గొలుపఁబడినవాఁ డగుచు, వఞ్చితః= మోసపుచ్చఁబడినవాఁడను, అస్మి = అగుచు న్నాను. ఈమోసమును మునుపే తెలియనైతి నని భావము.

ఉ. ఈమృదుగాన మీనటన ♦ మీకుచమర్దన మీసుధారసం
బీమహనీయసౌరభము ♦ నింతులయందుఁ దనర్చు నంచు స
న్నేమఱఁజేసి యాత్మహిత ♦ మిచ్చినభంగి మెలంగి యింద్రియ
గ్రామము మోసపుచ్చె హిత♦కార్యవిహీనుఁడ నైతి నక్కటా! 55

తా. ఈ జవరాండ్రయందే యిదె యింపైనపాట వినఁబడుచున్నదని నాచెవియు, నిందే యీ సొంపైనయాట గనఁబడుచున్నదని నాకన్నును, ఇందే యీమోవితేనియ యనెడిరసము చవి గులుకుచున్నదని నానాలుకయు, నిందే యీకమ్మతావి గుబులుకొనుచున్నదని నాముక్కును, నిందే చనుగుబ్బల నంటిన సుఖముగా నుండునని నాయొడలును, నిట్లు నాయైదింద్రియములును నాకే మోహితము చేయువానివలె నటించి విషయములకలరూపును దెలియనీక చెఱిపి యాయావిషయములందు నన్నుఁ దగులుకొలిపి ద్రోమఱించినవి. ఇది యప్పుడే తెలియక మోసపోయినవాఁడ నైతి.

అవ. మిక్కిలి మోహమును బుట్టించుమన్మథుని దూషించుచున్నాఁడు.

శ్లో॥ న గమ్యో మన్త్రాణాం న చ భవతి భైషజ్యవిషయో
న చాపి ప్రిధ్వంసం వ్రజతి వివిధైః శాన్తికశతైః।
భ్రమావేశా దఙ్గే కమపి విదధ ద్భఙ్గ మసకృత్
*స్మరాపస్మారోఽయం భ్రమయతి దృశం ఘూర్ణయతి చ॥ 56

టీ. అయం=ఈ, స్మర అపస్మారః=మన్మథుఁ డనెడియపస్మారరోగము-మన్మథుఁడు గలిగించు స్త్రీవ్యామోహ మనెడియపస్మారరోగ మనుట, మన్త్రాణాం=మంత్ర

* 'క్రుద్ధై ర్ధాతుభి రాహతేచ మనసి ప్రాణీ తమః సంవిశ న్ దన్తా న్ ఖాదతి ఫేనముద్వమతి దోఃపాదౌ క్షిప న్మూఢధీః। పశ్య న్నూప మసత్ క్షితౌ నిపతతి ప్రాయః కరోతిక్రియా బీభత్సాః స్వయమేవ శామ్యతి తథావేగేత్యపస్మారరుక్' అపస్మారరోగి ధాతువులు ప్రకోపించి మనస్సునుగొట్టఁగా చీఁకటి గ్రమ్మినట్టివాఁడై పండ్లు కొఱుకును, నురువుగ్రక్కును, మలిమాలి కాలుసేతులు జాడించును, భూమిమీఁద లేనిరూపమును గాంచి దానికై పడును, రోఁతపనులు పెక్కు సేయును, దనకుఁదానే యుపశమిల్లును' అని యున్నది. ఇట్టియవస్థలు మన్మథార్తులకును గలుగును గాన వ్యామోహమును అపస్మారరోగముగా వర్ణించినాఁ డని తెలియునది.

ములకు, నగమ్యః=విషయమైనదికాదు-సాధ్యమైనదికాదనుట, భైషజ్యవిషయశ్చ=ఔషధమునకువిషయమైనదియు-మందుచే కుదుర్పఁదగినదియు, న భవతి = కాదు, వివిధైః=పలువగలైన, శాన్తికశతైః అపి=నూఱులకొలఁది శాంతికర్మములచేతను, ప్రధ్వంసం=నాశమును, నవ్రజతి=పొందదు, 'పూర్వజన్మకృతంపాపం వ్యాధిరూపేణ బాధతే తచ్ఛాన్తి రౌషధై ర్దానై ర్జపహోమార్చనాదిభిః' అన్నట్లు ప్రసిద్ధమైన రోగము జపాదులచేత శాంతించును, ఇదియో యట్లుగాదనుట. భ్రమ+ఆవేశాత్=మోహమును బుట్టించుటవలన,అఙ్గే=శరీరమునందు, కమపి=ఇట్టి దట్టిదనరాని,భఙ్గం=జాడ్యమును-లేక, భ్రమావేశాత్=మతిభ్రంశము గలిగించుటవలన, అఙ్గే=అంగమునందు-కరచరణాద్యవయవములందు, కమపి=ఇట్టిదట్టిదనరాని, భఙ్గం=విదుల్చుట మొదలైన వికారమును, ఆసకృత్=మాటికి, విదధత్=చేయుచు, దృశం=నాచూపును, భ్రమయతి=తబ్బిబ్బుపఱుచుచున్నది, ఘూర్ణయతిచ=గిరగిరఁ ద్రిప్పుచున్నది. ఏమిచేయుదు వీని నెట్లు కుదుర్పనగునని భావము. ఇచట నలంకారము వ్యతిరేకము.

ఉ. ఆరయ మంత్రగమ్యమును గౌషధసాధ్యముఁ గాదు శాంతికా
  చారశతంబులం జెడదు గ చండతరభ్రమకల్పనోద్ధతిన్
  భూరివికార మంగములఁ గూన్చుచు మన్మథజన్య మీయప
  స్మారము లోచనద్వయము గ సారెకుఁ ద్రిప్పెడుఁ జక్రముంబలెన్.

తా. లోకములో నపస్మారమనెడిరోగము మందునకు మంత్రాదులకు లోనై కుదురును. మరుఁడు కామినులయెడఁ గలిగించు మోహమనెడి యపస్మారరోగమో మంత్రములకును లోనుగాదు, మందుచేతను గుదురదు. నూఱులకొలఁదిశాంతికర్మములఁ జేసినను నాశమునొందదు, కుఱి మనస్సును భ్రమముకలిగించి యవయవములను తాఱుమాఱుగా విదుల్చుట మొదలైనవికారములఁ బుట్టించి చూపులను తత్తఱపఱిచి గిరగిరఁ ద్రిప్పుచున్నది. ఏమి చేయుదును? దీని నెట్లు మాన్పుకొందును?

అవ. మూఁడుశ్లోకములచే వెలయాండ్రను నిందించుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ జాత్యన్ధాయచ దుర్ముఖాయచ జరాజీర్ణాఖిలాఙ్గాయచ
  గ్రామీణాయచ దుష్కులాయచ గళత్కుష్ఠాభిభూతాయచ।
  యచ్ఛన్తీషు మనోహరం నిజవపు ర్లక్ష్మీలవశ్రద్ధయా
  పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః॥ 57

టీ. జాత్యన్ధాయ=పుట్టుగ్రుడ్డికొఱకైనను, దుర్ముఖాయచ=వదరుఁబోతుకొఱకైనను-లేక దుర్గంధముగలముఖము గలవానికొఱకైనను,జరా...లాఙ్గాయచ-జరా=ముసిమిచేత, జీర్ణ=జీర్ణించిన-చిక్కి సంధులబిగి వీడిన యనుట, అఖిల=సమస్తమైన, అఙ్గాయచ=అవయవములు గలవానికొఱకైనను,గ్రామీణాయ = పల్లెటూరివానికొఱకైనను-లేక, మఱియొక్క గ్రామమునుండి వచ్చి కులగోత్రములు దెలియకుండునట్టివానికొఱకైనను, దుష్కులాయచ=చెడుకులముగలవానికొఱకైనను, వేయేల, గళ...భూతాయచ-గళత్=కాఱుచున్న,కుష్ఠ=కుష్టుచేత-కుష్టుచేనైన చీము నెత్తురు మొదలైనవానిచే ననుట, అభిభూతాయ=నిందితుఁడైనవానికొఱకైనను- రోయఁదగినవానికొఱకైనననుట, లక్ష్మీ...శ్రద్ధయా-లక్ష్మీ=సంపదయొక్క, లవ=లేశమునందలి, శ్రద్ధయా=అక్కఱచేత-ఇంచుకంతధనమున కాసపడి యనుట, మనోహర=మనస్సును హరించునట్టి-మిక్కిలియింపైన, నిజవపుః=తనదేహమును, యచ్ఛన్తీషు=అర్పించుచున్నట్టివారును-ముద్దిడుట కౌఁగిలించుట పంట నొక్కుట గోరఁజీరుట మొదలైన సంభోగవ్యాపారములకై తమదేహమును అట్టివారి కధీనము చేయుచున్నట్టివారు ననుట, వివేక—శస్త్రీషు-వివేక=వివేకమనెడి-ఇది తగును ఇది తగదనెడి విచార మనునట్టి, కల్పలతికా=కల్పవుఁదీఁగెను, శస్త్రీషు=చూరకత్తులైనవారును-తీఁగెలను త్రెంచు చూరకత్తులవలె వివేకమును ఛేదించునట్టివారును, (వివేకమునైతము సకలార్థముల నొడఁగూర్చునది గాన కల్పలతగా నిరూపింపఁబడినదని తెలియునది),అను,పణ్యస్త్రీషు=వేశ్యాంగనలయందు, కః=ఎవఁడు, రజ్యేత=అనురక్తి పొందును-ఎంతవివేకహీనుఁడును అట్టివేశ్యలయందు రక్తినొందఁడని యర్థము. అలం. రూపకము.

చ. విమువక పుట్టుగ్రుడ్డునకు • వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకుఁ • జారునిజాంగము లొక్కరూకకై
కడువడి నిచ్చువారి గుణ•కల్పలతల్ విదళించుకత్తులం
బడుపుఁబడంతులం దనదు•భావముఁ జేర్చునె యెవ్వఁడేనియున్.

తా. వారకాంత లొకింతద్రవ్యమున కాసపడి మిక్కిలి సొగసైన తమమైదీఁగలను పుట్టుగ్రుడ్డివానికైనను, వదరుఁబోతునకైనను, ముదిసి యంగములపటిమ తప్పినవానికైనను, ఊరును పేరును తెలియనియొకపల్లెటూరివానికైనను, చెడుకులమునఁ బుట్టినవానికైనను, వేయేల ! కుష్టుచేఁ జీము నెత్తురుఁ గాఱుచున్నంతయసహ్యముగానుండువానికైనను, సంభోగార్థము అప్పగింతురు. సకలార్థముల నొడఁగూర్చుకల్పలతవంటి వివేకమును బటాపంచలు సేయుచు నిట్టిమేవపుకార్యముల కొడిగట్టు వారస్త్రీలయెడ నెంతవివేకశూన్యుని కైనను రక్తి పుట్టనేరదు.

శ్లో॥ వే శ్యాసౌ మదనజ్వాలా రూపేన్ధనసమేధితా।
కామిభి ర్యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ॥ 58

టీ. అసౌ=ఈ, వేశ్యా=వేశ్య-వెలయాలు, రూపే...ధితా-రూప=సౌందర్య మనెడి, ఇన్ధన=వంటకట్టియలచేత, సమేధితా=మిక్కిలి పెంపఁబడినదియైన, మదన జ్వాలా=మన్మథాగ్నిశిఖ, యత్ర=ఎందు-అందు అనుట- వేశ్యయనెడి మన్మథాగ్ని జ్వాలయందు-కామిభిః=కాముకులచేత, యౌవనాని=ప్రాయములును, ధనానిచ=ధన ములును, హూయన్తే=హోమముచేయఁబడుచున్నవి. స్వర్గాదిఫలములను గోరువారు ఆహవనీయాగ్నిజ్వాలయందు హవిస్సులను వేల్చునట్లు వేశ్యాసంభోగఫలముగోరువారు వేశ్యలనెడి మన్మథాగ్నిజ్వాలయందు యౌవనము ధనము అనెడిద్రవ్యములను వేల్చు చున్నా రనుట. అగ్నియందు వేల్వఁబడు ద్రవ్యము లెట్లు రూపుమాయునో యట్లె వెలయాండ్రకై యుపయోగింపఁబడిన వయస్సును ధనమును మాయునని భావము. ఇ చట యౌవనధనములను హోమము సేయుట ప్రకృతము. ఈ ప్రకృతమైన హోమ కార్యమున కుపయోగించుటకు నగ్ని యావశ్యకముగాన వేశ్యయందు మదనజ్వాలా త్వము ఆరోపితమగుటవలన పరిణామ మలంకారము. అది రూపేంధన మనెడి రూప కముతో సంకీర్ణమగుచున్నది గాన సంకరమను చెలియునది.

క. రూపేంధనవర్ధిత వే
శ్యాపంచశరాగ్నికీలయం దంగజపూ
జాపరతంత్రులు వేల్తురు
దాపుగఁ దమజవ్వనములు ధనములుఁ గడఁకన్. 58

తా. ఈవెలయాలు ఒకమన్మథాగ్నిజ్వాల. ఇవి చక్కందన మనెడిసమిధలచే మీఁదుమిక్కిలి పెంపఁబడినది. ఈజ్వాలయందు కాముకులు తమయౌవనములను ధనములను హవిస్సులుగా నర్పించి వేల్తురు.

శ్లో॥ క శ్చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞ మపి।
చారభటచోరచేటకనటవిటనిష్ఠీవనశరావమ్॥ 59

టీ. మనోజ్ఞమపి=మనోహరమైనది యయ్యును, చార...శరావమ్-చార= వేగులవారు, భట=భటులు, చోర=దొంగలు, చేటక=కుంటెనగాండ్రు, నట=నట్టు వులు, విట=జారులు-అనెడి వీరలయొక్క, నిష్ఠీవన=ఎంగిలికి - ఎంగిలి నుమియు, శరావమ్=మూఁకుడైనట్టి-ఇటువంటితక్కువపాటిమనుజు లెల్ల ముద్దిడి యెంగిలి సేయుటచే మిక్కిలి యపవిత్ర మైనట్టి యనుట, వేశ్యాధరపల్లవం - వేశ్య = వెల యాలియొక్క, అధరపల్లవం=చిగురువంటి మోవిని, కులపురుషః=సత్కులమునందుఁ

బుట్టిన మనుష్యుఁడు, కః=ఎవఁడు, చుమ్బతి=ముద్దిడును-మంచికులమునఁ బుట్టినవాఁ డెవఁడును ముద్దువెట్టఁడనుట, 'రతికాలే ముఖం స్త్రీణాం శుద్ధ మాఖేటకే శునామ్' అన్నట్లు రతిసమయమున స్త్రీముఖము పవిత్రమే యైనను ముందు చెప్పఁబడిన కసుమాలపుమనుజులసంపర్కమువలన హేయమై చుంబనమున కనర్హ మగుటచే దానిని చుంబింపరాదని తాత్పర్యము. ఇచట 'అధరపల్లవం' అనుచో 'చిగురువంటిమోవి' యనియే ఉపమితసమాసముగా నర్థము సేయఁదగును గాని 'మోవి యనెడి చిగురు' అని రూపకసమాసముగా నర్థము దగదు. ఏలన, రూపకమున ఉత్తరపదమే ప్రధానముగనుక 'మోవిచిగురును ఎవఁడు ముద్దాడు' ననుచో మోవికాక యుత్తరపదమైన చిగురునే ముద్దాడుట యని అసంగతి కలుగుచున్నది. కాన ఉపమితసమాసముగా నర్థము గ్రాహ్యము. కాఁబట్టి, 'అధరపల్లవం' అనుచో ఉపమ. అధరపల్లవమును నిష్ఠీవనశరావముగా రూపించుటచే రూపకము. ఉత్తరార్థమునందు అనుప్రాస మనెడి శబ్దాలంకారము. ఈమూఁడును పరస్పరనిరపేక్షము లై యేకవాక్యమున నిబద్ధము లగుటచే సంసృష్టి యనియుఁ దెలియునది.

క. జారభటచోరచేటక
   చారనటప్రభృతినీచజననిష్ఠీవా
   ధారశరావము వార
   స్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్. 59

తా. వెలయాలియొక్క చిగురువంటి కెమ్మోవి యెంత యింపైనదిగా నుండినను అది జారచోరాదులైన కసుమాలపుమనుజులు ముద్దుకొనుటచే వారందఱు నెంగిలి నుమియుమూఁకుడుపాత్రవలె మిక్కిలియు నపవిత్ర మైనది కాఁబట్టి సత్కులమునందుఁ బుట్టినవాఁ డెవఁడుగాని దానిని జుంబింపఁడు.

అవ. స్త్రీలు మీఁగడ తీయఁదనమును లోపల విషమును గలిగి యుండుదు. కావున వారు సర్వవిధములఁ ద్యజింపఁ దగినవారే కాని కైకొనఁ దగినవారు కా రనునభిప్రాయముతోఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మధు తిష్ఠతి వాచి యోషితాం హృది హాలాహలమేవ కేవలమ్।
   అత ఏవ నిపీయతేఽధరో హృదయం ముష్టిభి రేవ తాడ్యతే॥ 60

టీ. యోషితాం=స్త్రీలకు, వాచి=నోటియందు, మధు=తేనె, తిష్ఠతి=ఉండును, హృది=హృదయమునందు, కేవలం=ముఖ్యముగా, హాలాహలమేవ=కాలకూట విషమే, ఉన్నది. అత ఏవ=కాఁబట్టియే, అధరః=క్రిందిపెదవి, నిపీయతే=క్రోలఁబడుచున్నది. అందు తేనియ యున్నదని తలఁచి సకలజనులును మిక్కిలి యాదర

ముతో జుట్టుదురనుట. హృదయం=ఎద-ఱొమ్మనుట, ముష్టిభిరేవ=పిడికిళులచేత నే, తాడ్యతే=కొట్టఁబడుచున్నది. అందు విషము వర్తించుచున్నదని తలఁచి యందఱును గొట్టుచున్నా రనుట - స్త్రీలు మాటలందు తేనె లొలుకుచున్నా రనియు మనస్సునందు విషమువంటి తలంపులు గలవారనియుఁ బూర్వార్ధమునఁ బ్రదర్శింపఁబడినవి గాను, ఉత్తరార్ధమున మొదటిపాదమునందలి తేనె గొనుటయు, రెండవపాదమునందలి హాలాహలస్థానమైన హృదయమును గొట్టుటయుం బ్రదర్శింపఁబడినవిగాను నభిప్రాయము. ఇచట 'మధు తిష్ఠతి వాచి' అనుచో వాక్కునకు మధుసంబంధము లేకుండియుఁ జెప్పఁబడుటచే నతిశయోక్తి, 'హృది హాలాహల మేవ' అనుచో ఏవకారముచే నిచట నధ్యవసాయము సాధ్య మగుటచే ఉత్ప్రేక్ష. పూర్వార్ధముచే ఉత్తరార్ధము సమర్థితము గాన కావ్యలింగము. ఇట్లు పైకి తీయగను లోపల విషముగను నుండు ననుటచే స్త్రీలు త్యజింపఁదగినవా రనియు ధ్వని స్ఫురించెడిని. ఈనాలుగింటికి సంసృష్టి.

చ. కలదుగదా సుధారసము కంజదళాక్షులముద్దుఁబల్కులన్
వెలయుఁగదా హాలాహలము వీరలచిత్తమునందుఁ గావునం
బలుమఱుఁ బల్లవాధరము బాన మొనర్తురు నిండువేడుకన్
బలితపుఱొమ్ము ముష్టితలపాతములం బరిహరింతు రెంతయున్.

తా. చెలువలకు నోటియందు తేనియ యొలుకుచున్నది. హృదయమందో హాలాహలమే యున్నది. కాఁబట్టియే పురుషులు వారికెమ్మోవి నాదరముతోఁ గ్రోలుదురు; హృదయమునో పిడికిళులతోనో కొట్టుదురు.

ఇది శృంగారశతకమున కామినీగర్హణ మన్నది తృతీయవింశతి.

---

## భర్తృహరిసుభాషితము - సువిరక్త దుర్విరక్త పద్ధతి.

---

ఇంతవఱకుఁ గామినీగర్హణము సేయఁబడినది. విరక్తులు గలరా లేరా యని యాశంకించి కల రనియే మది నుంచుకొని వారియందును సువిరక్తులు దుర్విరక్తులు అని రెండువిధములుగా నుండుట ప్రతిపాదించునాఁడై మొదట సువిరక్తపద్ధతిని దొమ్మిదిశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ ధన్యాస్త ఏవ ధవళాయతలోచనానాం
తారుణ్యదర్పఘనపీనపయోధరాణామ్।

క్షామోదరోపరి లసత్త్రివళీలతానాం
దృష్ట్వాకృతిం వికృతి మేతి మనో న యేషామ్॥ 61

టీ. ధవళా...లోచనానాం- ధవళ=తెల్లనైనదియు- తెల్లదామరరేకుల వంటివి యనుట, ఆయత=విశాలములైనవియు నగు, లోచనానాం=కన్నులుగలవారును, తారుణ్య...ధరాణాం-తారుణ్య=యౌవనముయొక్క, దర్ప=మదముచేత, ఘన=గొప్పలును-క్రిక్కిఱిసినవియు, పీన=బలుపుగలవియు నగు, స్తనానాం=చన్నులు గలవారును, క్షామో...పరి-క్షామ=మిక్కిలి కృశించిన, ఉదర=కడుపుయొక్క-నడుముయొక్క యనుట, ఉపరి=మీఁద, లసత్...లతానాం-లసత్=ప్రకాశించుచున్న, త్రివళీలతానాం = తీఁగలవలె నున్న మూఁడు ముడుతలు గలవారును, 'త్రివళిలలితమధ్యా హంసవాణీ సువేషా' అన్నట్లు మూఁడువళులు కలిగియుండుటచే పద్మినీజాతి సూచితమగుచున్నది. ఇట్టిరూపసంపత్తి గలవారగుకామినులయొక్క, ఆకృతిం=ఆకారవిశేషమును దృష్ట్వా=చూచి, యేషాం=ఎవ్వరియొక్క-ఏపురుషుల యొక్క యనుట, మనః=మనస్సు, వికృతిం=వికారమును-కామినులకు పరతంత్రమై యుండుటను, న ఏతి=పొందదో, తే ఏవ=అట్టివారే, ధన్యాః=ధన్యులు-సుకృతాత్ములనుట-ఇట్టి నిర్వికారమైన చిత్తము గలిగియుండుట శమసంపన్నులకే గాన ధన్యులనఁగా శమవంతులైన సువిరక్తు లని భావము.

చ. కలికిమెఱుంగువాలుఁదెలి కన్నులు సన్నపుఁగౌనుదీఁగెపై
నలరెడుసద్వళీలతలు నంచితయౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడుసిబ్బెపున్వలుఁద గుబ్బలునుంగల మించుఁబోండ్లరూ
పులఁ గని నిర్వికారు లగుపూరుషులే కృతకృత్యు లిద్ధరన్. 61

తా. తెల్లదామరరేకులం బురడించు తెలిగన్నుఁగవ గలిగి, పరువంపుసొంపునఁ గ్రిక్కిఱిసిన బలితంపు గబ్బిగుబ్బలు నొప్పి, నకనకలాడు సెన్నడుముమీఁద నునుఁదీనియలవలె నున్నమూఁడువళులు మురువుఁ జూప, నింపారుచెలువలరూపుం జూచి వికారము నొందనిమనస్సు గలవారే సుకృతాత్ములు.

అవ. ముందు తా ననుభవించి యున్నయొకకామిని నిపుడు సంబోధించుటచే తనసువిరక్తిని బ్రకటించుచున్నాఁడు.

శ్లో॥ బాలే లీలాముకుళిత మమీ మన్థరా దృష్టిపాతాః
కిం క్షిప్యన్తే విరమ విరమ వ్యర్థ ఏష శ్రమ స్తే।
సమ్ప్రత్యన్యే వయ ముపరతం బాల్య మాస్థా వనాన్తే
క్షీణో మోహ స్తృణమివ జగజ్జాల మాలోకయామః॥ 62

టీ. హేబాలే=ఓముద్దరాలా! లీలాముకులితం- లీలా = విలాసంపువగచేత, ముకులితం యథాతథా=మొగుడునట్లుగా - అరమోడ్పఁబడినట్లుగా-అరమోడ్చి అర తెఱచినకంటనుండి నిగుడునట్లుగా ననుట, మన్థరాః=మందసంచారములైన-అల్లల్ల నీటుగాఁ బొలయునట్టి యనుట, అమీ=ఈ, దృష్టిపాతాః=విలోకనప్రసారములు-చూడ్కుల పచరింపులు, కిం=ఎందుకు, క్షిప్యన్తే=చిమ్మఁబడుచున్నవి-వానిని జిమ్మఁ దగదనుట-విలాసముచే నరమోడ్చిన కన్నుఁదమ్ములనుండి యల్లల్లఁ దిన్నగా నొలయు వాఁడిచూడ్కుల నేల నాపైఁ జాలుకుగా నిగిడించెద వనుట. విరమవిరమ=ఉడు గుము ఉడుగుము-చూపులఁ జిమ్ముట మిక్కిలియు మాను మనుట, ఏలనఁగా, ఏషః =ఈ, తే=నీయొక్క, శ్రమః=ఆయాసము-కడగంటిచూడ్కుల నిగుడ్పుటచేఁ గలి గినయలఁత, వ్యర్థః=నిరర్థకము-పసలేని దనుట-దానివలనఁ గోరినఫలము ఒనగూడ నేరదుగాన నిష్ఫలమే యనుట. ఇంతవఱకును వలపుమత్తునకు లోనై యున్న మన స్సులు గలవిూబోంట్లయందు చూపులు నిగుడ్పుటవలన ఫల మేల కలుగ దనఁగాఁ జెప్పుచున్నారు, సమ్ప్రతి=ఇప్పుడు, వయం=మేము, అన్యే=వేఱైనవారము-మునుప టివలె నీవిలాసములకు లోనై మోహము నందునట్టివార మిపుడు గా మనుట, ఏ లనఁగా, బాల్యం=పసితనము-లేక బేలతనము అనఁగా అవివేకము, ఉపరతం= ఉడిగినది, అయితే, వనాన్తే=అరణ్యమునడుమ, ఆస్థా=ఆదరము - మిక్కిలియాశ, కలిగియున్న దని శేషము-నీయందు రక్తిని మాని విరక్తితో వనవాసముసేయఁ గో రుచున్నార మనుట, ఇది యెట్లు కలిగె ననగా, మోహః= అజ్ఞానము, క్షీణః= నశించినది-నీయం దాసక్తిని గలిగించు కారణమైన మోహము నిర్మూల మైన ద నుట, కాఁబట్టి, జగత్ జాలం=లోకములసమూహమును-సకలప్రపంచము ననుట, తృణమివ = పోఁచవలె-నిస్సారమైనదిగాననుట, ఆలోకయామః=చూచుచున్నా రము. 'నిః స్పృహస్య తృణం జగత్' అన్నట్లు జగము నెల్ల గడ్డిపరకవలె నెన్ను చున్నామనుట-ఇప్పుడు జ్ఞాన ముదయించుటవలన మనస్సుఖముతప్ప తక్కిన వెల్ల తుచ్ఛముగా ననుసంధించుచున్నా మనియు భావము కావున నీవు మాపయిఁ జూ పులు చిమ్మవల దని యాశయము.

ఉ. మానిని యేల చిమ్మెదవు ♦ మాపయి మంథరదృష్టిపాతము
లూనుము నీశ్రమంబు విఫలం బిది వింతల మైతి మిత్తఱిఁ
మానుగ జవ్వనం బడఁగె ♦ మానసవృత్తి వనంబుఁ గోరె న
జ్ఞానము నష్ట మయ్యె యవసంబుగఁ జూచెద మెల్లలోకమున్.

తా. ఓ ముద్దియా! విలాసంపువగచే నర మోడ్చినకన్నుఁగవనుండి యల్లల్లఁ బొలయు నునుఁజూడ్కులు మాపయిఁ జిమ్మకు చిమ్మకుమా. అట్లు చిమ్ముటవలన వట్టియాయాసమే కలుగును గాని వేఱుపస లేదు. ఏలనఁగా మేము మునుపటివలె

నీకులుకు బెళుకులకు జేలుపోవుచుండినవార మిపుడు గాము. మా బేలతనము తీసిపోయినది. ఇప్పుడు విరక్తితో వనవాసము సేయఁ గోరిక కలిగియున్నది. ఏలన, నీయందుఁ దగులుకలిగించుమూల మైనమోహము నిర్మూల మైనదిగాన ప్రపంచమంతయు మాకు గడ్డిపోఁచవలె నిస్సార మైయున్నది. అట్టిమాయందు నీచూడ్కులు నిష్ఫలముగాఁ జిమ్మఁ దగదు.

అవ. చెప్పినదానినే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఇయం బాలా మాం ప్ర త్యనవరత మిన్దీవరదళ
ప్రభాచోరం చక్షుః క్షిపతి కి మభిప్రేత మనయా।
గతో మోహోఽస్మాకం స్మరకుసుమబాణవ్యతికర
జ్వరజ్వాలా శాన్తా తదపి న వరాకీ విరమతి॥ 63

టీ. ఇయం=ఈ, బాలా=ముద్దియ, మాంప్రతి=నన్నుఁగూర్చి, అనవరతం=ఎడతెగక, ఇన్దీ...చోరం-ఇన్దీవరదళ=నల్లగలువ రేకులయొక్క, ప్రభా=కాంతిని, చోరం=దొంగిలునట్టి-నల్లగలువ రేకులతో సాటియైన యనుట, చక్షుః=కంటిని, క్షిపతి=ప్రసరింపఁజేయుచున్నది-నిగుడ్చుచున్నదనుట, అనయా=దీనిచేత-ఈముద్దియచేత ననుట, కిం=ఏమి, అభిప్రేతం=అపేక్షిత మైనది-ఈబాల యేమి యపేక్షించి తనకన్నుఁగవ నాపయి నిగిడ్చినదో యది నాకుఁ దెలియకున్న దనుట. అది నీపొందు నే యపేక్షించినది,కాని నీవు తెలియకుండుట యెట్లు అని యడుగఁగా జెప్పుచున్నాఁడు, అస్మాకం=మాకు, మోహః=అజ్ఞానము, గతః= పోయినది-ఇప్పు డుడిగిన దనుట, స్మర...జ్వాలా-స్మర=మన్మథునియొక్క, కుసుమ బాణ=పూవు టమ్ములయొక్క, వ్యతికర=సంపర్కముచేత ('స్మర శబరబాణ వ్యతికర' అనుచో మన్మథుఁ డనెడి బోయవానియమ్ములసంపర్కముచేత నని యర్థము)కలిగిన,జ్వర=సంతాపముయొక్క, జ్వాలా=సెగ, శాన్తా=నిమ్మళించినది-ఉడిగినదనుట, తదపి=అయినప్పటికి, వరాకీ=ఈదౌర్భాగ్యురాలు-లేక యతినీచురాలు, న విరమతి=ఉడుగకున్నది - చూపులను జిమ్ముట నుడుగకున్న దనుట. పూర్వము ప్రాణప్రియురాలై గొప్పదిగా నెన్నఁబడిన బాల నిప్పుడు వరాకి యని పేర్కొనుటచే దానియెడ నత్యంతవైరాగ్యము కలిమి సూచితమయ్యెడిని. మాకు మోహాదులెల్ల నశించి మహావైరాగ్యము కలిగియుండఁగా నిది మమ్ముఁ దనవాఁడిచూడ్కులతో గ్రుచ్చుట నిష్ఫలమే కాని దానిచే మాకు వలపు కలుగదు. ఇది తెలిసియు నింకను మాపై చూపులు చిమ్ముచున్నదే యిది యెంతనీచురా లని యాశయము.

ఉ. నీలసరోజపత్త్రకమనీయవిభాహరణప్రవీణదృ
గ్జాలము లీలతాంగి వెదఁజల్లెడు నాపయి నేమి గోరెనో

తూలెె సమస్తమోహవికృతుల్ రతివల్లభభిల్లభల్లసూ
జ్వాల లడంగె మాకుఁ దనకన్నెఖరి నూనదు జోటి నేఁటికిన్. 63

తా. ఈముద్దియ, నిద్దంపునల్లగలువ కేసుల నునుఁజాయలను జీ యనునట్టి లేత కన్నుంగవ నాపయి నెడతెగక నిగుడ్చుచున్నది. ఏమి తలఁచి యిట్లు నిగుడ్చుచున్నదో తెలియరాదు. నేనుఁ దన్ను వలతునని తలఁచియా? మా కిపుడు మోహ మెల్ల నుడిగినది. మరుని పూవుటమ్ముల తాఁకుచే వెమ్మునట్టి పెనుఁగాఁక సెగలును ఉడిగినవి. ఇట్లు కేవలవిరక్తిచే మాకు వలపులన్నియు నుడిగియుండఁగా ఈనీచురాలు మాత్ర ముడుగక వలపించుటకు వ్యర్థముగా మాపయి వాఁడిచూడ్కులు చిమ్ముచునే యున్నది.

అవ. ఇపుడు మరునియొక్కయు వాని పరివారముయొక్కయు నేపురు గర్వమును నిరాకరించుపలుకుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రే కన్దర్ప కరం కదర్థయసి కిం కోదణ్డటఙ్కారితైః
రే రే కోకిల కోమలైః కలరవైః కిం వా వృథా జల్పసి।
ముగ్ధే స్నిగ్ధవిదగ్ధముగ్ధమధురైర్లోలైః కటాక్షైరలం
చేత శ్చుమ్బితచన్ద్రచూడచరణధ్యానామృతం వర్తతే॥ 64

టీ. రేకన్దర్ప=ఓరిమన్మథా, 'రే' యనుట నీచసంబోధనము, కోదణ్డటఙ్కారితైః=వింటియొక్కటంకృతులచే-అల్లెత్రాటిని లాగి చేయుటంకారములచేత ననుట, కరం=చేతిని, కిం=ఎందుకు, కదర్థయసి=పీడించుచున్నావు? ('శరం కదర్థయసి కిం కోదణ్డటఙ్కారితం' అనుపాఠమున కోదణ్డటఙ్కారితం=వింటిటంకారముగలదిగాఁ జేయఁబడిన-ముందు అల్లెత్రాటిని మొరయించుటతోఁ గూడినదైన యనుట, శరం=బాణమును, కిం=ఎందుకు, కదర్థయసి=చెఱుపుచున్నావు? నారి మొరయించి తూపు నేయుటవలనఁ బనయేమి యని యర్థము), రేరేకోకిల=ఓరోరికోయిలా, కోమలైః=మెత్తనివైన, కలరవైః=అవ్యక్తమధురధ్వనులచేత-కులకులమను తియ్యనియెలుఁగులచేత ననుట, వృథా=వ్యర్థముగా, కింవా జల్పసి=ఏల వదరుచున్నావు? ('కోమలం కలరవం...జల్పసి' అనుపాఠమున మృదువైన యవ్యక్తమధురధ్వని యెందులకుఁ గూయుచున్నావనుట), వదరుటవలన ఫలము లేదు గాన నది వ్యర్థమే యని భావము. ముగ్ధే=సుందరీ, స్నిగ్ధ... మధురైః-స్నిగ్ధ=దట్టములును 'స్నిగ్ధస్తు మసృణే సాన్ద్రే' అని యమరుఁడు- లేక 'విస్రమ్భే పరమాం కాష్ఠా మారూఢే దర్శనాదిభిః। యేనాన్తరఙ్గం ద్రవతి స స్నేహ ఇతి కథ్యతే' అనునట్టిస్నేహముతోఁ గూడినవియు ననుట, విదగ్ధ=పలువగలవిలాసములను మెఱయించుటయందు నిపుణములును-అనఁగా 'యద్దర్శనే విరక్తోఽపి క్షుభ్యతే తత్సమన్మథమ్' అన్నట్లు విరక్తునైన వలపించుటయందు చతురములును, ముగ్ధ = సొగసైనవియు - 'అపరిచ్ఛిన్నవిష

యం మదమన్థరమీలితం । స్ఫురద్భ్రూపక్ష్మతాయుక్తం తత్స్మేరమితి కథ్యతే' అన్నట్లు ఏదే నొకవిషయమాత్రమున నెలకొనుట లేక నల్లల్ల పొలయుచు మదమంథరత్వాదిగుణములు గలిగియుండునట్టి స్మేరములును, మధురైః=ప్రియములును-లేక, 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్' అన్నట్లు సంతాపహరములును, అయినవియు, లోలైః=స్వభావముచే చంచలములైనవియు-లేక తృష్ణగలవియు 'కటాక్షైః హ్లాసగర్భైస్తు సమ్భోగౌత్సుక్యభావనా' అని సంభోగంపుఁదమిని తెలుపునట్టివి యనుట, అను, కటాక్షైః=కడగంటిచూపులచేత-'యద్గతాగతవిశ్రాన్తివైచిత్ర్యేణ వివర్తనమ్' అని పూర్వోక్తలక్షణములు గలచూపులచేత ననుట, అలం=చాలును-ఇటువంటి చూడ్కులు నిగిడింప నక్కఱలేదనుట, ఏలనఁగా, చేతః=నామనస్సు, చుమ్బిత.....మృతం=చుమ్బిత=ఆస్వాదింపఁబడిన, చన్ద్రచూడ=(చంద్రునిశిరస్సునందుఁ గల) శివునియొక్క, చరణ=అడుగులయొక్క, ధ్యాన=ధ్యానమనెడి, అమృతం=అమృతము గలది యగుచు - శివచరణధ్యానమనెడియమృతము నాస్వాదించుచు ననుట, వర్తతే=వర్తించుచున్నది. మన్మథుని గెలిచినపరమశివునిచరణముల ధ్యానముచే మాచిత్తము వైరాగ్యము లభించినది. మన్మథుని జయించినవానిని దలఁచుటచే మన్మథజయరూపమైన వైరాగ్యము కలుగునే కదా. అట్టివిరక్తచిత్తులమైనమమ్ము క్షుద్రులైనయీమన్మథాదులు ఏమి చేయుదు రని యొకభావము. 'ధ్యానామృతం' అనుటచే అమృతము గ్రోలి తృప్తిచెందినవానికి పులియఁబెట్టిన కడు గేల యని యొకభావము. బ్రహ్మానందముచే నిండినవానికి విషయములవలనఁ గలుగు క్షుద్రమైన యానందముతోఁ బనియేమియని యొకభావము. నేనిపుడు పూర్వమువలె మీకుఁ గింకరుఁడనుగాను శంకరకింకరుఁడ నని భావాంతరము. ఇట్టిశివచరణధ్యానాసక్తుని నన్ను వశముసేసికొనుట యసాధ్యముగాన నిట్టి యలవికాని పనిని సాధింపఁబూనుటకు మీ కేమివెఱ్ఱి యనియు భావము. అన్నివిధముల మాకు కామినులయెడ నపేక్షయే లేదు అని పరమభావము.

ఉ. ఓరిమనోజసూనశర మూరక చిమ్మకు మిన్నకే కుహూం
కారము లేల చేసెదు పికధ్వజ యో మృగశాబకాక్షి నీ
చారువిలోకనంబు లిఁకఁ జాలును నాహృదయంబు శంకరో
దారపదాబ్జచింతనసుధారసతత్పర మయ్యె నియ్యెడన్. 64

తా. ఓరిమన్మథా! వింటినారి మొరయించుచు నీచేయి నేల గాసిపెట్టుకొని యెదవు? ఓకోయిలా! కులకులమని యింపారు మెత్తనియెలుఁగుల నారక యేల వదరెదవు? ఓచెలువా! నెయ్యంబుచే తియ్యంబులై, నెఱసీటు మిటారించుచు, సొగసులు కులుకుచు, నింపు సొంపారుచుఁ, బలుకుం బెళుకు లీను నీకడగంటివాఁడిమాడ్కులు

నిసుడ్చుట చాలుఁజాలు. నాచిత్తము, పరమశివచరణారవిందమకరందమును గ్రోలి యితరవిషయములందు విరక్తి నొందియున్నది.

అవ. మనస్సుయొక్క స్థితినిబట్టియే సంగమము గాని విరహము గాని కలుగు నని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ విరహేఽపి సఙ్గమః ఖలు పరస్పరం సఙ్గతం మనో యేషామ్।
హృదయ మపి విఘటితం చే త్సఙ్గో విరహం విశేషయతి॥ 65

టీ. యేషాం=ఎవ్వరికి-ఏస్త్రీపురుషుల కనుట, మనః=మనస్సు, పరస్పరం=అన్యోన్యముగా, సఙ్గతం=కలిసి యుండునదో-పరస్పరానురాగము కలిగియుండునో యనుట, (తేషాం=వారికి), విరహేఽపి=వియోగావస్థయందును-ఒండొరుల నెడఁబాసియుండునప్పుడును, సఙ్గమః ఖలు=సమాగమమే యగునని శేషము-ఒండొరులను బాసియున్నను గలిసియున్నట్టివారే యగుదు రనుట, ('విరహోఽపి సఙ్గమః ఖలు' అనుపాఠమున విరహోఽపి=ఎడఁబాటుకూడ, సఙ్గమః ఖలు=సంగమమే యగును-వారియెడఁబాటు సంగమముతో సాటియగు నని యర్థము) 'హృదయసఙ్గమ ఏవ సుసఙ్గమో న తనుసఙ్గమ ఏవ సుసఙ్గమః, మనస్సులయొక్క కలయికయె మంచికలయిక గాని దేహములకలయిక మంచికలయిక గాదు' అనువచనముంబట్టియు, శరీరమున కంటె నంతరంగమే బలీయమైన దనున్యాయంబునను, అంతరంగములు కలిసియున్న యెడల శరీరములుకలిసియుండుటతో సమానమగునని భావము. మనస్సుకూడిక లేనిచో సంగమముండినను విరహమే కలిగించు ననుచున్నాఁడు-హృదయం=మనస్సు, విఘటితం చేత్=వేఱుపఱుపఁబడినదేని-కలసియుండదేని యనుట, సఙ్గః అపి=కూడికయు, విరహం=ఎడఁబాటును, విశేషయతి=వృద్ధి సేయుచున్నది. ('హృదయం విఘట్టితం చేత్' అనుపాఠమున, హృదయము, విఘట్టితం చేత్ = చక్కఁగా కొట్టుబడినదేని-లెస్సగా నిగ్రహింపఁబడినదేని యనుట-నిగ్రహించి విరక్తికి లోఁబఱుపఁబడిన దైన యెడల నని భావము, సఙ్గః=సమాగమము, విరహం = ఎడఁబాటును, విశేషయతి=విశేషించినదానినిగాఁ జేయుచున్నది-తనకంటె మేలైనదానినిగాఁ గావించుచున్న దనుట, స్త్రీపురుషులు మనస్సును ఒండొరులయెడ నిగిడింపక నిగ్రహించినయెడల నది వారికి సంగమము కలిగియుండినను విరహము నేదానికంటె మేలైనదిగాఁదోఁపించి దాని నే కోరునట్లుచేయునని భావము-ఈపాఠమునకనుగుణముగా పూర్వార్థమునకు ఉత్తరార్థమునకు అర్థాన్వయ మెట్లనఁగా స్త్రీపురుషులు తమతమమనస్సులను నిగ్రహింపకయొండొరులయెడ విచ్చలవిడిగా నిగిడించిరేని వారు ఒండొరులనుబాసి విరక్తిని బొందఁ జూచినను మనస్సులు కలసియుండుటవలనను రక్తితో నొండొరులఁ గూడియున్నట్టివారే యగుదురు. ఇట్లుగాక వారు మనస్సులను బరస్పరము నిగిడింపక నిగ్రహించిరేని వారు రక్తిగలవారివలెఁ గలసియున్నను విరక్తితో వీడియున్నట్టివారే యగుదురు అని యర్థము. కాఁబట్టి మనస్సును నిగ్రహించుట యావశ్యక మనియు,

అది నిగ్రహింపఁబడఁగా నింద్రియములును విషయములనుండి నివర్తింపఁబడుననియు, నింద్రియములు నివర్తింపఁగా దానివిషయము లైదింటను విరక్తి తనంతనే సిద్ధించు ననియు, నిట్లు పంచవిషయములందు విరక్తి సిద్ధించుప్రకార మీరెండవయర్థమున నిరూపిత మైన దని తెలియునది).

క. విరహమునం దైనఁ బర
స్పర మనురాగులకుఁ బొందు * భాసిలు మన సె
వ్వరి కెనయదు వారలకును
విరహము హెచ్చుగ నొసర్చు * వెస సంగతియున్. 65

తా. స్త్రీపురుషులమనంబులు ఒండొంటితోఁ గలిసియుండెనేని వా రెడఁబాసియున్నను గూడియున్నట్టివారే యనుదురు. మనస్సులు వేఱుపడియుండెనా వారు కూడియుండినను ఎడఁబాసినట్టివారే మిక్కిలి యనుదురు. [రెండవయర్థమునుఁ దాత్పర్యము తద్వివరణమందే నిబంధింపఁబడినది.]

అవ. దేశాంతరమునం దున్నయొకానొకవిరక్తునికిం గలవైరాగ్యమును వాఁడు సేయువిచారముంబట్టి ప్రకటించుచుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కిం గతేన యది సా న జీవతి, ప్రాణితి ప్రియతమా తథాపి కిమ్।
ఇత్యుదీక్ష్య నవమేఘమాలికాం, న ప్రయాతి పథికః స్వమన్దిరమ్॥

టీ. సా=ఆ, ప్రియతమా=ప్రేయసి-మిక్కిలి ప్రియురాలైన యా నాచెలువ యనుట, యది న జీవతి=బ్రతికియుండదేని-విరహవేదనఁ దాళమిచే బ్రతికియుండకుండిన యెడల ననుట, గతేన=పోవుటచే-నే నింటికిఁ బోవుటచే, కిం=ప్రయోజన మేమి-లేక 'గతేన మయా కిం' అని 'మయా' శబ్దము నధ్యాహరించుకొన్నయెడల 'పోయినట్టి నాచే నేమి' అని యర్థము. ప్రియురాలు బ్రతికియుండదేని నేనింటికిఁ బోవుటవలనఁ బ్రయోజన మేమియు లేదని భావము. లేక, (యది) ప్రాణితి=బ్రతికి యుండు నేని-నాప్రియతమ యేదేని వినోదోపాయములచే నెట్లో ప్రాణములు విడువక యుబుసుపుచ్చుచు బ్రతికి యుండు నేని యనుట, తథాపి=అట్లయినను-అది యట్లు బ్రతికియుండినప్పటికిని, (గతేన) కిం=(నేను పోవుటచే) ప్రయోజన మేమి-అది బ్రతికియున్నను విరక్తుఁడనైననాకు దానివలనఁ బ్రయోజనము లేదు గాన నేను బోవుట వ్యర్థమే యని భావము. ఇతి=ఇట్లని-ఇట్లు విచారము సేసి యనుట, పథికః=(ఒకానొక) తెరువరి, నవ...మాలికాం-నవ=క్రొత్తయైన, మేఘమాలికాం=మబ్బులవరుసను - విరహిజనులను మిక్కిలి పీడించునట్టిదాని ననుట, ఉదీక్ష్య=తలయెత్తిచూచి, స్వమన్దిరం ప్రతి=తనయింటినిగూర్చి, న ప్రయాతి=పయనము కాఁడు. * వైరాగ్యమువలన చిత్తము

---

* 'యద్భావి తద్భవత్యేవ యదభావి నతద్భవేత్। ఇతి నిశ్చితబుద్ధీనాం నచి

గట్టిగా చలింపకుండుటచే తనచెలువంగూర్చి యింటికిఁ బోఁడయ్యె ననుట.

క. చన నేటికిఁ బ్రేయసి జీ
వనవతి యగునేని ప్రాణవతి గానితఱిం
బని యే మని యొక తెరువరి
చనఁ డింటికి నవ్యజలదసమయమునందున్. 66

తా. ఒకానొకపాంథుఁడు అప్పుడు క్రొత్తగా లేచుచున్న *మబ్బులవరుసను జూచినవాఁడై యది విరహిజనులకు మిక్కిలి మదనతాపము కలిగించి ప్రాణసంకటము చేయునట్టిదిగాన యింటనున్న తనసెయ్యంపుటిల్లాలు విరహాగ్నిచే నేమగునో యని తలఁచి యింటికిఁ బోవంజూచియు విరక్తుఁడుగాన తనలో నిట్లు విచారించుచున్నాఁడు: 'ఒకవేళ నాప్రియురాలు విరహతాపముచేఁ గుందిప్రాణములు విడిచియుండునేని నే నింటికిఁ బోవుటవలనఁ బనయేమి? లేక, యది యెట్లో యుబుసుపుచ్చుచు బ్రతికియే యుండినను నేను విరక్తుఁడను గానఁ బోయియుఁ బ్రయోజన మేమి?' ఇట్లు విచారించినవాఁడై వాఁడు తనయింటికిఁ బయనమై పోయినవాఁడు గాఁడు.

అవ. పండితు లైనవారికి దానియందు వైరాగ్యము నుపదేశించుచున్నాఁడు.

శ్లో॥ విరమత బుధా యోషిత్సఙ్గా త్సుఖా త్క్షణభఙ్గురా
త్కురుత కరుణామైత్రీప్రజ్ఞావధూజనసఙ్గమమ్।
న ఖలు నరకే హారాక్రాన్తం ఘనస్తనమణ్డలం
శరణ మథవా శ్రోణీబిమ్బం రణన్మణిమేఖలమ్॥ 67

టీ. హేబుధాః=విద్వాంసులారా, క్షణభఙ్గురాత్=క్షణకాలములో నశించునట్టి, యోషిత్ సఙ్గాత్= స్త్రీలతోడిసమాగమ మనెడి-చెలువలతోడికూడిక యనెడి,

---

న్తా బాధ తేక్వచిత్-కలుగనున్నది కలిగియేతీఱును, కలుగరానిది కలుగనే కలుగదు అని బుద్ధిని నిశ్చయించి యున్నవారిని చింత యెచ్చటను బాధింపదు' అనుట విరక్తచిత్తునిలక్షణము.

* మేఘోదయము మిక్కిలి మదనోద్దీపకము. ఇదియే మేఘసందేశమున 'మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి చేతః । కణ్ఠాశ్లేషప్రణయిని జనే కింపునర్దూరసంస్థే' 'సుఖముగలవారికి-అనఁగా కాంతలం గూడియున్న పురుషులకుఁగూడ-మేఘమునుజూడఁగా మనస్సు మఱియొకవృత్తి-అనఁగా వికారముగలది యగుచున్నది. కాంతను బాసి దూరమందున్నవాఁడై దానికుత్తుక బిగి యార కాఁగిలించుకొన నువ్విళ్లూరునట్టివానినిగుఱించి చెప్ప నేల' యని కాళిదాసు చెప్పియున్నాఁడు.

సుఖాత్=సుఖమువలన, విరమత=విరమింపుఁడు-క్షణకాలమే సుఖము నిచ్చునట్టి స్త్రీ
సంగమము నుడుగుఁడనుట-దానివలనిసుఖము క్షణికముగాన తుచ్ఛ మనియు కావున
త్యాజ్యమనియు నాశయము, అయితే, కరుణా...సఙ్గమమ్-కరుణా=దయ-(సర్వభూ
తములందుఁగాని దుఃఖమునొందినవారియెడఁగాని) కనికరము, మైత్రీ=(పుణ్యవంతు
లతోడి) చెలిమి, ప్రజ్ఞా=బుద్ధి-ఆత్మవిషయ మైనజ్ఞానము, వీర లనెడి,వధూజన=స్త్రీ
సమూహముయొక్క, సఙ్గమం=కూటువను, కరుణ మైత్రి ప్రజ్ఞ అనెడి స్త్రీలతోడికూ
డిక ననుట, కురుత=చేయుఁడు, కరుణాదులే అంతఃకరణముయొక్క మాలిన్యమును
బోఁగొట్టి శుద్ధపఱుచునట్టివి గాన చిత్తపరికర్మములని సాంఖ్యసిద్ధాంతము-ఈ స్త్రీల
వలన నార్జితమైనసుఖము గలుగఁగా క్షణికసుఖము నిచ్చువా స్త్రీని జేపట్టనేల యని
భావము. ఏలనఁగా, నరకే=నరకమునందు,హార ఆక్రాంతం=ముత్తైపుసరులచే నా
క్రమింపఁబడినదియైన-ముత్తైపుసరులచే శోభిల్లునట్టియనుట, ఘన...మణ్డలం-ఘన=
గొప్పదైన, స్తనమణ్డలం=కుచమండలము-విశేవియైన వట్రువగుబ్బలును, అథవా=
లేక, రణ...ఖలమ్-రణత్=మ్రోఁగుచున్న, మణిమేఖలమ్=మణులు పొదిగిన మొల
నూలు గల, శ్రోణీబిమ్బం=నితంబమండలము-గుండ్రని వలుఁదపిఱుఁదులు ననుట, బిగి
గబ్బిగుబ్బలును బలితంపువలుఁదపిఱుఁదులును గలమెఱుఁగుఁబోండ్లనుట, శరణం=
రక్షక మైనది, నఖలు=కాదుగదా. కరుణాదులతోడిసంగతియో నరకమందును
రక్షించునట్టిది. కాఁబట్టి దానినే కయికొనఁదగు నని యాశయము.

మ. మన సింపొందఁగ ధీసులార కరుణాఁమైత్రీమనీషాక్షమా
వనితాసంగమ మాచరింపుఁ డెపుడున్ ఁ భామాసుఖం బస్థిరం
బని వర్జింపుఁడు హారరమ్యకుచముల్ ఁ బ్రాంచన్మణీమేఖలా
ధ్వనితాలంబినితంబముల్ ఁ నరకబాధల్ మాన్పి రక్షించునే. 67

తా. విద్వాంసులారా! స్త్రీతోడికూడిక క్షణకాలమే సుఖ మొసంగి నశించు
నట్టిదిగాన దానితోఁబనేమి? మీకు స్త్రీలతోకూడికయం దిచ్ఛయుండు నేని కరుణ,
మైత్రి, ప్రజ్ఞ యనెడి స్త్రీలతోఁ గూడుఁడు. ఏలనఁగా ముత్తైపుసరులచే సిరులు
చూపు చెలువలగబ్బిచనుగుబ్బలుగాని లేక చిఱుగజ్జెలచే మ్రోఁగుచున్న రతనంపు
మొలనూలిచేఁ దులకించు వారి బలితంపువలుఁదపిఱుఁదులుగాని నరకమునందు వచ్చి
మిమ్ము రక్షింపవుగదా.

అవ. ఇట్లు సాంఖ్యసిద్ధాంతముచొప్పున వైరాగ్యమును జెప్పి
యిపుడు యోగమతానుసారముగా దానినే చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదా యోగాభ్యాసవ్యసనకృశయో రాత్మమనసో
రవిచ్ఛిన్నామైత్రీ స్ఫురతి కృతిన స్తస్య కిము తైః।
ప్రియాణా మాలాపై రధరమధుభి ర్వక్త్రవిధుభిః
సనిశ్వాసామోదైః సకుచకలశాశ్లేషసురతైః॥ 68

టీ. యదా=ఎప్పుడు,(యస్య=ఎవనికి-మీఁద 'తస్య' అని తచ్ఛబ్దముండుటచే నిది యధ్యాహార్యము), యోగా...కృశయోః-యోగ అభ్యాస=(యమనియమాద్యష్టాంగములచే చిత్తమును నిరోధించి యాత్మయందు నిలుపుట యనెడి) యోగముయొక్క యలవాటునందలి, వ్యసన=ఆసక్తిచేత, కృశయోః=చిక్కినట్టి - యోగాభ్యాసమున మెదిగినట్టి యనుట, ఆత్మమనసోః=ప్రత్యగాత్మ అంతఃకరణము అనురెంటికి, అవిచ్ఛిన్నా=ఎడతెగని, మైత్రీ=చెలిమి-సంగడి-యోగాభ్యాసవశమున మనస్సు బాహ్యము లైన శబ్దాదివిషయములను బరిత్యజించి ప్రత్యగాత్మయందు రమించుట యనుట, స్ఫురతి=ప్రకాశించునో, (తదా=అప్పుడు), తస్య కృతినః = ఆధన్యునకు, ప్రియాణాం=ప్రియురాండ్రయొక్క, తైః=ఆ, ఆలాపైః=మాటలచేతను-చెవి కింపైన తియ్యనిముద్దుపలుకులచేత ననుట, అధరమధుభిః = మోవితేనియలచేతను-నాలుక కింపైన కెమ్మోవిపానకములచేత ననుట, సనిశ్వాసామోదైః=ఊర్పులయొక్క వాసనలతోఁ గూడినట్టి-పద్మినీజాతిని బట్టి ఘ్రాణమున కింపైనవాసనలు గల కమ్మయూర్పులతోఁ గూడినట్టి యనుట, వక్త్రవిధుభిః=ముఖచంద్రులచేతను-కంటికింపై చందురునివలె నొప్పునెమ్మోములచేత ననుట, సకుచ...సురతైః-సకుచ కలశ ఆశ్లేష=గిండ్లవంటి పాలిండ్ల కౌఁగిలింతలతోఁగూడిన, సురతైః=రతికేళులచేతను-ఒడలి కింపైన బాహ్యసంభోగములచేతను ఆభ్యంతరసంభోగములచేతను-'కుచకలశ' మనుట బాహ్యరతికిని 'సురత' మనుట ఆంతరరతికిని గమకములు, ఇట్లు చెవి కన్ను మొదలైనయాయాయింద్రియము లన్నిటికిని నింపుగూర్చు, ముద్దియలముద్దుపలుకులు, మోముచందురులు మొదలైనవానిచేత, కిము=ఏమి-వానితో ఏమిసంబంధ మనుట, మనస్సు ఆత్మయందు నెలకొని యందలి యమందానందమును అనుభవించునపుడు ప్రియురాండ్రయాయాలాపాదులు అతితుచ్ఛములుగాఁ దోఁచును గాన నట్టివానితోఁ బనేమి యని భావము.

చ. ఎనసిన యోగమార్గరతిన్ యెవ్వని డెందముఁలో వెలుంగుతో
గొనకొని యేకమై వెలుఁగున్ గూరిమి మీఱఁగ వాని కేటికిన్
వనితలముద్దుపల్కులునున్ వాతెర తేనియ లూర్పుఁదావులున్
గొనబగు మోముఁజందురులున్ గుబ్బలఁ గౌఁగిటఁ జేర్పుకూటముల్.

తా. ఎవఁడు యోగాభ్యాసమందలినిష్ఠకు మనస్సును బనుపఱచి యాత్మయందు నెలకొల్పి యందలిమహానందము నెడతెగక యనుభవించునో యట్టిధన్యునికిఁ బ్రియురాండ్రముద్దుఁబలుకులచేతను, మోవితేనియలచేతను, మోముచందురులచేతను, కమ్మయూర్పులచేతను, గిండ్లవంటిగుబ్బపాలిండ్ల బిగికౌఁగిలింతలతోఁగూడిన పెనఁకువలచేతను వరుసగాఁ జెవిమొదలైన యాయాయింద్రియములకుఁ గలుగుసుఖము తుచ్ఛమే యగును గాన నట్టివానితో వానికి సంబంధము కలుగదు.

అవ. వేదాంతముయొక్క సిద్ధాంతముఁజొప్పన వైరాగ్యమును వర్ణించి నిగమించుచున్నాఁడు.

శ్లో॥ యదాసీ దజ్ఞానం స్మరతిమిరసఞ్చారజనితం
తదా దృష్టం నారీమయ మిద మశేషం జగ దితి।
ఇదానీ మస్మాకం పటుతరవివేకాఞ్జనజుషాం
సమీభూతా దృష్టి స్త్రిభువన మపి బ్రహ్మ మనుతే॥ 69

టీ. యదా=ఎప్పుడు, స్మర...జనితం-స్మర=మన్మథుఁడనెడి, తిమిర=(బుద్ధిపరముగా) చీఁకటియొక్క - కామాంధకారముయొక్క యనుట-(దృష్టిపరముగా) 'తిమిరం నేత్రరోగే స్యా దన్ధకారేఽపిచ స్మృతమ్' అన్నట్లు, తిమిరమనెడి కంటితెవులుయొక్క, సఞ్చార=వ్యాప్తిచేత, జనితం=పుట్టింపఁబడినదైన, అజ్ఞానం=అవివేకము, ఆసీత్=ఉండెనో, తదా=అప్పుడు, అశేషం=సమస్తమైన, జగత్=ప్రపంచము, నారీమయం ఇతి=స్త్రీమయ మైనదని - స్త్రీలచే నిండినదని, దృష్టం=కనుఁగొనఁబడినది. మన్మథుఁడు కలిగించిన యజ్ఞానముచే లోకమెల్ల స్త్రీలుగాఁ గనఁబడిన దనుట, ఇదానీం=ఇప్పుడు, పటు...జుషాం-పటుతర=బలీయమైన-(బుద్ధిపక్షమున) అజ్ఞానమును దూలింపఁ జాలినట్టి యనుట-(దృష్టిపక్షమున) ఆరోగమును దూలింపఁజాలినట్టి, వివేక=వివేక మనెడి, అఞ్జనం=కాటుకను-నేత్రకల్యాణమనెడి సిద్ధాంజనము ననుట. జుషాం=పొందియున్నట్టి, అస్మాకం=మాయొక్క, దృష్టిః=మతి-చూపు అని అర్థాంతరము, సమీభూతాసతీ=సమముగాఁ జేయఁబడినది అగుచు-తన యెప్పటిబాగునకు వచ్చినదై యనుట, త్రిభువనం=మూఁడులోకములను, బ్రహ్మ=బ్రహ్మముగా-బ్రహ్మమయముగా ననుట, మనుతే=తలఁచుచున్నది-జ్ఞాన ముదయించుటవలన జగములనెల్ల బ్రహ్మస్వరూపముగా తెలియుచున్న దనుట. కాటుకచేత కంటితెవులు తీసిపోఁగా కుండమొదలైన వస్తువులు వానివాని కలరూపునఁ గనఁబడునట్లు, తత్త్వజ్ఞానముచే కామాంధకారమువలనఁ గ్రమ్మిన యజ్ఞానము తొలఁగఁగా పరవస్తువు సాక్షాత్కరించుచున్నది. ఈతత్త్వసాక్షాత్కారరూపమైన సమ్యగ్దర్శనముచే సమస్తమును బ్రహ్మాకారముగాఁ గనుపట్టెడి. ఇదియె వేదాంతసిద్ధాంతమని భావము. ఇట్లు వివేకము పరశ్రేయస్సు కలిగించునది గాన దానింబడయుటకై ప్రయత్నము సేయవలయు నని తాత్పర్యము. 'స్మరతిమిర' 'వివేకాఞ్జన' ఇత్యాదిప్రకృతిరంజకములైన యారోపములచే రూపక మలంకారము. 'దృష్టిః' అనుచో మతికిని చూపునకును శ్లేషమూలకమైన యభేదారోపము. అలంకారములు రెంటికిని సంకరము.

చ. స్మరతిమిరప్రచారభవశశ్వదబోధము గల్గువేళ మే
దురగతి ముజ్జగంబులు వధూమయమై కన నయ్యె నిప్పుడిం

పరయంగ సద్వివేకమహిత తాంజనసంగత మై మదీయభా
సురసమదృష్టి బ్రహ్మముగఁ జూచుచునున్నది విశ్వ మంతయున్.

తా. కంటికిఁ దిమిర మనురోగము కలిగినపుడు చూపు చెడి ఒక గుణము గల వస్తువు మఱొకగుణము గలదిగా నగపడునట్లు, బుద్ధికి కామాంధకారముచే నజ్ఞానము కలిగినపుడు బ్రహ్మాత్మకమైన జగత్తెల్ల మాకు స్త్రీమయముగాఁ దోఁచినదయ్యె. కాటుకచే నాకంటితెవులు నశింపఁగా చూపాయావస్తువులను కలరీతిని గనుఁగొనునట్లు, వివేకముచే నాయజ్ఞానము నశింపఁగా మాబుద్ధి ముల్లోకములను బ్రహ్మస్వరూపముగాఁ దలఁచుచున్నది.

అవ. ఇంతవఱకును జెప్పఁబడిన సువిరక్తపద్ధతికి విలక్షణమైనదిగా దుర్విరక్తపద్ధతిని జెప్పుచున్నాఁడు. అందు లోలుత కృతాత్ములకు వివేకము స్ఫురించు నని చెప్పినదానినే నిగమించుచున్నాఁడు.

శ్లో॥ తావదేవ కృతినామపి స్ఫుర త్యేష నిర్మలవివేకదీపకః।
యావదేవ న కురఙ్గచక్షుషాం తాడ్యతే చటులలోచనాఞ్చలైః॥

టీ. కృతినాం అపి=కుశలులైనట్టివారికిని, ఏషః=ఈ-పూర్వోక్తమైనయనుట, నిర్మల...దీపకః-నిర్మల=కళంకములేని, వివేక=తత్త్వజ్ఞాన మనెడి, దీపకః=దీపము, కురఙ్గచక్షుషాం=జింకకన్నులవంటి కన్నులు గలస్త్రీలయొక్క, చటు...చలైః-చటుల=చంచలములైన, లోచన అఞ్చలైః=కన్నులకొలుకులచేత-కడగంటిచూడ్కులచేతననుట, యావదేవ=ఎంతవఱకు, న తాడ్యతే=కొట్టువడదో-చూడఁబడదోయనుట, తావదేవ=అంతవఱకే, స్ఫురతి=ప్రకాశించుచుండును. ఎంతటివివేకకుశలుఁడైనను కామినికడగంటిచూపు తగిలెనా యావివేకమును నిర్వహించుకొని యుండువాఁడెవ్వఁడని భావము. అంచలశబ్దము 'అఞ్చలత్వంశుకాన్తే స్యాత్' అన్నట్లు కొనకు వాచకముగా నుండియు కొనయందుండు సామ్యమునుబట్టి కడగంటిచూడ్కులయందు ఉపచరించెడి నని తెలియునది.

క. నీలోత్పలనయనాతర
ళాలోకనహతులు సోఁకునంతకు వెలుఁగున్
ధీలలితసుజనవిమలో
ద్వేలాతిస్ఫుటవివేకదీపము నెమ్మిన్. 70

తా. వివేకకుశలులైనవారికిఁ గూడ నిర్మలమైనవివేక మనెడిదీపము, లేడిచూపులవన్నెలాండ్ర తెసుకుంగడగంటిచూడ్కులు గ్రుచ్చుకొనకుండునంతవఱకే ప్రకాశించును గాని యవి తగిలెనా ప్రకాశింప నేరదు.

అవ. వీరలు దుర్విరక్తులని వీరివాక్యములవలననే తెలియ నగును. ఆవచనము లిట్టివే యని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ వచసి భవతి సఙ్గత్యాగ ముద్దిశ్య వార్తా
శ్రుతిముఖరముఖానాం కేవలం పణ్డితానామ్ ।
జఘన మరుణరత్నగ్రన్థికాఞ్చీకలాపం
కువలయనయనానాం కో విహాతుం సమర్థః ॥ 71

టీ. శ్రుతి...ముఖానాం - శ్రుతి=వేదములచే, ముఖర = శబ్దించుచున్న-ఎడతెగక వేదములను బఠించుచుండుటచే శబ్దించుచున్న యనుట, ముఖానాం=నోళ్లుగల, పణ్డితానాం=వివేకులకును - వేదవేదాంతపారీణులైనవారికిఁగూడ ననుట, కేవలం వచసి=వట్టివాక్కునందే- మాటయందుమాత్రమే యనుట, సఙ్గత్యాగం=స్త్రీలతోడి కూడికవదలుటను, ఉద్దిశ్య=గురించి, వార్తా = కథ, భవతి=కలుగుచున్నది-మాటలందుమాత్రమే స్త్రీలసంబంధము వదలుకొనవలయు నను విషయముగాని మనస్సునందది లేదనుట-అట్లు ఊరక చెప్పుటేకాని యాచరించుట లేదని భావము. ఏలనఁగా, కువలయ నయనానాం=కలువ రేకులవంటి కన్నులు గల స్త్రీలయొక్క, అరుణ... కలాపం-అరుణమణి=కెంపులయొక్క, గ్రంథి=కూర్పుగల-కెంపులుపొదిగిన యనుట, కాఞ్చీ=మొలనూ లనెడి, కలాపం=భూషణముగల, జఘనం=మొలను, విహాతుం=విడుచుటకు, కః=ఎవ్వఁడు, సమర్థః=చాలినవాఁడు-ఎవఁడును విడువఁజాలఁ డనుట. బహుతరముగా దుర్విరక్తులమాట లిట్టివే యని భావము.

చ. నిగమసుభాషితాభ్యసననిష్ఠలు గల్గినయట్టిపండితుల్
మగువలపొందు నింద్య మని మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్
జగమున నెవ్వఁ డోపు విలసత్కురువిందమణిప్రభాధగ
ద్ధగితకలాపరమ్యవనితాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్. 71

తా. దుర్విరక్తులు వేదముల నెప్పుడు పఠించుచుండు వేదాంతవేత్తలైనను చెలువలతోడిసంబంధము కూడ దని మాటలుమాత్రమే చెప్పుచుందురు గాని మనఃపూర్వకముగా నటు లాచరింపరు. ఏలన మంచికెంపులు పొదిగిన మొలనూలిచే చెలువారుచున్న కలువకంటుల మొలలను విడువ నెవ్వరితరము?

శ్లో॥ స్వపరప్రతారకోఽసౌ, నిన్దతి యోఽలీకపణ్డితో యువతీః।
యస్మాత్తపసోఽపి ఫలం, స్వర్గః స్వర్గేఽపి చాప్సరసః॥ 72

టీ. యః=ఏ, అలీకపణ్డితః= కపటపండితుఁడు- నిజమైన పాండిత్యము లేని పురుషుఁ డనుట, యువతీః=జవరాండ్రను, నిన్దతి=దూషించుచున్నాఁడో, అసౌ=

అట్టి యీ, స్వ...తారకః-స్వపర=తనయొక్కయు నితరులయొక్కయు, ప్రతారకః=వంచకుఁడు-తన్నును నితరులను వంచించువాఁడు అగునని శేషము-ఎవఁడు పండితుఁడై యుండి జవరాండ్రను దూషించునో యట్టివానిపాండిత్యము సత్యమైనది కాదు, వట్టి బూటకమే యగును. ఏలన, వాఁ డట్లు వారిని నిందించినను దుదకు నిందించిన తన్నును ఆనిందలను విన్నయితరులను వంచించినవాఁడే యగునని భావము. ఆ వంచించుట యెట్లో చెప్పుచున్నాఁడు, యస్మాత్=ఎందువలన, తపసోఽపి = (ఆ పండితుఁడు సేయు చాంద్రాయణాదులు వ్రతోపవాసాదులు మొదలైన రూపముగా నుండు) తపస్సునకుఁగూడ, ఫలం=ఫలము, స్వర్గః=స్వర్గమో,స్వర్గేఽపి=ఆస్వర్గమునందుఁగూడ, అప్సరసః=ఊర్వశి మొదలైన యచ్చరలు, ఫలం=భోగ్యవస్తువో-ఆ స్వర్గమునందు యచ్చరలతోడిసంగమమే ఫలమగునో యనుట, అందుచేత వారిని నిందించు కల్లపాండిత్యము గలవాఁడు తన్నును తనయుపదేశమును విను నితరులను వంచించినవాఁడగు నని పూర్వముతో నన్వయము. తపస్సునకు ఫలము రంభాది స్త్రీలతోడిసంభోగము. ఇట్లు పండితుఁడు తపంబుచేసి యా స్త్రీలతోఁగూడంబోవువాఁడయ్యు నది తెలియక యిచట స్త్రీలను నిందించుటచేఁ దన్ను వంచించుకొన్నాఁడనియు, నిట్లె పరులకును ఫలమైయుండఁగా స్త్రీలను నిందించిచెప్పుటచే వారినిగూడ వంచించినాఁడనియు భావము. ('స పరప్రతారకోఽసౌ' అనుపాఠమున, ఏపండితుఁడు తనకు జవరాండ్రుప్రియలుగా నుండియు వారిని నిందించుచున్నాఁడో యట్టివాఁడు కేవలము పరులనువంచించువాఁడనియుఁ గాఁబట్టి సరియైనపండితుఁడు గాఁడనియు నర్థము.)

తే. కుటిలవాదియుఁ బరవంచ | కుండు వాఁడు
నెమ్మి నెవ్వాఁడు యువతుల | నిందసేయు
నిందఁ్రిలోకము తపముల | కెల్ల ఫలము
స్వర్గమున నున్నవార లచ్చరలు గారె? 72

తా. తపంబుసేయుటకు స్వర్గము ప్రాప్తించి యందు రంభాదులైన కుంభిస్తనుల ననుభవించుటయే ఫలము. ఇట్లు చెలువంపు జవరాండ్రతోడికూడికయే ఫలముగా నుండియుఁ బండితుఁ డెవ్వఁ డేని వారిని నిందించునేని వాని పాండిత్యము గల్లయే యగును. వాఁడును అట్టిఫలము తెలియక నిందించుటచేతన్నె కాక, నిందించి చెప్పుటచే తక్కినవారినిగూడ వంచించినవాఁ డగును.

అవ. మన్మథుని జయించుట మిక్కిలియుఁ గష్ట మని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మత్తేభకుమ్భదళనే భువి సన్తి ధీరాః
కేచి త్ప్రచణ్డమృగరాజవధేఽపి దక్షాః।

కిన్తు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య
కన్దర్పదర్పదళనే విరలా మనుష్యాః॥ 73

టీ. భువి=భూలోకమునందు, మత్తే...దళనే-మత్తేభ=మదించిన యేనుఁగుల యొక్క, కుమ్భ=కుంభస్థలమును, దళనే=చీల్చుటయందు, శూరాః=శూరులైనవారు, సన్తి=కలరు, కేచిత్=కొందఱు పురుషులు, ప్రచణ్డ...వధేఽపి-ప్రచణ్డ=మిక్కిలి భయంకరమైన, మృగరాజ=సింహముయొక్క, వధేఽపి=చంపుటయందును-బెడిదంబైన సింగమును జంపుటకుఁగూడ ననుట, దక్షాః=చాలినవారు-ఏనుఁగును జంపువారికంటె శూరులైనవారును గల రని భావము. కింతు=అయినను, బలినాం=బలాఢ్యులైనవారియొక్క-జ్ఞానబలము గలవారియొక్క యనియు గమ్యము, పురతః=మ్రోల, బ్రవీమి=చెప్పుచున్నాను-చేయెత్తి జంకులేక చాటిచెప్పెద ననుట, చెప్పుట యేద నఁగా, ప్రసహ్య=బలాత్కారముగా-భుజబలమువలనఁగాని బుద్ధిబలమువలనఁగాని యనుట, కన్దర్ప...దళనే- కన్దర్ప=మన్మథునియొక్క, దర్ప=గర్వమును, దళనే=చీల్చుటయందు-పోఁగొట్టుటయం దనుట, మనుష్యాః=(నేర్పరులైన) మనుష్యులు, విరళాః=పలుచనైనవారు-ఎక్కడనో యరుదుగా నుందురు గాని పెక్కండ్రు లేరనుట. ఇచట 'కన్దర్పదర్ప' అనుటచే వృత్త్యనుప్రాసము.

తే. సమదకుంజరకుంభభంజనులు మఱియు
నుగ్రమృగరాజవధదక్షు లుర్విఁ గలరు
తఱుచుగా లేరు కందర్పదర్పదళన
నిపుణజను లని చాటింతు నిఖిలసభల. 73

తా. పుడమియందు మదపుటేనుఁగుల కుంభములనుం జీల్పఁజాలినట్టిశూరు లున్నారు. వీ రన నేల, మిగుల బెడిదమైనసింగమును గూల్పఁజాలు మహావీరులును మఱికొందఱున్నారు. ఎట్టివా రుండిన నేమి? మన్మథునియేపు రూపుమాపంజాలినవా రెవరో మిక్కిలి యరు దని యెట్టిబలవంతులమ్రోల నేని జంకు లేక చెప్పుచున్నాఁడను.

అవ. మన్మథుని జయింపరాదని ముందు చెప్పినదానినే మఱొక రీతిని మఱలఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ సన్మార్గే తావ దాస్తే ప్రభవతి చ నర స్తావ దేవేన్ద్రియాణాం
లజ్జాం తావ ద్విధత్తే వినయమపి సమాలమ్బతే తావ దేవ।
భ్రూచాపాకృష్టముక్తాః శ్రవణపథగతా నీలపక్ష్మాణ ఏతే
యావల్లీలావతీనాం న హృది ధృతిముషో దృష్టిబాణాః పతన్తి॥

టీ. భ్రూచా...ముక్తాః-భ్రూచాప=కనుబొమ యనెడివింటిచేత, ఆకృష్ట=

ఈడువఁబడినవియును, ముక్తాః=విడువఁబడినవియు-(దృష్టిపరముగా) కనుబొమలు త్రిప్పినిగిడింపఁబడినవియు, (బాణపరముగా) విలు వంగునట్లు నారి నీడ్చి ప్రయోగింపఁబడినవియు నని తెలియునది, శ్రవణపథగతాః=చెవిత్రోవను బొందినవియు-(దృష్టిపరముగా) కన్నులు చెవివఱకు నిడుదగాఁ జాఁగి యుండుటచే నందుండి వెడలునపుడు చెవి నొఱసికొని నిగుడునట్టివియు-(బాణపరముగా)వింటిని జెవివఱకు సారించుటవలన నందుండి వెడలునవి యనియు నర్థములు, నీలపక్ష్మాణః=(దృష్టిపక్షమున) నల్లని ఱెప్పలు గలవియు-(బాణపక్షమున) నల్లనిగఱులు గలవియు, ధృతిముషః=ధైర్యమును హరించునవియు-రెంటికి సమము, అయిన, ఏతే=ఈ-పురుషుల తెంపును మాలించుటచే ప్రసిద్ధములైన యనుట, లీలావతీనాం=వగలాండ్రయొక్క, దృష్టిబాణాః=చూపులనెడితూపులు, యావత్=ఎంతవఱకు, హృది=(దృష్టిపరముగా) మనస్సునందు-(బాణపరముగా) ఱొమ్మునందు, నపతన్తి=పడవో-నాటవో యనుట, నరః=పురుషుఁడు-విద్వాంసుఁడై ననుట, సన్మార్గే=మంచిమార్గమునందు-(శ్రుతిస్మృతులు బోధించెడియాచారమునం దనుట, తావదేవ=అంతవఱకే, ఆస్తే=వర్తించుచున్నాఁడు, ఇన్ద్రియాణాం=ఇంద్రియములకు, తావదేవ=అంతవఱకే, ప్రభవతి=చాలినవాఁడగును-అంతవఱకే యింద్రియముల నడంపజాలు ననుట, లజ్జాం=సిగ్గును-రోఁత పుట్టించు పనులఁ జేయుటకుఁ గొంకుట ననుట, తావదేవ=అంతవఱకే, విధత్తే=అనువర్తించుచున్నాఁడు, వినయమపి=అడఁకువనుగూడ, తావదేవ=అంతవఱకే, సమాలమ్బతే = కైకొనుచున్నాఁడు. కులుకులాండ్రవాలారుఁజూడ్కులు తాఁకినపిదప సన్మార్గప్రవర్తనాదులు నిలుపుకొన నెవ్వఁడును నేరఁడనిభావము-ఇచట నుత్తరార్థమున సమస్తవస్తువర్తిసావయవరూపక మలంకారము.

శా. సారాచారముఁ బూను నింద్రియములన్ శాసించు లజ్జాన్వితుం
డై రాజిల్లుఁ బ్రశాంతిఁ జేకొను నరుండెందాఁక నెందాఁక దు
ర్వారంబుల్ శ్రుతిమార్గగాములు సుదారభ్రూధనుర్ముక్తముల్
నారీవీక్షణబాణముల్ చొరవు విద్యన్నాణంబుగా డెందమున్. 74

తా. విలుకాండ్రు వింటిని వంచి చెవివఱకు నారిని లాగి విడుచునట్టి నల్లనిగఱులతోఁ గూడినతూపులవలె, కులుకులాండ్రు కనుబొమలు వంచి చెవివఱకుఁ గడలుకొనుకన్నుంగవనుండి నల్లని ఱెప్పలనీటు దీటుకొనువాఁడిచూపులు నిగిడింపకుండునంతవఱకే యెట్టిపురుషునకుఁగాని మంచినడవడియు, నింద్రియములనడంచుటయు, లజ్జయు వినయమును నుండును. వా రట్టిచూపులు నిగిడించిరా యివియెల్ల నుండనే యుండఁజాలవు.

అవ. వే యేల; చెలువలు పూనినయెట్టిపనికిఁగాని బ్రహ్మాయు నడ్డపడఁజాలఁ డనుచున్నాఁడు.

శ్లో॥ ఉన్మత్తప్రేమసంరమ్భా, దారభ్యంతే య దఙ్గనాః ।
తత్ర ప్రత్యూహ మాధాతుం, బ్రహ్మాపి ఖలు కాతరః ॥ 75

టీ. అఙ్గనాః=స్త్రీలు,ఉన్మత్త..,సంరమ్భాత్-ఉన్మత్త=మిక్కుటమైన-విచ్చలవిడియైన, ప్రేమ=అనురాగముయొక్క, సంరమ్భాల్=సంభ్రమముచేత - ఉరవడి చేననుట, యత్=దేనిని-ఏపనిననుట, ఆరమ్భంతే=చేయఁదొడఁగుదురో, తత్ర=అందు-ఆపనివిషయమున ననుట, ప్రత్యూహం=విఘ్నమును, ఆధాతుం=చేయుటకు, బ్రహ్మా అపి=బ్రహ్మయును-తక్కినవారినిజెప్ప నేల యనుట, కాతరః ఖలు=పిఱికియైనవాఁడు గదా-ఆపనిని చెఱుచుటకు భయపడుననుట-చెఱుచుటకు శక్తుఁడు గాఁడనిభావము. ఒకటిని నిశ్చయించిరా దాని నెవ్వ రడ్డగించినను విడువక యెదురులేక యుండునంగనలను అడ్డగించువాఁ డెవఁ డని యాశయము.

క. ప్రేమావేశభరంబున
భామాజను లాచరించుకపని మరలింపం
దామరవిరిలోఁ బొడమిన
యామేటికి నైన నలవి కయగునె తలంపన్. 75

తా. చెలువలు బలితంబైనవలపున తత్తఱపడి మంచిదో చెడ్డదో యెట్టిపనిని గాని చేయఁబూనిరేని దాని నడ్డగించి నిలుపుటకు బ్రహ్మయు నేరఁ డనఁగాఁ దక్కినయెట్టివారు నడ్డగింపఁజాల రని చెప్ప నక్కఱలేదుగదా.

శ్లో॥ తావ న్మహత్త్వం పాణ్డిత్యం కులీనత్వం వివేకితా ।
యావ జ్జ్వలతి నాఙ్గేషు హతః పఞ్చేషుపావకః ॥ 76

టీ. యావత్=ఎంతవఱకు, హతః=నీచుఁడైన-తన్నుఁ గొలిచినవారిని మిక్కిలి యగౌరవపాత్రులం జేయుటచే నికృష్టుఁ డైనట్టియనుట, పఞ్చేషుపావకః=మన్మథుఁ డనెడి యగ్ని, అఙ్గేషు=అవయవములందు, నజ్వలతి=వెలుఁగకుండునో-తాపము పుట్టింపకుండునో యనుట, తావత్=అంతవఱకు, మహత్త్వం=మహానుభావత్వము-పేరిమి యనుట, పాణ్డిత్యం=ప్రజ్ఞ కలిమి-ఎఱుక యనుట, కులీనత్వం=మంచికులమునఁ బుట్టుటయు, వివేకితా=ఎగ్గులగ్గులను విచారించి తెలియునేరుపును, ఉండు నని శేషము.

క. కులశీలవివేకంబులు
దొలఁగక నరులందు నిల్చు క దుర్భరమదన
జ్వలనము సర్వాంగంబుల
నలకొననందాఁక నంత క నిలువం గలవే. 76

తా. మన్మథాగ్ని శరీరమును తపింపఁజేయ కుండునంతవఱకే పెద్దఱికమును,

నెఱుకయును, ఆభిజాత్యమును, వివేకమును నిలిచియుండును గాని యది తపింపఁ దొడఁగినా యివి యేవియు నిలిచియుండవు.

అవ. సాంసారికులకు సద్గతి కలుగుట దుర్లభ మని సహేతుకముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శాస్త్రజ్ఞోఽపి ప్రగణితనయోఽ ప్యాత్తబోధోఽపి బాఢం
సంసారేఽస్మి న్భవతి విరలో భాజనం సద్గతీనామ్ ।
యే నైతస్మి న్నిరయనగరద్వార ముద్ఘాటయన్తీ
వామాక్షీణాం భవతి కుటిలా భ్రూలతా కుఞ్చి కేవ॥ 77

టీ. యేన=ఎందుచేత, ఏతస్మిన్(సంసారే)=ఈసంసారమునందు, వామాక్షీణాం =(సొగసైనకన్నులు గల) స్త్రీలయొక్క, కుటిలా=వంకరయైన, భ్రూలతా=తీఁగవంటి కనుబొమ, కుఞ్చికా ఇవ=కుంచెకోలవలె-గడియప్రమానుదీయు వంకరయినుప కమ్మివలె,నిర...ద్వారం-నిరయనగర=యమపురముయొక్క, ద్వారం=వాకిటిని వాకిటితలుపుగడియమాఱ్పి నను, ఉద్ఘాటయన్తీ=తెఱచునట్టిది-వ్యామోహమును బుట్టించిదుర్గతిని ప్రవేశింపఁజేయునది యనుట, భవతి=అగునో, (అతః=అందుచేత), శాస్త్రజ్ఞః అపి=సకలశాస్త్రరహస్యములను దెలిసినవాఁడైనను, ప్రగుణితనయః అపి-ప్రగుణిత=మిక్కిలివల్లింపఁబడిన, నయః అపి=నీతిశాస్త్రము గలవాఁడైనను-నీతిశాస్త్రమును జక్కఁగా పరిశీలించినవాఁడైన ననుట - ('ప్రథితవినయోఽపి' అనుచో ప్రసిద్ధినొందినవినయము గలవాఁడైనను-వినయముచేఁ బ్రసిద్ధుఁడైన ననుట), బాఢం=దృఢముగా, ఆత్తబోధః అపి=పొందఁబడినజ్ఞానము గలవాఁడైనను-దృఢజ్ఞాన ముప్పతిల్లినవాఁడైన ననుట-ఆత్మబోధోఽపి' అనుచో ఆత్మజ్ఞానముగలవాఁడైన ననుట), అస్మిన్=ఈ, సంసారే=సంసారమునందు, సద్గతీనాం= మంచిగతులకు, భాజనం=పాత్రము, విరలః=పలుచనైనవాఁడుగా-ఎవఁడో యొకఁ డనుట, భవతి=అగును. స్వర్గాదిసద్గతులను ఎవఁడో యొకఁడు పొందు ననుట, యమపురమువాకిలిఁ దెఱచు కుంచెకోలవంటిదై కలువకంటుల వంకరయైన కనుబొమ జనులకు మరులుకొలుపు నీ సంసారమునం దెంతవఱకు మెలఁగుచుండునో యంతవఱకు శాస్త్రజ్ఞత్వాదిగుణములు గలపురుషులుకూడ సద్గతులకుఁ బాత్రులు కాఁజాల రని భావము. స్త్రీలతోడి సంగము కలవారికి సద్గతి యెక్కుడి దని యాశయము. అలంకార ముపమ.

తే. శాస్త్రవిదుఁడైన బుధుఁడైన సనయుఁడైన
సద్గతికిఁ బోవు టరిది సంసారసరణి
యమపురద్వారములకవాటములఁ గుంచి
కలునుబలె విప్పుచున్నవి కలికిబొమలు. 77

తా. చెన్నారుకన్నులుంగవలు గల చిన్నారి పూఁబోఁడుల విలువంపుగలిగి తీవియ వలె సొంపారు కనుబొమ, యమపురద్వారముయొక్క తలుపుగడియఁ దీయు కుంచెకోలవలె (దుర్గతికిం జొనుపునదై) యీసంసారమునందు వెలయుచుండఁగా నిందు వర్తించు పురుషుఁడు శాస్త్రిజ్ఞుఁడైనను, నీతిశాస్త్రికుశలుఁడైనను, జ్ఞానసంపన్నుఁడైనను సద్గతికిఁ బాత్రుఁ డగుట యరిది.

అవ. రెండుశ్లోకములచే మన్మథునివింతనడవడిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కృశః కాణః ఖఞ్జః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీ పూయక్లిన్నః కృమికులశతై రావృతతనుః।
క్షుధా క్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
శునీ మన్వేతి శ్వా హతమపిచ హన్త్యేవ మదనః॥ 78

టీ. కృశః=(కూడు దొరకమిచే దేహమున తోలు నెముకలుమాత్రము మిగులునట్లు) చిక్కినదియు, కాణః=గ్రుడ్డిదియు-లేక, 'కాణః కాకైకచక్షుషోః' అన్నట్లు ఒంటికన్ను గలదియు, ఖఞ్జః=కుంటిదియు-చేయరాని పని చేయుటంబట్టి దుడ్డుకఱ్ఱదెబ్బచేతఁ గాలువిఱిగిన దనుట, శ్రవణరహితః=చెవులు లేనిదియు-చెవులు మొదలంట తెగినదియు, పుచ్ఛవికలః=తోఁకయందు విచ్ఛేదము నొందినదియు-తోఁక తెగినది యనుట, వ్రణీ=(దేహ మెల్ల) గాయములు గలదియు-లేక కురుపులు గలదియు, కావుననే, పూయక్లిన్నః=(ఆ కురుపులనుండి కాఱునట్టి) చీముచేఁ దడిసినదియు, కృమికులశతైః=వందలకొలఁది పురుగుల సమూహములచేత, ఆవృతతనుః-ఆవృత=క్రమ్ముకొనఁబడిన-పురుగు లంతటను వ్యాపించిన యనుట, తనుః=దేహముగలదియు, క్షుధా=ఆఁకటిచేత, క్షామః=క్షీణించినదియు, జీర్ణః=ముదిసి యంగములబిగి వీడినదియు, పిఠరక...గళః-పిఠరక=కుండయొక్క, కపాల=పెంకుచేత, అర్పిత=ఉంపఁబడిన, గళః=మెడగలదియు-కుండయొక్క వలయముగా నుండు మూతిపెంకు మెడయందుఁ దగులుపడియున్నది యనుట-కుండయందు తల దూర్చి యందలియన్నమును బూర్ణముగాఁ దిని యంతమాత్రకే బలిసి తలను వెలికిఁ దీయజాలక యిటునటుఁ గుండ నీడిచికొట్టఁగా నది పగిలి యడుగుపెంకు వేఱుపడినంత దానిమూతిపెంకు తన గొంతునఁ జిక్కుకొనియున్న దనుట-లేక, దొంగతనమునకై దండించుటకుఁగాను చట్టినో మంగలమునో నడుమ బొందఁజేసి మెడకుఁ దగిలింపఁబడినది యనియు గ్రాహ్యము, ఇట్లు రోఁతఁబుట్టించులక్షణములుగల, శ్వా=కుక్క, శునీం=ఆఁడుకుక్కను, అన్వేతి=వెంబడించుచున్నది-కలయికకొఱకు వెనుకొనుచున్న దనుట, హతమపి చ=నశించినదానిని సైతము, మదనః=మన్మథుఁడు, హన్త్యేవ=చంపనే చంపుచున్నాఁ

డు-మరులుకొలిపి పీడించుచున్నాఁడనుట-చచ్చినదానినే చంపుట యన్యాయమని
యు విచారింపఁ డనుట; పలుగాకియైన మరుఁడు ఎవరిని ఏమి దాఁ జేయఁడనుట.
మరులు దలఁపరాని యిట్టియవలక్షణపుదశ నున్నకుక్క మరులుకొనుట దానిస్వభా
వము కాదు, మరునిప్రభావమే యని యాశయము.

చ. కరము కృశించి కాల్ విఱిగి కన్నులు గానక పుచ్ఛహీనమై
పురుగులు గ్రమ్ము చున్నవ్రణపుంజము మేనలముంగ నాఁకటం
బరవశమై ఘటీముఖకపాలగళం బగుకుక్క పెంటితో
నరిగెడుఁ గూళజంతువుల నైన వధించు మనోజుఁ డక్కటా. 78

తా. ఎమ్ములు తోలుగాఁ జిక్కి, యొకకన్ను పోయి, కాలు విఱిగి, కుంటై,
చెవులు మొదలంటఁ దెగి, తోఁకయుఁ దునిగి, దేహమంతయు గంట్లును బుండ్లునై
వానినుండి కాఱుచీముచేఁ దడిసి, అందుండిపుట్టిన లెక్కడరాని పురువులు దేహము
నందెల్లఁ బ్రాఁకులాడ, ఆఁకటిచేఁ దఱిఁగి, ముదిమిచేఁ దూలి, కుండయొక్క వలయా
కారపు మూతిపెంకు మెడఁ దగులుపడి, యిట్లు నోఁతలపాలై యున్న కుక్క స
యితము తనచెఱుగతిని దలంపక యొకయాఁడుకుక్కను జూచెనా మరులుకొని దాని
వెనువెంటఁ దగులుచున్నది. ఇది మరునిమహిమ. వాఁడేమి! ఇంచుమించుగాఁ జచ్చి
నదానినిగూడ విడువక వలపుగొలిపి చంపనేచంపుచున్నాఁడు. ఏమి యన్యాయము!

శ్లో॥ స్త్రీముద్రాం ఝషకేతనస్య పరమాం సర్వార్థసమ్పత్కరీం
యే మూఢాః ప్రవిహాయ యాన్తి కుధియో మిథ్యాఫలాన్వేషిణః
తే తేనైవ నిహత్య నిర్దయతరం నగ్నీకృతా ముణ్డితాః
కేచి త్పఞ్చశిఖీకృతా శ్చ జటిలాః కాపాలికా శ్చాపరే॥ 79

టీ. కుధియః=దుర్బుద్ధి గలవారును, కాఁబట్టియే, మూఢాః = వివేకము లేని
వారును అగు, యే=ఎవరు, మిథ్యాఫలాన్వేషిణః సన్తః-మిథ్యాఫల=బూటకములైన
ఫలము లైనవానిని - అభూతచరము లనుటచే లేనివానితో సాటి యగు స్వర్గాది
మోక్షఫలముల ననుట, అన్వేషిణః సన్తః = వెదకునట్టివా రగుచు, సర్వా...
కరీం - సర్వ అర్థ = సమస్తములైన ధర్మార్థకామము లనెడిపురుషార్థములయొ
క్క, సమ్పత్ = కలిమిని, కరీం = చేయునట్టిదియు- ధర్మార్థకామపురుషార్థముల
సమృద్ధికి హేతువైనది యనుట, పరమాం = శ్రేష్ఠమైనదియు, ('జయినీం' అను
పాఠమున మన్మథునికి జయముగలిగించునదియు నని యర్థము). అగు, ఝషకేతనస్య=
(చేఁప పడగయందుఁ గల) మన్మథునియొక్క, ('కుసుమాయుధస్య' అనుచో
పువ్వులు ఆయుధముగాఁగల మన్మథునియొక్క), స్త్రీముద్రాం = స్త్రీయనెడి
ముద్రను - స్త్రీరూపముగా నున్నవానిచిహ్నము ననుట, ప్రవిహాయ = విడిచి,

యాన్తి=పోవుదురో-మఱొకమార్గమునఁ బోవుదురో యనుట-ప్రవ్రాజకు లగుదురో యని భావము, తే=ఆమూఢులు, తేనఏవ=వానిచేత నే-తనముద్ర నతిక్రమించుటచేఁ గుపితుఁడైన యామన్మథునిచేత నే యనుట, నిర్దయతరం = మిక్కిలి దయలేనట్లుగా, నిహత్య=తక్కువపఱుపఁబడి, నగ్నీకృతాః=దిస్సమొలవారుగాఁజేయఁబడిరి- దిగంబరులనెడి సన్న్యాసులు గావింపఁబడిరని యర్థాంతరము,ముణ్డితాః=తల గొఱిగింపఁబడినవారై రి-ముండితశిరస్కులై యుండు పరమహంసలుగాఁ జేయఁబడి రని యర్థాంతరము, కేచిత్=కొందఱు, పఞ్చశిఖీకృతాః=అయిదుశిఖలు గలవారుగా - అనఁగా సగము గొఱిగింపఁబడి సగముజుట్టుగలవారుగాఁ జేయఁబడిరి-పంచశిఖు లనఁబడుయతు లైరనుట, కేచిత్=కొందఱు, జటిలాః=జడలుదాల్చినవారై రి-మును లైరని యర్థాంతరము, అపరే=మఱికొందఱు, కాపాలికాశ్చ = తలపునుకలో బిచ్చమెత్తువారై రి-కాపాలికు లను నొకతెగసన్న్యాసు లైరనుట-తనముద్రను బరిత్యజించినవారి నెల్ల వస్త్రహీనులు మొదలైనవారినిగాఁ జేసెనుగాని సౌభాగ్యసంపన్నులను జేయలేదనుట. లోకమున తీక్ష్ణదండు లైనరాజులు తమయాజ్ఞ నుల్లంఘించి యపరాధు లైన జనులను కొందఱిని కలధన మెల్లఁ దీసికొని కట్టుగుడ్డ సైతము లేకుండఁజేసియు, కొందఱిని తలయంతయు గొఱిగించియు, కొందఱిని సగముతలమాత్రము గొఱిగించియు, కొందఱిని జడలందాల్చునట్లు చేసియు, కొందఱిని పునుకలో బిచ్చమెత్తునట్లు చేసియు నెట్లు దండించునో అట్లే మన్మథుం డనురాజును సంసారసుఖసాధనము స్త్రీయే యని సిద్ధాంతముచేసి దానిమీఁద తాను వేసియున్న స్త్రీరూపమైన ముద్రను ఎవఁ డుల్లంఘించి మఱొక మార్గమునఁ బ్రవర్తించునో వారిని వస్త్రహీనులు మొదలైనవారినిగాఁ గావించి దండించు ననిభావము. స్త్రీసంగము వదలి వైరాగ్యము నొందినవారిలోఁ గొందఱు దిస్సమొలగా నుండు సన్న్యాసులుగాను (లేక దిగంబరు లనెడి బుద్ధసన్న్యాసులుగాను) గొందఱు పరమహంసులుగాను గొందఱు పంచశిఖులనుతెగవారుగాను, గొందఱు జడదారులుగాను, గొందఱు కాపాలికు లనెడి యొకతెగయతులుగాను నగుదురని యాశయము. ఇచట వైరాగ్యకృతము లైన నగ్నత్వాదులను మన్మథకృతములుగా నుత్ప్రేక్షించుటచే ఉత్ప్రేక్షాలంకారము. ఇది 'నూనమ్' ఇత్యాదివ్యంజకములు ప్రయుక్తములు కానందున గమ్య మగును.

చ. స్మరునకు సర్వలోకజయసంపద లీయఁగఁ జాలుప్రౌఢలం
దరుణుల నింద సేయుట సధర్ములు కొందఱు మానవుల్ దిగం
బరులును బ్రహ్మచారులుఁ గపాలకపాణులు దండహస్తులై
తిరుగుచు నున్నవారు రతిదేవుని మీఁజిన భోగ మబ్బునే. 79

తా. ఏమూఢులు బుద్ధిచెడినవారై ప్రత్యక్షముగా సకలార్థముల నొసఁగుచున్నదియు స్త్రీ యనఁబడునదియు నైన మన్మథుని మేలిముద్రను గైకొనక వదలి

స్వర్గము మోక్షము ననెడి కంటికిఁ దెలియరాని బూటకపుఫలముల నెదకుచుం బోవు దురో యట్టివారిని మన్మథుఁడు, లోకములో రాజులు తమముద్రను సరకు సేయని వారిని గావించునట్లు, మిక్కిలియు దయమాలి కీడుపఱిచి వారిలోఁ గొందఱిని గట్టు పుట్టముసైతము లేనివారినిగాను (దిగంబరులనుగా ననుట), కొందఱిని దలయంతయు గొఱిగింపఁబడినవారినిగాను (పరమహంసులనుగాననుట), గొందఱిని సగముతల గొఱిగించి సగముజుట్టు పెట్టఁబడినవారినిగాను, (పంచశిఖులనుగా ననుట), కొందఱిని తలయెల్ల జడలుగట్టినవారినిగాను (జడదారులనుగా ననుట), కొందఱిని పుఱ్ఱెచిప్ప లో బిచ్చమెత్తి బ్రతుకువారినిగాను (కాపాలికులనుగా ననుట) చేసి దండించిన వాఁడయ్యె.

అవ. వేయేల, మహర్షులుసయితమింద్రియముల నిగ్రహింపఁజాలినవారు గారైరని చెప్పి యుపసంహరించుచున్నాఁడు.

శ్లో॥ విశ్వామిత్రపరాశరప్రభృతయో వాతామ్బుపర్ణాశనా
స్తేఽపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః।
శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుఞ్జన్తి యే మానవా
స్తేషామిన్ద్రియనిగ్రహో యది భవేద్విన్ధ్యః ప్లవేత్సాగరే॥

టీ. వాతా...శనాః-వాత=గాలియు, అమ్బు=జలమును, పర్ణ = ఆకులును, అశనాః=ఆహారముగాఁ గలవారైన - శరీరయాత్రామాత్రమునకు వలయు గాలిని నీళ్లను బండుటాకులను భక్షించువారే కాని యింద్రియపుష్టికై మృష్టాన్నమును భుజించువారు కానట్టి యనుట, తే=ఆ, విశ్వామిత్రపరాశరప్రభృతయః అపి=విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలుగాఁ గలవారుకూడ, సులలితం=మిక్కిలి సుందరమైనట్టి, స్త్రీ...జం- స్త్రీ=స్త్రీలయొక్క - మేనక రంభ సత్యవతి మొదలైన సుందరీమణులయొక్క యనుట, ముఖపఙ్కజం=మోముఁదామరను, దృష్ట్వా ఏవ= చూచియే, మోహం=మోహమును, గతాః=పొందినవారైరి-ఆ స్త్రీలకు లోఁబడినవారైర నుట-ఇంద్రియముల నిగ్రహింపఁజాలకపోయిరని భావము. యేమానవాః=ఏసాధారణమనుష్యులు, సఘృతం=నెయ్యితోఁగూడినదియు, పయో...యుతం-పయః = పాలుతోడను, దధి=పెరుఁగుతోడను, యుతం=కూడినదియు, అగు, అన్నం=వరియన్నమును-మిక్కిలి వీర్యపుష్టికలిగించుమృష్టాన్నము ననుట, భుఞ్జన్తి = భుజింతురో, తేషాం=అట్టివారికి, ఇన్ద్రియనిగ్రహః=ఇంద్రియముల నడంచుట, భవేత్ యది=కలుగునేని, విన్ధ్యః= వింధ్యపర్వతము, సాగరే=సముద్రమునందు, ప్లవేత్ = తేలును, ('విన్ధ్యస్తరేత్సాగరమ్' అనుపాఠమున వింధ్యము సముద్రమును దాఁటు ననుట), బండలు నీటందేలుట కన్నదియు విన్నదియుఁ గాదు. కాన వింధ్య మెకప్పుడును సాగరమునఁ దేలదు, వింధ్యము దేలుట యెట్లో యట్లె యింద్రియముల నిగ్రహించు

టయు అసంభావితమేయగుననియాశయము. వాతాదులను గొనుఋషులకే యిటువం టియవస్థ గలిగినప్పుడు మృష్టాన్నమును భుజించుమానవులనుగుఱించి చెప్ప నేల యని భావము. ఇచట నింద్రియములకు గ్రహింపఁబడుసంబంధ ముండియు వింధ్యప్లవనదృష్టాంతముచే నట్టిసంబంధము లేమిని (అనఁగా అసంబంధమును) జెప్పుటచే నతిశయోక్తి యలంకారము.

చ. వనదళవాతముల్ మెసవుచువారు పరాశరకౌశికాదు లా
ఘనులును సుందరీజనులఁ జూడ్కగ్గొని మోహితచిత్తులైరి పే
ర్చినఘృతపాయసాన్నము భుజించెడినారలకున్ మనోజయం
బు నెగడు నేని వింధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే. 80

తా. శరీరయాత్రామాత్రమునకు వట్టిగాలి, నీళ్లు, ఆకు లలుము లనెడి పేలవమైన యాహారమును దిని తపంబులు సలుపుచుండు విశ్వామిత్రుఁడు పరాశరుఁడు మొదలైన మహర్షులే సొగసులు కులుకు మేనక సత్యవతి మొదలైన చెలువలమొగమును జూచినంతనే మోహముసాలై యుండఁగా, నేఁక నేయిపాలు పెరుఁగులతోఁ గూడినదై వీర్యపుష్టి కలిగించు మంచివరియన్నమును దిను సాధారణజనులకు నింద్రియనిగ్రహము కలుగు టెట్లు? అట్లు వా రింద్రియముల నిగ్రహించిరేని వింధ్యమనెడిపెనుఁగొండ సముద్రమునఁ దెప్పలఁ దేలదా?

ఇది శృంగారశతకమున సువిరక్త దుర్విరక్తపద్ధతి యన్నది చతుర్థవింశతి.

---

## భర్తృహరిసుభాషితము - ఋతువర్ణనపద్ధతి.

---

అవ. ప్రసంగవశముగాఁ జెప్పవచ్చినదానిని జెప్పి ముగించి ప్రకృతమైన శృంగారమున కుపయోగించునదిగా ఋతువర్ణనము నారంభింపఁ గోరినవాఁడై లోకమునను వేదమునను, వసంతము మొదటిదిగా వ్యవహరింపఁబడుటవలన దాని నాఱుశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ పరిమళభృతో వాతాః శాఖా నవాఙ్కురకోటయో
మధురవిరుతోత్కణ్ఠాభాజః ప్రియాః పికపక్షిణామ్ ।
విరళవిరళస్వేదోద్గారా వధూవదనేన్దవః
ప్రసరతి మధౌ ధాత్ర్యాం జాతో న కస్య గుణోదయః॥ 81

టీ. వాతాః = వాయువులు - ఉపవనములనుండి పొలయుతెమ్మెర లనుట, పరిమళభృతః = పరిమళమును దాల్చునవి - 'విమర్దోత్థేపరిమళో గన్ధే' అన్నట్లు నానాపుష్ప

ములసమ్మర్దమువలని వాసనావిశేషమును వలచునవి, అయ్యెను అని శేషము, ఇట్లే మీఁదనెల్ల నెఱుంగునది, శాఖాః=(మామిడి మొదలైనవృక్షముల) కొమ్మలు, నవ అఙ్కుర కోటయః=క్రొత్తలైన మొలకలు గల కొనలు గలవి-మొనలయందు చిగిర్చిన వనుట, అయ్యెను. పికపక్షిణాం=కోయిలపిట్టలయొక్క, ప్రియాః=స్త్రీలు-ఆఁడు కోయిలలనుట, మధుర... భాజః-మధుర=మామిడిచిగుళ్ల వగరురసమును గ్రోలుటచే నింపైనట్టి, విరుత=ఎలుఁగులందు, ఉత్కణ్ఠా=తమకమును, భాజః=పొందినవి-తీయని యెలుఁగులతోఁ గూయుటకుం దమిగలవి యనుట, ('మధురవిరుతోత్కణ్ఠా వాచః' అనుపాఠమున, పికపక్షిణాం=కోయిలపిట్టలయొక్క, వాచః=పలుకులు, మధు...త్కణ్ఠా-మధుర=తీయని, విరుత=ఎలుఁగులచేత, ఉత్కణ్ఠాః=ఉత్సుకములైనవియు-మధురమైనధ్వనిచేత నుత్సాహముగలవిగాఁ గనఁబడునవి యనుట-వానిపలుకుల యుత్సాహము అందలికలరవముచేఁ దెలియు నని భావము, కాఁబట్టియే, ప్రియాః=ఇంపైనవియు-కోయిలలు తమకంబుతో తియ్యనియెలుంగుల నింపారుపలుకులు వలుకు నవుట), అయ్యెను, వధూ...దవః-వధూ=స్త్రీలయొక్క, వదన + ఇన్దవః=ముఖచంద్రులు- చందురునివంటి ముద్దుమొగము లనుట, విరళ...ద్గారాః-విరళ విరళ = మిక్కిలిపలుచనైన-వేసవివేండ్రములేమిచే మిక్కిలి కొంచెముగాఁ గలిగిన యనుట, స్వేద ఉద్గారాః=చెమటలచిందుటలు గలవి-అతిస్వల్పముగా చెమరించునవి యనుట-కావుననే మఱింతయనుభవయోగ్యములైనవని భావము, అయ్యెను. ('విరళసురతస్వేదోద్గారాః' అనుచో స్వల్పముగా రతిక్రీడయందు చెమట గాఱునవి యనుట), ఇచట ఉద్గారశబ్దమునకు గౌణవృత్తిచే గ్రామ్యత్వము గలుగదు. ఇట్లు ఇవి యెల్ల నగుటకు హేతు వేమనఁగా, ధాత్ర్యాం=భూమియందు, మధౌ=వసంతము, ప్రసరతిసతి=వ్యాపించుచుండఁగా, కస్య=దేనికి-ఏవస్తువునకు, గుణ ఉదయః=గుణము పొడసూపుట-లేక, గుణము హెచ్చుట, న జాతః=కలుగదు-సకలవస్తువులకును గుణాతిశయము కలుగు ననుట, కావుననే వాయువులు మొదలైనవి మనోహరము లైనవని భావము.

చ. వలపు వహించె గంధగిరి వాతపరంపర భూరిభూజశా
ఖలు చిగిరించె నింపెసఁగెఁ గాకలి కోకిలలందుఁ జెక్కులం
బలుచనిఘర్మబిందువులు భామలకుం బ్రిసరించె నెయ్యెడం
జెలువు ఘటింపఁజాలదు విశేషవసంతసమాగమం బిలన్. 81

తా. పుడమియంచెల్ల వసంతఋతువు వ్యాపించి విలసిల్లుచుండఁగాఁ బ్రతి వస్తువునకు గుణ మతిశయించును. కాఁబట్టి యపు డుపవనములనుండి పొలయు నెలదెమ్మెరలు పలువగలపువ్వులతావులు వలచుచుండును. మ్రాఁకుఁగొమ్మలు మొనలం దెల్లఁ గ్రొంజిగుళ్లు మొలకెత్తి మురువుగాఁ జూపట్టును. కోయిలలు తీయనియెలుఁగెత్తి

కొలకొలమని యింపారుపలుకులు సొంపుతోఁ గూయును. ముద్దరాంధ్రచందురునివంటి ముద్దుమొగంబులు మిక్కిలి పలుచగాఁ జెమరించుటచే మఱింత యుపభోగయోగ్యముగా నుండును.

శ్లో॥ మధురయం మధురై రపి కోకిలా, కలకలై ర్మలయస్యచ వాయుభిః।
విరహిణః ప్రహిణ స్తి శరీరిణో, విపది హ న్త సుధాపి విషాయతే॥

టీ. అయం=ఈ-పూర్వము చెప్పఁబడిన యనుట, మధుః=వసంతుఁడు, మధురైః=యింపైన, కోకిలాకలకలైః=ఆఁడుకోవెలలయొక్క కలకలమను నెలుఁగులచేతను-('కలరవైః' అనుచో వానియవ్యక్తమధురధ్వనులచేత ననుట), మలయస్య=చందనపుఁగొండయొక్క, వాయుభిశ్చ=తెమ్మెరలచేతను-మిక్కిలి హాయిగాఁ బొలయువానిచేత ననుట, విరహిణః=విరహము గలిగియున్న, శరీరిణః=ప్రాణులను-జనుల ననుట, ప్రహిణ స్తి=నాశము సేయుచున్నాఁడు ('ప్రణహ స్తి' అనుచో నిదియే యర్థము). ఇంపైన కోయిలపలుకులు మొదలైనవానిచే వసంతుఁడెట్లు విరహిణులను నాశము సేయు ననఁగా, విపది=ఆపత్కాలమందు, సుధా అపి=అమృతముకూడ, విషాయ తే=విషమువలె నగుచున్నది-విషముతలె ప్రాణముల నలంచుననుట, హన్త=అక్కటా! 'మధురయం' ఇత్యాదివిశేషముచే 'విపదిహన్త సుధాపి విషాయతే' అను సామాన్యము సమర్థింపఁబడినదిగాన అర్థాంతరన్యాస మలంకారము. అది 'విషాయతే' అనుచోఁ గలయుపమతో సంకీర్ణమగుచున్నది. అనుప్రాస మనెడి శబ్దాలంకారమును 'మధురయం మధురైః' 'విరహిణః ప్రహిణ స్తి' ఇత్యాదులందుఁ దెలియునది.

తే. నిండుకొని వచ్చుగందపుఁగొండచల్ల
గాలియును బికకాకలీకారవంబు
విరహిజనుల వధించె నవ్వేళఁ గాన
నమృతమును విష మగు విపత్ప్రాప్తియందు. 82

తా. ఆపత్కాలమందు నమృతమువంటి వస్తువుగూడ విషమువలెఁ బ్రాణసంకటముగా నుండునుగాన జనులకు విరహముకలుగునపుడు కొలకొలమని పలుకుకోయిలల తీయనిపలుకులును, నల్లల్ల హాయిగాఁ బొలయుమలయమారుతములును, దుస్సహములుగా నుండును. కావున వసంతుఁడు వీనిని గొని విరహిజనులప్రాణముల నలంచుచున్నాఁడు.

అవ. వసంతము విరహిజనులకే కష్టముగా నుండును గాని తక్కినవారి కట్లుగా దనుచున్నాఁడు.

శ్లో॥ ఆవాసః కిలికిఞ్చితస్య దయితాః పార్శ్వే విలాసాలసాః
కర్ణే కోకిలకామినీకలరవః స్మేరో లతామణ్డపః।

గోష్ఠీ సత్కవిభి స్సమం కతిపయై ర్ముగ్ధా స్సితాంశోః కరాః
కేషాంచి త్సుఖయన్తి చాత్ర హృదయం చైత్రే విచిత్రాః స్రజః*॥

టీ. పార్శ్వే=ప్రక్కను, కిలికిఞ్చితస్య=రోషము అశ్రువు హర్షము భీతి మొదలైనవానియొక్క సంకరముగానుండు శృంగారచేష్టావిశేషముయొక్క, ఆవాసః=ఉనికిపట్టును-ఉనికిపట్టయినవారును అనుట, ఇచట కిలికించితమునకు ఆధారమాత్రమే చెప్పఁగోరుటవలన 'ఆవాసః'అని ఏకవచనము గ్రహింపఁబడినదిగా వివేచించుకొనునది, 'రోషాశ్రుహర్షభీత్యాదే స్సఙ్కరః కిలికిఞ్చితః' అని కిలికించితలక్షణము, విలాస అలసాః= లీలలచే మందటిలినవారును-కటాక్షము భుజాక్షేపము మొదలైన వివిధవిలాసముల నల్లల్ల నీటుసులుకఁజేయువారు ననుట-ఇచట 'స్మరమన్దీకృతవ్రీడా' యన్నట్లు వలపుచే సిగ్గు డిందుపఱుపఁబడి యుండుటవలన నాయికలు ప్రగల్భరాండ్రని తెలియునది, అసు, దయితాః=ప్రియురాండ్రును, కర్ణే=చెవియందు, కోకిల... రవః-కోకిలకామినీ=ఆఁడుకోవెలలయొక్క, కల=అవ్యక్తమధురమైన, రవః=శబ్దమును, స్మేరః=వికసించినట్టి, లతామణ్డపః=పొదరిల్లును-తీఁగెయిల్లును-వికసించినపువ్వులుగల పొదరి ల్లనుట, ఇచట పువ్వులయొక్క వికసించుట యనుధర్మము పువ్వులుగల పొదరింటియందు ఉపచరించునట్లు చేయఁబడెనుగాన పొదరింటిపువ్వులు వికసించె ననుటను మాఱుగా పొదరిల్లే వికసించెనని చెప్పఁబడెను, కతిపయైః=కొందఱేయుగు-పెక్కండ్రైన రసాభాసమగునుగాన కొంద అనఁబడెను, సత్కవిభిః సమం=మంచికవులతోఁ గూడ, గోష్ఠీ=ప్రసంగము, ముగ్ధాః=మనోహరములైన, సితాంశోః=చంద్రునియొక్క, కరాః=కిరణములు, విచిత్రాః=పలువిధములైన, స్రజః=పూదండలును, అత్ర=ఈ, చైత్రే=వసంతమునందు, కేషాంచిత్=కొందఱియొక్క-విరహులుకాని యితరులయొక్క యనుట, హృదయం=మనస్సును, సుఖయన్తి=రంజింపఁ జేయుచున్నది-అందఱియొక్క హృదయములను రంజింపఁజేవా వనుట. ఇటువంటిసౌభాగ్యము గలవారు కొందఱేగాన కొందఱినే రంజిల్లఁజేయునని భావము. ఇచట దయితలు మొదలైనబహుకారణములు హృదయమును రంజించుట యను నొకకార్యమును సాధించుటకై పూనుటను జెప్పుటచే ద్వితీయసముచ్చయ మలంకారము.

---

* ఈశ్లోకమునకుఁ బాఠాంతరము.

శ్లో॥ ఆవాసః కిల కిఞ్చిదేవ దయితాపార్శ్వే విలాసాలసః
కర్ణే కోకిలకామినీకలరవః స్మేరో లతామణ్టపః।
గోష్ఠీ సత్కవిభి స్సమం కతిపయై స్సేవ్యాః సితాంశోః కరాః
కేషాంచి త్సుఖయన్త్యహో హృదయే చైత్రే విచిత్రాః క్షపాః॥

టీ. దయితాపార్శ్వే=ప్రియురాలిప్రక్కను,విలాసఅలసః=లీలచే నల్లల్ల వర్తిం

చ. ఘనకిలికించితప్రచురకాంతలు చెంతఁ బికాంగనాకల
స్వనములు వీనులందు సుమశాలినికుంజము పుష్పమాల్యముల్
వినుతకవిప్రసంగమును వెన్నెలతేటలు భాగ్యవంతు లౌ
జనులకుఁ జైత్రమాసమున సౌఖ్యమొనర్చు సుగంధితోయముల్.

తా. ఈవసంతకాలమందు, జంకెనచూపులు కన్నీళ్లు నుబ్బును వెఱపును బిరి గొన్న శృంగారంపుచేష్టలు పచరించుచుఁ, గడగంటఁజూచుట బొమలుత్రిప్పుట మొదలైనయొయ్యారంపువగలు కులుకుచుఁ, గెలఁకులఁ జెలువారుచుండు చిగురాకుఁ బోండ్లును, జెవులకింపుగాఁ గూయు నాఁడుకోవెలలును, నిండారఁబూచిన పొదరిండ్లును, సరసవచనరచనాచతురులైనకొందఱు కవివరులతోడి ముచ్చటలును, జంగురనిసొంపారుచల్లనితెల్లనివెన్నెలలును, పలువగలపూవుదండలును సౌభాగ్యసంపన్నులైన యొకకొందఱికిమాత్రము గలిగి వారిని సుఖింపఁజేయును.

శ్లో॥ పాన్థస్త్రీవిరహానలాహుతికలా మాతన్వతీ మఞ్జరీ
మాకన్దేషు పికాఙ్గనాభి రధునా సోత్కణ్ఠ మాలోక్యతే।
అల్పా స్తే నవపాటలాపరిమళప్రాగ్భారపాటచ్చరా
వాన్తి క్లాన్తివితానతానవకృతః శ్రీఖణ్డశైలానిలాః॥ 84

టీ. అధునా=ఇప్పుడు- ఈ వసంతసమయమునం దనుట, పాన్థ...కలాం-పాన్థస్త్రీ=ప్రోషితభర్తృకలయొక్క, విరహ + అనల=వియోగాగ్నియొక్క, ఆహుతికలాం=హవిస్సువేల్చు వ్యాపారమును-అగ్ని నెట్లు హవిస్సు వేల్చి ప్రజ్వరిల్లఁజేయుదురో యట్లే యావిరహ మనెడియగ్నిని వేల్చి యుద్దీపింపఁజేయు ననుట-విరహాగ్నిని మిక్కిలి యుద్దీపింపఁ జేయు ననిభావము, ('ఆహుతికథాం' అనుచో ఆహుతి యనెడి వృత్తాంతము ననుట), ఆతన్వతీ = చేయుచున్నట్టిదైన, మాకన్దేషు = తియ్యమామిడి

---

చునట్టి, కిఞ్చిదేవ=ఒక్కింతయేయైన, ఆవాసః=నివాసమును, (కర్ణే...కలితపయైః' అనువఱకు ఉభయపాఠములను అర్థము సమము), సేవ్యాః=సేవింపఁదగినవైన, సితాంశోః కరాః=చంద్రకిరణములు, చైత్రే=వసంతమునందు, విచిత్రాః=పూర్వోక్తము లైన 'ఆవాసః' ఇత్యాదివివిధసుఖములచే వింతలైన, క్షపాః=రాత్రులు, కేషాంచిత్=కొందఱియొక్క, హృదయం=మనస్సును, సుఖయన్తి=రంజింపఁజేయుచున్నది. అవేహి=ఎఱుఁగుము.

తా. వసంతర్తువునందు ప్రియురాండ్రపజ్జ నీటుగులుక వసించుటచేతను, జెవికింపైన యాఁడుకోవెలలపలుకులచేతను, పూచినపొదరిండ్లచేతను, కొందఱు కవివరులతోడి ముచ్చటలచేతను, వెన్నెలలచేతను వింతలు సేయురాత్రులు కొందఱు పుణ్యాత్ములకే కలిగి వారిని మిక్కిలి రంజింపఁజేయు నని యెఱుంగుము.

చెట్లయందు, (గల అని శేషము), మంజరీ=పూగుత్తి, పికాఙ్గనాభిః=ఆఁడుకోవెలల చేత, స ఉత్కణ్ఠం=తమకముతో, ఆలోక్యతే=చూడఁబడుచున్నది-ఇష్టమై యుండుటచేత నని భావము. నవ...చ్చరాః-నవ=క్రొత్తయైన, పాటలా=కలిగొట్టుచెట్టుల యొక్క, పరిమళ=వాసనలయొక్క, ప్రాగ్భార=అతిశయమును, పాటచ్చరాః=దొంగిలించునవియు-కలిగొట్టుచెట్టులందప్పుడు క్రొత్తగాఁ బుట్టినపువ్వులనుండి బుగులుకొనుతావులతోఁ గూడినది యనుట, క్లాన్తి...కృతః-క్లాన్తి=బడలికలయొక్క, వితాన=సమూహముయొక్క, తానవ=తనుత్వమును-కృశత్వము ననుట, కృతః=చేయునవియు-బడలికలనెల్లఁ బోఁగొట్టునవి యనుట, అల్పాః=మందములైనవియు, నగు, తే=ఆ-ప్రసిద్ధములైన, ('అప్యేతే నవపాటలా...' అనుపాఠమున, అపిచ=మఱియును, ఏతే=ఈ-ప్రసిద్ధములైన యనియర్థము), శ్రీఖణ్డ...నిలాః-శ్రీఖణ్డశైల=చందనపుఁగొండయొక్క, అనిలాః=వాయువులు-మలయమారుతములనుట, వాన్తి=వీచుచున్నవి. మంజరీప్రభృతులచే వసంతము విరహిజనులకు దురంతదుఃఖకరమనియుఁ, గవగూడియున్నవారికి పరమానందకర మనియుఁ దెలియునది. 'వియోగాగ్ని' యనుచోఁ గల రూపకము 'ఆహుతికలామ్' అనుచోఁ గలయుపమ యపేక్షిత మనుటచే దానితో సంకరము నొందె శాబ్దమైన అనుప్రాసముతోడను సంకీర్ణమయ్యెడి.

చ. వరలు వియోగినీవిరహ॥వహ్నికి నాహుతిలీలఁ బొల్చు భా
సురసహకారమంజరులఁ॥ జూచి మదించెఁ బికంబు లత్తఱిఁ
సురతపరిశ్రమాతిశయ॥సూదనముల్ విహరించెఁ బాటలీ
పరిమళభారచోరములు॥ బంధురచందనశైలవాతముల్. 84

తా. వసంతకాలమునఁ దియ్యమావులందుఁ బూగుత్తి పొడసూపుచున్నది.హవిస్సు అగ్ని నెట్లో యట్లె యాపూగుత్తియు, దేశాంతరమునందుఁ బురుషు లుండుటచే వారి నెడఁబాసి గాసిపడుచున్నయెలనాఁగల మదనాగ్నిని మఱింత యధికముగాఁ జేయుచున్నది. దాని మెసవుటకై యాఁడుకోవెలలు మిక్కిలి యాతురతతోఁ జూచుచున్నవి. చందనపుఁగొండనుండి చిఱుదెమ్మెరలు కలిగొట్టుచెట్టులందుఁ గ్రొత్తగా వనిచినపువ్వుల గుబులుకొనుతావులను గొల్లగొనుచు, బడలికలనెల్లఁ బాపుచు వీచుచున్నవి.

శ్లో॥ ప్రథితః ప్రణయవతీనాం, తావ త్పద మాతనోతు హృది మానః।
భవతి న యావ చ్చన్దనతరుసురభి ర్మలయపవమానః॥ 85

టీ. ప్రథితః=ప్రసిద్ధమైన-మఱింతదృఢమైనయనుట, మానః=మానము-మనస్సుయొక్క.బిగి-ప్రియుఁడు పరకాంతతోఁ గూడుటవలని యసూయచేఁ గలిగిన కోపమనుట, 'స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మానోఽన్యాసఙ్గిని ప్రియే। శ్రుతే వానుమితే దృష్టే' అని మానలక్షణము, చన్దనతరుసురభిః-చన్దనతరు=చందనపుచెట్లచేత-వానిపై

వీచి వాని తావులతోఁ గూడుటచేత ననుట, సురభిః=పరిమళించుచున్న, మలయపవమానః=మలయపర్వతపుగాలి, యావత్=ఎందాఁక, నభవతి=కలుగదో-వీవదోయనుట, తావత్=అందాఁక, ప్రణయవతీనాం=ప్రేమ గల ప్రియురాండ్రయొక్క-, హృది=మనసునందు, పదం=స్థానమును, ఆతనోతు=చేయునుగాక-అందాఁక నెలకొని యుండుననుట. మలయమారుతము మిక్కిలి మదనోద్దీపకమైనదిగాన మానినులకుఁ దమప్రియులయెడ మాన మెంతదృఢముగా నుండినను ఆగాలి వీవఁగానే దానిని విడిచి తమంతటనే ప్రియులకు లోనగుదు రని భావము.

తే. అంగజునిగంధసింధురం బనఁగఁ బరఁగు
మలయజసుగంధిమలయాద్రిమారుతంబు
మలయ దెందాఁక నందాఁక మానవతుల
మానసంబుల నెలకొని మాన మమరు. 85

తా. మానినులకుఁ దమప్రియులయం దెంతప్రేమయుండియు వారు పరకాంతలతోఁ గలిసినయీసుచే నాప్రేమ మడంచి మిక్కిలియుఁ గోపము పూనియుందురు. అయినను మలయపర్వతమునందలి చందనపుచెట్లయొక్క వాసనలతోఁ గూడిన చల్లనిగాలి మరులుకొలుపుచుఁ బయిని వీవకుండునంతవఱకే యాకోపము దాల్చియుండఁ జాలుదురు గాని యవి వీచెనా మానము వీడి వల పగ్గలింపఁగాఁ దమంతనె ప్రియులకు వశమగుదురు.

శ్లో॥ సహకారకుసుమకేసర, నికరభరామోదమూర్ఛితదిగన్తే।
మధురమధువిధురమధుపే, మధౌ భవేత్కస్య నోత్కణ్ఠా॥ 86

టీ. సహ...అన్తే-సహకార = తియ్యమావుల, కుసుమ = పూవులయొక్క-, కేసర నికరభర=అకరువుగుంపుల పెంపులయొక్క-మిక్కిలియెక్కువగా నివ్వటిలుచున్న యకరువులయొక్క యనుట, ఆమోద=వాసనలచేత, మూర్ఛిత=వ్యాప్తములైన, దిగన్తే=దిక్కులకొనలుగలదియు, మధుర...మధుపే-మధుర=తీయని,మధు=పూఁదేనియచేత-దానిని గ్రోలుటచేత ననుట,విధుర=విహ్వలములైన-మత్తుగొని కళవళించుచున్న, మధుపే=తుమ్మెదలుగలదియు-మామిడిపూవుల యకరువుల వాసనలు బుగులుకొనుటచేతను దేనియ లాని సొక్కుచు ఝుంకారములు సేయుతుమ్మెదలచేతను మిక్కిలి యుద్దీపకమైనట్టియనుట,మధౌ=వసంతమునందు, కస్య=ఎవనికి-స్త్రీకిఁగాని పురుషునికిఁగాని యనుట, ఉత్కణ్ఠా=తమి-మరుకేళియందు తమకము,నభవేత్=కలుగదు-అందఱికిని గలుగుననుట. కాఁబట్టి యప్పుడు మానమును విడుచుటయే యుక్తమని భావము. అనుప్రాసము శబ్దాలంకారము.

తే. సరససహకారకుసుమకేసరసమూహ
గురుతరామోదమయదిగంతరము మధుర

మధువిధురమధుపము మధుకమాసనమయ
మెవ్వనికి వేడ్క వాటింప కి దిజ్జగమున. 86

తా. వసంతమునందు తియ్యమావులు పూచుటచే వానియందలి యకరువుల తావులు నలుగడల గుబులుకొనుచున్నవి. తీయనిపూఁదేనియలు క్రోలి సోలి తుమ్మెదలు పాటలు పాడుచున్నవి. ఇట్లీకమ్మవాసనలచేతను గండుతుమ్మెదలపాటలచేతను మిక్కిలి మరులుకొలుపుచు వసంతము రాఁగా నప్పు డెట్టివానికేని మరుకేళియందుఁ దమి కలుగకపోవదు.

అవ. ఇఁకమూఁడుశ్లోకములచే గ్రీష్మఋతువునువర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అచ్ఛాచ్ఛచన్దనరసార్ద్రతరా మృగాక్ష్యో
ధారాగృహాణి కుసుమానిచ కౌముదీచ।
మన్దో మరు త్సుమనసః శుచి హర్మ్య పృష్ఠం
గ్రీష్మే మదంచ మదనంచ వివర్ధయన్తి॥ 87

టీ. అచ్ఛ...తరాః-అచ్ఛ అచ్ఛ = మిక్కిలియు నచ్ఛమైన-కడుం దెల్లనైన యనుట, చన్దనరస=గందపుద్రవముచేత-అనుకుగానున్నగందంపుఁబూఁతలచేత ననుట, 'గుణేరాగే ద్రవేరసః' అనియమరుఁడు, ఆర్ద్రతరాః=మిక్కిలి తడిసినవారైన-వేఁడిమి శమించి చలువగలుగుటకై దట్టముగా మేనఁ గలప మలందుకొన్నవారైనట్టి యనుట, మృగాక్ష్యః=జవరాండ్రును, ధారాగృహాణి=నీటిని దారలుగాఁగాని తుంపరలుగాఁగాని చల్లునట్టియంత్రములు గల యిండ్లును, కుసుమానిచ=మల్లెలు మొదలయిన పువ్వులును, కౌముదీచ=వెన్నెలయును, సుమనసః=జాజిపువ్వుయొక్క-జాజిపూవుందావులతోఁ గూడిన యనుట, 'సుమనా మాలతీ జాతీ' అని యమరుఁడు, మన్దః=మెల్లగాఁ బొలయునట్టి, మరుత్=గాలియు, శుచి=(పాలగచ్చుచే) శుభ్రమైన, హర్మ్యపృష్ఠం=మేడమీఁదిభాగమును, గ్రీష్మే=వేసవికాలమునందు, మదం=ఉబ్బును, మదనంచ=మన్మథునిని-మరులుననుట, వివర్ధయన్తి=పెంచుచున్నది. ఇందు నొక్కకార్యమునకై కారణములు పెక్కు చెప్పఁబడుటంజేసి ద్వితీయ మగు సముచ్చయ మలంకారము.

చ. అతిసితచందనార్ద్రరుచిరాంగులు భామినులుర్ సుగంధసం
గతమగుమందమారుతముఁ కౌముదియుర్ జలయంత్రగేహ ము
న్నతశుచి సౌధభాగము ఘనం బగువాసనఁ బూనుపుష్పసం
తతియు మదంబు దర్పకునిదర్పముఁ బెంపుగఁ జేయు వేసవిన్. 87

తా. వేసవికాలమునందు ననుకుగాఁ గలిపిన యచ్ఛంపుగందమును దట్టముగా నలందుకొనుటచే చల్లనైయున్న చెలువంపుమేనులు గల జవరాండ్రును, జలయంత్ర

ములు గలయిండ్లును, మల్లెలు మొదలగు పువ్వులును, బండువెన్నెలయు, జాజిపూవుల తావులం గలసి హాయిగాఁ బొలయుగాలియు, పొలగచ్చుపూఁతలచే శుద్ధముగా నుండు మేడలును, జనులకు మిక్కిలిసొంపు పెంపారఁ జేసి మన్మథవికారము నెసకొలుపును.

శ్లో॥ స్రజో హృద్యామోదా వ్యజనపవన శ్చన్ద్రకిరణాః
పరాగః కాసారో మలయజరసః శీధు విశదమ్।
శుచిః సౌధోత్సఙ్గః ప్రతను వసనం పఙ్కజదృశో
నిదాఘర్త్తా వేత ద్విలసతి లభ న్తే సుకృతినః॥ 88

టీ. హృద్య ఆమోదాః=ఇంపైన వాసన గల, స్రజః=పూదండలును, వ్యజన పవనః=వీవనలగాడ్పును, చన్ద్రకిరణాః = చందురుని వెలుంగులును - వెన్నెలయు ననుట, పరాగః = పుష్పొడియు, కాసారః = (క్రీడించుటకైన) తమ్మికొలనును, మలయజరసః=గందపుద్రవమును-అనుకైన కలప మనుట, ('మలయజరజః' అనుచో గందపుఁబొడి యనుట), విశదం=తేటయైన, శీధు=మద్యమును, ('సీధు' అనుచో నిది యే యర్థము), శుచిః=నిర్మలమైన- తెలిగచ్చుచే మెఱయుచు నేమిఱికియు లేకుం డుటచేఁ గ్రీడించుటకు రమణీయముగా నున్న యనుట, సౌధ ఉత్సఙ్గః =మేడపయి భాగమును, ప్రతను=సూక్ష్మమైన-సన్నని, వసనం=వలువయు-జిలుఁగువస్త్రమనుట, పఙ్కజదృశః= (తామరలవంటికన్నులు గల) చెలువలును, అనెడి, ఏతత్=ఇది-ఈ చెప్పఁబడిన భోగసాధనములెల్ల ననుట, నిదాఘఋతౌ=వేసవికాలు, విలసతిసతి= మిక్కిలి యొప్పుచుండఁగా, సుకృతినః= పుణ్యశాలులు, లభన్తే=పొందుచున్నారు, ('నిదాఘార్త్తా హ్యేత త్సుఖ ముపలభన్తే సుకృతినః' అనుపాఠమున నిదాఘ ఆర్తాః =వేసవిచేఁ బీడింపఁబడినవారైన, సుకృతినః=పుణ్యవంతులు, ఏతత్ = ఈపూర్వో క్తమైనవాని నెల్ల, సుఖం=అనాయాసముగా-పుణ్యాత్ములుగాన కష్టములేకయే య నుట, ఉపలభన్తేహి=పొందుదురుగదా, యని యర్థము.) పుణ్యాత్ములు కాని వారి కిట్టిభోగము లెట్లు కలుగు నని భావము.

ఉ. కమ్మనిదండలుం సురఁటిగాడ్పులు వెన్నెలయుం బరాగపుం
జమ్మును మంచిగంధమును సన్నపువల్వలు సీధుపానముం
దమ్మికొలంకు మేడయును దామరసాక్షు లనంగ నొప్పు భో
గమ్ములు పుణ్యవంతులకుఁ గాని లభింప వటంద్రు వేసవిన్. 88

తా. గుమగుమవాసనలు మెండుకొను పూదండలును, వీవనలనుండి హాయిగాఁ బొలయుగాలియు, చందురునిచలివెలుంగులును, గమ్మపుప్పొడియుఁ, దమ్మికొలఁకు ను, గలపంపుఁబూఁతయుఁ, జెఱకురసమునఁగాని యూరెపువ్వులచేఁగాని చేయఁబడి

మీఁదైన తేటకల్లును, మఱికి యిసుమంతయు లేక తెలిగచ్చుచే మెఱయునట్టి మేడలును, జిలుఁగు వలువలును, జవరాండ్రును, వేసవికాలపు వేండ్రము నడంచి మిక్కిలి సౌఖ్యము నొసంగును. అయిన నివి పుణ్యాత్ములకే కలుగును గాన వారే యాబుతువున నీభోగముల నెల్ల ననుభవింతురు గాని తక్కినవా రనుభవింప నేరరు.

శ్లో॥ సుధాశుభ్రం ధామ స్ఫురదమలరశ్మిః శశిధరః
ప్రియావక్త్రామ్భోజం మలయజరస శ్చాతిసురభి।
స్రజో హృద్యామోదా స్త దిద మఖిలం రాగిణి జనే
కరో త్యన్తఃక్షోభం న తు విషయసంసర్గవిముఖే॥ 89

టీ. సుధాశుభ్రం=సున్నపుఁబూఁతచే స్వచ్ఛమైన-లేక, అమృతమువలె స్వచ్ఛమైన, 'సుధా స్యా ల్లేపనద్ర వ్యేఽమృతేచ' అని విశ్వము. ధామ=గృహమును, స్ఫురత్ అమలరశ్మిః=ప్రకాశించుచున్న తెల్లనికిరణములు గల-తెల్లని కాంతిచేఁ దుఱఁగలించుచున్న యనుట, శశిధరః=చంద్రుఁడును, ప్రియా వక్త్రి అమ్భోజం=ప్రియురాలియొక్క మోముఁదామరయు-తామరపువ్వువలె మనోహరమైన ప్రియురాలి నెమ్మొగ మనుట, అతిసురభి=మిక్కిలి పరిమళించుచున్న, మలయజరసః=చందనంపు ద్రవమును-అనుకుగందంపుఁబూఁత యనుట, ('మలయజరజః' అనుచో చందనపుఁబొడి యనుట), హృద్య ఆమోదాః=ఇంపైనతావి గల, స్రజః=పూదండలును, అనెడి, తత్ ఇదం అఖిలం = ఆ యీసమస్తమును-పూర్వోక్తములైన భోగసాధనము లన్నియు ననుట, రాగిణి=రాగముగల-విషయములందు రక్తి గలిగినట్టి, జనే=జనునియందు-విషయాసక్తునివిషయమం దనుట, అన్తః క్షోభం=లోపలియొక్క కలఁతను-మనస్సును గలంచుటను, కరోతి=చేయుచున్నది. విషయ...విముఖేతు-విషయ సంసర్గ=విషయములతోడిసంబంధమునందు, విముఖేతు=పెడమొగముగలవానియం దన్నో-విరక్తునియందో యనుట, న (కరోతి)=(మనస్సు కలఁతను) జేయదు-విరక్తుని గలంపఁజాల దనుట.

తే. కలువచెలియును బూవుదండలును మంచి
గందమును గేళిసౌధంబుఁ జెగలికిమోముఁ
గాముకునకు వికారంబుఁ గలుగఁజేయుఁ
గలఁక వాటింప వెపుడు నిస్పృహునకు. 89

తా. అచ్చంపుఁ దెలిగచ్చుచే మెచ్చులు గులుకు గృహమును, దెలివెలుంగులు దుఱంగలించుచున్న చందురుఁడును, విరిదమ్మివలె ముద్దుగొలుపు ప్రియురాలి నెమ్మొగంబును, గమగమతావులు గుబులుకొను గంధమును, కమ్మనివాసన లీను పూదండలు అనునివి యన్నియు విషయాసక్తుఁడగువానిమనస్సును గలంచునే కాని విషయవిరక్తుని గలంపఁజాలదు.

అవ. ఇఁక వర్షాకాలమును వర్ణింప నారంభించుచున్నాఁడు.

శ్లో॥ తరుణీ వైషా దీపితకామా, వికసితజాతీపుష్పసుగన్ధిః।
ఉన్నతపీనపయోధరభారా, ప్రావృట్ తనుతే కస్య న హర్షమ్॥

టీ. ఇందు వర్షర్తువును దరుణితోఁ బోల్చుచున్నాఁడు- దీపితకామా=ఉద్దీపింపఁబడినమన్మథుఁడు గలదియు-మన్మథు నుద్దీపింపఁజేయునదనుట, విక...గన్ధిః-వికసిత=విరిసిన, జాతీపుష్ప=జాజిపూవులచేత, సుగన్ధిః=మంచివాసనగలదియు (వర్షాపరముగా) జాజిపువ్వులు వికసించుటచేత వాసించు ననియు-(తరుణీపరముగా)జాజిపువ్వులు దుఱుముటచే వాసించునని యర్థము, ('వికసితజాతిః పుణ్యసుగన్ధిః' అనుపాఠమున వికసించినజాజిపువ్వులు గలదనియుఁ గావుననే పుణ్యమైన-అనఁగా మనోజ్ఞమైన-వాసన గలదనియు రెంటికి నర్థము సమము. 'పుణ్యం త్రిషు మనోజ్ఞే స్యాత్' అని విశ్వము), ఉన్న...భారా-ఉన్నత=పొడవైనవియు, పీన=బలిసినవియునను, పయోధర=మేఘములయొక్క, భార=అతిశయము గలది అని మేఘపరము-పొడవులై బలిసినచన్నులబరువు గలది యని తరుణీపరము, 'స్తనాబ్దౌ పయోధరౌ' అని వైజయంతి, అను, ఏషా=ఈ, ప్రావృట్=వానకాలు, తరుణీ ఇవ = జవరాలివలె, ('తరుణీవేషా' అనుపాఠమున జవరాలివేషమువంటి వేషము గల, ప్రావృట్=వర్షాకాలము, అని యర్థక్రమము), కస్య=ఎవనికి, హర్షం=సొంపును-సంభోగంపుఁదమిని,నతనుతే=చేయదు-ఎల్ల వారికిని మరుకేళియందుఁ దమకము పుట్టించు ననుట. వర్షర్తు వొకతరుణివలె కాము నుద్దీపింపఁజేయుచు, వికసించిన జాజిపువ్వులు గుబులుకొన్నదై, యున్నతపీనపయోధరములు గలదియునై యుండుటచే దానివలెనే తానును బ్రతివానికి సంభోగమునందుఁ దమి కలిగించునని యర్థము. ఒకతరుణి యెట్లు కొప్పునఁ దుఱిమిన జాజిపువ్వుల గుమగుమతావులచేతను, నునుటుగిబ్బిగుబ్బలచేతను మరులుకొలుపుచుఁ బ్రతివానికి సంభోగాభిలాషకలిగించునో యట్లె వర్షర్తువును నలుగడల జాజిపువ్వులు వికసించి వాసనలు వెదచల్లుటచేతను, పొడవుగా మింటఁ బొడసూపు పెనుమబ్బులచేతను మరులుకొలుపుచుఁ బ్రతివానికి సంభోగాభిలాష కలిగించునని భావము. జాతీపుష్పవాసనయు మేఘోదయమును స్మరోద్దీపకములుగాన నవిగల వర్షర్తువును స్మరోద్దీపకురాలగు తరుణితోఁ బోల్పబడిన దని తెలియునది. ఇచట నలంకార ముపమ. ఇది శ్లేషానుప్రాణిత మైనది.

క. కామోద్దీపకయు సము, ద్దామపయోధరవిరాజితయు జాతిసుమ
స్తోమసుగంధియునై స, ర్వామోద మొనర్చెఁ బ్రావృడంగనబళిరే.

తా. ఈవర్షర్తువు కాము నుద్దీపింపఁజేయుచు, వికసించు జాజిపువ్వులు తావులు గుబులుకొనుచున్నదై, పొడవులైన బలితంపు పయోధరములు (మబ్బులు, గు

బ్బలు) గలిగి, యొకతరుణివలె నొప్పటంజేసి దానివలెనే ప్రతివానికి మరుకేళియం దుఁ దమి పుట్టించుచున్నది.

శ్లో॥ వియ దుపచితమేఘం భూమయః కన్దలిన్యో
నవకుటజకదమ్బామోదినో గన్ధవాహాః।
శిఖికులకలకేకారావరమ్యా వనాన్తాః
సుఖిన మసుఖినం వా సర్వ ముత్కణ్ఠయన్తి॥ 91

టీ. ఉపచితమేఘం=పుష్టినొందింపఁబడిన మేఘములు గల-బలితంపుమబ్బులు గ్రమ్మిన యనుట, వియత్=ఆకాశమును, కన్దలిన్యః=మొలకలుగల-క్రొమ్మొలకలు దలసూపిన,భూమయః=నేలలును,నవ... మోదినః-నవ=క్రొత్తలైన,కుటజ=కొండమల్లెలయొక్కయు, కదమ్బ=కడపపువ్వులయొక్కయు, ఆమోదినః=వాసనలు గల, గన్ధవాహాః=గాడ్పులును-ఎలదోఁటలందలి కొండమల్లెలు కడపపువ్వులు మున్నగువాని తావులఁ గలసి పొలయు నెలదెమ్మెర లనుట, శిఖి...రమ్యాః-శిఖికుల=నెమిళ్ల గుంపుయొక్క, కల=అవ్యక్తమధురమైన-లేక, మందమైన, కేకా ఆరావ=కేకల శబ్దముచేత-కేకయనఁగా నెమిలికూఁత, రమ్యాః=మనోహరములైన, వనాన్తాః=అరణ్యప్రదేశములును-లేక, కేళీవనమధ్యప్రదేశములును, సుఖినం=సుఖము గలయట్టి కాని, అసుఖినంవా=సుఖములేనట్టి కాని-దుఃఖము గలయట్టి కాని యనుట, సర్వం=అందఱిని, ఉత్కణ్ఠయన్తి=తమి గొలుపుచున్నవి-తమ కాంతలతో సంభోగించుటకై మిక్కిలి తమకము గలవారినిగాఁ జేయుచున్న దనుట.

చ. జలధరమాలికాఖచితకచారునభంబు నవాంకురప్రభా
లలితమహీతలంబును గళలస్వనకేకికులోల్లసద్వన
స్థలములు జాతినీపకుటకజస్ఫుటగంధిలగంధవాహముల్
నెలకొని యెల్లవారలకుఁ నిండుముదంబు ఘటించె నత్తఱిన్. 91

తా. వానకాలమున పెనుమబ్బులు పయింబయిఁ గ్రమ్ముకొన్న మిన్నును, క్రొమ్మొలకలు దలసూపిన నేలలును, ఎలదోఁటల కొండమల్లియలు కడపపువ్వులు మొదలగువానితావులం గలసి వీచు కమ్మదెమ్మెరలును, నెమిళ్లగుంపులు కూయు నింపారుకూఁతలచే మిగుల సొంపునింపు నడవిపట్టులును, వీఁడు సుఖి వీఁడు దుఃఖాత్ముఁడని భేదమెన్నక యందఱికిని దమతమసుందరులతో రమించునట్లుతమిగొలుపుచున్నవి.

శ్లో॥ ఉపరి ఘనం ఘనపటలం, తిర్యగ్గిరయోఽపి నర్తితమయూరాః।
క్షితి రపి కన్దళధవళా, దృష్టిం పథికః క్వ పాతయతి॥ 92

టీ. ఉపరి=మీఁద, ఘనం=దట్టమైన, ఘనపటలం=మేఘములసమూహము, ఉన్నది యని శేషము. తిర్యక్=అడ్డముగ-దిక్కులయం దనుట, నర్తితమయూరాః-

న_ర్తిత=ఆడుచున్న-లేక, మేఘోదయమునం దుల్లాసముచే నాడుట గలదు గాన మబ్బులచే నాడింపఁబడిన, మయూరాః = నెమిళ్లుగల, గిరయోఽపి = పర్వతములును, ఉన్నవి అని శేషము. క్షితిరపి=భూమియు, కన్దళధవళా=పలువగల మొలకలచేత స్వచ్ఛమైనది. కాఁబట్టి, పథికః=తెరువరి-ప్రియురాలిని విడిచి యాత్రాదికారణమున నితరదేశములం దిరుగుచున్నవాఁడనుట, దృష్టిం=చూపును, క్వ=ఎక్కడ, పాతయతి=పడవైచును-నిగిడించు ననుట, ఎటుప్రక్కఁ జూచినను గామోద్దీపకములైన మబ్బులు మొదలైనవి గానంబడుటచే నెచ్చోటను వానికిఁ జూడ్కి నిగుడ్చుట కష్టముగా నున్నదని భావము. విరహిజనుల కీవానకాలము మిక్కిలి కష్టమైనదని పరమార్థము. ('దృష్టిం పథికస్య వారయతి' అనుచో పథికుని చూపును వారించుచున్నదని యర్థము. వాని నెటుప్రక్కను జూడనీయదనుట-నలుగడల మబ్బులు మొదలైనవి మరులుగొలుపుచు గానంబడుటచే వాఁ డేప్రక్కను జూడఁ జాలఁడయ్యె నని భావము.)

తే. మీఁద మబ్బులమోసులు క్రమ్మి మిసిమిచూపఁ
 బుడమియును గందళమ్ములఁ బొదల నాడు
 నెమ్మిగమితోడ దెసల శైలమ్ము లుండ
 విరహిజనుఁ డెందుఁ దనదృష్టి విరియఁ జేయు. 92

తా. మీఁద, నలుపు బలుపు నెక్కినమబ్బులు దట్టముగాఁ గ్రమ్మియున్నవి. చుట్టు నామబ్బులం జూచి చెలరేఁగి యాడుచున్న నెమిళ్లతోడం గూడిన కొండలు మెండుకొనియున్నవి. క్రింద భూమియంతయుఁ బలువగల క్రొమ్మొలకలచేఁ జెలువారుచున్నది. ఎటు చూచిన నివియన్నియుఁ గామోద్దీపకములై కనఁబడుచున్నవి. కాన యిల్లాలిని బాసి క్రుమ్మరుచున్న బాటసారి యేవంకను జూపు నిగిడింపఁ జాలకున్నాఁడు.

శ్లో॥ ఇతో విద్యుద్వల్లీవిలసిత మితః కేతకితరోః
 స్ఫురద్గన్ధః ప్రోద్యజ్జలదనినదస్ఫూర్జిత మితః।
 ఇతః కేకిక్రీడాకలకలరవః పక్ష్మలదృశాం
 కథం యాస్యన్త్యేతే విరహదివసాః సంభృతరసాః॥ 93

టీ. ఇతః=ఈప్రక్క, విద్యు...సితం - విద్యుద్వల్లీ =మెఱుపుదీఁగయొక్క, విలసితం=స్ఫురణము-మెఱచుటయనుట, 'భవతి' (ఉన్నది) అని శేషము, ఇతః=ఈచోట, కేతకితరోః=మొగలిచెట్టుయొక్క-దానిపూవులయొక్క యనుట, స్ఫురన్=వ్యాపించుచున్న, గన్ధః=పరిమళము, 'వర్తతే' అనిశేషము. ఇతః=ఈయెడ, ప్రోద్య...ర్జితం-ప్రోద్యత్=పయిని లేచుచున్న,జలద=మబ్బుయొక్క,నినద=ధ్వనియొక్క-ఉఱుముయొక్కయనుట, స్ఫూర్జితం=స్ఫురణమును, 'భవతి' అని శేషము,ఇతః=ఈ

చాయ, కేకి...రవః-కేకి=నెమిళ్ల యొక్క, క్రీడా=కేళులయందలి, కలకలరవః=కోలాహలధ్వనులును-లేక, మిక్కిలియు నవ్యక్తమధురములైన శబ్దములును, 'ఉజ్జృమ్భతే' (చెలరేఁగుచున్నవి)అని శేషము. కాఁబట్టి, సంభృతరసాః-సంభృత=కడలుకొన్న, రసాః=శృంగారరసము గల-శృంగారరసమును గడలుకొలుపునట్టి యనుట-మెఱపుతీఁగలు మొగలిపూవాసనలు మొదలైనవానిచే శృంగారరస ముప్పొంగఁజేయునట్టి యనిభావము, ఏతే=ఈ-కామోద్దీపకము లని ప్రసిద్ధములైన యనుట, విరహదివసాః=వియోగపుదినములు-ప్రియుల నెడఁబాసియున్న దినము లనుట, పక్ష్మలదృశాం=స్త్రీలకు, కథం=ఎట్లు, యాస్యన్తి=కడచును-ఎట్లును గడవనేర వనుట. దిన మొక్కయుగము గాఁదోఁచి కడపరానిదై యుండునని భావము. మెఱుపుఁదీఁగలు మొగలిపూవాసనలు మబ్బులయుఱుములు నెమిళ్లకూఁతలును శృంగారరసోద్దీపకము లని కవిసమయము.

ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుఁదివె లిక్కడఁ గేతకిగంధవైభవం
బిక్కడ భూరిగర్జితము లిక్కడ మత్తమయూరనిస్వనం
బక్కట యీరసోజ్జ్వలము లైనదినంబులు మన్మథార్తిపెం
పెక్కు వియోగినీజనుల కెట్లు చనం గల వెన్ని చూడఁగన్. 93

తా. ఒక్కయెడఁ దళతళమని మెఱుపుఁదీఁగె మెఱచుచున్నది. ఒకచోట మొగలిపూవులతావులు బుగులుకొనుచున్నవి. మఱియొకచక్కి పొడతెంచుచున్న మబ్బు ఉఱుముచున్నది. ఇంకొకవంక నెమిళ్లు కలకల మని యాడుచుఁ గూయుచున్నవి. ఇవియెల్ల నీదివసములయందు శృంగారరస ముప్పొంగఁజేయునవి. ప్రియుల నెడఁబాసి యున్న యువతులు మిక్కిలియు మరులుకొలుపు నిట్టిదినముల నెట్లు గడపుదురో తెలియరాదు.

శ్లో॥ అసూచీసఞ్చారే తమసి నభసి ప్రౌఢజలద
ధ్వనిప్రాజ్ఞంమన్యే పతతి పృషతానాంచ నిచయే।
ఇదం సౌదామిన్యాః కనకకమనీయం విలసితం
ముదంచ మ్లానించ ప్రథయతి పథి స్వైరసుదృశామ్॥ 94

టీ. తమసి=చీఁకటి, అసూచీ సఞ్చారేసతి=సూదియొక్క తిరుగుట లేనట్టిదగుచుండఁగా-సూదిమొన మోపునంతమాత్రమేని యెడము లేనట్లు క్రమ్ముకొనుచుండఁగా ననుట-కారు క్రమ్ముకొనుచుండఁగా నని భావము, నభసి=ఆకాశము, ప్రౌఢ...మన్యేసతి-ప్రౌఢ=గంభీరమైన, జలదధ్వని=మేఘగర్జితముచే - ఉఱుముచేత, ప్రాజ్ఞంమన్యే = తన్ను మాటకారిగా నెన్నుకొనునది యగుచుండఁగా-మిక్కిలి యుఱుములతో నిండిన దగుచుండఁగా ననుట, ('ప్రౌఢజలదధ్వనిప్రాయే'అనుచో బెడిదము లైన యుఱుములచేఁ దఱుచైనది యగుచుండఁగా ననుట),

పృషతానాం=నీటిబిందువులయొక్క, నిచయే=సమూహము, పతతిసతి=పడుచుండఁగా, ('పతతిద్పృషదాంనీరనిచయే' అనుచో, ద్పృషదాం=వడగండ్లయొక్క, నీరనిచయే=నీటితోఁ గూడినసమూహము, పడుచుండఁగా ననుట), కనకకమనీయం-కనక=బంగారువలె-ఒరగంటియందలి బంగరుగీఱవలె ననుట, కమనీయం=మనోహరమైన, ఇదం=ఈ, సౌదామిన్యాః=మెఱపుఁదీఁగెయొక్క, విలసితం=స్ఫురణము-మెఱుచుట యనుట - ఒరగంటియందు తళతళలాడు బంగారుగీఱవలెఁ బొలుపై మెఱచుచున్న మెఱు మనుట, స్వైరసుదృశాం=అభిసారికలకు, పథి=ప్రియునింగూర్చి పోవుమార్గమునందు, ముదంచ=(మార్గమును దెలుపుటచే) సంతోషమును, గ్లానించ=(తమ్ము వెలిపుచ్చుటచే) వాడుటను-విన్నఁదనముననుట, ప్రథయతి=ప్రకటించుచున్నది-కలిగించుచున్నదనుట, మెఱపులు మెఱచుట, కటికచీఁకటిలోఁగానరాని మార్గమును దెలుపుటచే సంతోషమును, గూఢముగాఁ బోవుచున్నతమ్ము బయలుపఱుచుటచే సంకోచమును అభిసారికలకుఁ గలిగించిన దని భావము. వేషాదులందాల్చి ప్రియునింగూర్చి సంకేతస్థానమునకుం బోవునది యభిసారిక యని తెలియునది. 'కాన్తాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా' అని తల్లక్షణము.

చ. ఘనతిమిరంబు సూది కవకాశ మొసంగమి మీఁద వారిద
స్వనముల మిన్ను పిక్కటిలఁ వారికణంబులు రాలుచుండఁగాఁ
గనకపురేఖలం దెగడుకారుమెఱుంగులు జారకామినీ
జనములకున్ ముదంబునువిషాదమునుం బ్రకటించెఁద్రోవలన్. 94

తా. కటికచీఁకటి సూదిమొన మోపునంతయెడమును లేనట్లు నిబిడముగాఁ గ్రమ్ముకొనుచుండఁగాను, బెడిదములైన యుఱుములచే మిన్నెల్ల మ్రోఁగుచుండఁగాను, చినుకులు పడుచుండఁగాను, ఒరగంటియందు రాచిన బంగరుగీఱవలెఁ దళతళ మెఱచుచున్న మెఱపుఁదీఁగ యభిసారికలకుఁ జీఁకటిలోఁ గానరానిమార్గముం దెలుపుటచే సంతోషమును, గూఢముగాఁ బోవుచున్నఁ దమ్ము వెలిపుచ్చుటచే సంకోచమును గలిగించుచున్నది.

శ్లో॥ ఆసారేణ న హర్మ్యతః ప్రియతమై ర్యాతుం బహిః శక్యతే
శీతోత్కమ్పనిమిత్తమాయతదృశా గాఢం సమాలిఙ్గ్యతే।
జాతాః శీకరశీతలా శ్చ మరుతో రత్యన్తఖేదచ్ఛిదో
ధన్యానాం బత దుర్దినం సుదినతాం యాతి ప్రియాసఙ్గమే॥ 95

టీ. ప్రియతమైః=వల్లభులచేత - పతులచేత, ఆసారేణ=వడగండ్లచేత - వడగండ్లు పడుటంబట్టి యనుట, హర్మ్యతః=ఉప్పరిగనుండి, బహిః=వెలుపలికి, యాతుం=పోవుటకు, నశక్యతే=అలవికాదు-వడగండ్లు పడుటవలనఁ బురుషు లుప్పరిగలను విడిచి బయటఁబోవనేర రనుట, ఆయతదృశా=(విశాలమగుకన్నులు గల) చెలువచేత, శీత ఉత్కమ్పనిమిత్తం=చలిచేతనైన వడఁకు కారణముగా-చలిచేఁ గలిగినవడఁకుం బోఁగొ

ట్టుటకై యనుట, గాఢం=మిక్కిలిబిగిగా, సమాలిఙ్గ్యతే=కౌఁగిలింపఁబడుచున్నది. శీకరశీతలాః=తుంపరలచే చల్లగా నున్నవియు, రత్య...చ్ఛిదః- రతి అన్త=మరుకేళి కడపటఁ గలిగెడు, ఖేద=శ్రమమును, 'శ్రమః ఖేదోఽథరత్యాదేర్జాతః స్వేదాదిభూమికృత్' అని ఖేదలక్షణము, ఛిదః=త్రుంచునవియును - సురతంపుకడపటఁ గలుగు బడలికను బాపునట్టివి యనుట, అగు, మరుతః=వాయువులును, జాతాః=పుట్టినవి-వీచుచున్న వనుట, కాఁబట్టి, ధన్యానాం=పుణ్యాత్ములకు, ప్రియాసఙ్గమే సతి=కాంతతోడి సంభోగము ఉండఁగా, దుర్దినం=దుష్టదిన మైనను-మబ్బు క్రమ్మినదిన మైనను అనియు గ్రాహ్యము, 'మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్' అని యమరుఁడు,సుదినతాం=మంచిదిన మగుటను, యాతి=పొందుచున్నది - మంచియుప్పరిగలు వాలుంగన్నులయొప్పులాండ్రు మొదలైన భాగ్యవిశేషములు గల పుణ్యాత్ములకు మబ్బు క్రమ్మి పసమాలినదినములుకూడ మిక్కిలి సుఖప్రదములై మంచిదినములవలెనే యుండును. పుణ్యహీనులకో యట్లుగాదని భావము. ఇచట 'దుర్దినమపి సుదినతాం యాతి' అనుచో స్ఫురించువిరోధము క్రిందఁజెప్పఁబడినసమాధానములచే నాభాసితమయ్యెంగాన విరోధాభాస మలంకారము.

ఉ. కేరుచు మేడనుండి వెలికిన్ జన శక్యము గాకయుండె నా
సారముచేత శీతమునకు జవ్వనికౌఁగిలి గల్గె శీకరో
దారసమీరణంబు సురతశ్రమవారణ మయ్యె దుర్దినం
బారయ నయ్యెడన్ సుదినమయ్యెఁ గృతార్థుల కంగనారతిన్.

తా. మబ్బుక్రమ్మిన కొఱగానిదినము జనులను వడగండ్లుకురిసి యిండ్లు వెడలనీయకయును, జలి పుట్టించి మిక్కిలి వడఁకునట్లును, తుంపరలతోఁ గూడినవాయువులను జిల్లుమని వీవఁజేసి గాసిపడునట్లును జేయుచున్నది. ఇట్లది సామాన్యముగా నందఱికి బాధకర మగుటచేఁ జెడుదినమయ్యు ప్రియాసంగమభాగ్యము గల పుణ్యాత్ముల కది యావడగండ్లు మున్నగువానిచే సుఖమునే కలిగించి తాను సుదినమే యగుచున్నది. ఎట్లన వడగండ్లు కురిసి వారిని బయట పోనీయక మేలియుప్పరిగలయందే యిందువదనలతో సుఖముగావసించియుండునట్లు చేయును. చలి వారిప్రియురాండ్రకు వడఁకుఁ బుట్టించి వారిని బిగియఁగౌఁగిలింపఁజేయుటచే బిగికౌఁగిలింతల సొంపును గలిగించుచున్నది. తుంపరతోఁ గూడినచలిగాలి, మరుకేళియం దలసి సొలసియున్నవారియలఁత నెల్లఁ దీర్చుచున్నది. ఔరా! దుర్దినమైనను బుణ్యాత్ములకు సుదినమే యగుంగదా!

అవ. ఒకశ్లోకముచే శరదృతువును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అర్ధం సుప్త్వా నిశాయాః సరభససురతాయాససన్నశ్లథాఙ్గః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదనిరతో హర్మ్యపృష్ఠే వివిక్తే।

సమ్భోగక్లాన్తకాన్తాశిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం పిబతి న సలిలం శారదం మన్దపుణ్యః॥96

టీ. నిశాయాః=రాత్రియొక్క, అర్ధం=సగము, సుప్త్వా=నిదురించి-రాత్రి తొలిరెండుజాములు నిద్రచే (గడపి యనుట,('అర్ధం నీత్వా నిశాయాః' అనుచో రాత్రి సగము నెట్లో కడపి యని యర్థము), సరభస...ఙ్గాః-సరభస=ఉరవడిలోఁ గూడిన, సురత=రతిచేతఁ గలిగిన, ఆయాస=శ్రమచేత, సన్న=వాడి, శ్లథ=ప్రిదిలిన-బిగివీడి సోలిన యనుట, అఙ్గాః=అవయవములు గలవాఁడును, 'మధ్యం నక్త ముదాహృతం శరదిచ ప్రత్యూషకాలే హిమమ్' అను భోజవచనముంబట్టి శరత్కాలమం దర్ధ రాత్రసురతమే భోగ్యముగాన నప్పుడు *రతికేళి సలిపి యలసియున్నవాఁ డనుట, కావుననే, ప్రోద్భూత...తృష్ణః-ప్ర + ఉద్భూత=మిక్కిలియుం బుట్టినదియు, కావుననే, అసహ్యా= సహింపరానిదియు నైన, తృష్ణః=దప్పిగలవాఁడును, మధు...నిరతః-మధు=సంభోగమునకు ముందు త్రాగినమద్యముచేత నైన, మద=మత్తుచేత, నిరతః=పరవశుఁడును, మద మనఁగా 'మదిరాదికృతో మోహో హర్ష వ్యతికరో మదః' అని మద్యపానముచేతఁ గలిగినమోహము(తెలివితప్పుట), ఇట్టివాఁడై, వివిక్త=ఏకాంతమైన, హర్మ్యపృష్ఠే=ఉప్పరిగమీఁదిభాగమున, కర్కరీతః=కర్కరివలననుండి-గిండివంటి మట్టిపాత్రముననుండి, సమ్భోగ...వర్జితం-సమ్భోగ=రతిచేత, క్లాన్త=వాడిన-అలసిన, కాన్తా=తనప్రియురాలియొక్క, శిథిల=సోలునట్టి, భుజలతా= తీఁగవంటి బుజముచేత, ఆవర్జితం = ధారగాఁ బోయఁబడినదియు, శారదం = శరత్కాలమునకు సంబంధించినట్టిదియు, నైన, సలిలం = జలమును-†హంసోదకము ననుట,

---

* దీనిచే నాయకుఁడు కామతంత్రకుశలుండనియు నాయిక మూఁడవజామున రతి గోరునదగుటచే శంఖినియనియుఁ దెలియునది. 'రమయతిచ తృతీయే శఙ్ఖినీ మార్ద్రభావాం,గమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే' అనియు 'వసుమితవన మధ్యే కాచిమార స్తృతీయే తిమిరనిబిడయామే శఙ్ఖినీం సంలభేత' అనియు శంఖినీ లక్షణము తెలియునది.

† ద్రవ్యరత్నమాలయందు 'అహ్నితప్త మహిమాంశురశ్మిభిః, శీత మమ్బుశశిరశ్మిభి ర్నిశి। ఏవమేవ తదహర్నిశంస్థితం, తచ్చ హంసజలనామకం స్మృతమ్' పగలు సూర్యకిరణములచేఁ గ్రాఁగి రాత్రి చంద్రకిరణములచే జల్లనై యిట్లే రేయుం బవలు నుండుజలము హంసజల మనఁబడును' అని హంసజలలక్షణము చెప్పంబడియె. దీనిని ద్రాగుటచేఁ గలుగు గుణములు 'ప్రసాదకం త్రిదోషఘ్నం హృద్యం లఘుచశీతలమ్। వృషం మనోహరం స్వాదు విషఘ్నం కాన్తికృత్వరమ్' అని యందె చెప్పఁబడినవి. మఱియొకచో శరత్కాలమందు దీనిని ద్రాగునియమము 'కర్పూరాగరుజం సితాద్యభిరసై ర్హంసోదకంవాసితం। పాథ శ్చాలిమనోహరం శిశిరతో ముగ్ధాఙ్గనాలిఙ్గనమ్' అని చెప్పఁబడియున్నది.

జ్యోత్స్నా..,ధారం-జ్యోత్స్నా=వెన్నెలచేత, భిన్న=కూడినట్టియు, కావుననే అచ్ఛ=తెల్లనైనట్టియు, ధారం యథాతథా=ధారకలుగునట్లుగా,మన్దపుణ్యః=భాగ్యహీనుఁడు, న పిబతి=త్రావఁడు-భాగ్యవంతుఁడే త్రాగుననుట. శరత్తున నెవఁడు నడిరేయిని రతిసలిపి యలసి బలుదప్పిగొని యిట్టికామిని పోసినజలమును ద్రాగునో వాఁడే ధన్యుఁ డని భావము.

చ. ప్రియముగ రేసగంబు నిదురించి నితాంతరతాంతవిహ్వలుం
డయి దగఁ జెంది యాసవమదాలసుఁడై రతిఖిన్నకామినీ
శయమునఁ గర్కరీగళితచంద్రవిభాచ్ఛశరజ్జలంబు లా
రయఁ గృతపుణ్యుఁ డింపెసఁగఁ ద్రాగు రహస్థితసౌధసీమలన్.

తా. ఎవఁడు రాతిరి తొలిరెండుజాములు నిదురించి పిదప సురవడిగా మరుకేళి సలిపి యలసిసొలసి మిక్కిలియుఁ దప్పిగొన్నవాఁడై, మును ద్రాగియున్న మద్యంపుమత్తునఁ దడఁబడుచు, నొంటిగా నుప్పరిగమీఁదనుండి, రతియందు నలంగిన తన చెలువ చేతులు సోల గిండిని వంచి నీరుపోయుఁగా, నచ్చంపుఁజలివెన్నెలతోఁ గూడి తెల్లగాఁ బడుచున్న యాదారను ద్రాగఁడో వాఁడు భాగ్యహీనుఁడే యగును.

అవ. ఇపుడు రెండుశ్లోకములచే హేమంతమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ హేమన్తే దధిదుగ్ధసర్పిరశనా మాఞ్జిష్ఠవాసోభృతః
కాశ్మీరద్రవసాన్ద్రదిగ్ధవపుషః ఖిన్నా విచిత్రై రతైః।
వృత్తోరుస్తనకామినీజనకృతాశ్లేషా గృహాభ్యన్తరే
తామ్బూలీదళపూగపూరితముఖా ధన్యాః సుఖం శేరతే॥ 97

టీ. హేమన్తే=మంచుకాలమునందు, దధి...రశనాః-దధి దుగ్ధ సర్పిః=పెరుఁగు పాలు నేయి అనునివి, ఆశనాః=ఆహారముగాఁ గలవారును, పాలును నేయియు చలువను బోఁగొట్టునుగాన వానిని సేవించుట దగునుగాని చలువహెచ్చించుపెరుఁగు నుపయోగించుట యీఋతువునఁ దగునాయన్నచో నాయుష్కాముఁడైనవాఁడు హేమంతమునను బెరుఁగు సేవింపవచ్చునని భోజరాజు చారుచర్యయందు ఋతుప్రస్తావమున 'త్రిషుచ దధి నిషేవ్యం గ్రీష్మకాలే వసన్తే,శరదిచ పరివర్జ్యం వాఞ్ఛతా దీర్ఘమాయుః। యది ఖలు పరివాఞ్ఛా సేవ్యతాం సర్వకాలం, సహగుడమధుపాత్రే శర్కరా ముద్గయూషైః' అని చెప్పియున్నాఁడుగాన దోషము లేదని తెలియునది,మాఞ్జిష్ఠ=మంజిడివన్నె గల, వాసః=వలువలను, భృతః=తాల్చువారును - మిక్కిలి యెఱుపువన్నెవలువలు గట్టువారనుట, 'నిర్వాతం భవనం సురక్తవసనం వహ్నిః పరంసేవనమ్' అని మంచియెఱ్ఱనివలువ వసంతమునఁ గట్టఁదగినదిగాఁ జెప్పఁబడియు నిట

మతాంతరముంబట్టి హేమంతమునందును గట్టందగినదిగాఁజెప్పఁబడె నని తెలియు నది, కాశ్మీ...వపుషః-కాశ్మీరద్రవ=కుంకుమపంకముచే, సాన్ద్రి=దట్టముగా, దిగ్ధ=పూయఁబడిన, వపుషః=దేహములుగలవారును, విచిత్రైః=బాహ్యములని అభ్యంతరములని నానావిధములైన, రతైః=సురతములచేత, ఖిన్నాః=అలసియున్నవారును, వృత్తో...శ్లేషాః-వృత్త=వట్రువలును, ఉరు=గొప్పలును నైన, స్తన=చన్నులుగల, కామినీజన=స్త్రీసమూహముచేత, కృత= చేయఁబడిన, ఆశ్లేషాః= కౌఁగిలింతలు గలవారును-ఇదియే 'కస్తూర్యాగురు కుఙ్కుమైరలికృతం పానం తటాకస్థితం। శీతం నైవవిదీర్యతే ప్రియతమై రాలిఙ్గనం కమ్బలమ్' అని చెప్పఁబడియున్నది. తామ్బూలీ...ముఖాః-తామ్బూలీదళ=తములపాకులచేతను, పూగ=పోఁకలచేతను, పూరిత=నిండింపఁబడిన, ముఖాః=నోళ్లుగలవారును-బాగాలు నములుచుండువారనుట, ఇట్టివారైన, ధన్యాః=భాగ్యవంతులు,గృహ అభ్యన్తరే=ఇంటిలోపల, సుఖం యథా తథా=సుఖముగా, శేరతే=నిదురింతురు. తాంబూలము మనస్సునకు సొంపుఁబుట్టించుట మొదలైన బహుగుణములు కలిగించుటచే దానిని నములుట యిట చెప్పఁబడినది-ఇది చారుచర్యయందు-'మనసో హర్షణం శ్రేష్ఠం రతిదం మదకారణమ్। ముఖరోగహరం హృద్యం దీపనం బస్తిశోధనమ్। ముఖశుద్ధి కృమిహరం తామ్బూలం శ్రీకరం పరమ్' అని చెప్పఁబడియున్నది.

చ. ఘృతదధిదుగ్ధభోజన మొగిన్ భుజియించి సురంగవస్త్రముల్
హితముగఁ దాల్చి కుంకుమము హెచ్చుగ మేన నలంది ధన్యుల
ద్భుతరతిఖిన్నులై విడెము పుక్కిట నుంచి పృథుస్తనాంగనా
కృతపరిరంభులై కడు రమింతురు మేడలలోన సీతునన్. 97

తా. హేమంతమునందు దాని కనుగుణమైన యుపచారముగా వీర్యవృద్ధికరమైనదిగానఁ దొలుత నెయ్యి పాలు పెరుఁగుతోఁగూడిన మృష్టాన్నమును గుడిచి, పిదప మెయినిండ కుంకుమపూవు కస్తురి మొదలగువానితో మెదిచినకలపం బలందుకొని, పలువిధములైన సురతక్రీడలు సలిపి యలసిసొలసి, గబ్బిగుబ్బలాండ్ర బిగికౌఁగిలింతలం జొక్కి యెప్పుడు బాగాలు నములుచు నుండు సుకృతాత్ములు సుఖముగా గాలిలేని యింటిలోపలిభాగమునందు నిదురింతురు.

శ్లో॥ ప్రోద్యత్ప్రౌఢప్రియఙ్గుద్యుతిభృతి వికసత్కున్దమాద్యద్ద్విరేఫే
కాలే ప్రాలేయవాతప్రచలవిలసితోదారమన్దారదామ్ని ।
యేషాం నో కణ్ఠలగ్నా క్షణమపి తుహినక్షోదదక్షా మృగాక్షీ
తేషా మాయామయామా యమసదనసమా యామినీ యాతి
[యూనామ్॥

టీ. ప్రోద్య...భృతి-ప్రోద్యత్=పొడసూపుచున్న, ప్రౌఢ=ప్రవృద్ధములైన-చక్కఁగాఁ బెరిఁగియున్న, ప్రియఙ్గు=ప్రేంకణపుఁ జెట్లయొక్క, ద్యుతి=కాంతిని-అవి యెదుగుటచేఁ గలుగుశోభను, భృతి=తాల్చినదియు, విక...రేఫే-వికసత్=వికసించుచున్న, కుంద=మొల్లలచేత, మాద్యత్=మత్తిలుచున్న, ద్విరేఫే=తుమ్మెదలుగలదియు, ప్రాలేయ...దామ్ని-ప్రాలేయవాత=మంచుగాలిచేత, ప్రచల=కదలునదియు, కావున నే, వికసిత=వికసినవియు, ఉదార=రమ్యములైనవియు, నగు, మన్దారదామ్ని=మందారపుఁబూదండలు గలదియు, ('విలసితోదార మన్దారధామ్ని' అనుపాఠమున, మంచుగాలిచే చలించునవియు, కావున నే, విలసిత=ప్రకాశించుచున్నవియు, ఉదార=రమ్యములైనవియు నగు, మన్దారధామ్ని=వేపచెట్లకు స్థానమైనది-లేక సంతానకవృక్షములకుఁ బట్టు అయిన దని యర్థము. 'పారిభద్రో నిమ్బతరుర్మన్దారః పారిజాతకః' అని యమరుఁడు), ఇటువంటిదైన, కాలే=హేమంతసమయమునందు, యేషాం యూనాం=ఏవయసుకాండ్రకు, తుహిన...దక్షా-తుహిన=మంచును, క్షోద=నివారించుటయందు, దక్షా=సమర్థురాలైన ('తుహిన క్షోదరక్షా' అనుపాఠమున. తుహిన=మంచుయొక్క, క్షోద-పొడినుండి-తుంపరనుండి యనుట, రక్షా=రక్షించునదని యర్థము)-సుబ్బచన్నులు వెచ్చగానుండునుగాన వానిఁ గౌఁగిలించుటచే మంచుతుంపరలవలనిచలిని బోఁగొట్టఁజాలినదనుట, మృగాక్షీ=(లేడివంటికన్నులు గల) స్త్రీ, క్షణమపి=అల్పకాలమైనను, కణ్ఠలగ్నా=మెడయందుఁ దగులువడినది-మెడయం దాలింగనము చేయఁబడినది-లేక, తమమెడ నాలింగనము చేసినది, నో=కాదో, తేషాం=వారికి - ఆవయసుకాండ్రకు, ఆయామ యామా సతీ-ఆయామ=నిడివిచే విశిష్టములైన-నిడుదలైన యనుట, యామా సతీ=జాములు గలదియగుచు- విరహవేదనచే జాములు మిక్కిలి గడపరానంతదీర్ఘములుగాఁ దోఁచుచున్నట్టి యని భావము, యామినీ=రాత్రి, యమసదనసమా = యమలోకముతో సాటియైనదై - మిక్కిలియు దుఃఖావహమై యనుట, యాతి=జరుగుచున్నది-హేమంతపు రాత్రులయందు ప్రియాంగనాలింగనము లేక విరహవేదన సహించుట అతికష్టముగా నుండునుగాన నవి మిక్కిలి దుఃఖావహము లగునని భావము. 'ప్రోద్యత్ ప్రౌఢప్రియఙ్గు' ఇత్యాదులందు అనుప్రాసము. 'యమసదనసమా' అనుచో ఉపమ-ఈశబ్దార్థాలంకారములు రెంటికి సంసృష్టి.

స్రగ్ధర ॥ ప్రోద్యత్ప్రౌఢప్రియంగుస్ఫుటరుచియుతమై ఫుల్లమల్లీమతల్లీ
మాద్యత్సారంగమై హైమసపవనచలన్మంజుమందారభూజా
తద్యోతం బైన హేమంతమున విరహసంతప్తులౌ వారి కెల్లన్
సద్యామాయామరాత్రుల్ చనువిషయమస్థానసాదృశ్యమూర్తిన్॥

తా. దప్పముగాఁ బెరుఁగుచున్న ప్రేంకణపుఁ జెట్లకాంతిం దళుకొత్తుచుఁ, బూచుచున్న మొల్లలచే మత్తిలి చెలరేఁగుచున్న మొకరితుమ్మెదలచే నిమ్మనూపుచు,

మంచుగాలిసోఁకుటచే ఱేకులు ప్రిదిలి విరియుచున్న మందారంపుఁ బూదండలు మెండుకొనుచును, మంచుకారు రాఁగా, మెచ్చులుగులుకు గుబ్బచన్నుల వెచ్చందనముచే మంచుతుంపరలవలనిచలిని మానుపుచుఁ గలువకంటి యెవరిమెడఁ గౌఁగిలించుకొనదో యావయసుకాండ్రకు రాతిరి విరహవేదనచే మిక్కిలి నిడుదరై కడవరాక కడచిన దగును.

అవ. రెండుశ్లోకములచే శిశిరఋతువును వర్ణించుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ చుమ్బన్తో గణ్డభిత్తీ రలకవతిముఖే సీత్కృతా న్యాదధానాః
వక్షః సూత్కఞ్చుకేషు స్తనభరపులకోద్భేద మాపాదయన్తః।
ఊరూ నాకమ్పయన్తః పృథుజఘనతటా త్స్రంసయన్తోంశుకాని
వ్యక్తం కాన్తాజనానాం విటచరితభృతః శైశిరా వాన్తి వాతాః॥99

టీ. ఇట చలిగాడ్పులను విటకాండ్రతోఁ బోల్చుచున్నాఁడు. కాన్తా జనానాం=స్త్రీ సమూహములయొక్క, గణ్డభిత్తీః=చెక్కిలిగోడలయందు-గచ్చుగోడలవలె నిద్దముగా నున్నచెక్కులయందు-కపోలస్థలములం దనుట, చుమ్బన్తః=ముద్దిడుచును-సోఁకుచు నని వాతపరము, 'స్తననయనకపోలా శ్చుమ్బనస్థాన మాహుః' చన్నులు కన్నులు చెక్కిళులును ముద్దిడుచోటు లని రతిరహస్యము, కాఁబట్టియే, అలకవతి=అలకలుగల-కౌఁగిలించుటవలన నలకలు గ్రమ్మినట్టి యనుట, ముఖే=మొగమందు, సీత్కృతాని=సీత్కారములను- 'సీత్' అని యనుకరణశబ్దము, ఆదధానాః=చేయుచును-పుట్టించుచు ననుట-చలిచేతనని వాతపరముగాను మోవినొక్కుటచేతనని విటపరముగాను గ్రాహ్యము, వక్షఃసు=ఱొమ్ములు, ఉత్+కంచుకేషు సత్స్వపి=చక్కఁగా ముడివేయఁబడిన ఱవికలుగలవి యయ్యు-లేక, తీసివేయఁబడిన ఱవికలు గలవి యగుచుండఁగా ననియు నర్థము, స్తన...ద్భేదం - స్తనభర= బలితంపుఁజన్నులయందు, పులక=గగురుపొడుపుయొక్క, ఉద్భేదం= పొటమరించుటను. ఆపాదయన్తః=కలుగఁ జేయుచున్నవియును-చలిచేత నని వాతపక్షము-చేతఁ బుడుకుటచే నని విటపక్షము-ఇందు రోమాంచ మనుసాత్త్వికభావము చెప్పఁబడినది, ఊరూన్=తొడలను, ఆకమ్పయన్తః=కదల్చుచున్నవియును, రతికొఱకుఁ బట్టి కదల్చుచున్నాఁడని విటపరముగాను చలిచే వడఁకించుచున్నదియని వాతపరముగాను గ్రహించునది, పృథుజఘనతటాత్=విశాలమైన కటియొక్క ప్రదేశమునుండి-విరివియగు మొలనుండి యనుట, అంశుకాని=చీరలను-పోకముళ్ల ననుట, స్రంసయన్తః=జార్చుచున్నవియు, కాఁబట్టియే, వ్యక్తం=స్పష్టముగా, విటచరితభృతః= విటకాండ్రవంటినడవడి దాల్చినట్టి, శైశిరాః=శిశిరఋతువునఁ బుట్టిన, వాతాః=గాడ్పులు, వాన్తి = వీచుచున్నవి, 'అలకచుబుకగణ్డం నాసికాగ్రంచ చుమ్బన్, పునరుపహితసీత్కం తాలుజిహ్వాంచ భూయః। భరిత లిఖితనాభీమూలవక్షోరు

హారు, శ్లథయితధృతధైర్యః శ్లాథయిత్వాఘనీవీమ్' అని రతిరహస్యప్రోక్తము లైన గండాదిచుంబనముఖసీత్కారములు మొదలైనవిటలక్షణములు గలిగి యుండుటచే వాతములు విటచరితభృతము లనఁబడినవి. వలిదెమ్మెరలు చెలువల చెక్కులపై సోఁకి చలిచే వారి నుస్సురని సీత్కారముచేయించుచు, బొమ్మలందలి గుత్తంపుఁబవిక లుండియు గుబ్బచన్నులందు చలిచే గగురు పుట్టించుచు దానిచేత నే తొడల వణంకఁజేయుచు నావడఁకుచే మొలయందలి వలువ సడల్చుచు వీచు నని భావము. 'విటచరితభృతః' అనుచో ఉపమ. 'వ్యక్తమ్' అనుటచే నుత్ప్రేక్షయు వ్యంజితమై యాయుపమ కంగమగుచున్నది; కాన రెంటికి సంకరము.

ఉ. చెక్కులు ముద్దుగొంచు ముఖసీమను సీత్కృతులన్ ఘటించుచుం
జక్కనిచన్గవం బులకజాలములన్ మొలపించుచుం గటిం
జెక్కినచేలముం దొలఁగఁ జేయుచు శైశిరమారుతంబు లిం
పెక్కఁగఁ గాంత లందు విటకృత్యముఁ బూని చరించు నత్తఱిన్.

తా. శిశిరఋతువునందలి చలిగాడ్పులు విటకానివలెఁ జెలువలనిద్దంపుఁజెక్కుల ముద్దుగొనుచు, నుస్సురని సీత్కారముచేయించుచు, గుత్తంపుఁబవికలు దాల్చి యున్నను బిగిగుబ్బలయందు గగురు పుట్టించుచుఁ, దొడల నాడించుచు, మొలనుండి వలువ జార్చుచు వీచుచున్నవి.

శ్లో॥ కేశా నాకులయన్ దృశో ముకుళయన్ వాసో బలా దాక్షిప
న్నాతన్వ న్పులకోద్గమం ప్రకటయ న్నఙ్గేషు కమ్పం శనైః।
వారం వార ముదారసీత్కృతకృతో దన్తచ్ఛదాన్ పీడయన్
ప్రాయః శైశిర ఏష సమ్ప్రతి మరుత్కాన్తాసు కాన్తాయతే॥100

టీ. ఈశ్లోకమున శిశిరర్తువునందలిచలిగాలి నొకచెలువునితోఁ బోల్చి యుభయులకు నన్వయించునట్లు విశేషణముల నిబంధించినాఁడు. కేశాన్=వెండ్రుకలను, ఆకులయన్=చెల్లచెదరుగాఁ జేయుచు-వడిగా వీచుటచేత నని గాలిపరముగాను సురవడిగా రతిసలుపుటచేత నని కాంతునిపరముగాను గ్రాహ్యము, దృశః=కన్నులను, ముకుళయన్=మొగుడ్చుచు-బిట్టుగా సోఁకుటచేత నని గాలిపక్షము, సుఖపారవశ్యముచేత నని కాంతునిపక్షము, వాసః=కట్టినవలువను, బలాత్=బలవంతముగా, ఆక్షిపన్=ఈడ్చివైచుచు-ఒకట వీచువడిచేత ననియు మఱియొకట రమించుకోరిక చేత ననియుఁ దెలియునది, పులక ఉద్గమం=గగురుపొడుచుటను, ఆతన్వన్=కలిగించుచు-ఒకట చల్లగా సుడియుటచేత ననియు, నింకొకట శృంగారరస ముప్పతిల్లుటచేత ననియు గ్రాహ్యము, అఙ్గేషు=అవయవములయందు, శనైః=మెల్లగా, కంపం=వడఁకును, ('ఆవేగకమ్పం' అనుచో ఉద్వేగమువలన వడఁకునని యర్థము),

ప్రకటయన్ = బయలుపఱుచుచు - తెలుపుచు ననుట - ఈ రెండు విశేషణములం దును రోమాంచకంపము లనుసాత్త్వికములు చెప్పఁబడినవి, ఉదారసీత్కృతకృతః= మనోహరములైన సీత్కారములను జేయునట్టి, దన్తచ్ఛదాన్=పెదవులను-క్రింది పెదవులననుట, వారంవారం=మాటిమాటికి, పీడయన్=గాసి పఱుచుచు-ఒక్కట మిక్కుటంపుచలిచేతననియు మఱొక్కట మోవినొక్కుటచేత ననియు నూహ్యము, ఏషః=ఈ, శైశిరః=శిశిరర్తుసంబంధియైన, మరుత్=గాలి-చలిగాలియనుట, సమ్ప్రతి=ఇప్పుడు- ఈశిశిరఋతువునందనుట, ప్రాయః=తఱుచుగా, కాన్తాసు= స్త్రీలయందు -స్త్రీలవిషయమునందనుట, కాన్తాయతే=* కాంతునివలె నాచరించుచున్నది. కురులు గలంచుట, కన్నులు మొగిడించుట, వలువను వీడ్చుట మొదలగుకాంతునికృత్యము లుండుటచే కాంతునివలె నగు నని యర్థము. కురులను చెల్లచెదరు గావించుచు, బిట్టుగా సోఁకుటచే వారికన్నులు మూసికొనఁజేయుచును, వడిగా వీచి వారిమొలవలువ నూడ్చుచు, చల్లఁగాఁదాఁకుటచే గగురుపాడువఁజేయుచు, మిక్కుటంపుచలిచే నొడలెల్ల వడఁకునట్లు చేయుచుఁ బెదవులయందు నుస్సురని సీత్కారముఁ బుట్టించుచును వీచు నని భావము. ఇచట నలంకార ముపమ, 'ప్రాయః' అనుటచే నుత్ప్రేక్షయు వ్యంజితమై యంగ మగును గాన, రెంటికిని సంకరము.

ఉ. వేనలిఁ గ్రొన్ననల్ చెదరఁ ద్రిప్పుచుఁ గన్నుల మూయఁ జేయుచుం
బూనిన సీత్కృతుల్ నెఱపుచు మోవుల నొక్కుచు నీవు లూడ్చుచున్
జానుగ మేనులం బులకజాలముల న్వెలయించుచున్ బర
స్త్రీనికరంబునందుఁ బతిరీతిఁ జరించు సమీరుఁ డత్తఱిన్. 100

తా. శిశిరర్తువునందలి యీచలిగాలి చెలువలకురులఁ గలంచుచు, కన్నులు మూయించుచు, బలిమి మొలవలువ జార్చుచు, గగ్గురు పుట్టించుచు, మేనియం దెల్ల నల్లల్ల వడఁకుఁ గలిగించుచు, మాటికి నుస్సురని కెమ్మోవి సీత్కారము నొనరించునట్లు చేసి గాసిపఱుచుచు, వారియెడ నొకచెలువునివలె మెలంగుచున్నది.

ఇది శృంగారశతకమున ఋతువర్ణన మన్నది పంచమవింశతి.

---

చ. ఉపనిషదర్థవేద్య దురితోగ్రభవామయవైద్య వాసరా
ధిపశశివహ్నినేత్ర సముదీర్ణపవిత్రచరిత్ర సత్కృపా

---

* 'కథాభిః కమనీయాభిః కామ్యైర్భోగైశ్చ సర్వదా।ఉపచారైశ్చ రమయే ద్యః సకాంత ఇతీర్యతే' ఇంపైనకథలచేతను నిచ్చకువచ్చినభోగములచేతను దగినయుపచారములచేతను నెవ్వఁడెప్పుడును రమింపఁజేయునో వాఁడు కాంతుఁడనఁబడును.

స్నపితసమస్తలోక కరసంగతదివ్యపినాక భీకర
ద్విపసురవైరిభంజన సు-ధీజనరంజన నిర్గతాంజనా.

ఉత్సాహ. తారకాసురారిజనక దక్షయాగభంజనా
తారకాచలేంద్రవాస దానకల్పభూరుహా
తారకాధినాయకావతంస భవపయోధిసం
తారకాభిధాన యాతుధానవైరిసన్నుతా.

క. దండధరచండవిక్రమ
దండనపాండిత్యమండితప్రబలభుజా
దండ సుపర్వాలయకో
దండ యఖండప్రమోదతాండవలోలా.

---

## శృంగారశతకము – అధికశ్లోకములు.

అవ. ఈసంసారమునఁ బరోపకారమునకు మించినపుణ్యమును కలువకంటికి మించినసొంపును లేదనుచున్నాఁడు.

*శ్లో॥ భవన్తో వేదాన్తప్రణిహితధియా మాప్తగురవో
విచిత్రాలాపానాం వయమపి కవీనా మనుచరాః ।
తథాప్యేత ద్బ్రూమో నహి పరహితా త్పుణ్య మధికం
న చాస్మిన్ సంసారే కువలయదృశో రమ్య మపరమ్ ॥

టీ. భవన్తః=మీరు, వేదాన్తప్రణిహిత ధియాం=వేదాంతమునందు ఉంపఁబడినబుద్ధి గలవారలకు-వేదాంతవేత్తల కనుట, ఆప్తగురవః=ఆప్తులును ఆచార్యులును, అగుదురని శేషము-మీరు వేదాంతవేత్తలకును వేత్తలని భావము. వయమపి=మేమును, విచిత్ర ఆలాపానాం=(రసాలంకారాది వైచిత్రిచే) విచిత్రములైన భాషణములుగల, కవీనాం=కవులకు, అనుచరాః=అనువర్తించువారము, మిగుల గొప్పయగు బ్రహ్మవిచారముసేయు వేత్తలకును మీరు గురువులు, సామాన్యములై చదురుపలుకు లాడుకవులకు మేము శిష్యులము. మహనీయులైనట్టివారికిని గురువులైన మీకంటెను, సామాన్యులకును శిష్యులమైనమే మెంతయో తక్కువవార మనిభావము, తథాపి=అయినను - వస్తుతత్త్వ మెఱుంగుటయందు జ్ఞానసంపన్నులైనమీకంటెను మేమెంతయో తక్కువజ్ఞానము కలవారమైయున్నను అనుట,(ఈరెండువిషయములను

---

* ఈశ్లోకము పూర్వార్థమునందుమాత్రము భిన్నమై-పుటయందుఁ జూపఁబడె.

మాత్రము సత్యములైనవని మేముధీరముగా నొక్కి చెప్పఁగల మనుచున్నాఁడు. అవి యేవనఁగా,) అస్మిన్ సంసారే=ఈ సంసారమునందు, పరహితాత్=పరోపకారమునకంటె, అధికం=హెచ్చైన, పుణ్యం=పుణ్యము, నహి=లేదు, కువలయదృశః=కలువకంటికంటెను, అపరం=వేఱైన, రమ్యంచ=ఇంపైనవస్తువును, న=లేదు, అని, ఏతత్=దీనిని-ఈ రెంటిని, బ్రూమః=చెప్పుదుము. పరోపకారమునకు మించినపుణ్యము లేదు, కలువకంటికి మించినయింపు లేదు, అని మే మెంతయల్పజ్ఞానులమైనను మిము బోఁటి జ్ఞానసంపన్ను లొప్పుకొనకపోయినను దృఢముగా సత్యమని చాటిచెప్పఁగల మని భావము.

శా. చింతింపన్ నిగమాంతతత్పరులకుం జె న్నౌగురుల్ మీరు మే
మంతేవాసులమే కవీశ్వరుల క ట్లయ్యుం దెగం బల్కఁగాఁ
బంతం బూనితి మా పరోపకృతికిన్ బాగైనపుణ్యంబునుం
గాంతారత్నము మించుసొంపు నెదియుం గా దీమహాసంసృతిన్.

తా. మీరు వేదాంతవిదులకును గురువులు గాన మిక్కిలిజ్ఞానసంపన్నులైనను, మేమింపుగామాటలాడు కవిమాత్రులకును శిష్యులమే గాన నల్పజ్ఞానులమైనను 'సంసారమునందుల పరోపకారముకంటె మించినపుణ్యము లేదు; కలువకంటికంటె మించినసుఖము లేదు' అను నీరెండుమాత్రము సంసారదూరులగు మీరు కల్లలన్నను మేము సత్యములేయని సాహసించి చెప్పఁగలము.

అవ. తరుణిబిగికౌఁగిలింతలో రాత్రి పరుండి నిదురించువాఁడే ధన్యుఁ డనుచున్నాఁడు.

శ్లో॥ మత్తేభకుమ్భపరిణాహిని కుఙ్కుమార్ద్రే
కాన్తాపయోధరతటే రతిఖేదఖిన్నః ।
వక్షో నిధాయ భుజపఞ్జరమధ్యవర్తీ
ధన్యః క్షపాం క్షపయతి క్షణలబ్ధనిద్రః ॥

టీ. (యః=ఎవఁడు,) రతిఖేదఖిన్నః సన్=రతిసలుపుటవలని శ్రమచే బడలినవాఁడై, మత్తే...హిని—మత్త+ఇభ=మదపుటేనుఁగుయొక్క, కుంభ=కుంభస్థలమువలె, పరిణాహిని=వైశాల్యగలదియు, కుఙ్కుమ+ఆర్ద్రే=కుంకుమచేతఁ దడిసినదియు-కుంకుమ పూఁతగలదియును, అగు, కాన్తాపయోధరతటే=ప్రియురాలియొక్క చన్నుపట్టునందు, వక్షః=ఱొమ్మును, నిధాయ=ఉంచి, భుజ...వర్తీ—భుజపఞ్జర=ప్రియురాలి బుజము లనెడిపంజరముయొక్క, మధ్య=నడుమ, వర్తీ=వర్తించువాఁడై-పంజరంబునం దగులువడిన శుకాదు లెట్టు లిటునటుఁ బోవక యందే

తిరముగానుండునో యట్లేప్రియురాలు బుజములచేబిగ్గగాఁగిలించుకొనఁగా నాకౌఁగిటిలోఁ దగిలి యిటునటుఁబోవక తిరముగా నుండువాఁడై యనుట, కావున నే, క్షణలబ్ధనిద్రః=క్షణమాత్రములో పొందఁబడిన నిద్రగలవాఁడై, క్షపాం=రాత్రిని, క్షపయతి=కడపునో, (సః=వాఁడు) ధన్యః=ధన్యుఁడు. ఈసంసారమునందు గబ్బిసుబ్బలాఁడి బిగి కౌఁగిలిలోఁ బరుండి నిదురించుటయే పరమసుఖావహ మనిభావము. అలంకారము ఉపమ.

తే. కుంకుమార్ద్రింబు జితకుంభికుంభ మైన
కాంతకుచకుంభమున రతిశ్రాంతుఁ డగుచు
లీల నెదఁ గ్రుమ్మి బిగికౌఁగిలింతఁ జిక్కి
హాయిగాఁ గూర్కుచును బుచ్చు రేయి సుకృతి.

తా. మదపుటేనుంగు కుంభమువలె విజీవియై, కుంకుమపూఁతచేఁ బొంకమై, మురువుచూపు ముద్దరాలి గబ్బిసుబ్బలయందు ఱొమ్ము గ్రుమ్మి దానిబుజముల బిగికౌఁగిలింతలోఁ బరుండి హాయిగా నిదురగూరుకుచు రాతిరిని గడపువాఁడే కడుధన్యుఁడు.

అవ. ప్రియురాలిముక్కుఅము త్తియమును జంద్రునిఁగా నుత్ప్రేక్షించి వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ సుధామయోఽపి క్షయరోగశాన్త్యై
నాసాగ్రముక్తాఫలకచ్ఛలేన ।
అనఙ్గసఞ్జీవనదృష్టశక్తి
ర్ముఖామృతం తే పిబతీవ చన్ద్రః ॥

టీ. (హేనాయికే=ఓనాయికా, అని అధ్యాహార్యము), సుధామయః=అమృతమయుఁడైనవాఁడును, కావున నే, అనఙ్గ...శక్తిః-అఙ్గ=మన్మథునిని, సంజీవన=పుట్టించుటయందు, దృష్ట=చూడఁబడిన, శక్తిః=సామర్థ్యముగలవాఁడును-అమృతము బ్రతికించునట్టిదిగాన అమృతమయుఁడైన చంద్రుఁడును శివునిచే మృతుఁడైనమన్మథుని బ్రతికించువాఁడగుననుట-చంద్రుఁడు మన్మథోద్దీపకుఁడుగాన కాము నుద్దీపింపఁజేయువాఁడనిభావము, అపి=అయ్యును, చన్ద్రః=చంద్రుఁడు, క్షయరోగశాన్త్యై=తనకుఁ గలిగినక్షయరోగమును అడంచుటకు - కృష్ణపక్షమున క్షయించుట యిచట క్షయరోగముగాఁ జెప్పఁబడినదని సారస్యము గ్రహింపవలయును, నాసాగ్ర...చ్ఛలేన-నాస-అగ్ర=ముక్కుకొనయందలి, ముక్తాఫలక=ముక్కుఅ ముత్తెమనెడి, ఛలేన=నెపముచేత-ముక్కుఅము త్తెపురూపముఁ దాల్చినవాఁడై యనుట, తే=నీయొక్క, ముఖ + అమృతం=మొగమునందలియమృతమును,పిబతిఇవ=త్రాగుచున్నట్లున్నది,అని

తలఁచుచున్నానని శేషము. చంద్రుఁడు మన్మథునిఁగూడఁ బుట్టించునట్టి మహిమగల తనయందలి యమృతముచేతను దనక్షయము తీఱనందున నీముఖమునందలి యమృతమును ముక్కుఅను త్రైపు రూపముగా వచ్చి గ్రోలుచున్నాఁడని నాకుఁ దోఁచుచున్న దనియర్థము. అలంకారము, 'పిబతీవ' అనుచో ఉత్ప్రేక్ష 'నాసాగ్రముక్తా ఫలకచ్ఛలేన' అనుచోఁ గలయపహ్నుతిచే నీయుత్ప్రేక్ష యుత్థాపితమైనది.

తే. అమృతమయుఁ డయ్యుఁ జంద్రుఁ డనంగజీవ
నౌషధం బయ్యుఁ దనదుక్షయంబు మాన్ప
నలవి గామి ముక్కఅము త్రిక్రయంబు పేర
నబల! యానెడినో నీముఖామృతంబు.

తా. చంద్రుఁ డమృతమయుఁడు, కావుననే మన్మథునిఁగూడ నుజ్జీవింపఁ జేయుచున్నాఁడు. ఇట్టిమహిమగల యమృతమే తనయొద్దఁగలవాఁడయ్యును నతఁడు తన(కృష్ణపక్ష) క్షయమును గుదుర్చుకొనలేక దానిని నీముఖమునందలి యమృతముచేఁ బోఁగొట్టుటకు నీము త్రైపుముక్కుఅరూపముఁ దాల్చి దానిని గ్రోలుచున్నాఁ డేమో యని తలంచెద.

అవ. స్త్రీపురుషులు చిత్తము లొక్కటిగాఁ గలసి చేయుసంగమమే కామపురుషార్థఫలము గాని చిత్తము వేఱువేఱై యుండఁగాఁ జేయు సంగమము శవసంగమమువలె నిష్ఫలమే యగు ననుచున్నాఁడు.

శ్లో॥ ఏతత్కామఫలం లోకే, యద్ద్వయోరేకచిత్తతా।
అన్యచిత్తకృతే కామే, శవయోరివ సఙ్గమః॥

టీ. లోకే=లోకమునందు, ద్వయోః=స్త్రీపురుషు లిరువురయొక్క, ఏకచిత్తతా=ఒక్కమనస్సు గలిగియుండుట-మనసు లొక్కటిగాఁ గలసియుండుట, (ఇతి) యత్= అనునది యేదియో, ఏతత్=ఇదియే, కామఫలం=కామపురుషార్థమునకు ఫలము- కామపురుషార్థమును గైకొన్నందుల కదియే ఫల మనుట, అగునని శేషము. కామే=కామము, అన్యచిత్తకృతే సతి=ఇతరులయందలి మనస్సుతోఁ జేయఁబడినది -పురుషుఁడు మఱొక స్త్రీయందును స్త్రీమఱొక పురుషునియందును మనస్సునుంచి చేయునట్టిది యగుచుండఁగా, శవయోః=రెండుపీనుఁగులయొక్క, సఙ్గమ ఇవ=సంగమమువలె, అగును.

క. మానసము లిరువు రొక్కటి
గా నుంచియుఁ గూడు టదియ కామఫలం బౌం
డై నతెఱంగునఁ గూడినఁ
బీనుంగులకూడినట్లు పెరయుం గాదే.

తా. స్త్రీపురుషు లిరువురు నొండొరులమనంబు లొక్కటిగాఁ గలసి కావించు సంగమముచేతనే కామము సఫల మగునుగాని మనస్సులు మఱొక్కరియెడ నుంచి యొండొరులఁ గామించి చేయుసంగమము రెండుపీనుంగులసంగమములో సాటియగును.

అవ. రాగులయందుఁగాని విరాగులయందుగాని శివుఁడొక్కఁడే రాజిలుచున్నాఁడు గాని మఱెవ్వారు నట్లు గానేర రనుచున్నాఁడు.

శ్లో॥ ఏకో రాగిషు రాజతే ప్రియతమాదేహార్ధహారీ హరో
నీరాగేష్వపి యో విముక్తలలనాసఙ్గో న యస్మాత్పరః ।
దుర్వారస్మరబాణపన్నగవిషజ్వాలావలీఢో జనః
శేషః కామవిడమ్బితో హి విషయాన్ భోక్తుం న మోక్తుం క్షమః॥

టీ. ప్రియ...హారీ-ప్రియతమా=ప్రియురాలైన పార్వతియొక్క, దేహార్ధ=సగముదేహమును, హారీ=కయికొన్న వాఁడగు, హరః=శివుఁడు, ఏకః=ఒక్కఁడే, రాగిషు=విషయములందు రక్తిగలవారియందు-కాములయందనుట, రాజతే = ప్రకాశించుచున్నాఁడు- తనసగముదేహమునందే ప్రియురాలినెప్పుడుఁ దాల్చియుండునంతటిరాగి మఱియొకఁడు లేఁడుగాన నట్లు దాల్చియున్న శివుఁడొక్కఁడే రాగులలోనెల్ల మిక్కిలి యతిశయించినరాగి యని భావము. అతఁడు మఱియు నెట్టివాఁడనఁగా, యః=ఎవఁడు, విముక్త...సఙ్గః సన్-విముక్త=విడువఁబడిన, లలనాసఙ్గఃసన్=స్త్రీలతోడికూటువగలవాఁడై, నీరాగేషుఅపి=రాగము లేనివారియందును, (ఏకః రాజతే=ఒక్కఁడే రాజిలునో),యస్మాత్=ఎవనికంటె, పరః=అధికుఁడైనవాఁడు, న=లేదో, ఆశివుఁడు 'రాగిషు రాజతే' రాగులయందు రాజిలు నని పూర్వముతో నన్వయము. ప్రియురాలికి దేహము సగమునిచ్చి రాగులయందుఁ దానొక్కఁడే యగ్రగణ్యుఁడగును, పడఁతులతోడి సంగమునే మాని విరాగులయందు నొక్కఁడే యగ్రగణ్యుఁడగును, కాన రాగిత్వవిరాగిత్వములు రెంటియందును నతనికంటె నధికుఁడైనవాఁడు లేఁడనిభావము. దీనినే సహేతుకముగా నుపపాదించుచున్నాఁడు. దుర్వార...లీఢః=దుర్వార=వారింపరాని, స్మరబాణ=మన్మథుని బాణములనెడు, పన్నగ=సర్పములయొక్క విషజ్వాలా=విషంపుసెగలచేత-విషముతోఁగూడినవాలుకలచేతననుట, ఆవలీఢ=నాఁకఁబడిన, శేషః=తక్కిన, జనః=జనుఁడు, కామవిడమ్బితఃసన్=కామునిచేమోసపుచ్చఁబడినవాఁడగుచు, విషయాన్=స్త్రీలుమొదలగు విషయములను, భోక్తుం=(శివునివలె) ననుభవించుటకును, మోక్తుం=(శివునివలె)విడుచుటకును, క్షమః=సమర్థుఁడు, నహి= కాఁడుగదా, విషజ్వాలావలీఢుఁడు ఎట్లు భోగ్యవస్తువుల ననుభవింపలేఁడో యట్లెస్మరబాణ విషజ్వాలావలీఢుఁడును కామిన్యాదిభోగముల జక్కఁగా ననుభవింపలేఁడు; కామునిచే వంచితుఁడుగానవానిని విడువను లేఁడు. శివుఁడు స్మరబాణవిషావలీఢుఁడుగాఁడు గనుక నాభోగములను

జక్కఁగా ననుభవింపఁ గలవాఁడును కామునే జయించినవాఁడు గాన నా భోగ
ములను విడువఁజాలువాఁడును అగును. కనుక రాగులందును విరాగులందును నాతఁ
డొక్కఁడే యప్రతిముఖుఁడై వెలుఁగునుగాని తక్కినవారట్లుగారని భావము. శివుఁడు
పార్వతిని పెండ్లియాడకమునుపు తన్ను మోహింపఁజేయుటకు మన్మథుఁడు పూనినను
వానింగాల్చుటంజేసి విముక్తలలనాసంగుండై విరాగులందు వెలింగె ననియుఁ, పా
ర్వతితపంబునకుఁ దుష్టిం జెందినవాఁడై తద్వియోగభంగము గలుగుననుభీతిచేత తన
సగముదేహముగా నాదేవిం దాల్చినవాఁడై రాగులందును వెలింగె ననియు తెలియు
నది. ప్రియతమాదేహార్ధహారిత్వముచేతను విముక్తలలనాసంగత్వముచేతను రాగివిరా
గులయందు రాజిల్లుట యనుపదార్థము సమర్థితము. కాన అలం. కావ్యలింగము.
స్మరబాణవిషాగ్నిజ్వాలావలీఢత్వముచేతను కామవిడంబితత్వముచేతను విషయభుక్తి
ముక్తులం దక్షమత్వము సమర్థింపఁబడిన యిచటను, మఱొక కావ్యలింగము. ఈ
కావ్యలింగము పూర్వకావ్యలింగముచే సమర్థితము గాన రెంటికిని సంకరము.

శా. రామం గూడియు సాముమే నొసఁగియున్ రాజిల్లెఁ దా రాగులన్
రామాసంగవిదూరుఁడై పరముఁడై రాజిల్లె నీరాగులం
గామారాతి యొకండ యక్కరణి భోగం బూనఁగా మానఁగాఁ
గామక్రూరశరాహిదష్టుఁ డగు నేకష్టుండుఁ దా నేర్చునే.

తా. శివుఁడు ప్రియురాలికిఁ దనసగదేహము నిచ్చి రాగులందును, నంతకు
మున్ను లలనాసంగము నే వీడియుండి విరాగులందును దా నొక్కండ యతిశయించి
వెలుంగుచుఁ దనకంటె మించినవాఁడు లేనివాఁడయ్యె. ఇది యిట్లేయగును. ఏలన
నతఁడుతప్ప తక్కినజనుఁడెవ్వఁడుగాని మరుతూపులచే విషమునోఁకినట్లు తడఁబడి
విషయముల నతనివలె ననుభవింపను జాలఁడు; కామునికి లోనై యుండుటచే నతని
వలె విషయములను విడువనుం జాలఁడు. కాఁబట్టి రాగివిరాగు లుభయులందును
విషయభుక్తిముక్తులంబట్టి శివుఁ డొక్కఁడే యతిశయిల్లును.

అవ. స్త్రీలభ్రూవిక్షేపము మిక్కిలి యపకారము చేయునది
గాన దుర్జనులతోఁ బోల్చి వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అజితాత్మసు సంబద్ధః, సమాధికృతచాపలః।
భుజఙ్గకుటిలః స్తబ్ధో, భ్రూవిక్షేపః ఖలాయతే ॥

టీ. అజిత ఆత్మసు=జయింపనిమనస్సు గలవారియందు-జితేంద్రియులు కాని
వారియెడ ననుట, సంబద్ధః=సంబంధించినది-జితేంద్రియులు కానివారిని మరులు
కొలుపునదని భ్రూవిక్షేపపరము, జితేంద్రియులుకానివారితోఁ గూడియుండువాఁడని
ఖలపరము, సమాధి...చాపలః-సమ్ అధి=చక్కఁగా మనస్సును బీడించుటయందు,

కృత=చేయఁబడిన, చాపలః=ఆసక్తిగలది అని భ్రూవిక్షేపపరము-సమాధి=చిత్తము యొక్క ఐకాగ్ర్యమునందు-మనస్సు ఒక్కదానియందే స్థిరముగ నెలకొనియుండుఁవిషయమున, కృత=చేయఁబడిన, చాపలః=చాంచల్యము గలవాఁడు-ఒక్కటను దిరముగా నెలకొనక చలించువాఁడని ఖలపరము, భుజఙ్గకుటిలః=సర్పమువలె వంకరయైనదని భ్రూవిక్షేపపక్షము-విటకానివలె కుటిలుఁడని ఖలపక్షము, స్తబ్ధః=స్థిరమైనది-ఉభయపక్షమున గర్వించినవాఁడని యర్థము, ఇట్టి, భ్రూవిక్షేపః=కనుబొమ త్రిప్పు, ఖలాయతే=ఖలునివలె నాచరించుచున్నది. జితేంద్రియులు కానివారిని మరులుగొలుపుచు మనస్సును మిక్కిలియుఁ బీడించుచు, సర్పమువలె వక్రముగాఁ బొలయుచు భ్రూవిక్షేప ముండుఁనని భావము. 'ఖలాయతే' అనుచో నుపమ. ఇది 'సమాధికృతచాపల' ఇత్యాదివిశేషణములందలిశ్లేషచే అనుప్రాణిత మైనది.

క. అజితాత్మసమాగతమును
భుజంగకుటిలంబు స్తబ్ధభూతంబు సమా
ధిజనితచాపలమును నై
కుజనుంబలె నొప్పు బొమలకొనలుకుంద్రిప్పుల్.

తా. కన్బొమత్రిప్పు, మనస్సు జయింపనివారితో సంబంధించి యుండును; సమాధి (మనఃపీడ, మనోలయము) యందు చాపలము కలిగియుండును; భుజంగము (సర్పము, విటుని) వలె కుటిలముగా (వంకరగా, కపటముగా) వర్తించును; స్తబ్ధమై, (స్థిరమై, గర్వితమై) యుండును; కాఁబట్టి యది దుర్జనునివలె నడచుకొనుచున్నది.

భర్తృహరిసుభాషితము శృంగారశతకమునందలి
యధికశ్లోకములు సంపూర్ణము.



# భర్తృహరిసుభాషితము - వైరాగ్యశతకము.

## తృష్ణాదూషణము.

---

శ్లో॥చూడోత్తంసితచారుచన్ద్రకలికాచఞ్చచ్ఛిఖాభాస్వరో
లీలాదగ్ధవిలోలకామశలభః శ్రేయోదశాగ్రే స్ఫురన్ ।
అన్తఃస్ఫూర్జదపారమోహతిమిరప్రాగ్భార ముచ్చాటయం
శ్చేతఃసద్మని యోగినాం విజయతే జ్ఞానప్రదీపో హరః ॥ 1

టీ. ఇందు శివుని నొకదీపముగా రూపించి వర్ణించుచున్నాఁడు. చూడో... భాస్వరః-చూడా=సిగయందు, ఉత్తంసిత=భూషణముగాఁజేయఁబడిన, చారు=మనోహరమైన, చన్ద్రకలికా=చంద్రకల యనెడి, చఞ్చత్=చలించుచున్న-అల్లలాడుచున్న, శిఖా=సెగచేత, భాస్వరః=ప్రకాశించునదియు, లీలా...శలభః-లీలా=విలాసముచేత- అనాయాసముగాననుట, దగ్ధ=కాల్పఁబడిన, విలోల=చపలమైన, కామ=మన్మథుఁడనెడి, శలభః=మిడుతగలదియు, శ్రేయో...గ్రే- శ్రేయః=శుభమనెడు, దశా=వత్తియొక్క, అగ్రే=కొనయందు, స్ఫురన్=ప్రకాశించుచున్నదియు-నిచట శ్రేయఃపరముగా 'అగ్రే' అనుటకు 'ముందు' అనియర్థము, శుభముకలుగుటకు ముందు స్ఫురించువాఁడనుట-అతఁడు స్ఫురించినతోడనే శుభముకలుగుననిభావము,అన్తః... ప్రాగ్భారం-అన్తః=లోపల-హృదయమునం దనుట, స్ఫూర్జత్=విజృంభించుచున్న, అపార=మేరలేని, మోహ=అజ్ఞానమనెడి, తిమిర=చీఁకటియొక్క, ప్రాగ్భార=అతిశయమును, ఉచ్చాటయన్=పోఁగొట్టునదియును అయిన, జ్ఞానప్రదీపః=జ్ఞానమనెడి దీపము-దీపమువలె స్వయంప్రకాశమైయున్న జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడనుట, అగు, హరః=శివుఁడు-శివుఁడనెడి జ్ఞానమయదీపమనుట, యోగినాం=సనకాది యోగులయొక్క, చేతఃసద్మని=మనస్సుఅనెడిగృహమునందు, విజయతే=సర్వోత్కృష్టుఁడై వర్తించును. ఒకదీపము జ్వాలకలదై, తనయందుఁబడినమిడుతల నవలీలఁ గాల్చుచు, వత్తికొనయందు వెలుఁగుచు, చీఁకటినెల్లఁ బోఁగొట్టుచు, గృహములందు ఎట్లు మిక్కిలి విలసిల్లునో యట్లే శివుఁ డనెడిజ్ఞానాత్మకమైనదీపము, చంద్రుఁ డను జ్వాలగలదియై, మన్మథుఁ డనుమిడుతనుగాల్చి, శుభమనెడివత్తిమొనయందు వెలుఁగుచు (శుభప్రాప్తికిఁ బూర్వము స్ఫురించుచు ననుట), అజ్ఞాన మనెడిచీఁకటిని బోఁగొట్టుచు, యోగులమనస్సులనెడి గృహములందు సర్వాతిశయమై విలసిల్లునని యర్థము. ఇట చంద్రుఁడనక చంద్రకలికయనుటచేతనే దీపశిఖగా రూపించుట పొసఁగుచున్నది. శిఖాశబ్దమునకు జ్వాలయుఅగ్రమును అర్థములగునుగాన తలయందుఁ దాల్పఁ

బడినచంద్రకలిక హరుఁ డనుదీపమునకు శిఖాగ్రముగా నున్నదను నర్థవిశేషము స్ఫురించెడి. తలయందు అగ్నిజ్వాలవలెఁ బ్రకాశించుచంద్రరేఖం దాల్చి, అగ్ని మిడుత నెట్లో యట్లే యనాయాసముగాఁ గామునిం గాల్చి, శుభావహముగా స్ఫురించుచు, భక్తజనాంతఃకరణములయందుఁ జీఁకటివలెఁ గ్రమ్ముకొన్నయజ్ఞానమును దొలఁగించుచు, నిండ్లయం దతిస్వస్థముగా వసించునట్లు యోగిజనహృదయారవిందంబుల నెలకొని, జ్ఞానస్వరూపుఁడగు నీశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిల్లునని భావము. తొలుత, 'చూడోత్తంసిత' అనువాక్యమున చంద్రపదమును గ్రహించుటచే భక్తతాపహారి యనియు, 'లీలాదగ్ధ' అనువాక్యమున 'కామశలభ' యనుపదము గ్రహించుటచే మహాశత్రువుల నేని యవలీల సంహరించువాఁ డనియు నర్థములు లభించెడిని. అలం. సావయవరూపకము.

క. శ్రీరమణాధృతమృదంగగ
ధీరధిమింధిమినినాదభేదక్రమయో
గ్యారంభగుంభనటన
శ్రీరంజితసుఖనివేశ శ్రీసోమేశా.

చ. కలితవతంసితేందుకలికాశిఖచే విలసిల్లి చిత్తభూ
శలభము నుగ్గుసేసి శుభసారదశాగ్రమునన్ వెలుంగుచున్
బలవదపారమోహభరబాధతమోహరణంబు సేయుచుం
దెలివి వెలుంగు పొల్చు శివదేవుఁడు యోగిమనోగృహంబులన్. 1

తా. హరుం డనుజ్ఞానమయదీపము, తలపువ్వుగాఁ దాల్చినచందురుకళ యనెడిసెగకొన గలిగి, యవలీల మరుఁ డనుమిడుతం గాల్చి, మంగళమనెడి వత్తిమొనను వెలుఁగుచు, లోనఁ గడలుకొనునజ్ఞాన మను చీఁకటిపెల్లును దూలించుచు, సనకాది యోగులమనంబు లనెడి యిండ్లయందు సర్వోత్కృష్టుఁడై వర్తిలుచున్నాఁడు.

అవ. వైరాగ్యమునకు విరుద్ధమైనది రాగము. రాగమునకు మూలము తృష్ణ. ఇట్టితృష్ణను నిరసింపనియెడ వైరాగ్యము సిద్ధింపదు గాన నది సిద్ధించుటకై దానికి మొదటిశత్రువైనతృష్ణను రాఁగల తొమ్మిదిశ్లోకముల దూషించుచున్నాఁడు. అందుఁ దొలుత తృష్ణచేఁ దాను జేసినకార్యములును బడినకష్టములును దెలుపుచు దానిం బేర్కొని మూఁడుశ్లోకముల దూషించుచున్నాఁడు.

శ్లో॥ భ్రాన్తం దేశ మనేకదుర్గవిషమం ప్రాప్తం న కిఞ్చిత్ఫలం
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం సేవా కృతా నిష్ఫలా ।

భుక్తం మానవివర్జితం పరగృహేష్వాశఙ్కయా కాకవ
త్తృష్ణే జృమ్భసి పాపకర్మనిరతే నాద్యాపి సన్తుష్యసి ॥ 2

టీ. అనేక... విషమం-అనేకదుర్గ= పెక్కుదుర్గములచేత -కొండలు చెట్లు జలములు మొదలైనవానిచేఁ బోవరానిప్రదేశములచేత ననుట, విషమం = వికటమైన, దేశం ప్రతి = దేశమునుగూర్చి - దేశమునం దనుట, భ్రాన్తం = (నాచే) తిరుగఁబడినది- నేను తిరిగితిననుట, ఇట్లు తిరిగియు, కిఞ్చిత్=కొంచెమైనను, ఫలం= ఫలము, ప్రాప్తంన=పొందఁబడినదికాదు-మిక్కిలి ఫలముఁ గోరి పోరానిదుర్గములకుఁ బోయినను ఆవంతఫలమును గలుగదయ్యెనని యర్థము. ఉచితం=తగిన-నాకుండఁదగినట్టియనుట, జాతికుల అభిమానం=జాతియందును కులమునందునుగల యభిమానము-నాగొప్పజాతిని మంచికులమునుబట్టి నాకుండఁదగినయభిమాన మనుట, త్యక్త్వా= విడిచి, నిష్ఫలా=ఫలశూన్యమైన, సేవా=కొలువు-ధనవంతులఁగొలుచుట, కృతా= చేయఁబడినది-రెంటను గష్టమే దక్కినది గాని ఫలమేమియు లేదయ్యె నని భావము. మానవివర్జితంయథాతథా=మానములేనట్టుగా-సరిగౌరవమును వదలియనుట, పరగృహేషు=ఇతరులయిండ్లను, కాకవత్=కాకివలె, ఆశఙ్కయా=జంకుచేత, భుక్తం= భుజింపఁబడినది-కాకి తలఁచినపుడు తన్నుఁ దఱిమివేయుదు రనుజంకుచే నెట్లు నుడుచునోయట్లె నేనును గుడిచితిననుట-అవమానములో నొరులు పెట్టినపిండము తింటి నని భావము. ఇన్నికష్టములుపడియు, పాపకర్మనిరతే=పాపకార్యములయందు ఆసక్తి గలిగియున్న, తృష్ణే=విషయరాగమా - విషయములందలిపేరాసా, జృమ్భసి=చెలరేఁగుచున్నావు-పయింబయి పెరుఁగుచు నేయున్నావు కాని, అద్యాపి=ఇంకను-ఇట్టి కష్టములుపడిచియు, నసంతుష్యసి = సంతోషమునొందవు - తృప్తినొంది యుడుగ వనుట, ఇంతటితోఁ దృప్తినొందక యింకను పాపకర్మములు చేయ నొడిఁగట్టియున్నా వని నాకుఁ దోఁచుచున్న దని భావము.

చ. విసిగితి దుర్గదుర్విషయదేవిభ్రమయుక్తిఁ గులాభిమానముం
బస చెడ సేవఁ జేసితి విశేషన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితిఁ బ్రయత్నము నిష్ఫలమై నశించె సం
తసపడ వుగ్రకర్మపిశునత్వముఁ జూపెద వాశ యేటికిన్. 2

తా. ఎక్కరానికొండలు దాఁటరానియేఱులు మున్నగుదుర్గములచే నొడుదొడుకై యున్నదేశ మంతయుఁ దిరిగితినిగాని యావంతఫలము నొందనైతి. నాజాతి గొప్పదియయ్యు, వంశము మేలైనదయ్యు వానినిగూడఁబాటింపక ధనవంతులకొలువుఁ గొలిచి యేలాభమును బడయనైతి. మానమువిడిచి పరులయిండ్లఁ గాకివలె తలఁచి నంత నే తఱిమివైతురోయని జంకుకొంకులతోఁ గుడిచితిని. ఓతృష్ణా! నన్నిన్నిపాట్లు

పఱచితివి. ఇంతటితోనైన నుడుగక పయింబయిం బెరుఁగుచు తృప్తిపడకున్నావు. ఇంకను నేనుష్కర్మమున కొడిగట్టుదునో తెలియరాదు.

శ్లో॥ ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం ధ్మాతా గిరే ర్ధాతవో
నిస్తీర్ణః సరితాంపతి ర్నృపతయో యత్నేన సన్తోషితాః ।
మన్త్రారాధనతత్పరేణ మనసా నీతాః శ్మశానే నిశాః
ప్రాప్తః కాణవరాటకోఽపి నమయా తృష్ణే సకామా భవ ॥ ౩

టీ. నిధిశఙ్కయా=పాఁతు ఉన్నదనుభ్రమచేత, క్షితితలం=భూప్రదేశము, ఉత్ఖాతం=పెల్లగింపఁబడినది-త్రవ్వఁబడినదనుట, అప్పటికిని ఏమియు లభింపలేదని యర్థము, గిరేః ధాతవః=కొండయొక్కమనశ్శిలాది *ధాతువులు, ధ్మాతాః=ఊఁదఁబడినవి-అవి బంగారమగునని తలఁచి మూసయందు తగినమూలికలతోఁ గూడఁ జేర్చియుంచి నిప్పునఁబెట్టి కాఁచి యూఁదఁబడినవనుట, అప్పటికిని ఏమియుఁ గలుగలేదనియర్థము, సరితాంపతిః=(నదులకు మగఁడైన) సముద్రము, నిస్తీర్ణః=దాఁటఁబడినది-ద్వీపాంతరములందు వర్తకము సేసి బహుధనము సంపాదించెదనని యాత్రికుఁడనై సముద్రమును దాఁటినాఁడ నని భావము, నృపతయః=రాజులును, యత్నేన=పూనికచే-వారియిష్టము ననుసరించి కొలుచు ప్రయత్నముచే ననుట, సన్తోషితాః=సంతోషపెట్టఁబడిరి, మన్త్ర ఆరాధన తత్పరేణ=మంత్రములను జపించుటయందలి యాసక్తి గల, మనసా=మనస్సుచేత, శ్మశానే=ప్రేతభూమియందు, నిశాః=రాత్రులు, నీతాః=కడపఁబడినవి-భూతప్రేతపిశాచాదులవలనిభయమును గణింపక నిధిమొదలైనవానిని జూపి యనుగ్రహించునట్టిదేవతలు ప్రసన్నులగునట్లు చేయుటకు వలయుమంత్రములను జపించుచు రాత్రులు ప్రేతభూమియందుఁ గడపితిననుట, కాణవరాటకోఽపి=గ్రుడ్డిగవ్వయైనను-ఇఁక ధనమును జెప్ప నేల యనుట, మయా=నాచేత, ప్రాప్తః న=పొందఁబడినదికాదు, కాఁబట్టి, తృష్ణే=విషయరాగమా, సకామా=ఈడేఱినకోరికగలదానవు, భవ=కమ్ము-నీవాసపెట్టిచూపినయర్థము లేవియుఁ గలుగమిచే నీ విఁకనైనఁ దలంపులన్నియు నీడేఁగూడినట్లుగాఁ దలఁచుకొని యూఱకుండుమనుట. ('తృష్ణేఽధునాముంచమామ్' అనుపాఠమున తృష్ణా! ఇప్పుడు నన్ను విడిచిపెట్టు మని యర్థము. ఇంతవఱకు నీవలనిలాభము చాలు నిఁకనీజోలి నాకువలదని భావము), అన

* 'సువర్ణరూప్యతామ్రాశ్మ హరితాలమనఃశిలాః। గైరికాఞ్జనకాశ్మీర లోహసీసాశ్చహిఙ్గులాః॥ గన్ధకాభ్రక మిత్యాద్యా ధాతవో గిరిసంభవాః' అని సువర్ణరజతాదులు గైరికధాతువు లగును. బంగారుదొరకుటకై వానినూఁదినాఁడని యిచ్చటఁ దెలియునది. అయిన నేమియు దొరకలేదనుటచే బంగారు వెండి ధాతువులు గాక తక్కినధాతువులనే యూఁదినాఁ డని యూహ్యము.

ర్థముల నిట్లుగలిగించుతృష్ణనుబట్టి వ్యర్థముగాఁ బాటుపడి ప్రయాసయే దక్కినదికాని కోరిక యీడేఱినదిగాదు. కాఁబట్టి వానిని మొదలంట మానవలయు నని భావము.

చ. నిధి యనుశంక భూతలము ♦ నిచ్చలుఁ ద్రవ్వితి నావచే మహో
దధిఁ దరియించితిన్ శిఖరి♦ధాతువు లూఁదితి రాజుఁ గొల్చితిన్
వ్యథగొని ఘోరమంత్రజప ♦ మర్థి నొనర్చితి గవ్వ యైన నే
విధమునఁ బొందనైతిఁ గద♦వే ముద మందఁ గదే దురాశరో. 3

తా. పాఁతు దొరకునని పుడమిని బెల్లగించితిని. బంగారుమొదలైనవి చిక్కునని కొండధాతువులనెల్ల మూసనుంచి యగ్గిలోఁ బెట్టి యూఁదితిని. దీవులకుఁబోయి వర్తకముసేసి యవ్వారిగా గడనసేయుదునని యోడలెక్కి సముద్రములోఁదను గడచి పోయితిని. రాజులను వారిమనస్సునకు వచ్చునట్లెల్లఁ గొలిచి సంతోషపెట్టితిని. లబ్బి మొదలైనవి చూపునని దేవతలను వశము చేసికొనుటకై తత్పరములైనమంత్రములను జపించుచు ప్రేతభూమియందుఁ బెక్కురాత్రు లుంటిని. ఇన్నిపాటులుపడియు నొక గ్రుడ్డిగవ్వయు నాకు దొరకినదికాదు. తృష్ణా! ఇఁకనైన నీకోరికలెల్ల నీడేఱినట్లు తలఁచుకొని యూఱడిలుమా.

శ్లో॥ ఖలోల్లాపాః సోఢాః కథ మపి తదారాధనపరై
ర్నిగృహ్యాన్తర్బాష్పం హసిత మపి శూన్యేన మనసా।
కృతో విత్తస్తమ్భప్రతిహతధియా మఞ్జలి రపి
త్వ మాశే మోఘాశే కి మపర మతో నర్తయసి మామ్॥ 4

టీ. ఖల ఉల్లాపాః=దుర్జనులయొక్క చెడుమాటలు, తత్ ఆరాధన పరైః= వారిని మనసునకు వచ్చునట్లు గొలుచుటయందు తత్పరులైన, (అస్మాభిః=మాచేత అని శేషము), కథమపి=ఎట్లో-మిక్కిలికష్టములో ననుట, సోఢాః=ఓర్చుకొనఁబడి నవి-ఓర్వకున్న కార్యభంగము కలుగునని వెఱచి ఓర్వఁబడినవనుట, ఆపరుసంపుమా టల నూరక యోర్చుకొనులేకాదు, అన్తః=లోపలనే, బాష్పం=కన్నీటిని, నిగృహ్య=అడంచి- ఆవాఁడిమాటలను వినుటచేఁ బొడమినయశ్రుజలమును బయటికిరానీక లోపలనే యడంచి యనుట, శూన్యేన=వట్టిదియైన-నవ్వునుబుట్టించునట్టి భావములేన ట్టిదైన యనుట,మనసా=మనస్సులో, హసితమపి=నవ్వును,('కృతః=చేయఁబడినది' అని శేషము)-నవ్వుపుట్టించువిషయమేదైన మనస్సునందుండిననే నవ్వుకలుగును,అట్టి విషయమేదియులేక మనస్సు శూన్యముగానుండినను 'వీరలు మన మెంతనుడుసులాడి నను సంతోషముతో నున్నవారుగాని విషాదమొందరు. కాఁబట్టి వీరు మిక్కిలియు విశ్వాసపాత్రులు' అని యాఖలులకుఁ దోఁచునట్లుగా లేనినవ్వు తెచ్చుకొని నవ్వను గూడ నవ్వితిమనిభావము. విత్త...ధియాం-విత్త=ద్రవ్యముచేనైన, స్తంభ=గ్రాను పాటుచే - జడభావముచే-గర్వముచేలెననుట, ప్రతిహత=కొట్టఁబడిన, ధియాం=బుద్ధి గలవారికి-ద్రవ్యగర్వముచే బుద్ధిచెడి మాయెడ నడచుకొనువారి కనుట, అఞ్జలిరపి=

కేలుమోడ్పును, కృతః=చేయఁబడినది. ఇంతచేసియు నేమియులభింపదయ్యెనని భావము. ('కృతశ్చిత్తస్తంభః ప్రతిహతధియాం' అనుచో, చిత్తస్తంభః=మనస్సుయొక్క ప్రమానుపాటు-మనస్సునం దేవికారము కలిగినను వెలికిఁ దోఁపనీక మాటు సేయుట యనుట, కృతః= చేయఁబడినది, ప్రతిహతధియాం-ప్రతిహత=కొట్టఁబడిన-అనఁగా చెడిన, ధియాం=బుద్ధిగలవారికి, అఞ్జలిరపి=కేలుమోడ్పును, కృతః=చేయఁబడినది-ఈపాఠమందే 'ప్రహసితధియాం' అనుచో మిక్కిలి నవ్వునందు బుద్ధి గలవారికి-మిక్కిలియు మమ్ముఁజూచి నవ్వునట్టివారికినని యర్థము.) కాఁబట్టి, మోఘ ఆశే=వ్యర్థమైనమనోరథముగల-కోరిక యీతేటనట్టియనుట, ఆశే=తృష్ణా, త్వం=నీవు, మాం=నన్ను, అతః=దీనికంటెను-దురుసుల కోర్చుట మొదలుగా నాడించినయాటల కంటె, అపరం=వేఱైనదానిని-వేఱైనయాటను, కిం=దేనిని, నర్తయసి=ఆడించెద వు-ఇంతవఱ కాడించినయీయాటలేకాక మఱివే ఱేయాట నాడించెదవనుట. ఏ యాటయు లేదని భావము-ఇంతవఱ కాడించిన యాటలకంటె నీచమైనవి శేమింజేసియుఁ, నింక నన్నేమియాడించినను నీపూనిక వ్యర్థమేగావునను నన్నాడింపవలసిన దింతకంటె మఱేదియు లేదని భావము.

చ. పలువలు పల్కుమాట లొకభంగి సహించితి బాష్పవారి లో
పలనె హరించి శూన్య మగుభావమునన్ వెడనవ్వు నవ్వితిం
బొలు పఱి విత్తజాడ్యహతబుద్ధుల కంజలి చేసితిం గటా
తలఁకక యింక నేపనికిఁ దార్చెదు నన్ను దురాశ నీ విటన్, 4

తా. దుష్టులను వారిమనస్సునకు వచ్చునట్లు కొలిచి వా రాడినదురుసుల నెల్ల నెట్లో సైరించుకొంటిమి. ఆ వాఁడిమాటలకుఁ గన్నులనీరు గ్రమ్మఁబోవఁగా దానిని లోపలనే యడంచి రిత్తమనస్సుతో లేనినవ్వు తెచ్చుకొని వారు మమ్ము మంచివారని మెచ్చుకొనుటకై నవ్వితిమి. ద్రవ్యగర్వముచే వివేకముమాలి మాయెడల నడచుకొన్న వారికిని జేయెత్తి మ్రొక్కిలిమి. ఓతృష్ణా! నీవు మాకుఁ గోపము కలిగింపవలయు నని యెన్నిపాటులు పడినను నీకోరిక యీడేఱినదిగాదు. ఇంతవఱకు నన్నాడించినివాని కంటె మఱియేమి యాడింపఁగలవు? అట్లాడించియు దానివలన నీకుఁ బసయేమి?

అవ. తృష్ణయొక్క చెడు నయ్యాటముచేతనే మిక్కిలియూఁ దగనికార్యముకూడఁ జేయఁబడిన దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అమీషాం ప్రాణానాం తులితబిసినీపత్రపయసాం
కృతే కిం నాస్మాభి ర్విగళితవివేకై ర్వ్యవసితమ్ ।
య దాఢ్యానా మగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞమనసాం
కృతం వీతవ్రీడై ర్నిజగుణకథాపాతక మపి ॥ 5

టీ. తులిత...పయసాం-తులిత=సమానముగాఁ జేయఁబడిన, బిసినీపత్ర=తామరాకునందలి, పయసాం=నీరుగల-తామరాకునందలి నీటితో సమానమైనయనుట-అతిభంగురమైనయని భావము, అమీషాం=ఈ-ఇట్లు మిక్కిలి నమ్మరానియనుట, ప్రాణానాంకృతే=ప్రాణములకొఱకు-ప్రాణముల రక్షించుటకైయనుట, విగళితవివేకైః=భ్రష్టమైనతెలివిగల-తెలివి మాలినట్టియనుట, అస్మాభిః=మాచేత, కిం=ఏది-ఏదుష్కర్మమనుట, నవ్యవసితం=పూనఁబడినదిగాదు-అన్ని దుష్కార్యములును పూనఁబడినవేయనుట, యత్=దేనిచేత- ఏలనఁగా ననుట, ద్రవి...నసాం-ద్రవిణమద=ధనగర్వముచేత, నిస్సంజ్ఞ=సంజ్ఞ లేని-మ్రానుపడినయనుట, మనసాం=మనస్సుగల-విమర్శ చేయలేనట్టియంతఃకరణములుగల యనుట, ఆఢ్యానాం=ధనపరిపూర్ణులైనవారియొక్క, అగ్రే=మ్రోల, వీతవ్రీడైః=పోయినలజ్జగల లజ్జమాలిన, మాచేతనని యధ్యాహార్యము, నిజ...పాతకమపి-నిజగుణకథా=సొంతగుణములను చెప్పికొనుటయనెడి-స్వవిద్యావినయాదిగుణములను బొగడికొనుటయను, పాతకమపి=పాపముకూడ, కృతం=చేయఁబడినది.'ఆత్మప్రశంసాపరగర్హణమివ;తన్నుఁబొగడికొనుట పరులనునిందించుటవలె''ఆత్మప్రశంసామరణం పరనిన్దాతథైవచ; తన్నుఁ బొగడికొనుటయు నట్లే పరులనిందించుటయుమరణము' అనువచనములంబట్టితనగుణములఁబొగడుట నిషిద్ధము.అది నరకమును గలిగించునట్టిదిగానపాతకమునగును. ఇట్టిపాతకమైనయాత్మగుణప్రశంసచేసియైన ధనముసంపాదించి ప్రాణములను తృప్తిపఱిచెద నసెడి యాశచేత యిట్టి యనుచితమును గూడ చేసితిని. అప్పటికిని ధనము దొరకినదిగాదు అని అభిప్రాయము.

మ. నళినీపత్రగతాంబుచంచలము లెన్నం బ్రాణముల్ వీనికై
గళితప్రజ్ఞత మేము చేయనియసత్కార్యంబు లే దేమియుం
బలవద్విత్తమదాతిరేకజనితాటోపస్మారులైనట్టిలు
బ్ధులమ్రోలం నిజసద్గుణస్తుతిమహాదోషంబు గావించుటన్. 5

తా. ఈప్రాణములో తామరాకునందలి నీటిబొట్టులవలె మిక్కిలి యస్థిరములైనవి. అయినను ఇట్టివానిని గాపాడఁగోరి తెలివిమాలినమే మేయకృత్యమునైనను వెనుదీయక చేసెదము. ఎట్లనఁగా, ధనగర్వముచేఁ జొక్కి మతిమఱచియున్న ధనాఢ్యులయొద్ద మాగుణములను లజ్జ విడిచి పొగడుకొంటిమి. ఇట్టి పాతకమునే చేసినప్పుడు మఱి యేయకృత్యము చేయము.

అవ. ఉచితమునే చేసినను, దానిని ఎట్లు చేయఁదగునో యారీతిని జేయమిచే దానిచే ఫలము గలుగదయ్యె ననుచున్నాఁడు.

శ్లో॥ క్షాన్తం న క్షమయా గృహోచితసుఖం త్యక్తం న సన్తోషతః
సోఢో దుస్సహశీతవాతతపనక్లేశో న తప్తం తపః।
ధ్యాతం విత్తమహర్నిశం నియమితప్రాణైర్న శమ్భోః పదం
తత్తత్కర్మ కృతం యదేవ మునిభిస్తైస్తైః ఫలైర్వఞ్చితాః॥ 6

టీ. క్షమయా=(అవమానమునకు హేతువైనది యుండియు మనస్సు ఉద్వేగము పొందకుండుటయే ఓర్పు. అట్టి) ఓర్పుచేత, నక్షాన్తం=(అవమానాదులు) ఓర్వఁబడినదికాదు. అయితే అశక్తిచేతనో భయముచేతనోయాయవమానాదు లోర్వఁబడినవనుట, గృహఉచితసుఖం=గృహమునందు తగినసుఖము-మృష్టాన్నభోజనము భార్యాసంభోగము మొదలైనవానిచే గృహంబునఁగలుగఁదగిన యానందాదు లనుట, సన్తోషతః=సంతోషముచేత-'ఇదీ యిది యేమి'యని మనఃపూర్వకము గారోయుటచేతననుట, నత్యక్తం=విడువఁబడినదికాదు-అయితే త్రోసి పుచ్చరాని బ్రహ్మచర్యముచేతనో పారతంత్ర్యముచేతనో విడువఁబడినదనుట, దుస్స...క్లేశః - దుస్సహ=సహింపరాని, శీతవాతతపన=చలి గాలి యెండ అను వీనిచేఁ గలుగునట్టి, క్లేశః=దుఃఖము, సోఢః=ఓర్వఁబడినది-దేహయాత్రకొఱకు దేశాంతరసంచారముచేయునప్పుడు వీనినెల్ల సహించితిననుట, అయితే, తపః=తపస్సు, నతప్తం=తపింపఁబడినదిగాదు - శీతవాతాదుల నోర్చుట తపస్సునుబట్టికాదు దేహయాత్రకొఱకని భావము. విత్తం=ద్రవ్యము,అహర్నిశం=రేయుంబవలు, ధ్యాతం=ధ్యానముచేయఁబడినది-చింతింపఁబడినదనుట,అయితే,నియమితప్రాణైః=లోపల నడ్డగింపఁబడినప్రాణవృత్తులచేత - ప్రాణవ్యాపారముల లోపలనే నిరోధించియనుట, శమ్భోః=శివునియొక్క, పదం=చరణము,న(ధ్యాతం)=ధ్యానింపఁబడినదికాదు. కాఁబట్టి, మునిభిః=ఈశ్వరుని మననముచేయునట్టివారిచేత, యత్ కర్మ=ఏయేకర్మము-క్షమ సుఖత్యాగము మొదలైనవనుట, కృతం=చేయఁబడినదో, తత్ తత్ కర్మ=ఆయాకర్మమే, కృతం=మాచేతను జేయఁబడినది. అయితే, తైః తైః=ఆయా, ఫలైః=ఫలములచేత-ఆయాకర్మములకు నియతములైయున్న యాయాఫలములచేత ననుట, వఞ్చితాః=(మేము) వంచింపఁబడితిమి, మునులకుఁ గలిగిన యాయాఫలములే మాకుఁ గలుగక మమ్మువంచించినవనుట-మునులాచరించినక్షమాదికర్మములనే మేమును ఆచరించినను వారువానిని జేసినరీతిని మేముచేయనందునవాని వలన వారు పొందినఫలములు మాకుఁ గలుగవయ్యెనని భావము. ఋషులవలె క్షమాదులచేతనే యవమానాదులనుఓర్చుకొనియుందుమేని ఫలలాభముకలిగియే యుండునని యాశయము. ఆరీతిని వానినాచరింపకుండుటకు మూలము తృష్ణాదుర్విలసితమే యని భావము.

మ. క్షమచేఁ గాదవమాన మోర్చుట మహాసంతుష్టిచేఁ గాదు గే
హమునం దైనసుఖంబు మానుట తపోవ్యాసక్తిచేఁ గాదు దు
ర్దమశీతోష్ణజయంబు కాదు హరుపై ధాన్యంబు విత్తంబుపై
నమరెన్ మాకు మునీంద్రకృత్యములు లేవాసత్ఫలాభ్యున్నతుల్. 6

తా. మే మవమానాదుల నోర్చితిమికాని యది క్షమచేతఁ గాదు. ఇండ్లయం దనుభవింపఁదగిన సుఖములను విడిచితిమిగాని యది మనఃపూర్వకమైనదిగాదు. చలిగాలి యెండలకుఁ దాళితిమిగాని దానిచే తపము సేయలేదు. రేయుంబవలు ధనము నే ధ్యానించితిమి కాని ప్రాణవృత్తులను లోపల నాపి శివచరణములను ధ్యానింపలేదు. ఇట్లు మునులు సేయు క్షమ గృహసుఖత్యాగము శీతవాతాదిసహనము ధ్యానము మొదలైన కర్మములు మేమును జేసినను వానిని జేయవలసినరీతిని జేయనందున వారికిఁ గలుగుఫలములు మాకుఁ గలుగక యేమఱినవార మైతిమి.

అవ. మూఁడుశ్లోకములచే ముదిమిని దూషించుచు తన్మూలమున తృష్ణను నిందించుచున్నాఁడు.

శ్లో॥ భోగా న భుక్తా వయమేవ భుక్తా, స్తపో న తప్తం వయమేవ తప్తాః।
కాలో న యాతో వయమేవ యాతా, స్తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణాః॥

టీ. భోగాః=భోగములు-హారచందనాదిసుఖానుభవములనుట, నభుక్తాః=అనుభవింపఁబడినవిగావు, అయితే, వయమేవ=మేమే, భుక్తాః=భుజింపఁబడితిమి-ఆభోగములకొఱకై నదురంతచింతచే మేమే గ్రసింపఁబడితిమనుట- లేక సర్వభక్షకుఁడైన కాలమనెడి రాక్షసునిచేత మేమే భుజింపఁబడినవారమైతిమనుట-భుక్తశబ్దమునకు భోగపక్షమున అనుభవింపఁబడుటయు, 'వయం' అను పక్షమున భుజింపఁబడుటయు నని యర్థములు. తపః=తపస్సు, నతప్తం=తపింపఁబడినదిగాదు, వయమేవ=మేమే, తప్తాః=(ఆధ్యాత్మికాదితాపత్రయముచేత) తపింపఁజేయఁబడితిమి-తప్తశబ్దము తపస్సు చేయఁబడుటకును తపింపఁజేయఁబడుటకును గ్రాహ్యము. కాలః=కాలము, నయాతః=పోయినదిగాదు, అయితే, వయమేవ=మేమే, యాతాః=(జీవితకాలపుమేరను దాఁటి)పోయితిమి-అవసానము నొందితిమనుట. అప్పటికిని, తృష్ణా=తృష్ణ, జీర్ణాన=శిథిలమైనదికాదు-దానికి శిథిలత్వము గలిగించునది లేనందుచే నని భావము, వయమేవ=మేమే, జీర్ణాః=ముదిమిచే నవయవములు సోలినవారమైతిమనుట, కాఁబట్టి యిటమీఁద వేగమ తృష్ణను నిర్మూలించుదానిని సంపాదింపవలయునని భావము. అలం. విశేషము.

క. భోగానుభవంబు తపో
యోగము కాలంబు చనుటయును ఘనతృష్ణో

ద్యోగవిరామము లే దహ
హా గురుత వహించి తృష్ణకు యలజడి దెచ్చెన్. 7

తా. భోగములు భుక్తములు (అనుభవింపఁబడినవి) గావు. మేమే భుక్తులము (దురంతచింతచేఁగ్రసింపఁబడినవారము.) తపస్సుతప్తము(తపస్సుచేయఁబడినది) గాదు. మేమే తప్తులము (తాపత్రయముచే తపింపఁ జేయఁబడినవారము). కాలము (అనంత మగుటచే) పోయినదిగాదు. మేమే పోయినవారము (అంత్యదశను బొందినవారము). తృష్ణ జీర్ణించినది (శిథిలమైనది) గాదు. మేమే జీర్ణించిన (ముదిసిన) వారము.

శ్లో॥ వలిభి ర్ముఖ మాక్రాన్తం పలితై రఙ్కితం శిరః ।
గాత్రాణి శిథిలాయన్తే * తృష్ణైకా తరుణాయతే ॥ 8

టీ. వలిభిః-(ముదిమిచేఁగలిగిన) ముడుతలచేత,ముఖం=మొగము,ఆక్రాన్తం= ఆక్రమింపఁబడినది-ముఖము విరూపమైనదనుట, పలితైః=నరలచేత,శిరః=తల,అఙ్కితం=గుఱుతుగలదిగాఁ జేయఁబడినది-తల నరసిన దనుట, గాత్రాణి=శరీరములు-కరచరణాద్యవయవములనుట, శిథిలాయన్తే=శిథిలము లగుచున్నవి- ముదిమిచే బిగితప్పి తమతమవ్యాపారములు సేయుట కశక్తము లగుచున్నవనుట, అయితే, ఏకాతృష్ణా= తృష్ణయొక్కటి, తరుణాయతే= పరువమైనదానివలె నాచరించుచున్నది- బలిష్ఠమైన దనుట- దేహేంద్రియాదులశక్తు లన్నియు నుడిగినను దృష్ణ యొకదానిశక్తిమాత్ర ముడుగక బలీయముగానే యుండు నని భావము.

క. కరచరణాద్యవయవముల
భర ముడిగెఁ వళులు మొగముపై నిండారెఁ
శిర సెల్లఁ దెల్లఁబాఱెను
దరి మాలినతృష్ణ యొకఁడె తరుణతఁ బూనెన్. 8

తా. మొగమెల్ల ముడుతలుపడినవి. తలయంతయునరసినది. అవయవము లెల్ల బిగితప్పినవి.అయినను తృష్ణయొకటిమాత్రము పరువంపుదానివలె బలీయముగానే యున్నది.

శ్లో॥ నివృత్తా భోగేచ్ఛా పురుషబహుమానో విగళితః
సమానాః స్వర్యాతాః సపది సుహృదో జీవితసమాః ।
శనై ర్యష్ట్యుత్థానం ఘనతిమిరరుద్ధేచ నయనే
అహో ధృష్టః కాయ స్తదపి మరణాపాయచకితః ॥ 9

---

* ఇదియే 'జీర్యన్తే జీర్యతః కేశాః, దన్తా జీర్యన్తి జీర్యతః । జీర్యత శ్చక్షుషీశ్రోత్రే, తృష్ణైకా తరుణాయతే॥' అనుచోటను జెప్పఁబడినది.

టీ. భోగఇచ్ఛా=విషయానుభవమునందలి స్పృహ, నివృత్తా=నివర్తించినది-సామర్థ్యములేమిచే నని భావము. పురుషబహుమానః=పురుషుఁడనెడి సన్మానము, విగళితః=వీడిపోయినది-పూర్వపౌరుషాదులు లేమిచేననుట, లేక, పురుషబహుమానః=పురుషులయొక్క (అనఁగావయసుకాండ్రయొక్క) తమ్ముగొప్పగాఁ దలఁచుకొనుట-వయస్సునందలిగర్వ మనుట, వీడిపోయినదనియు నర్థము. లేక, పురుషబహుమానః=ఇతరపురుషులయొక్క గొప్పగాఁ దలఁచుట-ఇతరులు తమ్ము గొప్పగాఁ దలఁచుట వీడినదనియు నర్థాంతరము. మృతులైన సుహృదులనుగుఱించి శోకించుమూలమున తనవ్యర్థజీవమును సూచించుచున్నాఁడు. జీవితసమాః=ప్రాణముతో సాటియైనవారును, సమానాః=సమానవయస్సుగలవారును, అగు, సుహృదః=సఖులు- లేక బంధువులు, సపది=తోడనే-ముదిమి రాకమునుపే యనుట-లేక, నాయట్టి దుర్దశ రాకమునుపే, స్వః=స్వర్గమునుగూర్చి, యాతాః=పోయినవారైరి-తమ పుణ్యపరిపాకమువలనఁ బుణ్యలోకమును బొందిరి-ముదిసి పెంపు సొంపు దక్కిన నేను బోవక వ్యర్థము గాఁబ్రతికి పడియున్నాననుట. ఇట్లు తన్నుదూఱుకొన నేలయనఁగాఁ జెప్పుచున్నాఁడు. శనైః=మెల్ల మెల్లగా, యష్టిఉత్థానం=కొయ్యచేతలేచుట-కాళ్లయందు పటుత్వములేమివలనఁ దనంతలేవను దిరుగను సత్తువలేమిచే కఱ్ఱనూనుకొని మెల్లగాలేచుటయైనదని భావము. నయనే=రెండుకన్నులును, ఘనతిమిరరుద్ధే-ఘనతిమిర=దట్టమయినతిమిరమను కంటిజెవులుచేత, రుద్ధే=అడ్డగింపఁబడినది-ప్రసరించి విషయములను గ్రహింపనీయకుండునట్లు చేయఁబడిన వనుట. ఇట్లు కుంటియు గ్రుడ్డియునై బ్రతికియుండు తాను నిఁదార్వాఁడే; ఇట్టి దుర్దశ కలుగకమునుపే గతించిన తనసుహృదులు పుణ్యాత్ములే యగుదురని భావము. తదపి=అయినను-ఇట్లు కుంటును గ్రుడ్డితనమును గలిగి జీవించుటకంటెను మరణమే మేలయినను,ధృష్టః=లజ్జలేని ('మూఢః' అనుచో తెలివిలేనియనుట), కాయః=దేహము, మరణా... కితః-మరణాపాయ=మరణముచేతఁ గలుగు నెడఁబాటువలన-లేక, మరణరూపమైన యెడఁబాటువలన-దేహము నెడఁబాయుటవలన ననుట, చకితః=భయపడినది, అగునని శేషము, ఇచట దేహిధర్మమైన భయపడుట తద్దేహమునందు ఉపచరించినదని తెలియునది, అహో=ఆశ్చర్యము. *ఇట్టికష్టదశ గలిగినను జీవితాశయే బలీయముగానున్నదిగాని జ్ఞానోదయము గాదని యాశ్చర్యము-ఇట్టికష్టములు కలుగుటయు తృష్ణావిలసితమే యని భావము. అలం. విభావన.

*'అతికష్టా స్వప్యవస్థాసు జీవితనిరపేక్షా న భవన్తిఖలు ప్రాణినాం ప్రవృత్తయః' మిక్కిలి కష్టములైన యవస్థలు గలిగినను జీవితమం దపేక్ష మాని ప్రాణులు నడచుకొనరు' అని కాదంబరి.

శా. భోగాపేక్ష దొలంగెఁ బూజ్యత సెడెం ◌ బోరానిమిత్రుల్ మహా
భాగుల్ సెల్లిరి దండమూఁతగొనుటల్ ◌ ప్రాప్తించెఁగన్నుల్ తమో
రోగచ్ఛన్నము లయ్యె దేహము జరా◌రూఢంబు ప్రాణానిల
త్యాగాపాయభయంబునర్క వడఁకెడుం◌దా నెంతసమ్మోహమో. 9

తా. అనుభవించుటకు శక్తిలేమిచే భోగములం దాశమానినది. పురుషత్వము వలనిగర్వమును పోడినది. నాకుఁ బ్రాణపదమై నాయీడువారైన చెలికాండ్రందఱును నప్పుడే స్వర్గప్రాప్తులైరి. నేనో ముదిమిగ్రమ్మియు బ్రదికియేయున్నాను. ఎందుల కీబ్రతుకు? కొయ్య నూనియే లేవవలసియున్నది. కంటికిఁ జెవులు దట్టముగాఁ గలిగి విషయములు గానరావయ్యె. ఇట్టిదుర్దశ గలిగి బ్రదుకుటకంటె మరణమే మేలయ్యు సిగ్గుమాలిన యీదేహమో మరణమన్న భయపడుచున్నదే. ఏమాశ్చర్యము! ఆశ్చర్య మేమి? ఇదియంతయు తృష్ణాదుర్విలసితము గదా.

అవ. ఇటువంటితృష్ణ నుల్లంఘించి స్వకీయాత్మసుఖము ననుభవించుమహాత్ము లెవ్వ రేని గలరా యని యాశంకించినవాఁడై కలరేయని నిగమించుచు నాతృష్ణ యట్టిమహాత్ములు తప్ప నితరులకు దాఁటరానిదని తెలుపుటకై యొకమహానదిగా రూపించుచున్నాఁడు.

శ్లో॥ ఆశానామ నదీ మనోరథజలా తృష్ణాతరఙ్గాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ ।
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః॥ 10

టీ. ఆశానామ = ఆశయనెడి, నదీ = ఏఱు, మనోరథజలా = (మృష్టాన్నపానభోజనము విచిత్రవస్త్రభూషణధారణము యువతీసంభోగము మొదలైనవానియందువర్తించు మనోవ్యాపారము లనెడి) కోరిక లనెడిజలముగలది, తృష్ణా...కులా- తృష్ణా= (లభింపరాని వస్తువులు లభింపవలయు నను నభిలాషవిశేషము లైన) తృష్ణ లనెడి, తరఙ్గ=అలలచే, ఆకులా=వ్యాపించినది, రాగ...వతీ-రాగ=(అభిమతములైన వస్తువులందు స్నేహరూపమైన) రాగములనెడి, గ్రాహవతీ=మొసళులుగలది, రాగశబ్దము ద్వేషాదులకు నుపలక్షణము, వితర్కవిహగా-వితర్క=(ఇట్లుచేసిన నిది కలుగునో లేదో యను)ఊహలనెడి,విహగా=పక్షులుగలది, ధైర్యద్రుమధ్వంసినీ=(వికారముకలిగించుహేతువులుండియుమనస్సువికారమునొందకుండుటధైర్యము.అట్టి)ధైర్యమనెడి మ్రాఁకును నిర్మూలము చేయునది. మోహా...స్తరా - మోహ = అజ్ఞానవృత్తులనెడి,

ఆవర్త=సుడులచేత, సుదుస్తరా=దాఁటుటకు మిక్కిలియుఁ గష్టమైనది, అతిగహనా=(ఆశాపక్షమున) మిక్కిలియుఁ దెలిసికొనరానిది-(నదీపక్షమున) మిక్కిలియుఁ జొరరానిది, ప్రోత్తుఙ్గ...తటీ-ప్రోత్తుఙ్గ=మిక్కిలిపొడవులైన, చిన్తా=చింతలనెడి, తటీ=దరులు గలది, తస్యాః=దానియొక్క, పారగతాః=గట్టును బొందినవారును-జ్ఞాన మనుతెప్పచేత ననుట, కావున నే, విశుద్ధమనసః=నిర్మలమైన అంతఃకరణము గలవారును, అగు, యోగీశ్వరాః=మహాయోగులు, నన్దన్తి=ఆనందించుచున్నారు-బ్రహ్మానంద మనుభవింతు రనుట. కాఁబట్టి శ్రేయస్సును గోరువాఁడు తృష్ణను దరించునుపాయము నెల్లపుడు వెదకవలయునని భావము. ఇచట ప్రవాహరూపమున నవిచ్ఛిన్నముగా సాగుచుండుటచే ఆశను నదిగాను, దానికి స్వరూపనిరూపకమై నలుగడల భ్రమించుచుండుటచే మనోరథములను జలములుగాను, ఒకటివెనుక నొకటి వరుసగా లేచుచు మునుఁగుచు నడుగక యుండుటచే తృష్ణలను తరంగములుగాను, దుష్టస్వభావమునఁ బట్టుకొనుగుణము కలిగియుండుటచే రాగాదులను గ్రాహములుగాను, నానావిధగతులు కలిగియుండుటచే వితర్కములను విహగములుగాను, మిక్కిలి స్థిరముగా నుండుటచే ధైర్యమును ద్రుమముగాను, ఎడతెగక సుళ్లఁ బెట్టుచుండుటచే మోహములను ఆవర్తములుగాను, లోఁతైయునికిని దెలుపుటచే చింతలను తటములుగాను, గవి రూపించినాఁ డని తెలియునది. కావున నలం. సమస్తవస్తువర్తిసావయవరూపకము.

చ. కలితమనోరథంబు లుదకంబులు తృష్ణలు భూరివీచికా
వళు లనురాగముల్ మకరవర్గము మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ ధైర్యఫలభూజముఁ గూల్చుదురాశ పేరిపు
ష్కలనది దాఁటి నిత్యసుఖసంపద గాంతురు యోగిపుంగవుల్. 10

తా. కోరికలనెడి జలములు గలిగి, తృష్ణలనెడితరఁగలు గొట్టుచు, రాగాదులనెడి మొసళులు కలిగి, వితర్కములనెడి పక్షులతోఁగూడి, దరులందున్న ధైర్యమనెడి మ్రాఁకును గూల్చుచు, మోహము లనెడి సుళ్లతోను, చింతలనెడి పొడవులైన దరులతోను గూడి, చొరరానిదై యాశ యనెడినది యొప్పును. నిర్మలాంతఃకరణులైన యోగీశ్వరులు దాని నుత్తరించి బ్రహ్మానందము ననుభవించుచుందురు.

ఇది వైరాగ్యశతకమున తృష్ణాదూషణ మన్నది ప్రథమదశకము.

---

## వైరాగ్యశతకము - విషయపరిత్యాగవిడంబన.

---

అవ. యోగులు తృష్ణానదిని దాఁటి యానంద మనుభవించువా రయ్యు విషయపరిత్యాగము సేయక యది వారికిఁ గలుగఁ

జాలదు గాన *విషయపరిత్యాగవిడంబన యిఁకఁ బదిశ్లోకములఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ న సంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః ।
మహద్భిః పుణ్యౌఘై శ్చిరపరిగృహీతా హి విషయాః
మహాన్తో జాయ న్తే వ్యసన మివ దాతుం విషయిణామ్॥ 11

టీ. సంసార ఉత్పన్నం=సంసారమందుఁబుట్టిన, చరితం=నడవడి-లేక, ఫలోద్దేశముతోఁ జేయఁబడు పుణ్యాచరణము, కుశలం=క్షేమకరమైనదిగా, న అనుపశ్యామి=కనుఁగొనను-అనాదిజన్మపరంపరారూపముగానుండునిహసంసారమునందు నడచుకొనునట్టియేనడవడిగాని క్షేమకరముకాదని నాకుఁ దోఁచుచున్నదనుట. ఏలనఁగా, పుణ్యానాం=పురాకృతములైన సుకృతములయొక్క, విపాకః=పరిపాకము-ఫలమనుట, విమృశతః=పరామర్శించుచున్న-ఇది నిజముగా సుఖప్రదమా కాదా యని విమర్శ సేయుచున్నట్టి, మే=నాకు, భయం=వెఱపును, జనయతి=కలిగించుచున్నది-పుణ్యముచేనగు సంపదలన్నియు నాపుణ్యముయొక్క వ్యయముచేత నె కలుగును గాన నవి విపత్తులేయగునని భయపడుచున్నాననుట. ఇదియే 'పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః సంపదో విపద ఏవ విమృష్టాః-పూర్వముచేసిన పుణ్యవిభవముయొక్క వ్యయముచేలభించిన సంపదలువిమర్శించి చూడఁగా విపత్తులేయగు'నని శ్రీహర్షుండును జెప్పియున్నాఁడు. లేక, పుణ్యములయొక్క-అనఁగా జ్యోతిష్టోమాది సత్కర్మములయొక్క - విపాకమనఁగా స్వరాదిరూపమైన ఫలమును ముందు వెనుక నాలోచించి చూడఁగా 'క్షీణే పుణ్యేమ ర్త్యలోకం విశ న్తి-పుణ్యము అనుభవించి తీఱఁగా మరల మనుష్యలోకమును బ్రవేశింతురు'అనువచనముం బట్టి యాఫలములు తీఱఁగా మరల భూలోకమును బ్రవేశించి మహాదుఃఖకరములైన గర్భనరకాదు లనుభవింపవలసివచ్చుచున్నది గాన నిట్టిపరిణామములుఁగల పుణ్యములు భయమే నాకొసంగుచున్నవనియు కావున నీసంసారమునందుఁ జేయఁబడునదేదిగాని కుశలమైనది కాదని కనుఁగొనుచున్నాననియు భావము. మఱియును, మహద్భిః=గొప్పలైన, పుణ్యౌఘైః=పుణ్యసమూహములచేత, చిరపరిగృహీతాః=చిరకాలము గయికొనంబడిన-చిరకాలముగా అనుభవింపఁబడుచున్న యనుట, విషయాః= భోగములు, విషయిణాం=విషయాసక్తులైనవారికి, వ్యసనం=దుఃఖమును,

* విషయములనఁగా రూపరసాదులు గాని లేక హారచందనవనితాదులు గాని గ్రాహ్యము. పరిత్యాగమనఁగా సన్న్యసించుట. విడంబన యనఁగా ననుకరణము-అభినయమనుట-విషయసన్న్యాసము నభినయించుట యిఁకఁ జెప్పఁబడునని భావము.

దాతుమివ=ఇచ్చునట్లు-లేక 'ఇవ' శబ్దము అవధారణార్థకము గా గ్రహించినయెడల, ఇచ్చుటకే, మహాన్తః=మిక్కిలిపెద్దవిగా-మిక్కిలి సుఖప్రదములుగా ననుట, జాయన్తే=అగుచున్నవి. ఆపుణ్యములచే బహుకాలముగా ననుభవింపఁబడుచున్న భోగము లోమిక్కిలి సుఖము చూపి విషయాసక్తుల నాకర్షించుటచే వారికి దుఃఖమే కలిగించునట్లుగా నున్నవి గాని సుఖమును గాదనుట. కాఁబట్టి యైహికాముష్మికభోగము లన్నియు ననిష్టములయందే పర్యవసించుటచే వానినెల్ల పరిత్యజించుటయే శ్రేయ మని భావము.

అవ. విషయములు సర్వవిధములను ద్యాజ్యములే యని చెప్పుటకై వాని వ్యవస్థితిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాపి విషయాః
వియోగే కో భేద స్త్యజతి న జనో య త్స్వయ మమూన్ ।
వ్రజన్తః స్వాతన్త్ర్యా దతులపరితాపాయ మనసః
స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనన్తం విదధతి ॥ 12

టీ. విషయాః=శబ్దాదులు-శబ్దాదివిషయభోగము లనుట, చిరతరం = బహుకాలము,ఉషిత్వాఅపి=నిలిచియుండియు,అవశ్యం=నిశ్చయముగా-సిద్ధముగా ననుట, యాతారః=పోవునవి-*ఆగమాపాయులు (వచ్చుచు పోవుచుండునవి) గాన తమ్మనుభవించు పురుషుని విడిచి పోవునే కాని పరిచయముంబట్టి పురుషుని జీవపర్యంతముండునవిగావనుట, యత్=ఎందుచేత, జనః=పురుషుఁడు, అమూన్=వీనిని, స్వయం=తానే, నత్యజతి=విడువఁడో, (తత్=అందుచేత), వియోగే=ఇవి తామైపోనిపోవుటయందు, భేదః=విశేషము, కః=ఏమి-విషయములను తానై విడువఁడుగాన అవి తామే విడిచిపోయిననే పోనిచ్చునని తెలియుచున్నది. తానే వానిని విడుచుటకంటె అవి తామే విడిచిపోవుటయందుఁ గలయతిశయ మేమి? ఏమియు లేదు గాన తానే వానినేల విడువరాదు? అని భావము. తానై వానిని విడువఁడు కాఁబట్టి అవియే తన్ను విడిచిపోవుటయందుఁ గలవిశేషమేమి యని యాక్షేపము. దీనినే యుపపాదించుచున్నాఁడు. స్వాతంత్ర్యాత్=స్వాతంత్ర్యమువలన-తమంతనే యనుట, వ్రజన్తః సన్తః=పోవునవి-పురుషుని విడుచునవి,అగు, (విషయములు అని శేషము),మనసః=మనస్సునకు, అతుల పరితాపాయ=మిక్కిలిసంతాపముకొఱకు, అగుచున్నవి అని శేషము. తామై పురుషుని విడిచిపోవునేని వానికి దుఃఖకరములే యగునని యర్థము. స్వయం=తనంతనే-పురుషునిచేతనే యనుట, త్యక్తాః=(తుచ్ఛములుగా తృణీకరించి) విడువఁబడినవై, ఏతే=ఇవి-విషయభోగములు, అనన్తం=కొలఁదిలేని, * శమసుఖం = మన

---

* 'మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత' అని గీతయు విషయములయొక్క ఆగమాపాయిత్వమును దెలిపెడిని.

శ్శాంతివలనిసుఖమును, విదధతిహి=కలిగించుచున్నవి. మనస్సుయొక్క తృష్ణ నడంచి నెమ్మది గలుగఁజేయు నని భావము.

చ. ఉరుగతితోడ నేఁగుఁ దడ* వుండియు భోగము లట్టివానిఁ దా
నరుఁడు పరిత్యజింపఁడు కఠనం గన దద్వియోగంబు భిన్నమే
పురుషుని భోగముల్ విడిచి * భూరిమనోవ్యథ లాచరించు నా
పురుషుఁడెభోగముల్ విడిచి*పొందు నిరామయశాంతిసౌఖ్యముల్.

తా. విషయభోగములు చిరకాలము పురుషునిచే ననుభవింపఁబడు చుండినను తుదకు నవి వానిని విడిచిపోవునవే యగుననుట సిద్ధము. పురుషుఁడు తానై వానిని విడువఁడు కాఁబట్టి యవియే విడిచిపోవున వగుచున్నవి. పురుషుఁడే విడుచుటకంటె నవియే విడిచిపోవుటయందు విశేషమేమియు లేదు. మఱియు నవి తమంత విడిచిపోవునేని పురుషుని మనస్సునకు మిక్కిలియు సంతాపము కలుగుచున్నవి. పురుషుఁడు తానే వానిని విడిచెనేని వానిమనస్సుఁ గలంచుచున్న తృష్ణ నిమ్మళించి దానిచే వానికి మిక్కిలిసుఖము కలుగును. కాన విషయములు తామే విడిచిపోవుటకంటె పురుషుఁడు తానే వానిని విడుచుట మిక్కిలియు శ్రేయము.

అవ. విషయములను ద్యజింపఁజాలినపురుషు లెట్టివారని యాశంకించి జ్ఞానులే యిట్టివారు గాని మాబోఁటులు గా దనుచున్నాఁడు

శ్లో॥ బ్రహ్మజ్ఞానవివేకినో ఽమలధియః కుర్వ న్త్యహో దుష్కరం
యన్ముఞ్చ న్త్యుపభోగభాఞ్జ్యపి ధనా న్యేకాన్తతో నిఃస్పృహాః।
న ప్రాప్తాని పురా న సంప్రతి నచ ప్రాప్తౌ దృఢప్రత్యయో
వాఞ్ఛామాత్రపరిగ్రహాణ్యపి పరం త్యక్తుం న శక్తా వయమ్॥ 13

టీ. బ్రహ్మజ్ఞానవివేకినః=బ్రహ్మవిషయమైన జ్ఞానముచేఁ గలిగినవివేకము గలవారు, అను, అమలధియః=నిర్మలమైనబుద్ధి గలవారు-బ్రహ్మజ్ఞానముచే మంచిచెడ్డల వేఱువేఱ తెలియునట్టిశక్తి గలిగి దానిచే బుద్ధియు నిర్మలమైనవా రనుట, ('బ్రహ్మజ్ఞానవివేకనిర్మలధియః' అనుచో బ్రహ్మజ్ఞానముచేఁ గలిగినవివేకమువలనఁ దేటయైన బుద్ధి గలవారని యర్థము), యత్=ఎందుచేత, ఉపభోగభాఞ్జి=అనుభవమును బొందునట్టి-హారచందనాదిరూపముగా ననుభవింపఁబడుచున్నట్టి యనుట, ధనాని=ద్రవ్య

* ఇదియే 'యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్। తృష్ణాక్షయసుఖస్యైవ నార్హతః షోడశీం కలామ్'॥ అనియు 'విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాం శ్చరతి నిఃస్పృహః। నిర్మమో నిరహఙ్కారః స శాన్తి మధిగచ్ఛతి' అనియుఁ జెప్పఁబడినది.

ములను, ఏకాన్తతః=నిశ్చయముగా-బొత్తిగా ననుట, నిఃస్పృహాః=ఇచ్ఛలేనివారై, ముఞ్చన్తి=విడుతురో, (తత్=అందుచేత), దుష్కరం=చేయ నలవి కానిదానిని-అను భవింపఁబడుచున్న ధనములను విడుచుట దుష్కర మైనను అట్టిదానినిగూడ నని భావము, కుర్వన్తి=చేయుచున్నారు, అహో = ఆశ్చర్యము. పురా = పూర్వము, ప్రాప్తాని న=లభించినవి కావు-మాకు ముందైన నీధనములు గలిగినవి కా వనుట, సంప్రతి=ఇప్పుడును, న=(లభించినవి) కావు, ప్రాప్తౌ=అవి కలుగుటయందు, దృఢ ప్రత్యయశ్చ=గట్టినమ్మికయు, న=లేదు-అవి మాకు నిఁకఁ గలుగునని గట్టిగా నమ్ము టకును వీలులేదనుట, వాఞ్ఛామాత్రపరిగ్రహాణి అపి = కోరికమాత్రముచేత నే పరిగ్ర హింపఁబడుట గలవి యయ్యును-మనస్సునందుమాత్రము కోరఁబడుచున్న వే కాని నిజముగా అనుభవింపఁబడునవి కాకపోయినను అనుట,త్యక్తుం=విడుచుటకు, వయం =మేము-మాబోఁటులనుట, పరం=మిక్కిలి, నశక్తాః=సమర్థులు కానివారము-కాఁబ ట్టి పూర్వోక్తులైన బ్రహ్మజ్ఞానులే ధన్యులని భావము. విషయపరిత్యాగమునకు బ్రహ్మ జ్ఞానమే ముఖ్యసాధనము. కాఁబట్టి బ్రహ్మజ్ఞానము సంపాదించి విషయత్యాగము అవశ్యము చేయఁదగినది.

చ. అనఘులు బోధపూర్ణులు మహాత్ములు భోగనిదాన మామహా
ధనముఁ బరిత్యజింతురు గతస్పృహు లై పరమాద్భుతంబుగా
మునుపును బొంద కిప్పుడును రాదు మట్టక యింకను జెందలేక నె
మ్మనమునఁ దోఁచుభోగములమానఁగఁజాలముమే మొంకితయున్.

తా. హారచందనాదిరూపముగా ననుభవింపఁబడుచున్నధనములను విడుచుట దుష్కరము. అయినను బ్రహ్మజ్ఞానముచే సారాసారవివేకముగలిగి నిర్మలబుద్ధినొందిన జ్ఞానులు బొత్తిగా నాశ మాలినవారై ఔరా! యట్టిదుష్కరమైన ధనపరిత్యాగమును జేయుదురు. మాబోఁటులకో ధనము లింతకు ముందును గలిగినదిగాదు. ఇప్పుడును గలిగినదికాదు. ఇఁకఁ గలుగుననుగట్టినమ్మికయు లేదు. కాఁబట్టి యేమనుభవించుట లేక యూరక మనస్సునందుఁ గోరఁబడుచుమాత్రమే యుండునవయ్యు నట్టివానిని గూడ విడుచుటకు మే మెంతయు నశక్తులమై యున్నారము.

అవ. చెప్పినదానినే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ధన్యానాం గిరికన్దరేషు వసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానన్దాశ్రుజలం పిబన్తి శకునా నిఃశఙ్కమఙ్కేశయాః।
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకాననకేళికౌతుకజుషా మాయుః పరిక్షీయతే ॥ 14

టీ. గిరికన్దరేషు=కొండగుహలయందు, వసతాం=వసించువారును, 'వివిక్తసేవీ లఘ్వాశీ' అనునట్లు జనసమ్మర్దము లేని కొండగుహలం దొంటిగా వసించియుండునట్టివారు ననుట, పరం జ్యోతిః=స్వప్రకాశమైన పరబ్రహ్మమును, ధ్యాయతాం=ధ్యానించువారును, అగు, ధన్యానాం=పుణ్యాత్ములయొక్క, ఆనన్ద అశ్రుజలం=ఆనందమువలనికన్నీటిని, నిశ్శఙ్కం = (వారు తపస్సమాధి నుండుటవలన) జంకు లేనట్లుగా, అఙ్కేశయాః=తొడయందు నెలకొన్న-వారు నిశ్చలులై తపంబు సేయుచుండఁగా జంకక వారితొడలయందు వ్రాలినట్టి, శకునాః=పక్షులు, పిబన్తి=త్రాగుచున్నవి, తు=అయితే, మనోరథో...జుషాం-మనోరథ=కోరికమాత్రముచేత-మనస్సుచేమాత్ర మనుట, ఉపరచిత=కల్పింపఁబడిన, ప్రాసాద=ఉప్పరిగలందును, వాపీతట=చిన్నకొలంకులకెలఁకులందును-క్రీడాకానన= ఉద్యానవనములందును, కేళి=విహారములందలి, కౌతుకజుషాం= కుతూహలము గలిగియున్నవారైన, అస్మాకం=మాకు-పూర్వోక్తులైనవారికి వ్యతిరిక్తమైననడవడి గలవారికనుట, ఆయుః=ఆయువు, పరిక్షీయతే=మిక్కిలిక్షీణించుచున్నది - పూర్వోక్తులైన ధన్యులయాయువు బ్రహ్మజ్ఞానప్రాప్తిచే సఫలమగుచున్నది. దుర్లభవిషయములను చింతించుకొనుచు బ్రహ్మజ్ఞానము మాలినమాయాయువు ఊరకయె గడపంబడి వ్యర్థమగుచున్నది. కాఁబట్టి వారివలె మేము ధన్యులము కామని భావము.

చ. గిరిగుహాలఁ వసించి వృషకేతనచింతన మాచరించుస
త్పురుషులసమ్మదాశ్రుకణపుంజముఁ గ్రోలుచు నంకశయ్యలం
దిరవుగ నుండుఁ బక్షులు సకమిద్ధమనఃకృతసౌధవాపికా
వరవనకేళిశీలు రగువారల కాయువె విక్షతం బగున్. 14

తా. కొండగుహలం దొంటిగా వసించి జ్యోతిఃస్వరూపమైన పరబ్రహ్మమును ధ్యానించుచు బ్రహ్మానుభవజనితమైన యానందమువలనఁ దొరఁగుతమబాష్పజలముల నొడియందు జంకులేక వ్రాలి పక్షులు త్రాగునంతనిశ్చలులై కాలము గడపుధన్యులయాయువే సార్థకము. అట్లుకాక మనస్సుమాత్రముచేతనే యుప్పరిగలు కొలఁకులు నుద్యానవనములు మొదలగువానిని గల్పించుకొని యందుఁ గల్లవిహారములు సలుపుచు నేదియు నిజముగా ననుభవింపక బ్రహ్మజ్ఞానమును గడింపక యూరక కాలము పుచ్చు మముబోఁటులయాయువో నిరర్థకము.

అవ. విషయములవలనిపస గానక విఫలుఁడై యొకానొకఁడు చెప్పికొనుమాటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భిక్షాశనం తదపి నీరస మేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహమాత్రమ్।

వస్త్రం సుజీర్ణశతఖణ్డమయీ చ కన్థా
హాహా తథాపి విషయా న్న జహాతి చేతః॥ 15

టీ. భిక్షా=బిచ్చము, అశనం=ఆహారము, తదపి=ఆబిచ్చపుఁగూడైనను, నీరసః=రసములేనిది-చప్పిడిదైనదనుట, అదియును, ఏకవారం=ఒకసారియే-ఒక్కపూఁటకే దొరకుననుట, శయ్యాచ=పడుకయు, భూః=భూమి-చాఁపమొదలైనవి లేని వట్టికటికనేలయే యనుట, పరిజనః=సేవకజనము, నిజదేహమాత్రం= సొంతదేహము మాత్రమే-తనకుఁదానే పరిజనుఁడుగాని మఱియొకఁడు పరిజనుఁడులేఁడనుట, వస్త్రం=గుడ్డ, సుజీర్ణ.. మయీ-సుజీర్ణ=మిక్కిలిచివికిన, శతఖణ్డ=నూఱుపేలికలచేమయీ=నిండారిన, కన్థా=బొంత, తథాపి=అట్లయ్యును-విషయములందు విరక్తి పుట్టించు నిట్టినీచదశ కలిగినను అనుట, చేతః=మనస్సు, విషయాన్=విషయములను-విషయభోగముల ననుట, నజహాతి=విడువదు. హాహా=అయ్యయ్యో-ఇది విషాదవిస్మయాతిశయములను దెలిపెడిని. ఇచట విషయపరిత్యాగమునకు వలయు కారణములు సమగ్రముగా నుండియు నాకార్యము కలుగమిచే నలంకారము విశేషోక్తి.

చ. నిరతముఁ దిండి బిచ్చ మగు నీరస మద్దియు నొక్కపూఁటయే
ధరణితలంబు సెజ్జ సతతంబును దోడు శరీరమాత్రమే
చెఱఁగులచీరతున్కగమిచేత నమర్చినబొంత పుట్ట మీ
కరణి మెలంగినన్ విషయకాంక్ష లొకింతయుఁ బాయ వక్కటా.

తా. బిచ్చమేకూడు. అదియును జప్పిడిదియై యొకపూఁటకే దొరకును. పడుక చాఁపమొదలైనవిలేనివట్టికటికనేల. సేవకుఁడు తనదేహమే. వస్త్రమో మిక్కిలిప్రాఁతగిలిననూఱుపేలికలతోఁ గుట్టిన వట్టిబొంత. విషయసుఖములందు విసుగు పుట్టించు నిట్టి తక్కువదశ గలిగియు పాడుమన సావిషయములను విడువ ననుచున్నది. అక్కటా! ఏమివింత యిది.

అవ. విషయానుభవమునందు స్త్రీలే ముఖ్యులు గాన వారిని దూషింపనియెడల వానిని విడుచుట సులువుగాదని తలఁచియా స్త్రీలను దూషించుచున్నాఁడు.

శ్లో॥ స్తనౌ మాంసగ్రన్థీ కనకకలశా వి త్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాఙ్కేన తులితమ్।
స్రవ న్మూత్రక్లిన్నం కరివరశిరఃస్పర్ధి జఘన
మహో నిన్ద్యం రూపం కవిజనవిశేషై ర్గురుకృతమ్॥ 16

టీ. స్తనౌ=చన్నులు, మాంసగ్రన్థీ=మాంసపిండములు-మాంసపు కంతు లనుట, తథాపి=అట్లయినను, కనకకలశౌ=బంగరుకుండలు, ఇతి=అని, ఉపమితౌ=పో

ల్పఁబడినవి-వానికి నీడుగా వర్ణింపఁబడినవనుట, ముఖం=మొగము, శ్లేష్మ అగారం=తేమడకు పట్టయినది, తదపి=అయినప్పటికిని, శశాఙ్కేన=(జింకను గుఱుతుగాఁగల) చంద్రునితో, తులితం=పురుడింపఁబడినది, దానితో నెనయైనదిగా వర్ణింపఁబడిన దనుట, జఘనం=మొల, స్రవ...క్లిన్నం-స్రవత్=కాఱుచున్న, మూత్ర=మూత్రము చేత, క్లిన్నం=తడిసినది-మిక్కిలి అపవిత్రమైనదనుట, అయినప్పటికిని, కరివర శిరః స్పర్ధి-కరివర=శ్రేష్ఠమయినయేనుఁగుయొక్క, శిరః=తలతో-కుంభస్థలములతో, స్పర్ధి=మచ్చరించునది-దానితో నెన యైనదిగా వర్ణింపఁబడిన దనుట, అహో=ఔరా, నిన్ద్యం=గ్రంథిమొదలైన యాకారముచే నేవగింపఁదగిన, రూపం=స్త్రీయొక్కరూపు, కవిజనవిశేషైః=(కామిజనులను రంజించుటయందు దాసక్తిగల) కొందఱుకవులచే త, గురుకృతం=గొప్పదిగా చేయఁబడినది-కనకకలశాదులతో సాటిచెప్పి శ్రేష్ఠము గావింపఁబడినది. ఈరూపము కవిజనవాఙ్మాత్రసారమే కాని నిజమైనసారము కల ది కాదనుట, ఇచట స్తనములు మాంసపిండము లనుటచే పిసుకఁదగని వనియు, ము ఖము శ్లేష్మాగార మగుటచే చుంబింప నర్హము కాదనియు, జఘనము స్రవన్మూత్ర క్లిన్నమగుటచే హేయమై సంభోగమునకు పాత్రముకాదనియు సూచితము. కామిను లయొక్క యీయవయవములే సంభోగమునకు స్థానములుగా నంగీకరింపఁబడియు న్నవి. ఇట్లంగీకరింపఁబడినవే యీతీరున హేయములై యుండు నేని స్త్రీయందు మఱేది భోగయోగ్య మగు నని తాత్పర్యము.

శ్లో॥ స్తనములు మాంసపిండములు ♦ చక్కనిబంగరుకుండ లంచు నా
ననము కఫాలయంబు తుహి♦నద్యుతితుల్య మటంచు మూత్రభా
జనజఘనస్థలంబు కరి♦చారుశిరస్సమ మంచుఁ గామినీ
జనమలినాంగముల్ సుకవి♦చాతురి వర్ణన కెక్కె నిమ్మహిన్. 16

తా, చనుఁగుబ్బలు వట్టిమాంసపుముద్దలైనను బంగరుకుండలనియు, మొగము తేమడ జొల్లు మొదలైనవానికిఁ బట్టయినను చందురునితో సాటియైనదనియు, మొల మూత్రము కాఱి తడిసి యుండుటచే నేవగింపఁ దగినదయ్యు, నేనుంగుకుంభములవం టి దనియు నిట్లు మిక్కిలి నింద్యము లైనవానిని కడుంగొప్పగాఁ గొందఱు కవులు కాముకుల రంజించుటకై వర్ణించెదరు.

అవ. పరమేశ్వరుఁ డొక్కఁడే పూర్ణముగా అనురక్తుఁడును విర క్తుఁడును అగును. తక్కినవారు అట్లు అనురక్తులుగాని విరక్తులుగాని కారు గనుకఁ గష్టులే యనుచున్నాఁడు.

శ్లో॥ ఏకో రాగిషు రాజతే ప్రియతమాదేహార్ధహారీ హరో
నీరాగేషు జనో విముక్తలలనాసఙ్గో న యస్మాత్పరః।

దుర్వారస్మరబాణపన్నగవిషవ్యావిద్ధముగ్ధో జనః
శేషః కామవిడమ్బితా న్న విషయాన్ భోక్తుం న మోక్తుం క్షమః॥

టీ. ప్రియ... హారీ-ప్రియతమా=ప్రియురాలైన పార్వతియొక్క, దేహ=శరీరముయొక్క, అర్ధ=సగభాగమును, హారీ=కయికొన్నవాఁడైన-మిక్కిలియు కామకత్వముచేత క్షణమాత్రమేని ప్రియురాలి నెడఁబాసి యుండనోపక యామెను తనదేహమునందె సగభాగముగా కల్పించుకొన్నవాఁడైన యనుట, హరః=శివుఁడు, ఏక ఏవ=ఒక్కఁడే, రాగిషు=అనురక్తులందు-కాముకులందనుట, రాజతే=సాటిలేక ప్రకాశించుచున్నాఁడు-దేహమునందు సగ మిల్లాలుగానే చేసికొన్నరాగి మఱెవ్వఁడును లేనందున అట్లు చేసికొన్నశివుఁ డొక్కఁడే వారిలో నెల్ల అగ్రగణ్యుఁ డని భావము. నీరాగేషు=విరక్తులయందును, విముక్తలలనాసఙ్గః=విడువఁబడినస్త్రీలతోడి కూటువ గలవాఁడైన, జనః=పురుషుఁడు-విరక్తపురుషుఁడనుట, యస్మాత్= ఎవనికంటె-ఏ శివునికంటెననుట, పరః=అన్యుఁడు, న=లేఁడో-తపస్సుచేయునప్పుడు మన్మథుని గాల్చుట మొదలైన కృత్యములచే నట్టి వైరాగ్యమును బ్రకటించుటవలన శివునికంటె విరక్తుఁడును మఱొక్కఁడు లేఁడనిభావము, అయితే, దుర్వార... ముగ్ధః-దుర్వార=వారింపనలవికాని, స్మరబాణ=మన్మథునిబాణము లనెడి, పన్నగ=సర్పములయొక్క, విష=విషముచేత-విషతుల్యమైన వ్యామోహముచేతననుట, వ్యావిద్ధ=కొట్టువడి, ముగ్ధః=మూఢుఁడైన-నిశ్చేష్టుఁడైన యనియునర్థము, పామువిషపుకాటుచే నెట్లు మూఢుఁడగునో యట్లేమరునితూపులచేతను మూఢుఁడగును గాన మరునితూపులు పాములుగా రూపింపఁబడియె, సర్పపక్షమున మూర్ఛిలినవాఁడనియు, బాణపక్షమున మరులుచే మతితప్పినవాఁడనియు ముగ్ధశబ్దమున కర్థము గ్రాహ్యము, ఇట్టివాఁడైన, శేషః జనః=తక్కినజనుఁడు-శివుఁడుతప్పఁ దక్కినవాఁ డనుట, కామ విడంబితాన్=మన్మథునిచే మోసముగాఁ గల్పింపఁబడిన, విషయాన్=విషయములను-స్త్రీసంభోగాదులననుట, భోక్తుం=అనుభవించుటకును, మోక్తుంవా=విడుచుటకును, క్షమః=సమర్థుఁడు, న=కాఁడు, శివునికిఁగలయనురాగాతిశయముగాని విరాగాతిశయముగాని లేనందున నతనివలె భోగించుటకును త్యజించుటకును జాలఁడని యర్థము. అఘటితఘటనాచతురుఁడైన పరమేశ్వరుఁడొక్కఁడే అనురక్తులయందును విరక్తులయందును మిక్కిలి యుత్కృష్టుఁడగును. తక్కినవారందఱును ఉభయభ్రష్టులేయనిభావము. విషము మేన వ్యాపించి సొమ్మసిలినవాఁడు దేనినిజేయనుగాని మాననుగాని నేరఁడు. కాఁబట్టియే మరుతూపులను సర్పములుగా రూపించి తద్విషవ్యావిద్ధుఁడై ముగ్ధుఁడైనవానికి విషయములను భోగింపనుద్యజింపను సాధ్యము కాదని సమర్థింపఁబడినది. మన్మథబాణములను పన్నగములుగా రూపించుటచే అలం. రూపకము.

చ. కాముకులందు మే సగముఁ గాంతకు నిచ్చినశంకరుండె ని
ష్కాములలోనఁ బంచశరశాసనుకన్నఁ బరుండుఁ గల్గఁ డు
ర్ధామమనోజబాణవిషదగ్ధులు తక్కిననమూఢు లోప రే
సీమల భామినీసుఖముఁ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్. 17

తా. శివుఁడు ప్రియురాలి నే తనసగదేహము చేసికొన్నవాఁడు గాన నతఁడే కాముకులలో నగ్రగణ్యుఁడు. స్త్రీసంగమును మానినవాఁ డతనికంటె మఱెవ్వఁడు ను లేఁడుగాన నతఁడే విరక్తులలోను అగ్రగణ్యుఁడు. తక్కినజనులో మరుతూపులు నాటఁగా పాముపిషపు కాటులచేతంబోలె మతిదప్పి కాముఁడు కపటముగాఁ బన్ని న విషయములను నతనివలె ననుభవింపనుఁ జాలరు; పరిత్యజింపనుఁ జాలరు.

అవ. విషయములందలిదోషములు తెలిసినప్పటికిని వానిని విడువకుండుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అజాన న్దాహాత్మ్యం పతతు శలభా దీపదహనే
స మీనో ఽప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితమ్।
విజానన్తో ఽప్యేతే వయ మిహ విపజ్జాలజటిలా
న్న ముఞ్చామః కామా నహహ గహనో మోహమహిమా॥18

టీ. శలభః=మిడుత, దాహాత్మ్యం=దహించుస్వభావము కలిగియుండుటను, అజానన్=తెలియనిదగుచు, దీపదహనే=దీపపునిప్పునందు, పతతు=పడునుగాక-పడి నీఱగునుగాకయనుట, సః=ఆ-ప్రసిద్ధమగు, మీనః అపి=చేఁపయు, అజ్ఞానాత్=తెలియమిచే-తన్ను నశింపఁజేయున దిదియనువివేకము లేమిచేననుట, బడిశయుతం=గాలముతోఁగూడిన-గాలమున గ్రుచ్చఁబడినదనుట, పిశితం=మాంసమును, అశ్నాతు=తినునుగాక-ఎరయందలి లోభముచే గాలము మ్రింగి కుత్తుకయం దడ్డుపడి చచ్చునుగాక యనుట, 'పతఙ్గ మాతఙ్గ కురఙ్గ భృఙ్గ మీనా హతాః పఞ్చభిరేవ పఞ్చ' అనున్యాయంబునం జేసి యీ మీనశలభము లేమఱుట వానియపరాధము గాదు, అజ్ఞానముచేఁ జేయఁబడినవి గాన వానికార్యము లపరాధములు కానేరవు. అయితే, ఇహ = ఈలోకమునందు, విజానన్తః అపి=(ఇవి వినాశహేతువులు అని) తెలియుచున్నవార మైనను, ఏతే = ఈ, వయం = మనము, విప...టిలాన్ - విపత్ జాల = ఆపదల సమూహముచేత, జటిలాన్= పెనఁచుకొనియున్న - విపత్తులతోఁ గూర్పఁబడి యున్న యనుట, కామాన్ = విషయములను, నముఞ్చామః = విడువము. విషయములస్వరూపము తెలిసియు వానిని విడువకున్న మనదే యపరాధ మని భావము. విచారింపఁగా మిక్కిలిప్రబలమై మఱొకకారణముండుటచే మనకుఁగూడ నపరాధము లేదనుచున్నాఁడు. మోహమహిమా=అజ్ఞానముయొక్కమాహాత్మ్యము,

గహనా=తెలిసికొనరానిది. అహహ=అక్కటా. అఘటితఘటనాచతురమైన యవిద్యయొక్క విలాసమహిమచేత లోకులు విహితము కానట్టిదానిని సైతము చేయుదురు. కాఁబట్టి మనయపరాధ మేమియు లే దని భావము.

చ. తెలియక నాశహేతు వగు తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుఁ గాక మతి చాలక మీనము గాలపుంగొనం
గలపిశితంబు తా మెసఁగుఁ గాక యెఱింగియు మేము దుఃఖదో
హలవనితాసుఖంబు విడనాడము మోహమహత్త్వ మెట్టిదో. 18

తా. దీపపుసెగ తన్ను నీఱుగాఁ గాల్చునని తెలియమిచే మిడుత యందుఁ బడి చెడుచున్నది. ఎర గాలములో గ్రుచ్చఁబడియున్న దని యెఱుఁగనిదై చేప దానిని మ్రింగి బ్రుంగుడువడుచున్నది. ఈరెండును తెలియమిచే నిట్లుచేసినవి. కావున వీనియం దేయపరాధమును లేదు. కాని విషయములు పెక్కువిపత్తులను గలిగించునవని చక్కఁగాఁ దెలిసియున్నవారమైనను వానిని విడువకున్నమనమే సాపరాధులము. మనమును అపరాధులము కాము. ఏలన, నిది యంతయు అజ్ఞానముయొక్క మహిమ. ఆమహిమయో కట్టా! యిట్టి దట్టి దని తెలియరాకున్నది.

అవ. అజ్ఞానమహిమయే సుఖప్రదములు కానియన్నపానాదివిషయములందును సుఖబుద్ధిని కలిగించుచున్న దనుచున్నాఁడు.

శ్లో॥ తృషా శుష్య త్యాస్యే పిబతి సలిలం శీతమధురం
క్షుధార్తః శాల్యన్నం కబళయతి మాంసాదికలితమ్।
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలిఙ్గతి వధూం
ప్రతీకారం వ్యాధేః సుఖ మితి విపర్యస్యతి జనః॥ 19

టీ. తృషా=దప్పిచేత, ఆస్యే=నోరు, శుష్యతిసతి=ఎండుచుండఁగా, శీతమధురం = చల్లనిదియు తాపహరము నైన, ('స్వాదు సురభి' అనుచో తీయనిదియు వాసనగలదియు నైన యనియర్థము), సలిలం=జలమును, పిబతి=త్రాగుచున్నాఁడు-ఇట 'మధురం' అనఁగా 'శీతలీ క్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్' అన్నట్లు తాపహరమైనదనుట-లేక చక్కెర మొదలైనవానిచేఁ దీయనిదిగాఁ జేయఁబడిన దనియు గ్రాహ్యము, క్షుధార్తః సన్=ఆఁకలిచేఁ బీడింపఁబడినవాఁ డగుచు, మాంసాదికలితమ్-మాంసాది=మాంసము మొదలైనవానితో-మాంసము నేయి పాలు పెరుఁగు మొదలైన వ్యంజనద్రవ్యములతో ననుట, కలితమ్=కూర్పఁబడిన, శాల్యన్నం=వరియన్నమును, కబళయతి=ముద్దగొనుచున్నాఁడు. (క్షుధార్తః సన్ శాలీన్కబళయతి శాకాదివలితాన్' అనుచో, శాకాదివలితాన్=కాయగూరలు మొదలైన వ్యంజనములతోఁగూడిన, శాలీన్=బియ్యమును-బియ్యపుటన్నమునునుట, తినుచున్నాఁ

డని యర్థము), కామాగ్నౌ=మన్మథాగ్ని, ప్రదీప్తేసతి=మిక్కిలి వెలుఁగుచుండఁగా-మరులు చెలరేఁగఁగా ననుట, ('రాగాగ్నౌ' అనుచో రాగ మనెడియగ్నియని యర్థము), సుదృఢతరం=మఱింత మిక్కిలి గట్టిగా, వధూం=స్త్రీని, ఆలింగతి=కౌఁగిలించుకొనుచున్నాఁడు. కాఁబట్టి, వ్యాధేః=రోగముయొక్క-ఆఁకలి దప్పి మొదలైన బాధలయొక్క యనుట, ప్రతీకారం=మాఱుచేయుట-వానిని అన్నపానాదులచే నుపశమింపఁజేయుట, సుఖం ఇతి=సుఖము అని, జనః=మనుష్యుఁడు, విపర్యస్యతి=తబ్బిబ్బువడుచున్నాఁడు-తలక్రిందుగా గ్రహించుచున్నాఁడు. సుఖమనునదియే లేదు; సుఖముగా ననుభవింపఁబడున వెల్ల బాధ తొలఁగుటచే నట్లు తోఁచుచున్నవే కాని యథార్థములుగా సుఖములు గావు. అయినను జనులు వానిని సుఖము లని తప్పుగా నెన్నుచున్నా రని భావము.

ఉ. శీతలవారిఁ ద్రావు వడఁ జెందినవాఁడు క్షుధార్తుఁ డిష్టమృ
ష్టాతతభక్ష్యమాంసకలితాన్నము సాపడు మన్మథాగ్నితా
పాతురుఁ డైనవాఁడు జవరాలిఁ గవుంగిటిలోనఁ జేర్చు నీ
రీతిని రోగశాంతికరకృత్యము భోగ మనంగఁ జెల్లునే. 19

తా. మనుజుఁడు దప్పిచే మొగము వఱువట్లువట్టినపుడు తీయనిచల్లనినీరు త్రాగుచున్నాఁడు. ఆఁకలి పీడించినపుడు పాలు నేయి పెరుఁగు మొదలైన వానితోఁ గూడినవరియన్నమును దినుచున్నాఁడు. మరులుగొన్నయెడల జవరాలిని బిగ్గఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు ఇట్లు బాధకు మాఱుసేయుటయే సుఖ మని తలక్రిందుగాఁ దలఁచుచున్నాఁడు. కాని నిజముగా సుఖ మెక్కడిది?

అవ. అజ్ఞుఁడు సంసారవిషయంబులందు బద్ధుఁ డగుచున్నాఁడు. జ్ఞానియో సర్వసంగములను వదలి కృతకృత్యుఁ డగుచున్నాఁ డనిచెప్పి నిగమించుచున్నాఁడు.

శ్లో॥ తుఙ్గం వేశ్మ సుతాః సతా మభిమతాః సఙ్ఖ్యాతిగాః సంపదః
కల్యాణీ దయితా వయ శ్చ నవ మి త్యజ్ఞానమూఢో జనః।
మత్వా విశ్వ మనశ్వరం నివిశతే సంసారకారాగృహే
సందృశ్య క్షణభఙ్గురం త దఖిలం ధన్యస్తు సన్న్యస్యతి॥ 20

టీ. తుఙ్గం=పొడువైన, వేశ్మ=యిల్లు, సతాం=సజ్జనులకు, అభిమతాః=ఇష్టులగువారైన, సుతాః=పుత్రులు - విద్యావినయాదిగుణంబులు పడసినవా రనుట, సఙ్ఖ్య అతిగాః=లెక్కనుగడచిన-లెక్కపెట్టరాని, సంపదః=సంపత్తులు, కల్యాణీ=శుభకారిణి యైనదై- అనుకూల్యాదిగుణములతోఁ గూడినదనుట-ఇదియే 'అనుకూలాం

విమలాఙ్గీం కులజాం కుశలాం సుశీలసంపన్నాం। పఞ్చలకౌరాం భార్యాం పురుషః పుణ్యోదయా ల్లభతే' అని చెప్పఁబడియున్నది. దయితా=ప్రియురాలు, నవం=క్రొత్తదైన, వయః=వయస్సు-యౌవనమనుట, ఇతి=అని, అజ్ఞాన మూఢః=మోహముచే మతిమాలిన-వివేకశూన్యుఁడైన, జనః=జనుఁడు, విశ్వం= సమస్తమును-ఇల్లు బిడ్డలు ధనము పెండ్లము మొదలుగాఁ గలప్రపంచము ననుట, అనశ్వరం=శాశ్వతమైనదిగా, మత్వా=తలఁచి, సంసారకారాగృహే=సంసారమనెడిచెఱసాలయందు నివిశతే=మిక్కిలిచొచ్చుచున్నాఁడు-సంసారమునందు తగులువడుచున్నాఁడుగాని అది యనర్థకరమని తెలియఁడనుట. అతిసంకటమై మిక్కిలి నిర్బంధము కలిగించునది గాన సంసారము కారాగృహముగా నిరూపింపఁబడినది. ధన్యస్తు=జ్ఞానియైన పుణ్యాత్ముఁడన్ననో, తత్ అఖిలం=దానినంతయు-ఆయిల్లు మొదలైన యఖిలప్రపంచమును క్షణభఙ్గురం=క్షణకాలములో నశించునదిగా-అనిత్యమైనదిగా ననుట, సందృశ్య=లెస్సగా కనుఁగొని, సన్న్యస్యతి=సన్న్యసించుచున్నాఁడు-వానియందుఁ దగులువడఁడు గాని విరక్తుఁడగుననిభావము. కాఁబట్టి జ్ఞానముచే సర్వానర్థములకు మూలమైన యజ్ఞానమును దొలఁగించి కృతకృత్యత పొందవలయు నని యాశయము.

చ. పొడువులు మాడువుల్ ఘనులు పుత్రులు పెక్కులు రమ్యసంపదల్
 పడఁతుక చారుశీల యెల ప్రాయ మటంచు నరుండు మూఢుఁడై
 కడు జగ మెల్ల శాశ్వతము గాఁ గొని సంసృతిబందిలోపలం
 బడు నిదిమాయయంచుమతి మంతుఁడుదావిడుచుర్ సమస్తమున్.

తా. పొడువులైన మిద్దెలను మేడలను, సజ్జనులచేఁ గొనియాడఁబడినకొడుకులను, కొలఁది యిడరాని సంపదలను, అనుకూలవతియైన యిల్లాలిని, ఎలజవ్వనమును, మఱియుం గలప్రపంచమునంతయు నజ్ఞాని యగుజనుఁడు నిత్యముగా నమ్మి సంసారమునం దగులువడుచున్నాఁడు. జ్ఞాని యగు పుణ్యాత్ముఁడో వానినెల్ల ననిత్యముగా గ్రహించి సన్న్యసించుచున్నాఁడు.

ఇది వైరాగ్యశతకమున

విషయపరిత్యాగవిడంబన యన్నది ద్వితీయదశకము.

## వైరాగ్యశతకము-యాచ్ఞాదైన్యదూషణము.

అవ. విషయములు యాచనయు దానివలన దైన్యమును గలిగించుచున్నవి. కాన విషయపరిత్యాగవిడంబనను బ్రస్తావించినపిదప యాచ్ఞాదైన్యమును దూషింపఁ దగును గానఁ బదిశ్లోకములచే దానిని దూషించుచున్నాఁడు.

శ్లో॥ దీనా దీనముఖైః సదైవ శిశుకై రాకృష్టజీర్ణామ్బరా
క్రోశద్భిః క్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యా న చే ద్గేహినీ।
యాచ్ఞాభఙ్గభయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కో దేహీతి వదే త్స్వదగ్ధజఠరస్యార్థే మనస్వీ పుమాన్. 21

టీ. దీనా=పేదరాలును, కావుననే, దీనముఖైః=విన్నవైన మొగములు గల వారును-కాంతిలేనిముఖములు గలవా రనుట, దేనిచేతననఁగా, క్రోశద్భిః=ఏడ్చుచున్న వారును, ఇది దేనిచేతననఁగా, క్షుధితైః=ఆఁకలిగొన్నవారును, అగు, శిశుకైః=నిసు వులచేత, సదా ఏవ=ఎప్పుడును, ఆకృష్ట జీర్ణ అమ్బరా=పట్టి లాగఁబడిన చినిగిన వలువగలదియు- బిడ్డలు అన్నాదు లడుగుచు వలువనుబట్టి యీడుచుచుండుట గలది యనుట, నిరన్నవిధురా= అన్నము లేనిదియు (కావుననే) కష్టపడుచున్నదియు, 'విధురః ప్రత్యవేతేస్యా త్కష్టవిశ్లిష్టయోరపి' అని విశ్వము, అగు, గేహినీ=ఇల్లాలు, దృశ్యా=కనఁబడునది, నచేత్=కాదేని, ('నరై ర్నవిధురా దృశ్యేతచే ద్గేహినీ' అను చో, విధురా=అన్నాదులు లేమిచే కష్టపడునట్టి, గేహినీ=ఇల్లాలు, నరైః=మనుజు లచేత, నదృశ్యేతచేత్=చూడఁబడదేని), మనస్వీ=ధైర్యశాలియగు, కః=ఏ, పుమాన్ =పురుషుఁడు,యాచ్ఞాభఙ్గభయేన-యాచ్ఞా=యాచనయొక్క, భఙ్గ=చెడిపోవుటవలని, భయేన=దిగులుచేత-యాచించుట విఫలమగునో యనువెఱపుచే ననుట,గద్గద...క్షరం యథాతథా-గద్గద=డగ్గుత్తికగల-హీనస్వరముగల యనుట - గద్గదశబ్దము అనుకరణశ బ్దము, గళ=పత్తుకయందు, త్రుట్యత్=తునుఁగుచు, కావుననే, విలీనా=లోపలనే యడంగునట్టి-ఇంచుమించుగా నుచ్చరింపఁబడనట్టి, అక్షరంయథాతథా=అక్కరములు గలుగునట్లుగా-డగ్గుత్తికచే నక్షరములొక్కొక్కటియుకొంతగొంతులోపల నేయడఁగి కొంత బయటికి వచ్చునట్లు అనుట, స్వదగ్ధ జఠరస్య-స్వ=తనయొక్క, దగ్ధ=కాలిన -తుచ్ఛమైనయనుట, జఠరస్య = పొట్టయొక్క, అర్థే = కొఱకు-దాని నిండించుట కొఱకు-దగ్ధశబ్దము నిర్వేదమును సూచించెడి, ఇట్లే సురేశ్వరవార్తికమున 'అస్య దగ్ధోదరస్యార్థే కిం న కుర్వ న్త్యసాంప్రతమ్' అని చెప్పఁబడినది, దేహి ఇతి=ఇమ్ము అని, వదేత్=చెప్పును-అట్లు ఆఁకటిచేతను నిసువులవలని రొదచేతను నవయుచున్న యిల్లాలిని జూడనియెడల మాట తొట్రువడం బాదుపొట్టకొఱకు 'దేహి' యని ధీరుఁ డెవ్వఁడును యాచింపఁడనుట, అట్టియిల్లాలిం జూచుటవలననే యిట్టియవస్థ గలుగు చున్నది గాన అనర్థమూలమైనయద్దాని నవశ్యము పరిత్యజింపవలయు నని భావము.

ఉ. ఆఁకొని యేడ్చు లేఁబిఱుతకై లన్నముకై తనకొంగు లాగఁ బె
ల్లాఁకట సోలు చుండెడునిల్లాంగనదుర్దశఁ జూడఁడేని యా

చ్ఛాకలనావిభంగభయసంభృతగద్గదశూన్యకంఠుఁ డై
చేకొని దేహి యం చడుగఁ జేరునె కాలినపొట్ట కెవ్వఁడున్. 21

తా. నిఱుపేదరా లగుటచే బిడ్డలకుఁ గూడువెట్టుటకు గతిలేకుండుటవలన వా రాఁకలిగొని యేడ్చుచు మొగములువాడఁ దనచినిఁగినచీర చెఱంగుఁ బట్టి యెడతెగక లాగుచుండఁగాఁ, దాను నన్నాదులు లేక నవయుచున్నయిల్లాలు కంటఁ బడకుండు నేని ధీరుఁ డెవ్వఁడుగాని యీపాడుపొట్టకొఱకు యాచింపఁబూని, యాచించినచో నేమియు నియ్యక యెవరు దన్నుఁ దూలనాడుదురో యనుదిగులుచేత గొంతుకలోనుం డి యక్షరములు సగము వచ్చియు రాక తొట్రుపడుచుండఁ గ్రేటుకొనుచు 'దేహి' యని యడుగఁడు.

అవ. ఇపుడు దీనత్వమునకును అనర్థమునకును మూల మైన యుదరమును నిందించుచున్నాఁడు.

శ్లో॥ అభిమతమహామానగ్రన్థిప్రభేదపటీయసీ
గురుతరగుణగ్రామామ్భోజస్ఫుటోజ్జ్వలచన్ద్రికా।
విపులవిలసల్లజ్జావల్లీవితానకుఠారికా
జఠరపిఠరీ దుష్పూరేయం కరోతి విడమ్బనమ్॥ 22

టీ. అభిమత...పటీయసీ-అభిమత=(కీర్తి మొదలైనవి కలిగించున దగుటచే) ఇష్టమైనదియు, మహత్=గొప్పదియు, మాన=అభిమానముయొక్క-తన్ను గొప్పగా నెన్నుకొనుటయొక్క, గ్రన్థి=ముడియొక్క, ప్రభేద=విడఁదీయుటయందు, పటీయసీ =మిక్కిలి సమర్థమైనదియు-ముడిని విడఁదీయుట యనఁగా పట్టులేకుండఁజేయుట- అనగా ఛేదించుట, కనుక మానముయొక్క ముడిని వీడ్చునది యనఁగా మానము ను నాశముసేయునది యని భావము, మఱియును, గురుతర...చన్ద్రికా-గురుతర= మిగులగొప్పలైన, గుణగ్రామ=గాంభీర్యధైర్యాదిగుణగణములనెడి, అమ్భోజ=తామర లకు, స్ఫుట=విశదమును, ఉజ్జ్వల=ప్రకాశించుచున్నదియు-విశదముగా వెలుఁగుచు న్నట్టి యనుట, చన్ద్రికా=వెన్నెలయైనదియు-తామరలను వెన్నెల యెట్లో యట్లె గు ణగణములను సంకోచింపఁజేయునది యనుట, విపుల...కుఠారికా-విపులం యథాత థా=మిక్కిలిగా, విలసత్=ప్రకాశించుచున్న, లజ్జా=సిగ్గుఅనెడి, వల్లీ=తీఁగలయొ క్క, వితాన=సమూహమునకు, కుఠారికా=గొడ్డలియైనదియు-తీఁగలను ద్రుంచుగొ డ్డలివలె సిగ్గును ద్రుంచివైచున దనుట, దుష్పూరా=పూరించుట కలవి కానిదియు- ప్రతిదినమును=అన్నపానాదులచే నిండించినను చాలు ననకుండున దనుట, అగు, ఇ యం=ఈ, జఠర పిఠరీ=ఉదరమనెడివంటకుండ, విడమ్బనం=డిందుపడుటను-అనఁగా అకార్యములు సేయుట అవాచ్యములు పలుకుట అహేయములు విడుచుట మొదల గువానిని, కరోతి=చేయుచున్నది, లేక, యాచన ననుకరింపఁ జేయు ననుట, యా

చాదైన్యమును మనల నభినయింపఁ జేయుచున్నదని భావము, ఇంతకంటె దైన్యము ను గలిగినది మఱొక్కటి లేదని యాశయము. అలం. రూపకము.

శా. మానగ్రంథివిభేదనక్షమము శుంభద్ధైర్యగాంభీర్యము
ఖ్యానేకప్రియసద్గుణాంబుజసమూహజ్యోత్స్న లజ్జాలతా
హానిస్ఫారకుఠారధార జఠరంబన్నట్టిపెన్బాన యా
రా నిండారదు దైన్యవృత్త్యభినయప్రాగల్భ్యముం జూపుచున్.

తా. ఈయుదర మను పెనురుకుండ మిక్కిలియు నిష్టమై విడువరానట్టి పెను మానమునుగూడఁ దూలునట్లు చేయుచున్నది. మిక్కిలి గొప్పలైనగుణములనెల్ల, వెన్నెలఁ దామరలనుంబోలె, సంకోచింపఁజేయుచున్నది. మిక్కిలి విలసిల్లులజ్జను, గొడ్డలి తీఁగను ద్రుంచునట్లు, ద్రుంచుచున్నది. ఎంత నిండించినను నిండదు. మఱి యాచన సేయించి దీనత్వము కలిగించుచున్నది.

అవ. మాని యైనవానికి బంధువులకడ యాచించుటకంటె మఱొకచోట బిచ్చ మెత్తి బ్రతుకుట మే లనుచున్నాఁడు.

శ్లో॥ పుణ్యే గ్రామే వనేవా మహతి సితపటచ్ఛన్నపాలీం కపాలీ
మాదాయ న్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకణ్ఠే
ద్వారం ద్వారం ప్రవిష్టో వర ముదరదరీపూరణాయ క్షుధార్తో
మానీ ప్రాణైః సనాథో న పున రనుదినం తుల్యకుల్యేషు దీనః॥23

టి. న్యాయ...కణ్ఠే-న్యాయగర్భం యథాతథా=మీమాంసాశాస్త్రమునం జెప్పఁబడిన విధానములు లోపలఁ గలుగునట్లుగా-లేక, న్యాయములులోపలఁ గలవారైన అని ద్విజశబ్దమునకు విశేషణము- స్వరప్రకారమున మంత్రములను బఠించునట్టివారైన యనుట, ద్విజ=బ్రాహ్మణులచేత, హుత=వేల్వఁబడిన,హుతభుక్=అగ్నిహోత్రములయొక్క, ధూమ=పొగచే, ధూమ్ర=నలుపుమించినయెఱుపుగల, ఉపకణ్ఠే=సమీపప్రదేశముగల, పుణ్యే గ్రామే=పవిత్రమైన యొకగ్రామమందుఁగాని-అగ్రహారమందుఁగాని యనుట, మహతివనే=గొప్పయడవియందుఁగాని-అడవియందును వానప్రస్థాదు లుండుటచే నందుఁగాని యనుట, సిత...పాలీం-సిత=తెల్లని, పట=గుడ్డచే ఛన్న=కప్పఁబడిన, పాలీం=ఓరలుగల-ఇతరులదృష్టికిఁ దెలియకుండునట్లు గుడ్డతోఁ గప్పఁబడిన యనుట-ఇట్లు గప్పుట విశిష్టాచార మని తెలియునది, కపాలీం=బిచ్చపు మూఁకుడును, ఆదాయ=కొని, క్షుధార్తః=ఆఁకటిచేఁ బీడింపఁబడిన, మానీ=మానముగల పురుషుఁడు, ఉదర...పూరణాయ-ఉదరదరీ=పొట్ట యనెడిగుహను, పూరణాయ=నిండించుటకొఱకు, ద్వారం ద్వారం=గృహస్థులయొక్క యిండ్లకడప కడ

పను, ప్రవిష్టః=చొచ్చినవాఁడై, ప్రాణైః సనాథః చేత్=ప్రాణములతోఁగూడిన వాఁడగు నేని-ఇంటింట బిచ్చమెత్తితిని బ్రతుకు నేని,వరం=కొంత మేలు. పునః=అయితే, అనుదినం=ప్రతిదినమును, తుల్యకుల్యేషు=సమానకులజులయందు- తనకుసమాన కులజనితులైనవారినడుమ,దీనః=దీనుఁడగు నేని-ఇఁడు విన్నఁదనముతో బ్రతుకు నేని, న=మేలుకాదు. ('మానీ ప్రాణీ సధన్యోనపునః' అనుపాఠమున-ఇంటింట నట్లు బిచ్చమెత్తుమానవంతుఁడైన ప్రాణియగువాఁడే ధన్యుఁడు. తనసమానకులజులైనవారినడుమ తక్కువపాటుతో దీనుఁడై యుండి బ్రతుకువాఁడు ధన్యుఁడు గాఁడని యర్థము), బంధువులనడుమ యాచించి నీచముగా బ్రతుకుటకంటె మఱియొకచో నింటింట బిచ్చమెత్తిబ్రతుకుట మేలని భావము. 'న బన్ధుమధ్యే ధనహీనజీవనమ్; ధనములేక బంధువులనడుమ బ్రతుకరాదు' అనువచన మిట నూహ్యము. అయినను 'త్యజన్త్యసూన్ శర్మచమానినో వరం త్యజన్తి న త్వేకమయాచితవ్రతమ్-మానవంతులుప్రాణములను సుఖమునైన మేలుగావిడుతురుగాని యాచింపకుండునట్లు తాము చేసికొన్న వ్రతము నొకటినిమాత్రము విడువరు' అన్నట్లు మానులకు నెప్పుడు యాచింపకుండుటయే ముఖ్యవ్రతమయ్యెను, మిక్కిలి యాఁకటిపెల్లుచే నొకవేళ యాచింపఁ బూనిరేని యప్పుడు పరిచితముకాని యొకానొకచోట శ్రోత్రియులగృహములందుఁ గపాలంబున బిచ్చమెత్తి కడుపుఁ బ్రోచుకొనఁదగునుగాని ప్రాణసంకటము గలిగినను బంధుజనులయాచించి బ్రతుకుట యతినీచముగాన వారికిఁదగదు అని గూఢాభిసంధి.

చ. అవనిసురావళీహుతహుతాశనకోమలధూమధూమలా
  ప్రవిశదవాటియందు వనభాగమునందుఁ గపాలపాణినై
  భవనములందు భిక్షగొని ప్రాణముదాల్చుట కొంతమేలు బాం
  ధవులను జేరి వేఁడి కడుదైన్యముఁ జెందుటకంటె మానికిన్. 23

తా. స్వరప్రకారమున బ్రాహ్మణులు మంత్రములు పఠించుచు వేల్చునగ్నిహోత్రములనుండి వెడలుపొగలచే నలుపుమించిన యొఱుపువన్నె గాంచిన చుట్టుఁబట్లు గలిగినయొకపుణ్యగ్రామమునఁగాని గొప్పయడవినిగాని తెలిగుడ్డ కప్పిన యొక్క తిరిపపుమూఁకుడుగొని యాఁకలిగొన్నప్పుడు పెనుఁగడుపుఁ బ్రోచికొనుటకై యిల్లిల్లు దిరిగి తిరిప మెత్తి బ్రతుకుట మానవంతునికిఁ గొంత మేలుగాని ప్రతిదినము తనసరియగుకులజులనడుమ యాచించుచు దీనవృత్తి నుంకుట యెంతయు మేలుగాదు.

అవ. ఈ యాచనకంటె మేలైనగతి మఱి వే ఱొకటి లేదాయని వితర్కించుచు న ట్లుండగా నిదియేల యని దూషించుచున్నాఁడు.

శ్లో॥ గఙ్గాతరఙ్గహిమశీకరశీతలాని
  విద్యాధరాధ్యుషితచారుశిలాతలాని।

స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
య త్సావమానపరపిణ్డరతా మనుష్యాః॥ 24

టీ. గఙ్గా...శీతలాని-గఙ్గాతరఙ్గ=గంగానదియలలయొక్క, హిమ=చల్లని, శీకర=తుంపురులచేత, శీతలాని=చల్లనైనవియు,విద్యా...తలాని-విద్యాధర=విద్యాధరులనెడి దేవయోనివిశేషులచేత, అధ్యుషితాని=అధిష్ఠింపఁబడిన, చారు=రమ్యములైన, శిలాతలాని=ఱాతిప్రదేశములు గలదియు-ఈరెంశువిశేషణములచేతనే పరమపవిత్రమయినదని సూచితము, అగు, హిమవతః=మంచుకొండయొక్క, స్థానాని=ప్రాంతప్రదేశములు, ప్రళయం=నాశమును, గతాని కిం=పొందినవా యేమి? కింశబ్దమిట వితర్కమును దెలుపును. హిమాలయస్థానములు నశింపకుండఁగా నవి నశించెనా యని యేల వితర్కింపవలసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు. యత్=ఎందుచేత, మనుష్యాః=మనుజులు, సావ...రతాః-సావమాన=అవమానములోఁ గూడిన-తిరస్కారపూర్వకముగా పెట్టంబడు, పరపిండ=ఇతరుల కూళ్లయందు, రతాః=ఆసక్తులో, అందుచేత నవి నశించినవా యని వితర్క మనుట. హిమగిరిస్థానములు నశింపకుండునేని జను లిట్లు కష్టపడి యాచించి బ్రతుకువారు గా నేరరు. అవి నశించుటంబట్టి యిట్టికష్టదశపాలై రని తలఁచి యీవితర్కము కలిగె నని వాక్యార్థము. యాచ్ఞయనెడి పాడుపిశాచముసెత్తిని పిడుగు వైచి పర్వతపరిసరంబుల సుఖముగా వసింపఁదగు నని సూచితము.

తే. పూతగంగోర్మిశీకరశీతలములు
లలితవిద్యాధరాధ్యశిలాతలములు
హిమగిరిస్థానములు నశియించె నొక్కొ
నరులు నిందితపరపిండనిరతు లగుట. 24

తా. పరు లవమానపూర్వకముగాఁ బెట్టు పిండమును దినుటకంటె, గంగయలలవలని చల్లనితుంపురులచేఁ జల్లనై విద్యాధరులు విహరించు మనోహరశిలాప్రదేశములు గలిగి వెలయు హిమాలయమునందలిప్రదేశములందు సుఖముగా వసించి కాలము పుచ్చుట మనుష్యులకు మిక్కిలి శ్రేయము.

అవ. ఇప్పు డింతకంటె వేఱొకజీవనోపాయములేదా యని వితర్కించుచు నట్లుండఁగా నిది యేల యని దీనిని దూషించుచున్నాఁడు.

శ్లో॥ కిం కన్దాః కన్దరేభ్యః ప్రళయ ముపగతా నిర్ఝరా వా గిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్యః సరసఫలభృతో వల్కలిన్య శ్చ శాఖాః।
వీక్ష్యన్తే యన్ముఖాని ప్రసభ మపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్తస్మయపవనవశానర్తితభ్రూలతాని॥ 25

టీ. కన్దరేభ్యః = గుహలవలననుండి, కన్దాః=గడ్డలు-కందమూలఫలాదులనుట-ఆఁకలిని బోఁగొట్టఁజాలినపదార్థములనిభావము, ప్రళయం=నాశమును- మొలవకయుడుగుటను, ఉపగతాః కిం=పొందినవాయేమి? ఇచట కింశబ్దము వితర్కసూచకము. గిరిభ్యః=కొండలనుండి, నిర్ఝరాః=సెలయేళ్లు-దప్పిని బోఁగొట్టఁజాలునవి యనుట, కింవా ప్రళయ ముపగతాః=నశించినవాయేమి-దీనినిట్లే మీఁదనెల్ల గ్రహించుకొనునది. తరుభ్యః=చెట్లనుండి, సరసఫలభృతః =మాధుర్యరసముతోఁగూడినపండ్ల నుదాల్చునవియు, వల్కలిన్యః=నార-చీరలుగలవియు, అగు, శాఖాః=కొమ్మలు, ప్రధ్వస్తావా=నశించినవాయేమి? 'సరసఫలభృతః' 'వల్కలిన్యః' అను రెండువిశేషణములచేత మంచిభోజ్యవస్తువులతో నిండియుండుటయు కట్టుపుట్టములు గలిగియుండుటయు సూచితములు. ఇట్లు కందమూలాదులెల్లనుండఁగా అవిలేవా యని వితర్కింప నేల యనఁగాఁ జెప్పుచున్నాఁడు. యత్=దేనివలన, ప్రసభంయథాతథా=మిక్కిలియు, అపగతప్రశ్రయాణాం=పోయినవినయముగలవారగు- వినయశూన్యులనుట, ఖలానాం=దుర్జనులయొక్క-దుష్టప్రభువులయొక్కయనుట, దుఃఖ...లతాని-దుఃఖ=కష్టముచే, ఉపాత్త=పొందఁబడిన, అల్ప=కొంచెమైన, విత్త=ధనమువలనఁగలిగిన, స్మయ=గర్వమనెడి, పవన=గాలియొక్క, వశ=అధీనతచేత, ఆనర్తిత=ఆడింపఁబడిన, భ్రూలతానాం=తీఁగలవంటికనుబొమలు గల-భ్రూవికారములు గలిగినట్టి యనుట, ముఖాని= మొగములు, వీక్ష్యన్తే=చూడఁబడుచున్నవో- యాచకజనులచేత నని శేషము, అందుచేత నే కందమూలాదులు కందరాదులందు లేవా యని వితర్కింపఁబడె నని భావము. ఆఁకలిదప్పులకుఁ గట్టుకొనుటకు కందమూలఫలనిర్ఝరవల్కలాదులు కందరాదులందు వలయునంత యుండఁగా నొకరిని యాచింపక యావస్తువులతో గౌరవముగాను సుఖముగాను కడుపుఁబ్రోచుకొనక దుష్టప్రభువులఁగొలిచి జనులు గష్టపడుచున్నారు. వారు కష్టపడుటంజూచి కందమూలాదులుగల గిరికందరాదులు లేవా యని యిట్లు వితర్కింపవలసి వచ్చినదికాని మరేమికాదని భావము. వినయశూన్యులగు దుష్టప్రభువులఁగొలుచుట మిక్కిలినీచమును శాస్త్రనిషిద్ధము నగునుగాన యట్టికొలువుచే బ్రదుకుట దగదని యభిసంధి. 'స్మయపవన' 'భ్రూలతా' అనుచోట్ల ఉపమారూపకములు రెండును గూడునుగాన సందేహసంకరము.

మ. ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో శైలమ్మే ళ్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం బాడయ్యెనో చూడఁ గే
వలదుఃఖాప్తమితార్థగర్వపవనవ్యానర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁ జూచెదరు భ్రాంతస్వాంతులై యాచకుల్.

తా. ఆఁకలిదీర్చుటకు గుహలందుఁ గందమూలములును, దప్పిపోఁగొట్టుటకుఁ గొండలందు సెలయేళ్లును, జవులుగా మెసవుటకుఁ జెట్లయందుఁ దియ్యనిపండ్లును,

పయింగప్పకొనుటకు వారియందే నారలును, వలయునంతయుండఁగా వానితో సుఖముగాఁ గడుపుఁ ద్రోచుకొనవచ్చునుగాని, కష్టపడి యొక్కింతధనమార్జించినంత నే మరియాద తప్పి గర్వ మెచ్చి బొమ లెగాదిగ్ద్రిప్పు దుష్టుల మొగములు చూచుచు వారిని గొలుచుట మిక్కిలి తగదు.

అవ. యాచకులు ఖలులముఖములు చూచుచుఁ గొలుచుచున్నారని మున్ను వారియెడఁ దాను సూచించిననింద నిపుడు ప్రకటముగాఁ దెలుపుటకై, దుష్టప్రభువును జిరకాలము గొలిచి వేసరినయొకానొకఁడు చెప్పుమాటలను నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ పుణ్యై ర్మూలఫలైః ప్రియే ప్రణయినీ వృత్తిం కురు ష్వాధునా
భూశయ్యానవవల్కలై రకరుణై రుత్తిష్ఠ యావో వనమ్
క్షుద్రాణా మవివేకమూఢమనసాం య త్రేశ్వరాణాం సదా
విత్తవ్యాధివికారవిహ్వలగిరాం నామాపి న శ్రూయతే॥ 26

టీ. ప్రియే=ప్రియవస్తువునందు, ప్రణయినీ = ఆశగలిగియున్న - కోరినదానినొడఁగూర్చుకొన్నట్టిదాన వైన, (త్వం=నీవు), పుణ్యైః=పవిత్రము లైన, మూలఫలైః=వేళ్లచేతను పండ్లచేతను, అకరుణైః=దయలేని-కఱకైన యనుట, భూశయ్యానవవల్కలైః=భూశయ్యచేతను క్రొత్తనారచీరలచేతను-భూమియే శయ్యగాఁ గరుండియు క్రొత్తనారలనే వలువలుగాఁ గట్టికొనియు ననుట, వృత్తిం=బ్రతుకును, అధునా = ఇప్పుడు, కురుష్వ=చేసికొనుము. ఇఁక వేళ్లు పండ్లు దిని పుడమినే పండుకొని నారలే కట్టుకొని బ్రతుకునట్లు పూనుమనుట,(భూశయ్యాం నవపల్లవై రకృపణైః' అనుచో, అకృపణైః=వాడనట్టి, నవపల్లవైః=క్రొత్తచిగుళ్లచేత,భూశయ్యాం=భూమియందలిపడుకను, కురుష్వ=కావించుకొనుము. అని యర్థము), ఇట్లు బ్రతుకుటకై, ఉత్తిష్ఠ=లెమ్ము, వనం=అడవికి, యావః=ఇరువురును బోవుదము. ఇచటనుండి నీచులను గొలిచి కుచ్ఛితపుబ్రతుకు బ్రదుకక యడవికిఁ బోవుదము రమ్మనుట. అట్లుచటికిఁ బోవుటవలనిఫలమును జెప్పుచున్నాఁడు. యత్ర=ఏయడవియందు-ఆయడవియందనుట, క్షుద్రాణాం=నీచులైనవారును, అవివేకమూఢమనసాం = వివేకములేమిచే తెలివిమాలినమనస్సు గలవారును, సదా=ఎప్పుడును, విత్త...గిరాం-విత్తవ్యాధి=ధన మనెడిరోగముచేత, కలిగిన, వికార=విపరీతభావముచేత, విహ్వల=వికలమైన-స్పష్టముకాని, గిరాం=పలుకులు గలవారును, అను, ఈశ్వరాణాం=ఏలికలయొక్క-ప్రభువులయొక్క, నామఅపి=పేరుకూడ,నశ్రూయతే=వినఁబడదో-వారిపేరే వినఁబడదేని వారిదర్శనసేవ నాదు లెక్కడివని భావము. ధనమదాంధులైనవారివలన మర్మములు దూఱు నాడుమాటలు వినుటకంటె కాఱడవియందు నాకులలములు తిని

బ్రదుకుట యుత్తమమని భావము. ఐహికాముష్మికఫలలేశమును గలిగింపనినీచులఁ గొలుచుటమాని సకలశ్రేయంబుల నొడఁగూర్చువనంబునకుఁ బొమ్ము; వనవాసము కర్తవ్యమని యాశయము.

చ. ప్రవిమలకందమూలఫలపంక్తుల జీవికఁ జేయు ముర్విపై
నవనవపల్లవంబుల నొనర్పుము పానుపు లెమ్ము పావనా
టవికిని బోవు మయ్యెడ దృఢద్రవిణామయదుర్వికారగా
రవవికలోక్తులై మెలఁగురాజులపేరును జెప్పఁ డెవ్వఁడున్. 26

తా. ఓసీ! నీచులఁ గొలిచి బ్రతుకరాదనుకోరిక నెఱవేర్చుకొనఁదలఁచితివేని, యిది మొదలుగా కందమూలాదులు దిని పుడమియె పడుకగాఁ బరుండి నారలు వలువలుగాఁ గట్టుకొని బ్రతుకు జరుపఁ జూడుము. లెమ్ము. అందులకై మనయిరువుర మడవికే పోవలయు. ఏలన, నడవియందు, మలితెలివిమాలి ధనమదముచే తాలుమాలుగ నోరికోలఁదు లాడు నీచప్రభువులపేరైనను వినరాదు గాన నీకోరినట్లు వారితోడికూడికయే మనకుఁ గలుగదు.

అవ. బ్రతుకుటకు వలయుసాధనములెల్ల మితిగాని యడ్డుగాని లేక సమృద్ధముగా నుండఁగా కృపణుఁడు తనకార్పణ్యమును విడువక యొరుల యాచించుదైన్యముచేఁ గుందుచున్నాఁడే. ఏమి చేయవచ్చు ననుచున్నాఁడు.

శ్లో॥ ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివన మఖేదం క్షితిరుహాం
పయః స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితామ్।
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహన్తే సన్తాపం తదపి ధనినాం ద్వారి కృపణాః॥ 27

టీ. ప్రతివనం=ఒక్కొకయడవియందును-ఒక్కొకచోటనే కాదనుట, అఖేదం యథాతథా=అనాయాసముగా, స్వేచ్ఛాలభ్యం=తనయిచ్ఛచే దొరకఁదగినవి-తానే సొంతముగాఁ బడయవచ్చును; ఒకరినిగొని పడయనక్కఱలేదనుట, క్షితిరుహాం=చెట్లయొక్క-అరఁటి మామిడి పనస మొదలైన ఫలవృక్షములయొక్క, ఫలం=పండు, ఉన్నదని శేషము-కడుపునిండించుటకుఁ జాలినన్ని యున్నవని భావము. స్థానేస్థానే=ఒక్కొక్కచోటను, శిశిరమధురం=చల్లనై తాపముఁ బోఁగొట్టునట్టి దగు, పుణ్యసరితాం=గంగ గోదావరి మొదలైన పవిత్రనదులయొక్క, పయః=తీర్థము, అస్తి=ఉన్నదని శేషము-సరిత్తులకు 'పుణ్య' అనువిశేషణముచే స్నానపానములవలన బాహ్యాభ్యంతరకాలుష్యములనుదొలఁగించి తృష్ణనుపశమింపఁజేయునవై యున్నవని భావము. శాస్త్రిములు 'పరోపకారాయ ఫలన్తి వృక్షాః పరోపకారాయ వహన్తి నద్యః' అని వృక్షములకును నదులకుఁ జెప్పుపరోపకారవృత్తి యిట సూచితము. సులలితలతా

పల్లవమయీ - సులలిత=మిక్కిలికోమలములైన, లతాపల్లవ = తీఁగలయాకులచేత, మయీ=ప్రచురమైనదియు, కావుననే, మృదుస్పర్శా=మెత్తనితాఁకుడు గలదియు- అంటుటకు మృదువైనదియు, అసు. శయ్యా=పడుక, ఉన్నదని శేషము-సుఖముగా నిదురించుటకుఁ దగినదై యున్నదని భావము. తదపి=అయినను, ధనినాం=ధనవంతుల యొక్క, ద్వారి=మోసలయందు, కృపణాః=ధనపరాయణులైనవారు, సన్తాపం= వారలను గొలుచుట యనువర్తించుట మొదలైనవానివలనికొందలపాటును, సహన్తే =ఓర్చుకొనియెదరు. వారిట్టినీచులై యుండఁగా ఇఁక వారివేలు గోరి మే మేమి చేయవచ్చుననియర్థము. ఏఫలమును గలిగింపనిదై, బలవదనిష్టపరంపరలఁ గూర్చుచు, దురంతసంతాపముంజేయుచు, నతికార్పణ్యముపుట్టించుచు, కీర్తిప్రతిష్ఠాభంజకమైన యీదుష్టప్రభుసేవను మాని సకలశ్రేయస్సంపాదనమైన వనవాసజీవనమే చేయుం దగు నని *తాత్పర్యము.

చ. కలవు పచేళిమంబు లయి కానలలోపలఁ బండ్లు ప్రమాఁకులం
గలవు పవిత్రవాహినులఁ గమ్మనిశీతలవారిపూరముల్
గలవు చివుళ్లపాన్పు లవి గైకొననేరక దీను లై ధనా
ఢ్యులగవని౯ వసించి నరులోలి సహింతురు తీవ్రతాపమున్.27

తా. ఒక్కొక్కయడవియందును జెట్లలోనిపండ్లు కడుపునకుఁ జాలినన్ని సుఖముగా దొరకుచున్నవి. ఎడనెడ నొక్కొకచోటఁ బుణ్యనదులందు చల్లనితియ్యనినీరు దాపముఁ బోఁగొట్టుట కున్నది. తీఁగెలలేఁజిగుళ్లచేసైన మెత్తనిసెజ్జయు సుఖముగా నిదురించుటకుఁ గలిగియున్నది. ఇట్లన్నియుండియు ద్రవ్యాశాపరు లగునీచులు ధనవంతులయిండ్లమొగసాలలకడఁ గొలువుగొలిచి కష్టపడియెదరు. ఏ మాశ్చర్యము!

అవ. విరక్తుఁడై సమాధి నధిగమించినయొకఁడు మున్ను ధనాఢ్యులఁ గొలుచుచు విషయలంపటుఁడై యున్నకాలమందు దినములు పుచ్చినరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యే వర్ధన్తే ధనపతిపురః ప్రార్థనాదుఃఖభాజో
యే చాల్పత్వం దధతి విషయాక్షేపపర్యస్తబుద్ధేః।

---

* ఇదియే 'చీరాణి కిం పథి న సన్తి దిశన్తి భిక్షాం, నోవాఙ్ఘ్రిపాః ఫలభృతః సరితోఽప్యశుష్యన్, శుద్ధాగృహాః కిము న సన్తి మహానుభావా, యస్మాద్భజన్తి యతయో ధనదుర్మదాన్ధాన్-దారియందువలువలులేవా? బిచ్చములు పెట్టరా? పండ్లు గలచెట్లులేవా? నదులుకూడ నెండిపోయినవా? నిర్మలములైనయిండ్లు లేవా? మహాత్ములు లేరా? యతులు, ద్రవ్యముచే మత్తిలి కన్నుగాననివారిని గొలువనేల' అని భాగవతమునను జెప్పఁబడినది.

తేషా మన్తఃస్ఫురితహసితం వాసరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరగ్రావశయ్యానిషణ్ణః॥ 28

టీ. ధనపతిపురః-ధనపతి=ధనాఢ్యుఁడైనవానియొక్క, పురః=ముందల, ప్రార్థనాదుఃఖభాజః=యాచ్ఞాదైన్యమును బొందినవానికి, యే=ఎవి-ఏదినము లనుట, వర్ధన్తే=పెరుఁగుచున్నవో-దీర్ఘములుగానుండునో-ధనవంతులఁ గొలుచుకష్టమునంబట్టి దినములు గడపరాక దీర్ఘములుగాఁ దోఁచునోయనుట, విషయా...బుద్ధేః-విషయ=విషయభోగములయొక్క, ఆక్షేప=ఆకర్షణమువలన, పర్యస్త=వ్యాకులమైన, బుద్ధేః=బుద్ధిగలవానికిని-విషయసుఖానుభవములందు మగ్నుఁడై చొక్కి బుద్ధి తడఁబడి యున్నవాని కనుట, యేచ=ఏదినములు, అల్పత్వం=కుఱుచఁదనమును-కుఱుచగాఁ దోఁచుటను, దధతి=తాల్చుచున్నవో, తేషాం వాసరాణాం=ఆదినములను, శిఖరి... నిషణ్ణః-శిఖరి=కొండయొక్క, కుహర=గుహయందలి, గ్రావ=తాయియనెడి,శయ్యా=పడుకయందు, నిషణ్ణఃసన్=కూర్చున్నవాఁడనై, ధ్యానచ్ఛేదే=ధ్యానమును వీడిన పిదప-ధ్యానమును నిలిపియున్న వ్యుత్థానములం దనుట, లేక-ధ్యానముయొక్క కడప ట, అన్తఃస్ఫురితహసితంయథాతథా=లోపలనేస్ఫురించినట్టి నగవు గలుగునట్లుగా-లోపల నే నవ్వుకొనుచుననుట,స్మరేయం=తలంచుకొనుచున్నాను. ఇప్పుడు నేను విష యలంపటుఁడనై దినములు గడపుచున్నాను. ఇఁక నీశ్వరానుగ్రహమువలన దీనిని విడి చి యొకకొండగుహఁజని యందలితాలిపై కూర్చుండి ధ్యానసమాధి నొందువాఁ డ నగుదునేని యపుడు ధ్యానముచేసి తీఱుపాటు గలిగినకాలమందుఁగాని ధ్యానము చేయుచు నడుమనడుమ తెలపిగా నుండుకాలమందుఁగాని యిప్పుడు నేను జరుపు చున్న యీవిషయానుభవవృత్తిని మనస్సులోనే నవ్వుకొనుచుఁ దలఁచుకొందును. ఇట్టివిషయసుఖమును దలఁపునకు తెచ్చునట్టి దేదైన 'సదృశాః దృష్టిచిన్తాద్యాః స్మృతిబీజస్యబోధకాః'అన్నట్లు కంటికిఁగాని మనస్సునకుఁగాని తగిలినట్లయిన నప్పు డీయ నుభవించుచున్నవి నాతలఁపునకు వచ్చును. నేను వీనిని దలఁచి లోపలనే నవ్వు కొందు నని భావము.

చ. ధనపతిమ్రోల నిల్చి కడుదైన్యముఁ జూపెడువార లెవ్వరో
ఘనవిషయాభిలాష మతికల్పన మీఱినసేచు లెవ్వరో
మొనయుచు వారిదుష్టదినములు్ మది నవ్వి తలంతు నాత్మచిం
తనముతుదిన్ గుహాంతరమునన్ రుచిరోపలతల్పశాయి నై. 28

తా. నేను, దైవానుగ్రహంబున విరక్తి గుదిరి యొకకొండకేఁగి యందలిగుహ యందలితాలిసెజ్జపైఁగూర్చుండి, ధ్యానసమాధినొందువాఁడనగుదునేని యిపుడు ధన వంతులమ్రోల యాచించి కష్టముగాబ్రతుకుచో గడుసై దీర్ఘములుగాఁ దోఁచుదిన ములును, విషయానుభవములం దగిలి మతి దడఁబడ చొక్కియున్నప్పుడు కడుఁ గు

ఉచగా సాఁగుదినములును నపుడు సమాధి తీఱియున్నకాలమునందు తలఁపునకు వచ్చెనేని 'ఇసీ ఏ ట్లాదినములుగడపితిమి!' అని వింతయు వెగటును బిరిగొన లోలోన నవ్వుకొందును.

అవ. తృష్ణ యెంతకును నుడుగదు గాన దానికొఱకై యాచించి దీనతను బొందనేల యనుచున్నాఁడు.

శ్లో॥ యే సన్తోషనిరన్తరప్రముదితా స్తేషాం న భిన్నా ముదో
యే త్వన్యే ధనలుబ్ధసఙ్కులధియ స్తేషాం న తృష్ణా హతా।
ఇత్థం కస్య కృతే కృతః స విధినా తాదృ క్పదం సమ్పదాం
స్వాత్మన్యేవ సమాప్తహేమమహిమా మేరు ర్న మే రోచతే॥ 29

టీ. యే=ఎవరు, సన్తోష...ముదితాః-సన్తోష=(దైవికముగా లభించినవస్తువులచేఁ గలుగుమనోవిలాసమైన) సంతోషముచేత, నిరన్తర=ఎడతెగకుండునట్లు, ప్రముదితాః=మిక్కిలి తుష్టు లగుదురో-తృప్తులై యుందురో యనుట, తేషాం=వారికి, ముదః=ఆనందములు, న భిన్నాః=వేఱ్వేఱై చెడినవికావు-అయితే పయింబయి వర్ధిల్లునవే యనుననుట, అన్యే=ఇతరులైన, యే=ఎవరు, ధన...ధియః-ధన=ద్రవ్యమునందు, లుబ్ధ=లోభము గలదియు-పేరాసగలది యనుట, కావుననే, సఙ్కుల=వ్యాకులమైనదియు, నగు, ధియః=బుద్ధిగలవారో, తేషాం=వారికి,తృష్ణా=విషయస్పృహ, న హతా=నశించినదికాదు-ఉడిగినది కాదనుట, ధనలోభమునకు కొలఁది లేదుగాన నెంతకు నుడుగదనిభావము, ఇత్థం=ఇట్లు-విషయము లిట్లుండఁగా ననుట, సంపదాం=రత్నాదిసమృద్ధులకు, తాదృక్=అటువంటి-వర్ణింప నలవికాని యనుట, పదం=స్థానమైనదియు, స్వాత్మనిఏవ=తనయందే, సమాప్తహేమమహిమా-సమాప్త=పర్యవసించిన-తనకొఱకే యుపయోగించునదై పరోపకారముకొఱకుఁ గానట్టి యనుట, హేమ=బంగారముయొక్క, మహిమా=సంపత్తి గలదియు-తనబంగారపుపెంపు తనకేకాని యితరుల కుపయోగింపనిదిగాఁ గలయట్టియనుట, సః మేరుః=ప్రసిద్ధమైన బంగారుకొండ, బ్రహ్మణా=బ్రహ్మచేత, కస్యకృతే=ఎవనికొఱకు, కృతః=నిర్మింపఁబడినది-నిత్యసంతోషతృప్తులు ధనలోభదుఃఖితులు అని యిరుతెగలపురుషులు గలరు. అందు నిత్యసంతోషుల కపేక్షయుండదుగాన వారికి మేరు వక్కఱలేదు. ధనలుబ్ధులకు లక్షమేరువులైనను జాలవుగాన వారికి నొక మేరువు ఉపయుక్తముకాదు. ఇట్లు ఇరుతెగలవారికి నుపయుక్తము గానిదై యున్న మేరువును అట్టివర్ణనాతీతరత్నాదిసమృద్ధులతో స్వర్ణమయముగా బ్రహ్మ మఱియెవ్వరికొఱకు సృజించెనో యనియర్థము. అది యెవ్వరికి నుపయోగింపమిచే దానిని బ్రహ్మ నిర్మించుట వ్యర్థమే యని భావము. కాఁబట్టి, మే=నాకు,న రోచతే=రుచింపదు- మేరువును నిర్మించుట నాకు సమ్మతము గా దనుట. మేరువునంతధనరాసులు దొరకినను తృష్ణాధనపిశాచికి సంతోషము కలు

గదు గావున నది కలిగించుయాచ్ఞాదైన్యవిభ్రమమును దత్త్వవిచారముచే నిరసించి సంతుష్టాంతరంగులై యాయుష్మంతు లుండవలయు నని యాశయము.

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ వర్ణింప నెవ్వాను ని
ర్భరముల్ వారికి మోదముల్ కనకలుబ్ధస్వాంతు లౌవారికిన్
విరతిం బొందదు తృష్ణ యెవ్వనికిఁ గావింపంబడెన్ బ్రహ్మచే
స్థిరసంపన్నిధి మేరు వాత్మధృతలక్ష్మీకంబు నా కిష్టమే. 29

తా. దైవికముగా నేవి దొరకిన నంతటితో సంతుష్టులై తృప్తినొందియుండు పురుషులకు నానంద మెట్లును జెడక పెరుఁగుచు నేయుండును. ద్రవ్యమునందుఁ బేరాస నొంది యుండుచున్నవారికి తృష్ణయెట్లు నుడుగకయేయుండును. నిత్యసంతుష్టులకు మేరువునందు నపేక్షకలుగదు. ధనలుబ్ధులకు మేరువును జాలదు. ఇట్లగుటంజేసి మేరువునందలి బంగరురాసులు దానికొఱకేకాని మఱెవ్వరికి నుపకరింపనివయ్యె. ఇట్టి మేరువును గొలఁదియిడరానట్టి రత్నాదిసంపదలతో బ్రహ్మ నిర్మించుట యెవ్వనికి నుపకరింపమిచే వ్యర్థమే యగునుగాన నాకును సమ్మతము కాదయ్యె.

అవ. యాచింపరాదన్నచో నిఁక జీవించుట యెట్లు? అని యాశంకించినవాఁడై జీవించునుపాయమును దానిపరికరములతోఁ దెలుపుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనమ్।
సర్వత్రాన్వహ మప్రయత్నసులభం సాధుప్రియం పావనం
శమ్భోః సత్ర మవార్య మక్షయనిధిం శంసన్తి యోగీశ్వరాః॥30

టీ. యోగీశ్వరాః=పరమార్థతత్త్వజ్ఞులైనమహాయోగులు, భిక్షాహారం=బిచ్చమే యాహారముగాఁగలదియు-యాచింపవలయుదైన్యములేక 'దేహి' యన్నప్పుడే మంచి గృహస్థులు బహుమానపూర్వకముగాఁ బెట్టునట్టి బిచ్చమును భుజించుట గలది యనుట, కాఁబట్టియె, అదైన్యం=దీనత్వములేనిదియు, అప్రతిముఖం=ఎదురులేనిదియు-తనకెదురైనసుఖము మఱొకటి లేక తానే నిరతిశయసుఖ మైనదనుట, సర్వదా=ఎప్పుడును, ('సర్వతః' అనుచో అన్నియెడల ననుట), భీతిచ్ఛిదం=భయమును బోఁగొట్టునదియు-భిక్షాశనము సేయువాని కెందును భయములేదనుట, దుర్మా...మథనం-దుష్ట=దుష్టస్వభావములయిన, మాత్సర్య=అసూయ, మద=దర్పము, అభిమాన=గర్వము అనెడివీనిని, మథనం=నిరసించునదియు, దుఃఖ ఓఘ విధ్వంసనం=(సాంసారికములైన) బాధలసమూహములను నాశము సేయునదియు, సర్వత్ర=అన్నియెడల-అన్నిదేశములందు ననుట, అన్వహం=ప్రతిదినమును, అప్రయత్నసులభం=ప్రయత్నములేక

యే సుఖముగా లభించునదియు, సాధుప్రియం = అహంకారరహితులగు సజ్జనులకు నిష్టమైనదియు, పావనం=పవిత్రమైనదియు, అను, శమ్భోః=శివునియొక్క, సత్రం=పూజనమును-లేక 'రుద్రోయేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే' అన్నట్లు శివునికి తృప్తిసాధన మైనదనియు నర్థాంతరము, అవార్యం=అడ్డగింపఁబడని-ఎవ్వరికిని దొరకుటకు నభ్యంతరము లేని, యక్షయనిధిం=తఱుఁగని పాఁతఱగా, శంసన్తి=చెప్పుచున్నారు.

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భిక్షాహారముఁ భూతదై
న్యభయక్రోధమదాభిమానజడిమాహంకారముఁ సత్సుఖ
ప్రభవం బశ్రమలభ్య మూర్జిత మనార్యం బక్షయం బుగ్రదుః
ఖభిదాదక్షము శంభుసత్రము మహాకైవల్యసత్పాత్రమున్. 30

తా. 'శివునిపూజనము అక్షయనిధివంటిదై యెవ్వారికిని అడ్డి లేక దొరకునది. అందు గృహస్థులు గౌరవముతోఁ బెట్టుబిచ్చమే యాహారము గావున దీనత్వము కలుగదు. అది మఱియు నిరతిశయసుఖమై యెయ్యెడను వెఱపును బోఁగొట్టుచు, మాత్సర్యగర్వాహంకారములఁ దూలించుచు, దుఃఖసమూహంబుల నిర్మూలించుచు నన్నియెడలఁ బ్రతిదినమును సులభముగా లభించునదై సజ్జనులకుఁ బ్రియమై పవిత్రమై యొప్పునది' అని మహాయోగులు చెప్పెదరు.

ఇది యాచ్ఞాదైన్యదూషణ మన్నది తృతీయదశకము.

భర్తృహరిసుభాషితము-భోగాస్థైర్యవర్ణనము.

అవ. భోగము లస్థిరములుగా వర్ణించుట యాచ్ఞాదైన్యమును దూషించుటతో నించుమించుగా సాటియగునని మనసున నుంచుకొని యాచ్ఞాదైన్యమును దూషించినపిదప భోగములయస్థైర్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్।
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం
సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్॥

టీ. భోగే=విషయముల భోగించుటయందు, రోగభయం=వాతపిత్తాదిరోగములవలనిభయము, ఉన్నది అనిశేషము-రోగములు భోగమును అడ్డుపఱుచునని భావము. కులే=మంచివంశమునందు, చ్యుతిభయం=ఆచారభ్రంశమువలనిభీతి-ఆచారభ్రంశము

కులమునకు అప్రతిష్ఠావహ మైనదిగాన నని భావము, విత్తే = ధనమునందు, నృపాలాత్ =రాజువలన,భయం=భయము-రాజు అపహరించునని భయమనుట, మానే=అభిమానమందు, దైన్యభయం=దీనత్వమువలనిభయము-దీనత్వము చూపుటవలన మానము చెడునని భయ మనుట, బలే=బలిమియందు - లేక, సామర్థ్యమునందు, రిపుభయం=పగతునివలన భయమును-శత్రువు తనబలంబు నడంచునని భయమనుట, రూపే=సౌందర్యమందు, జరాయాం=ముదిమివలన, భయం=భయము - ముదిమివలన సౌందర్యము మాయునని భయ మనుట, శాస్త్రే=వేదాంతాదిశాస్త్రములందు, వాదభయం=వాదమువలన భయము-కుతర్కములుసేసి రిత్త కలహించుకంటకులవలన భయము, గుణే=గుణమునందు-విద్యావినయాదిగుణములం దనుట, ఖలభయం=దుర్జనునివలనిభయ మనుట-ఖలుఁడు గుణములను దూషించుటచే భయమనుట,కాయే=దేహమునందు,కృతాన్తాత్ =యమునివలన, భయం=భయము-యముఁడు దేహము నంతము నొందించుటచే ననుట, కాఁబట్టి, భువి=భూమి యందు, నృణాం = మనుష్యులయొక్క-మనుష్యులను సంబంధించినట్టి, సర్వం=సకల ప్తమైన, వస్తు=వస్తువును-సకలభోగాద్యర్థములు ననుట, భయాన్వితం=(ముందు చెప్పఁబడినరీతిని) భయముతోఁగూడినవి-అంతము గలవిగాన అపాయమును గలవి యనుట, అయితే, వైరాగ్య ఏవ=విరక్తియే, అభయం=భయము లేనిది-నిరాతంక మైనది గాన నిరపాయ మైన దనుట.

చ. బలగుణభోగరూపకులకభర్మకళేబరశాస్త్రమానముల్
బలిఖలరుగ్జరాచ్యుతినృపాలయమప్రతివాదిదైన్యసం
కులభయయుక్తముల్ నరులకుర్వి భువి నెవ్వియు నిర్భయంబులే
నెలకొని యెన్నిభంగులను నిర్భయ మొక్కవిరాగమే సుమీ.31

తా. భోగము లనుభవించునపుడు రోగ మెక్కడ వచ్చి చెఱుపునో యని భయము. మంచికులంబునఁ బుట్టినయెడల నాచారము భ్రంశమునొందిన కులప్రతిష్ఠ చెడునని భయము. ద్రవ్యమున్నయెడ రాజపహరించుకొనునో యనిభయము. మానము కలిగినయెడ నేదైనదీనత్వము చూపఁగలిగినయెడ నది చెడునో యని భయము. బలముండినచో నెవఁడేని పగతుఁడు వచ్చిగెలుచునో యని భయము. రూపముగలయెడ ముదిమిచే నది తీసిపోవునో యనిభయము. శాస్త్రములు తెలిసినయెడ వితండావాదము లేమిప్రసక్తించునో యనిభయము. మంచిగుణము లుండిన దుర్జనుఁడు చూపోపక వాని నేమినిందించునోయనిభయము. దేహమును జూచినపుడు యముఁ డెపుడు దానిం దుదముట్టించునో యని భయము. ఇట్లు భూమియందుఁ గలయొక్కొక్కవస్తువును భయముతోఁ గూడినదిగా నున్నది. వైరాగ్య మొక్కటియె భయము కలిగింపనిది.

అవ. భోగము లస్థిరము లని చెప్పఁ దొడఁగి దానినే వేర్వేఱు రీతులఁ దొమ్మిదిశ్లోకములచే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ ఆక్రాన్తం మరణేన జన్మ జరయా విద్యుచ్చలం యౌవనం
సన్తోషో ధనలిప్సయా శమసుఖం ప్రౌఢాఙ్గనావిభ్రమైః ।
లోకై ర్మత్సరిభి ర్గుణా వనభువో వ్యాళై ర్నృపా దుర్జనై
రస్థైర్యేణ విభూతయోఽప్యుపహతా గ్రస్తం న కిం కేన వా॥32

టీ. జన్మ=పుట్టుక, మరణేన=(స్వరూపనాశకమైన) మృత్యువుచేత, ఆక్రాన్తం=ఆక్రమింపఁబడినది - గ్రసింపఁబడినదనుట-దీని నిట్లె మీఁద నధ్యాహరించుకొనునది. విద్యుత్ చలం=మెఱపుఁదీఁగవలె చంచలమైన, యౌవనం=ప్రాయము, జరయా=ముదిమిచేత, గ్రసింపఁబడినది ('జరసా చాత్యుజ్జ్వలం యౌవనం' అనుచో - అత్యుజ్జ్వలం=మిక్కిలి ప్రకాశించుచున్న, యౌవనము, జరసా=ముదిమిచేత, గ్రసింపఁబడినదని యర్థము), సన్తోషః=(దైవికముగా లభించినవస్తువులచేఁ గలుగు) సంతోషము, ధనలిప్సయా=(దానికి నుపద్రవముసేయు) ద్రవ్యాశచేత, గ్రసింపఁబడినది. శమసుఖం-శమ-ఇంద్రియవ్యాపారోపరతివలనఁ బుట్టిన-లేక, అంతఃకరణనిగ్రహము వలనఁ గలిగిన, సుఖం=ఆనందము, ప్రౌఢాఙ్గనా విభ్రమైః-ప్రౌఢాఙ్గనా=ప్రోడలైన విలాసినులయొక్క, విభ్రమైః=(కక్షము విదుల్చుట, చెవులగీఱుట, చన్నుఁగవ రాయుట మొదలైన) విలాసములచేత, ఆవరింపఁబడినది. గుణాః=(విద్యావినయాది) గుణములు, మత్సరిభిః=అసూయగల, లోకైః=జనులచేత-ఆగుణములం దపవాదము మోపువారిచేత ననుట, ఉపహతాః-కొట్టువడినవి. వనభువః=అరణ్యప్రదేశములు, వ్యాళైః=దుష్టగజములచేత-లేక, సర్పములచేత-అడవియందుఁ జొరనీయక దిగులుకొలుపువానిచేత ననుట,(ఉపహతాః=గ్రసింపఁబడినవి). నృపాః=రాజులు,దుర్జనైః=దుర్మంత్రము లుపదేశించి వారిబుద్ధిని తడఁబడఁజేయుదుష్టులచేత, (ఉపహతులైరి). విభూతయః=సంపదలును, అస్థైర్యేణ=నిలుకడలేమిచేత, (ఉపహతాః=కొట్టువడినవి). కాఁబట్టి, కిం=ఏది-ఏవస్తువనుట, కేనవా=దేనిచేత-ఏయుపద్రవముచేత, నగ్రస్తం = గ్రసింపఁబడినదికాదు-ముందుచెప్పఁబడినట్లు సర్వమును గ్రసింపఁబడినదే యనుట. ఇట్లన్నియు నస్థిరము లగుటచే నెందును నమ్మిక యుంపక నిత్యవస్తు వగుపరమేశ్వరునియందే మనసు నుంపవలయు నని భావము.

చ. జననము చావుచేత శమసౌఖ్యము కాంతలలీలచేత జ
వ్వనము జరార్తిచేత గుణవర్గము కూళలచేత రాజు దు
ర్జనములచే ముదంబు ధనరాగముచే సిరు లెల్ల లేమిచే
వినిహతిఁ జెందె దోషపరివిద్ధము గాదె తలంప నెద్దియున్. 32

తా. జన్మమును మరణము స్వరూపముతో మాపుచున్నది. అతిచంచల మగు యౌవనమును ముదిమి వెలిపివైచుచున్నది. సంతోషమును ద్రవ్యాశ పడఁగొట్టుచున్నది. శాంతిసుఖము ప్రౌఢ లగుపడఁతులకులుకు బెళుకులచేఁ గలఁత నొందుచున్నది. గుణములు మత్సరము గల జనులచే నిందపాలగుచున్నవి. అడవిపట్టులు సర్పములచేతను దుష్టగజములచేతను జొరరాకయున్నవి. రాజులు దుర్మంత్రములు చెప్పుదుష్టులచేఁ జెడుచున్నారు. సంపదలు నిలుకడలేకున్నవి. ఇట్లు సర్వమును ఉపద్రవగ్రస్తముగానే యున్నది. నిరుపద్రవ మైనది యీశ్వరధ్యానమే గాన బుద్ధిమంతులు దానినే కయికొనవలయును.

అవ. మరల శ్రోతలకుఁ బూర్వము చెప్పినదానియందు నమ్మిక దృఢముగాఁ గలుగుటకై దానినే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆధివ్యాధిశతై ర్జనస్య వివిధై రారోగ్య మున్మూల్యతే
లక్ష్మీ ర్యత్ర పత న్తి తత్ర వివృతద్వారా ఇవ వ్యాపదః।
జాతం జాత మవశ్య మాశు వివశం మృత్యుః కరో త్యాత్మసా
త్తత్కిం నామ నిరఙ్కుశేన విధినా య న్నిర్మితం సుస్థిరమ్॥ 33

టీ. వివిధైః=నానాప్రకారములైన, ఆధివ్యాధిశతైః-ఆధి=మనోవ్యథలయొక్కయు, వ్యాధి=శరీరవ్యాధులయొక్కయు, శతైః=వందలచేత-నూఱులకొలఁది మానస శారీరవ్యథలచేత ననుట, 'పుంస్యాధి ర్మానసీ వ్యథా' అని యమరుఁడు. జనస్య=మనుజునియొక్క, ఆరోగ్యం=దేహము స్వస్థమైయుండుట, ఉన్మూల్యతే=నిర్మూలింపఁబడుచున్నది. యత్ర=ఎచట-ఎవనియందనుట, లక్ష్మీః=ఐశ్వర్యము, ఉన్నదోయని శేషము, తత్ర=అచట-ఆజనునియందు, వ్యాపదః-వి+ఆపదః=వివిధములైన సంకటములు, వివృతద్వారా ఇవ=తెఱవఁబడినద్వారములు గలవానివలె- ఏప్రతిబంధమునులేక యనుట, పతన్తి=పడుచున్నవి-చొచ్చుచున్నవి యనుట, మృత్యుః=యముఁడు, జాతంజాతం=ప్రారబ్ధకర్మవశమున మాటిమాటికిఁ బుట్టుచున్న-లేక, పుట్టినమాత్రముగల, కావుననే, వివశం=విహ్వలమైన-తనకు వశముగాక తత్తఱపడునట్టి యనుట, జంతువును అని శేషము, అవశ్యం=నియతముగా, ఆశు=శీఘ్రముగానే, ఆత్మసాత్=తనకులోనుగా, కరోతి=చేయుచున్నాఁడు-చంపుచున్నాఁడనుట, తత్=కాఁబట్టి, నిరఙ్కుశేన=ఏయడ్డులేక విచ్చలవిడిగానున్న - అప్రతిహతవ్యాపారుఁడైన యనుట, విధినా=దైవముచేత-లేక బ్రహ్మచేత, యత్=ఏది, సుస్థిరం=మిక్కిలిస్థిరమైనదిగా, నిర్మితం=నిర్మింపఁబడినదో, (తత్=అది), కిం నామ=ఏదిదా-ఏదియు లేదనుట.

శా. ఆధివ్యాధిశతంబుచే జనులశైరోగ్యం బెల్ల నిశ్శోభమై
బాధింపంబడు సంపదల్ గలుగుచోఁ బ్రత్యక్షమై ద్వారసం
రోధం బేమియు లేక దుర్దశలు చేరున్ మృత్యువున్ మర్త్యుల
న్వేధించున్ విధి యేది సుస్థిరముగా నిర్మించెఁ దర్కించినన్.

తా. నానావిధములైన మనోవ్యథలచేతను శరీరరోగములచేతను ఆరోగ్యము నిర్మూల మగుచున్నది. ఐశ్వర్య మున్నచోట నిరాతంకముగా నాపదలు పెక్కువిధములు కలుగుచున్నవి. పుట్టినప్రాణి నెల్ల మృత్యువు పట్టికొని రూపుమాపుచున్నది. విధి నిర్మించిన దేదియు సుస్థిరము కాదు. విధియో నిరంకుశ మైనది. కాన దాని వ్యాపారములకు నడ్డుపడ నెవరితరము?

అవ. ఇట్లయినచో నిఁకఁ జేయఁదగిన దేమి యని యాశంకించి భోగములయస్థిరత్వమును జెప్పుచునే చేయఁదగినదానిని మూఁడుశ్లోకముల నుపదేశించుచున్నాఁడు.

శ్లో॥ భోగా స్తుఙ్గతరఙ్గభఙ్గతరళాః ప్రాణాః క్షణధ్వంసినః
స్తోకాన్యేవ దినాని యౌవనసుఖస్ఫూర్తిః ప్రియాసుస్థితా।
త త్సంసార మసార మేవ నిఖిలం బుద్ధ్వా బుధా బోధకా
లోకానుగ్రహపేశలేన మనసా యత్నః సమాధీయతామ్॥ 34

టీ. భోగాః=హారచందనాది విషయములు, తుఙ్గ...తరళాః-తుఙ్గ=పొడవులైన, తరఙ్గ=అలలయొక్క, భఙ్గ=చెడుటవలె, తరళాః=చపలములైనవి-అతిసూక్ష్మములే కాని కొన్నిదినములైన నవి నిలుకడగా నుండునవి కావనుట, ప్రాణాః=ప్రాణములు, క్షణధ్వంసినః=క్షణకాలములో నశించునవి-మిక్కిలియస్థిరములనుట, యౌవనసుఖస్ఫూర్తిః=యౌవనమునందలివిషయసుఖముయొక్క తోఁపిక-ప్రాయమునందలి విషయసుఖానుభవ మనుట, స్తోకాన్యేవ దినాని=స్వల్పదినములే, ప్రియాసు=ప్రియురాండ్రయందు; స్థితా=ఉండునట్టిది-ప్రియురాండ్రతో విషయభోగము లనుభవించుట యౌవనముండు కొన్నిదినములవఱకేకాని వార్ధకమునం దావనితాసుఖము వీడుటచే నది యావజ్జీవ ముండునది కాదనుట. ('యౌవనసుఖం ప్రీతిః ప్రియేష్వస్థిరా' అనుచో-యౌవనసుఖం=యౌవనమువలనిసుఖము, స్తోకాన్యేవ దినాని=కొన్నిదినములే' ప్రియేషు=ప్రియులైనవారియందు, ప్రీతిః=ప్రేమ, అస్థిరా=నిలుకడలేనిది, అని యర్థము). తత్=కాఁబట్టి, బోధకాః=హితోపదేశము సేయువారగు, బుధాః=విద్వాంసులారా, నిఖిలం=సమస్తమైన,సంసారం=భోగాదిరూపమైన సంసారమును, అసార మేవ=అనిత్య మనియే-అసిద్ధ మనియే యనుట, బుద్ధ్వా=తెలిసి-ఆలోచించి

యనుట, లోక అనుగ్రహ పేశలేన=లోకుల ననుగ్రహించుటయందు నేర్పుగల, మనసా=మనస్సుచేత, యత్నః=ప్రయత్నము, సమాధీయతాం=చేయఁబడును గాక, పరమదయాళుత్వమువలనఁ గలిగిన యనుగ్రహముచే మీరు జ్ఞానోపదేశాదులవలన ముమ సంసారార్ణవమగ్నులగు జనుల నుత్తరింపఁ జేయవలయును గాని యుపేక్షింప రాదని భావము. లేక, లోకానుగ్రహపేశలేన = లోకసంగ్రహమునందు అనురక్తి గల, మనస్సుచేత యత్నము సేయవలయును-అనఁగా 'యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరోజనః। స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే' అను ప్రమాణముంబట్టి, మిమ్మను జూచియే జనులు నడచుకొందురు గాన మీరు లోకసంగ్రహమునందు రక్తి గలిగి యెట్టి ప్రయత్నములు చేసినయెడ జనులు సైతము వానిని తాముసు జేసి కృతార్థు లగుదురో అట్టి ప్రయత్నములను తప్పక చేయవలయు ననియు భావము.

ఉ. తుంగతరంగభంగములకైవడిఁ జలఁదూఁగువిలోలభోగముల్
భంగపడుక్ నిమేషమునఁ బ్రాణము కొన్నిదినంబులే సుఖం
బంగనలందు నిల్లు మది కారసి బ్రహ్మవిచారయత్నము
ప్పొంగుచుఁ జేయఁ గావలయు భూరిజగద్ధితబుద్ధిఁ బండితుల్. 34

తా. భోగములు పెనుఁగరుళ్లవలె నురువుగాఁ దోఁచి వానివలెనే చంచలము లై యుండును. ప్రాణములో మతియెంతనిలుకడ లేనివి. వనితలవలనిసుఖమో యౌవన ముండు కొన్ని దినములవఱకేగాని యావజ్జీవ ముండునదిగాదు. కాఁబట్టి, హితోపదేశకులగు విద్వాంసులు సంసారమంతయు ననిత్య మని యెఱింగి లోకానుగ్రహమందు రక్తి మదిఁ గలిగి యందులకై తగినప్రయత్నము చేయవలయును.

అవ. మరల మఱింతనమ్మిక గట్టియగుటకును, యుక్త్యంతరము లభించుటవలనను, జెప్పినదానినే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భోగా మేఘవితానమధ్యవిలసత్సౌదామినీచఞ్చలా
ఆయు ర్వాయువిఘట్టితాబ్జపటలీలీనామ్బువ ద్భఙ్గురమ్।
లోలా యౌవనలాలనా తనుభృతా మి త్యాకలయ్య ద్రుతం
యోగే ధైర్యసమాధిసిద్ధిసులభే బుద్ధిం విధధ్వం బుధాః॥ 35

టీ. తనుభృతాం=దేహధారులకు, భోగాః=పూర్వోక్తము లైన భోగములు, మేఘ...చఞ్చలాః- మేఘవితాన=మబ్బులసమూహముయొక్క, మధ్య=నడుమ, విలసత్=ప్రకాశించుచున్న, సౌదామినీ=మెఱుపుఁదీఁగవలె, చఞ్చలాః=చపలము లై నవి -క్షణికము లైనవనుట, ఆయుః=ఆయువు-బ్రతుకనుట, వాయు...నామ్బువత్-వా

2 m

యు=గాలిచేత, విఘట్టిత=కదల్పఁబడిన, అబ్జపటలీ=తామరాకుసోరలందు, లీన=అంటియున్న, అమ్బువత్=జలమువలె-జలబిందువువలె ననుట, భఙ్గురం=నశించునట్టిది. ఇదియె 'నళినీదళగతజల మతితరళమ్' అని చెప్పఁబడినది, ('వాయువిఘట్టితాభ్రపటలీలీనామ్బువత్ అనుచో- వాయువిఘట్టిత=గాలిచే నెగురఁగొట్టఁబడిన, అభ్రపటలీ=మబ్బులబంతియందు, లీన=ఉన్నట్టి, అమ్బువత్=జలమువలె' నని యర్థము.)యౌవనలాలనా=యౌవనమందలిసుఖము, లోలా = చంచల మైనది, (లోలా యౌవన లాలసాః' అనుచో-యౌవన లాలసాః = యౌవనమునందలి మహాభోగాభిలాషలు-'కామోఽభిలాష స్తర్షశ్చ స మహాన్ లాలసాద్వయోః' అని యమరునిచెప్పున 'లాలసా' యన మహాభిలాష, లోలాః=చంచలము లైనవని యర్థము), ఇతి=ఇట్లు, ఆకలయ్య=ఆలోచించి, హే బుధాః=పండితులారా, ధైర్య...సులభే-ధైర్య=ధైర్యముచేతఁ గలిగిన, సమాధిసిద్ధి=సమాధియొక్క సిద్ధించుటచేత, సులభే=సుకరముగా లభింపఁదగిన, యోగే=యోగమునందు - పరమాత్మతోడిసంయోగమునం దనుట-విడువని పూనికతో ధ్యానముసేయుటచే చిత్తసమాధానరూపమైన సమాధి సిద్ధింపఁగా దానివలన పరమాత్మతోడఁ గలుగుసంగతియం దనుట - సమాధియనఁగా మనస్సు బాహ్యవిషయములనుండి మరల్చి ఆత్మస్వరూపమునం దేకాగ్రముగా నెలకొల్పుట, అట్టియోగమునందు, బుద్ధిం=బుద్ధిని, త్రుతం=శీఘ్రముగా, విధద్ధ్వం=చేయుఁడు. పరమాత్మధ్యానమందు బుద్ధిని బట్టుకొలుపుఁడనుట. అలం-ఉపమయు, కావ్యలింగమును.

చ. జలదములోనిక్రొమ్మెఱుఁగుఁ జాయలు భోగపరంపరల్ మహా
నిలపరిఘట్టితాబ్జదళ నీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమత సౌఖ్యము లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మయోగమున బుద్ధి ఘటింపుఁడు సత్వరంబుగన్.

తా. భోగములు మబ్బుపిండునడుమఁ దళుక్కని మెఱసి మఱుఁగువడు మెఱుఁగు దీఁగవలె చంచలమైనవి. ఆయువో గాలిచేఁ గదల్పఁబడినతామరాకునందలి నీటిబొట్టువలె నశ్వరమైనది. యౌవనసుఖమో యతిచపలమైనది. కాఁబట్టి విద్వాంసులు దీని నంతయు నాలోచించి యెడతెగనిపూనికచే సిద్ధించుసమాధివలన సులభమైనపరమాత్మధ్యానమందు మనస్సు నెలకొలుపవలయును.

శ్లో॥ ఆయుః కల్లోలలోలం కతిపయదివసస్థాయినీ యౌవనశ్రీ
రర్థాః సంకల్పకల్పా ఘనసమయతటిద్విభ్రమా భోగపూగాః।
కణ్ఠాశ్లేషోపగూఢం తదపి చ నచిరం యత్ప్రియాభిః ప్రణీతం
బ్రహ్మణ్యాసక్తచిత్తా భవత భవభయామ్భోధిపారం తరీతుమ్॥

టీ. ఆయుః=ఆయువు, కల్లోలలోలం=అలవలె చంచలమైనది-ఆచంద్రార్కస్థాయియైనది గాదనుట, యౌవనశ్రీః=యౌవనసంపద, కతిపయదివసస్థాయినీ=కొన్ని

దినములే నెలకొనియుండునది-యావజ్జీవముండునది గాదనుట, అర్థాః=ధనధాన్యాదివస్తువులు, సంకల్పకల్పాః=తలంపుతో సాటియైనది-మనస్సులోనితలంపువలె అస్థిరములైన వనుట, భోగపూగాః=విషయపరంపరలు ('భోగపూరాః' అనుచో విషయప్రవాహము లనుట), ఘన...విభ్రమాః-ఘనసమయ=వర్షాకాలమందలి, తటిత్=మెఱపుఁదీఁగలయొక్క, విభ్రమాః=విలాసమువంటివిలాసముగలవి-లేక, స్ఫురణమువంటి స్ఫురణము గలవి-క్షణభంగురములైన వనుట, ప్రియాభిః=ప్రియురాండ్రచేత, యత్=ఏ, కణ్ఠా...గూఢం-కణ్ఠ ఆశ్లేష = కుత్తుకను గాఁగిలించుట గల, ఉపగూఢం=కాఁగిలింత-కంఠమునందుఁ గాఁగిలించుకొనుట,ప్రణీతం=రచింపఁబడినదో, తదపి=అదియును, చిరం= చిరకాల ముండునది, న (భవతి) = కాదు, కాఁబట్టి, భవ...పారం-భవ=సంసారమువలని, భయం=భయమనెడి, అంభోధి=సముద్రముయొక్క, పారం=గట్టును, తరీతుం=దాఁటుటకు-సంసారసముద్రమును దరించుటకు,బ్రహ్మణి=బ్రహ్మమునందు, ఆసక్తచిత్తాః = తగులుగల మనస్సులు గలవారు-బ్రహ్మధ్యానైకపరాయణు లనుట, భవత=కండు-బ్రహ్మధ్యానముకంటె మఱియొక తరణోపాయమేదియుఁ గానిపింపదని భావము, ఇట్లు పరమార్థము నొడఁగూర్చు బ్రహ్మధ్యాననిష్ఠయందు దృఢతరవిశ్వాసము గలుగుటకై యది మూఁడుశ్లోకములచేఁ జెప్పఁబడినది. కాని యనర్థము నొడఁగూర్చుసంసారాసక్తి చెప్పఁబడినదికాదు. తత్త్వవిచారవేత్తలిం దేది యుక్తమో దానిని గైకొనవలయు నని శ్లోకత్రయతాత్పర్యము. అలం. కావ్యలింగము.

ఉ. ఆయువు వీచిచంచలము ♣ యౌవన మల్పదినోచితంబు పు
 ష్పాయుధకేళిజన్యసుఖ ♣ మస్థిర మర్థము వాంఛవోలె సా
 పాయము భోగముల్ మెఱపుకైలట్ల భ్రమించు భవాబ్ధిలంఘునో
 పాయము బ్రహ్మచింతనముఁ♣బాయక చేయుఁడు సజ్జనోత్తముల్.

తా. ఆయు వొకయలవలెఁ జంచలమైనది. ప్రాయంపుసొంపు కొన్నిదినములవఱకే యుండునది. ద్రవ్యములో తలంపులవలె క్షణికము లైనవి. భోగములు వానకాలమందలి మెఱుపులవలె నొకింతసేపు మిక్కిలియు వెలింగి తోడనే మటుమాయ మగునవి. కుత్తుక నలము ప్రియురాలికౌఁగిలింతయుఁ జిరకాల ముండునదిగాదు. ఇట్టి సంసారసముద్రమును దాఁటుటకు బ్రహ్మధ్యానమే సాధనము. కాఁబట్టి బ్రహ్మధ్యానైకపరులు కండు.

అవ. లోకమునందుఁ దఱుచుగా సంసారసుఖపరాయణులే కనఁబడుచున్నారు. కాఁబట్టి యట్టిసంసారము నిషేధించుట యెట్లు? అని యాశంకించి మరల దాని నుత్పత్తిమొదలుకొని విచారముసేయఁగా నందు సుఖలేశమును లే దనుచున్నాఁడు.

శ్లో॥ కృచ్ఛ్రేణామేధ్యమధ్యే నియమితతనుభిః స్థీయతే గర్భవాసే
కాన్తావిశ్లేషదుఃఖవ్యతికరవిషమో యౌవనే చోపభోగః।
వామాక్షీణా మవజ్ఞావిహసితవసతి ర్వృద్ధభావో౽ప్యసాధుః
సంసారే రే మనుష్యా వదత యది సుఖం స్వల్ప మప్యస్తి కిఞ్చిత్॥

టీ. గర్భవాసే=గర్భమునందు వసించునపుడు-లేక, గర్భాశయమునందు, అమేధ్యమధ్యే=మూత్రపురీషములనడుమ, నియమిత తనుభిః = ఆయాకొలఁదులలోపల నడంపఁబడిన దేహములు గలవారైన - దేహములు ముడుఁచుకొన్నవారను, ప్రాణులచేత నని శేషము, కృచ్ఛ్రేణ=మిక్కిలికష్టముతో, స్థీయతే=ఉండఁబడుచున్నది-ప్రాణులు గర్భాశయమునందు మలమూత్రములనడుమ దేహములు ముడుఁచుకొని కష్టపడుచు నుందురనుట. యౌవనే=యౌవనమందు, ఉపభోగశ్చ=సంభోగమును, కాన్తా... విషమః= కాన్తావిశ్లేష=ప్రియురాలి నెడఁబాయుటచేతఁ గలుగు, దుఃఖ=దుఃఖముయొక్క, వ్యతికర = సంబంధముచేత, విషమః=వికలమైనది-కటువైనదనుట, అగు నని శేషము. వామాక్షీణాం = (సొగసుంగన్నులు గల) స్త్రీలయొక్క, అవజ్ఞా...వసతిః-అవజ్ఞావిహసిత=అవమానములతోఁ గూడిన పరిహాసములయొక్క, వసతిః=స్థానమగు, వృద్ధభావః అపి=ముసలితనమును, అసాధుః=మంచిదికానిది-పడఁతులయపహాసమునకుఁ బాత్రమైనముదిమి మంచిది యెట్లగు నని భావము. కాఁబట్టి, రే మనుష్యాః=ఓరిమనుష్యులారా, 'రే' యని నీచసంబోధనము; ఇచట సాంసారికుఁడై యుండుటయే నీచత్వముగాన నట్టివారికి 'రే' యని సంబుద్ధి, సంసారే=(గర్భవాసము జన్మించుట ముదిమి మొదలగు రూపముగా నుండు) సంసారమునందు, స్వల్పం=అల్పమైన, సుఖం=సుఖము, కిఞ్చిదపి=కొంచెమైనను, అస్తియది=ఉన్నయెడల, వదత=చెప్పుఁడు. కొంచెమైనను సుఖము లేదనుట. కాఁబట్టి గర్భనరకాదిసాంసారికదుఃఖముల నొంది కుంద నేల? పునరావృత్తిరహితమైన నిత్యనిరతిశయబ్రహ్మానందప్రాప్తికై ప్రయత్నింపుఁ డని భావము.

ఉ. కాయము గుంచి గర్భనరకంబున నుండుట దుఃఖ మాదిఁ బం
దాయతలోచనావిరహ మబ్బుట దుఃఖము జవ్వనంబునం
బాయక భామినీహసనపాత్రము దుఃఖము వృద్ధభావ మిం
కేమెడఁ గల్గు సౌఖ్యలవ మించుకయే జనులార చెప్పుఁడీ. 37

తా. మొదటఁ దల్లికడుపునందుఁ గాలుసేతులు ముడుఁచుకొని మలమూత్రములనడుమఁ గష్టముతో నుండఁగలుగుచున్నది. పిదపఁ బుట్టి యౌవనమును బొంది భోగము లనుభవింపఁ జూచినయెడల, నదియు నొక్కతీరుగానే యుండక ప్రియురాలి యెడఁబాటువలనిదుఃఖముతోఁ గలసియుండుటచే వికలమగుచున్నది. యౌవనమును

గడచి ముదిమియం దైన సుఖముగా నుండుద మన్నచోఁ బడుచులపరిహాసములకు నది పట్టుగా నుండుటచే మంచిది కానేరదు. తల్లికడుపుం దొట్టి ముదిమివఱకు నిట్టిదై యున్న యీ సంసారమునందు గొప్పది కాకున్నను అల్పమైన నగు సుఖము గొంచె మేనియుఁ గలుగదు.

అవ. లోకులు తమ్మును బడఁగూల్చు హేతువులు సమీపించియే యున్నను మంచివారు గాకున్నారు. ఇ దేమాశ్చర్య మనుచున్నాఁడు.

శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్।
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివామ్భో
లోక స్తథా ప్యహిత మాచర తీతి చిత్రమ్॥ 38

టీ. జరా=ముదిమి, వ్యాఘ్రీ ఇవ=ఆఁడుపులివలె, పరితర్జయన్తీసతీ=బెదరించుచు, తిష్ఠతి=ఉన్నది-బొందిని జీర్ణింపఁ జేయుచున్నదై మృత్యువు దాపున నుండుటఁ దెలుపుచున్నదనుట. రోగాః=వ్యాధులు, శత్రవః ఇవ=పగవాండ్రవలె, దేహం=శరీరమును, ప్రహరన్తి=కొట్టుచున్నవి-మిక్కిలి పీడించుచుననుట. ఆయుః=ఆయువు, భిన్నఘటాత్=పగిలిన కుండనుండి, అమ్భఃఇవ=నీటివలె, పరిస్రవతి=కాఱుచున్నది-ప్రతిక్షణమును నశించుచున్న దనుట, తథాపి=అట్లయినను, లోకః=జనము, అహితం=పరులకపకారమును-లేక, తమకు శుభముకానిదానిని, ఆచరతి=ఆచరించుచున్నది, ఇతి=అని, చిత్రం=ఆశ్చర్యము. రానున్నయనర్థముల నాలోచించియైన తమకు హితమైన(శుభమైన) వానియం దభినివేశము కలిగియుండుటలేదు. ఇ దేమి చిత్రమనుట. అలం. ఉపమ.

చ. కడు వెఱపించుచుఁ ముదిమి క్రొగ్గడతిబెబ్బులిమాడ్కి నున్న వె
న్కుడుపగదాయలంబలెఁ దెగుళ్లు శరీరము నొంచుచున్న వె
ప్పుడుఁ జనుభిన్నకుంభజలకంబుంబలె నాయువు లిట్టు లయ్యుఁ దా
రుడుగక మానవుల్ దురితక్రమోలి నొనర్చుచు నున్నవా రహో.

తా. ముసలితన మొకయాఁడుపులివలె బెదరుచూపుచునున్నది. రోగములును బగవారివలె దేహమును బీడించుచున్నవి. ఆయువు నోటికుండలోనినీరువలె తీసిపోవుచున్నది. ఇట్లయ్యును మనుష్యుఁడు తనకు హితము కానిదానినే యాచరించుటను జూడఁ జిత్రముగా నున్నది.

అవ. మాయుపదేశమందు విశ్వాసముగలదేని దానిచొప్పున నాశలన్నిద్రుంచి మదికి శాంతి గలిగింపుఁడు. అదియే తగు ననుచున్నాఁడు.

శ్లో॥ భోగా భఙ్గురవృత్తయో బహువిధా స్తై రేవ చాయం భవ
స్తత్క స్యేహ కృతే పరిభ్రమత రే లోకాః కృతం చేష్టితైః।
ఆశాపాశశతోపశాన్తివిశదం చేతః సమాధీయతాం
కామోచ్ఛిత్తివశే స్వధామని యది శ్రద్ధేయ మస్మద్వచః॥ 89

టీ. బహువిధాః=నానాప్రకారములైన, భోగాః=విషయములు, భఙ్గురవృత్తయః=భంగమునొందువృత్తి గలవి-అగమాపాయు లగుటచే నస్థిరము లైనవనుట, తై రేవ=వానిచేత నే, అయం=ఈ, భవః=సంసారము, కల్పితమైనదని శేషము, 'కారణగుణాః కార్యేఽనువర్తన్తే' అన్నట్లు అస్థిరములైన యా భోగములచే రచింపఁబడిన యీసంసారమును అస్థిరమే యగు నని భావము, తత్ = కాఁబట్టి, రే లోకాః=ఓలోకులారా, ఇహ=ఇందు-ఈసంసారమం దనుట, కస్యకృతే=దేనికొఱకు-ఏభోగమును బ్రాపించుకొఱకనుట, పరిభ్రమత = తిరుగాడుచున్నారు. చేష్టితైః=వ్యాపారములచేత-భోగముల నొడఁగూర్చుకొను ప్రయత్నములచేత, అలం=చాలును-అస్థిరములైన భోగములకై యింతవఱకుఁ జేయుచున్న మీవ్యాపారముల నిఁక నిలుపుఁడనుట. ఇఁకఁ జేయవలసినదాని నుపదేశించుచున్నాఁడు. అస్మత్ వచః=మాయొక్కమాట-మేము చేయునుపదేశము, శ్రద్ధేయం యది=విశ్వసింపఁదగినది యేని, మీకు అని శేషము, ఆశా...విశదం - ఆశా=ఆశయొక్క, పాశా=రజ్జువులయొక్క-బంధహేతువగుటచే రజ్జువు లనుట తెలియునది, శత=నూఱులయొక్క-పెక్కులైన యాశాపాశములయొక్క యనుట, ఉపశాన్తి=ఉడుగుటచేత, విశదం=నిర్మలమైన, చేతః=మనస్సును, కామ ఉచ్ఛిత్తి వశే=కామము నిర్మూలమగుటచే స్వాధీనమైన, స్వధామని=తనపట్టునందు - దానియొక్క పట్టునం దనుట-ఇట మనస్సే దానికి గృహముగాఁ జెప్పఁబడుట తెలియునది, సమాధీయతాం=స్థిరముగా నిలుపంబడుఁ గాక-కామములను ద్రెంచుటచే లోనై యున్నదానిగృహమునందు దానిని నిలుకడగా నెలకొలుపుఁడనుట- ఆశాపాశములన్నియు నుడిపి దాని నిర్మలముగాఁజేసి కామమును బొత్తిగా విడిచి దానికి నెమ్మది కలిగింపుఁడని భావము. మనస్సు ఆశలచే కలుషితమును గామముచే చంచలమునగుటచే నాశల నుడుగుటచే నిర్మలముగాను గామమును ద్రెంచుటచే స్థిరముగాను అది యగు నని యాశయము.

చ. తరళతరంబులున్ బహువిధంబులు భోగము లీదురంతసం
సరణము వానిచేఁ బొడమెఁ జాలుఁ బరిభ్రమణంబు వానికై
నరులు మదీయభాషణము నమ్మెద రేని శమప్రసన్నమై
పరఁగుమనంబు శంభుపదపద్మయుగప్రవణంబు సేయుఁడీ. 39

తా. పలువిధములుగాఁ గానంబడుచున్న భోగములన్నియు క్షణభంగురములు కాని స్థిరములు కావు. ఇట్టియస్థిరములచేత నే యీసంసారమును జేయఁబడినది గాన నిదియును స్థిరము గాదు. కనుక నిట్టి సంసారమం దేయర్థముకొఱకుఁ దిరుగాడె దరు? అస్థిరములగు భోగములకొఱకైన మీవ్యాపారము లెల్ల నిఁకఁ జాలింపుఁడు. మే మొక యుపదేశము సేసెదము. అది మీకు నమ్మఁదగినదిగాఁ దోఁచె నేని దానిచొప్పు న, నాశాపాశములన్నియు నుడిపి మనస్సును నిర్మలముగావించి కామమును బొత్తి గా విడిచి దానికి నిలుకడ గలిగింపుఁడు.

అవ. నీకు భోగమునందు సర్వవిధముల స్పృహ యుండునేని మే ముపదేశించు నట్టిభోగమందే యభిరతి గలిగియుండుము ; తక్కిన దానియందు వల దని చెప్పి యుపసంహరించుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మేన్ద్రాదిమరుద్గణాం స్తృణకణా న్యత్ర స్థితో మన్యతే
యత్స్వాదా ద్విరసా భవన్తి విభవా స్త్రైలోక్యరాజ్యాదయః।
భోగః కోఽపి స ఏక ఏవ పరమో నిత్యోదితో జృమ్భతే
భో సాధో క్షణభఙ్గురే తదితరే భోగే రతిం మాకృథాః॥ 40

టీ. యత్ర=ఎందు - ఏనిరతిశయనిత్యభోగసామ్రాజ్యమునం దనుట, స్థితః= ఉన్నట్టివాఁడు, పురుషుఁ డని శేషము, బ్రహ్మ ఇంద్ర ఆది మరుత్ గణాన్=బ్రహ్మ యింద్రుఁడు మొదలుగాఁగల దేవతాసమూహములను-ఇఁక తక్కినవారిని జెప్ప నేల యనుట, తృణకణాన్=గడ్డిపరకలనుగా-మిక్కిలి నిస్సారులనుగాను పరమనీచులను గాను ననుట, మన్యతే=తలఁచునో - బ్రహ్మభోగమును ఇంద్రభోగమునుగూడ నిట్టి భోగసామ్రాజ్యమునందు వేయింట నొకపాలును సాటిగామిచే నట్లు తలఁచునో య నుట, యత్ స్వాదాత్=దేనిని చవిచూచుటవలన, త్రైలోక్యరాజ్యాదయః=మూఁడు లోకములయాధిపత్యము మొదలుగాఁగల, విభవాః=సంపదలు, విరసాః=హేయములు- అనిష్టము లనుట, భవన్తి=అగుచున్నవో, త్రైలోక్యాధిపత్యాములుకూడ నీభోగ సామ్రాజ్యమునంతరుచికరములు గావనుట, క్షుద్రములగు నితరానందములెల్ల బ్రహ్మా నందమునం దంతర్భూతములు. ఇదియే 'ఏతస్యైవానన్ద స్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి' అనుశ్రుతిని జెప్పఁబడియె. కోఽపి=ఇట్టి దట్టి దని చెప్పరానిదియు, పరమః=సర్వోత్కృష్ట మైనదియు, నిత్య + ఉదిత=ఎప్పుడును అభ్యుదయసంపన్న మైనదియును, అగు, సః=ఆ, భోగః=భోగము-బ్రహ్మానందరూప మైనభోగ మనుట, ఏక ఏవ=ఒకటియే, జృంభతే=సర్వోత్కృష్టమై వర్తించుచున్నది. కాఁబట్టి, భోసాధో=ఓయీ సజ్జనుఁడా, తా నుపదేశించుదానిని ఆలించి వినుటకై స్తుతిరూపముగా 'సాధో' యని సంబోధించినాఁడు. ఇట ఏకవచనము సముదాయము గుఱించినదియే

గాన 'శేలోకాః' అనుపూర్వశ్లోకమందలిబహువచనమునకు విరుద్ధముకాదు. క్షణభఙ్గురే=అనిత్యమైన-ఇది నీచత్వమునకును ఉపలక్షణము గనుక పరమనీచములైన, తదితరే=దానికంటె వేఱైన, భోగే=భోగమునందు-బ్రహ్మానందానుభవముకంటె నితరమై యనిత్యమై తుచ్ఛములైన సాంసారికసుఖానుభవమునం దనుట, రతిం=రాగమును-ప్రీతిని, మాకృథాః=చేయకుమా, అయితే పూర్వోక్తబ్రహ్మానుభవమునందే రతిం జేయుము; అది పరమశ్రేయస్కర మని భావము.

ఉ. ఎందు వసించి ధన్యుఁడు విరించిముఖామరకోటి నెల్ల నెంచుం దృణమట్లు దేనిఁ జవిఁజూచుటచే రసహీనభావముం జెందు జగత్ప్రభుత్వమును జెప్పఁగరాని యనంతకేవలానందము దానియందు మది నాటుము మానుము నీచభోగముల్.

తా. బ్రహ్మానందానుభవమునందు నెలకొన్నవాఁడు బ్రహ్మేంద్రాదిదేవతలం గూడ గడ్డిపరకలవలెఁ జూచును. దానిని జవిచూచినవానికి ముల్లోకములయాధిపత్యమువంటివిభవములుకూడ నిస్సారములుగాఁ దోఁచును. కావున నాబ్రహ్మానందానుభవము ఇట్టి దట్టి దనరానిదై అద్వితీయమై సర్వోత్కృష్టమై సంతతాభ్యుదయసంపన్నమై వెలయుచున్నది. అట్టిదానిని విడిచి యితర మగుసాంసారికసుఖానుభవము క్షణభంగురము గాన నందు సజ్జను లాసక్తులు కాఁదగదు.

ఇది వైరాగ్యశతకమున భోగాస్థైర్యవర్ణన మన్నది చతుర్థదశకము.

## భర్తృహరిసుభాషితము - కాలమహిమానువర్ణనము.

అవ. అన్నియును గాలమునకు లోనై యుండుటవలన దానిమహిమను బదిశ్లోకముల వర్ణించుచున్నాఁడు. అందు మొదట దాని నియామకత్వమును దెలుపుచు నమస్కరించుచున్నాఁడు.

శ్లో॥ సా రమ్యా నగరీ మహాన్స నృపతిః సామన్తచక్రం చ త
త్పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిష త్తాశ్చన్ద్రబిమ్బాననాః।
ఉద్రిక్తః సచ రాజపుత్రనివహ స్తే వన్దిన స్తాః కథాః
సర్వం యస్య వశా దగాత్ స్మృతిపథం కాలాయ తస్మై నమః॥41॥

టీ. సా=ఆ-పూర్వమనుభవించినట్టి యనుట, *ఇం దన్నిటంగల తచ్ఛబ్దము పూర్వ

---

* ఇదియే 'ప్రక్రాన్తప్రసిద్ధానుభూతార్థగోచర స్తచ్ఛబ్దో నయచ్ఛబ్ద మపేక్షతే' అని కావ్యప్రకాశమందును జెప్పఁబడినది.

మనుభవింపఁబడినదానిని సహించినది కాన దీనికి యచ్ఛబ్ద మపేక్షితము కాదు, రమ్యా=క్రీడించుటకుం దగిన-మనోహర మైన, నగరీ=పట్టణమును- రాజధానియును, అంను, స=ఆ, మహాన్=గొప్పవాఁడైన, నృపతిః=రాజును, తస్య=ఆతనియొక్క-ఇది మీఁదనెల్లఁగూర్చుకొనునది, పార్శ్వే=ప్రక్కను, తత్=ఆ, సామన్తచక్రం=సామంతరాజమండలమును, సా=ఆ, విదగ్ధపరిషత్=విద్వాంసులసభయు-లేక కర్తవ్యార్థములందు చతురులైనవారి సభయు, 'కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం పరికీర్త్యతే' అని లక్షణము, తాః=ఆ, చన్ద్రబిమ్బాననాః=చంద్రబింబమువంటి మొగములుగల స్త్రీలును, ఉద్రిక్తః=గర్వించిన, సః=ఆ, రాజపుత్రనివహశ్చ=రాజకుమారుల సమూహమును, తే=ఆ, వన్దినః=స్తుతిపాఠకులును, తాః=ఆ, కథాశ్చ=కథలును-ఇంపైన వచనములు ననుట, (ఇతి)సర్వం = (అను) సమస్తమును, యస్య=దేనియొక్క - వశాత్=అధీనతవలన, స్మృతిపథం=స్మరణమార్గమును- ఊరక తలంచుకొనఁబడుటను, అగాత్=పొందెనో-అన్నియు ననుభవింపఁబడుట పోయి యిపుడూరక వానినిమనస్సునఁ దలంచుకొనుటమాత్రము దేనిచేఁ గలిగెనో యనుట, తస్మై=ఆ,కాలాయ=కాలముకొఱకు, నమః=నమస్కారము.

మ. అది మేలైనపురంబు పూజ్యచరితుం డారాజు రాణ్మండలం
బది పార్శ్వంబున నావిదగ్ధసభ వా రబ్జాస్య లత్యుద్ధతం
బది రాజన్యక మద్ది వందినికరం బాగాథలున్ సర్వముం
గదలం జేసినకాలమూర్తికి నమస్కారంబు సత్కీర్తికిన్.  41

తా. ముం దనుభవింపఁబడుచుండినయాసొగసైనపట్టణము, అం దేలుచుండినయాగొప్పరాజు, నాతనిచుట్టుఁ గొలుచుచుండినసామంతరాజులు, నతనికొలంకుల సరసగోష్ఠి సలుపు విద్వాంసులు, చంద్రబింబమువంటి మొగంబులు గల యాతనికాంతలు, భుజగర్వంబున విఱ్ఱవీఁగుచు నతని బలసియుండిన యారాజకుమారులు, నతని పొగడుచుండిన స్తుతిపాఠకులు, నతనిముచ్చటలు, నివి యన్నియు నశించినవై యిపుడు కేవలము స్మరింపఁబడుచుమాత్ర మున్నవి. ఇదియంతయు కాలమహిమయే. కాన నట్టికాలమునకు నమస్కరించెద.

అవ. కాలమును బాచికలాడుజూదరితోఁ బోల్చి సర్వప్రాణుల నది నియమించుచున్న దని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యత్రానేకే క్వచి దపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ స్తత్ర నైకోఽపి చాన్తే।
ఇత్థం చేమౌ రజనిదివసౌ దోలయ న్ద్వావివాక్షౌ
కాలః కాళ్యా భువనఫలకే క్రీడతి ప్రాణిశారైః॥  42

టీ. యత్రక్వచిత్=ఏ యొకానొక, గృహే=ఇంటియందు- నెత్తపలకయందలి యింటియందు, ఇట్లే యర్థద్వయము మీఁదనెల్లఁ దెలియునది, అనేకే=పెక్కండ్రు-పెక్కండ్రు ప్రాణు లనుట- పెక్కుసారె లని యర్థాంతరము, ఉండిరో యని శేషము, అథ=పిమ్మట, తత్ర=అందు-ఆయింటియందు-ఆనెత్తపలకలోని యింటియందు, ఏకః=ఒకఁడు-ఒకప్రాణి - ఒకసారె, తిష్ఠతి=ఉండును. యత్ర=ఎందు-ఏ యింటియందు, ఏకః=ఒకఁడును-ఒకసారెయు, తదను=పిదప, బహవః=పెక్కండ్రును-పెక్కుసారెలును, ఉండిరో, తత్ర=అందు, అన్తే=కడపట, ఏకోఽపి=ఒకఁడును-ఒకసారెయు, న=ఉండడు. ఇత్థం=ఈప్రకారముగా, కాలః=కాల మను పురుషుఁడు, ఇమౌ=ఈ, రజనిదివసౌ=రేయుంబగలు రెంటిని, అక్షౌ ద్వావివ=రెండుపాచికలవలె, భువనఫలకే=జగముఅనెడి నెత్తపుఁబలకయందు, దోలయన్=దొర్లించుచు, కాళ్యాసహ=కాళితోఁగూడ, ప్రాణిశారైః= ప్రాణులనెడి సారెలచేత, క్రీడతి=ఆడుచున్నాఁడు-జూదమాడుచున్నాఁ డనుట. పాచికలదొర్లుటచేత నే సారెల రాకపోకలు గలుగునట్లు రాత్రిందివములగతిచేత నే ప్రాణులజీవితముల రాకపోకలు గలుగుచున్నవి గాన రేయుంబగలు పాచికలుగాను, ప్రాణులు సారెలుగాను రూపింపఁబడినవి- 'అక్షావివ' అనుచో 'ఇవ' యను నుపమాలింగము స్పష్టముగా నుంటచే నన్నిట నుపమితసమాసముగా గ్రహించినయెడల నలంకార ముపమ. లేక 'క్రీడతి' యనుట కుపయుక్తముగా రూపకము నే యాశ్రయించినయెడ నలంకారము రూపకము. అదియు 'కాలః' అనుచో అక్షధూర్తత్వరూపణము గమ్యముగా నుండుటచే ఏకదేశవర్తి యగు. అందులకు 'అక్షావివ' అనునుపమ యంగము.

శా. ఏయింటన్ వసియించుఁ బెక్కు లొకఁ డాకయింటం బ్రవర్తించు నే
చాయన్ నిల్చు నొకండు పెక్కు లచటన్ కసంధిల్లు నొండైన లే
దాయింటన్ మది నిట్లు రాత్రిదినరూకపాక్షద్వయిం జిమ్ముచుం
జేయుం గాలుఁడు క్రీడ లోకఫలకక్రశ్రేణిన్ నృశారంబులన్. 42

తా. నెత్తపలకయం దేయింట మొదట నొకసారె యుండెనో యందే పెక్కుసారెలుండుటయు, నెందొకసారెయుఁ బిదపఁ బెక్కుసారెలు నుండెనో యందుఁ గడపట నొక్కసారెయు లేకుండుటయు నెట్లో యట్లే భూమిలో సాంసారికగృహములందెచటఁ బెక్కండ్రుండిరో యచట నొక్కఁ డుండును. ఎచ్చట నొకఁడును బిదపఁ బెక్కండ్రు నుండిరో యచటఁ గడపట నొక్కఁడు నుండఁడు. దీనినిబట్టి చూడఁగా నిట్లు తేలుచున్నది. ఈపుడమి యనెడినెత్తపుఁబలకయందు రేయుంబవ లనెడి రెండుపాచికల దొర్లించుచుఁ బ్రాణు లనెడిసారెలతో కాల పనుజాదరి కాళికతోడ జూదమాడుచున్నాఁడు.

అవ. లోకులు నిత్యము పరాకువలన నీకాలమహిమను దెలియంజాల కున్నా రనుచున్నాఁడు.

శ్లో॥ ఆదిత్యస్య గతాగతై రహరహః సంక్షీయతే జీవితం
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలో న విజ్ఞాయతే।
దృష్ట్వా జన్మజరావిపత్తిమరణం త్రాస శ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్॥

టీ. ఆదిత్యస్య=సూర్యునియొక్క, గతాగతైః=రాకపోకలచేత-ఉదయాస్తమయములచేత ననుట, అహరహః=ప్రతిదినమును, జీవితం=ఆయువు, సంక్షీయతే=మిక్కిలి తఱుఁగుచున్నది-కాలక్రమమున నాయువు క్షయించుచున్నదనుట. అయినను, బహు...గురుభిః-బహు=అనేకములైన, కార్యభార=కార్యాతిశయములచేత- దేహగేహములకొఱకు వలయునర్థపరంపరలచేత ననుట, గురుభిః=గొప్పలైన, వ్యాపారైః=చేష్టితములచేత-జీవనమునకై నపూనికలచేత ననుట, కాలః=కాలము, నవిజ్ఞాయతే=విశేషించి తెలియఁబడదు-జీవితార్థమైన వ్యాపారపరంపరలందు మునిఁగియుండుటచే కాలముపోకడను విశేషించి పాటించుటలేదని యర్థము. జన్మజరావిపత్తిమరణం=పుట్టుట ముదిమి ఆపద చావు అనువానిని, దృష్ట్వా=చూచి, త్రాసశ్చ= భయమును, న ఉత్పద్యతే=పుట్టదు, ఈజన్మాదులు క్లేశపూర్ణములైనవి,ఇందు సుఖలేశమును లేకుండియు వీనిని సుఖప్రచురములుగా మూఢులు దలఁచి వీనిని గలిగించు నవిద్యాకామకర్మముల నడుఁగకయుందురనిభావము. జగత్=జగము-లోకులందఱుననుట, మోహమయీం=అజ్ఞానముచే నిండారిన-బుద్ధిని తలక్రిందు సేయునట్టి యనుట, ప్రమాదమదిరాం=పరాకు అనెడి మద్యమును, పీత్వా=త్రాగి, ఉన్మత్తభూతం=వెఱ్ఱికొన్నది-వివేకశూన్య మైనది, అగుననని శేషము. కాలముచేతనే లోకులు పరాకునొందుటవలన దానిమహిమ వారెట్లు నెఱుంగనేరక యిట్లెల్ల నాచరించుచున్నా రని భావము.

చ. అనుదినముఁ క్షయించుఁ బరమాయువు సూర్యునిరాకపోకలఁ
ఘనబహుకార్యభారములఁ గాలము పోవుట గానరాదు సం
జననజరామయంబులును జావును జూచి భయంబు లేదు దు
ర్జనభువనంబు మోహమదిరారసవిహ్వల మయ్యె నయ్యయో. 43

తా. సూర్యునియుదయాస్తమయములచే నాయువు మిక్కిలి నానాఁట క్షీణించుచున్నది. అయినను లోకులు జీవితార్థమై పెద్దకార్యములందు మునిఁగియుండుటచే కాల మట్లుపోవుచు నాయువును దగ్గించుచుండుటను విశేషించి పాటింపరు. పుట్టుక,

ముదిమి, యిడుమలు, చావు మొదలగు కష్టములం జూచియు దిగులునొందరు పరా కువలన లోకులబుద్ధి తడఁబడి యున్నది. లేకున్న వారు పిచ్చిగొని యెల్లెల్లఁ జేయరు.

అవ. చెప్పినదానినే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రాత్రిః సైవ పునః స ఏవ దివసో మత్వాబుధా జన్తవో
ధావ న్త్యుద్యమిన స్తథైవ నిభృతప్రారబ్ధత త్తత్క్రియాః।
వ్యాపారైః పునరుక్తభుక్తవిషయై రేవంవిధే నామునా
సంసారేణ కదర్థితా వయ మహో మోహా న్న లజ్జామహే. 44

టీ. రాత్రిః=ఈనడచుచున్న రాత్రి, పునః=మరల, సైవ=అదియే-కడచినరా త్రివంటిదేయనుట, దివసః=ఇప్పుడు జరుగుచున్న దినము, పునః=మరల, సఏవ=అది యే-కడచిపోయిన దినమువంటిదే, (ఇతి=అని), మత్వాపి=తెలిసియు, అబుధాః=ఎ ఱుక లేని, జన్తవః=ప్రాణులు, ఉద్యమినః=పూనికగలవారై, తథైవ=అట్లే-మును పటివలెనే, నిభృత...క్రియాః-నిభృత=దృఢముగా-లేక, రహస్యముగా, ప్రారబ్ధ= ఆరంభింపఁబడిన, తత్తత్క్రియాః సన్తః=ఆయాకార్యములుగలవారు అగుచు, ధావ న్తి=పరుగిడుచున్నారు. జరుగుచున్న రాత్రియుఁ బగలును గడచిపోయినరాత్రిని బగటిని బోలినవేయని తెలిసియు నిందేమో విశేషము కలిగియున్నట్లు తలఁచి మును పటికార్యములనే మరలఁబూనిచేయుఁదురు కింతురని యర్థము. పునరుక్తభుక్తవిషయైః- పునరుక్తంయథాతథా=పునరుక్తముగా, భుక్త=అనుభవింపఁబడిన-మునుపటివే యై మరలమరల ననుభవింపఁబడిన, విషయైః=విషయములుగల, వ్యాపారైః=చెయ్వులచే తను-ఏవ్యాపారమునందును ముం దనుభవించినవిషయములే మరలమరల ననుభవింపఁ బడుచున్నవిగాని విశేష మేమియులేదనుట, ఏవంవిధేన=ఇట్టివిధముగల-ఇట్లు నిర్వే దము కలిగించునదైన, అమునా సంసారేణ=ఈసంసారముచేతను, కదర్థితాః=ఎగ్గిం పఁబడినవారమైన-నిరర్థకులుగాఁ జేయఁబడినవారమైన యనుట, వయం=మనము- మన మిట్లు చర్వితచర్వణముగా మునుపటివిషయములనే యనుభవించుకార్యములు సేయుటచేతను నిట్టివానివలన నిర్వేదావహమైన యీసంసారముచేతను వ్యర్థులమై మనబ్రతుకునకు లజ్జపడఁదగినవా రయ్యును, మోహాత్= అజ్ఞానమువలన, నలజ్జా మహే=సిగ్గుపడకున్నారము. అహో=ఆశ్చర్యము ! కాలమహిమచే నిస్సారులుగా మన మయ్యు నందులకై లజ్జింపకుండుట మిక్కిలి యాశ్చర్య మని భావము.

ఉ. వచ్చినరాత్రులే తిరిగి • వచ్చుట పోయినవాసరంబులే
వచ్చు నెఱింగి గూఢతర • వర్తనులై పునరుక్తకార్యముల్
నిచ్చలు సేయుచుంద్ జనులు • నిశ్చలవృత్తిఁ జరింతు రీభవా
భ్యుచ్ఛ్రయరీతిచేఁ జెడి కు • బుద్ధులు సిగ్గు వహింప రెంతయున్. 44

తా. ఇప్పుడు జరుగుచున్న రాత్రిగాని పగలుగాని కడచిన పోయిన రాత్రినిఁ బగటిని బోలినవేకాని మఱి విశేషించిన వేమియుఁగావు. ఇట్లని తెలిసియు ప్రాణు లెఱుకమాలి యిందేమో విశేషముండునట్లు తలఁచి పనిపూని మునుపటియాకార్యములనే మరలఁ జేయుటకుఁ బరుగిడుచున్నారు. ఇట్టికార్యము లేల? ఏవ్యాపారమునందును మున్ననుభవించినవిషయములే మరల ననుభవింపఁబడుచున్నవికాని వింత యేమియు లేదు. ఈసంసారమో ఎంతయు నిర్వేదకరము. ఇట్టివ్యాపారములచేతను నిట్టి సంసారముచేతను గలిగినమనబ్రతుకున కెంతో లజ్జింపవలసినవార మైనను అజ్ఞానమువలన లజ్జింపకుండుట యెంతయు వింతగా నున్నది.

అవ. లోకంబునఁ బురుషులకు ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధపురుషార్థములు సంపాదించుటకు సాధనములుగా పరమేశ్వర పదధ్యానము, యజ్ఞము, అధ్యయనము, యశోవిత్తార్జనము, గురుశుశ్రూష, అంగనాలింగనము మొదలైనవి యాయాదానికిఁ దగునట్లు విహితములై యున్నవి. మేమో వానియం దొకటియుఁ గావించినవారము గాము. కాన మాజన్మము నిరర్థకమైనదని సారెసారెకు శోకించువారలవచనము నభినయించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ న ధ్యాతం పద మీశ్వరస్య విధివ త్సంసారవిచ్ఛిత్తయే
స్వర్గద్వారకవాటపాటనపటు ర్ధర్మోఽపి నోపార్జితః।
నారీపీనపయోధరోరుయుగళం స్వప్నేఽపి నాలిఙ్గితం
మాతుః కేవలమేవ యౌవనవనచ్ఛేదే కుఠారా వయమ్॥ 45

టీ. సంసారవిచ్ఛిత్తయే=సంసారమును నిర్మూలించుటకొఱకు-మోక్షప్రాప్తికొఱకనుట, ఈశ్వరస్య=శివునియొక్క, పదం=అడుగు-పాదారవిందయుగళ మనుట, విధివత్=శాస్త్రముచొప్పున, నధ్యాతం=ధ్యానింపఁబడినదికాదు. 'శమ్భుపాదామ్బుజధ్యానం సాక్షాన్మోక్షైకసాధనమ్' అని యనేకపురాణేతిహాససంహితావచనములచేత సాక్షాన్మోక్షసాధనముగా విధింపఁబడిన శంభుపదధ్యానము సేయమిచే తత్ఫలమైన మోక్షపురుషార్థమును మేము గడించినవారము కామైతి మని భావము. ఇట్లే ధర్మార్థములను సంపాదింపమికి శోకించుటను జెప్పుచున్నాఁడు. స్వర్గ... పటుః-స్వర్గద్వార=స్వర్గద్వారముయొక్క, కవాట=తలుపును, పాటన=చీల్చుటయందు,పటుః=సమర్థమైనదగు-ఇట స్వర్గము అపవర్గమునకును ఉపలక్షకము గాన స్వర్గాపవర్గములను నిరాటంకముగాఁ జొరనిచ్చునట్టి దను,ధర్మోఽపి=జ్యోతిష్టోమాదిధర్మమును, న ఉపార్జితః=సంపాదింపఁబడినదికాదు. 'జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత' 'ధర్మా త్సుఖంచ జ్ఞానా న్మోక్ష మవాప్నుయాత్' ఇత్యాదిశ్రుతిస్మృతులందు స్వర్గాది

సాధకముగాఁ బ్రతిపాదింపఁబడిన ధర్మము ననుష్ఠింపమిచే తత్ఫలమైన పురుషార్థములును మాకు సిద్ధింపవయ్యె ననిభావము. నారీ...యుగళం-నారీ=స్త్రీలయొక్క, పీన=బలుపుగల, పయోధర=స్తనములయొక్క, ఉరు=గొప్పదైన, యుగళం=జంట-బలితంపుగబ్బిగుబ్బచందోయియనుట-లేక, పీన=బలుపుగల, పయోధర = చన్నులయొక్కయు, ఉరు=తొడలయొక్కయు, యుగళం=జంట, అనియు నర్థము, స్వప్నేఽపి=కలయందుఁగూడఁ-ఇఁక మేలుకొనియున్నపుడు చెప్పనేల యనుట. న ఆలిఙ్గితం=కౌఁగిలింపఁబడినది కాదు. 'సంసారే పటలాన్తతోయతరళే సారం యదేకం పరం। యస్యాయంచ సమగ్ర ఏష విషయగ్రామప్రపన్నో జనః। తత్సౌఖ్యం పరతత్త్వవేదనమహానన్దోపమం మన్దధీః। కోవా నిన్దతి సూక్ష్మమన్మథకలావైచిత్ర్యమూఢోజనః॥ మబ్బులచాలు చివరలోని నీటివలె నిలుకడలేనిసంసారమునందు ఏది యద్వితీయమై మిక్కిలియుత్కృష్టమగుసారమో, విషయసమూహముల నాశ్రయించిన యీజనుఁడు దేనికిఁ జాలినవాఁడో, పరబ్రహ్మానుభవజనితమహానందములో సాటియైన యాసౌఖ్యమును, సూక్ష్మములగు మన్మథకళావిచిత్రములను దెలియక నిందించుమందమతి యెవఁడు' అని కామశాస్త్రోక్తిప్రకారమున నుపాదేయమైన కామపురుషార్థము నొడఁగూర్చునదిగాఁ జెప్పఁబడిన యంగనాకుచకుంభాలింగనాదికము గూడ మేము చేసినవారము గాము గాన తత్ఫలమైనకామపురుషార్థమును మాకు సిద్ధింపదయ్యె నని భావము. అయితే, కేవలం=మిక్కిలియు, మాతుః=తల్లియొక్క, యౌవనవనచ్ఛేదే=ప్రాయమనెడి వనమును ఛేదించుటయందు, వయం=మేము, కుఠారా ఏవ=గొడ్డండ్రమే-యౌవనము పుత్రోత్పత్తిపర్యంతమైనదిగాన మేము పుట్టి తల్లియౌవనమును బోఁగొట్టితి మింతేకాని మఱియేయర్థము సాధించినవారము గాము; కాఁబట్టి మా జన్మము నిరర్థకమే యని భావము.

ఉ. శ్రీరమణీయశంభుపదచింత యొనర్చుట లేదు గోపుర
ద్వారకవాటపాటనసుధర్మము సేయుట లేదు సుందరీ
హారికుచోరులబ్ధిఁ గలనైన నెఱుంగము మాతృయౌవనో
దారవనీకుఠారములమై జనియించినవార మిమ్మహిన్. 45

తా. సంసారము దూలునట్లు పరమేశ్వరపదధ్యానము సేయమిచే మోక్షమును బొందమైతిమి. స్వర్గము నిరాతంకముగాఁ జూరనిచ్చుధర్మమును గడింపకపోయితిమి. వగలాండ్రగబ్బిగుబ్బలను నూరువులను గలలోనైనఁ గౌఁగిలింపమిచే కామపురుషార్థమునకు దూరుల మైతిమి. కాన తల్లియొక్క ప్రాయము దూలించుటకొఱకే మేము జన్మించితిమి గాని మఱి యేపురుషార్థమును గడించుటకొఱకుఁ గాదు గాన నిరర్థకజన్ముల మైతిమి.

శ్లో॥ నాభ్యస్తా భువి వాదిబృన్దదమనీ విద్యా వినీతోచితా
ఖడ్గాగ్రైః కరికుమ్భపీఠదళనై ర్నాకం న నీతం యశః।

కాన్తాకోమలపల్లవాధరరసః పీతో న చన్ద్రోదయే
తారుణ్యం గతమేవ నిష్ఫల మహో శూన్యాలయే దీపవత్ ॥ 46

టీ. భువి=పుడమియందు, వాదిబృన్దదమనీ = ప్రతివాదుల సమూహము నడంచునట్టిదియు, వినీత ఉచితా=వినయసంపన్నులైన సజ్జనులకుఁ దగినదియు, అగు, విద్యా=వేదశాస్త్రాదిరూపమైన విద్య, నఅభ్యస్తా=అభ్యసింపఁబడినదిగాదు. ఖడ్గ అగ్రైః=కత్తిమొనలచేత, కరి...దళనైః-కరి-ఏనుఁగులయొక్క, కుమ్భపీఠ=పీఁటల వంటి కుంభస్థలములను, దళనైః=చీల్చుటలచేత, యశః=కీర్తి, నాకం=స్వర్గమును గూర్చి, నీతం న=కొనిపోవంబడినదిగాదు-కీర్తి యాకసము ముట్టునట్లు కత్తిగొని శత్రుగజకుంభములను జీల్పలేదనియర్థము. క్షత్రధర్మముచే లోకాంతరమునను బొగడ్తకెక్కునట్టికీర్తిని గడింపలేదని భావము. 'కీర్తిః స్వర్గఫల మాహు రాసంసారం విపశ్చితః' అనువచనముంబట్టి స్వర్గసాధనము గాఁ బ్రతిపాదితమైనకీర్తి నార్జింపమిచే స్వర్గమును గలుగదనియు 'కింజన్మకీర్తింవినా' అనుటచే పుడమియందు కీర్తి లేనిచో జన్మమును సఫలము కాదనియు నాశయము. చన్ద్రోదయే=చంద్రుఁడుదయించునపుడు, కాన్తా...రసః-కాన్తా=ప్రియురాలియొక్క, కోమల=మృదువైన, పల్లవాధర=మోవిచిగురుయొక్క-చిగురువంటి క్రిందిపెదవియొక్క, రసః=రసము-అధరామృతమనుట, పీతః న=క్రోలంబడినదికాదు. కాఁబట్టి కామపురుషార్థమును గడింపలేదని భావము. 'మలయానిలచన్ద్రోద్యా స్తటస్థాః పరికీర్తితాః' అన్నట్లు చంద్రుఁడు తటస్థమైనశృంగారరసోద్దీపనవిభావమగుటంజేసి చంద్రోదయ మిట చెప్పఁబడినది. తారుణ్యం=యౌవనము, శూన్యఆలయే=ఎవరు లేనియింటియందు, దీపవత్=దీపమువలె-పాడుపడినయింటియందుఁబెట్టినదీపమువలె ననుట, నిష్ఫలమేవ = నిరర్థకముగానే,గతం=పోయినది. పాడుపడినయింటియందలిదీప మెవ్వరికి నుపయోగింపమిచే నిరర్థకమైనట్లు యౌవనమును ఏపురుషార్థమును గడింపమిచే నిరర్థకమే యయ్యె నని యర్థము. అహో=అకటా.

చ. వలనుగ విద్య నేర్చి ప్రతికవాదుల గెల్చుటలేదు కుంభిని
ర్దళనని శాతఖడ్గముల కీ దైవతలోకమునందుఁ గీర్తులుగా
నిలుపుట లేదు చారురమణీమధురోష్ఠముఁ గ్రోలలేదు ని
ష్ఫల మయి జవ్వనం బరిగెఁ గ బాడుగృహంబున దీపముంబలెన్.46

తా. ప్రతివాదుల మూఁకలనడంపఁజాలినదియు వినీతులకు వలయునదియు నగు విద్యను గఱచినవారము గాము. వాఁడికత్తిమొనచేతఁ బగవారియేనుఁగులకుంభముల వ్రయ్య నడుచువీరత్వంబున మిన్నుముట్టినట్టికీర్తియుఁ బొందినవారము గాము. శృంగారరస మిగురొత్తు చంద్రోదయసమయమునఁ బ్రియురాలిచిగురాకువంటినునుమోవితేనియ నానినవారము గాము. ఇట్లు విద్యయులేక కీర్తియుఁ గానక సుఖమును బడయక పాడింటనెత్తినదీపమువలె మాజవ్వన మంతయు కట్టా! రిత్తవోయినది.

శ్లో॥ విద్యా నాధిగతా కళఙ్కరహితా విత్తంచ నోపార్జితం
శుశ్రూషాపి సమాహితేన మనసా పిత్రోర్న సమ్పాదితా।
ఆలోలాయతలోచనాః ప్రియతమాః స్వప్నేఽపి నాలిఙ్గితాః
కాలోఽయం పరపిణ్డలోలుపతయా కాకై రివ ప్రేరితః॥ 47

టీ. కళఙ్కరహితా=కళంకములేని-సప్రమాణ మైన యనుట, విద్యా=విద్య, న అధిగతా=అభ్యసింపఁబడినది కాదు. విత్తంచ=ధనమును-త్యాగభోగసాధన మైన దనుట, న ఉపార్జితం=ఆర్జింపఁబడినదికాదు. 'యస్యాస్తివిత్తంస నరః కులీనః' 'ధన మార్జయ కాకుత్స్థ ధనమూలమిదంజగత్। అన్తరం నాభిజానామి నిర్ధనస్య మృతస్యచ' ఇత్యాదివచనముల నుపదిష్టమైనయర్థార్జనములేమిచే దానివలనిఫలమును మాకు లేదనిభావము. సమాహితేన=ఎచ్చరికగల, మనసా=మనస్సుచేత,పిత్రోః=తలిదండ్రులకు, శుశ్రూషా=పరిచర్య, సమ్పాదితా న=చేయఁబడినదికాదు. 'మాతాపితృసమందైవం సర్వేషాం నహివిద్యతే। తస్మాత్సమర్చయే న్నిత్యం పితరౌ దేవరూపిణౌ' ఇత్యాదివచనములవలన పరమేశ్వరారాధనముతో సాటిగాఁ జెప్పఁబడిన పితృసేవయుఁ గావించినవారము గామనుట. ఆలోల ఆయతలోచనాః=చంచలములును విశాలములు నగుకన్నులుగల, యువతయః=జవరాండ్రు, స్వప్నేఽపి=కలయందును, ఆలిఙ్గితాః న=కౌఁగిలింపఁబడినవారుగారు. వట్టిమిథ్య! యగుకలలోని సుఖమే లేనపుడు మేలుకొనియున్నప్పుడు నిజముగా ననుభవించుట కలుగ నే కలుగదని చెప్ప నేల యనిభావము. అయం=ఈ, కాలః=కాలము-ఈజరుగుచున్నకాల మనుట, కాకైః ఇవ=కాకులచేతంబోలె, మాచేత నని శేషము, పరపిణ్డలోలుపతయా=ఒరులకూటియందలిపేరాస కలిగియుండుటచే, ప్రేరితః=కడపఁబడినది. ('ప్రేర్యతే' అనుచో కడపఁబడుచున్నది యని యర్థము).

చ. వినయవిశేషహృద్య లగువిద్యలు నేర్చుటలేదు నీతిచే
ధనమును గూర్పలేదు తలిదండ్రులసేవయుఁ జేయలేదు చ
క్కనిచిగురాకుఁబోండ్లబిగికౌఁగిలియుం గలనైన లేదు గో
బ్బున సమయంబు కాకులకుఁబోలె గతించెఁ బరాన్నభుక్తులన్.

తా. నిష్కళంకమైనవిద్య నభ్యసింపలేదు. త్యాగభోగసాధనమైన ద్రవ్యము నార్జింపలేదు. ఎచ్చరికతోడఁ దలిదండ్రులకుం బరిచర్య సేయలేదు. వాలుఁగన్నుల జవరాండ్రఁ గలనైనఁ గౌఁగిలింపలేదు. కాలమంతయుఁ గాకులవలెఁ బరులకూటితోఁ బొట్ట ప్రోచికొనుచుఁ గడపితిమి. కాని మఱిపురుషార్థమును గడింపమైతిమి.

అవ. కాలపరిపాకమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ వయం యేభ్యో జాతా శ్చిరపరిగతా ఏవ ఖలు తే
సమం యైః సంవృద్ధాః స్మృతివిషయతాం తేఽపిగమితాః।

ఇదానీ మేతే స్మః ప్రతిదివస మాసన్నపతనా
గతా స్తుల్యావస్థాం సికతిలనదీతీరతరుభిః॥ 48

టీ. వయం=మనము, యేభ్యః=ఎవరివలననుండి-ఏతలిదండ్రులవలననుండి యనుట, జాతాః=పుట్టితిమో, తే=వారు, చిరపరిగతా ఏవ ఖలు=చాలకాలమునకు మునుపే మృతులైనవారలేగదా. ('చిరపరిచితాః' అనుచో చాలకాలమునకు మునుపటిపరిచయముగలవారనుట-వారితోడిపరిచయము పోయి చాలకాల మైనదనుట), యైః సమం=ఎవరితోఁగూడ, సంవృద్ధాః=చక్కఁగాఁ బెరిఁగితిమో, తేఽపి=వారుకూడ, స్మృతివిషయతాం=స్మరణమునకు గోచరు లగుట-మనస్సులో తలఁచుకొనఁబడుటను, గమితాః=పొందింపఁబడినవారై రి-మనస్సునఁ దలంచుకొనఁబడువారేకాని పుడమిలోఁ జూచుటకు లేనివారనుట-మృతులైరని భావము. ఇదానీం=ఇప్పుడు-ఈవార్ధకదశయం దనుట, (వయం=మేము), ప్రతిదివసం=ఒక్కొక్కదినమును-నాఁడునాఁటికి, ఆసన్నపతనాః=సమీపించినపాటు గలవారును-నాశము సమీపించుచున్నవారనుట, కాఁబట్టియే, సిక...తరుభిః-సికతిల=ఇసుకపాఱయైన, నదీతీర=ఏటిగట్టునందలి, తరుభిః=చెట్లతోడ, తుల్యఅవస్థాం=సమానమైనదశను, గతాః=పొందినవారును-అను, ఏతే=వీరు-ఇట్టివారమైయనుట, స్మః=ఉన్నారము. ఇదియంతయుకాలము సేఁతయే; మఱొకరి కిట్టిసామర్థ్య మెక్కడిదనిభావము. అలలు గొట్టుటచే నిసుక తొలఁగిపోవఁగా నందు మొలచినచెట్లు త్వరలోఁ బెల్లగిలికూలుచున్నవి. కావున నే నదీతీరమున కిచట 'సికతిల' విశేషణము. ఆచెట్లవలె నానాఁటఁ ద్వరలో నాశము సమీపించుచుండుటవలన వానితోడిసామ్య మిట నిబద్ధము. అలం. ఉపమ.

ఉ. తాలిమి మాలి కన్నతలిదండ్రులఁ దోడ మెలంగువారలం
గాలము గోలుపుచ్చె నని కానరు ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహితదుర్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజములకుం సరివత్తురు మూఢమానవుల్. 48

తా. మనలఁ గన్నవారుపోయి చిరకాలమైనది. మనమెవరిలోఁగూడఁ బెరిఁగితిమో వా రిపుడు తలంపునమాత్రమే యున్నారు. మేమో యిసుకపాఱైన యేటిగట్టచెట్లువలె నానాఁటికి నాశము సమీపించుచు నించె యున్నారము.

అవ. ప్రాణులకు విచారింపఁగా కొంచెమేనియుఁ దీఱుపాటు లేదనుచున్నాఁడు.

శ్లో॥ ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధ మపరం బాలత్వవృద్ధత్వయోః।

శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే
జీవే వారితరఙ్గచఞ్చలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్॥ 49

టీ. నృణాం=మనుష్యులయొక్క, ఆయుః=ఆయువు, వర్షశతం=నూఱుసంవత్సరములుగా, పరిమితం=కొలఁదిపెట్టఁబడినది-బ్రహ్మచేతనని శేషము, తదర్ధం=దానిసగము-ఏఁబదిసంవత్సరము లనుట, రాత్రౌ=రాత్రియందు, గతం=పోయినది-ఇంద్రియవ్యాపారము లుడిగియుండు నిద్రాదశచే గళితమైనదనుట, తక్కినదైన, పరస్య తస్యఅర్ధస్య=తక్కిన ఆసగముయొక్క-మేలుకొని కడపు కడమ యేఁబదిసంవత్సరములయొక్క యనుట, అపరం=మఱియొక, అర్ధం=సగము-అనఁగా నిరువదియైదుసంవత్సరము లనుట, లేక, చకారమువలన 'తస్య అర్ధస్య అర్ధం; పరస్య అర్ధస్య అర్ధం' అని రెండుగా విభజించుకొని 'తస్య=ఆయేఁబదియొక్క, -అర్ధస్య=సగముయొక్క-అనఁగా నిరువదియైదింటియొక్క, అర్ధం=సగమును అనఁగా పండ్రెండునరయు, పరస్య అర్ధస్య=(ఆయేఁబదియొక్క) తక్కినసగముయొక్క, అర్ధం=సగమును-పండ్రెండునరయు, బాలత్వవృద్ధత్వయోః=బాల్యవార్ధకములందు, గతం=పోయినది. బాల్యమునందు పండ్రెండునరయు వార్ధకమునందు పండ్రెండునరయుఁ బోయినవని యర్థము-అజ్ఞానములోఁగూడినబాల్యదశయందును, అశక్తితోఁ గూడిన వార్ధకమునందును వ్యర్థముగాఁ జెడి పండ్రెండునగవత్సరములు గడచిపోయెనని భావము. ఇట బాల్యవార్ధకములకాలనిర్ణయమందు రాత్రులు గణింపఁబడవు. పగళ్లుమాత్రమే కైకొనఁబడినవి కాన చెడి పండ్రెండునరయనఁగా నిది వట్టిపగళ్ల మొత్తమేయగును. రాత్రులతోఁగూడ గణించిన చెడి యిరువదియైనువత్సరము లగు నని యూహించునది. శేషం=తక్కినది-మిగిలినయిరువదియైదువత్సరములనుట, వ్యాధివియోగదుఃఖసహితం సత్=రోగములయొక్కయు పుత్రకళత్రాదుల నెడఁబాయుటలయొక్కయు దుఃఖములతోఁ గూడిన దగుచు, సేవాదిభిః=కొలువు మొదలైనవానిచేత-పొట్టపోసికొనుటకు విత్తవంతులఁ గొలుచుట మున్నగుకష్టకర్మములచేత ననుట, నీయతే=కడపఁబడుచున్నది. కాఁబట్టి, వారి...తరే-వారితరఙ్గ=నీటికరుళ్లవలె, చఞ్చలతరే=మిక్కిలి యస్థిరమైన, జీవే=ఆయువునందు, ప్రాణినాం=ప్రాణులకు, సౌఖ్యం=సుఖము, కుతః=ఎక్కడిది-ఎట్లును సుఖము లేదనుట, విచారింపఁగా ప్రాణులకు రత్యంతసుఖముఁ బొందుటకును దీఱుపాటు లేదని భావము.

ఉ. ఆయువు నూఱువత్సరము లందు సగంబు నశించె నిద్రచే
నాయెడలో సగంబు గత మయ్యెను బాల్యజరాప్రసక్తిచేఁ
బాయక తక్కినట్టిసగ మాలు గతించుఁ బ్రయాసవృత్తిచే
నాయువు చంచలం బగుటఁ బ్రాణుల కెట్లు సుఖంబు చేకుఱున్.

తా. మనుష్యుల కాయుష్కాలము నూఱేండ్లకొలఁదిగా నేర్పఱుపఁబడియున్నది. అందు సగము (ఏఁబదియేండ్లు) ఇంద్రియవ్యాపారములేని నిద్రాదశ గలరాత్రియందుఁ బోయినది. మిగతసగమునందు సగము (ఇరువదియైదేండ్లు) అజ్ఞానముతోఁ గూడిన బాల్యముచేతను అశక్తితోఁగూడిన ముదిమిచేతను జరుపఁబడినది. మిగిలిన సగమో (యిరువదియైదేండ్లో) రోగములు వియోగములు మున్నగువానివలనిదుఃఖములం బడుచు నుదరపోషణమునకై కొలువుసేయుట మొదలైనకష్టములందుఁ గడపఁబడినవి. ఆయువో నీటికెరుల్లవలె నతిచంచలమైనది. అదియు నిట్లు జరుపఁబడెనేని ప్రాణులకు సుఖము కలుగుట కవకాశ మెక్కడిది?

అవ. బాల్యాదిదశలను వరుసగాఁ బొందుచు మనుజులందఱును మృతిం జెందుచున్నా రని చెప్పి యుపసంహరించుచున్నాఁడు.

శ్లో॥ క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపి చ సమ్పూర్ణవిభవః ।
జరాజీర్ణై రఙ్గై ర్నట ఇవ వలీమణ్డితతను
ర్నరః సంసారాన్తే విశతి యమధానీయవనికామ్॥ 50

టీ. నరః=మనుష్యుఁడు-మనుష్యులెల్లవారుననుట, నట ఇవ=నర్తకునివలె, క్షణం=క్షణమాత్రమున-స్వల్పకాలమనుట, బాలః=బాలుఁడు, భూత్వా= అయి, క్షణమపి=క్షణముననే, కామరసికః=మన్మథునిచే రసజ్ఞుఁడైనవాఁడగు-శృంగార రసాభిజ్ఞుఁడగు, యువా=వయసుకాఁడు, అయి, క్షణం=క్షణములోన, విత్తైః=ద్రవ్యములచేత, హీనః=తక్కువయైనవాఁడు-దరిద్రుఁడనుట, అయి, క్షణమపిచ=క్షణముననే, సంపూర్ణవిభవః=పరిపూర్ణమైన ధనము గలవాఁడు, 'అర్థరై విభవాఅపి' అని విభవశబ్దము ధనపర్యాయముగా నమరుఁడు, అయి, జరాజీర్ణైః=ముదిమిచేజీర్ణించిన-సంధులబిగిలప్పినట్టి యనుట, అఙ్గైః=అవయవములచేత, వలీ...తనుః-వలీ=ముడుతలచే, మణ్డిత=అలంకరింపఁబడిన-గుర్తింపఁబడిన యనుట, తనుః=దేహముగలవాఁడును, అయి, నటుఁడు బాలుఁడుగాను, యౌవనవంతుఁడుగాను, ధనికుఁడుగాను, దరిద్రుఁడుగాను, వృద్ధుఁడుగాను నల్పకాలమున నాయావేషములు దాల్చునట్లు మనుష్యుఁడు నాయాబాల్యకౌమారాద్యవస్థలు స్వల్పస్వల్పకాలములే తాల్చినవాఁడై కడపట వార్ధకమునుజెంది యనుట, సంసార అన్తే=బాల్యయౌవనాదిరూపసంసారముయొక్క కడపట యని నరపక్షము-నాట్యప్రవర్తనాడంబరముకడపట యని నటపక్షము, యమ...యవనికాం-యమధానీ = యమునిరాజధాని యనెడు-సంయమని యనెడు, యవనికాం=తెరను, విశతి=చొచ్చుచున్నాఁడు - మృతుఁడగుచున్నాఁడనుట- తెరచొచ్చు చున్నాఁడని నటపక్షము. అలం. ఉపమ.

ఉ. బాలకుఁడై క్షణంబు యువభావయుతుండయి కొంతకాలము
ద్వేలదరిద్రుఁడై క్షణము విత్తసమన్వితుఁడై క్షణంబు జీ
ర్ణాలసగాత్రుఁడై నటునియట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయనామమైన తెరయందుఁ జొరంబడు సత్వరంబుగన్.

తా. మనుష్యుఁడొకనర్తకునివలె నొకింతకాలము బిడ్డగాను, కొంతకాలము కామసుఖము లనుభవించు పడుచువాఁడుగాను, కొంతకాలము దరిద్రుఁడుగాను, మఱికొంతకాలము సంపద పెంపారినవాఁడుగాను, గనఁబడి ముదిమిచే నంగములబిగి సడలి యొడలెల్ల ముడుతలువడినవాఁడై యానర్తకుఁడాటతుదను దెరచొచ్చి మఱుఁగైనట్లు తానును సంసారముతుదను యమపురముసొచ్చి మాటుపడుచున్నాఁడు.

ఇది వైరాగ్యశతకమున కాలమహిమానువర్ణన మన్నది
పంచమదశకము.

---

భర్తృహరిసుభాషితము-యతినృపతిసంవాదవర్ణనము.

---

అవ. ఇం దెవఁడేనొకఁడొకానొకభాగ్యవశమునఁ గాలమిట్లు విషమమైనదని యెఱింగి విరక్తినొంది యతి యగునేని వాఁ డప్పుడు నిరపేక్షుఁడై జగజ్జాలమును గడ్డిపరకవలెఁ జూచుచు రాజు ననువర్తించుట రోసి యారాజుతో సంవాదముసేయ శక్తుండగును గాని మఱొక విధమున నట్లు శక్తుండు గానేరఁడు. కాఁబట్టి రాజునేని సరకుసేయ నంత నిరంకుశత్వముగల యతిభావ మవశ్యముం బడవలయు నని వివేకి జనులకుం దెలుపుటకై యతిసంవాదప్రకారముం జెప్పుచున్నాఁడు.

శ్లో॥ త్వం రాజా వయ మప్యుపాసితగురుప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాత స్త్వం విభవై ర్యశాంసి కవయో దిక్షు ప్రతన్వన్తి నః।
ఇత్థం మానధనాతిదూర ముభయో రప్యావయో రన్తరం
య ద్యస్మాసు పరాఙ్ముఖోఽసి వయమప్యేకాన్తతో నిఃస్పృహాః॥

టీ. త్వం=నీవు, రాజా=రాజవు, వయమపి= మేమును, ఉపా...న్నతాః-ఉపాసిత=సేవింపఁబడిన, గురు=గురువుచేలభించిన, ప్రజ్ఞా=కార్యాకార్యవివేకము గల బుద్ధియొక్క-లేక, త్రికాలగోచరబుద్ధివిశేషముయొక్క, అభిమాన=గర్వముచేత -అతిశయముచేతననుట, ఉన్నతాః=హెచ్చైనవారము, త్వం=నీవు, విభవైః=ఐశ్వర్యములచేత, ఖ్యాతః=ప్రసిద్ధుఁడైనవాఁడవు. నః=మాయొక్క, యశాంసి=కీర్తులను, కవయః=విద్వాంసులు.

దిశు=దిక్కులయందు, ప్రతన్వన్తి=మిక్కిలి విస్తరింపఁజేయుదురు-కాఁబట్టి మేమును ప్రసిద్ధుల మైనవారమే యనుట. ఇత్థం=ఈప్రకారమున, మానద=శత్రువులమానము ఖండించువాఁడా, ఆవయోః ఉభయోరపి=మనయిరువురకును, అన్తరం=తారతమ్య ము, న అతిదూరం=మిక్కిలి దవ్వైనదికాదు-మిక్కిలి యెచ్చైనదికాదనుట, ('మాన ధనాతిదూరమ్' అనుచో, మానధన=మానముచేతను ధనముచేతను, అతిదూరం= మిక్కిలిదవ్వయినది-అనఁగా మేము ప్రజ్ఞాభిమానము గలవారము నీవు ధనము గల వాఁడవు కాఁబట్టి మనయిరువురకుఁదారతమ్యము మిక్కిలియుఁగలదని యర్థము),అ స్మాసు=మాయందు, పరాఙ్ముఖః=ఆదరములేనివాఁడవు, అసియది=అగుదువేని, వయ మపి=మేముకూడ, ఏకాన్తతః=అత్యంతము, నిఃస్పృహాః=స్పృహలేనివారము-నీయె డ నాదరములేనివారము-లేక ఐహికవిషయములందు రక్తిలేనివారము. అనఁగా మాకు నైహికవిషయములం దావంతయు స్పృహలేదుగాన నీయనాదరమువలన మా కిసు మంతయు బాధ లేదని భావము.

ఉ. రాజవు నీవు మేము గురుసేవ్రాట్కలితప్రతిభాభిమానవి
భ్రాజితమహోన్నతాత్ములము సంభవ్యధనప్రథితుండ వీవు స
దాజి నుతించు మాయశము దవ్వుసుమీ మనవాసి మమ్ము ని
ర్వ్యాజతఁ జూడవేని యనురాగము మాకును లేదు నీయెడన్.

తా. నీవు రాజవు. మేమును గురుసేవచేఁ బడసిన ప్రజ్ఞావిభవముచే నతిశయిం చినవారము. నీ వైశ్వర్యములచేఁ బ్రసిద్ధుండవు. మాకీర్తులను గవులచే నలుగడల వ్యా పితమై యున్నవిగాన మేమును బ్రసిద్ధులమే. కాఁబట్టి నీకును మాకును దారతమ్య ము విశేషముగాలేదు. నీవేయెక్కుడనితలఁచుకొని మాయెడ ననాదరముచూపుదువేని నీయందును మాకుఁగూడ నాదర మిసుమంతయులేదు. మే మైహికవిషయము లన్నిటి యందు రక్తియే లేనివారము గాన నీయనాదరమువలన మా కేమి నష్టియుఁ గలుగదు సుమీ.

అవ. చెప్పినవిషయమునే మఱొకరీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అర్థానా మీశిషే. త్వం వయమపిచ గిరా మీశ్మహే యావదర్థం
శూర స్త్వం వాదిదర్పవ్యుపశమనవిధా వక్షయం పాటవం నః।
సేవన్తే త్వాం ధనాఢ్యా మతిమలహతయే మామపి శ్రోతుకామా
మయ్యప్యాస్థా న తేచే త్త్వయి మమసుతరా మేష రాజన్గతోఽస్మి॥

టీ. త్వం=నీవు, అర్థానాం=ధనములకు, ఈశిషే=ఈశ్వరుఁడగుదువు, వయమ పిచ=మేమును, యావదర్థం=అర్థమువఱకు-అర్థమెంతో యంతవఱకుననుట, గిరాం= శాస్త్రవచనములకు, ఈశ్మహే=ఈశ్వరు లగుదుము-సమస్తశాస్త్రార్థవైభవములను దెలియుదుమనుట, త్వం=నీవు, శూరః=శూరుఁడవు-శత్రువుల నడంచుటయందనుట.

నః=మాకును, వాది...విధౌ-వాది=ప్రతివాదులయొక్క, దర్ప=గర్వముయొక్క, వ్యపశమనవిధౌ=అడంచువిధానమందు, అక్షయం=నశింపని, పాటవం=శక్తి, ఉన్నదనిశేషము. త్వాం=నిన్ను, ధనాఢ్యాః=ధనాధిపతులు, సేవన్తే=కొలుచుచున్నారు. మామపి=నన్నును-మమ్ముననుట. మతిమలహతయే=బుద్ధిజాడ్యముయొక్క నివృత్తికొఅకు, 'యస్తుపర్యటతేదేశాన్ యస్తుసేవేతపణ్డితాన్। తస్య విస్తారితాబుద్ధి స్తైలబిన్దురివామ్భసి' అనువచనమునంబట్టి బుద్ధిశుద్ధిమూలముగా జ్ఞానముం బ్రాపించుట కనుట, శ్రోతుకామాః=విననిచ్ఛగించువారు-శుశ్రూషువు లనుట, 'గురుముఖాచ్ఛ్రోతవ్యమ్' అన్నట్లు మాముఖమువలన శాస్త్రశ్రవణము నభిలషించువారు, కొలుతురు. కాఁబట్టి, హేరాజన్=ఓరాజా, తే=నీకు, మయి=నాయందు, ఆస్థానచేత్=ఆస్థ లేనియెడల, మమ=నాకు,త్వయిఅపి=నీయందును, సుతరాం=మిక్కిలియు,(న=కలుగదనుట-నీయందును నాకును ఆదరముకలుగదనుట,) అయితే, ఏషః=ఈనేను, గతఃఅస్మి =మఱొకచోటికిఁ బోవుచున్నాను, తాను నిరంకుశుఁ డగుటం దెలుపుటకై 'ఏష' యన్నాఁడు.

చ. ధనపతి వీవు మేము వివిధశ్రుతిపుంజపదార్థతత్త్వశా
సనులము నీవు శూరుఁడవు ప్రచండతరప్రతివాదిగర్వభం
జనులము మేము నిన్ను ధనశాలురు మమ్ము భజింతు రాశ్రితుల్
వినయము సేయవేని పృథివీవర సాఁగెద మీఁకుణంబునన్. 52

తా. రాజా! నీవు ధనములకు నధిపతివి. మేము శాస్త్రవచనములకు వానియశేషవిశేషార్థములతోఁగూడ నధికారులము. పగతుర నడఁచుటయందు నీవు శూరుండవు. ప్రతివాదులగర్వ మడంచుటయందు మేమును జెడనిపటిమ గలవారము. నిన్ను ధనము గోరువారు గొలుతురు. మమ్ము మనఃకలుషములు నశించుటకు శాస్త్రముల వినఁగోరువారు సేవింతురు. కాఁబట్టి మనమిరువురము సమానులమే. నాయందు నీకాదరము లేదేని నేను నిరపేక్షుఁడ నగుటచే నీయందు మిక్కిలియు నా కాదరము గలుగదు. కాన యిదె నే నొండొకచోటికిఁ బోయెద.

అవ. 'మఱొకచోటికిఁ బోయెద' మనుట యెట్లని యడుగఁగా మేము నిత్యసంతుష్టాంతరంగుల మగుటచే నెచటికిఁ బోయినను గష్ట మేమియు నుండ దనుచున్నాఁడు.

శ్లో॥ వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలైః
సమ ఇహ పరితోషో నిర్విశేషో విశేషః।
స తు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః॥ 53

టీ. ఓరాజా! వయం=మేము, ఇహ=ఇందు-లేక, యిపుడు, వల్కలైః=నారలచేత, పరితుష్టాః=తృప్తినొందినవారము, త్వం=నీవు, దుకూలైః=పట్టుపుట్టములచే, (పరితుష్టః=తృప్తినొందినవాఁడవు అని విపరిణామము.) ఇహ=ఇందు, పరితోషః=సంతోషము, సమః=నీకును మాకును సమానమే. విశేషః=విశేషము-నీకును మాకును భేదమనుట, నిర్విశేషః=విశేషములేనిది-భేదరహితమైనదనుట-మనమిద్దఱిసంతోషములకుఁ దారతమ్య మేమియు లేదనుట, కింతు=అయితే, యస్య=ఎవనికి, తృష్ణా=ధనాశ, విశాలా=విరివియైనదో, సః=వాఁడు, దరిద్రః=పేద, భవతు=అగుఁగాక-మఱొకఁడు దరిద్రుఁడు గాఁ డనుట, ఎట్లనఁగా, మనసి=మనస్సు, పరితుష్టేసతి=తృప్తిఁబొందిన దగుచుండఁగా, కః=ఏవఁడు, అర్థవాన్=ధనవంతుఁడు, కః=ఎవఁడు, దరిద్రః=పేదవాఁడు-ఎవఁడును గాఁడనుట, మనస్సు తృప్తినొందియుండఁగా లాభాలాభములు రెండును సమానములే యగుటంజేసి యట్టిమనస్సుగలవాఁడు ధనికుఁడును గాఁడు దరిద్రుఁడునుగాఁ డనిభావము. మేము నట్టివారమే కాన మఱెచటికిఁ బోయినను మాకును గష్టము లేదని భావము.

చ. కలితదుకూలవస్త్రములు కై గట్టిననీకును జీర్ణవల్కలం
బులు ధరియించుమాకును బ్రకామోదము తుల్యము లేదు వావి య
గ్గల మగుతృష్ణ యెవ్వనికి కై గాఢదరిద్రుఁడు వాఁడు లేమియుం
గలిమియు నేల సమ్మదవివేకస్వరమానసులైనవారికిన్. 53

తా. రాజా! మాకు నారలచేత నే తృప్తి. నీకుఁ బట్టుపుట్టములచేఁదృప్తి. కాన మనయిరువురసంతోషములును సమానములుగానే యున్నది గాని వానియం దేతారతమ్యమును గానము. ఎవనికి ద్రవ్యమందుఁ బేరాసయో వాఁడు దరిద్రుఁడు గాని, మనస్సు తృప్తినొందియుండువానికి ద్రవ్యమును లేదు దారిద్ర్యమును లేదు.

అవ. అయినను శరీరయాత్ర దుర్జనులను గొలువకయే మఱొకవిధమున జరుపఁగూడును గాన నాదుర్జనులు మాయెడల వినయము లేక నడచుకొన్నయెడల దానిని మేము సైఁపఁజాల మనుచున్నాఁడు.

శ్లో॥ ఫల మల మశనాయ స్వాదు పానాయ తోయం
క్షితి రపి శయనార్థం వాససే వల్కలం చ।
నవధనమధుపానభ్రాన్తసర్వేన్ద్రియాణా
మవినయ మనుమన్తుం నోత్సహే దుర్జనానామ్॥ 54

టీ. ఫలం=పండు, అశనాయ=(శరీరధారణమున కైన) భోజనముకొఱకు, అలం=చాలును. స్వాదు=తియ్యని, తోయం=నీరు, పానాయ=(దప్పి నడంచుటకై) త్రాగుటకు, చాలును. క్షితిరపి=భూమియు, శయనార్థం=పరుండుటకు, చాలును.

వల్కలంచ=నారయు, వాససే=(కప్పుకొనుటకై) పుట్టముకొఱకు, చాలును.('శయన మవనిపృష్ఠం వల్కలేవాససీచ' అనుచో, అవనిపృష్ఠం=భూతలము, శయనం=పడుక, వల్కలే=రెండునారలు, వాససీచ=రెండువస్త్రములు-పడుకకు రిత్తనేలయుఁ గట్టుకొనుటకు రెండునారపట్టలును జాలు నని యర్థము.) కాఁబట్టి, నవ...యాణాం-నవ=క్రొత్తగాఁ గలిగిన, ధన=ద్రవ్య మనెడి, మధుపాన=మద్యముఁ ద్రాగుట చేత, భ్రాన్త=దారితప్పిన-తడఁబాటునొందిన, సర్వే=సమస్తమైన, ఇన్ద్రియాణాం=ఇంద్రియములు గలవారికి-మద్యము త్రాగుటచే నెట్లో నడిమంతరమున వచ్చినధనము చేతను అట్లే యింద్రియములు తడఁబడునుగనుక నవధనము మద్యపానములోఁ బోల్పఁబడినది, ఇట్టివారైన, దుర్జనానాం=దుష్టులయొక్క, అవినయం=అడఁకువలేమిని-ఉద్ధతినసుట, అనుమన్తుం=అంగీకరించుటకు, న ఉత్సహే=ఉత్సహింపను-పూననసుట. బ్రదుకుటకు గత్యంతరముండఁగా వారియుద్ధతిని సైఁచుకొనవలసినదేలయని భావము.

చ. ఫలములు చాలు జీవికకుఁ గ్రౌనముసేయ జలంబు చాలు వ
ల్కలములు చాలుఁ గట్టుట కిల్లాతలముల్ శయనింపఁ జాలు ని
ష్ఫలనవవిత్తశీధురసపానవిజృంభితమోహలీనచి
త్తు లగునికృష్టభూపతులదుర్ణయ మించుకయుం సహింతునే. 54

తా. దేహధారణమునకై భుజించుటకుఁ బండ్లు చాలును. దప్పితీఱఁ ద్రావుటకుఁ దియ్యనినీరుచాలును. పరుండుటకు వట్టినేల చాలును. కట్టుకొనుటకు నారలు చాలును. ఇట్లు దుర్జనులను గొలువకయే దేహయాత్ర జరుపుటకు నయిలికలిగియుండఁగా నడిమంతరపుసిరిచేఁ గన్నుఁగానక కల్లుద్రాగినవానివలె నింద్రియములెల్లఁ దడఁబడుచుండుదుర్జను లుద్ధతిం జూపిరేని దాని నెట్లును సైఁపఁజాలను.

అవ. ఈయర్థమునే వేఱొకవిధమునఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ *అశ్నీమహి వయం భిక్షా, మాశావాసో వసీమహి
శయీమహి మహీపృష్ఠే, కుర్వీమహి కి మీశ్వరైః॥ 55

టీ. వయం=మేము, భిక్షాం=భిక్షాన్నమును, అశ్నీమహి=భుజింతుము. ఆశావాసః=దిక్కులనెడిపుట్టమును, వసీమహి=కట్టుకొందుము-దిగంబరుల మగుదుమనుట,

* ఇందుఁ బ్రతిపాదింపఁబడినస్థితియే బ్రహ్మనిష్ఠుని లక్షణము. ఇదియే 'యేన కేన చిదాచ్ఛన్నో యేనకేనచిదాశితః।యత్రక్వచన శాయీ స్యాత్తందేవా బ్రాహ్మణం విదుః' అని మహాభారతోద్యోగపర్వమునను, 'సంవీతో యేనకేనాశ్న న్భక్ష్యం వాభక్ష్యమేవవా। శయానో యత్ర కుత్రాపి సర్వాత్మా ముచ్యతేఽత్ర సః', అని శివగీతయందును జెప్పఁబడియున్నది.

మహీపృష్ఠే=భూతలమున-వట్టి నేలమీఁద ననుట, శయీమహి=పరుండుదుము. కాఁబట్టి, ఈశ్వరైః=అధిపతులతో-రాజులతో, కిం=ఏమి, కుర్వీమహి=చేయఁగలము-వారి వలన మా కేమి యుఁ బ్రయోజనము లే దని భావము.

తే. చేరి భిక్షాన్న మారగించెదము మేము
కట్టెదము దిక్కు లనియెడి కలితశాటిఁ
బవ్వళించెద మిల యను పాన్పుమీఁద
నేమి కార్యము మాకు నరేంద్రులందు. 55

తా. బిచ్చమెత్తి పొట్టఁ బోచికొందుము. దిక్కులనే వలువగాఁ గట్టుకొందుము. వట్టి నేలమీఁదఁ బరుందుము. ఇట్టిమాకు రాజులతోఁ బనేమియు లేదు.

అవ. తాము రాజును దర్శించుటకుఁ దగువారము కామని తెలుపుమిషచే నాతని నిందించుచున్నాఁడు.

శ్లో॥ న నటా న విటా న గాయకా, న చ సభ్యేతరవాదచుఞ్చవః।
నృప మీక్షితుమత్ర కే వయం, స్తనభారానమితా న యోషితః॥

టీ. వయం=మేము, నటాః=నటులము, న=కాము - వివిధవేషములు ధరించి విచిత్రనాట్యములచే నయనానందము గూర్చువారము గామనుట, విటాః=విటులము-ముఖస్తుతులు సేయువారము-లేక, నాయకునకు నాయిక ననుకూలింపఁజేయు*ఏకవిద్యులగు విటులమనియు నర్థము, న=కాము, గాయకాః=పాడువారము-సంగీతకుశలులమై కర్ణానందము సేయువారమనుట, న=కాము, సభ్యే...చుఞ్చవః-సభ్య ఇతర=సజ్జనుల కంటె నితరులైనవారియొక్క - ఏవగింపుమాట లాడువారే కాని శాస్త్రసంవాదులు కానివారనుట, ఇట్టివారియొక్క, వాద=వాక్యములచేత, చుఞ్చవః=సమర్థులమైన వారము-మనస్సునకు వినోదము కలిగించు హాస్యకారుల మనుట, న=కాము. ('నపర ద్రోహానిబద్ధబుద్ధయః' అనుచో ఇతరులకు ద్రోహము సేయుటయందు మిక్కిలి కట్టఁబడినబుద్ధులు గలవారు, న=కాము. అనియర్థము), స్తనభార ఆనమితాః=చన్నులబరువుచేఁ గొంత వంగిన, యోషితః=స్త్రీలును, న=కాము. సంరంభసంభోగమునకుఁ దమికొల్పువారమును గామనుట, కాఁబట్టి, నృపం=రాజును, ఈక్షితుం=చూచుటకు

---

* నాయకులకు నాయిక లనుకూలించుటయందు సహాయులగువారు పీఠమర్దన, విట, చేట, విదూషకు లని నలుగురు. అందు, 'కిఞ్చిదూనః పీఠమర్దః ఏకవిద్యో విటః స్మృతః। సన్ధానకుశల శ్చేటో హాస్యప్రాయో విదూషకః' ప్రధాననాయకునికి గుణములందుఁ గొంతతక్కువయుయినవాఁడు పీఠమర్దుఁడు. నాయకున కుపయుక్తములగు నృత్తగీతాదివిద్యలయం దొకవిద్యమాత్ర మెఱింగినవాఁడు ఏకవిద్యుఁ డనంబడు విటుఁడు. తక్కినవారిలక్షణములు సుగమములు.

దర్శనము సేయుటకనుట, అత్ర=ఇందు - ఈ చెప్పఁబడిన నటవిటాదులందు, వయం= మేము, కే=ఎవ్వరము-వారిలో నెవ్వరును గామనుట. వారిలో నొకరుగా నుండు మేని రాజదర్శనమునకు యోగ్యుల మగుదు మని భావము. రాజు అసభ్యులకే యవకాశ మొసంగునుగాని సభ్యులకు నొసంగఁడని తన్నింద సూచితమగుచున్నది. ('నృపసద్మని నామకే వయమ్' అనుచో నృపసద్మని=రాజునింట, వయం=మేము, కేనామ=ఎవ రుదా నగుదుము - ఎవ్వరును గామనుట, ఎందులకును గొఱగా మని భావము).

క. విట గాయక వైతండిక
నటజనులము గాము పృథుఘనస్తనసమితో
త్కటవారకాంతలము గా
మటుగావున నృపునిఁ జూడ నగునే మాకున్. 56

తా. రాజుదర్శనముం బడయుటకుఁ, గంటికింపుగా వేసములు వైచి వింత లుగా నాడు నటులైనను, నాయిక ననుకూలించుటయందు సాయపడు విటులైనను, జెవికింపుగాఁ బాడుగాయకులైనను, ముఖస్తుతులు మదికింపుగాఁ బ్రేలుచుండువారైన ను, రతిసుఖ మొసంగు బలితంపుగబ్బిగుబ్బలాండ్రయినను గావలయు. వీరియందు మే మెవ్వరమును గాము. కాన రాజును దర్శింప మేము దగువారము కాము.

అవ. రాజనిందయే నాలుగుశ్లోకముల విస్తరించుచున్నాఁడు.

శ్లో॥ విపులహృదయై ర్ధన్యైః కైశ్చి జ్జగ జ్జనితం పురా।
విధృత మపరై ర్దత్తం చాన్యై ర్విజిత్య తృణం యథా।
ఇహ హి భువనాన్యన్యే ధీరా శ్చతుర్దశ భుఞ్జతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః॥ 57

టీ. విపులహృదయైః=ఉదారములైనమనసులు గలవారగు, కైశ్చిత్ ధన్యైః =కొందఱు ధన్యులచేత-ధన్యాత్ములగు ప్రజాపతులచేత ననుట, పురా=ముందు-సృష్టి కాలమందనుట, జగత్=జగము, జనితం=పుట్టింపఁబడినది. అపరైః=మఱికొందఱి చేత-పాలకులైన విష్ణువు మొదలైనవారిచేత, విధృతం=పాలింపఁబడినది, అన్యైః= మఱియితరులచేత-పరశురామాదులచేతననుట, విజిత్య=జయింపఁబడి, తృణంయథా= గడ్డివలె, దత్తం=(బ్రాహ్మణులకు) ఒసంగఁబడినది. ఇహహి=ఇందే-ఈలోకమందే యనుట, అన్యేధీరాః=ధీరులైన మఱికొందఱు-బలిప్రముఖులనుట, చతుర్దశ భువనాని =పదునాలుగు జగములను, భుఞ్జతే=అనుభవించుచున్నారు-ఇప్పుడు ననుట, కతిప యపురస్వామ్యే=కొన్నిపట్టణములయొక్క యధిపతిగా నుండుటయందు-కొన్నిపట్ట ణము లేలఁ గలుగఁగానే యనుట, పుంసాం=మనుష్యులకు, ఏషః=ఈకనఁబడుచున్న, మదజ్వరః=మద మనెడి జ్వరము-దర్పాతిశయ మనుట-మదము బుద్ధిభ్రంశము కలిగిం

చుటచే జ్వరముగా రూపింపఁబడినది, కః=ఏమి, ఎందుల కనుట, వారల కీ పెనుగ ర్వమువలనఁ బ్రయోజనము లేదని భావము.

ఉ. అంచితబుద్ధు లైనమనుకజాధిపతుల్ జగ మెల్లఁ దొల్లి ని
ర్మించిరి దానిఁ గొందఱు భరించిరి యిచ్చిరి గొంద ఱర్థికి
న్మించి జగంబు లన్నియును నెమ్మి భుజించుచుఁ గొంద ఱుండఁగాఁ
బంచపపట్టణేశుల కహంకారమదజ్వర మింత యేటికిన్. 57

తా. ఈ జగత్తు మొదట నుదారమనస్కులగు కొందఱు ధన్యులచే సృజింపఁ బడినది. పిదప మఱికొందఱిచే నిది పాలింపఁబడినది. అవ్వల మఱికొందఱు దీనిని జయించి గడ్డిపరకవలె దానము సేసిరి. ఇప్పుడును మఱికొందఱు ధీరులు పదునాలు గులోకములను బాలించుచున్నారు. మహాత్ము లిట్లుండగా నేవో నాలుగయిదుపట్ట ణము లేలునంతపదవి కలిగెనా మనుజులు మదాంధు లయి కన్నుఁ గానకుందురు.

శ్లో॥ అభుక్తాయాం యస్యాం క్షణమసి న యాతం నృపశతై
ర్భువ స్తస్యా లాభే క ఇవ బహుమానః క్షితిభృతామ్।
తదంశస్యా ప్యంశే తదవయవలేశేఽపి పతయో
విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదమ్॥ 58

టీ. నృపశతైః=వందలకొలఁదిరాజులచేత, యస్యాం=ఏది-ఏభూమి యనుట, అభుక్తాయాం సత్యాం=అనుభవింపఁబడని దగుచుండఁగా, క్షణమపి=క్షణమంతకాల ముకూడ, యాతంన-జరుపఁబడదో-ఏది క్షణకాలమైనను రాజులనేకులచే నేలఁబడ కుండినది కాదో యనుట-దేనిని ప్రతిక్షణమును రాజులు పెక్కండ్రు నేలుచునే యుందురో యనిభావము, తస్యాఃభువః=ఆభూమియొక్క, లాభే=ప్రాప్తియందు-క్షణమునేపుకూడ నవకాశములేక పెక్కండ్రురాజులచే ననుభవింపఁబడుచునే యుం డునట్టిభూమిని బడయుటవలన ననుట, క్షితిభృతాం=రాజులకు,బహుమానః=ఉత్క ర్షము-పేర్మి, కఇవ=ఏమిదా-ఏమియు లేదనుట-అందఱికి నిది సాధారణమైయుండుట చే నేరాజునకును దీనివలన నొకయతిశయము కలుగదనిభావము. అయితే,తదంశస్య= ఆభూమిలోని భాగముయొక్క, అంశేఽపి=భాగమునందును, తదవయవలేశేఽపి-తత్=ఆభాగముయొక్క, అవయవ=ఒకకొంతభాగముయొక్క, లేశేఽపి=ఒక్కింత యందును-రవ్వంతమాత్ర మైనయొకమూలయందు ననుట, పతయః= అధిపతులు-రా జులు, విషాదే=దుఃఖము, కర్తవ్యేసతి=చేయఁదగినదై యుండఁగా-మిక్కిలియుం గొంచెమైన భూభాగమునకే మన మధిపతులైతిమిగదాయని దుఃఖపడవలసియుండఁ గా ననుట, జడాః సన్తః=మందులై-బుద్ధిహీనులై యనుట, ప్రత్యుత=విపరీతముగా-విషాదముపడుటకు మాఱుగా ననుట, ముదం=సంతోషమును, విదధతి=చేయుదురు.

భూమియో పెక్కండ్రచే నెడతెగక భుజింపఁబడుచుండునది. అదియును బూర్ణము గాఁగాక అందు నేదోయొకపాలులోఁ బాలుగాని, ఆపాలులోనొక పాలైనచోటిలో నేదోయొకమూలగాని తమ కేలుటకుఁ గలిగినా యిసీ! పెక్కండ్రచే భుజింపఁబడిన దానిలోని పాలిలోను మిక్కిలి యల్పపాలికే మనసు పతులమైతిమే యని దుఃఖింపక మనము రాజులమని యుబ్బుచున్నారు. వీరియవివేక మే మనవచ్చునని యాశయము. 'ప్రత్యుతేత్యుక్తే వైపరీత్యే' అని గణవ్యాఖ్యానము.

చ. ఎడ నిమిషంబు లేక ధరణీశశతంబు భుజించు చున్నయి
ప్పుడమి లభించినన్ మహిమఁ బొందునె రాజుల నేల తున్కలో
నడరు లవంబులోఁ దునియయం దొకమూలకు నాథు లైనవా
రడలక వైపరీత్యమునఁ హర్షముఁ జెందుదు రెంత మందులో. 58

తా. భూమండలమంతయుఁ బ్రతిక్షణమును పెక్కండ్రు రాజులచే నేలంబడుచునేయుండునది కాని వారు దాని నేలనిక్షణ మొకటియుఁలేదు. కాఁబట్టి యిట్టి భూమియంతయుఁ గలినను రాజులకేయతిశయమును గలుగదు. ఇట్టిభూమిలోనిభాగములో నొక పాలుగాని, యాపాలిలోని యొకపాలునం దొకానొకమూలగాని యేలఁ గలిగినంతనే మూఢులు కొంచె మంతయల్పమునకుఁ దాము పతులైనందులకు వగచుటకు మాఱుగా మిక్కిలి యుబ్బునొందెదరు. ఏమి వీరియవివేకము!

అవ. క్షుద్రులగు రాజులనార్తయటుండఁగా వారిని యాచించి బ్రతుకువారు వారికంటెఁ బరమక్షుద్రులని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మృత్పిణ్డో జలరేఖయా వలయితః సర్వోఽప్యయం న న్వణుః
స్వాంశీకృత్య స ఏవ సంయుగశతై రాజ్ఞాం గణై ర్భుజ్యతే।
నో దద్యు ర్దదతేఽథవా కిమపి తే క్షుద్రా దరిద్రా భృశం
ధిగ్ధిక్తాన్ పురుషాధమాన్ ధనకణం వాఞ్ఛన్తి తేభ్యోఽపి యే॥59

టీ. జలరేఖయా=సముద్రాకారముగానుండు నీటిరేకచే, వలయితః=చుట్టఁబడిన-ముద్దగాఁ గూర్పఁబడిన యని యర్థాంతరము, అయం=ఈ, సర్వోఽపి=సమస్తమునైన, మృత్పిణ్డః=భూమియనెడి మట్టిముద్ద-నీటిచేఁ గూర్పఁబడిన మట్టిముద్దయుం బోలె సముద్రజలముచేఁ గూర్పఁబడిన మట్టిముద్దయగు నీపుడమి యని చమత్కారము ధ్వనించెడి, భూమిని మృత్పిండ మనుట అతిశయము కామిని చూపుటకొఱకు; జలరేఖచే వలయితమనుట కొలఁది యిడరానిది కాక యొకకొలఁదికి లోనైనదని తెలుపుటకొఱకు నని తెలియునది. ఇట్టి భూమి, అణుఃనను=అణువేకదా-మిక్కిలియు స్వల్పమేయగుననుట, సఏవ =అదియే - అట్టి యతిస్వల్పమైన మృత్పిండమాత్రమేయనుట, రాజ్ఞాంగణైః=రాజులసమూహముచేత,సంయుగశతైః=హింసాప్రచురములైనవందల

కొలఁదియుద్ధములచేత, స్వాంశీకృత్య = తమతమ భాగములుగాఁ జేయఁబడి-తమతమ సొంతభాగములుగా భాగించుకొని యనుట, భుజ్యతే = అనుభవింపఁబడుచున్నది. ('స్వాంశీకృత్య తమేవ సఙ్గరశతై రాజ్ఞాం గణా భుఞ్జతే' అనుచో రాజులసమూహములు వందలకొలఁదియుద్ధములచే దానినే తమతమవిగాఁ జేసికొని యనుభవించునని యర్థము). తే=వారు-భూమి నంతయుఁగాక నందులో నొకానొకపాలును బొందుటకై యనేకప్రాణులను జంపునట్టి యారాజులు, కిమపి=కొంచెమైనను, నోదద్యుః =(ఇఁక) ఇయ్యరు. అథవా=లేక, నోదదతే=ఇప్పుడిచ్చుచున్నవారునుగారు. కాఁబట్టి, భృశం=మిక్కిలి, క్షుద్రాః=నీచులును, దరిద్రాః=పేదలును, అగుదురు, అనేక యుద్ధములంబడి యార్జించినమృత్పిండమును ననుభవించువా రగుటచే క్షుద్రులును, దానియందుఁగూడ నంశములే గలవారుగాన దరిద్రులునని భావము. కావుననే యొకరికిప్పుడును బెట్టరు, మఱెప్పుడును బెట్టఁబోరు అని యర్థము. తేభ్యోఽపి=ఇట్టివారి వలనఁగూడ, యే=ఎవరు, ధనకణం=ద్రవ్యలేశమును-అధికముగా నొసంగుదాతృత్వము లేమిచే అత్యల్పధనము ననుట, వాఞ్ఛన్తి=కోరుదురో, తాన్ పురుషాధమాన్=ఆ నికృష్టమనుష్యులను-అట్టివారింగూర్చి యనుట, ధిక్ ధిక్ = ఛీఛీ-మోఁచేతిక్రిందినీటిని ద్రాగునట్లు అతినీచమైనయిట్టియాచన సేయువా రారాజులకంటెఁ బరమనీచులుగాన ఇమ్మడిగా వారు నింద్యులని భావము. తమతమ కాలినపొట్ట ప్రోచికొనుటయే ప్రయోజనముగాఁ జేసి పురుషాధములను గావించుక్షుద్రయాచ్ఞను మూలఁబుచ్చి స్వాతస్సిద్ధానందముచే నేకలంకలేనినెమ్మది నొందించి పురుషోత్తములను గావించుయతిత్వమే బ్రతుకుఁదెరువుగాఁ గయికొనవలయు నని భావము.

చ. తగ జలరేఖచే వలయితం బగుకొంచెపుమంటిముద్దకై
  జగడము లాడి యాడి పెలుచన్ విభజించి భుజించుచున్నమ
  ర్భగనృపు లిచ్చువారె తలఁపం గడు నీచులు వారియందు నొ
  ప్పగ ధనలేశకాంక్ష గలపూరుషులుం గడుహీనులే కదా. 59

తా. ఈపుడమి వట్టిపెనుమట్టిముద్దయేకాని వేఱుకాదు. అదియును గొలఁది లేనిదికాక నలుగడల సముద్రజలములచేఁ జుట్టఁబడి కొలఁదికి లోనై యున్నది. అది యంతయును మొత్తమునకు మిక్కిలియు స్వల్పమైనదే. ఏలనఁ బెక్కురాజులు లెక్కలేనియుద్ధము లాడి దానిని దమతమవిగా రచించుకొని యనుభవించుచున్నారు. వారట్లామట్టిపెళ్లకై యటు పోట్లాడినవారుగాన క్షుద్రులును, అదియును బూర్ణముగాఁ గాక యందొక్కొక్కపాలే గలవారుగాన దరిద్రులు నగుదురు. కాన వా రొకరి కిప్పుడును బెట్టరు; ఇఁకఁ బెట్టువారును గారు. అట్టివారిని బోయి యాచించుహీనులు వారికంటె నీచులుగాన మఱిమఱి నిందింపఁదగినవారే యగుదురు.

అవ. వేయేల, వానిజన్మమే సార్థక మనుచు నిగమించుచున్నాఁడు.

శ్లో. స జాతః కోఽప్యాసీ న్మదనరిపుణా మూర్ధ్ని ధవళం
కపాలం యస్యోచ్చై ర్వినిహిత మలఙ్కారవిధయే।
నృభిః ప్రాణత్రాణప్రవణమతిభిః కైశ్చి దధునా
నమద్భిః కః పుంసా మయ మతులదర్పజ్వరభరః॥ 60

టీ. యస్య=ఎవనియొక్క, ధవళం=తెల్లనైన, కపాలం=తలపునుక, మదన రిపుణా=మన్మథునికి శత్రువైనశివునిచేత, ఉచ్చైః=పొడవుగా-అన్నిటికంటె నతిశ యించినదిగా, మూర్ధ్ని=శిరస్సునందు, అలఙ్కారవిధయే=భూషణముగా విధించుట కొఱకు-సొమ్ముగాననుట, వినిహితం=పెట్టుకొనఁబడినదో-శివుఁడు కపాలశేఖరుఁడు గావునను యుద్ధమున హతులైనవారికపాలముల నతఁడు సొమ్ములుగాఁ దాల్చుటం జేసియు నట్లెవనిపునుక నాదేవుండు సొమ్ముగాఁ దలయందుఁదాల్చునోయనియర్థము, *సః=ఆ, కోఽపి=ఒకానొకఁడే, జాతః ఆసీత్=జన్మించినవాఁ డయ్యెను-సఫలమైన జన్మముగలవాఁ డయ్యెను-తక్కినవారిజన్మములు సఫలములైనవి గావని యర్థము. అయితే, అధునా=ఇప్పుడు, ప్రాణ...మతిభిః-ప్రాణత్రాణ=తుచ్ఛములైన ప్రాణములను రక్షించుకొనుటయందు, ప్రవణ=ఆసక్తమైన, మతిభిః=మనస్సులు గలవారును, కావుననే, నమద్భిః=నమస్కరించువారును, అగు, కైశ్చిత్=కొందఱు, నృభిః=మనుష్యులచేత-కొందఱుమనుజులు బ్రతుకుకొఱకుఁ దమకు మ్రొక్కునట్టికారణముచేత ననుట, ఇచట హేతువునందుఁ దృతీయ, పుంసాం=మనుష్యులకు, అయం=ఈ, అతుల...భరః-అతుల=ఎనలేని, దర్ప=గర్వమనెడి, జ్వరభరః=జ్వరాతిశయము-మిక్కుటపు జ్వరమువలె తబ్బిబ్బుపఱుచుగర్వ మనుట, కః=ఏమి-ఎందులకనుట, మరణించినపిదపఁగూడ నెవనిశిరసు ఆదరపూర్వకముగా మిక్కిలి యుపాదేయ మగునో వానిజన్మమే సార్థకము. వాఁడే పురుషోత్తముఁడు. తక్కినవారెల్ల నిష్ఫలజన్ములును బురుషాధములు నగుదు రని భావము.

చ. అతఁడ సుజన్ముఁ డెవ్వనిసకర్మంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దలపై ధరియించె విభూషణంబుగా
క్షితిపయిఁ బ్రాణరక్షణము సేయుటకై తముఁ జేరి కొంద ఱా
నతు లయి రంచు దుర్మదఘనజ్వర మేటికి మానవాళికిన్. 60

---

* శివుఁడు యుద్ధహతులైనవారికపాలములు సొమ్ములుగాఁ దాల్చుటగలదు. అయిన నిచట నొకనికపాలమె తాల్చునట్లు చెప్పఁబడియున్నది. ఇందులకుఁ బ్రమాణము గానరాదు. మఱియుఁ గపాలములను సరులుగాఁ దాల్చుటే కాని తలయందుఁ దాల్చుట విచారణీయము.

తా. ఎవనితెల్లనితలపునుకను శివుండు సొమ్ముగాఁ దనతలయందుఁ దాల్చెనో యట్టివాఁ డొక్కఁడే సార్థకజన్ముఁ డయ్యెను గాని తక్కినవా రందఱును సార్థకజన్ములు గారు. ఇప్పుడో కొందఱుమనుష్యులు, పొట్టపోసికొనుటకై యెవరేని కొందఱు తమకు మ్రొక్కుదురేని, తామే సార్థకజన్ములుగాఁ దలఁచి కన్నుమిన్ను గానక గర్వింతురు. ఇది యెందులకో తెలియరాదు.

ఇది వైరాగ్యశతకమున యతినృపతిసంవాదవర్ణనమన్నది షష్ఠదశకము.

---

## భర్తృహరిసుభాషితము - మనస్సంబోధననియమనము.

---

అవ. మనస్సును నియమింపంజాలువాఁడే యతి యగుం గాన యతిని గుఱించినప్రసక్తి యైనపిదప మనోనియమనముఁ జెప్పం బూని మనస్సును సంబోధించుచు దాని నియమించుప్రకారముం జెప్పుచున్నాఁడు.

శ్లో. *పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదం కిం నేతుం విశసి హృదయ క్లేశకలిలమ్।
ప్రసన్నే త్వ య్యన్తః స్వయ ముదితచిన్తామణిగుణే
విముక్తః సఙ్కల్పః కి మభిలషితం పుష్యతి న తే॥ 61

టీ. హేహృదయ=ఓమనసా, ప్రతిదివసం = ప్రతిదినమును, బహుధా=అనేకవిధములచేత, పరేషాం=ఇతరులయొక్క, చేతాంసి=మనస్సులను, ఆరాధ్య=ఆరాధించి-తత్కాలమునకుఁ దగిన యనువర్తనములచే అభిముఖములుగాఁ జేసికొని, ప్రసాదం=తేటదనమును - సంతోషము ననుట, నేతుం=పొందించుటకు, క్లేశకలిలమ్=కష్ట

---

* ఈ శ్లోకమున నుత్తరార్థమునకు

'ప్రసన్నే త్వ య్యన్తః స్వయ ముదితచిన్తామణిగణో వివిక్తః సంకల్పః కిమభిలషితం పుష్యతి న తే॥' అని పాఠాంతరము. అప్పుడు, అన్తః=లోపల, ప్రసన్నే త్వయిసతి=నీవుప్రసన్నమైయుండఁగా, స్వయం=తనంత, ఉదితచిన్తామణిగణః=పుట్టిన చింతామణులసమూహమైనదియు-పెక్కుచింతామణులవలె సకలవాంఛితములనొడఁగూర్పఁజాలినదియు, వివిక్తః=నిర్మలమైనదియు, అగు, సఙ్కల్పః=ఇచ్ఛావిశేషము, నీకోరికను దేనిని బూరింపదని యర్థము. నీవు లోనఁ బ్రసన్నమైతివేని పెక్కుచింతామణులవంటిదైన నీవిమలసంకల్పము కోరినదానినెల్ల నొడఁగూర్చు నని తాత్పర్యము. ప్రసన్నమగుచిత్తమేది తనలో సంకల్పించిన నది సమకూఱు ననుట.

ములగజిబిజిని, కిం=ఏల, విశసి=చొచ్చుచున్నావు? ఒకరిమనస్సు నెట్లో ప్రసన్న ముకావించి కోరికలనొడగూర్చుకొందునందు వేని, అన్తః=లోపల,స్వయం=తనంతనే, ఉది...గుణే-ఉదిత=పుట్టిన, చిన్తామణిగుణే=చింతారత్నముయొక్క గుణములుగల-చింతామణివలె సకలార్థములనొనగూర్చునట్టిదై యనుట,త్వయి=నీవు, ప్రసన్నేసతి= ప్రసన్నమగుచుండఁగా-నీవు ప్రసన్నతనొంది దానివలనఁ జింతామణింబోలె కోరికల నెల్లనొడఁగూర్పఁజాలినదికాఁగా ననుట,విముక్తః సఙ్కల్పః=త్యజింపఁబడినకోరిక-కోరికలనెల్లపరిత్యజించుట యనుట, తే=నీయొక్క, అభిలషితం=కోరినదానిని,కిం= దేనిని, నపుష్యతి=పూరింపదు-నీవు కోరినవానినెల్ల నొడఁగూర్చుననుట-మనస్సు ప్రస న్నతనొందఁగా కోరుట కేదియుఁగలుగదుగాన కోరికలన్నియు వీడును,అట్లువీడియు కోరికలన్నియు నొడఁగూడుటవలన నెట్టితృప్తి కలుగునో యట్టితృప్తియే కలుగును కావున కోరికలన్నియు వీడుట (అనఁగా సంకల్పము విముక్త మగుట) కోరికలన్ని యు నొడఁగూడుటతో సాటియగును. కావుననే విముక్తమైన సంకల్పము ఏకోరి కను బూరింపదు అనఁబడియె. ఇదియె 'విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాం శ్చరతి నిస్స్పృహః। నిర్మమో నిరహఙ్కార స్సశాన్తి మధిగచ్ఛతి॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి' అని గీతయు; 'యదా సర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్య హృదిస్థితాః।అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే' అని కఠోపనిషత్తును ప్రతిపాదించెడి. లేక, సంకల్పమనుటకు 'మనః సమ్భోగేభ్యః స్పృహయతి న సఙ్కల్పవిరతమ్' చండకౌశికము; 'సఙ్కల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః' గీత-అనుచోఁ గలప్రయోగములంబట్టి మనోవ్యాపారము లని యర్థము. కావున మనస్సుయొక్క (విముక్తః సఙ్కల్పః) వ్యాపారము వీడినదై యది ప్రసన్న మగునేని కోరికలన్నియు నొడఁగూడు నని యర్థాంతరము.

చ. పరులమనంబు లోలబహుభంగులఁ గొల్చి ప్రసన్నతాగుణ
స్ఫురణ వహింపఁ జేయుటకుఁ బూనఁగ నేటికి నీవు చిత్తమా
స్థిరముగ సుప్రసాదము భజించి నిలింపమణీగణోదయ
స్ఫురితగతిన్ మనోరథము సొంపు వహింపదె నీకు మేలుగన్.61

తా. మనసా! ఇతరులమనస్సులను బలువిధములఁ గొలిచి వానిని బ్రసన్నము లుగాఁ జేయుటకై పెనుఁగకష్టములపాలు పడెదవేల? నీవే ప్రసన్నమై చింతామణి వంటిగుణములం బడసితివేని కోరికలన్నియు విడివడి నెమ్మది కలుగును. దానిచేఁ గోరికలన్నియు నొడఁగూడినవే యగును.

అవ. ఇట్లు మనఃప్రసాదమునం గలగుణమును జెప్పి యిపు డా మనంబుయొక్క యవగుణమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పరిభ్రమసి కిం వృథా క్వచన చిత్త విశ్రామ్యతాం
స్వయం భవతి యద్యథా భవతి తత్తథా నాన్యథా।
అతీత మననుస్మర న్నపి చ భావ్యసఙ్కల్పయ
న్నతర్కితసమాగమా ననుభవామి భోగా నహమ్॥          62

టీ. హేచిత్త=ఓమనసా, వృథా=వ్యర్థముగా, కిం=ఏల, పరిభ్రమసి=తిరుగాడుచున్నావు-ప్రయోజనము లేమిచే నూరక తిరుగఁదగదని భావము. అయితే చేయఁదగినదేమి యనఁగాఁ జెప్పుచున్నాఁడు, క్వచన=ఒకానొకచో, విశ్రామ్యతాం=విశ్రమింపఁబడునుగాక-స్వస్థానమందే నిచ్చలు నెలకొనియుందువుగాక యనుట. ఇట్లు చేసినయెడ కార్యసిద్ధి యెట్లనఁగా చెప్పుచున్నాఁడు. యత్=ఏది-ఏవస్తువు-లేక ఏకార్యము, స్వయం=తనంత-స్వభావముచేతనే, యథా = ఎట్లు, భవతి=అగునో, తత్=అది, తథా=అట్లే-తనప్రకృతిచొప్పుననే,భవతి=అగును. న అన్యథా (భవతి)=మఱొకవిధముగాఁగాదు,'యద్భావితద్భవత్యేవ'అన్నట్లు అన్నియు దైవాయత్తముగా నేరీతిని గలుగనున్నదో యారీతినే కలుగునుగాని వేఱొకరీతిని గలుగదు. కాన దానికై పాటుపడక యూరక విశ్రమించియుండుమని సంబంధము. అట్లు విశ్రమించుటయందుఁగలఫలముం జెప్పుచున్నాఁడు. అహం=నేను, అతీతం=కడచినదానిని, అననుస్మరన్=తలఁచుకొనకయు-కడచిపోయినదానినిగుఱించి శోకింపకయు ననుట. భావిచాపి=కలుగనున్నదానిని, అసఙ్కల్పయన్=సంకల్పించుకొనకయు-కోరకయు ననుట,అతర్కితసమాగమాన్=ఊహింపఁబడనిరాకలు గలిగిన-తలంపఁబడకయే ప్రాప్తించునట్టి యనుట, భోగాన్=విషయసుఖములను, అనుభవామి=అనుభవించెదను-దైవికముగా లభించినవానితోఁ దృప్తినొందియుండెదను కాన నాకై నీ వలయవలదనిభావము. ('అతర్కితగమాగమా ననుభవ స్వభోగానిహ' అనుచో, ఇహ=ఈపుడమియందు, అతర్కిత=ఊహింపరాని, గమ ఆగమాన్=పోకయు రాకయుఁ గల, స్వభోగాన్=నీభోగములను, అనుభవ=అనుభవింపు మని యర్థము),ఇట్లుచేసిన 'యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాఙ్క్షతి। శుభాశుభపరిత్యాగీ భక్తిమా న్యః స మే ప్రియః' అనుభగవద్వాక్యముచొప్పునను 'గతార్థా న్నానుశోచన్తి నార్థయన్తే మనోరథాన్।వర్తమానేన వర్తన్తే తేన మేపాణ్డవాః ప్రియాః॥' అనువచనమునను పరమేశ్వరుని కవశ్యము ప్రియుఁడ నగుదు నని భావము.

ఉ. ఏల పరిభ్రమించెద వనేకవిధంబుల వెఱ్ఱిచిత్తమా
తాలిమి విశ్రమింపు మొక తావున యత్నము లేకయే యగున్
మేలును గీడు నేఁ దలఁప మించినకార్యము భావికార్యమున్
లాలసవృత్తిఁ గోర విధిలబ్ధఫలంబులు నే భుజించెదన్.          62

తా. చిత్తమా! ఊరక నాకై యేల నలుగడల భ్రమించెదవు? ఇఁకనొకచో విశ్రమింపుము. ఏది యెట్లు జరుగనున్నదో యది యట్లేజరుగును గాని వేఱొకవిధమున జరుగదు. కావున నీపాట్లవలన నాకు విశేష మేమియుఁ గలుగఁబోదు. నీవు నెమ్మదిగా నిలుకడనొందుదు వేని నేనును గడచినదానికి వగవక కలుగనున్నదానికై తలపోఁతలు సేయక దైవికముగాఁ గలిగినభోగములనే తృప్తితో ననుభవించెద.

అవ. ఇప్పుడు విశేషించి సంబోధించురీతినే చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏతస్మా ద్విర మేన్ద్రియార్థగహనా దాయాసకా దాశ్రయ
శ్రేయోమార్గ మశేషదుఃఖశమనవ్యాపారదక్షం క్షణాత్।
శాన్తం భావ ముపైహి సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భఙ్గురాం భవరతిం చేతః ప్రసీ దాధునా॥ 63

టీ. హేచేతః=ఓమనసా, ఆయాసకాత్=ఆయాసపెట్టునదియగు, ఏతస్మాత్=ఈ-సర్వానుభవసిద్ధమైన యనుట, ఇన్ద్రి...హనాత్ = ఇంద్రియార్థ=ఇంద్రియవిషయములైన శబ్దాదులనెడి, గహనాత్=అడవివలన- విరమ=ఉడుగుము-విషయములు మిక్కిలి యనర్థములు కలిగించి చిక్కులం బెట్టునవి కాన వానియం దాసక్తి వలదనుట, క్షణాత్=క్షణమాత్రమున, అశేష...దక్షం-అశేషదుఃఖ=సమస్తదుఃఖములను, శమన=పోఁగొట్టుట యనెడి, వ్యాపార=కార్యమునందు, దక్షం=సమర్థమైన, శ్రేయోమార్గం=జ్ఞానమార్గమును- లేక మోక్షమార్గమును, ఆశ్రయ=అనుసరింపుము-జ్ఞానమార్గంబునందు వర్తింపుమనుట, శాన్తం=గంభీరమైన, భావం=భావమును, ఉపైహి=పొందుము, ('స్వాత్మీభావ ముపైహి' అనుచో, నీయాత్మ యగుటను (అనఁగా నీయాత్మస్వరూప మనుసంధించుటను పొందుమని యర్థము), నిజాం=నీదైన, కల్లోలలోలాం=పెనుకరడువలె చంచలమైన, గతిం=వ్యాపారమును, సన్త్యజ=బొత్తిగా విడువుము-స్థిరుఁడవుగమ్మనుట, భూయః=మరల, భఙ్గురాం=నాశశీలమైన-శాశ్వతము కాని యనుట, భవరతిం=సంసారమందలి ఆసక్తిని; మాభజ=భజింపకుమా, అధునా=ఇప్పుడు, ప్రసీద=ప్రసన్నము కమ్ము, చిత్తప్రసన్నత లేక తక్కిన పుణ్యాశతముల చేతను శ్రేయఃప్రాప్తి కలుగ దని భావము.

శా. ఆయాసప్రద మిన్ద్రియార్థగహనం బాత్రోవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికరచ్ఛేదార్థ మై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచే దీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ మాలిన్యముఁ వీడుమీ.

తా. మనసా! మిక్కిలి యలంచునట్టి యీ శబ్దాదివిషయముల సందడినుండి వీడి సకలదుఃఖములను దోడనే పోఁగొట్టఁ జాలుజ్ఞానమార్గమునం బ్రవర్తింపుము.

గంభీరభావముతో నాత్మస్వరూపానుసంధానము సేయుచు, పెద్దకరుడువలె నతిచంచలమగు నీవృత్తిని బొత్తిగా విడిచి యనిత్యమైనసంసారమం దాసక్తిని మరలఁ బొందక యిఁక నిదిమొదలుగాఁ బ్రసన్నత నొందుమూ.

అవ. నమ్మఁదగినవానినే నమ్ముము; తక్కినవానిని వల దనుచున్నాఁడు.

శ్లో॥ మోహం మార్జయ తా ముపార్జయ రతిం చన్ద్రార్ధచూడామణౌ
చేతః స్వర్గతరఙ్గిణీతటభువా మాసఙ్గ మఙ్గీకురు।
కో వా వీచిషు బుద్బుదేషుచ తటిల్లేఖాసుచ స్త్రీషుచ
జ్వాలాగ్రేషుచ పన్నగేషుచ సరిద్వేగేషుచ ప్రత్యయః॥ 64

టీ. హేచేతః=ఓమనసా,మోహం=(పుత్రమిత్రాదులం దాసక్తిని గలిగించు) అజ్ఞానమును, మార్జయ=ఊడ్చివైవుము-విడువు మనుట-వానియందు నమ్మిక వలదని భావము, అయితే, చంద్రార్ధచూడామణౌ=అఱచందురుఁడు తలమానికముగాఁ గల శివునియందు, తాం=ఆ-పరమసుఖప్రద మని ప్రసిద్ధినొందినట్టి యనుట, రతిం-అనురక్తిని-ప్రీతిని, ఉపార్జయ=సంపాదింపుము. స్వర్గ...భువాం-స్వర్గతరఙ్గిణీ=దేవలోకపునదియగు మందాకినియొక్క, తట=తీరముతోఁ జేరిన, భువాం=ప్రదేశములయొక్క, ఆసఙ్గం=సామీప్యమును, అఙ్గీకురు=కైకొనుము-శివుఁడును గంగాతీరప్రదేశములును శ్రేయస్కరము లగుటచే నారెంటియందే నమ్మికయుంపుమనుట, ఏలనఁగా, వీచిషు=అలలందును, బుద్బుదేషుచ=నీటిబుగ్గలందును, తటిల్లేఖాసుచ=మెఱపుఁదీఁగలయందును, స్త్రీషుచ=స్త్రీలయందును ('శ్రీషుచ' అనుచో సంపదలయందును), జ్వాలాగ్రేషు = అగ్నిసెగలకొనలందును, పన్నగేషుచ= సర్పములందును, సరిత్ వేగేషుచ=నదీవేగములందును, ('సుహృద్వర్గేషుచ' అనుచో, బంధుసమూహములందును) ప్రత్యయః=విశ్వాసము-నమ్మిక, కోవా=ఏది-ఏనమ్మికయు లే దనుట-గృహదీపమును 'చుమ్బనకరణే శ్మశ్రుదాహః' ముద్దుపెట్టిన మీసముకాలు'నను లోకన్యాయమునఁ బ్రత్యక్షముగా దహించు జ్వాలాగ్రములందును, స్పష్టముగాఁ బ్రాణములను హరించుసర్పములందును,నిలుకడలేని నదీప్రవాహములందును ఆపదలందు విడిచిపోవు బంధుజనులందును విశ్వాసముదగదనియర్థము. 'ప్రత్యయోఽధీన శపథ జ్ఞాన విశ్వాస హేతుషు' అని యమరుఁడు. ఇందు ప్రస్తుతములైన స్వబంధుజనాదులకును అప్రస్తుతములైన వీచిప్రభృతులకును ఔపమ్యము గమ్య మగుటచే దీపకాలంకారము.

చ. దురితపుమోహముం దొలఁగఁజేయుము సేయుము భక్తి శూలిపై
వరసురవాహినీతటనివాసముఁ జేకొను మేటినమ్మికల్
తరఁగలయందు బుద్బుదవితానములందు మెఱుంగుఁదీఁగెలం
దరయఁగఁ గీలలందు ఫణులందు సుహృజ్జనులందు డెందమా. 64

తా. మనసా! మోహమును మానుము. చంద్రధరునియందు బ్రీతియు గంగాతీరప్రదేశములందు వాసమును శ్రేయఃప్రదములు గాన వానినే కయికొనుము. స్త్రీలు గాని, శ్రీలుగాని, యలలు, నీటిబుగ్గలు, మెఱపుఁదీఁగలు, అగ్గిసెగకొనలు, సర్పములు, నదివేగములు మొదలైనవానివంటివి కాన వానిని నమ్మఁదగదు.

అవ. మఱొకరీతిని సంబోధించుచున్నాఁడు.

శ్లో॥ చేత శ్చిన్తయ మా రమాం సకృ దిమా మస్థాయినీ మాస్థయా
భూపాలభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాఙ్గనామ్ ।
కన్థాకఞ్చుకితాః ప్రవిశ్య భవనద్వారాణివారాణసీ
రథ్యాపఙ్క్తిషు పాణిపాత్రపతితాం భిక్షా మపేక్షామహే॥ 65

టీ. హేచేతః=ఓమనసా, అస్థాయినీం=అస్థిరమైనదియు, ఎట్లనఁగా, భూపాల...పణ్యాఙ్గనాం-భూపాల=రాజులయొక్క, భ్రుకుటీ=బొమముడిపాటనెడి, కుటీ=ఇంటియందు, విహరణ=విహరించుట యనెడి, వ్యాపార=వ్యాపారముగల, పణ్యాఙ్గనామ్=బోగముది యైనదియు-రాజులు ప్రీతితో బొమలు త్రిప్పిన లక్ష్మి కలుగుటయు కోపముతో బొమలు ముడిఁచిన నదితొలఁగుటయు సంభవించునుగాన నాబొమ్మలు లక్ష్మికి విహరించుగృహముగాఁ జెప్పఁబడినది. బొమలయందు కేవల ముండుటను జెప్పక విహరించుటను జెప్పుటచే బొమలు నిగ్రహానుగ్రహములచే నెట్లు దిరుగునో యట్లే తానును లోనైతిరుగు నని యాశయము. అనఁగా కేవలము బొమలందుఁ గాక బొమలత్రిప్పులందే లక్ష్మికలిమిలేములు కలుగును గాన నాత్రిప్పులంబట్టి యిచట విహరణశబ్దము ప్రయుక్తము. అయిన నది యొక్కటను నిలుకడలేక వ్యభిచరించునది గాన పణ్యాంగనగా రూపితమైనది. ఇట్టిదియు, అగు,ఇమాం=ఈ-ఈకనఁబడుచున్న యనుట, రమాం=సిరిని, ఆస్థయా=ఆదరముతో-పట్టుతో ననుట, సకృత్=ఒకప్పుడును, మాచిన్తయ=చింతింపకుమా-ఆసింపకుమనుట, అయితే జీవించుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు, కన్థాకఞ్చుకితాః సన్తః-కన్థా= బొంతచేత, కఞ్చుకితాః=చొక్కాయిగలవారును- బొంతను గప్పుకొన్నవారై యనుట, (వయం=మేము, అని శేషము), వారాణసీ రథ్యాపఙ్క్తిషు=కాశియొక్క రాజమార్గములవరుసలందు,భవనద్వారాణి=ఇండ్లవాకిళ్లను, ప్రవిశ్య=చొచ్చి, పాణిపాత్రపతితాం = చేతు లనెడి పాత్రలందుఁ బడిన, భిక్షాం=బిచ్చమును, అపేక్షామహే=కోరుచున్నాము. 'పాణిపాత్ర ఉదరమాత్రపాత్రే పతిత మశ్నీయాత్' ఇత్యాదిశ్రుతిచోదితప్రకారమున ఆనాయాసముగా దొరకుభిక్షాహారమున శరీరయాత్ర నడపుచుఁ బుణ్యక్షేత్రముల సుఖముగా వసింతు మని యర్థము.

మ. అవనీశభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాంగనన్
భువిలోఁ సంపద నించుకం గొనకుమీ భోగార్థమై చిత్తమా

శివమోదావహకాశికానగరసు శ్రీరాజమార్గంబులన్
భవనద్వారములందుఁ జేత నిడుసద్భైక్షం బపేక్షించెదన్. 65

తా. మనసా! రాజులయనుగ్రహముచేఁ గలుగుచు నిగ్రహముచేఁ బోవుచు వారవనితవలె నొక్కయెడను గుదుటలేక చపలమైయుండులక్ష్మిఁ గాంచి మమ్మల యింపవలదు. మేము బొంతఁ గప్పుకొని కాశీక్షేత్రమునకుఁ బోయి యందలి పెనువీధులలో నిల్లిల్లు సొచ్చి చేతులలోఁ బడినబిచ్చము గొని బ్రతుకుదుము సుమా.

అవ. నీవు సంసారమునందెప్పుడు సభినివేశముండు నేని యది యీచెప్పఁబడుపరికరములతోఁ గూడినయెడ నందాసక్తి కలిగియుండుము. ఇట్లుగానిచో ధ్యానమందు నిష్ఠగలిగియుండుమని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అగ్రే గీతం సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః
పశ్చా ల్లీలావలయరణితం చామరగ్రాహిణీనామ్।
య ద్యస్త్యేవం కురు భవరసాస్వాదనే లమ్పటత్వం
నో చే చ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ॥ 66

టీ. హేచేతః=ఓమనసా, అగ్రే=ముంగల, గీతం=గానము-గాయకజను లనుట, పార్శ్వయోః=ఇరుప్రక్కల, దాక్షిణాత్యాః=దక్షిణదేశపువారైన, సరసకవయః=రసికులైనకవులును, పశ్చాత్=వెనుకప్రక్క, చామరగ్రాహిణీనాం=చామరలను వీచు చెలువలయొక్క, లీలా...రణితం-లీలా=వింజామరలను వీచు విలాసముచేతఁ గలుగు, వలయ=మణికంకణములయొక్క, రణితం=ఝణత్కారమును, ఇది యెల్ల, ఏవం=ఈప్రకారమున, అస్తియది=ఉండెనేని, భవరస ఆస్వాదనే=సంసారమునందలి చవులను ఆస్వాదించుటయందు-సంసారసుఖానుభవమునం దనుట, లమ్పటత్వం=లోలుపత్వమును-ఆసక్తినుట, 'లోలుపోలోలుభోలోలో లాలసో లమ్పటశ్చ సః' అని యాదవము, కురు=చేయుము, నోచేత్=కాదేని-అట్లుకలుగదేని, సహసా=తోడనే, నిర్వికల్పే=ధ్యేయరూపమైనవికల్పము లేని-ధ్యానమందు వేఱొదియు స్ఫురింపక తన యాత్మస్వరూపము మాత్రమే స్ఫురించుచుండునది నిర్వికల్పమనుట, అట్టి, సమాధౌ=సమాధియందు- అసంప్రజ్ఞాతసమాధియందనుట, ప్రవిశ=చొరుము - ఆత్మస్వరూపధ్యాననిష్ఠమవు గమ్మని యర్థము.

చ. సరసులు దాక్షిణాత్యకవిచంద్రులు చెంతలయందు ముందటన్
సురుచిరగీతమున్ వెనుక శోభితచామరపాణిమానినీ
కరమణికంకణక్వణముఁ గల్గెనయేని భవానుభూతిచేఁ
బరఁగుము గల్గవేని భవభంజనయోగముఁ బూను మానసా. 66

తా. ఓమనసా! క్రోలు వీణాదివాద్యములు వాయించుగాయకులును, నిరుప్రక్క రసికులైన దక్షిణదేశపుకవులును, వెనుకదెసం జామరల వీచుచున్న ముద్దియల మురువునూపురతనంపుంగడియముల రవళియు, నను నివియెల్ల నుండెనేని యీసంసారసుఖము ననుభవింపుము. లేదేని తోడనే నిర్వికల్పసమాధిం గయికొని యాత్మస్వరూపనిష్ఠమ వగుము.

అవ. విచారింపంగా సంపత్తికలుగుట పగతురగెలుచుట మొదలైనవానివలనంగూడ నేమియుం బస లేదనుచున్నాండు.

శ్లో॥ ప్రాప్తాః శ్రియః సకలకామదుఘా స్తతః కిం
న్యస్తం పదం శిరసి విద్విషతాం తతః కిమ్ ।
సంపాదితాః ప్రణయినో విభవై స్తతః కిం
కల్పం స్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్॥ 67

టీ. ఓమనసా! తనుభృతాం=శరీరులకు, సకలకామదుఘాః=సమస్తములైన కోరికలను బిదుకునట్టి, శ్రియః=సంపదలు, ప్రాప్తాః=పొందంబడినవి. తతః=దానివలన-అట్లువానిని పొందుటవలన, కిం=ఏమి-ప్రయోజనమేమి? విద్విషతాం=శత్రువుల యొక్క, శిరసి=తలయందు, పదం=అడుగు, న్యస్తం=పెట్టంబడినది- పరాక్రమాతిశయముచే సర్వశత్రువులు పాదాక్రాంతులుగాం జేసికొనంబడిరనుట, తతః కిం=దానివలనం బ్రయోజనమేమి? విభవైః=ధనములచేత, ప్రణయినః=సుహృదులు - చెలికాండ్రు, సంపాదితాః=సంపాదింపంబడిరి, ('సమ్మానితాః' అనుచో, బహుమానింపంబడిరనుట), తతః కిమ్= దానివలనం బ్రయోజనమేమి? తనుభిః=శరీరములచేత, కల్పం=కల్పాంతకాలము, స్థితం=ఉండుటయైనది. ('కల్పస్థితా స్తనుభృతాం తనవః' అనుచో, తనవః=శరీరములు, కల్పస్థితాః=కల్పము ఉండునవి యనుట), తతఃకిమ్=దానివలనం బ్రయోజనమేమి? బ్రహ్మానుభవమొకటియే అతిశయింపరాని యానందమై నిత్యమైయుండునది. తక్కినవెల్లం దమకంటె నతిశయించినవి గలవియై యవశ్యముగా నశించునవియు నై యున్నవి. కాన యవియన్నియు నిష్ప్రయోజనములే యని భావము.

చ. సకలశుభంబు లిచ్చుప్రియ కసంపద వచ్చిన నేమి దానిచేం
బ్రకటవిరోధిమస్తకము కపైం బద మంచిన నేమి దానిచే
నికటధనంబుచే హితుల కనేర్పుగ నేలిన నేమి దానిచే
వికృతము గాక ప్రాణికి భుకవిం దను వుండిన నేమి దానిచేన్. 67

తా. ఓమనసా! దేహధారులకుం గోరికల నెల్ల నొడంగూర్చుసంపదలు గలిగినను, శత్రువులు పాదాక్రాంతులైనను, ధనము లొసంగి సుహృదులను బెక్కండ్ర సంపాదించినను, దేహములు కల్పాంతమువఱ కుండినను నివియన్నియు నిరతిశయనిత్యశ్రేయస్సాధనములు కావు గాన వీనివలనం బ్రయోజన మేమియు లేదు.

అవ. శ్రేయస్సాధనములుగాఁ జెప్పఁబడినవీని నెల్ల వల దన్న యెడల మఱేది శ్రేయఃసాధన మని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ భక్తి ర్భవే మరణజన్మభయం హృదిస్థం
　　స్నేహో న బన్ధుషు న మన్మథజా వికారాః ।
　　సంసర్గదోషరహితా విజనా వనాన్తా
　　వైరాగ్య మస్తి కిమితః పర మర్థనీయమ్॥　　68

టీ. ఓమనసా! భవే=శివునియందు, భక్తిః=భక్తి, చేయఁదగినదని శేషము. మరణజన్మభయం=పుట్టుకచావులవలని భయమును, హృదిస్థం = మనసునందు నెలకొన్నదిగా- మఱవరానిదిగా ననుట, చేయఁదగునని శేషము. ఇట్లు నిరతిశయశ్రేయస్సునకు సాధనము లైన కర్తవ్యములను రెంటిని జెప్పి దానిని సాధింపనివి గాన అకర్తవ్యము లైనమఱిరెంటిని జెప్పుచున్నాఁడు. బన్ధుషు=పుత్రమిత్రకళత్రాదిరూపు లగు బంధుగులయందు, స్నేహః=అనురక్తి, న=(చేయఁదగినది) కాదు. మన్మథజాః=మన్మథునిచేఁ బుట్టినట్టి-మరుఁడు పుట్టించునట్టి, వికారాః=(స్త్రీలంపటత్వము మొదలైన) వికారములు, న=(చేయఁదగినవి) కావు. ఇఁక ముఖ్యకర్తవ్య మైనదానిని జెప్పుచున్నాఁడు. విజనాః=జనులులేనిదియు, కావుననే, సంసర్గదోషరహితాః-సంసర్గ=సంగమువలని, దోష=కామక్రోధాది దోషములచే, రహితాః=విడివడినవియు-'సఙ్గాత్సఞ్జాయతే కామః' ఇత్యాదివచనములప్రకారమున సంగముచేఁ బుట్టుకామక్రోధాదిదోషములు లేనిదియనుట, అగు, వనాన్తాః=వనమధ్యప్రదేశములు, సేవింపఁదగినవని శేషము. ఇట్లెల్లఁజేయుటచే నేమికలుగుననఁగాఁ జెప్పుచున్నాఁడు. వైరాగ్యమ్=విరక్తి, అస్తి=ఉన్నది-కలుగు ననుట, ఇతః=దీనికంటె- ఈవైరాగ్యమునకంటె, పరం=వేరైనది, కిం=ఏది, అర్థనీయమ్=కోరఁదగినది. వైరాగ్యమునకంటెఁ గోరఁదగినది వేఱొద్దియు లేదనుట- వైరాగ్యమే పరమశ్రేయస్సాధనమని భావము.

చ. హరచరణాబ్జయుగ్మమునఁ గ నంచితభక్తి మనంబులో జరా
　　మరణభయంబు బాంధవసమాజముపై స్పృహ లేమి దుస్సహ
　　స్మరశరనిగ్రహంబు మునిసమాన్యవివిక్తవనప్రదేశముల్
　　పరమవిరక్తియుం గలుగ భాగ్యమహోన్నతి వేఱ యున్నదే.68

తా. ఓమనసా! శివునియందు భక్తియు, జననమరణములవలన మనంబునందు భయమును, బుత్రకళత్రాదులందు రక్తిలేమియు, మన్మథప్రేరితము లైనవికారముల నొందకుండుటయు, నిర్జనములై సంగదోషములఁ గలిగింపని వనప్రదేశములును గయికొనవలయును. ఏలన, వానివలన వైరాగ్యము సిద్ధించును. ఇదియే పరమశ్రేయస్సాధన మగుటచే దీనికంటెఁ గోరఁదగినది మఱేదియు లేదు.

అవ. బ్రహ్మవిచారతత్పరమ వగునీకు లోకాధిపత్యములు మొదలైనవి యెల్లను దుచ్ఛములుగానే తోఁచుచున్న వని యుపసంహరించుచున్నాఁడు.

శ్లో॥ తస్మా దన న్త మజరం పరమం వికాసి
త ద్బ్రహ్మ చి న్తయ కి మేభి రసద్వికల్పైః।
యస్యానుషఙ్గిణ ఇమే భువనాధిపత్య
భోగాదయః కృపణ లోకమతా భవ న్తి॥ 69

టీ. తస్మాత్=దానిచేత-వైరాగ్యమే యభ్యర్థనీయ మగు కారణముచేత, ఓ మనసా, అనన్తం=అంతములేనిదియు-ఆది లేనిదిగాన అంతమును లేని దనుట, కావున నే, అజరం=ముదిమిలేనిదియు-క్షీణతలేనిదనుట-ఏదిపుట్టునో యదియే క్షీణించును-బ్రహ్మము పుట్టుకలేనిది గాన క్షీణతయును లేనిదనుట, కావున నే, పరమం=సర్వోత్కృష్టమైనదియు, వికాసి=ప్రకాశరూపమైనదియు-లేక, సర్వవ్యాపియైనదియు, అగు, తత్ బ్రహ్మ=ఆబ్రహ్మమును, చిన్తయ=చింతింపుము- అజ్ఞానమువలన నీకుఁ బరోక్షమైనట్లుండియు దానినే చింతింపుమనుట. ఏభిః=ఈ-ఈచేయఁబడుచున్న, అసత్ వికల్పైః-అసత్=మంచివికాని, వికల్పైః=విచారములచేత, లేక, ఏభిః=ఈ-అనఁగా ప్రత్యక్షముగా ననుభవింపఁబడుచున్నవి యయ్యును, అసత్ వికల్పైః=మిథ్యాభూతములే యైనభావములచేత, కిం=(ప్రయోజనము) ఏమి- వికల్పములవలన సాధింపఁదగున దేమియు లేదనుట, యస్య=దేనియొక్క-ఏబ్రహ్మముయొక్క, అనుషఙ్గిణః=సంబంధించినవానికి-నీకు అని శేషము, ఇమే=ఈ-కోరఁబడుచున్న, భువనా...దయః-భువన ఆధిపత్య = లోకాధిపత్యము, భోగ=సుఖానుభవములు, ఆదయః=మొదలైనవి-లేక, యస్య=ఏబ్రహ్మముయొక్క, అనుషఙ్గిణః= అనువర్తించునవియైన, ఈభువనాధిపత్యభోగాదులనియు నన్వయము-బ్రహ్మమును ఈభువనాధిపత్యాదు లనువర్తించునవేకాని మఱి వేఱుకాదని యర్థాంతరము, కృపణలోకమతాః-కృపణ=దీనులయొక్క- బ్రహ్మవిచారహీనులయొక్క, లోక=సమూహమునకు, మతాః=ఇష్టములైనవి-యోగ్యములైనవనుట,భవన్తి=అగునో-తోఁచునో యనుట-ఆబ్రహ్మమును జింతింపుమని పూర్వముతో నన్వయము. కృపణుం డనఁగా 'యోవా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మల్లోకాత్ప్రైతిసకృపణః' బృహదారణ్యశ్రుతి; 'కార్పణ్యదోషోపహతః' గీత; అనునట్లు బ్రహ్మవిచారదూరు లగుదీనులు, 'అనుషఙ్గిణః' అనుటకు అనువర్తించునవి-అనఁగా బ్రహ్మమునకు లోనైనవి, యనునర్థమున ఒకానొకమందుఁడు అజ్ఞానమువలన రాజును విడిచి రాజపరతంత్రుఁ డగు నొకసేవకుని రాజుగాఁ దలఁచి వానిని బ్రసన్నునిగావింపఁ దివురునట్లు బ్రహ్మమును విడిచి వానికి లోనైనభువనాధిపత్యాదులకై తివురుట యగు నని భావము.

తే. కావున ననంత మజర మక్షర మజంబు
  బ్రహ్మము భజింపు మతివికల్పములు వలదు
  బ్రహ్మసంగికి భువనాధిపత్యభోగ
  పదవియును నీకుఁ దుచ్ఛమై పరఁగుఁ జువ్వె.   69

తా. కాఁబట్టి, ఓమనసా ! యనంతమై, నాశరహితమై సర్వోత్కృష్టమై, సకలవ్యాపియై యొప్పుబ్రహ్మమును జింతింపుము. మంచివి కానియీపెఱచింత లేల? ఆబ్రహ్మమునకుఁ బరతంత్రుఁడైనవానికి లోకాధిపత్యము మొదలైన యివియన్నియుఁ గృపణులకు యోగ్యములైనవిగాఁ దోఁచునేకాని తనకుఁ దగినవిగాఁ దోఁపదు.

అవ. ఈయర్థమునే మఱొకరీతి నుపదేశించుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ పాతాల మావిశసి యాసి నభో విలఙ్ఘ్య
  దిఙ్మణ్డలం భ్రమసి మానస చాపలేన।
  భ్రాన్త్యాపి జాతు విమలం కథ మాత్మనీనం
  తద్బ్రహ్మ న స్మరసి నిర్వృతి మేషి యేన॥   70

టీ. హేమానస=ఓమనసా, చాపలేన = ఆయావిషయములందలి యాసవలని చాపల్యముచేత, పాతాళం=పాతాళమును-మిక్కిలియుఁ గ్రిందైనప్రదేశము సైనను‌ట, ఆవిశసి=చొచ్చుచున్నావు, నభః=ఆకసమును, విలఙ్ఘ్య=దాఁటి - మిక్కిలి పొడవైనప్రదేశము సైనను గడచి యనుట, యాసి=పోవుచున్నావు, దిక్ మండలం=దిక్కులగుంపును, భ్రమసి=తిరుగుచున్నావు-మిక్కిలియు దూరదేశమైనను బరుగిడుచున్నావనుట, భ్రాన్త్యా అపి=భ్రమచేతనైనను-వివేకముచేతఁ గాకపోయినను అనుట, జాతు = ఒకానొకప్పుడు, విమలం = నిర్మలమైనదియు, ఆత్మనీనం=ఆత్మకు హితమైనదియు-నీ కుపకారక మైనది యనుట, ('ఆత్మనీనమ్' అనుచో ఆత్మయం దంతర్భూతమైయుండునదియనుట), అగు, తత్ బ్రహ్మ=ఆబ్రహ్మమును, కథం=ఎట్లు, నస్మరసి=స్మరింపకున్నావు-ధ్యానింపవనుట, యేన=దేనిచేత-ఏస్మరణముచేత, నిర్వృతిం=ఊఱటను-మోక్షమనెడి నిరతిశయమైనయానందమును, ఏషి=పొందుదువో - ఎల్లని స్మరించినంతనే యానందప్రదమైనది గాన నట్టిబ్రహ్మమును అవశ్యము స్మరింపవలయు నని యర్థము.

చ. బలిసదనంబుఁ జొచ్చెదవు ప్రాఁకెద వభ్రపదంబు దాఁటి ది
  గ్వలయము సంక్రమించెదవు వారక చిత్తమ చాపలంబునం
  దలఁప వొకప్పుడున్ మఱచి తప్పియు లోన వెలుంగుబ్రహ్మము
  న్దలఁచెదవేని పొందెదవు నాశవివర్జితనిత్యసౌఖ్యమున్.   70

తా. ఓమనసా! పాతాళమును జొచ్చెదవు. ఆకాశమును గడచియుఁ బో యెదవు. నలుదిక్కులకడలకును దిరిగెదవు. నీ విట్టిగమనశక్తి గలదానవయ్యు వివేక ముచేఁ గాకున్నను భ్రమచేతనైన నొకానొకప్పుడేని మలరహితమై యాత్మోపకార కమై యున్నయాబ్రహ్మమును స్మరింపవేమి ? బ్రహ్మస్మరణమువలన నిరతిశయమైన యాత్మతృప్తి నొందుదువుగదా.

ఇదివైరాగ్యశతకమునమనస్సంబోధననియమనమన్నది సప్తమదశకము.

---

## భర్తృహరిసుభాషితము–నిత్యానిత్యవస్తువిచారము.

---

అవ. వేదాధ్యయనము, స్మృతిపర్యాలోచనము, శాస్త్రపఠ నము, పురాణశ్రవణము మొదలైనవానివలన నేలాభమును గలుగదు. విచారింపఁగా శ్రవణమనననిదిధ్యాసనాదులచే ఆత్మస్వరూపము నను భవించుటయే లాభ మని తలఁచి జనులం జూచి బోధించుచున్నాఁడు.

శ్లో॥ కిం వేదైః స్మృతిభిః పురాణపఠనైః శాస్త్రైర్మహావిస్తరైః
స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః ।
ముక్త్వైకం భవదుఃఖభారరచనావిధ్వంసకాలానలం
స్వాత్మానన్దపదప్రవేశకలనం శేషా వణిగ్వృత్తయః॥ 71

టీ. వేదైః=ఋగ్యజుస్సామాదిచతుర్వేదములచేత, కిం=ఏమి - ప్రయోజన మేమియనుట- ఏమియు లేదనిభావము, స్మృతిభిః=మనుస్మృతి మొదలైనపదునెని మిది స్మృతులచేత, కిం=ప్రయోజన మేమి - ఏమియు లేదనుట, పురాణపఠనైః=బ్ర హ్మాండాదులైన పదునెనిమిదిపురాణములను ఉపపురాణములను బఠించుటచేతను, కిం =ఏమి-ఏమియును లేదనుట, మహావిస్తరైః=మిక్కిలివిటివిగల, శాస్త్రైః=తర్కవ్యా కరణాదిశాస్త్రములచేత-లేక, న్యాయమీమాంసాదిశాస్త్రములచేత, కిం=ఏమి-ఏమి యు లేదనుట, స్వర్గ... ఫలదైః-స్వర్గ=స్వర్గమనెడి, గ్రామకుటీ=పల్లెటూరి యింటి యందు-వేదాంతులకు స్వర్గమునందుఁగలజుగుప్సచే దానినొకపల్లెటూరియిల్లుగా నిట చెప్పిరని తెలియునది, నివాస=వసించుటయనెడి, ఫల=ఫలమును, దైః=ఇచ్చునట్టి వను, కర్మక్రియావిభ్రమైః-కర్మ=స్నానసంధ్యావందనాగ్నిహోత్రాదికర్మములయొ క్క, క్రియా=వ్యాపారములయొక్క,లేక, అనుష్ఠానముయొక్క, విభ్రమైః=విలాస ములచేత, కిం=ఏమి-ఏమియు లేదనుట, భవ...లానలం-భవ=సంసారమువలని, దుఃఖ భార = దుఃఖాతిశయములయొక్క, రచనా = ఏర్పఱుచుటయొక్క-ఒనగూర్చుట యొక్క - పురాకృతకర్మముచే పయింబయి నేర్పఱుపఁబడునట్టి దుఃఖపరంపరల

యొక్క యనుట, విధ్వంస=తూటాడుట యందు, కౌల అనలం=ప్రళయాగ్నియైనదగు, స్వాత్మా...కలనం-స్వ = తనయొక్క, ఆత్మ ఆనంద=ఆత్మసుఖానుభవముయొక్క, పద=స్థానమునందు, ప్రవేశ=చొచ్చుటయొక్క, కలనం=సంపాదనము-ఆత్మస్వరూపానుభవమును గడించుట, ఏకం=ఒక్కటిని, ముక్త్వా=విడిచి, శేషాః=తక్కినవి, వణిక్ వృత్తయః=వర్తకవ్యాపారములైనవి-వర్తకవృత్తులతో సాటియైన వనుట, వర్తకు లొకసరకు నిచ్చి మఱొకటిఁ గొనునట్లు మనుజులు వేదాధ్యయనాదుల నాచరించి స్వర్గాదులను గొనుచున్నారుగాన నిది వట్టిబేరములే యగును. కాన వీనివలనఁ బ్రయోజనమేమియు లేదని భావము. ఆత్మజ్ఞానముతప్ప వేదాధ్యయనాదులవలనఁ బసలేదు; వేదాంతవాక్యము లన్నియు పరబ్రహ్మమునందే పర్యవసించుటవలన వానిని విడిచి యాబ్రహ్మజ్ఞానమే సంపాదింపవలయు నని యాశయము.

ఉ. శ్రీమహితశ్రుతిస్మృతులఁ జే బహుశాస్త్రపురాణయుక్తిచే
నేమిఫలంబు లౌక్యజనవృత్తికి నీఁ దగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫలకర్మముచే ఫల మేమి జన్మదుః
ఖామయభేషజాత్మయమహాసుఖ మొక్కటి దక్క నన్నిటన్. 71

తా. వేదములచేఁగాని, స్మృతులచేఁగాని, పురాణములఁ జదువుటచేఁగాని, మిక్కిలి విరివిగలశాస్త్రములచేఁగాని, స్వర్గ మనెడి యొకపల్లెటూరియింటఁ గాఁపురము, సదుర్చుస్నానాదికర్మానుష్ఠానములందుఁ బ్రిమ్మరుటలచేతఁగాని యేమియుఁ బ్రయోజనము గలుగదు. పూర్వకర్మములచే పయింబయి నొడఁగూర్పఁబడుచుండు సంసారదుఃఖసమూహములఁ గాలాగ్నివలెఁ దూలించునదైన యాత్మస్వరూపానందానుభవమును గడించుట యొక్కటిదక్కఁ దక్కినవన్నియు రిత్తబేరపువ్యాపారములతో సాటియే యగును.

అవ. బ్రహ్మముతప్పఁ దక్కినవెల్ల ననిత్యములగుట విస్తరించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదా మేరుః శ్రీమా న్నిపతతి యుగాన్తాగ్నివలితః
సముద్రాః శుష్యన్తి ప్రచురమకరగ్రాహనిలయాః।
ధరా గచ్ఛ త్యన్తం ధరణిధరపాదై రపి ధృతా
శరీరే కా వార్తా కరికలభకర్ణాగ్రచపలే॥ 72

టీ. యదా=ఎప్పుడు, శ్రీమాన్=(మణిసువర్ణాదిసకలవస్తు) సమృద్ధి గల, మేరుః=మేరుపర్వతము, యుగా...లితః సన్ - యుగాంతాగ్ని = ప్రళయకాలపువహ్నిచేత, వలితః సన్=చుట్టుకొనఁబడినదగుచు, నిపతతి=పడుచున్నదో, యదా=ఎప్పుడు, ప్రచుర...లయాః-ప్రచుర=మిక్కిలియైన, మకర=పెద్దచేఁపలకును, గ్రాహ

=మొసళులకును, నిలయాః=వాసస్థానములైన, సముద్రాః=సముద్రములు, శుష్యన్తి=ఎండిపోవుచున్నవో, యదా=ఎప్పుడు, ధరణిధరపాదైః= (కుల) పర్వతము లనెడి కాళ్లచేత, ధృతా=ధరింపఁబడినదైన, ధరాఅపి=భూమియును, అన్తం=నాశమును, గచ్ఛతి=పొందునో - ఇచటను బ్రళయాగ్నిచేత నే యని తెలియునది, (తదా=అప్పుడు), కరి...చపలే-కరికలభ=ఏనుఁగుగున్నయొక్క, కర్ణాగ్ర=చెవికొనవలె, చపలే=చంచలమైన, శరీరే=శరీరవిషయమున, కా వార్తా=ఏమికథ - చెప్పవలసిన దేమి ఉన్నది, ఏమియులేదని భావము. ఎంతయుఁగొలఁదిపెట్టరానివై యత్యంతస్థిరములైన మేరువు మొదలైనవియే నశించుచుండఁగా నిఁక మిక్కిలియుఁ గొలఁదికిలోనై క్షణభంగురమైనశరీరము నశించునని చెప్పవలసిన దేమున్నదని యాశయము. 'గజాయత్ర నగణ్యన్తే మశకానాంతు కాకథా' అనున్యాయ మిట అనుసంధేయము. అన్నియు నశ్వరములే; శరీర మన్నింటికంటె నశ్వర మని భావము.

చ. స్థిరతర మైనమేరువు నశించు యుగాంతకృశానుకీలలన్
వరమకరాకరంబు లగువారినిధానము లెల్ల నింకు భూ
ధరములచే ధరింపఁబడి ధారుణి పోఁడిమి దప్పుఁ గావునం
గరికలభశ్రవశ్చపలకాయమునం దిఁక వార్త లేటికిన్. 72

తా. సర్వసమృద్ధిగల మేరుపర్వతము ప్రళయాగ్నిని గ్రాఁగి నీఱగుచున్నది. పెనుఁజేఁపలకును మొసళ్లకును బట్టయినసముద్రములును దానిచే నెండిపోవుచున్నవి. కులపర్వతము లనియెడికాళ్లపయి నెలకొన్నభూమియు దానిచేత నే నాశముఁ బొందుచున్నది. ఇటువంటివే యిట్టియవస్థనుబొందఁగా నిఁక యేనుఁగుగున్నచెవి కొనవలె నతిచంచల మైనశరీరము నశించున దని చెప్ప నేల?

అవ. శరీరులకు ముదిమిచేఁ గలుగుదురవస్థను రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ గాత్రం సఙ్కుచితం గతి ర్విగళితా భ్రష్టాచ దన్తావలి
ర్దృష్టి ర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రించ లాలాయతే।
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా న శుశ్రూషతే
హా కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రాయతే॥ 73

టీ. గాత్రం=దేహము, సఙ్కుచితం=ముడిఁగినది-అయ్యెనని శేషము. ఇట్లె మీఁదనెల్ల నెఱుంగునది, గతిః=నడక, గళితా=జాఱినది-పటుత్వము తప్పినదనుట, దన్తావళిః=పండ్లవరుస, భ్రష్టా=ఊడినది. దృష్టిః=చూపు, నశ్యతి=నశించుచున్నది-విషయముల గ్రహించుటకుఁ జాలకున్నవి. బధిరతా=చెవుడు, వర్ధతే=పెరుఁగుచున్నది, వక్త్రిం=నోరు, లాలాయతే=జొల్లుచే నిండియుండును-జొల్లు కార్చుచున్న

దనుట. బాన్ధవజనః=బంధువర్గము, వాక్యం=(తాను జెప్పిన) మాటను, న ఆద్రియతే =ఆదరింపదు. వేమేల, భార్యా=పెండ్లమును, న శుశ్రూషతే=కొలువదు, కాఁబట్టి, జీర్ణవయసః=జీర్ణించినవయస్సుగల-ముదిసిన, పురుషస్య=పురుషునికి, పుత్రోఽపి= కొడుకు గూడ, అమిత్రాయతే=శత్రువువలె నాచరించుచున్నాఁడు. హా కష్టం= అయ్యో యేమికష్టము!

చ. తనువు ముడుంగుఁ బాదగతి దప్పును దంతము లూడుఁ జీఁకటుల్
గనుఁగవ పర్విలుం జెవుడు గ్రమ్మును జొంగలు గాఱు మోమునన్
జనములు మాట చేకొనరు సన్నిధిఁ జేరదు భార్య పుత్రుఁడుం
గానకొని శత్రునట్ల తిరుగుం గడుఁగష్టము వృద్ధదేహికిన్. 73

తా. ముదిమియందు దేహము ముడుఁగుకొనుచున్నది. నడక తొట్రిలుచున్నది. పండ్లు రాలిపోవుచున్నవి. చూపు మందగిలుచున్నది. చెవుడు మీఱుచున్నది. నోర జొల్లు దొరఁగుచున్నది. బంధువులు చెప్పినమాట నాలింపరు. పెండ్లమును గొలువుసేయదు. కన్నకొడుకును బగవాఁ డగును. ముదిసినవానికష్ట మకటా! ఏమన వచ్చును.

శ్లో॥ వర్ణం సితం శిరసి వీక్ష్య శిరోరుహాణాం
స్థానం జరాపరిభవస్య తదా పుమాంసమ్।
ఆరోపితాస్థిశకలం పరిహృత్య యాన్తి
చాణ్డాలకూప మివ దూరతరం తరుణ్యః॥ 74

టీ. తరుణ్యః=జవరాండ్రు, శిరోరుహాణాం=కురులయొక్క, సితం=తెల్లని, వర్ణం=వన్నియను, శిరసి=తలయందు, వీక్ష్య=చూచి, తదా=అప్పుడు- అట్లు చూచినతోడనే యనుట, జరాపరిభవస్య=ముదిమిచేతియవమానమునకు, స్థానం=పట్టు అయినవాఁడును, ఆరో...శకలం-ఆరోపిత=ఎక్కింపఁబడిన-బిగిగాఁ బెనఁచుకొని యుండునదిగాక యూరక యందదుకులవలె నున్న యనుట, అస్థిశకలం=ఎమ్ముతును కలుగలవాఁడును-ముదిమిచే నెమ్ములబిగి సడలినవాఁడు ననుట, అగు, పుమాంసం=పురుషుని, ఆరోపితాస్థిశకలం=వ్రేలఁగట్టఁబడినయెమ్ముతునుక గల-ఇది పురుషునికిని చండాలకూపమునకును సామాన్యమగు విశేషణము, చాణ్డాలకూపమివ=చండాలుర నూతివలె- చండాలజాతులనూతిపయి నెమ్ము వ్రేలఁబడియుండుప్రతీతి యిట ననుసంధేయము. పరిహృత్య=పరిత్యజించి, దూరతరం=మిక్కిలిదవ్వుగా, యాన్తి=పోవుదురు. ‘వర్ణం సితం శిరసి వీక్ష్య...పరిభవస్య యదేవ పుంసామ్’ అనుచో, యదేవ=ఏదియే, పుంసాం=పురుషులయొక్క, జరాపరిభవస్య =ముదిమిచేనైనయవమానమునకు, స్థానం= స్థానమగునో, శిరసి=శిరస్సునందు, శిరోరుహాణాం=కురులయొక్క, సితం వర్ణం=ఆతెల్లనివన్నె,యనియర్థము. కురులతెల్లఁదనమె-యనఁగా నరలే, జరాపరిభవస్థాన మని యాశయము).

ఆ. కురులతెలుపు చూచి కొఱగాఁడు వీఁడని
మునలివాని విడిచి ముదిత లెల్ల
దూరముగఁ దొలంగుదురు సాస్థిశకల మా
మాలనూతి విడిచి మలఁగుభంగి. 74

తా. జవరాండ్రెవరేని పురుషులతలయందలినరల తెలుపుం జూచిరేని ముదిమిచే వికారపడి యందదుకులై యున్నయెమ్ములు గలవారిం జూచినతోడనే యెమ్ముక్రేలంగట్టఁబడిన చండాలజాతినూతింబోలె విడిచి కడుదవ్వుగాఁ దొలఁగుదురు.

అవ. కాఁబట్టి దురవస్థ యాక్రమించుకొనక మునుపే శ్రేయస్సును సంపాదించుటకు యత్నముసేయవలయుఁగాని మఱొకప్పుడు గాదనుచు దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యావత్స్వస్థ మిదం కళేబరగృహం యావచ్చ దూరే జరా
యావ చ్చేన్ద్రియశక్తి రప్రతిహతా యావత్క్షయో నాయుషః।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహా-
న్ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః॥ 75

టీ. యావత్=ఎంతవఱకు, ఇదం=ఈ, కళేబరగృహం=కళేబరమనెడియిల్లు, స్వస్థం=పీడలేక లెస్సగానుండునో, ('శరీర మరుజం'అనుచో, శరీరం=దేహము, అరుజం=రోగము లేనిదై, స్వస్థం=నెమ్మదిగానుండునో యనుట), యావచ్చ=ఎంతవఱకు, జరా=ముదిమి, దూరే=దూరమునందు - ఉండునోయని శేషము-ముదిమి యెంతవఱకు నలముకొనదో యనుట, యావచ్చ=ఎంతవఱకు, ఇన్ద్రియశక్తిః=ఇంద్రియములపటిమ, అప్రతిహతా=ఖండితముకానిది అగునో, యావత్=ఎంతవఱకు, ఆయుషః=ఆయువునకు, క్షయః=తఱుఁగుట-నాశము, న=లేదో తావదేవ=అంతవఱకే - అంతకు లోనుగానే యనుట, విదుషా=తెలిసినవానిచేత-ఎఱుకగలవానిచే, ఆత్మశ్రేయసి=తనశ్రేయస్సునందు-మోక్షప్రాప్తివిషయమునం దనుట, మహాన్=గొప్పదియైన-పూజనీయమైన, యత్నః=ప్రయత్నము-జ్ఞానవైరాగ్యతపంబుల సంపాదించుపూనిక, కార్యః=చేయఁదగినది. అయిన నిప్పుడే యట్టిప్రయత్నము చేయవలయుననునియమమేల? అవసానమం దట్టిప్రయత్నమును జేసికొనరాదోయనఁగా దానిని దృష్టాంతముచూపి నిషేధించుచున్నాఁడు. భవనే=ఇల్లు, ప్రోద్దీప్తేసతి=అగ్నిచేఁ గాలుచుండఁగా, కూపఖననంప్రతి=బావిత్రవ్వుటనుగూర్చి, ఉద్యమః=యత్నము, కీదృశః=ఎట్టిది-అవకాశము వలయునంత లేమిచే నది యయుక్తమనుట. ఇల్లుగాలునప్పుడు నీటికై నూయి ద్రవ్వ

నట్లే యవసానకాలమందు శ్రేయఃప్రాప్తికై పూనుట యుక్తముకానేరదనియర్థము. కావున బుద్ధిమంతుఁడైనవాఁడు స్వస్థుఁడైయుండునపుడె శ్రేయఃప్రాప్తికి వలయు సాధనములు సంపాదించుకొనవలయు నని భావము.

చ. ధృతిఁగొని రోగముల్ జరయు దేహమునొంపకముందె యింద్రియ
ప్రతిహతి లేకముందె తనప్రాణవిరామము కాకముందె పం
డితజనుఁ డాచరింపఁ దగు శ్రీవిఁ బ్రయత్నము ముక్తికిక్ మహో
ద్ధతశిఖ నిల్లు గాలుతఱిఁ దాలిమి నూతులు ద్రవ్వ టొప్పునే. 75

తా. ఈదేహము లెవులులేక యెంతవఱకు దిటవుగానుండునో, యెంతదనుక ముదిమిరాక దవ్వననేయుండునో, యెందాఁక నింద్రియములపటుత్వము నూటిదప్ప కుండునో, యెంతకాల మాయువు క్షయింపకుండునో యంతకులోపలనే యెఱుకగల వాఁడు తనశ్రేయస్సుకొఱకు మంచియత్నము సేయఁ గడంగవలయు. అట్లు మున్మట్ట గాక కడపట నాప్రయత్నము సేయఁజూచుటయెల్ల నిల్లు కాలుచుండఁగా నీటికై నూయి త్రవ్వుటతో సాటియగును.

అవ. తపస్సు మొదలైనవానిని బెక్కింటిని జేయఁదగునా తగదా యని వితర్కించి పిదప నొకకొందఱనిశ్చయముచొప్పునఁ దపమే సం పాదింపఁదగిన దని రెండుశ్లోకములఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ తపస్యన్తః సన్తః కిమధినివసామః సురనదీం
గుణోదారాన్దారా నుత పరిచరామః సవినయమ్।
పిబామః శాస్త్రౌఘా నుత వివిధకావ్యామృతరసా-
న్నవిద్మః కిం కుర్మః కతిపయనిమేషాయుషి జనే॥ 76

టీ. తపస్యన్తః సన్తః = తపస్సుచేయువారమగుచు, సురనదీం=మందాకినిని- మందాకినియం దనుట, అధినివసామః కిం=వసింతుమా-కేవలవిరక్తిచేతననుట; ఉత= లేక, సవినయం యథాతథా=అడఁకువగా-ఆనుకూల్యముతోఁ గూడినట్టుగా ననుట. గుణఉదారాన్=(సౌభాగ్యసౌశీల్యాది)గుణములచే రమణీయులైన,దారాన్=భార్యల ను,పరిచరామః కిం=అనుసరింతుమా-సాంసారికధర్మముచే ననుట; శాస్త్రౌఘాన్= శాస్త్రకలాపములను, పిబామః కిం=త్రాగుదుమా - తద్రస మాస్వాదింతుమా-కీర్తి ప్రతిష్ఠావిజ్ఞానములకొఱ కనుట ; ఉత=లేక, వివిధ...రసాన్-వివిధ = పలువిధ ములైన, కావ్య=కావ్యముల నెడి-లేక, కావ్యములందుఁగల, అమృతరసాన్=సుధా ద్రవములను, పిబామః కిం=త్రాగుదుమా - సకలకళాకౌశలముకొఱకనుట; జనే= జనుఁడు-జనసముదాయమనుట, కతి...యుషిసతి-కతిపయ=కొన్ని, నిమేష=నిమిష ములు కొలఁదియేయైన, ఆయుషిసతి=ఆయువుగలవాఁడగుచుండఁగా, ఇట జనశబ్దము

జాత్యేకవచనమగు నేని, జనులమగు మేము కొన్నినిముసములపాటియాయువు గలవార మగుచుండఁగా ననియర్థము, కిం=దేనిని- మును చెప్పఁబడిన తపశ్చరణాదులలో దేనిని కుర్మః = చేయుదుము - కొన్నినిముసముల బ్రతుకులో దేనిని జేయుటకు నవకాశము లేమిచేననుట, న విద్మః=ఎఱుఁగము - నిశ్చయింప శక్యము కానందున నేమిచేయుట కును దెలియకున్న దని యర్థము.

మ. తపముల్ సేయుచు దేవతాతటినిచెంతన్ నిల్తుమో కాక దా
రపరత్వంబున నుందుమో వివిధశాస్త్రశ్రవ్యకావ్యామృతం
బుపభోగింతుమొ యేమి సేతుము హితంబూహింపఁగా లే మని
త్యపులోకంబునమానవుల్ మితనిమేషాయుష్కులై యుండఁగన్.

తా. ఆయువో కొన్నినిముసములపాటి యైయున్నది. ఇంతకాలములో, విరక్తి నొంది తపముసల్పుచు గంగాతీరమున వసింతుమా; లేక సాంసారికుల మై యానుకూల్యముతో గుణవతుల గురమణులను గొలుతుమా; లేక కీర్తి విజ్ఞానములకొఱకు శాస్త్రములను గఱతుమా; కళాకౌశలముకొఱకుఁ గావ్యముల యమృతరసముఁ గ్రోలుదుమా; దేనికిని నవకాశము లేమిచే నేదియుఁ జేయుటకు మాకుఁ దోఁపకున్నది.

అవ. అవ్వల నేమిసేయవచ్చునని యాశంకించి పిదప నిశ్చయించు చున్నాఁడు.

శ్లో॥ దురారాధ్యా శ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో
వయం తు స్థూలేచ్ఛా మహతి చ పదే బద్ధమనసః।
జరా దేహం మృత్యు ర్హరతి దయితం జీవిత మిదం
సఖే నాన్య చ్ఛ్రేయో జగతి విదుషోఽన్యత్ర తపసః॥ 77

టీ. తురగచలచిత్తాః= గుఱ్ఱమువలె చంచలములైనమనస్సులు గలవారగు-అస్థిరహృదయులైన, అమీ=ఈ కానంబడు, క్షితిభుజః=రాజులు, దురారాధ్యాః=ఆరాధించుటకు (అనఁగా ప్రసన్నులఁగావించుటకు) శక్యముకానివారు, వయం తు=మనమో, స్థూలఇచ్ఛాః=మిక్కుటమైనయాశగలవారము. మహతిపదే చ=గొప్పస్థానమునందును('సుమహతిఫలే' = మిక్కిలియుగొప్పఫలమునందు), బద్ధమనసః=నెలకొల్పఁబడినమనసు గలవారము. మాకు పేరాసమాత్రమే కాని యారాజు లిచ్చువారు గారని భావము. జరా=ముదిమి, దేహం=శరీరమును, హరతి=క్షీణింపఁజేయుచున్నది, మృత్యుః=అంతకుఁడు, దయితం=ప్రియమైన, జీవితం=ఉసురును- ఈప్రాణములను, హరతి-కొనిపోవుచున్నాఁడు. కాఁబట్టి, హేసఖే=ఓ చెలికాఁడా, జగతి=ఈలోకమునందు, విదుషః=తత్త్వజ్ఞునకు, తపసః=తపస్సుకంటె, అన్యత్ర = ఒండుచోటు-వేఱొకటియనుట, అన్యత్ =అసాధారణమైన- ఉత్తమమైన, శ్రేయః=మోక్షసాధ

నము-మంగళము, న=లేదు. కాఁబట్టి సర్వవిధములఁ దపస్సు నే సంపాదింప వలయు నని భావము.

ఉ. వాజిచలస్వభావు లగుచున్నవారు ప్రసన్నులు గారు భూపతుల్
రాజసవృత్తి మానరు దురాశయు నెక్కుడు మాకు సౌమ్ముపైఁ
దేజ మడంచు వృద్ధదశ దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁ డం
వ్యాజతపంబుకన్న భువి నాత్మహితం బగుకృత్య మున్న దే. 77

తా. గుఱ్ఱమువలె నిలుకడ లేనిమనసులు గలయీరాజులను బ్రసన్నులుగాఁ జేయుట యెంతయుఁగష్టము. మనకో యాశ యతిమాత్ర మగుటయేకాక గొప్పపదవులే కావలయునని బుద్ధి యువ్విళులూరుచుండును. ముదిమియో దేహమును జీర్ణింపఁ జేయుచున్నది. మృత్యు వత్యంతప్రియమైన యీ ప్రాణములను దీసికొనుచున్నది. కావున, చెలికాఁడా! ఎఱుకగలవానికి నిజగంబునందు తపంబునకంటె మించిన శ్రేయస్సు మఱొకటి లేదు.

అవ. తపస్సు శ్రేయము కలిగించునదేని దాని నాచరించుటకుఁ దగినచో టెయ్యది యనఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మానే మ్లాయిని ఖణ్డితేచ వసుని వ్యర్థం ప్రయాతేఽర్థిని
క్షీణే బన్ధుజనే గతే పరిజనే నష్టే శనై ర్యౌవనే।
యుక్తం కేవల మేత దేవ సుధియాం య జ్జహ్నుకన్యాపయః
పూతగ్రావగిరీన్ద్రకన్దరదరీకుఞ్జే నివాసః క్వచిత్॥ 78

టీ. మానే=(జాతిపలాగులవలని) అభిమానము, మ్లాయినిసతి=తీసిపోవునదగుచుండఁగా, వసుని=ధనము, ఖణ్డితేసతి=నశించినదగుచుండఁగా, కాఁబట్టియే, అర్థిని= యాచకుఁడు, వ్యర్థం=(తనమనోరథ మొనగూడమివలన) నిరర్థకముగా, ప్రయాతేసతి=పోయినవాఁ డగుచుండఁగా, బన్ధుజనే=పుత్రమిత్రాది బంధువర్గము, క్షీణేసతి=(అన్నాదులులేమిచే) క్షీణించుచుండఁగా, పరిజనే=భృత్యసమూహము, గతేసతి = (బత్తెము లందకపోవుటచే మఱొకచోటికి) పోయినదగుచుండఁగా, శనైః=మెల్లగా, యౌవనే=జవ్వనము, నష్టేసతి=తీసిపోయిన దగుచుండఁగా- అనిత్యస్వభావము లగుటవలన సర్వమును విపన్నము లగుచుండఁగా ననుట, క్వచిత్ =ఒకానొక, జహ్ను...కుఞ్జే - జహ్నుకన్యా = గంగానదియొక్క, పయః = జలములచేత, పూత=పవిత్రమైన, గ్రావ=ఱాళ్లుగల, గిరీన్ద్ర=పర్వతశ్రేష్ఠముయొక్క, కన్దర=గుహయొక్క, దరీ=గట్టునందలి, (తటీ=చోటునందలి), కుఞ్జే=పొదరింటియందు, నివాసః=వసించియుండుట, (ఇతి) యత్=(అనునది) ఎదియో, ఏతదేవ= ఇదియే, కేవలం=మిక్కిలియు, సుధియాం=బుద్ధిమంతులకు, యుక్తం=ఉచితము. అచ్చట వసించుటయే శ్రేయస్సాధన మగుతపంబునకు యోగ్యమైనస్థలమని భావము.

ఉ. మానము గుర్రింగఁగా ధనము క్రమ్మట్టముగా నిజబాంధవాళిరితుల్
దీనతఁ జెంది యేఁగ నతిరథిపరికరంబు నిరాశమైఁ జనర్
మానుగ జవ్వనం బఱుగ క్రమాన్యునకుం దగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలిరతోపలశైలనికుంజవాసముల్. 78

తా. మానము చెడిపోవుచును, ధనము నశించుచును, కావుననే యాచింప వచ్చినవాఁడు వ్యర్థముగా మరలియును, బంధుజనులు నశించియుఁ, బరిజనులు కొలువువిడిచిపోయియు, యౌవన మల్లల్ల తీసిపోయియుు నున్నపుడు, బుద్ధిమంతులైనవారికి గంగాజలములచేఁ బవిత్రములైన ఱాలుగల యొక పెనుఁగొండగుహలోని యొకానొక పొదరింట వసించియుండుటయె మిక్కిలియు నుచితము.

అవ. చిత్తమునకు నిత్యానిత్యవస్తువివేకము కలిగినపుడు రమ్యములయ్యు నెల్లవియు నరమ్యములుగానే తోఁచు ననుచున్నాఁడు.

శ్లో॥ రమ్యా శ్చన్ద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనా న్తస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః।
కోపోపాహితబాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్య మనిత్యతా ముపగతే చిత్తే న కిఞ్చి త్పునః॥ 79

టీ. చన్ద్రమరీచయః=చంద్రకిరణములు, రమ్యాః=మనోహరములైనవి-ఉద్దీపకము లగుటచే నని భావము, తృణవతీ=పచ్చికగల- పచ్చగానున్న యనుట, వనాన్తస్థలీ=వనమధ్యప్రదేశము, రమ్యా=మనోహరమైనది, సాధు...సుఖం-సాధు=సజ్జనులతోడి, సమాగమ=కూడికవలన, ఆగత=వచ్చిన, సుఖం=సుఖమును, రమ్యం=రమణీయమైనది, కావ్యేషు=కావ్యములందు, కథాః=కథలు-ఉపాఖ్యానములనుట, రమ్యాః=మనోహరములైనవి. కోప...తరళం-కోప=(ప్రణయకలహములందలి) కినుకవలన, ఉపాహిత=కైకొనఁబడిన- పుట్టిన, బాష్పబిందు=కన్నీటి బొట్టుచేత, తరళం=కలఁతనొందిన - లేక, ప్రకాశించుచున్న, ప్రియాయాః=ప్రియురాలియొక్క, ముఖం=మొగమును, రమ్యం=మనోహరము. కాఁబట్టి, సర్వం=సమస్తమును, రమ్యం=(మీఁదఁ జెప్పఁబడినట్లు) మనోహరమే. చిత్తే పునః=మనస్సో, అనిత్యతాం=(సమస్తమును) అనిత్యమగుటను, ఉపగతేసతి=పొందినదగుచుండఁగా- సమస్తమును అసత్యమైనదను వివేకమునొందఁగా, కిఞ్చిత్=ఏదియు, న (రమ్యం)= మనోహరము కాదు. లేక, చిత్తము, అనిత్యతాం=నిలుకడలేమిని, ఉపగతేసతి = పొందియుండఁగా మనస్సు స్థిరముగాక కలఁతనొందియుండఁగా ననుట, ఏదియు రమ్యము గాదని యర్థాంతరము.

ఉ. మంచివి పండువెన్నెలలు ౹ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమన ౹ మాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశుప్రియుత ౹ మానవతీముఖ మీానమ స్తముల్
మంచిది కా దనిత్య మని ౹ మానసవృత్తి నెఱుంగువారికిన్. 79

తా. చంద్రుని తెలివెలుంగులును, పచ్చగానుండు నడవినడిమిపట్టులును సజ్జనులతోడి కూడికవలని సుఖమును, కావ్యములందలి కథలును, ప్రణయకోపముచేఁ బొడమిన కన్నీటిబొట్టుతోఁగూడినప్రియురాలినెమ్మొగమును,అన్నియును రమ్యములే యగును. కాని మనస్సున కవి యనిత్యము లనువివేచన కలిగినా యేదియు రమ్యము కాదు. (లేక, మనస్సు కలఁత నొందియుండునేని యవు డేదియు రమ్యము కాదని యర్థాంతరము.)

అవ. చెప్పినయర్థము నే వివరించుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే।
కిన్తు భ్రాన్తపతఙ్గపక్షపవనవ్యాలోలదీపాఙ్కుర
చ్ఛాయాచఞ్చల మాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః॥80

టీ. రమ్యం=మనోహరమైన,హర్మ్యతలం=ప్రాసాదప్రదేశము-ఉప్పరిగపట్టు, వసతయే=వాసస్థానముకొఱకు, నకిం=లేదాయేమి, గేయాదికం=గానము మొదలైన వి-ఆదిశబ్దముచే వీణావాదాదులు గ్రాహ్యములు, శ్రావ్యం=చెవికింపైనది, న కిం=కాదాయేమి, ప్రాణ...సుఖం - ప్రాణసమా=ప్రాణములతో సమానురాలైనట్టి దాని తోడి - ప్రాణప్రియురాలైన నాయికతోడి, సమాగమ= సంభోగముచేఁ గలుగు, సుఖం=సుఖము, అధికప్రీతయే=మిక్కిలిసంతోషముకొఱకు,నైవ కిం=కాదాయేమి, తప్పకయగునని భావము. కిన్తు=అయినను, సన్తః=సజ్జనులు-వస్తువిచారతత్పరులగు పురుషు లనుట, సకలం = (హర్మ్యతలనివాసము మొదలుగాఁగల) సమస్తమును, భ్రాన్త...చఞ్చలం-భ్రాన్త=పడఁగోరి భ్రమసిన, పతఙ్గ=మిడుతయొక్క, పక్ష=రెక్కలయొక్క, పవన=(ఈఁకల) గాలిచేత, వ్యాలోల=అల్లలాడుచున్న=దీపాఙ్కుర=దీపపుమొగ్గయొక్క, ఛాయా=కాంతివలె-లేక నీడవలె,చఞ్చలం=నిలుకడలేనిదిగా, ('కిన్తూద్భ్రాన్తపతత్పతఙ్గపవన...'అనుచో,ఉద్భ్రాన్త=పయికిభ్రమించినవై, పతత్=పడుచున్న, పతఙ్గ=మిడుతలయొక్క, పవన=రెక్కల గాలిచేత, నని యర్థము), ఆకలయ్య=నిశ్చయించి, వనాన్తం=వనమధ్యముంగూర్చి, గతాః=పోయిరి-శాశ్వతబ్రహ్మానందమునకు సాధనమైన తపశ్చర్యకొఱకనుట.

ఉ. సంతతముం సుఖం బొసఁగఁ ౹ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగముం మధుర ౹ గానములుం వివరించి చూడ సం

ఉ. మానము గుంగఁగా ధనము మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁ జెంది యేఁగ నతిథిపరికరంబు నిరాశమైఁ జనన్
మానుగ జవ్వనం బఱుగ మాన్యునకుం దగు జహ్నుకన్యకా
నూనతరంగపూతకలితోపలశైలనికుంజవాసముల్. 78

తా. మానము చెడిపోవుచును, ధనము నశించుచును, కావుననే యాచింప వచ్చినవాఁడు వ్యర్థముగా మరలియును, బంధుజనులు నశించియుఁ, బరిజనులు కొలువువిడిచిపోయియు, యౌవన మల్లల్ల తీసిపోయియు నున్నపుడు, బుద్ధిమంతులైనవారికి గంగాజలములచేఁ బవిత్రములైన ఱాలుగల యొకపెనుఁగొండగుహాలోని యొకానొక పొదరింట వసించియుండుటయె మిక్కిలియు నుచితము.

అవ. చిత్తమునకు నిత్యానిత్యవస్తువివేకము కలిగినపుడు రమ్యము లయ్యు నెల్లవియు నరమ్యములుగానే తోఁచు ననుచున్నాఁడు.

శ్లో॥ రమ్యా శ్చన్ద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనా న్తస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః।
కోపోపాహితబాష్పబిన్దుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్య మనిత్యతా ముపగతే చిత్తే న కిఞ్చి త్పునః॥ 79

టీ. చన్ద్రమరీచయః=చంద్రకిరణములు, రమ్యాః=మనోహరములైనవి-ఉద్దీపకము లగుటచే నని భావము, తృణవతీ=పచ్చికగల- పచ్చగానున్న యనుట, వనాన్తస్థలీ=వనమధ్యప్రదేశము, రమ్యా=మనోహరమైనది, సాధు...సుఖం-సాధు=సజ్జనులతోడి, సమాగమ=కూడికవలన, ఆగత=వచ్చిన, సుఖం=సుఖమును, రమ్యం=రమణీయమైనది, కావ్యేషు=కావ్యములందు, కథాః=కథలు-ఉపాఖ్యానములనుట, రమ్యాః=మనోహరములైనవి. కోప...తరళం-కోప=(ప్రణయకలహములందలి)కినుకవలన, ఉపాహిత=కైకొనఁబడిన- పుట్టిన, బాష్పబిందు=కన్నీటి బొట్టుచేత, తరళం=కలఁతనొందిన - లేక, ప్రకాశించుచున్న, ప్రియాయాః=ప్రియురాలియొక్క, ముఖం=మొగమును, రమ్యం=మనోహరము. కాఁబట్టి, సర్వం=సమస్తమును, రమ్యం=(మీఁదఁజెప్పఁబడినట్లు) మనోహరమే. చిత్తే పునః=మనస్సో, అనిత్యతాం=(సమస్తమును) అనిత్యమగుటను, ఉపగతే సతి=పొందినదగుచుండఁగా-సమస్తమును అసత్యమైనదను వివేకమునొందఁగా, కిఞ్చిత్=ఏదియు, న (రమ్యం)= మనోహరము కాదు. లేక, చిత్తము, అనిత్యతాం=నిలుకడలేమిని, ఉపగతే సతి = పొందియుండఁగా మనస్సు స్థిరముగాక కలఁతనొందియుండఁగా ననుట, ఏదియు రమ్యముగాదని యర్థాంతరము.

ఉ. మంచివి పండువెన్నెలలు ౹ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమస౹మాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశ్రుయుత౹మానవతీముఖ మీసమస్తముం
మంచిది కా దనిత్య మని ౹ మానసవృత్తి నెఱుంగువారికిన్. 79

తా. చంద్రుని తెలివెలుంగులును, పచ్చగానుండు నడవినడిమిపట్టులును సజ్జనులతోడి కూడికవలని సుఖమును, కావ్యములందలి కథలును, ప్రణయకోపముచేఁ బొడమిన కన్నీటిబొట్టుతోఁగూడినప్రియురాలినెమ్మొగమును,అన్నియును రమ్యములే యగును. కాని మనస్సున కవి యనిత్యము లనువివేచన కలిగెనా యేదియు రమ్యము కాదు. (లేక, మనస్సు కలఁత నొందియుండునేని యపు డేదియు రమ్యము కాదని యర్థాంతరము.)

అవ. చెప్పినయర్థమునే వివరించుచు నిగమించుచున్నాఁడు.

శ్లో॥ రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే।
కిన్తు భ్రాన్తపతఙ్గపక్షపవనవ్యాలోలదీపాఙ్కుర
చ్ఛాయాచఞ్చల మాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః॥80

టీ. రమ్యం=మనోహరమైన, హర్మ్యతలం=ప్రాసాదప్రదేశము-ఉప్పరిగపట్టు, వసతయే=వాసస్థానముకొఱకు, నకిం=లేదాయేమి, గేయాదికం=గానము మొదలైనవి-ఆదిశబ్దముచే వీణావాదాదులు గ్రాహ్యములు, శ్రావ్యం=చెవికింపైనది, న కిం=కాదాయేమి, ప్రాణ...సుఖం - ప్రాణసమా=ప్రాణములతో సమానురాలైనట్టి దానితోడి - ప్రాణప్రియురాలైన నాయికతోడి, సమాగమ= సంభోగముచేఁ గలుగు, సుఖం=సుఖము, అధికప్రీతయే=మిక్కిలిసంతోషముకొఱకు,నైవ కిం=కాదాయేమి, తప్పకయగునని భావము. కిన్తు=అయినను, సన్తః=సజ్జనులు-వస్తువిచారతత్పరులగు పురుషు లనుట, సకలం = (హర్మ్యతలనివాసము మొదలుగాఁగల) సమస్తమును, భ్రాన్త...చఞ్చలం-భ్రాన్త=పడఁగోరిభ్రమసిన, పతఙ్గ=మిడుతయొక్క, పక్ష=ఱెక్కలయొక్క, పవన=(ఈఁకల) గాలిచేత, వ్యాలోల=అల్లలాడుచున్న=దీపాఙ్కుర=దీపపుమొగ్గయొక్క, ఛాయా=కాంతివలె-లేక నీడవలె, చఞ్చలం=నిలుకడలేనిదిగా, ('కిన్త్వాద్భ్రాన్తపతత్పతఙ్గపవన...'అనుచో,ఉద్భ్రాన్త=పయికిభ్రమించినవై, పతత్=పడుచున్న, పతఙ్గ=మిడుతలయొక్క, పవన=ఱెక్కల గాలిచేత, నని యర్థము), ఆకలయ్య=నిశ్చయించి, వనాన్తం=వనమధ్యముంగూర్చి, గతాః=పోయిరి-శాశ్వతబ్రహ్మానందమునకు సాధనమైన తపశ్చర్యకొఱకనుట.

ఉ. సంతతముం సుఖం బొసఁగఁ౹జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగముం మధుర౹గానములుం వివరించి చూడ సం

భ్రాంతపతంగపక్షభవక్షమారుతఘాతవిఘూతదీపికా
కాంతిచలంబు సర్వ మని కానల కేఁగిరి పండితోత్తముల్. 80

తా. వసించుటకు మంచియుప్పరిగలును, వినుటకు నింపైనగానాదులును, మిక్కిలి సంతుష్టినొందుటకుఁ బ్రియురాండ్రతోడిసంగమమువలని సుఖమును గలవు. అయినను సుజనులు, మిడుత మిడిసిపడఁగా దాని యీఁకలగాలిచే నల్లలాడు దీపపుమొగ్గ కాంతివలె నివియంతయుఁ జంచలము లని విచారించి వీనినెల్ల మాని వనాంతమునకుఁ బోయిరి.

ఇది వైరాగ్యశతకమునని త్యానిత్యవస్తువిచారమన్నదియష్టమదశకము.

---

## భర్తృహరిసుభాషితము - శివార్చనము.

---

అవ. వస్తువిచారమును గుఱించి ప్రసక్తి రాఁగా తన్మూలమునఁ దపస్సుయొక్క ప్రస్తావము గలిగి యది మిక్కిలి యావశ్యక మైనదని చెప్పఁబడినది. అది యెట్టిదని యాశంక కలుగఁగా నది శివార్చనము తప్ప వేఱెద్దియుఁగాదని మదినుంచుకొన్నవాఁడై యిపుడు మొదట శివార్చనమును వర్ణించుచున్నాఁడు. ఆ యర్చనము బాహ్యము ఆభ్యంతరము అని రెండువిధము లైనది అందు మొదటిది పెక్కుకరణముల చే సాధింపఁదగినదై దేవతలకే చెల్లునదగుటంజేసి ముఖ్యము కాదని యెంచి దాని నుపేక్షించి ముఖ్యమగు నాభ్యంతరపూజాప్రకారము ననుభవించున ట్లభినయించుచుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆసంసారం త్రిభువన మిదం చిన్వతాం తాత తాదృ-
ఙ్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా ।
యోఽయం ధత్తే విషయకరిణీగాఢగూఢాభిమాన
క్షీబస్యాన్తఃకరణకరిణః సంయమాలానలీలామ్॥ 81

టీ. హేతాత=నాయనా - ఇది యాదరాతిశయమున మఱొకనిఁబిలుచుమాట, ఆసంసారం = సంసారముండువఱకు, ఇదం=ఈ, త్రిభువనం=మూఁడులోకములను, చిన్వతాం=వెదకుచున్న లేక పరామర్శించుచున్న, అస్మాకం=మాయొక్క, నయనపదవీం=నేత్రమార్గమునుగాని, శ్రోత్రమార్గంవా=చెవులదారినిగాని, తాదృక్=అటువంటివాఁడు-అట్టిపురుషుండు, నగతః=పొందినవాఁడుగాఁడు. అట్టిపురుషుని మేము

వినుటలేదు చూడనులేదనుట,ఎట్టిపురుషుఁడనఁగా చెప్పుచున్నాఁడు,యః=ఏ, అయం =వీఁడు-ఏపురుషుఁడనుట,విషయ... క్షీబస్య-విషయ=హారచందనాదివిషయములనెడి, కరిణీ=ఆఁడుయేనుఁగులందలి, గాఢ=అత్యంతమును, గూఢ=మఱుఁగైనదియు, నగు, అభిమానః=మిక్కిలి యాసక్తిచేత, క్షీబ=మత్తిల్లిన-'మత్తేశౌణ్డోత్కటక్షీబాః' అని యమరుఁడు, అన్తఃకరణ=మనస్సుఅనెడి, కరిణః = ఏనుఁగుయొక్క, సంయ...లీలామ్-సంయమ = చక్కఁగా నియమించుటయందు_లేక,చక్కఁగా నిగ్రహించుట యనెడి, ఆలాన=కట్టుకంబముయొక్క, లీలాం=విలాసమువంటివిలాసమును, ధర్తే= ధరించునో-నిగ్రహింపరానిమనస్సును నిగ్రహించుటయందు సమర్థుఁడగునో యనుట, తాదృక్ నయన...గతః'అట్టివాఁడు చూడఁబడనులేదు వినఁబడనులేదు అనిపూర్వముతో నన్వయము.('సంయమానాయలీలామ్'అనుచో మనోనిగ్రహమునందు దారముసేయఁజే యఁబడిన యురియొక్కలీలను అని యర్థము'ఆనాయఃపుంసిజాలంస్యాల్' అని యమరుఁడు), ఇట్టిపురుషుఁడు నయనశ్రోత్రమార్గవిషయత్వమును సంబంధించియుండియు నసంబంధమును జెప్పుటచే సంబంధాతిశయోక్తి. దీనిచేత, మనోనియమనము మిక్కిలి యశక్యమనెడివస్తువు వ్యంజితమగుటచే అలంకారముచే వస్తుధ్వని. ఏదేనియొకయోగమున మనస్సును నియమించి యందు బ్రహ్మానందమునకు సాధనభూతమయి యంతరంగశివునర్చించుటయనుతపంబు నవశ్యముచేయందగినదని గూఢాభిప్రాయము. 'ఆలానలీలామ్' అనుచో నిదర్శనాలంకారము. అది 'సంయమాలాన' అనురూపకముతో నంగాంగీభావముచే సంకీర్ణము.

మ. తగ సంసారమునాఁటనుండియును దత్తత్కర్మసంయుక్తి ము
జ్జగముం ద్రిమ్మరు మాకుఁ గానఁబడఁ డేతచ్చందంబునం గర్ణమా
ర్గగతుం డైనను గాఁడు భోగకరిణీగాఢాదరోన్మత్తచి
త్తగరిష్ఠద్విపరాజసంయమపటుస్తంభాత్మకుం డెవ్వఁడున్. 81

తా. అనాదిసంసార ముందునది మొదలుకొని యీమూఁడులోకములను వెదకి చూచితిమి గాని విషయము లనియెడునాఁడుయేనుంగులందు మిక్కిలి దృఢమైన యాసక్తిచే మత్తిలియున్న మనస్సనెడియేనుఁగును నియమించుటకుఁ గట్టుకంబమువంటివాఁ డగుపురుషుని మేము చూచినవారమును విన్నవారమును గాము.

అవ. తపస్సునఁ బ్రవర్తించువిధమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదేత త్స్వచ్ఛన్దం విహరణ మకార్పణ్య మశనం
సహార్యైః సంవాసః శ్రుత ముపశమైకవ్రతఫలమ్ ।
మనో మన్దస్పన్దం బహిరపి చిరస్యాపి విమృశ
న్నజానే కస్యైషా పరిణతి రుదారస్య తపసః॥ 82

టీ. స్వచ్ఛన్దం=యథేచ్ఛమైన-ఒకరికిలోఁబడవగాని, విహరణం=విహారమును, అకార్పణ్యం=కృపణత్వములేని-దీనత్వముకలుగని, అశనం=భోజనమును-భిక్షాన్నభోజనమును, లేక, కందమూలఫలాహారమును, ఆర్యైః సహ=శ్రేష్ఠులైనవారితోఁ గూడ-విజ్ఞానసంపన్నులతోడననుట, సంవాసః=వసతియు-కూడిమనుటయు, ఉప...ఫలమ్-ఉపశమ=శాంతియనెడు-విషయభోగనివృత్తి యనెడు, ఏకం=ముఖ్యమైన, వ్రతఫలం=వ్రతముఫలముగాఁగలదియగు-శాంతిఫలమునొసంగు తపశ్చరణమును బోధించునట్టి యనుట, శ్రుతం=వేదాంతశాస్త్రశ్రవణమును, బహిః=వెలుపల-వెలివిషయములందనుట, మన్దస్పన్దం=మెల్లనిచలనము గల-మందముగా ప్రసరించునట్టి యనుట, మనః అపి=మనస్సును, (ఇతి) యత్ ఏతత్ (సర్వంవర్తతే)=(అనెడి)యేయిది (యంతయు కలదో), ఏషా=ఇది - ఈస్వచ్ఛందవిహరణాదికము, విధేయప్రాధాన్యత్వముంబట్టి యిట స్త్రీలింగత్వము, కస్య=ఏ, ఉదారస్య=గొప్పదైన, తపసః=తపముయొక్క, పరిణతిః=పరిపాకమో-లేక, పరిణామమో, చిరస్య=చిరకాలముగా, విమృశన్ అపి=పరామర్శించుచుండినను, నజానే=తెలియకున్నాను. ఏతపస్సు ఈస్వచ్ఛందవిహారాదికముగా పరిణమించెనో యెంతకాల మాలోచించియు నాకుఁదెలియకున్నదియని యర్థము. ఆతపస్సు శివపూజనమేయగును. కావున్నమతియొకదానికి నిట్టిఫలమును సాధించుటకుఁగాని యిట్టిపరిణామమును బొందుటకుఁగాని సామర్థ్యము కలుగదనిభావము.

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియించుట దైన్యము లేనితిండియున్
నిచ్చలు సాధుసంగమును నిర్మలశాంతియు శాస్త్రబోధమున్
మచ్చిక లోనఁ బూని వెలిమట్టనిచిత్తము నాఁగ నింతయున్
వచ్చుట యేమహోన్నతతపంబుఫలంబొ యెఱుంగ నేర్తుమే. 82

తా. ఒకరికిలోఁబడవగాక యిచ్చమెయిఁదిరుగుట, దీనత్వములేనికడుపు, గొప్పవారితోఁగూడి మనుట, శాంతినొసంగు వేదాంతశాస్త్రశ్రవణము, మనస్సు బాహ్యవిషయములందు మిక్కిలి కొంచెముగాఁ బ్రసరించుట, యను నిదియంతయు నేగొప్పతపమువలన సిద్ధించునో యెంతకాలము విచారించియు నాకుఁ దెలియరాకున్నది.

అవ. శివచరణమే శరణమని తదీయస్మరణ మభినయించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ జీర్ణా ఏవ మనోరథాశ్చ హృదయే యాతంచ తద్యౌవనం
హన్తాఙ్గేషు గుణాశ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞైర్వినా।
కిం యుక్తం సహసాభ్యుపైతి బలవాన్కాలః కృతాన్తోఽక్షమీ
హా జ్ఞాతం మదనాన్తకాఙ్ఘ్రియుగళం ముక్త్వాస్తి నాన్యాగతిః॥

టీ. మనోరథాః=విషయాభిలాషములును, హృదయే= అంతరంగమునందే, జీర్ణాః=నశించినవి-వానిని గోరటమాత్రమే కాని యనుభవించుట లేదని యర్థము. తత్=అ-అటువంటి, యౌవనంచ=ప్రాయమును, యాతం=పోయినది. ('యాతం జరాం యౌవనమ్' అనుచో, యౌవనము ముదిమిని జెందినదని యర్థము), హన్త=అక్కటా, అఙ్గేషు=అవయవములందు, గుణాశ్చ=గుణములును-ఆయాయవయవములసామర్థ్యములన్నియు ననుట, గుణజ్ఞైః=గుణమును దెలిసినవారు లేక - గుణముల నెఱింగి యభినందించురసజ్ఞులు లేమింజేసి యనుట, వన్ధ్యఫలతాం=వ్యర్థమైనఫలము గలిగి యుండుటను-నిష్ఫలమగుటను, యాతాః=పొందినవి. బలవాన్=బలిష్ఠమైన, కాలః =కాలమును-కాలస్వరూపమును, అక్షమీ=ఓర్పులేని, కృతాన్తః=యముఁడును-లేక, బలవాన్=బలిష్ఠమును, కృతాన్తః=నాశముసేయునదియు, అక్షమీ=ఓర్పులేనిదియు-నిర్దాక్షిణ్యమైనదియు, నగు, కాలః=మృత్యువు, అని యర్థాంతరము, సహసా =తోడనే- వేగముగా, అభ్యుపైతి=ఎదురుకొని వచ్చుచున్నది-ప్రాణము నపహరించుకొఱకనుట, కాఁబట్టి, కిం=ఏది, యుక్తం=ఉచితమైనది-ఇట్టిదశయందు ఏమి చేయఁదగినదనుట, హా=ఓహో, జ్ఞాతం= తెలిసినది-ఇట్టియవస్థయందు యుక్తమైన దిదియని తెలియనైనదియనుట,అది యేదియన, మదనా...గళం - మదనాన్తక=(మరునిం గూల్చిన) శివునియొక్క, అఙ్ఘ్రియుగళం==అడుగులజంటను, ముక్త్వా=విడిచి,అన్యా=వేరైన, గతిః=శరణము,నాస్తి=లేదు. కాఁబట్టియదియే శరణము-ఇట్టిస్థితియందు దానినే కయికొనవలయు నని స్మరించి చెప్పినాఁడని తెలియునది.

ఉ. చిత్తమునందె కోరికలు ♣ జీర్ణము లయ్యె నశేషగాత్రముల్
హత్తినజవ్వనం బరిగె ♣ నార్యులు లేమి గుణంబులుల్ ఫలో
చ్ఛిత్తి వహించె నెద్ది తగుఁ ♣ జేరక మానఁడు కాలుఁడక్కటా
చిత్తజవైరిపాదయుగ ♣ సేవనమే గతిగా నెఱింగితిన్. 83

తా. కోరికలన్నియు నొడఁగూడుటకు నయితిలేక హృదయములోనే యడంగినవి. ప్రాయమును జాఱినది. ఆయాయవయవములసామర్థ్యములును దానిని మెచ్చందగువేత్తలులేమిచే నిష్ఫలములైనవి. బలీయమై నాశముసేయుచుఁ గనికరమింతయు లేక మృత్యువు వేగముగాఁ బైకొని వచ్చుచున్నది. ఇట్టిస్థితియందుఁజేయఁదగినదేమి? ఆ! తెలిసినది. మరుని గెలిచిన పరమశివుని పాదారవిందయుగళమును విడిచినచో వేఱొకదిక్కు లేదు. కాన నదియే శరణము.

అవ. 'యచ్చాచ నిఃస్రుతసరిత్ప్రవరోదకేన,తీర్థేన మూర్ధ్ని విధృతేన శివఃశివోఽభూత్ । దాతుర్మనశ్చకులశైలవిసృష్టవజ్రం ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిన్దమ్'ఇత్యాదులచే శివుం డాదిగాఁగలసకల దేవతలకును గల్యాణప్రదమైయఖిలలోకారాధ్యమైనసంసారసాగరోత్తా

రకమై యొప్పుభగవచ్చరణారవిందము వెలయుచుండఁగా శివాంఘ్రి) యుగళము తప్ప వేఱుగతి లేదని ప్రలపించెద వేల యని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మహేశ్వరేవా జగతా మధీశ్వరే, జనార్దనేవా జగదన్తరాత్మని।
న వస్తుభేదప్రతిపత్తి రస్తిమే, తథాపి భక్తి స్తరుణేన్దుశేఖరే॥84

టీ. జగతాం=పదునాలుగు లోకములకు, అధీశ్వరే=స్వామియగు,మహేశ్వరే వా=శివునియందుఁగాని, జగత్ అన్తరాత్మని-జగత్=జగంబులకు, అన్తరాత్మని= అంతర్యామియైన-లోపల నాత్మస్వరూపమునఁ జొచ్చి వ్యాపించి జగంబుల నియమించువాఁడైన, జనార్దనేవా=విష్ణువునందుఁగాని, మే=నాకు, వస్తుభేదప్రతిపత్తిః =(ఇతఁడుశివుఁడు ఇతఁడువిష్ణువు అని) వస్తువునందుఁ గలుగు భేదబుద్ధి- వేఱువేఱు వస్తువులుగా గ్రహించుటయనుట, న=లేదు. 'శివాయ విష్ణురూపాయ' ఇత్యాదులచే వారిద్దఱికి వస్తువుంబట్టి భేదములేదని భావము, తథాపి=అయినను-భేదబుద్ధి లేకున్నను, తరుణ ఇందు శేఖరే=(లేఁతచందురుని దలపువ్వుగాఁ గల)శివునియందు భక్తిః= కొలుచునసురక్తి,ఉన్నదని శేషము. కాఁబట్టియె శివాంఘ్రియుగళి తప్ప 'నాన్యా గతిః' వేఱుగతి లేదనఁబడియె ననిభావము. 'స్వభావో దురతిక్రమః'అనున్యాయ మిటఁ దెలియునది.

తే. జగదధీశ్వరుఁ డగుమహేశ్వరునియందు
సకలజగదంతరాత్ముఁ డౌశార్ఙ్గియందు
భేదవిజ్ఞాన మెయ్యెడ లేదు మాకు
నైనఁ దరుణేందుశేఖరునందె భక్తి. 84

తా. జగంబులకునెల్ల స్వామియగు శివునియందుఁగాని సకలలోకంబుల నంతర్యామియై వ్యాపించియున్నవిష్ణువునందుఁగాని వీరిరువురు వేఱువేఱువస్తువు లను భేదబుద్ధి నాకు లేదు. అయినను, లేఁతచందురుని దాల్చుశివునియందే నాకు భక్తి స్వభావసిద్ధముగాఁ గుదిరియున్నది.

అవ. శమము స్థాయిగాఁ బుట్టుటం జేసి శాంతరసమును జిప్పిలు వాక్యముల రాఁగలమైదుశ్లోకములం జెప్పుచున్నాఁడు.

శ్లో॥ స్ఫురత్స్ఫారజ్యోత్స్నాధవళితతలే క్వాపి పులినే
సుఖాసీనాః శాన్తధ్వనిషు రజనీషు ద్యుసరితః।
భవాభోగోద్విగ్నాః శివ శివ శివే త్యార్తవచసః
కదా స్యామానన్దోద్గతబహుళబాష్పాప్లుతదృశః॥ 85

టీ. శాన్తధ్వనిషు-శాన్త=ఉడిగిన, ధ్వనిషు=పక్షిమృగాదిశబ్దములు గల, రజనీషు=రాత్రులందు-ఇట చిత్తముకలఁతలేకుండుటకై రాత్రులకు నిశ్శబ్దత్వము చెప్పఁబడియె, స్ఫుర...తలే-స్ఫురత్=ప్రకాశించుచున్నదియు, స్ఫార=అధికమైనదియు, నగు, జ్యోత్స్నా=వెన్నెలచేత, ధవళిత=తెల్లనిదిగాఁజేయఁబడిన, తలం=ప్రదేశము గల, క్వాపి=ఒకానొక, ద్యుసరితః=గంగానదియొక్క, పులినే=ఇసుకదిన్నెయయందు, సుఖాసీనాఃసన్తః=సుఖముగాఁ గూర్చున్నవారమగుచు, భవా...ద్విగ్నాః-భవ=సంసారముయొక్క, ఆభోగ=విశేవివలన, ఉద్విగ్నాః=విహ్వలులమై-వెగడుపడినవారమై యనుట-సంసారము దుఃఖకరమగుటచేననుట, 'మేము' అనిశేషము, శివ శివ శివ ఇతి=శివశివశివయని, ఆర్తవచసః = కయికొనఁబడినమాటలుగలవారై ('ఉచ్చవచసః' అనుచో, గట్టిగా పలుకఁబహువచనములు గలవారై యనుట), శివశివశివయని పలుకుచు ననుట, కదా=ఎప్పుడు, ఆనన్దో...దృశః-ఆనన్ద ఉద్గత=ఆనందముచే వెలికి వచ్చిన, బహుళ=అధికమైన, బాష్ప=కన్నీళ్లచేత, ఆప్లుత=అంతటఁ దడుపంబడిన, దృశః=కన్నులుగలవారము, స్యామ=అగుదుము. ('ఆర్తవచసః కదా యాస్యామోఽన్తర్గతబహుళబాష్పాకులదశామ్' అనుచో, ఆర్తవచసః=దైన్యపుఁబలుకులుగలవారమై, అన్త...దశామ్-అన్తర్గత=లోపలనేయడంపఁబడియున్న, బహుళ=అధికమైన, బాష్ప=కన్నీళ్లచే, ఆకుల=వ్యాకులమైన, దశాం=స్థితిని, కదా=ఎప్పుడు, యాస్యామః=పొందఁగలము? అని యర్థము.)

శా. శాంతారావనిశీథకాలముల భాస్వత్సాంద్రచంద్రాతపా
  క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయోగ్యక్షోణిఁ గూర్చుండి జ
  న్మాంతోద్వేగులమైనమేము శివశబ్దావృత్తితో నెప్పు డ
  త్యంతానందభవాశ్రుసంకులదశాప్తిన్ సుఖం బందుమో.

తా. రాత్రులయందుఁ జప్పుడులన్నియు నడంగినపిదపఁ దళతళలాడుచున్న యగ్గలంపువెన్నెలచేఁ దెల్లగా విలసిల్లుచున్న యొకానొకగంగానదియిసుకదిన్నెయందు హాయిగాఁ గూర్చుండినవారమై మేము, సంసారము మిక్కిలి విశేవిగలదై కడవరాకుండుటకుఁ జింతిలుచు, 'శివశివశివ' యని యుచ్చరించుచున్నవారమై, దానంజేసి కలిగినయానందమువలన నానందబాష్పము లుప్పతిలి కన్నుల జాలుకొన్నవారమగుట యెప్పుడో!

శ్లో॥ వితీర్ణే సర్వస్వే తరుణకరుణాపూర్ణహృదయాః
  స్మరన్తః సంసారే విగుణపరిణామాం విధిగతిమ్।
  వయం పుణ్యారణ్యే పరిణతశరచ్చన్ద్రకిరణా-
  స్త్రియామా నేష్యామో హరచరణచిన్తైకశరణాః॥ 86

టీ. తరుణ...హృదయాః-తరుణ=లేఁతదైన-మృదువైన, కరుణా=భూతదయచేత, పూర్ణ=నిండిన, హృదయాఃసన్తః=హృదయములు గలవారగుచు, సర్వస్వే=

(తమకుఁగల) సకలధనమును, వితీర్ణేసతి=(అర్థులకు) దత్తముకాఁగా-మృదుకరుణాపూరితహృదయులై తమధనమెల్ల యాచకుల కియ్యఁగా ననుట, సంసారే=సంసారమునందు, విధిగతిం=దైవముయొక్క ప్రవృత్తిని, విగుణపరిణామాం=విషమమైన పరిపాకముగలదిగా-చెడ్డదై పర్యవసించునదిగాననుట, ('విగుణపరిణామాః విధిగతీః' అనుచో, విగుణపరిణామాః=నిర్గుణమైన-అనఁగా అనిష్టమైన-పరిణామములుగల-అనిష్టముగాఁ బరిణమించు, విధిగతీః=దైవవిలసితములను, అనియర్థము), స్మరన్తః సన్తః=స్మరించుచున్నవారమగుచు, వయం=మేము, పుణ్యారణ్యే=తపోవనమునందు, హర... శరణాః సన్తః-హర=శివునియొక్క, చరణ=అడుగులందలి, చిన్తా=చింతనమే, ఏక=ముఖ్యమైన, శరణాః సన్తః=దిక్కుగాఁ గలవారమగుచు, పరిణత... కిరణాః-పరిణత=పరిపాకమునొందిన-లేక చుట్టు వ్యాపించిన, శరత్ చన్ద్రకిరణాః=శరత్కాలపు చందురునియొక్క వెలుంగులు గల, త్రియామాః=రాత్రులను, నేష్యామః=కడపఁగలము-ఎప్పుడు కడపుదుమో యనుట.

చ. కలధన మంతయుఁ జెలవుగాఁ గా నిడి సూత్నకృపాప్రపూర్ణచి
త్తుల మయి సంసృతిం గుశలదూరవిపాకము గాఁగ దైవముం
దలఁచుచుఁ గానలో శివపదస్మృతినిష్ఠుల మై నయింపఁ గాఁ
గలము శరత్ప్రసన్నమిహికాకరరమ్యము లైనరాత్రులన్. 86

తా. మేము మనంబుల మెత్తనికరుణ గడలుకొనఁగా సకలధనములను యాచకులకు నొసంగి, సంసారమందు దైవము సేయుననిష్టవ్యాపారములు మనస్సునఁదలంచుకొనుచు వానినిరోసి తపోవనంబున కరిగి శివచరణధ్యానమె రక్షకముగా నుంచుకొని శరదృతువునందలిచందువెన్నెలలఁ జెన్నారురాతిరులఁ గడపుదుము. అది యెన్నఁడో తెలియరాదు.

శ్లో॥ కదా వారాణస్యా మమరతటినీరోధసి వస-
న్వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్।
అయే గౌరీనాథ త్రిపురహర శమ్భో త్రినయన
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్॥ 87

టీ. కదా=ఎప్పుడు, వారాణస్యాం=కాశియందు, అమరతటినీరోధసి=గంగాతీరమునందు, వసన్=వసించుచు, కౌపీనం=గోఁచిని, వసానః=కట్టుకొనుచు-వస్త్రిమేయక్కఱలేకున్నను లోకవిరోధమును బరిహరించుటకై యంతమాత్ర మేని కట్టుకొనువాఁడనగుచు ననిభావము, శిరసి=తలయందు, అఞ్జలిపుటం=చేమోడ్పును, నిదధానః సన్=ఉంచుకొన్నవాఁడనగుచు, అయే=ఓ, గౌరీనాథ=పార్వతీపతీ, త్రిపురహర=త్రిపురములను నాశముచేసినవాఁడా, శమ్భో=శంభుఁడా! 'శం+భూ' శం=సుఖ,

అస్మా ద్భవతీతి శమ్భుః - సుఖము దీనివలనఁ గలుగు నని వ్యుత్పత్తి. త్రినయన= ముక్కంటీ, 'గౌరీనాథ'యనుట లోకసంగ్రహకారణత్వమును, 'త్రిపురహర' యనుటచే అశక్యకార్యకరణశక్తియు, 'శమ్భో' అనుటచే భక్తజనసుఖసంధాయకత్వమును, 'త్రినయన' అనుటచే అసాధారణమహిమాస్పదత్వమును సూచితములయ్యెనని తెలియు నది, ప్రసీద=ప్రసన్నుఁడవగుము, ఇతి=అని, క్రోశన్=బిగ్గరఁ జెప్పుచు, దివసాన్= దినములను, నిమిషమివ=క్షణమువలె, నేష్యామి=కడపుదునో, ఇట రాఁగల తీవ్రనరక యాతనను జింతించుట మొదలగు విభావములచేఁ బుట్టి, గోఁచికట్టుట తలను చేమో డ్పుగీలించుట మొదలగు ననుభావములచే నభివ్యక్తమై 'కదా' అనుపదముచే సూచి తమగు చింతయనెడి సంచారీభావముచేఁ బుష్టినొంది, తన్ను అవమానించుకొనుటయే లక్షణముగాఁ గల నిర్వేదమును స్థాయిగాఁ గలిగి వెలయుశాంతరసము మిక్కిలియు స్ఫురించెడి నని తెలియునది. ఇట్లే మీఁదనెల్ల నెఱుంగునది.

ఉ. శ్రీనుతకాశియం దమరసింధువుచెంగట నిల్చి గోఁచినిం
బూని ప్రణామముద్రఁ దలఁ మోసి పురాంతక పార్వతీశ శం
భో నిటలాక్ష రక్ష యని మ్రొక్కులువెట్టుచు నిశ్చలానుసం
ధానత యెన్నఁడోఁ గడపెదన్ దినముల్ నిమిషంబుకైవడిన్.

తా. కాశియందు గంగాతీరమున వసించువాఁడనై గోఁచిమాత్రము బొడిగి తలయందుఁ జేమోడ్పుఁ గీలించి 'ఓపార్వతీనాథా! త్రిపురాంతకా! శంభూ! త్రిన యనా! ప్రసన్నుఁడవగుమని బిగ్గరఁ గూయిడుచు దినములను క్షణములవలెఁ గడపఁ గలుగుట యెప్పుడో యెఱుంగను.

శ్లో॥ స్నాత్వాగాఙ్గైః పయోభిః శుచికుసుమఫలైరర్చయిత్వావిభో త్వాం
ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధరకుహరగ్రావపర్యఙ్కమూలే।
ఆత్మారామః ఫలాశీ గురువచనరత స్త్వత్ప్రసాదాత్స్మరారే
దుఃఖం మోక్ష్యే కదాహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్॥

టీ. గాఙ్గైః=గంగాసంబంధియగు, పయోభిః=జలములచేత, స్నాత్వా=స్నాన ముచేసి, హేవిభో=ఓప్రభూ, త్వాం=నిన్ను, శుచికుసుమఫలైః-శుచి=శుద్ధములైన- శాస్త్రసమ్మతములైన, కుసుమఫలైః=పూవులచేతను పండ్లచేతను,అర్చయిత్వా=ఆరా ధించి-దీనిచే బాహ్యపూజయు కొంతప్రధానమగునని సూచితము, ధ్యేయే=ధ్యానింపఁ దగినవస్తువునందు-నీచరణారవిందమునం దనుట, ధ్యానం=ధ్యానమును, నియోజ్య= నియోగించి, (నివేశ్య=ఉంచి)-ఏకాగ్రచిత్తుఁడనై యనుట, క్షితి...మూలే-క్షితిధర= కొండయొక్క, కుహర=గుహయందలి, గ్రావ=ఱాయియనెడి, పర్యఙ్క=మంచము యొక్క, మూలే=మూలను, 'కూర్చున్నవాఁడనగుచు' అని శేషము, సమాధివ్యుత్థాన మునకుఁ బిదప సుఖముగాఁ గూర్చుండఁదగియుండున దని తెలుపుటకై గ్రావమును

పర్యంకముగా రూపించినాఁడు, ఆత్మారామః=ఆత్మయందే రమించువాఁడును-విష యాంతరములం దాసక్తిలేక ఆత్మస్వరూపమునందే యాసక్తుఁడనుట-'రమన్తేయోగినో ఽనన్తే సత్యానన్దేచిదాత్మని' అనిస్మృతి,ఫల+ఆశీ=పండ్లుభక్షించువాఁడును-శరీర ధారణార్థమనుట, గురువచనరతః=ఆచార్యుఁ డుపదేశించినదానిని ఆచరించుటయం దాసక్తుఁడును అగుచు, అహం= నేను, హేస్మరారే=మదనునకుశత్రువైనయోశంభూ, త్వత్ ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, సమకరచరణే=సమానములైన కాలు సేతులు గల-నావలెనే కాలుసేతులుగల-తనకు సాటియే యయి యెక్కుఁడు గానట్టి యనుట-కాలుసేతులఁగొని వాఁడు స్వతంత్రుఁడై యుండఁగాఁ దా నవి యుండియు నస్వతంత్రుఁడై యుండుట యతినింద్యమని సూచితము, పుంసి=పురుషునివిషయమందు, సేవాసమర్థం=కొలువుసేయుటవలనఁ బుట్టిన, దుఃఖం=దుఃఖమును, కదా=ఎప్పుడు, మోక్ష్యే=వీడుదునో. లేక, సమకరచరణే-సమకర=మొసలియాకారముగల రేకతోఁ గూడిన, చరణే=పాదములుగల-అనఁగా 'మకరో మత్స్యరేఖాచ పద్మశఙ్ఖాకృతిః పదే, మహాధనీ మహాభోగీ దాతా దీర్ఘాయురేవచ' అనుసాముద్రికవచనరీతిని మకర రేఖ పదమునంగలవాఁడు మహాభాగ్యసంపన్నుండుగాన నట్టివాఁడైన, పుంసి=పురుషునివిషయమందు, అని యర్థాంతరము.

ఉ. వేలుపుటేటఁ దోఁగి సుపవిత్రఫలాదులఁ బూజచేసి ని
న్నోలి మనంబులో నిలిపి యోగ్యగుహాశిలయందు నాత్మసం
శీలుఁడనై ఫలాశి నయి శ్రీగురువాక్యరతుండనై మహీ
పాలకసేవనశ్రమముఁ బాసెద నెన్నఁడు మన్మథాంతకా. 88

తా. ప్రభూ! గంగానదీజలంబుల స్నానంబుసేసి శుద్ధంబులైనపుష్పఫలంబుల చేత నన్నారాధించి, ధ్యానింపఁదగు నీపదారవిందమును ధ్యానించియు, కొండగుహ యందలిఱాతిసెజ్జపయి హాయిగాఁ గూరుచుండి, యితరవిషయములను మాని యాత్మ స్వరూపమునందే యాసక్తిగలిగి, శరీరధారణముకొఱకుఁ బండ్లాహారముగాఁ గొను చు,నాచార్యుం డుపదేశించినదానిని దప్పక యనుష్ఠించుచు, నావలెనె కాలుసేతులు గలిగి నాతో సాటియేయగు నొకపురుషుని గొలుచుటవలనిదుఃఖమును మదనాంతకా! నీయనుగ్రహమువలన నెప్పుడు వీడుదునో.

శ్లో॥ ఏకాకీ నిఃస్పృహః శాన్తః, పాణిపాత్రో దిగమ్బరః।
కదా శమ్భో భవిష్యామి, కర్మనిర్మూలనక్షమః॥ 89

టీ. హేశమ్భో=ఓశంకరా, ఏకాకీ = అసహాయుఁడును-లేక సంగరహితుఁడును-'సఙ్గాత్సఞ్జాయతే కామః' ఇత్యాదిసంగజనితములైన కామాదిపరంపర యనర్థహేతువగుటవలన సంగరహితుఁడును అనుట, దేనిచేననఁగా, నిఃస్పృహః=తృష్ణ లేనివాఁడును-విషయాభిలాష లేనివాఁ డగుటచే ననుట, కావుననే, శాన్తః=రాగా

దులచే కొట్టుపడనిచిత్తముగలవాఁడును - లేక, ఉపరతములైనయింద్రియములు గల వాఁడును, కావుననే, పాణిపాత్రః=చేయే భిక్షాపాత్రముగాఁ గలవాఁడును, దిక్ + అమ్బరః సన్=దిక్కులే వస్త్రముగాఁ గలవాఁడును అగుచు, నేను అని శేషము, కర్మనిర్మూలనక్షమః = కర్మములను నాశముసేయుటయందు సమర్థుఁడైనవాఁడను, కదా=ఎప్పుడు, భవిష్యామి=అగుదునో-కర్మబంధమునుండి యెప్పుడు విముక్తుఁడనగు దుననుట. 'ఏకాకీ యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః। శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్' అనుగీతావచన మిట గ్రాహ్యము.

తే. ఒంటి దిరుగుచుఁ గోరిక లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణిభాజనుఁడ నై ది
గంబరుఁడ నై సమస్తకర్మంబు లెపుడు
మొదలుచెడఁ ద్రుంతుఁ బరమేశ సదయహృదయ. 89

తా. ఓశంకరా! నేను సంగరహితుఁడును, దృష్ణాదూరుండును, శాంతుండునై, చేతుల బిచ్చముగొని, దిగంబరుఁడనై నాపూర్వకర్మము లెల్ల నిర్మూలింపఁజాలుట యెప్పుడో.

అవ. ఇట్టివారికి శివప్రసాదమువలన మోక్షమార్గము విలంబము లేకయె సులభ మగు నని చెప్పి నిగమించుచున్నాఁడు.

శ్లో॥ పాణిం పాత్రయతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం
యత్ర క్వాపి నిషీదతాం బహుతృణం విశ్వం ముహుః పశ్యతామ్।
అత్యాగేఽపి తనో రఖణ్డపరమానన్దావబోధస్పృశా-
మధ్వా కోఽపి శివప్రసాదసులభః సంపత్స్యతే భోగినామ్॥ 90

టీ. పాణిం=చేతిని,పాత్రయతాం=పాత్రవలె నుపయోగించువారును,నిసర్గశుచినా=స్వభావముచే పవిత్రమైన,భైక్షేణ=భిక్షాసమూహముచేత, సంతుష్యతాం=సంతోషించువారును, 'భైక్షం భిక్షాకదమ్బకమ్' అని యమరుఁడు,యత్రక్వాపి=ఏదో యొకానొకచోట-ఎచ్చోటనైనను-శ్మశానమందుఁగాని వనమందుఁగానియనుట,నిషీదతాం=కూర్చుండువారును, ముహుః=మాటిమాటికి, విశ్వం=ప్రపంచమును, బహుతృణం=కొంచెముతక్కువయగు తృణముగా-పూర్ణముగా తృణమనికాక యించుమించుగా తృణమనియనుట-తృణప్రాయముగా, 'స్వాదీషదసమాప్తౌతు బహుచ్ప్రికృతిలిఙ్గకః' అని బహుచ్ప్రత్యయ మిట నీషదసమాప్తియందు వర్తించును, పశ్యతాం=చూచువారును-ఎంచువారనుట, తనోః=దేహముయొక్క, అత్యాగేపి=విడువమియందును-దేహసంబంధమును విడువకున్నను అనుట, అఖణ్డ...స్పృశాం-అఖణ్డ=అపరిచ్ఛిన్నమైన, పరమానన్ద=శ్రేష్ఠమైన బ్రహ్మానందముయొక్క, అవబోధ=తెలియుటను, స్పృశాం=తాఁకుచున్నవారును - అనుభవించుచున్నవారును-జీవన్ముక్తులనుట, అగు,

యోగినాం=ధ్యాననిష్ఠులైనయోగులకు, శివప్రసాదసులభః=శివునియనుగ్రహముచే సుకరముగా లభింపఁదగిన, కోఽపి = అనిర్వాచ్యమైన-ఇట్టిదట్టిదనరాని, అధ్వా= మార్గము-మోక్షమార్గమనుట, సంపత్స్యతే=కలుగును. (అత్యాగేఽపి తనోరఖ... బోధస్పృహాం। మర్త్యఃకోఽపి శివప్రసాదసులభాం సంపత్స్యతే యోగినామ్) అనుచో, యోగినాం=పూర్వోక్తలక్షణములు గల యోగులయొక్క, శివప్రసాదసుల భాం=శివప్రసాదముచేసులభముగాకలుగునట్టిదైన,అఖణ్డ...స్పృహాం-అఖణ్డపరమా నన్ద=అపరిచ్ఛిన్నమైన మహానందమును - పూర్వోక్తులైన యోగులు అనుభవించు న ఖండబ్రహ్మానందమును, అవబోధ = తెలియుటకు, స్పృహాం=కోరికను, కోఽపిమ ర్త్యః=ఒకానొకమనుష్యుఁడు, తనోః అత్యాగేపి=దేహమును విడువకున్నను-దేహసం బంధము వీడకయనుట, సంపత్స్యతే=పొందును. పాణియె పాత్రగాఁ గలిగి స్వభావ శుద్ధమైన భిక్షులచేత నే తృప్తినొందుచు నెందేని కూర్చుండుచు ప్రపంచమును దృణ ప్రాయముగాఁ జూచుచునుండుయోగు లనుభవించు అఖండబ్రహ్మానందము నెఱుంగ వలయు ననుకోరిక యనేకశతసహస్రజనులలో నెవఁడో యొకానొకనికి, నీదేహ సంబంధముతోఁ గూడియుండినను, శివప్రసాదమువలన సులభముగా లభించు నని యర్థము).

చ. హితునకుఁ బాణిపాత్రునకు నీనిచ్చునకున్ శుచిభైక్షమాత్రితో
  షితునకు నెట్టిఠావున వసించెడువానికి విశ్వముం దృణ
  ప్రతినిధిఁ జేయువానికిఁ బుకరస్థితుఁ డయ్యు నఖండసౌఖ్యసం
  గతుఁడగుయోగి కేర్పడు నొకానొకమార్గము శంభుసత్కృపన్.

తా. అఱచేతినే పాత్రగా నుపయోగించుచు స్వభావపవిత్రమగు భిక్షముల చేత నే తృప్తినొందుచు, నెయ్యెడ నేని కూర్చుండుచు, మాటికి జగంబు నెల్ల నించు మించుగా గడ్డిపరకవలెఁ జూచుచు, దేహసంబంధమును విడువకుండియు నపరిచ్ఛి న్నబ్రహ్మానందజ్ఞానము ననుభవించుచు (జీవన్ముక్తులుగా) నుండు యోగులకు నిట్టి దట్టి దని వర్ణింపరానిమోక్షమార్గము శివప్రసాదమువలన సులభముగా లభించును.

ఇది వైరాగ్యశతకమున శివార్చన మన్నది నవమదశకము.

---

## భర్తృహరిసుభాషితము-అవధూతచర్య.

---

అవ. శివార్చనము మోక్షమున కుపయుక్తమగు నవధూతభా వము*ను గలిగించునదిగావునను, 'అత్యాగేఽపి తనోరఖణ్డపరమానన్దా

---

* అవధూత యనఁగా బ్రహ్మాత్మస్వరూపానుసంధానతత్పరుఁడై వెలుపలిప్ర పంచమును మఱచి మలినుఁడై కానంబడుచు జీవన్ముక్తుఁ డనంబడునొకయోగపురు షుఁడు.

వబోధస్పృశామ్' అని యవధూతవిషయము నుపక్రమించి యుం డుటం జేసియు, నిప్పు డవధూతచర్యను రాఁగల పదిశ్లోకములం జెప్పు చున్నాఁడు.

శ్లో॥ *కౌపీనం శతఖణ్డజర్జరతరం కన్థా పునస్తాదృశీ
నైశ్చిన్త్యం నిరపేక్షభైక్షమశనం నిద్రా శ్మశానే వనే
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశం విహరణం స్వాన్తం ప్రశాన్తం సదా
స్థైర్యం యోగమహోత్సవేఽపిచ యది త్రైలోక్యరాజ్యేనకిమ్॥

టీ. శత...తరం-శతఖణ్డ=నూఱుతునుకలచే,జర్జరతరం=మిక్కిలి శిథిలమైన, కౌపీనం=గోఁచియు, తాదృశీ=అటువంటిదైన - ఆగోఁచివలె నూఱుచింపులతోఁ గూడినదైన యనుట, కన్థాపునః=బొంతయును, నైశ్చిన్త్యం=విషయచింతలేమియు, నిరపేక్షభైక్షం-నిరపేక్ష = అన్నముకొఱకు నొకరిని అనువర్తింపవలసిన యపేక్ష లేని, భైక్షం = భిక్షాసమూహ మను, అశనం = భోజనమును, శ్మశానే = ప్రేత భూమియందుఁగాని, వనే = అడవియందుఁగాని, నిద్రా=నిదురయు, స్వాతన్త్ర్యేణ =స్వతంత్రతతో-ఒకరియిచ్చకు లోఁబడవగాక, నిరఙ్కుశం = ఏయడ్డపాటును లేని,

---

* ఈశ్లోకముయొక్క పాఠాంతరము.

శ్లో॥ కౌపీనం శతఖణ్డజర్జరతరం కన్థాపున స్తాదృశీ
నిశ్చిన్తం సుఖసాధ్యభైక్ష మశనం శయ్యా శ్మశానే వనే।
మిత్రామిత్రసమానతాతివిమలా చిన్తాఽథశూన్యాలయే
ధ్వస్తాశేషమదప్రమాదముదితో యోగీ సుఖం తిష్ఠతి॥

టీ. కౌపీనం•••తాదృశీ-(సుగమము), నిశ్చిన్తం=చింతలేకుండునట్లుగా,సుఖ సాధ్యభైక్షం=సుఖముగా సాధింపఁదగినదియగుభిక్షాసమూహము,అశనం=భోజనము, శ్మశానే వనే-(సుగమము), శయ్యా=పడుక, మిత్రామిత్ర సమానతా=మిత్రుల యందును శత్రులయందును సమభావము, శూన్యాలయే=నిర్జనమైనస్థానమునందు, అతివిమలా=మిక్కిలి శుద్ధమైన, చిన్తా=సమాధి, ఇవియెల్లఁ గలవాఁడైన, ధ్వస్త ...ముదితః-ధ్వస్త=నశించిన, అశేష=సమస్తమైన, మదప్రమాద=గర్వముచేతను ప రాకుచేతను- మదప్రమాదములు పూర్ణముగా నశించుటచేత ననుట, ముదితః=సంతో షించినవాఁడగు, యోగీ=యోగి, సుఖం=హాయిగా, తిష్ఠతి=ఉండును,

తా. నూఱుచింపులగోఁచియు నట్టిదే యగుబొంతయు, నేచింతయు లేక సు లువుగా దొరకఁదగినబిచ్చము తినుటయు, ప్రేతభూమినో యడవినో పరుండుటయు, మిత్రులయందును శత్రులందును సమభావమును, నిర్జనప్రదేశమునందు నతివిమల సమాధియుఁ గలవాఁడై మదమును బ్రమాదమును బూర్ణముగా విడిచి యోగి సుఖ ముగా నుండును,

విహరణం=తిరుగుటయు, సదా = ఎప్పుడును, ప్రశాన్తం=ప్రసన్నమైన, స్వాన్తం= మనస్సును, యోగమహోత్సవే=సమాధియనెడి పెనుఁబండువునందు-పెనుఁబండువు వంటి యోగసమాధియందు, స్థైర్యంఅపిచ=నిలుకడయును, యది(అపి)=ఉండెనేని, త్రైలోక్యరాజ్యేన= త్రిలోకాధిపత్యముచేత, కిం = ఏమి-ఏమియు లేదనుట-కాపీనాదులే త్రైలోక్యరాజ్యాధిపత్యమునకన్న పరమసౌఖ్యప్రదము లని భావము.

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపేక్షాశూన్యభైక్షంబుఁ జిం
తాపాయంబు వనశ్మశానముల నిద్రావాప్తి దుర్వారస
ద్వ్యాపారంబుఁ బ్రశాంతచిత్తమును యోగారూఢియుఁ వృత్తిసం
క్షేపంబుం గలదేని యోగికిఁ ద్రిలోకీపాభవం బేటికిన్. 91

తా. నూలుచింపులచే పెంపుమాలినగోఁచిగాని, బొంతగాని, విషయచింత లేమిగాని, యొకరినిగోలువనక్కఱలేని బిచ్చపుఁదిండిగాని, ప్రేతభూమియందో య డవియందో నిదురించుటగాని, యొకరికిలోఁబడవ గాక యేయడ్డుపాటునులేక తిరుగుట గాని, యెప్పుడును ప్రసన్నమైయుండు మనస్సు గాని, యోగమునందు నిలుకడగాని యుండినయెడల త్రైలోక్యరాజ్యాధిపత్యము సయితమక్కఱలేదు.

అవ. మిక్కిలి సౌఖ్యావహమైనదిగాఁ బొగడఁబొందిన త్రైలోక్యరాజ్యమును నిషేధించి కౌపీనాదులకలిమియే యుపపాదించుట యొప్పదు. ఎట్లన త్రైలోక్యరాజ్యమే మిక్కిలి యాసగొలుపునది కాని కౌపీనాదులు కావు. కాఁబట్టి యదియే యుత్తమమని శంక రాఁగా, మనస్వి యగువానికి త్రిలోకరాజ్యమే కాదు బ్రహ్మాండముసైత మాస గొలుపనేరదు. కాన కౌపీనాదులుతప్ప మఱేదియు వాని కుత్తమము గాదని సమర్థించుచున్నాఁడు.

శ్లో॥ బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం, కిం లోభాయ మనస్వినః।
శఫరీస్ఫురితేనాబ్ధిః, క్షుబ్ధో న ఖలు జాయతే॥ 92

టీ. మనస్వినః=ధీరునికి-ఆత్మజ్ఞాని కనుట, బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం=బ్రహ్మాండములసమూహములంతమాత్రమును-అతిమాత్రవిస్తారము గలబ్రహ్మాండసమూహములైనను అనుట, లోభాయ =పేరాసకొఱకు- మనస్వినకుఁ బేరాసగొలుపుటకు,కిం (భవతి)=(అగునా) యేమి-కానేరవనుట-మనస్వి బ్రహ్మాండములనేని యాసింపఁడనుట -ఇఁక వానియందు దొకానొకమూల నడఁగియుండు త్రైలోక్యపురాజ్యమును గోరుట చెప్పనేల యనిభావము. దీనికి దృష్టాంతము చెప్పుచున్నాఁడు. అబ్ధిః=సముద్రము, శఫరీస్ఫురితేన=ఎగసిపడెడుమీనుయొక్క అదరుటచేత, క్షుబ్ధః=కలఁగినది, నజా

యతేఖలు=కాదుగదా ('శఫరీస్ఫురితే నాబ్ధేః క్షుబ్ధతా జాతు జాయతే' అనుచో, శఫరీస్ఫురితముచేత, అబ్ధేః=సముద్రమునకు, క్షుబ్ధతా=కలఁత, జాతు=ఒకప్పుడేని, కిం జాయతే=కలుగునా-కలుగదు అనియర్థము- త్రైలోక్యరాజ్యముచే మనస్వికి లోభము కలుగుట మీఁ నదరుటచే సముద్రము కలఁగుటతో సాటి యగునని భావము. అలం. దృష్టాంతము.

క. మండలమాత్రంబగుబ్ర, హ్మాండములోభకరమగు నెయతిధీరునకుఁ
నిండుసముద్రము జలచర, తాండవగతిచే విలోడితము గాదుగదా.

తా. ఒకమీఁ నదరుటచే సముద్రము కలఁగుడువడనట్లు ఆత్మజ్ఞాని యగుధీరుని బ్రహ్మాండసమూహములును నాసగొలిపి కలఁపఁజాలదు.

అవ. వైరాగ్యప్రకారమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మాతర్లక్ష్మి భజస్వ కంచి దపరం మత్కాఙ్క్షిణీ మాస్మభూ
ర్భోగేషు స్పృహయాళవ స్తవ వశే కా నిఃస్పృహాణా మసి।
సద్యః స్యూతపలాశపత్రపుటికాపాత్రే పవిత్రీకృతే
భిక్షాసక్తుభిరేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే॥ 93

తా. మాతః=తల్లీ, హేలక్ష్మి=లక్ష్మి, ఇట 'మాత' అనుట యింతవఱకు నీచే రక్షింపఁబడితిమని భక్త్యతిశయసూచనార్థముగాఁ దెలియునది, అపరం=వేఱు, కంచిత్=ఒకానొకని, భజస్వ=కొలువుము. మత్కాఙ్క్షిణీ=నన్నుఁగోరునది-నావిషయమం దభిలాష గలది, మాస్మభూః=కాకుమా-ఇప్పు డింత వైరాగ్య మెట్లు కలిగననఁగాఁ జెప్పుచున్నాఁడు. భోగేషు=హారచందనాదివిషయానుభవములయందు, స్పృహయాళవః=ఆసగలవారు, తవ=నీయొక్క, వశే=వశమునందు, వర్తింతురని శేషము. అయితే మీరెవ్వరని యడుగఁగాఁ జెప్పుచున్నాఁడు. నిఃస్పృహాణాం=భోగాభిలాష లేనివారికి, కా=ఎవ్వతెవు-ఎట్టిదానవు, అసి=అగుదువు-ఎట్టిదానవును గావనుట, మేమును నిఃస్పృహులము. మాకు నీతోఁబనిలేదుగాన మమ్ము విడిచి మఱొకచోటికిఁ బొమ్మని భావము. ('భోగేభ్యః స్పృహయాళవో నహివయమ్' అనుచో, మేము భోగములదెస నాసగలవారము కాముగదా. అట్లు నిఃస్పృహుల మగుమాకు నీ వెవ్వతెవని యర్థము.) మిమ్ము నేను విడిచితినేని మీరు బ్రతుకుట యెట్లనఁగా చెప్పుచున్నాఁడు. వయం=మేము, సంప్రతి=ఇప్పుడు, పవిత్రీకృతే=('పలాశం పద్మపత్రంచ' ఇత్యాదివచనములచే) పావనముగాఁ జేయఁబడినది యగు,సద్య...పాత్రే-సద్యః=లోడనే, స్యూత=కుట్టఁబడిన- చాలసేపు కష్టపడి సంపాదింపవలసినది గాక తలఁచినంతనే కుట్టియనుభవింపఁగూడినయనుట,పలాశపత్ర=మోదుగాకులచేతనైన, పాత్రే=పాత్రయందు, భిక్షాసక్తుభిరేవ=బిచ్చమెత్తి తెచ్చుకొన్న పేలపిండ్లచేతనే,

('పవిత్రీకృతైః భిక్షావస్తుభిరేవ' అనుచో, పవిత్రీకృతైః=పవిత్రముగాఁజేయఁబడిన, శాస్త్రవిహితములైన పలాశపత్రాదుల నుంపఁబడుటచే పావనములు గావింపఁబడిన, భిక్షావస్తుభిః ఏవ=అన్న పుఁబిడుచలు కాయగూరలు మొదలైన బిచ్చపుపదార్థముల చేతనే యని యర్థము), వృత్తిం=జీవికను, సమీహామహే=కోరుచున్నారము.

క. అమ్మా లక్ష్మి నమస్కా, రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యారూ, పమ్మున నేలుకొను ముఖ్యఫల మదియకదా.

తా. ఓతల్లీ! లక్ష్మీదేవీ! మమ్మువిడిచి మఱెవ్వరినేనిగొలువుము. మమ్ముఁగోర కుమా. ఏలన, భోగములం దాసక్తిగలవారే నీ కధీనులుగాని, భోగస్పృహ లేని మాకు నీవెవ్వతెవు? నీవులేకున్న మాకుబ్రతుకు జరుగదనకుమా. మేమిపుడు పవిత్ర ము లగు మోదుగాకుపాత్రలు గట్టుకొని యందు తిరిప మెత్తినపేలపిండ్లు తిని మా బ్రతుకు జరుపఁగోరుచున్నాము. ఇట్లు బ్రతుకుమాకు నీప్రాపు పక్కఱలేదు.

అవ. యోగులు సార్వభౌములతోసాటి యగుదు రని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మహీ రమ్యా శయ్యా విపుల ముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోఽయ మనిలః।
స్ఫురద్దీప శ్చన్ద్రో విరతివనితాసఙ్గముదితః
సుఖీ శాన్తం శేతే ముని రతనుభూతి ర్నృప ఇవ॥ 94

టీ. మహీ=భూమి, రమ్యా శయ్యా=ఇంపైనసెజ్జ, ('మహాశయ్యా పృథ్వీ' అనుచో భూమి పెద్దసెజ్జ), భుజలతా=బాహువల్లి-తీఁగవంటిబుజము, విపులం=విరివియైన, ఉపధానం=తలయంపి, ఆకాశంచ=ఆకాశమును, వితానం=మేలుకట్టు, అయం=ఈ-వీచుచున్నయనుట, అనుకూలః=మనసునకెక్కినవాఁడగు,అనిలః=గాలి, వ్యజనం=వీవన, చంద్రః=చంద్రుఁడు, స్ఫురత్ దీపః = ప్రకాశించుచున్న దీపము. ('శరచ్చన్ద్రో దీపః' అనుచో శరత్కాలపుచంద్రుఁడు దీపము. ఇట శరత్తును గ్రహించుట ప్రకాశాతిశయమును దెలుపుటకొఱకు), ఈశయ్యాదులన్నియు యత్నములేకయే సిద్ధించునవియు అపరిచ్ఛిన్నములు నగును-ప్రసిద్ధములైనశయ్యాదు లిట్లుగావని భావము. తానన్ననో, విరతి...ముదితః-విరతి=విరక్తి-లేక శాంతి యనెడి, వనితా =స్త్రీతోడి, సఙ్గ=సంభోగముచేత, ముదితః=సంతుష్టుఁడైనవాఁడును, కావుననే, శాన్తః=శాంతుఁడును, అగు,మునిః=యోగి, అతనుభూతిః= అధీనమైనవిభవము గల-అఖండితైశ్వర్యసంపన్నుఁడైన, నృపఇవ = రాజువలె - సార్వభౌమునివలె ననుట, సుఖం = సుఖముగా, శేతే=నిదురించుచున్నాఁడు. రూపకసంకీర్ణ మైనయుపమ యలంకారము. ఉపమానమగు నృపునికంటె నుపమేయమగు మునికి అపరిచ్ఛిన్నమైన

శయ్యాదిసంపత్తివలన నాధిక్యము ప్రతీతమగుటచే వ్యతిరేకము వ్యంజిత మయ్యెడిని గాన నలంకారముచే నలంకారధ్వని.

చ. ధరణి విశాలతల్ప ముపధానము బాహువు నింగి చందువా
సురఁటులు గంధవాహములు శోభనదీపము చందురుండుగా
విరతివధూమణిం గలసి వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగి శయనించు మహీపతిమాళిక్రైవడిన్. 94

తా. మునికి నేల పఱపైనసెజ్జ; తీఁగలవలె నిడుదయైన బుజము తలయంపి; మిన్ను మేలుకట్టు; ఇంపుగా వీచుచున్నగాలియే వీవన; చందురుఁడే దీపము; (అయత్నసిద్ధములును అపరిచ్ఛిన్నములునైనయిట్టిశయ్యాదులు కలవాఁడై) విరక్తి యనెడి కాంతతోడిసంభోగమువలన సంతుష్టుఁడై శమముం గాంచి యాముని యఖండైశ్వర్యసంపన్నుండైనసార్వభౌమునిం బోలి హాయిగా నిదురించును.

అవ. యోగిస్వరూపమును నిరూపించుచున్నాఁడు.

శ్లో॥ భిక్షాశీ జనమధ్యసఙ్గరహితః స్వాయత్తచేష్టః సదా
హానాదానవిరక్తమార్గనిరతః కశ్చిత్తపస్వీ స్థితః।
రథ్యాకీర్ణవిశీర్ణజీర్ణవసనై రాస్యూతకన్థాధరో
నిర్మానో నిరహఙ్కృతిః శమసుఖాభోగైకబద్ధస్పృహః॥ 95

టీ. భిక్షాశీ=బిచ్చమును దినువాఁడును-భిక్షాన్నమాత్రభోజనముచే దేహధారణము సేయువాఁడు, జన...రహితః-జనమధ్య=జనులనడుమ, సఙ్గరహితః=ఆసక్తి లేనివాఁడును-జనులనడుమనుండియు వారియందుఁ దగులులేనివాఁ డనుట,సదా=ఎప్పుడును, స్వాయత్తచేష్టః=తనకులోనైనవ్యాపారములు గలవాఁడు-తననియమమునకు లోనైనయింద్రియవ్యాపారములు గలవాఁ డని యర్థము-జితేంద్రియుఁడని భావము, హానా...నిరతః-హాన=విడుచుట, ఆదాన= కయికొనుట, అనెడి యీరెంటియెడ, విరక్త=రక్తిలేని-ఉదాసీనమైన, మార్గ=మార్గమందు-నడవడియందు,నిరతః=ఆసక్తుఁడైనవాఁడును-'నిస్త్రైగుణ్యేపథివిహరతాం కోవిధిఃకోనిషేధః.'అన్నట్లు ఇది హేయము ఇది యుపాదేయ మనుబుద్ధిలేనివాఁడును,రథ్యా...వసనైః-రథ్యా=పెద్దమార్గము లందు, కీర్ణ-పాఱవైవంబడినవియు, విశీర్ణ=చినిఁగినవియు, జీర్ణ=ప్రాఁతవియు నగు, వసనైః=గుడ్డలచేత, ఆస్యూత=అంతటఁ గుట్టంబడిన, కన్థా=బొంతను, ధరః=ధరించువాఁడను, ('రథ్యాకీర్ణవిశీర్ణజీర్ణవసనః సంప్రాప్తకన్థాసనః' అనుచో, మార్గములందు పాఱవైవంబడిన చినిఁగిన ప్రాఁతవస్త్రములను గలవాఁడును, ప్రాప్తించినబొంతయే యాసనముగాఁ గలవాఁడును-అనఁగా బొంతను నాలుగు మడతలుగా మడచి

క్రిందఁ బఱచుకొని కూర్చున్నవాఁడును, అని యర్థము), కావుననే, నిర్మానః=అభిమానము లేనివాఁడు-తన్ను గొప్పగా నెన్నుకొననివాఁడనుట, నిరహంకృతిః=అహంకారము లేనివాఁడును, శమ...స్పృహః-శమ = (వైరాగ్యముచే మనస్సు వికారము నొందకుండుట యనెడి) శమమువలని, సుఖ=సుఖముయొక్క, ఆభోగ = విస్తారమునందు, లేక, సుఖ=సుఖమును, ఆభోగ=అనుభవించుటయందు, ఏక=ముఖ్యముగా, బద్ధ=పట్టుకొన్న, స్పృహః=స్పృహగలవాఁడును-అగు, తపస్వీ=తపస్సంపన్నుఁడు-యోగీశ్వరుఁడు, కశ్చిత్=ఒకానొకఁడు - ఎవఁడోయొకఁడే యనుట, స్థితః=ఉన్నవాఁడు-కానఁబడుచున్నాఁ డని భావము. అలం. స్వభావోక్తి.

శా. హీనాదానవిరక్తమార్గనిరతుం డక్షయ్యభిక్షాశి స్వా
ధీనారంభుఁడు లోకసంగదురితాతీతస్వభావుండు ర
థ్యానిక్షిప్తవిశీర్ణవస్త్రికృతకంథాసీనుఁ డాత్మాక్షర
ధ్యానాసక్తుఁ డొకానొకండు విగతాహంకారుఁడొప్పారు భువిన్.

తా. బిచ్చముచేతనే దేహయాత్రగడపుచు, జనులనడుమనుండియు వారియందుఁ దగులులేక, యింద్రియవ్యాపారముల లోఁబఱుచుకొని, హేయ మిది యుపాదేయ మిదియనుతలంపు మాలి, మార్గములందు పాఱవైవంబడి చినిఁగియున్న ప్రాఁతపేలికలతోఁ గుట్టినబొంతను గట్టుకొని యభిమానమును నహంకారమును లేక, శమమువలనియానందాతిశయము ననుభవించుటయందే కోరిక గలవాఁడైనతపస్వి యెవఁడో యొకఁడే యరుదుగాఁ గనుపట్టుచున్నాఁడు.

అవ. యోగులకు మానావమానములు రెండును సమములనుచున్నాఁడు.

శ్లో॥ చణ్డాలః కి మయం ద్విజాతి రథవా శూద్రోఽథ కిం తాపసః
కిం వా తత్త్వవివేకపేశలమతి ర్యోగీశ్వరః కోఽపి కిమ్।
ఇత్యుత్పన్నవికల్పజల్పముఖరై రాభాష్యమాణా జనై
ర్నక్రుద్ధాః పథి నైవ తుష్టమనసో యాన్తి స్వయం యోగినః॥96

టీ. అయం=వీఁడు-ఈ కనఁబడుచున్నవాఁ డనుట, చణ్డాలః కిం=చండాలుఁడా యేమి? అథవా=లేక, ద్విజాతిః వా=బ్రాహ్మణుఁడా, అథ=లేక, కింశూద్రోవా=శూద్రుఁడా, తాపసః కింవా=తపసియా, తత్త్వ...మతిః-తత్త్వ=పరమార్థమును, వివేక=పర్యాలోచించుటయందు, పేశల=నేర్పుగల, మతిః=బుద్ధిగలవాఁడైన, కోఽపి=ఒకానొక, యోగీశ్వరః=గొప్పయోగియా, ఇతి=అనియిట్లు, ఉత్పన్న...ముఖరైః-ఉత్పన్న=పుట్టిన, వికల్ప = సందేహములను, జల్ప=వదరుటచేత, ముఖరైః=

ప్రోఁగుచున్న-ఇట్టి సందేహపుఁబలుకులు పలుకుచున్న యనుట, జనైః=జనులచేత, పథి=మార్గమునందు, ఆభాష్యమాణాః=అధిక్షేపింపఁబడినవారు-లేక, సంభాషింపఁబడినవారు, అయ్యును, నక్రుద్ధాః=కోపించినవారును గాక-చండాలత్వాదుల నాక్షేపించుటవలన ననుట, నైవతుష్టమనసః=సంతోషించినమనస్సులు గలవారును గాక-ద్విజాతిత్వాదుల నాక్షేపించుటచే ననుట, *యోగినః=యోగులు, స్వయం=తమంతఊరక యనుట, యాన్తి=పోవుదురు-బ్రహ్మనిష్ఠులగుటచే నేయాక్షేపములను బాటింపరని భావము.

ఉ. మాలఁడొ వీఁడు విప్రకులకమండనుఁడో మఱి శూద్రుఁడో తప
శ్శీలుఁడొ సిద్ధుఁడో యనుచుఁ గెంతలఁ జేరి వికల్పజల్పవా
చాలజనంబు లాడఁగ వెకసం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురు గారు మిన్నక భువిన్ విహరింతురు యోగిపుంగవుల్.

తా. జనులు దారియందుఁ బోవుచున్నయోగులను జూచి వీఁడెవఁడు చండాలుఁడా? బ్రాహ్మణుఁడా? శూద్రుఁడా? తపస్వియా? పరమార్థమును వివేచించుబుద్ధిగల యెవఁడో నొకయోగీశ్వరుఁడా? యని సందేహములు కలిగి త మ్మాక్షేపింపఁగా వారు కోపముగాని సంతోషముగాని లేక యూరక తమదారిని బోవుదురు.

అవ. యోగులు హింసాదిరహితవృత్తులై యుండుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ హింసాశూన్య మయత్నలభ్య మశనం ధాత్రా మరుత్కల్పితం
వ్యాళానాం పశవ స్తృణాఙ్కురభుజః సృష్టాః స్థలీశాయినః।
సంసారార్ణవలఙ్ఘనక్షమధియాం వృత్తిః కృతా సా నృణాం
యా మన్వేషయతాం ప్రయాన్తి సతతం సర్వే సమాప్తిం గుణాః.

టీ. హింసాశూన్యం=హింసలేనిదియు-ఇతరప్రాణులను వధించి పడయునట్టిది కానిది యనుట, అయత్నలభ్యం=యత్నములేక దొరకఁదగినదియు-అనాయాసముగా దొరకునది యనుట, అశనం=ఆహారము, వ్యాళానాం=సర్పములకు, ధాత్రా=బ్రహ్మచేత, మరుత్=గాలి- గాలిరూపముగా ననుట, కల్పితం=నిర్మింపఁబడినది. స్థలీశాయినః=అకృత్రిమమైన ప్రదేశమునఁ బరుండునట్టి, పశవః=పశువులు, తృణఅఙ్కురభుజః=గడ్డిమొలకలు దినునవిగా, సృష్టాః=నిర్మింపఁబడినవి, వ్యాళములును బశువులును బుద్ధివివేకము లేనివి గాన వాని తెలివికిం దగినట్లు సులభముగా దొరకఁ

* ఈయోగులే 'నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజే త్ప్రాప్యచాప్రియమ్। స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః । జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ॥ యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః' అని గీతయందును జెప్పఁబడిరి.

దగిన యాహారములు బ్రహ్మచే నిర్మితము లైనవి, ఇఁక బుద్ధిసంపన్ను లైన మనుష్యుల కెట్లు నిర్మించెనో చెప్పుచున్నాఁడు. సంసా... ధియామ్-సంసారార్ణవ=సంసారమనెడి సముద్రమును, లఙ్ఘన= దాఁటుటయందు, క్షమ=శక్తిగల, ధియాం=బుద్ధిగలవారైన-పశువ్యాళములవలెఁగాక సంసారమును దరింపఁ జాలినట్టి బుద్ధిని బడసినవారైన, నృణాం=మనుష్యులకు, సా=ఆ, వృత్తిః=జీవిక-బ్రతుకు, కృతా=చేయఁబడినది, యాం=దేనిని-ఏవృత్తి ననుట, అన్వేషయతాం=వెదకువారికి-పొందఁగోరువారికి, సతతం=ఎప్పుడును, సర్వేగుణాః=(విద్వత్తు నేర్పు మొదలైన) సమస్తగుణములును, సమాప్తిం=ముగియికను-పూర్తిని-పూర్ణముగా నెఱపఁబడుటను, ప్రయాన్తి=పొందునో, (సావృత్తిః) ఆవృత్తి, చేయఁబడిన దని పూర్వముతో నన్వయము. బ్రహ్మబుద్ధిసంపన్నులైన మనుష్యులకు వారిగుణము లన్నియు సంపూర్ణముగ నెఱపి కష్టపడి సాధింపఁ దగినట్టి బ్రతుకును నిర్మించినాఁడు. వ్యాళాదులు బుద్ధిహీనములు కాన వానికి నప్రయత్నలభ్యములైన యాహారములను గల్పించినాఁడు. మనుష్యులు కష్టమగు తమబ్రతుకు జరపుటకుఁ దమశక్తులన్నియు నెఱపి యందే మగ్ను లైయుండవలసియున్నది కాన నిత్యానందమునకై పాటుపడుటకు వారి కవకాశ మెక్కఁడిదని భావము.

చ. చిలువల గాలిమేపరులఁ * జేసి తృణాంకురభోజనంబు భూ
  తలశయనంబు గోవులకుఁ * దామరచూలి విధించెఁ దత్త్వపే
  శలమతు లైనవారలకు * సన్నుతవృత్తి ఘటించె దానిచేఁ
  దొలఁగు రజస్తమోజనిత*దోషము లెల్ల భజించువారికిన్. 97

* తా. సర్పములును నేలలం బరుండుపశువులును బుద్ధివివేకము లేనివి గాన బ్రహ్మ వానికి నే ప్రాణిహింసయు లేక సుఖముగా దొరకునట్టి గాలిని గడ్డిపోఁచలను

---

* ఈశ్లోకము మనుష్యసామాన్యవిషయ మైనదిగాని యోగివిషయము కాదు. ఆయినను దీనిని యోగివిషయముగా నర్థము వ్యాఖ్యాత పాఠాంతరముచే కల్పించి యీదశకమునం జేర్చినాఁడనితోఁచెడి. ఈ సార మంతగా సంభావ్యము కాకున్నను బ్రకరణముంబట్టి వ్యాఖ్యాత చేసినయర్థము తెలుపుట యావశ్యకము. ఈయర్థమున 'యామన్వేషయతామ్' అనుచో 'తామన్వేషయతామ్'అని పాఠాంతరము. మొదటి సగమునకుఁ బూర్వోక్తమైనయర్థ మెగ్రాహ్యము. రెండవసగమునకర్థాంతర మెట్లన; సంసారార్ణవలంఘనక్షమబుద్ధు లగునరులకు, సా=ఆ- పూర్వోక్తమైన-పూర్వశ్లోకములందు వర్ణితమైన, వృత్తిః=బ్రతుకు, కృతా=కావింపఁబడినది, తాం=ఆవృత్తిని,

వరుసగా నాహారముగాఁ గల్పించినాఁడు. సంసారమును దరింపఁజేయునట్టి బుద్ధిం బడసిన మనుష్యులకో వారిశక్తులన్నియుఁ బూర్ణముగా నెఱపి పడయుందగినట్టిబ్రతుకును గావించినాఁడు.

అవ: నివృత్తిప్రకారమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ గఙ్గాతీరే హిమగిరిశిలాబద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య।
కిం తైర్భావ్యం మమ సుదివసైర్యత్ర తే నిర్విశఙ్కాః
కణ్డూయన్తే జరఠహరిణాః స్వాఙ్గమఙ్గే మదీయే॥ 98

టీ. గఙ్గాతీరే=గంగానదిగట్టునందు, హిమ...పద్మాసనస్య- హిమగిరిశిలా=హిమవంతముయొక్క ఱాతిబండయందు, బద్ధ=రచింపఁబడిన, పద్మాసనస్య=పద్మాసనముగలవాఁడును-రెండుపాదములును దొడలమూల లంగుంచుకొని కూర్చుండుట పద్మాసనము, బ్రహ్మ...విధినా- బ్రహ=బ్రహ్మముయొక్క, ధ్యాన=ధ్యానమును, అభ్యసన=అభ్యసించుట-అలవాటు, విధినా=చేయుటచేత, యోగనిద్ర=సంప్రజ్ఞాత సమాధిని, గతస్య=పొందినవాఁడును, అగు, మమ=నాకు, తైః=ఆ, సుదివసైః=పుణ్యదినములచేత, భావ్యం కిం=అవునాయేమి-అట్టిపుణ్యదినములను నేను జూతునా యేమి యనుట, యత్ర=ఏదినములందు, తే=ఆ, జరఠహరిణాః=ముసలిజింకలు, నిర్విశఙ్కాః సన్తః=జంకులేని వగుచు, స్వఅఙ్గం=తమశరీరమును, మదీయేఅఙ్గే=నాదైనశరీరమునందు, కణ్డూయన్తే=గీఁకునో-ఆదినములు కలుగునా యని పూర్వముతో నన్వయము.

ఉ. శ్రీసురసింధుతీరమున ♦ శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసనవర్తినై శివు నుపాస్తి యొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్ననాతనువుపైఁ దమమేనులఁ తీఁట దీఱ న
త్రాసములై కురంగములు ♦ రావులుసేయుట గల్గునేకదా. 98

తా. గంగానదీతీరంబున హిమగిరియందలి యొకఱాతియందుఁ బద్మాసనము వైచుకొని కూర్చుండి బ్రహ్మధ్యానము నలవాటు సేయుచు యోగసమాధి నొందినవారై యుండఁగా నందలిముసలిజింకలు కదలమెదలకున్న నన్నుఁ జూచి జంకుమాలి తమమేనులు నామేనియందుఁ దీఁటవోవ రాయుచు నుండఁగాఁ గడచునట్టి పుణ్యదినములు నాకుఁ గలుగునా యేమి?

---

అన్వేషయతాం=వెదకునట్టి వారికి-రజస్తమోదోషముల నిరసించిన యోగుల కనుట, సర్వేగుణాః=సమస్తగుణములును, సతతం=ఎప్పుడును,సమాప్తిం=నాశమును,ప్రయాన్తి=పొందును. అట్టివృత్తి నాచరించువారు'మనవృత్తు లీశ్వరుండు జాగరూకుఁడై నెఱపుచుండును. అందులకై మనగుణములు నెఱపనక్కఱలేదు' అని తలఁచి వర్తింతురు గాన వారిగుణములు నెఱపఁబడమింజేసి యుండియు నశించినవే యగు నని భావము.

అవ. కేవలము సర్వసంగపరిత్యాగమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్ష మక్షయ్య మన్నం
విస్తీర్ణం వస్త్ర మాశాదశక మపమలం తల్ప మస్వల్ప ముర్వీ ।
యేషాం నిస్సఙ్గతాఙ్గీకరణపరిణతస్వాన్తసన్తోషిణ స్తే
ధన్యాః సంన్యస్తదైన్యవ్యతికరనికరాః కర్మనిర్మూలయన్తి॥ 99

టీ. పాణిః=చేయియే, పవిత్రం=పరిశుద్ధమైన, పాత్రం=పాత్రయు, భ్రమణపరిగతం=తిరుగుటచేత కలిగిన-తిరిపమెత్తుటచే దొరకిన యనుట, భైక్షం=భిక్షాసమూహము, అక్షయ్యం=తఱుఁగని, అన్నం=ఆహారమును, ఆశాదశకం=పదిదిక్కులు, అపమలం=మురికిలేనిదియు, విస్తీర్ణం=విరివియైనదియు, అగు, వస్త్రం=వలువయు, ఉర్వీ=భూమి, అస్వల్పం=కొంచెముకాని-పెద్దదియైన, తల్పం=పడుకయు, యేషాం=ఎవ్వరికో, నిః సఙ్గ...తోషిణః-నిస్సఙ్గతా=అనాసక్తిని-సంగము లేమిని, అఙ్గీకరణ=కయికొనుటచేత, పరిణత=పరిపక్వమయిన, స్వాన్త=మనస్సుచేత, సన్తోషిణః=సంతుష్టులైన, తే=ఆ, ధన్యాః=ధన్యులు, సంన్యస్త...నికరాః- సంన్యస్త=విడువఁబడిన, దైన్య=దీనత్వమువలని, వ్యతికర=వ్యసనములయొక్క, నికరాః సన్తః=సమూహములు గలవారగుచు, 'అథవ్యతికరః పుంసివ్యసనవ్యతిషఙ్గయోః' అని మేదిని, కర్మ=కర్మమును, నిర్మూలయన్తి=నాశము సేయుదురు.

ఉ. పాత్రము పాణిపంకజము భైక్షము భోజ్య మనల్పతల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరిధాన మగుచు భువి నేరి కానుచా
రిత్రు లసంగతాగుణధురీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశములఁ బాసి దహింతురు కర్మబీజమున్.99

తా. చేయియే పరిశుద్ధమైన పాత్రగాను, తిరిప మెత్తి తెచ్చికొన్న బిచ్చమే తఱుఁగని యన్నముగాను, పదిదిక్కులే విఱివియై మురికిలేనట్టి వలువగాను, పుడమియే పెనుఁబఱపుగాను గలిగి, సంగమును మానుటవలన పరిపాకము నొందినమనస్సు గలిగి సంతసిలుచుండు పుణ్యాత్ములు దైన్యమువలనఁ గలుగువ్యసనము లన్నియుఁ బరిత్యజించి జన్మపరంపరలం గూర్చు కర్మబంధము నెల్ల నిర్మూలము సేయుదురు.

అవ. పంచభూతములను వేఁడుకొని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మాత ర్మేదిని తాత మారుత సఖే తేజః సుబన్ధో జల
భ్రాత ర్వ్యోమ నిబద్ధ ఏష భవతా మన్త్యః ప్రణామాఞ్జలిః ।
యుష్మత్సఙ్గవశోపజాతసుకృతస్ఫారస్ఫురన్నిర్మల
జ్ఞానాపాస్తసమస్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి॥ 100

టీ. హేమాతః=ఓతల్లీ, మేదిని=భూమీ, హేతాత=ఓతండ్రీ, మారుత=వాయూ, హేసఖే=ఓచెలికాఁడా, తేజః=తేజమా, హేసుబన్ధో=ఓమంచిచుట్టమా, జల=జలమా, హేభ్రాతః=ఓతోఁబుట్టువా, వ్యోమ=ఆకాశమా, భవతాం=మీకు, అంత్యః=కడపటిదైన, ఏషః=ఈ, ప్రణామ అఞ్జలిః=నమస్కారముయొక్క చేమోడ్పు -నమస్కారముకొఱకైనచేమోడ్పనుట, నిబద్ధః=రచింపఁబడినది, యుష్మ...మహిమా-యుష్మత్ సఙ్గ=మీకూడికయొక్క, వశ=అధీనతచేత, ఉపజాత=పుట్టిన,సుకృత=పుణ్యముచేత, స్ఫార=అధికమును, స్ఫురత్=ప్రకాశించుచున్నదియు, నిర్మలం=పరిశుద్ధమైనదియు, అగు, జ్ఞాన=జ్ఞానముచేత, అపాస్త=దూరముగా విడువఁబడిన, సమస్త=సకలమైన, మోహ=అజ్ఞానముయొక్క, మహిమా సన్=అతిశయము గలవాఁడ నగుచు,(అహం=నేను), పరబ్రహ్మణి=పరబ్రహ్మమునందు-సచ్చిదానందస్వరూపమై నిర్వికారమై నిష్కళంకమై నిరంజనమై యొప్పుబ్రహ్మమునం దనుట, లీయే=లీనుఁడ నగుచున్నాను.

మ. జననీ మేదిని తాత మారుత వయస్యా వహ్ని చుట్టంబ జీ
 వనమా సోదర తారకాపథమ భవద్వ్యప్రేమ సంధిల్ల మీ
 కొనరింతుం జరమప్రణామము భవద్యోగస్ఫురత్పుణ్యసం
 జనితజ్ఞాననిరస్తమోహతతి నైక సద్బ్రహ్మముం బొందెదన్.100

తా. తల్లివగుభూమీ! తండ్రివైన వాయూ! చెలివగుతేజమా! మంచిచుట్టమవగుజలమా! తోఁబుట్టువగునాకాశమా! యిదె మీకుఁ గడపటిసారి చేమోడ్చి మ్రొక్కెద. మీతోడికూడికవలనఁ గలిగిన సుకృతముచే నాకు మిక్కిలియుఁ బ్రకాశించుచున్న విమలజ్ఞాన ముప్పతిల్లఁగా దానిచే నజ్ఞానమంతయు నశించినవాఁడనై యానందస్వరూప మగుపరబ్రహ్మమందు లీనుండ నయ్యెద.

ఇది వైరాగ్యశతకమునందు అవధూతచర్య యన్నది దశమదశకము.

---

## భర్తృహరిసుభాషితము - అధికశ్లోకములు.

---

అవ. నిరతిశయమగు బ్రహ్మానందమునకుఁ బరిమితమగు నింద్రవిభవమును సాటి గా దనుచున్నాఁడు.

శ్లో॥ వివేకవ్యాకోశే వికసతి శమే శామ్యతి తృషా
 పరిష్వఙ్గే తుఙ్గే ప్రసరతితరాం సా పరిణతిః।
 జరాజీర్ణైశ్వర్యగ్రసనగహనాక్షేపకృపణః
 కృపాపాత్రం యస్యాం భవతి మరుతామప్యధిపతిః॥ 1

టీ. వివేకవ్యాకోశే=వివేకముచేత విరిసిన-వివేకముచేఁ బరిణమించినయనుట, శమే=శమము-శమ మనఁగా శ్రవణమననదిధ్యాసములుతప్పఁ దక్కినవానినుండి మనస్సును నిగ్రహించుట, వికసతి=వికసిల్లుచుండఁగా, తుఙ్గే=పొడవైన-దృఢమైన యనుట, తృషాపరిష్వఙ్గే=తృషయొక్క కౌఁగిలి, శామ్యతిసతి=తీసిపోవుచుండఁగా-శమముపెరిఁగి తృషయొక్కపట్టు వీడఁగా ననుట, సా=ఆ, పరిణతిః=నిరతిశయసుఖ రూపమైన పరిపాకము, ప్రసరతితరాం=మఱింత విస్తరిల్లుచున్నది, ఆపరిణతి యెట్టి దనఁగా, యస్యాం=దేనియందు-ఏపరిణతియందు, జరా...కృపణః-జరా=ముదిమిచే-ఇంద్రత్వము నిత్యమైనదికాక కాలపరిమితి గలది గనుక నిట జర యనఁగా ముదిమి కాక యామితి సమీపించుట యని తెలియునది,దానిచే, జీర్ణ=ప్రాఁతగిలిన-ఇంద్రుని తోనే యాతనియైశ్వర్యమును దీసిపోవును గాని నతనికాలము సమీపింపఁగాఁ దాను ను దీసిపోవునట్టియనుట-శాశ్వతము కానిదైన యనిభావము, ఐశ్వర్య=ఐశ్వర్యమును, గ్రసన=అనుభవించుటచేతనైన, గహన=తెలియనలవికాని, ఆక్షేప=వ్యాకులతచేత-లేక, నిందచేత, కృపణః=దీనుఁడైన-అనిత్యమై పసచెడి తూలునైశ్వర్యము నే యను భవించుటవలన మిక్కిలి దీనతనొందినయనుట,మరుతా మధిపతిరపి=దేవేంద్రుఁడును, కృపాపాత్రం=కనికరమున కాస్పదము, భవతి=అగునో, సాపరిణతిః అని పూర్వ ముతో నన్వయము. ఇంద్రునియైశ్వర్యమును అతనికి అస్థిర మైనది గాన దుఃఖకర మగుచున్నది. కాఁబట్టి, యది తృష వీడి శమము వికసిల్లునప్పుడు గలుగు నిరతిశయ సుఖరూపమైన పరిణతితో సాటిగాదని భావము.

మ. శమముం జారువివేకయుక్తిని వికాసంబొందఁగాఁ దృష్ణ దు
 శ్శమమౌపట్టును వీడఁగాఁ గలుగు నాసౌఖ్యాతిరేకంపుఁబా
కమునుం జూడ జరావిజీర్ణవిభవగ్రాసాగతాక్షేపవి
శ్రమదీనం బగువేల్పుఱేనిదశయుఁ జాలిం దగం జేయదే. 1

---

అవ. చదువు నానాఁట దురుపయోగముపాలై చెడుటను చెప్పుచున్నాఁడు.

శ్లో॥ పురా విద్వత్తాఽసీదుపశమవతాం క్లేశహతయే
గతా కాలేనాసౌ విషయసుఖసిద్ధ్యై విషయిణామ్।
ఇదానీం తు ప్రేక్ష్య క్షితితలభుజః శాస్త్రవిముఖా
నహో కష్టం సాపి ప్రతిదిన మధోఽధః ప్రవిశతి॥ 2

టీ. పురా=తొల్లి, విద్వత్తా=పాండిత్యము, ఉపశమవతాం=శాంతిపరుల యొక్క, క్లేశహతయే=దుఃఖమునశించుటకొఱకు, ఆసీత్=ఉండెను, కాలేన=దీర్ఘ

కాలముచే-బహుకాలము కడవఁగా, అసౌ=ఇది, విషయిణాం=విషయలోలురయొక్క, విషయసుఖసిద్ధ్యై=విషయసుఖముల నొడఁగూర్చుటకొఱకు, గతా=పోయినది-ప్రవర్తించినది, ఇదానీంతు=ఇప్పుడో, క్షితితలభుజః=రాజులను, శాస్త్రవిముఖాన్=శాస్త్రపరాఙ్ముఖులనుగా, ప్రేక్ష్య=చూచి, సా=అదియు, ప్రతిదినం=నాఁడునాఁటికి, అధోఽధః=క్రిందుగా క్రిందుగా-మిక్కిలి క్రిందుగా, ప్రవిశతి=పోవుచున్నది. రాజులు పరాఙ్ముఖులై తన కాశ్రయ మీయనందున నిపుడు నానాఁటికిఁ గ్రిందుపడుచున్న దని భావము.

చ. చదు వది తొల్లి శాంతిపర సంతతి వంతలఁ బాచుచుండె దాఁ
బదపడిఁ గామలోలజన పాలిసుఖంబులు గూర్పఁజొచ్చె న
య్యది మఱి శాస్త్రదూరమతు లౌపతు లిప్పు డుపేక్ష సేయఁగాఁ
బొదుపఱి నాఁడునాఁటికిని బ్రుంగుచుఁ గ్రుంగుచు నున్నదక్కటా.

---

అవ. ఒకవిరక్తుఁడు చేసికొను నిశ్చయమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అతిక్రాన్తః కాలో లటభలలనాభోగసుభగో
భ్రమన్తః శ్రాన్తాః స్మః సుచిర మిహ సంసారసరణౌ।
ఇదానీం స్వఃసిన్ధో స్తటభువి సమాక్రన్దనగిరః
సుతారైః ఫూత్కారైః శివశివశివేతి ప్రతనుమః॥ 3

టీ. లటభలలనా భోగసుభగః=మనోజ్ఞలైన స్త్రీలను అనుభవించుటచే రమణీయమైన, కాలః=కాలము, అతిక్రాన్తః=అతిక్రమింపఁబడినది-కడచినది, ఇహ=ఈ, సంసారసరణౌ=సంసారమనెడి మార్గమునందు, సుచిరం=దీర్ఘకాలము, భ్రమన్తః=తిరుగుచు, శ్రాన్తాఃస్మః=అలసినవార మగుచున్నారము, ఇదానీం=ఇప్పుడు, స్వఃసిన్ధోః=గంగయొక్క, తటభువి=గట్టునందలి ప్రదేశమున, సుతారైః=మిక్కిలి నిడుదలగు, ఫూత్కారైః సహ=ఫూత్కృతులతో-నిట్టూర్పులతో ననుట, ఇది ఖేదసూచకము, శివశివశివఇతి=శివశివశివ యని, సమాక్రన్దనగిరః=పిలుపులుకులను-శివశివా యని బిగ్గరఁ బిలుచుపిలుపులను, ప్రతనుమః=మిక్కిలి జరుపుదుము.

ఉ. చారుముఖీసుఖైకరతి జా నగుకాలము వోవుడెంచె సం
సారపుఁద్రోవఁ ద్రిమ్మరుటఁ జాలశ్రమంబును గల్గె నింకఁ బూ
త్కారపురస్సరంబుగను దైవతరంగిణితీరసీమ నే
పారు నెలుంగునన్ శివశివా యని కూయిడువార మెంతయున్.

---

శ్లో॥ అహో ధన్యాః కేచిత్త్రుటితభవబన్ధవ్యతికరా
వనాన్తేఽచిన్వన్తో విషమవిషయాశీవిషగతిమ్।
శరచ్చన్ద్రజ్యోత్స్నాధవళగగనాభోగసుభగాం
నయన్తే యే రాత్రిం సుకృతచయచిన్తైకశరణాః॥ 4

టీ. అహో=ఔరా, త్రుటిత భవబన్ధవ్యతికరాః=త్రెస్సిన సంసారమనెడి బంధముయొక్క సంబంధము గలవారును, విషమవిషయ ఆశీవిషగతిమ్=కఠినములైన యింద్రియార్థము లనెడి సర్పములమార్గమును, అచిన్వన్తః=వెదకనివారును- ఇంద్రియార్థముల త్రోవఁబోవనివారనుట, సుకృతచయచిన్తా ఏకశరణాః=పుణ్యముయొక్క వృద్ధినిగుఱించినచింతయే ముఖ్యమైనయాశ్రయముగాఁ గలవారును, అగుచు, వనాన్తే=వనమధ్యమున, శర...సుభగాం-శరత్ చంద్ర జ్యోత్స్న=శరత్కాలపుచంద్రునివెన్నెలచేత,ధవళ=తెల్లనైన,గగన ఆభోగ=ఆకసమువిటివిచేత విటివియగు నాకాశప్రదేశముచేత, సుభగాం= మనోహరమైనదగు, రాత్రిం=రేయిని, యే=ఎవరు, నయన్తే=కడపుదురో, (తే) కేచిత్=ఆ కొందఱు, ధన్యాః = ధన్యులు, అహో= ఔరా-సంసారబంధము తెగి విషయములదెసఁ బోక పుణ్యమును గూర్చుటయందే చింతగలిగి వనమునకుఁ బోయి శరత్కాలపువెన్నెలచేఁ దెల్లనగుచున్ననఁ జెన్నారు రాత్రిఁ గడపునట్టికొంద అంతధన్యు లని యర్థము.

ఉ. దారితబంధులై విషయదారుణసర్పవిమార్గదూరులై
భూరితపోవనంబునను బుణ్యాచయైకపరాయణాత్ములై
శారదచంద్రికాధవళచారునభోపరిభాసమానమై
వారక వెల్గురేల్ గడపువారలు మాయురె యెంతధన్యులో.

---

శ్లో॥ మహాదేవో దేవః సరి దపిచ సై వామరసరి-
ద్గుహా ఏవాగారం వసనమపి తా ఏవ హరితః।
సుహృద్వా కాలోఽయం వ్రత మిద మదైన్యవ్రత మితి
కియద్వా వక్ష్యామో వటవిటప ఏవాస్తు దయితా॥ 5

టీ. మహాదేవః=శివుఁడే, దేవః=దేవుఁడు, సా అమరసరిత్ ఏవ=ఆదేవనది యగు గంగయే, సరిత్=నది, గుహాఏవ=గుహయే, అగారం=ఇల్లు, తా దిశః ఏవ= ఆదిక్కులే, వసనమపి=వస్త్రమును, అయం కాలః=ఈమృత్యువే, సుహృత్=చెలికాఁడు, ఇదం=ఈ,అదైన్యవ్రతం=యాచించుటయనెడిదీనత్వము లేకుండుట యను వ్రతమే, వ్రతం=వ్రతము, ఇతి=అని, కియద్వా=ఎంతదా, వక్ష్యామః=చెప్పఁగల ము-లేక, కియత్=కొంచెము, వక్ష్యామః=చెప్పెదము - వేయేల సంగ్రహముగాఁ జెప్పెదమనుట, అది యేదన, వటవిటపః ఏవ=మఱ్ఱిచెట్టే, దయితా=ప్రియురాలు,

అస్తు=(మాకు) అగుఁగాక. గృహస్థాశ్రమమందు దయితయెట్లో విరక్తియోగమందు వటవృక్షమునట్లే ప్రియమైనదనిభావము. వటవృక్షముక్రిందఁ గూర్చుండి శివధ్యానము సేయుదుమనుట.

మ. దివిషద్వాహిని మాకు వాహిని మహాదేవుండె దేవుండు బ
ల్గవియే మాకు గృహంబు నీదశదిశల్ గల్పాగైనపుట్టంబు మృ
త్యువ చూడం జెలికాఁడు సువ్రతము నెంతో యాయదైన్యవ్రతం
బు విచారింపఁగ వేయునేల వటసద్భూభాజంబె కంజాక్షియున్. 5

---

శ్లో॥ జ్ఞానం సతాం మానమదాదినాశనం
కేషాంచిదేత న్మదమానకారణమ్।
స్థానం వివిక్తం యమినాం విముక్తయే
కామాతురాణా మతికామకారణమ్॥ 6

టీ. జ్ఞానం=ఎఱుక, సతాం=సజ్జనులకు, మదమాననాశనం=మదమును అభిమానమును జెఱుపునది, ఏతత్=ఇదియే, కేషాంచిత్=కొందఱికి-కొందఱునీచులకనుట, మదమానకారణం=మదమును అభిమానమునుగలిగించునది, దీనిని సదృష్టాంతముగా నుపపాదించుచున్నాఁడు,వివిక్తం=నిర్జనమైన, స్థానం=స్థానము, యమినాం=జితేంద్రియులకు, విముక్తయే=ముక్తికొఱకు, అగును. అదియే, కామాతురాణాం=కాముకులకు, అతికామకారణం=మిక్కిలికామమునకు హేతువు, అగును. నిర్జనస్థానము జితేంద్రియులకు ముక్తియు కామిజనులకుఁ గామమును నెట్లు కలిగించునో యట్లె జ్ఞానమును సజ్జనులకు మదమాననాశమును నీచులకు మదమానోత్పత్తియు కలిగించునని యర్థము.

క. జ్ఞానము మదమానంబుల
మానుచు సుజనులకు నిచ్చు మఱికొందఱకున్
జ్ఞానికిఁ గామికి విజన
స్థానము ముక్తియును రక్తి దా నొసఁగుగతిన్. 6

---

శ్లో॥ శయ్యా శైలశిలా గృహం గిరిగుహా వస్త్రం తరూణాం త్వచః
సారఙ్గాః సుహృదో నను క్షితిరుహాం వృత్తిః ఫలైః కోమలైః।
యేషాం నైర్ఝర మమ్బుపాన ముచితం రత్యైచ విద్యాఙ్గనా
మన్యే తే పరమేశ్వరాః శిరసి యై ర్బద్ధో న సేవాఞ్జలిః॥ 7

టీ. యేషాం=ఎవ్వరికి, శైలశిలా=కొండయందలిఱాయియే, శయ్యా=పడుకయో, గిరిగుహా=కొండయందలిగుహయే, గృహం=ఇల్లో, తరూణాంత్వచః=చెట్ల

పట్టలు-నారలు, వస్త్రం=వలువయో, సారఙ్గాః=జింకలు, సుహృదః=చెలికాండ్రో, క్షితిరుహాం=చెట్లయొక్క, కోమలైఃఫలైః=మెత్తనిపండ్లచేత, వృత్తిః=మనుగడ -ఆపండ్లుదిని బ్రతుకుటయో, నైర్ఝరం=సెలయేటితోఁ జేరినదైన, అమ్బుపానం= జలమునుద్రావుట, ఉచితం=తగినదో, రత్యై=క్రీడకొఱకు, విద్యా అఙ్గనా=విద్యయ నెడిస్త్రీయో, యైః=ఎవరిచేత, శిరసి=తలయందు, సేవాఅఞ్జలిః=ఊడిగముకొఱకైన చేమోడ్పు, బద్ధా న=రచింపఁబడనిదో-ఎవరొకరికి చేమోడ్చి కొలువు సేయరోయనుట, తే=వారు, పరమేశ్వరాః=మిక్కిలియుధన్యులని, మన్యే=నేను దలఁచుచున్నాను- ఈపాడుపొట్టఁ బ్రోచుటకై స్వాతంత్ర్యమును వీడి యొకరిని గొలువక శైలశిలాదులే శయ్యాదులుగాఁ గలిగి కాలముపుచ్చువారే పరమధన్యాత్ములని యర్థము.

చ. శిల దగుశయ్య యిల్లు గుహ చీరయు నార చెలుల్ కురంగముల్
నలు వగుపండ్ల నిర్ఝరజలంబుల మన్కియు మారు కేళికిం
జెలువయు విద్యయై యమరఁ జేతుల నౌదల మోడ్చి యన్యులం
గొలువక యుండువార లె యకుంఠితభూరికృతార్థు లారయన్.7

---

శ్లో॥ సత్యామేవ త్రిలోకీసరితి హరశిరశ్చుమ్బినీవిచ్ఛటాయాం
సద్వృత్తిం కల్పయన్త్యాం తటవిటపిభవైర్వల్కలైః సత్ఫలైశ్చ।
కోఽయం విద్వాన్విపత్తిజ్వరజనితరుజాతీవ దుఃఖాసికానాం
వక్త్రంవీక్షేతదుఃస్థేయదిహినబిభృయాత్స్వేకుటుమ్బేఽనుకమ్పామ్॥

టీ. హర...చ్ఛటాయాం-హరశిరస్ చుమ్బి=శివునితలను తాఁకుచున్న, నీవి =కటివస్త్రముయొక్క, ఛటాయాం=కొంతులుగలదియు-తనకటివస్త్రముకొంతులు శివునిశిరంబున వ్యాపించుట గలదియు, తటవిటపిభవైః=(తన) గట్టునందలి చెట్ల వలనఁ బుట్టిన వైన, వల్కలైః=నారచేతను, సత్ఫలైశ్చ=మంచిపండ్లచేతను, సద్వృత్తిం=మంచిబ్రతుకును, కల్పయన్త్యాం=కల్పించుచున్నదియు-తనకడ నాశ్ర యించినవారికి కట్టుకొనుటకు నారలును దినుటకు బండ్లును నిచ్చి లెస్సగా మనుపు నదియు ననుట, అగు, త్రిలోకీసరితి=మూఁడులోకములనది-గంగ, సత్యామేవ= తప్పక ఉండఁగా, కః అయంవిద్వాన్=ఏ యీవిద్వాంసుఁడు-ఎఱుకగలవాఁ డెవఁడు, దుఃస్థే=కష్టమునందున్న, స్వే=తనయొక్క, కుటుమ్బే=కుటుంబమునందు, అను కమ్పాం=కరుణను, బిభృయాత్ న యది=కలిగియుండఁ డేని విపత్తిజ్వరజనితరుజా= ఆపద (దారిద్ర్య) మనెడిజ్వరముచేఁ బుట్టిన రోగముచేత, అతీవ=మిక్కిలియు, దుఃఖాసికానామ్ (-దుఃఖమాస్తే అసు ఇతి దుఃఖాసికా) =దుఃఖపు స్థితులయొక్క- కష్టసందర్భములయొక్క, వక్త్రం=ముఖమును, వీక్షేత=చూచును. ఎఱుకగలవాఁ డెవ్వఁడుగాని దారిద్ర్యరోగపీడితుఁడై దుర్దశయం దున్న తనకుటుంబమునందు జాలి కలిగియుండుటచేతనే వారలఁ బోషింప కష్టములపాలగుచున్నాఁడుకాని, కానిచో

నాదుఃఖములదిక్కు చూడక గంగాతీరమందలిచెట్లనారలు గట్టికొని వానిపండ్లుతిని యందే సుఖముగా నుండు నని యర్థము.

చ. హరుతల సోఁకుపోఁకముడిఁ యంచితకాంతుల మించుగంగయుఙ్
దరి గలమ్రానిపండులను నారల నల్లగుపోవుఁ జూప నే
వెరవరిగాని పేదటిమిఁ వేదనఁ బొక్కుచు నుక్కుబిడ్డలాం
డ్రుర దయఁజూడకుండినఁ గడుం బెనువంతలదారిఁ దొక్కునే.

---

శ్లో॥ ఉద్యానేషు విచిత్రభోజనవిధి స్తీవ్రాతితీవ్రం తపః
కౌపీనావరణం సువస్త్ర మమితం భిక్షాటనం మణ్డనమ్ ।
ఆసన్నం మరణం చ మఙ్గళసమం యస్యాం సముత్పద్యతే
తాం కాశీం పరిహృత్య హ న్త విబుధై రన్యత్ర కిం స్థీయతే॥ 9

టీ. యస్యాం=ఎందు- ఏకాశియందు, తీవ్రాతితీవ్రం=అత్యంతతీవ్ర మైన, తపః=కృచ్ఛ్రాదిరూపమైన తపస్సు, ఉద్యానేషు=ఎలదోఁటలయందు, విచిత్రభోజన విధిః=వింతలైనభోజనముల ప్రకారముగా, సముత్పద్యతే=అగునో -ఇది మీఁదనెల్లఁ గూర్చుకొనునది-ఎందలి తపస్సు ఎలదోఁటలలోని వింతలైన విందుకుడుపులతో సాటి యగునో యనుట, కౌపీనావరణం = గుహ్యమును గప్పుట - గోఁచి యనుట, సువస్త్రం=మంచివస్త్రముగా- దానితో సాటిగా, అగునో, అమితంభిక్షాటనం= కొలఁదిలేని బిచ్చముకై తిరుగుట, మణ్డనమ్=భూషణముగా- ఎందు బిచ్చమెత్తుటయే యలంకారముగా, అగునో, ఆసన్నం మరణంచ=ధాపించినమరణమును - మరణము డాపించుటయు, మఙ్గళసమం=శుభముతో సాటిగా, అగునో, తాంకాశీం=ఆకాశిని, పరిహృత్య=విడిచి, హన్త=అక్కటా, విబుధైః=ప్రాజ్ఞులచేత, అన్యత్ర=మఱొకచో, కిం=ఏల, స్థీయతే= ఉండుట యగుచున్నది. అట్టికాశిని విడిచి ప్రాజ్ఞులు మఱొకచోట నుండనేల యని యర్థము.

చ. అరిదిమహాతపంబు చెలు వానెలదోఁటలఁ గుడ్పువిందుగా
గరువపుగోఁచి బల్వలువగాఁ దిరిపం బది భూషణంబుగా
మరణముదాపు మంగళసమంబుగ సొంపలరారు నెందు నా
యిర వగుకాశి వీడి బుధు లేటికి నొండొకచోట నుండఁగన్. 9

---

శ్లో॥ నాయం తే సమయో రహస్య మధునా నిద్రాతి నాథో యది
స్థిత్వా ద్రక్ష్యసి కుప్యసి ప్రభు రితి ద్వారేషు యేషాం వచః।
చేత స్తా నపహాయ యాహి భవనం దేవస్య విశ్వేశితు
ర్నిర్దౌవారికనిర్దయో క్త్యపరుషం నిస్సీమశర్మప్రదమ్॥ 10

టీ. చేతః=మనసా, అయం=ఇది, తే=నీకు, సమయః=వేళ, న=కాదు, అధునా=ఇప్పుడు, రహస్యం=ఏకాంతము, నాథః=ఏలిక, నిద్రాతి=నిదురించుచున్నాఁడు, స్థిత్వా=(పోక) నిలిచి, ద్రక్ష్యసియది=చూతువేని, ప్రభుః=ఏలిక, కుప్యతి=కోపించును, ఇతి=అని, వచః=పలుకు, యేషాంద్వారేషు=ఎవ్వరిమొగసాలలందు, కలుగునోయనిశేషము, తాన్=వారిని, అపహాయ=విడిచి, నిర్దౌవారికనిర్దయోక్తి=దౌవారికుల దయలేనిపలుకులు లేనిదియు, కావుననే, అపరుషం=పరుసనిది కానిదియు, కావుననే, నిస్సీమశర్మప్రదమ్ = మేరలేనిసుఖము నిచ్చునదియు, అగు, దేవస్య, విశ్వేశితుః భవనమ్=దేవుఁడగువిశ్వేశ్వరుని యాలయమునుగూర్చి, యాహి=పొమ్ము.

శా. నీకుం గా దిది వేళ మంతనము సూ ♦ నిద్రించెడిఁ నాథుఁడుం
బోకే నిల్చియుఁ జూచితేఁ గినియుఁ బో ♦ పొమ్మన్న యవ్వాకిళుల్
వీఁకన్ వీడి మనంబ వేగ చనుమా ♦ విశ్వేశుసద్మంబుకై
నీకుం గల్గు సుఖంబు కూ్రరు లరయన్ ♦ లేరందు దౌవారికుల్.

---

శ్లో॥ అకిఞ్చనస్య దాన్తస్య, శాన్తస్య సమచేతసః।
సదా సన్తుష్టమనసః, సర్వా స్సుఖమయా దిశః॥ 11

టీ. అకిఞ్చనస్య=ఏమియులేనివాఁడును-పేదయు, దాన్తస్య=బహిరింద్రియములయుపరతి గలవాఁడును, శాన్తస్య = అంతఃకరణము నిగ్రహించినవాఁడును, సమచేతసః=సమమైనమనస్సు గలవాఁడును, సదా=ఎప్పుడును, సన్తుష్టమనసః=సంతోషించినమనస్సు గలవాఁడును, అగువానికి, సర్వాదిశః=దిక్కు లన్నియు, సుఖమయాః=సుఖప్రచురము లైనవి-మిక్కిలియు సుఖ మెటు చూచినను గలుగుననుట-సర్వసుఖములకును గారణమైన సంతుష్టి నొందఁగా అన్నియు మిక్కిలిసుఖములుగానే యుండు నని భావము.

క. దాంతుఁడు నకించనుండును
శాంతుఁడు సమచిత్తవృత్తి ♦ సంయుతుఁడు సదా
సంతుష్టుఁడు నగువానికి
సంతత మెల్లదిశలు సుఖ ♦ సంతతిమయముల్. 11

---

అవ. దారిద్ర్యమునకంటె మరణమే శ్రేయమని తెలుపుచున్నాఁడు.

శ్లో॥ ఉత్తిష్ఠ క్షణ మేక ముద్వహ గురుం దారిద్ర్యభారం సఖే
శ్రాన్త స్తావ దహం చిరం మరణజం సేవే త్వదీయం సుఖమ్।
ఇత్యుక్తో ధనవర్జితేన సహసా గత్వా శ్మశానే శవో
దారిద్ర్యా న్మరణం వరం వర మితి జ్ఞాత్వైవ తూష్ణీం స్థితః॥ 12

టీ. హేసఖే=చెలీ-ఇది శవమును సంబోధించుట, ఉత్తిష్ఠ=లెమ్ము, ఏకం క్షణం=ఒకక్షణముసేపు, గురుం=భరింపరాని, దారిద్ర్యభారం=పేదఱికపుబరువును-నాబరువైనపేదఱికమును, ఉద్వహ=భరింపుము. అహం=నేను, తావత్=ఇప్పుడు, శ్రాన్తః=(సంసారభారమును మోచి) యలసియున్నవాఁడను, మరణజం=మృతివలనఁబుట్టిన, త్వదీయం=నీదయిన, సుఖం=సుఖమును, చిరం=పెద్దకాలము, సేవే=భజించెదను-అనుభవించెద. ఇతి=అని, ధనవర్జితేన=ధనములేనివానిచేత, సహసా=త్వరగనే-దారిద్ర్యమనుభవింపలేక వేగముగా, గత్వా=పోయి, శ్మశానే=శ్మశానమునందు, ఉక్తః సన్ = చెప్పఁబడినదగుచు-పేదవాఁడు శ్మశానమునకు వేగపోయి చెప్పఁగా ననుట, శవః=పీనుఁగు, దారిద్ర్యాత్=పేదఱికమునకంటె,మరణం=చావు, వరంవరం ఇతి=మేలుమేలు అని, జ్ఞాత్వా=తెలిసి, తూష్ణీమేవ=ఊరకయే- పేదవాఁ డడుగు కొన్నందులకు బదులుసెప్పకయే, స్థితః=ఉండినది.

శా. ఆరుం బేద యొకండు ప్రేతమును డాయంబోయియోమిత్రయీ
దారిద్ర్యంబును గొమ్ము లెమ్ము మృతిచేతం గన్నసౌం పిమ్ము వే
సారంజొచ్చితి నంచు వేఁడ శవముం జావెంతయుం మేలుమేల్
దారిద్ర్యంబునకంటె నంచు నదియుం దాఁబల్కకుండెం గడున్.

అవ. స్త్రీలు కపటచిత్తలుగానవారినిద్యజింపఁదగుననుచున్నాఁడు.

---

శ్లో॥ ఏతా హసన్తిచ రుదన్తిచ కార్యహేతో
ర్విశ్వాసయన్తిచ పరం నచ విశ్వసన్తి ।
తస్మాన్నరేణ కులశీలసమన్వితేన
నార్యః శ్మశానఘటికా ఇవ వర్జనీయాః ॥ 13

టీ. ఏతాః=ఈస్త్రీలు, కార్యహేతోః=కార్యార్థము, హసన్తిచ=నవ్వుదురును, రుదన్తిచ=ఏడ్తురును, పరం=ఇతరుని, విశ్వాసయన్తిచ= తమ్ము నమ్మునట్లును జేయుదురు, విశ్వసన్తి నచ=తాము నమ్మరు, తస్మాత్=కాఁబట్టి, కులశీల సమన్వితేన=కులముతోను శీలముతోను గూడియున్న, నరేణ = మనుష్యునిచేత, నార్యః= స్త్రీలు, శ్మశానఘటికాః=ప్రేతభూమియందలి మట్టిపాత్రలవలె,వర్జనీయాః=విడువఁదగినవారు.

తే. చిగురుఁబోఁడులు కార్యంబు కై నిగుడుకొలకు
నగుదు రేడ్తురు నమ్మింతురు కై నమ్మ రొరులఁ
గాన కులశీలవంతుండు కై మానవులయు
నారులను వల్లకాటిపకైనంట్లఁబోలె. 14

---

అవ. సంసారవైచిత్రిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ క్వచి ద్వీణావాదః క్వచి దపిచ హాహేతి రుదితం
క్వచిద్విద్వద్గోష్ఠీ క్వచిదపి సురామత్తకలహః।
క్వచిద్రామా రమ్యా క్వచిదపి గళత్కుష్ఠవపుషో
నజానే సంసారః కిమమృతమయః కిం విషమయః ॥ 15

టీ. సంసారమునందు, క్వచిత్=ఒకచోట, వీణావాదః=వీణియవాయించుట, క్వచిదపిచ=మఱియు నొకచోట, హాహాఇతి రుదితం=హాహాయను నేడ్పు, క్వచిత్=ఒకచోట, విద్వత్ గోష్ఠీ=పండితుల శాస్త్రప్రసంగము, క్వచిదపిచ=మఱొకచోట, సురామత్తకలహః=కల్లుచే మత్తుగొన్నవారి జగడము, క్వచిత్=ఒకచో, రమ్యాః=ఇంపైన, రామాః స్త్రీలు, క్వచిదపి=మఱొకచోట, గళత్ కుష్ఠవపుషః=కాఱుచున్నపులుముగల దేహములు గలవారగు, రామాః=స్త్రీలు, సంసారః=సంసారము, అమృతమయః కిం=అమృతమయమా - వీణావాదవిద్వద్గోష్ఠిరమ్యరామాదులచే సుఖప్రచురమైనదా, విషమయః కిం = రుదితకలహాదులచే దుఃఖప్రచురమా, నజానే=నేనెఱుఁగకున్నాను-పరస్పరవిరుద్ధావస్థలు గానిపించుటచే నిది యిట్టిదని నిశ్చయింపనేరకున్నా ననుట.

చ. ఒకయెడ వీణియల్ మొరయు నొక్కెడ హా యని యేడ్పు విన్చు వే
ఱొకయెడ సూరిగోష్ఠి మఱి యొక్కెడఁ ద్రాగియొనర్చు చివ్వ యొం
డొకట బెడంగుఁ జేడియలు నొక్కటఁ గుష్ఠము గాఱునారు లా
నొకటి యెఱుంగరా దమృతమో మఱి సంసృతి దా విషంబొకో.

శ్లో॥ చలా లక్ష్మీ చ్చలాః ప్రాణా, శ్చలం జీవితయావనమ్।
చలాచలే చ సంసారే, ధర్మ ఏకోహి నిశ్చలః॥ 16

టీ. లక్ష్మీః=సంపద, చలా=చంచలమైనది, ప్రాణాః=ప్రాణములు, చలాః=అస్థిరము లైనవి. జీవితయావనమ్=జీవితమునందు ప్రాయమును, చలం=అస్థిరమైనది, చలాచలే=చంచలమైన, సంసారే=సంసారమునందు, ధర్మః=ధర్మము, ఏకః=ఒక్కటియే, నిశ్చలం=చలనములేనిది-నిత్యమైనది.

క. చలము సిరి చలము ప్రాణము
చల మరయఁగ జీవనంబు జవ్వన మతిచం
చల మగుసంసారమునం
దలఁపఁగ నిశ్చలన మొక్క ధర్మము కాదే. 16

శ్లో॥ న భిక్షా దుష్ప్రాపా పథి మమ మహారామరచితే
ఫలైః సంపూర్ణా భూ ర్విటపిమృగచర్మాపి వసనమ్।

సుఖైర్వా దుఃఖైర్వా సదృశపరిపాకః ఖలు తదా
త్రినేత్రం క స్త్యక్త్వా ధనలవమదాన్ధం ప్రణమతి॥ 17

టీ. మమ=నాకు, మహారామచరితే=గొప్పతోఁటలచే రచింపఁబడిన-పెను తోఁట లిరుప్రక్కఁ గల, పథి=మార్గమునందు, భిక్షా=బిచ్చము, దుష్ప్రాపా న=దొరకరానిది కాదు-దొరకునదేయనుట, భూః=భూమి, ఫలైః సంపూర్ణా=పండ్లచే నిండినది. విటపిమృగచర్మఅపి=చెట్లయు మృగములయు తోలును-నారలును కృష్ణాజినమును, వసనం=వస్త్రము, సుఖైర్వా=సుఖములచేతఁగాని, దుఃఖైర్వా=దుఃఖములచేతఁగాని, సదృశపరిపాకఃఖలు=సమమైనపరిణామమేగదా-భిక్షాదుల సేవించునట్టినియతిని బూనినపుడు-సుఖములైనఁగాని దుఃఖములైనఁగాని సమానముగానే స్ఫురించునుగాని భిన్నముగాఁ దోఁపదనుట, తదా=అప్పుడు-అట్టిపరిపాకము గలిగినప్పుడు, కః=ఎవఁడు, త్రినేత్రం=ముక్కంటిని, త్యక్త్వా=విడిచి, ధనలవమదాన్ధం=ద్రవ్యమొకింతచేనైన గర్వముచేఁ గన్నుఁగాననివానిని, ప్రణమతి=నమస్కరించును-వానికి నడఁగిమడఁగి కొలువుసేయును-ఎవ్వఁడును జేయఁడని భావము.

ఉ. పంటవలంతినిం గలవు పండులు నారలుఁ దోలుఁ బుట్టమాఁ
గొంటకు బిచ్చయున్ సులువగుం బెనుఁదోఁటలమీఱుత్రోవలో
రెంట సుఖాసుఖంబు లనురీతి యొకం డగు నిట్లయేని ము
క్కంటిని వీడి యల్పధనగర్వితు నెవ్వఁడుఁ గొల్వఁ బూనునే. 17

శ్లో॥ యద్వక్త్రం ముహురీక్షసే న ధనినాం బ్రూషే న చాటుం మృషా
నైషాం గర్వగిరః శృణోషి న పునః ప్రత్యాశయా ధావసి।
కాలే బాలతృణాని ఖాదసి సుఖం నిద్రాసి నిద్రాగమే
తన్మే బ్రూహి కురఙ్గ కుత్ర భవతా కిం నామ తప్తం తపః॥ 18

టీ. హేకురఙ్గ=ఓజింకా, యత్=దేనిచేత, ధనినాంముఖం=ధనవంతుల మొగమున, ముహుః ఈక్షసే న=మాటికినిజూడవో, మృషా=వ్యర్థముగా, చాటుం=స్తుతిభాషణములను, బ్రూషే న=పలుకవో, ఏషాం=వీరియొక్క-పూర్వము చెప్పఁబడిన ధనికులయొక్క, గర్వగిరః=గరువంపుమాటలు, న శృణోషి=వినవో, పునః=మఱియు, ప్రత్యాశయా=పేరాసచేత, ధావసి (వారినిగూర్చి) పరుసునఁ బోవో, కాలే=ఆఁకలికాలమున, బాలతృణాని=లేఁతగడ్డిపరకలను, ఖాదసి=మేయుదువో, నిద్ర ఆగమే=నిద్రరాకయందు-నిద్రరాఁగా, సుఖం=హాయిగా, నిద్రాసి=నిదురింతువో, తతః=దానిచేత-ధనికముఖమును జూడమి మున్నగుకారణములచేత, భవతా=నీచేత, కుత్ర=ఎక్కడ, కింనామ=ఏమిదా, తపః=తపము, తప్తం=తపింపఁబడినదో, మే బ్రూహి=నాకుఁ జెప్పుము. ధనికులమొగము చూడకుండుటమున్నగు నీ యిటువంటి చరితము బుద్ధిమంతుఁడగు పురుషునియందును గానిపింపదు. కాన యిట్టిచరిత యేతపముయొక్కపరిపాకమో తెలియదు. దానిం జెప్పు మని యర్థము.

చ. కనుఁగొన వర్ధవంతులమొగంబులు మాటికి మెచ్చులాడవున్
వినవును వారిబెట్టిదము వేమఱుఁ జెంతకుఁ బాఱ వాసమైఁ
గొనుదువు పూరియుం దఱిని గూర్కుదు నిద్దురవేళ హాయిగా
నొనరఁగ నేతపంబుఫలమో యిది చెప్పఁగదే కురంగమా. 18

---

శ్లో॥ సమారమ్భా భగ్నాః కతిన కతివారాంస్తవ పశో
పిపాసోస్తుచ్ఛేస్మిన్ ద్రవిణమృగతృష్ణార్ణవజలే।
తథాపి ప్రత్యాశా విరమతి న తేఽద్యాపి శతధా
నదీర్ణం యచ్చేతో నియత మశనిగ్రావఘటితమ్. 19

టీ. హేపశో=(కొమ్ములును దోఁకయులేని) పశువా-పశుప్రాయుఁడా యనుట, తుచ్ఛే=నీచమైన, అస్మిన్=ఈ, ద్రవిణమృగతృష్ణార్ణవజలే = ద్రవ్యమనెడి యెండమావుల సముద్రమందలినీటియందు, పిపాసోః=త్రావనిచ్ఛగించు, తవ=నీకు, కతివారాన్ = ఎన్నిమాఱులు, కతిసమారమ్భాః=ఎన్నికార్యారంభములు, నభగ్నాః=చెడినవికావు-పెక్కుమాఱులు పెక్కుప్రారంభములు చెడినవనుట, తథాపి =అట్లయ్యును, తే=నీకు, ప్రత్యాశా=పేరాస, అద్యాపి=ఇంకను, నవిరమతి= ఉడుగకున్నది. ఇట్లయ్యును, యతః=ఎందుచేత, చేతః=నీమనస్సు, శతధా=నూఱు భాగములుగా, నవిదీర్ణం=చీల్పఁబడదో-చీలదోయనుట, (అతః=అందుచేత, తత్ =అది), నియతః=నిశ్చయముగా, అశనిగ్రావఘటితమ్=వజ్రపుఱాయితో చేయఁబడినది. ఇంతకఠినము కాకున్నచో అన్నికార్యములు భగ్నమైనందుల కది చీలియే యుండు నని భావము.

చ. ద్రవిణమరీచికాబ్ధికలితం బగుతుచ్ఛజలంబుఁ ద్రావఁగాఁ
దివిరెడునీదుపూనికలు దేఁకువ నెన్నియొ యెన్నిమాఱులో
యవిసెను గాదె యోపశువ యైనను నింక దురాశ మాన వీ
వవు నవు నీదుచిత్త మరయం బటువజ్రశిలాకృతం బగున్. 19

భర్తృహరిసుభాషితము అధికశ్లోకములు

స మా ప్త ము.

---

శ్రీరస్తు.

మహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతికృత

# మల్లభూపాలీయము

---

## నీతిశతకము

### మూర్ఖపద్ధతి

శా. శ్రీమద్బాలసరస్వతీప్రకటలక్ష్మీహేతువై శాంతమై
యామోదావహమై నిజానుభవవేద్యంబై యనేహోదిగా
ద్యామేయప్రవిబోధరూపమహితంబై యొప్పు తేజంబు ప్రా
పై మీకు న్సిరు లీవుతన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 1

మ. సతతంబు న్మది మత్సరాఢ్యులు పరిజ్ఞాత ల్మహీనాథు లా
తతసంపన్మదదుష్టచిత్తు లితరు ల్తర్కింప నజ్ఞానమూ
షితభావు ల్వినువార లెవ్వ రొడలన్ జీర్ణంబు లౌఁ గాక యా
ర్యతతు ల్నేర్చినసూక్తము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 2

మ. నిలుప న్వచ్చు స్వభావమూర్ఖుఁ డగువానిం గొల్చి యత్యంతము
న్నిలుప న్వచ్చు విశేషవేది యగువానిం గొల్చి యెందేని జ్ఞా
నలవాహంకృతిదుష్టుఁ డైనమనుజు న్రంజింప శక్యంబు గా
దలభాషాపతి కేనియు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 3

శా. కాలాహిం దలఁ దాల్ప వచ్చు విరిపొంకౌనం, దరంగవ్రజో
త్తాలం బైనపయోధిఁ జేతులనె యీఁద న్వచ్చు, నక్రోగ్రదం
ష్ట్రాలగ్నం బగుమానికంబు హరియింప న్వచ్చు నెట్లేని మూ
ర్ఖాళిం దెల్పఁగ రాదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 4

మ. వసుధం గుంచెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబున
న్వెసఁ ద్రావ న్జల మెండమావులనెయేనిం గాంచ వచ్చు న్నిజం

